విజ్ఞానం
అంతర్జాతీయ తెలుగు సంపూర్ణ మాస పత్రిక

పాదకవర్గం:
పాదకుడు:
కె.వి.గోవిందరావు
బి.ఏ.,ఎల్.ఎల్.బి.
సహాయ సంపాదకులు:
ఎల్.ఎన్.రావు బి.ఎస్సి.,
బాలకుమార్ ఎమ్.ఏ.,బి.ఎడ్.
...లు:
...ఎస్.శరత్ బాబు ఎమ్.కామ్.,బి.ఎడ్.
...ఎస్.విజయకుమార్ బి.కాం.
...కుమారి

చందా వివరాలు

| | |
|---|---|
| ...సంవత్సరం చందా | రూ. 120/- |
| ...సర చందా | రూ. 42/- |
| ...మెయిల్ (1 సం॥) | రూ. 200/- |
| ...మెయిల్ (1 సం॥) | రూ. 100/- |

...ఁది పంపిణీ దారులు
...రత్నా ఏజన్సీస్
...ఫోన్: 73327

ఈ సంచికలో
సెప్టెంబరు 1992



ముఖచిత్రం:
కలర్ ట్రాన్స్‌పరెన్సీ,
సత్యమూర్తి

...గు 'విస్డమ్' కు ఇది 11 వ సంవత్సరం...

# ధ్యానం

## పుష్పాలను వెదజల్లు కంటకాలను కాదు


జేమ్స్ ఎలెన్

మనిషి స్వార్థదృష్టి దుఃఖానికి దారి తీసే వక్రమార్గం. దీనివల్ల బ్రతుకుబాట దుర్భరమై పోతుంది. నిస్వార్థ జీవితం సంతోషానికి రాజమార్గం. హృదయాన్ని కరిగించి బ్రతుకులో ఆదర్శాన్ని ఎత్తి చూపిస్తుంది. ఇది ముమ్మాటికీ సత్యం. ఈ పరమసత్యాన్ని జీర్ణించుకుని ఆచరణతో కొనసాగిస్తే స్వార్థం అడుగంటుతుంది. త్యాగం పొడసూపుతుంది. జీవన దృక్పథం మలుపు తిరుగుతుంది. విశ్వం ఒక కాంతి నిలయం అవుతుంది. ఇందులో పౌరుడు సత్యశీలుడు. సత్యాన్నే ఆలోచిస్తాడు. సత్యాన్నే చూస్తాడు. సత్యమార్గంలోనే నడక సాగుతుంది. అతడు నడిచిన మార్గమే ఇతరులకు ఆదర్శపథం అవుతుంది. ఎవరూ విశ్వాన్ని విడివడలేరు. నీ లోపలా, బయటా, చుట్టూ అంతా విశ్వమే. మానవ మాత్రులు అందరూ ఒకటే. ఒకరి సంతోషం, అందరి సంతోషమూను. ఈ పరమసత్యాన్ని

(మిగతా 3 వ పేజీలో)

# సంపాదకుని పేజీ

## పిల్లలకు క్రమశిక్షణ

ఈనాడు అభివృద్ధి పొందుతున్న దేశాల లోను, భారతదేశంలోను మిలియనుల కొద్దీ పిల్లలకు సరియైన పోషక ఆహారంలేదు, ఆరోగ్య సంరక్షణలేదు, విద్యావకాశాలులేవు. యునైటెడ్ నేషన్స్ ఇంటర్నేషనల్ చిల్డ్రన్స్ ఎమర్జెన్సీ ఫండ్ (UNICEF) ఇప్పుడు అభివృద్ధి పొందుతున్న దేశాలలో పిల్లల సంక్షేమాభివృద్ధి కార్యక్రమాలను చేపట్టడానికి ఉద్యమిస్తూంది. పిల్లలకు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను స్థాపించుట, గ్రామీణ నీటి సరఫరా విధానాన్ని అభివృద్ధి చేయుట, పాలప్లాంటులు మరియు పోషకాహార పథకాలను క్రమపరచుట, శాస్త్ర విజ్ఞానాభివృద్ధిని ప్రోత్సాహపరచుట వంటి ఉద్యమాలను చేబడుతూంది

ప్రపంచంలో వర్తమానదేశాలలో విజ్ఞాన శాస్త్రం, ప్రకృతి శాస్త్రం, ట్రావెల్ మొదలైన వాటికి సంబంధించిన రంగురంగుల పుస్తకాలు ఎన్నెన్నో పిల్లల తృష్ణను తీరుస్తున్నాయి. సౌభాగ్యవంతమైన దేశాలలో పిల్లల పుస్తకాలు ప్రస్తుత పరిస్థితులను విశదీకరిస్తున్నాయి. కథలు వినోదాత్మకంగా ఉంటాయి. పిల్లల బుద్ధి వికాసాలకు సహకరిస్తున్నాయి. పిల్లల తలిదండ్రులు, ఉపాధ్యాయులు పిల్లల విద్యా విషయంలో ప్రవృద్ధిదాయకమైన యోచనలు కలిగి ఉన్నారు. నేటి పిల్లలే రేపటి పౌరులనే సత్యాన్ని పెద్దలు గ్రహించారు.

భారతదేశంలోను, ఇతర అభివృద్ధి పొందుతూన్న దేశాలలోను పెద్దవారి అజ్ఞానం వల్ల పిల్లల మానసిక పరిస్థితులకు అపకారం కలుగుతూంది. అనుచితమైన అభ్యాసాలు అనేకం వాడుకలో ఉన్నాయి. మొట్టమొదటిది

"దేశ సంస్కృతి గానీ, దేశంలో ప్రజల సంస్కృతిని గాని

పిల్లలను భయపెట్టడం వల్ల పిల్లల లేత మనస్సులలో భయం పట్టుకుంటుంది. ఆలోచనా శక్తి సామర్థ్యం చలించిపోతూంది. వారి మనస్సులలో భయభ్రాంతులు ఉద్భవిస్తాయి. పిరికితనం, మానసిక దుర్బలత్వం ఏర్పడుతుంది.



పిల్లలు దేశ సౌభాగ్యం. వారి శక్తి సామర్థ్యాలను క్రమమార్గంలో పెట్టినప్పుడు సమాజం మానసిక ఆరోగ్యాన్ని రక్షించగలుగుతాం. పిల్లల శారీరక ఆరోగ్యం ఒక్కటే ముఖ్యం కాదు. మానసిక ఉత్సాహం కలిగించడం కూడా ముఖ్యం. కుల, జాతి, మత విచక్షణ లేకుండా పిల్లలలో పరస్పర ప్రేమాభిమానాలను అభివృద్ధి చేయాలి. సౌభ్రాతృత్వాన్ని పెంపొందించాలి. ఇదే ముఖ్యమైన మార్గం. అవలంబించవలసిన బాట.

తలిదండ్రుల మరియు ఉపాధ్యాయుల అపాయకరమైన కఠిన స్వభావం మారాలి. పిల్లల జీవితాన్ని విలాసవంతం చేయాలి. పిల్లలు ఏది అభిమానిస్తారో తెలుసుకోవాలి. విసిగించే పాఠాలు తక్కువగా చెబుతూ ఎక్కువ వినోదం కలిగిస్తూండాలి. కథలు, పద్యాలు అధికంగా చెబుతూ బొమ్మలను ప్రదర్శిస్తూండాలి. పిల్లలకు ఫిల్ములు, పుస్తకాలు అతిజాగ్రత్తగా తయారుచేయాలి. ఇతరుల పట్ల ద్వేషం, పగ తప్పు అని, సౌభ్రాతృత్వమే మంచిదనే భావాన్ని కలిగించాలి.

చిన్న పిల్లలను గురించి సరైన విషయాలను గ్రామాలలో ప్రసరింపజేయాలి. ప్రతీ పట్టణంలోను పిల్లల జ్ఞాన వికాసాలకు పార్కులు, ఆటమైదానాలు, లైబ్రరీలు, నర్సరీలు, బాల భవనాలు ఏర్పరచాలి.

పిల్లల పాఠశాలలలో ప్రత్యేకంగా పిల్లలంటే ప్రేమాభిమానాలు గల ఉపాధ్యాయులను ప్రోత్సహిస్తూ అటువంటి పాఠశాలలను పిల్లలకు అనువుగా తీర్చిదిద్దాలి. పిల్లల సంక్షేమానికి సాంఘిక కార్యక్రమాలలో ప్రాముఖ్యతను ఇవ్వాలి.

## పగటిపూట సూర్యుడు ప్రకాశిస్తాడు!

*పంజాబ్‌లో రైతులు అపూర్వ వాదంలోకి దిగారు - ప్రపంచానికి సూర్యుడా లేక చంద్రుడా ముఖ్యం. వీరి సమస్యను గ్రామ పంచాయితీ వద్ద పెట్టారు. పెద్దలు చర్చలు జరిపి విచారించి చివరకు చంద్రుడే ముఖ్యం అన్నారు. "చంద్రుడి కాంతి లేకపోతే రాత్రిపూట చీకటిలో ఏమీ చూడలేం. సూర్యుడు మనకు అవసరం లేనప్పుడు పగటిపూట ప్రకాశిస్తాడు!" అని తీర్మానించారు.*

— కుష్వంత్ సింగ్ [illegible]

( 2 వ పేజీ తరువాయి)

తెలుసుకుని జీవిత మార్గంలో సువాసితమైన పరిమళ పుష్పాలను వెదజల్లుదాం. కంటకాలను కాదు. అప్పుడే త్యాగమయమైన అమరాగ పుష్ప సౌరభంతో జీవితం పవిత్రవంతం అవుతుంది. నీకూ, జగత్తుకూ సామరస్యం లభిస్తుంది. జీవితం వికసించినదిగా, ఆనంద భరితంగా పరిణమిస్తుంది.

"అతి కష్టతరమైన పనిని శ్రద్ధగా నిర్వహిస్తూ బాగా ముగించేవారికి ఆత్మగౌరవం

# కాకరకాయ - డయాబిటీస్‌కి ఔషధం

హెచ్.కె. బబ్రు

కాకరకాయ సామాన్యంగా భారతదేశం అంతటా పండే కూరగాయ. ఇది ఒక సన్నని తీగ. సంవత్సరం పొడుగునా కాస్తుంది. సాధారణంగా 1 0 మొదలు 20 సెం.మీ.ల పొడవుగా ఉండి పైన గరుకుగా, మొద్దుబారిన ముళ్లులాగా ఉంటుంది. లేతకాయలలో విత్తనాలు తెల్లగా ఉంటాయి. పండిన కాయలలో గింజలు గోధుమ వర్ణంలో ఉంటాయి.



bitter gourd (karela)

పొట్టి కాకరకాయలు జాతి కూడా ఉంది. కాకరకాయలు ముదురు ఆకుపచ్చని రంగులో ఉంటాయి. కొన్ని తెల్లగా దంతపు రంగులో కూడా ఉంటాయి

దీని మొట్టమొదటి వాసస్థానం అంతగా తెలియక పోయినా పూర్వార్థగోళంలో ఉష్ణ ప్రదేశాలలో బాగా ప్రవృద్ధి పొందుతూంది. ఇది ఈనాడు అన్ని ఉష్ణ ప్రదేశాలలో విస్తారంగా పెరుగుతూంది. భారతదేశం, ఇండోనేషియా, శ్రీలంకా, మలేషియా, ఫిలిప్పైన్స్, చైనా, కరేబియన్ ప్రదేశాలలో ఎక్కువగా పండిస్తున్నారు.

పెద్ద పొడుగు రకం కాకరకాయ విశ్లేషణలో ఈ క్రింది విషయాలు తెలిసాయి - తినడానికి పనికివచ్చే 100 గ్రా.ల కాకరకాయలో తేమ 92.4 శాతం, ప్రోటీనులు 1 6 శాతం, క్రొవ్వు 0.2 శాతం, ఖనిజాలు 0.8 శాతం, ఫైబర్ 0.8 శాతం, పిండి పదార్థాలు 4.2 శాతం ఉంటాయి. దీనిలో 100 గ్రాములలో లభించే ఖనిజాలు, విటమినులు— సున్నం 20 మి.గ్రా. శాతం, భాస్వరం 70 మి.గ్రా. శాతం, ఇనుము 1.8 మి.గ్రా. శాతం, కెరోటిన్ 126 మిసి.గ్రా. శాతం, థయామిన్ 0 07 మి.గ్రా. శాతం, రిబోఫ్లావిన్ 0.09 మి.గ్రా శాతం, నియాసిన్ 0.5 మి.గ్రా. శాతం, విటమిన్ C 88 మి.గ్రా శాతం. దీని కాలోరిఫిక్ (ఆహారపు) విలువ 25.

కాకరకాయకు మంచి ఔషధ లక్షణాలు ఉన్నాయి ఇది విరుగుడు మందు. మంచి టానిక్, ఆకలి పుట్టిస్తుంది కడుపు ఉబ్బసాన్ని తగ్గిస్తుంది విరేచనకారి. ఇది సామాన్యంగా జ్వర నివారణకు, జఠర శక్తి వృద్ధికి ఉపయోగిస్తారు.

కాకరకాయను నాటు వైద్యులు ప్రాచీన కాలం నుంచీ డయాబిటీస్‌కి (మధుమేహం) దివ్యమైన ఔషధంగా వాడుతున్నారు ఇటీవల బ్రిటిష్ వైద్య బృందం పరిశోధనలు చేసి ఇందులో ఒక విధమైన హైపోగ్లిసమిక్ (hypoglycemic) లేక ఇన్సులిన్ వంటి ప్లాంట్‌ఇన్సులిన్ పదార్థం ఉందని ఇది రక్తం మరియు మూత్రంలో చక్కెర స్థాయిని బాగా తగ్గిస్తుందని తెలుసుకున్నారు. డయాబిటిక్కులు ప్రతీరోజూ ఉదయం ఐదు లేక ఆరు పచ్చి కాకరకాయల రసం పరగడుపున త్రాగాలి.

కాకరకాయ విత్తనాలు పొడి చేసి ఆహారంలో ఉపయోగించవచ్చు. డయాబిటిక్కులు పచ్చి

"దేశాన్ని ప్రేమించాలని అందరూ అంటారు. మంచిని పెంచాలని కూడా అందరూ అంటారు. అయితే ఈ సత్యాన్ని

కాకరకాయ ముక్కలను నీటిలో ఉడకబెట్టిన నీటినిగానీ, ఎండు గింజల పొడి డికాక్షనుగానీ తీసుకోవచ్చు.

పచ్చికాకర ఆకుల రసం మూలశంకకు మంచి ఔషధం. మూడు చిన్న టీ చెంచాల రసం ఒక గ్లాసెడు మజ్జిగలో కలిపి ప్రతీరోజు ఉదయం పరగడుపున నెలరోజులపాటు తీసుకుంటే ఈ వ్యాధి నివారింపబడుతుంది. కాకర తీగ వేళ్ల గంధం మూలశంకకు పట్టించి మందుగా వాడవచ్చు.

నెత్తురు గడ్డలు, దురదలు, చిడము, సొరియాసిస్, కడుపులో కొక్కి పురుగులు మరియు జఠర రస సంబంధమైన ఇతర వ్యాధులకు మంచి ఔషధంగా పని చేస్తుంది ఈ వ్యాధులకు ఒక కప్పు తాజా కాకరకాయ రసానికి ఒక పెద్ద చెంచాడు నిమ్మరసం చేర్చి ప్రతీరోజూ ఉదయం పరగడుపున ఆరునెలల పాటు త్రాగాలి.

ఆకుల పసరు ఆల్కహాలువల్ల కలిగే మత్తును తగ్గిస్తుంది. ఇది ఆల్కహాల్‌కి విరుగుడు ఆల్కహాలు అలవాటు వల్ల చెడిపోయిన కాలేయానికి ఆరోగ్యాన్ని చేకూరుస్తుంది.

కాకరకాయలు భారతదేశంలోనూ, దూర ప్రాచ్య ప్రదేశాలలోనూ కూరవండుకుని తింటారు. కూర చేసే ముందు కాకరకాయ ముక్కలను ఉప్పు కలిపిన తేట మజ్జిగలో వేసి పిండేస్తే చేదు తగ్గుతుంది. దీనితో ఊరగాయ కూడా పెట్టుకుంటారు. వేయించిన గింజల పొడి కూడా రుచికి వాడతారు. ●

## అతి ముఖ్యమైనది

ఒక పెద్ద పనిని చేయడం, దానిని చిత్తశుద్ధితో చేయడం చాలా ముఖ్యం. కానీ అలా చేసేవారికి ప్రాచుర్యం లభించడం లేదు.

— జె.ఆర్.డి. టాటా, పారిశ్రామికవేత్త

## విలువిద్యా నైపుణ్యం



దక్షిణ అమెరికా ట్రైబల్‌లో కబోక్లాస్ ఇండియనులు విలువిద్యలో నిపుణులు. వెల్లికిలా పడుకుని కాళ్లతో విల్లు వంచి బాణాలను అతి నైపుణ్యంగా వదులుతారు.

## విస్‌డమ్ పాతకాపీలు

మే '84, జూన్ '84, ఆగస్టు '84 నుంచీ నవంబరు '84, మార్చి '85 నుంచీ జూలై '85, ఫిబ్రవరి '86 నుంచీ ఏప్రిల్ '86, జూన్ '86, సెప్టెంబరు '86 నుంచీ డిసెంబరు '86, జనవరి '87 నుంచీ మే '87, ఆగస్టు '87, డిసెంబరు '87, జనవరి '88, మార్చి '88 నుంచీ డిసెంబరు '88, జనవరి '89 నుంచీ డిసెంబరు '89, జనవరి '90 నుంచీ సెప్టెంబరు '90, నవంబరు '90, డిసెంబరు '90; ఫిబ్రవరి '91 నుంచీ డిసెంబరు '91 కాపీలు మావద్ద ఉన్నవి. 1984 కాపీల వెల రూ. 7.50లు; 1985 కాపీల వెల రూ. 6.50లు; 1986 కాపీల వెల రూ. 12-00లు; 1987 కాపీల వెల రూ. 11.50లు; 1988 కాపీల వెల రూ. 18.75; 1989కాపీల వెల రూ 24.50లు; 1990 కాపీల వెల రూ. 25-50లు; 1991 కాపీల వెల రూ. 26.50లు. రిజిస్టర్డ్ పోస్టులో పొందడానికి కాపీల వెలతో పాటు రూ 6.00లు చేర్చి M.O. పంపాలి. 'రత్నా ఏజెన్సీస్, 9, వెంకటేశ్వరరోడ్డు, ఆళ్వారు పేట, మద్రాసు - 600 004.

— సర్క్యులేషన్ మేనేజర్

"సంఘశృంఖలాలనుండి మనస్సు పూర్తిగా విడుదలైనప్పుడు లేని ...

# విజ్ఞానదీపిక

## ప్రథమావస్థలో కాన్సర్‌ను తెలుసుకోడానికి సహకరించే సైటాలజీ

ప్రథమావస్థలో కాన్సర్ వ్యాధిని గుర్తించి తెలుసుకోడానికి సైటాలజీ (cytology) విజయవంతమైన మార్గం. శరీరంలో ఉన్న ఒక కంతి నుండి ఒక సన్నని దొప్ప వంటి సూది సహాయంతో ద్రవ పదార్థాన్ని తీసి పరీక్ష చేసి 20 నిమిషాలలో ఫలితం తెలుసు కుంటారు.



## ప్రపంచంలో కృత్రిమ నీటి మార్గం

పసిఫిక్ మహాసముద్రం మరియు అట్లాంటిక్ మహా సముద్రాన్ని కలిపే పనామా కాలువ ఒకటే మానవుడు కల్పించిన బ్రహ్మాండ మైన నీటి మార్గం. పనామా యుఎస్ఎకు 10 మైళ్ళ వెడల్పు భూభాగాన్ని కాలవ నిర్మా ణానికి కౌలుకు ఇచ్చింది. నిర్మాణం ముమ్మరంగా కొనసాగేటప్పుడు ప్రతీరోజు ఒక్కొక్కటి 400 టన్నుల మట్టితో నిండిన 300 రైలు రోడ్డు కారులు వెళ్లేవి. మొత్తం 10,000 మిలియను టన్నుల మట్టి కాలువ కోసం త్రవ్వబడింది. చియోప్స్ గ్రేట్ పిరమిడ్ మొత్తం భారం కంటే ఇది అధికం!

## వాతావరణంలో నత్రజని

వాతావరణంలో నత్రజని 78 శాతం, ప్రాణ వాయువు 21 శాతం, కార్బన్‌డయాక్సైడ్ 3 శాతం, మిగతావి అరుదైన వాయువులు. సుమారు 70 శాతం ఈ ప్రాణవాయువు మహా సముద్రాలలో బయలుదేరే ప్లాంక్‌టానిక్ మొక్కల నుండి, 30 శాతం భూమిపై ఉండే సస్యావరణ అడవుల నుండి, గడ్డి మైదానాల నుండి లభిస్తుంది.

# సుభాషితాలు

*చదువు చదువనేల? సన్న్యాసి కానేల?*
*షణ్మతముల జిక్కి చావనేల?*
*అతను భజన చేసి యాత్మలో దెలియుడీ*
*విశ్వదాభిరామ వినురవేమా!*

*[వేదాలు వల్లించి సన్యాసి అయి ఆరు మతాలలోబడి కొట్టుకోవడం కంటే రూపం లేని భగవంతుని సేవచేసి ఆత్మ తత్త్వం తెలుసుకోడం ఉత్తమం]*

*జాతి నీతి వేరు జన్మం బదొక్కటె*
*అరయ దిండ్లు వేఱె యౌను గాక*
*దర్శనములు వేరు దైవమొ నొక్కటే*
*విశ్వదాభిరామ వినురవేమా!*

*[జాతులు, నీతులు, తిళ్ళు వేరు కావచ్చు కానీ మానవజాతి ఒక్కటే. అదేవిధంగా దైవాన్ని తెలిపే శాస్త్రాలు వేరైనా దైవం ఒక్కటే.]*

"వసుధైక కుటుంబం వాంఛనీయమే అందరికీ, అసలైన మానవత్వమంటే అభిమానమే అందరికీ, అయితే ఈ అసలులో

## ప్రపంచంలో మిక్కిలి పొడవైన ఆర్ట్ గాలరీ

సోవియెట్ యూనియన్ లెనిన్‌గ్రాడ్‌లో వింటర్ పాలెస్ మరియు చుట్టుప్రక్కల హెర్మిటేజ్‌లో ఉన్న ఆర్ట్ గాలరీ ప్రపంచంలో మిక్కిలి పొడవైనది. ఇక్కడ 322 గాలరీలలో ప్రతీ దానిని చూడడానికి 24 కి.మీ లు నడవాలి మొత్తం ఇక్కడ 3,000,000 కళాఖండాలు ఉన్నాయి.

## ప్రపంచంలో వింత గొలిపే మొక్క

ప్రపంచంలో మిక్కిలి వింత గొలిపే ఒక అడుగు పొడవు, 15 అడుగుల కైవారం ఉన్న వెల్‌విట్చ్సియా (Welwitschia) చెట్టు దక్షిణ మరియు పశ్చిమ ఆఫ్రికాలలో పెరుగుతుంది ఇది మూడే ఆకులను తొడుగుతుంది ఇవే చెట్టు జీవితాంతం 100 ఏళ్ళు ఉంటాయి

## ప్రపంచంలో పూత పూసే మొక్కల జాతులు అధికం

'పీ' కుటుంబానికి చెందిన (Leguminosae) చిక్కుడు జాతి - ప్రపంచంలో ఎక్కువగా పూత పూసే మొక్కల జాతికి చెందినది లింటిల్స్, పీస్, బీన్స్, వేరుశనగ మొదలైనవి 12,000 వివిధ రకాలు ఉన్నాయి

## సెంటీగ్రేడ్ థర్మామీటరు డిగ్రీలు

సెంటీగ్రేడ్ థర్మామీటరు మీద డిగ్రీలను దానిని కనిపెట్టిన శాస్త్రజ్ఞుని పేరుతో 'డిగ్రీస్ సెల్షియస్' అంటారు ఇలాగే ఇతర వాటిమీద డిగ్రీలను గాబ్రియల్ ఫారెన్‌హీట్, రేనే డి రీముర్ అంటారు. అండెర్స్ సెల్షియస్ ఒక స్వీడిష్ ఖగోళ శాస్త్రజ్ఞుడు

## జీవితంలో హాస్యం




"కొంచెంసేపు బిడ్డను పట్టుకుంటావా?"

## యుఎస్‌కు వలసలు వెళ్ళిన ఇంజినీర్లు, శాస్త్రజ్ఞులు

బ్రిటిష్ శాస్త్రజ్ఞుల అధ్యయనం ప్రకారం 1974-1988 సంవత్సరాల మధ్య యునైటెడ్ స్టేట్స్‌లో వలసలు వచ్చిన ఇంజినీర్లు మరియు శాస్త్రజ్ఞులు సంఖ్య మొత్తం 58 శాతం నుంచి 105 శాతానికి రెట్టింపు అయింది ప్రతిభావంతులు అందరూ వరుసగా భారతదేశం, బ్రిటన్, తైవాన్, పోలండ్ మరియు చైనాకి చెందినవారు ప్రస్తుతం ముఖ్యంగా ఇంజినీరింగ్ మరియు మాథమెటిక్స్‌లో 40 శాతం PhD విద్యార్థులు అందరూ విదేశీయులే. యుఎస్‌లో చదవడానికి నిశ్చయించుకున్నవారు అక్కడే వృత్తిని స్వీకరించడానికి నిర్ణయించుకుంటారు మలేషియా మొత్తం విద్యార్థుల మీద తమ 7 యూనివర్శిటీలలో 220 మిలియను డాలర్లు ఖర్చు చేస్తూంటే విద్యార్థులను విదేశాలలో చదివించడానికి సగటున సంవత్సరానికి 1.46 బిలియను డాలర్లు వ్యయం చేస్తూంది.

-'హ్యూమన్ రైట్స్ వరల్డ్‌వైడ్' సౌజన్యంతో

"తమ కీర్తి ప్రతాపాలు చెప్పుకునేవారు ఏనాటికీ గొప్పవారు కానేరరు."

# ఆగు! విను!! యోచించు!!!

వెనుక ఒక చెరువులో రెండు కప్పలు ఉండేవి. అవి పరస్పర స్నేహంతో జీవిస్తూండేవి. ఆ చెరువుకు చేరువగా ఒక అందమైన భాగ్యవంతుల భవనం ఒకటి ఉంది. జీవితంలో ఒక్కసారైనా ఆ ఇంట్లోకి వెళ్ళాలని, చూడాలని ఆ కప్పలు ఉబలాటపడుతూండేవి. మరపురాని చరిత్రాత్మక దినం సమీపించింది. ఆ రోజు చీకటి పడేదాకా కాచుకుని ఉన్నాయి. ఒక్కసారిగా చెరువులో నుంచి బయటికి గెంతాయి. ఎంతో సంతోషంగా ఆ భవనంలోకి ప్రవేశించాయి



వంటగదిలో గట్టు మీద ఒక పెద్ద అందమైన పాత్ర ఒకటి ఉంది. అందులో ఏముందో తెలుసుకోవాలనే ఆరాటంలో ఆ రెండూ పాత్రలోకి దూకాయి. అయ్యో! ఆ పాత్ర పాలతో నిండి ఉంది. ఒక కప్పకి వెంటనే భయం పట్టుకుంది. వణికిపోతూ ఆ కప్ప అక్కడికక్కడే ప్రాణాలు వదిలింది. ఇక రెండవ కప్ప కంగారు పడకుండా విశ్రాంతిగా, శాంతంగా సదవకాశం కోసం కాచుకుని ఉంది

బ్రతికి జీవించడానికి నిశ్చయించుకుంది. ఆ పాత్రలో నుంచి బయటకు గెంతడానికి ఎన్నెన్నో విశ్వప్రయత్నాలు చేసింది. కానీ సాధించలేకపోయింది. ఈ సమయంలో ఆశ్చర్యకరమైన వింత ఒకటి సంభవించింది. రసాయనిక ప్రక్రియకు పాత్రలో పాలు గట్టిగా తోడుకున్నాయి. కప్ప మెల్లిగా బయటకు గెంతింది.

మనం జీవితంలో సంభవించే అత్యల్ప విషయాలకు భయపడిపోయి తబ్బిబ్బులతో తలక్రిందులైపోతాం. నిశ్చింతగా శాంతంగా ఉంటే, దృఢ విశ్వాసంతో, నమ్మకంతో, ఓపికగా మనసారా ప్రయత్నాలు చేస్తే జీవితం విజయవంతంగా, ఆనందంగా ఉంటుంది.

## ఉపకార బుద్ధి

ఉదారమైన ఉపకార బుద్ధి ఇటీవల పూర్తిగా మృగ్యమైంది అయినా ప్రేమ, ఔదార్యాలు వల్ల మానవుడు జంతువుల కంటే భిన్నంగా కనిపిస్తున్నాడు

నీ కాలానికి నీవు ఉదారవంతంగా ఉండు కష్ట సమయంలో ఎవరైనా నీ సహాయం కోరినప్పుడు వెంటనే వారిని ఆదుకో ఎవరైనా తమ సమస్యలను నీతో ఆలోచించినప్పుడు జాగ్రత్తగా పూర్తిగా చెప్పేది విను నీ ప్రేమాభిమానాలతో ఉపకారం చేయి నీవు ప్రేమించే వారికి నీవు ప్రేమిస్తున్నావని తెలియనీ నీవు వారి సుఖ సౌఖ్యాల కోసం ఆదుర్దాపడుతున్నావని వారికి తెలియజేయి

నీ అవగాహన విషయంలో ఉదారత్వం ప్రకటించు వ్యతిరేకంగా అంగీకరించినప్పుడు క్రోధం అణచుకో యుక్తాయుక్త విషయాలలో కోపం వెలరేగనీయకు

నీ దయా దాక్షిణ్యాలకు, మర్యాదలకు, హాస్య స్వభావాలకు ఉదారంగా ఉండు మర్యాద, చిరునవ్వు, సరసోక్తి, సరసత పరస్పరం పంచుకునేటట్లు ఉండాలి

— డా. నార్మన్ విన్సెంట్ పీలీ

“నమ్మిన సిద్ధాంతాల కోసం · ప్రాణం బలిపెట్టడానికి

# పసిపిల్లల మారక వ్యాధులు

పసి పిల్లలకు సంభవించే మారక వ్యాధులు ముఖ్యంగా ఆరు ఉన్నాయి.

1 మీసిల్స్ మీసిల్స్ రాకుండా టీకాలు వేయించని పిల్లలకు ఇది పట్టుకుంటుంది సక్రమ పోషకాహార లోపం వల్ల లేక దీర్ఘకాలిక విరేచన వ్యాధివల్ల నీరసించిపోయిన పిల్లలకు ఇది ప్రాణానికే ముప్పు కలిగించవచ్చు. సుమారు 30 శాతం రోగులకు అనేక చిక్కులు ఏర్పడతాయి. చెవులకు అంటువ్యాధి సోకుతుంది విరేచనాలు పట్టుకుంటాయి దృష్టి చెడి పోతుంది ఎన్సెఫలైటిస్, న్యుమోనియా వ్యాధులు వస్తాయి



లక్షణాలు . 1-3 రోజులకు పిల్లలకు జలుబు, దగ్గు, జ్వరం వస్తుంది కళ్లు ఎర్రబడిపోతాయి. వెలుతురు చూడలేరు నీళ్లు కారతాయి. నుదిటి మీద, చెవుల ప్రక్క దద్దురులు ఏర్పడతాయి.

3-4 రోజులకు కళ్లు ఎర్రబడిపోతాయి, వచ్చని పుసికడతాయి. ముఖం మీద, శరీరం అంతా దద్దురులు అలుముకుంటాయి.

4-6 రోజులకు దద్దురులు దిగజారిపోతాయి. చర్మం మీద మచ్చలు ఏర్పడతాయి చర్మం ఊడిపోవడానికి ప్రారంభిస్తుంది.

2 డిఫ్తీరియా · ఈ రోగులు 10 మొదలు 15 శాతం మరణిస్తారు. గొంతుకలో సన్నని పొరలు బయలుదేరతాయి. గొంతుక పూడిపోయి ఊపిరి ఆడక మరణిస్తారు డిఫ్తీరియా సూక్ష్మజీవుల విషం గుండెకు,' నాడీ విధానానికి చాలా అపాయకరంగా పరిణమించి మరణం ఏర్పడవచ్చు

లక్షణాలు 1-3 రోజులకు బిడ్డ శ్రమపడి పోతుంది ఆహారం సరిగ్గా తినదు ఆటలు ఆడదు మెడ వాస్తుంది

4-6 రోజులకు వ్యాధి ముదిరి పోతుంది. మెడ బాగా వాచిపోతుంది. డిఫ్తీరియా స్వర పేటిక దాకా పాకిపోతుంది ఊపిరి పీల్చుకోడం కష్టం అవుతుంది ఇది గుండె దాకా పాకుతుంది గుండెపోటు ఏర్పడుతుంది. మరణం సంభవిస్తుంది.

3 పెర్టుస్సిస్ (గోరింత దగ్గు)· దీనివల్ల పసి పిల్లలలో మారకపు రేటు చాలా అధికం. ఈ వ్యాధికి 'ఊఫ్' అనే మాట నుంచి 'ఊఫింగ్ కాఫ్' ఏర్పడింది. ఊపిరి పీల్చుకునేటప్పుడు

# క్రీడారంగం

## ఆస్ట్రేలియా పర్యటించిన ఇండియన్ క్రికెట్ టీమ్

***ఇండియన్ క్రికెట్ టీమ్ 1947లో మొట్టమొదట లాలా అమర్‌నాథ్ కాప్టెన్‌గా ఆస్ట్రేలియా పర్యటించింది. ఆస్ట్రేలియా కాప్టెన్ డాన్ బ్రాడ్మన్. ఆస్ట్రేలియా 4 టెస్టులు గెలుచుకుంది. ఒకటెస్ట్ డ్రా అయింది.***

"ప్రజాస్వామ్యం విజయవంతమయేందుకు ప్రజాభిప్రాయము,

పిల్లల గొంతుకలో 'ఊఫ్' అనే శబ్దం ఏర్పడు తుంది. దగ్గి వాంతి చేసుకోవడంతో రోగి నీరస పడిపోతాడు. మెదడుకి శాశ్వతమైన హాని సంభవిస్తుంది. న్యుమోనియా వచ్చి పీడి స్తుంది.

లక్షణాలు · 1వ వారం · బిడ్డకు జలుబు, దగ్గుతో ముక్కు కారుతూంటుంది.
2వ వారం . దగ్గు విపరీతంగా ఎక్కువ అయి పోతుంది. బిడ్డ దగ్గడానికి కష్టపడుతుంది గురక శబ్దంతో ఊపిరి తీసుకుంటుంది దగ్గిన తరువాత వాంతి ఏర్పడుతుంది. దగ్గు-కూత - వాంతి పగలు రాత్రి ఉంటుంది. విపరీతమైన దగ్గు వల్ల 3వ వారం తరువాత కళ్ళలో నెత్తురు కారవచ్చు. దగ్గు మెల్లిగా సర్దుకుంటుంది.

4 టిటానస్ : కొత్తగా పుట్టిన పిల్లలకు ఈ వ్యాధి తగిలితే 100కి 100 మంది మరణిస్తారు బాగా ఉడుకుతున్న నీళ్లలో స్టెరైల్ చేయని సాధనాలతో బొడ్డు కోయడంవల్ల ఇది సంభ విస్తుంది సాధారణంగా పెద్దవారికి శరీరంలో గాయాలు వుళ్లనుండి లోపలకు ప్రవేశిస్తుంది ముఖ్యంగా , గర్భిణీ స్త్రీలకు ఇమ్యూనైజేషన్ చేయడం వల్ల దీనిని నివారించవచ్చు.

రెండు మోతాదులు అధమం నాలుగు వారాల వ్యవధిలో ఇస్తే పుట్టబోయే బిడ్డకు రక్షణ కలుగుతుంది. ప్రసవానికి బాగా వేడి నీటిలో ఉడకబెట్టి స్టెరైల్ చేసిన సాధనాలను ఉపయోగించాలి
లక్షణాలు .

5-7 రోజులు బిడ్డ పుట్టిన తరువాత చంటి పిల్ల మూతి ముడుచుకుపోతుంది. పాలు త్రాగడం మానేస్తుంది.

7-10 రోజులు బిడ్డ పుట్టిన తరువాత చంటిపిల్లలు అసలు పాలు త్రాగరు. శరీరం బిగుసుకుపోతుంది. ఫిట్లు వస్తాయి. చివరగా మరణిస్తుంది.

ఇతరులకు సూక్ష్మజీవులు గాయంగుండా లోపలకు ప్రవేశిస్తాయి నోరు, కాళ్లు, చేతులు బిగుసుకు పోతాయి. చాలా మంది పిల్లలు దీని వల్ల మరణిస్తారు

5 పోలియోమైలైటిస్ సామాన్యంగా ఇది 3 సంవత్సరాల వయస్సులోపల పిల్లలకు సంభ విస్తుంది. ఈ వ్యాధివల్ల బిడ్డకు శరీరంలో పక్షవాతం ఏర్పడుతుంది. పదిమందిలో ఒకరు మరణిస్తారు.

లక్షణాలు
1-3 రోజులు వ్యాధి సోకిన తరువాత బిడ్డకు అస్వస్థతగా ఉంటుంది. జ్వరం వచ్చి తగ్గినట్టు ఉంటుంది.

3-5 రోజులు బిడ్డకు విపరీతంగా తలనొప్పి ఉంటుంది. మెడ కదల్పలేదు. జ్వరం వస్తుంది కండరాలు నొప్పులు బయలుదేరతాయి

## K2 - ప్రపంచంలో రెండవ ఉన్నత శిఖరం



హిమాలయ పర్వతాలలో గాడ్విన్ ఆస్టిన్ (K2 అని పిలువబడే) పర్వతశిఖరం ప్రపంచంలో రెండవ ఉన్నత శిఖరం

"ఒక మంచి పనికి తిలోదకాలు ఇవ్వదలచుకుంటే మీరు

5-7 రోజులకు బిడ్డకి కొద్దిగా పక్షవాతం కలుగుతుంది. ఒక కాలుగానీ, ఒక భుజంగానీ పడిపోవచ్చు లేకపోతే తీవ్రతరమైన పక్షవాతంలో రెండు కాళ్ళు, రెండు చేతులు, భుజాలు పడిపోవచ్చు.

6 క్షయవ్యాధి : సంవత్సరానికి 10 మిలియను మంది ఈ వ్యాధికి గురి అవుతున్నారు. పిల్లలకు మరణాంతకం. టిబి వల్ల శక్తి తగ్గిపోతుంది. పెరుగుదల మందకొడిగా ఉంటుంది. శరీరంలో అనేక భాగాలకు ఈ వ్యాధి సోకుతుంది మెడమీద కంతులు ఏర్పడతాయి. ఇవి పగిలి చీము కారతాయి పుళ్ళు ఏర్పడతాయి టిబి వల్ల న్యుమోనియా కూడా రావచ్చు. దీనివల్ల అనేక రకాల అంగవైకల్యాలు ఏర్పడతాయి. నడుం దగ్గర వాపు బయలుదేరుతుంది. నడుం, మోకాళ్ళు పడిపోతాయి వెన్నెముక వంగిపోతుంది. చాలానొప్పి పెడుతుంది మెదడులో టిబి వ్యాపిస్తే అది మరణాంతకం. తీవ్రమైన తలనొప్పి, విభ్రాంతి ఏర్పడుతుంది. మెడ బిరుసెక్కి పోతుంది. ఫిట్స్ వస్తాయి దీనిని టిబి మెనింగైటిస్ అంటారు.

లక్షణాలు : రోగి ఎప్పుడూ అలసట పడినట్టు కనిపిస్తారు. కొంతమందికి జ్వరం వస్తుంది తలనొప్పి, విపరీతమైన దగ్గు వస్తుంది. పిల్లలకు ఆటలలో ఆసక్తి ఉండదు. బరువు తగ్గిపోతారు.

ముగింపు .

ముఖ్యంగా ఈ ఆరు వ్యాధుల వల్ల పిల్లలకు మరణం సంభవిస్తుంది. ఇవి రాకుండా పిల్లలకు టీకాలు వేయించవచ్చు. ప్రపంచ ఆరోగ్య సంస్థ (WHO) వారి ఎక్స్‌పాండెడ్ ప్రోగ్రాం ఆఫ్ ఇమ్యూనైజేషన్ (EPI) మరియు యూనిసెఫ్ వారి యూనివర్సల్ చైల్డ్‌హుడ్ ఇమ్యూనైజేషన్ (UCI) క్రింద చేపట్టిన పెద్ద వ్యాధులు ఈ ఆరు.

ఈ EPI వ్యాధులను రాకుండా చేయలేం కానీ నియంత్రించవచ్చు. EPI వ్యాధులు చిన్న పిల్లలకే తగులుతాయి. కాబట్టి రక్షణకు, పిల్లలకు అతి శీఘ్రంగానే ఇమ్యూనైజేషన్ చేయించాలి.

పుట్టిన ప్రతీ బిడ్డ గుర్తించబడాలి. ఆరోగ్య సేవల వారి పరిధిలోకి రావాలి. పూర్తిగా ఇమ్యూనైజేషన్ అయ్యేవరకూ తిరిగి తిరిగి వాక్సిన్ వేస్తూండాలి.

ఇమ్యూనైజేషన్ ప్రోగ్రాం

| వయస్సు | వాక్సిన్ |
|---|---|
| పుట్టుక | బిసిజి, నోటిద్వారా పోలియో చుక్కలు |
| 6 వారాలకు | డిపిటి, ఓరల్ పోలియో చుక్కలు, |
| 10 వారాలకు | డిపిటి, ఓరల్ పోలియో చుక్కలు |
| 14 వారాలకు | డిపిటి, ఓరల్ పోలియో చుక్కలు |
| 9 నెలలకు | మీసిల్స్ |

— 'హెరాల్డ్ ఆఫ్ హెల్త్' సౌజన్యంతో

## సినీమా రంగం

### అంతర్జాతీయ గౌరవం పొందిన మొట్టమొదటి ఇండియన్ ఫిల్ము

*వెనిస్ (ఇటలీ)లో 1935లో మూడవ ఇంటర్నేషనల్ ఎగ్జిబిషన్ ఆఫ్ సినిమాటోగ్రాఫిక్ ఆర్ట్‌లో దేబకి బోస్ డైరెక్ట్ చేసిన హిందీ సినిమా 'సీత' ప్రదర్శింపబడింది. దీనికి బంగారు పతకం లభించింది. ఇదే అంతర్జాతీయ గౌరవం మొట్టమొదటి ఇండియన్ ఫిల్మ్.*

"ఆనందమనేది మనలో లేదు, వెలుపలనూ లేదు. ఏకాంతతో

# ఈ శతాబ్దంలో

## ప్రపంచంలో మొట్టమొదటి పాకెట్ కెమేరా

ప్రపంచంలో పూర్తిగా దానంతట అదే పనిచేసే ఎలక్ట్రానిక్ ఫ్లాష్‌తో మొట్టమొదటి పాకెట్ కెమేరా 1982లో పశ్చిమ జర్మనీలో అమ్మకానికి పెట్టారు కెమేరాలో అంతర్నిర్మిత మైన ఫోటోఎలక్ట్రిక్ సెల్ కాంతి పరిస్థితులను ఖచ్చితంగా కొలుస్తుంది చాలా చీకటిగా ఉంటే ఫ్లాష్ వెంటనే పనిచేయడం ప్రారంభిస్తుంది




## ప్రపంచంలో మిక్కిలి పెద్ద బస్సు

ప్రపంచంలో 250 మంది ప్రయాణీకులను తీసుకుపోయే 29 టన్నుల మిక్కిలి పొడవైన బస్‌ను యునైటెడ్ కింగ్‌డమ్‌లో స్కాట్లండ్‌లో ఒక ఫాక్టరీ వారు 1981లో తయారు చేసారు. బస్సు 12 మీటర్లు పొడవుగా ఉన్నా 19 మీటర్లు వంపుతిరిగి సన్నని వీధులలో కూడా పోగలదు

## నీడపట్టున అత్యధిక ఉష్ణోగ్రత

నీడపట్టున అత్యధిక ఉష్ణోగ్రత (Highest shade temperature) 136.4 డిగ్రీల ఫారన్ హీట్ లిబియాలో (ఉత్తర ఆఫ్రికా) అల్ అజీజియాలో 1922 సెప్టెంబరు 13న రికార్డు అయింది.

## మానవుడు ఎడారులను జయించగలడు

జాక్వెయిస్ మార్టిన్ అనే 27 సంవత్సరాల ఫ్రెంచ్ యువకుడు ఉత్తర ఆఫ్రికా సహారా ఎడారిలో 50 రోజులలో 3,300 కి మీ ల దూరం పరుగెత్తి మరాథాన్ పరుగు చేసాడు ఇతడు అల్జీర్స్ (అల్జీరియా)లో 1980 నవంబరు 27న మారాథాన్ పరుగు ప్రారంభించి 1981 జనవరి 15 కి నార్తరన్ నైజెర్‌లో జిండెర్‌సు చేరాడు గంటకు 12 కి.మీ ల వేగంతో రోజుకి 50 మరియు 60 కి మీ లు పరుగెత్తేవాడు

## ఒక మైలుకి నాలుగు నిమిషాలు

రోగార్ బానిస్టర్ (బ్రిటన్) 1954లో నాలుగు నిమిషాల కంటే తక్కువ కాలంలో ఒక మైలు దూరం పరుగెత్తిన మొట్టమొదటి వ్యక్తి

## 'ప్రిన్సెస్ డెయిసీ'కి 3,203,875 డాలర్లు

జ్యూడిచ్ క్రాంట్జ్ వ్రాసిన 'ప్రిన్సెస్ డెయిసీ' అనే పుస్తకానికి న్యూయార్క్‌లో బాంటమ్ బుక్స్ వారు 1979 సెప్టెంబరు 5 న 3,203,875 డాలర్లు ఇచ్చారు

# అపూర్వ విషయాలు

## కింగ్ కోబ్రా పొడవు

*ప్రపంచంలో మిక్కిలి పొడవైన విష పాము - కింగ్ కోబ్రా 1937 ఏప్రిల్‌లో మలేషియాలో పోర్ట్ డిక్సన్ దగ్గర పట్టుపడింది. ఇది ఇంగ్లండ్ లండన్ జూలో 18 అడుగుల 9 అంగుళాల వరకు పెరిగింది.*

"జీవితంలో విజయానికి పది సూత్రాలు ఉన్నాయి. మొదటిది

## ప్రపంచంలో మొట్టమొదటి ఫేసిస్ట్ పార్టీ

ఇటలీకి చెందిన బెనిటో ముస్సోలినీ ప్రపంచంలో మొట్టమొదటి ఫేసిస్ట్ పార్టీని 919 మార్చి 23న స్థాపించాడు సోషలిస్టు తలిదండ్రులకు పుట్టి తాను సోషలిస్ట్‌గా ఉంటూ దేశంలో అరాజకం అనుకూలవంతం చేసుకుని ఇటలీకి డిక్టేటర్ అయ్యాడు.

## పికాస్సో స్వీయ చిత్రం




ప్రఖ్యాత స్పానిష్ చిత్రకారుడు పాబ్లో పికాస్సో స్వీయ చిత్రం (Self-portrait) 1981 లో 5 3 మిలియను డాలర్లకు విక్రయించబడింది

## బ్రిటిష్ జనరల్ వాచ్ 77,000 డాలర్లకు అమ్మబడింది

బెల్జియం వాటర్లూ యుద్ధంలో ఫ్రెంచ్ చక్రవర్తి నెపోలియన్ బోనాపార్టీని జయించిన సాహసోపేతుడైన బ్రిటిష్ జనరల్ డ్యూక్ ఆఫ్ వెల్లింగ్‌టన్ ఉపయోగించిన వాచ్‌ని 1964లో ఏలంలో 77,000 డాలర్లకు అమ్మారు. ఈ వాచ్ 1807లో పారిస్ (ఫ్రాన్స్)లో తయారైంది.

## తమిళనాడులో మిక్కిలి పెద్ద వృద్ధురాలు 1981లో మరణించింది

తమిళనాడులో పండు ముసలి ఉన్నక్క అమ్మాళ్ 121 సంవత్సరాల వయస్సులో కోయంబత్తూరులో 1981 డిసెంబరు 17న మరణించింది. ఈమెకు 205 మంది మనుమలు, ముని మనుమలు ఆమె చివరిదాకా ఆరోగ్యంగా ఉంది. మనుమలతో 4 కి.మీ. దూరంలో బంధువుల ఇంటికి నడిచి వెళుతూండేది.

## 16 ప్లాటినం దిమ్మలు కనుగొనబడ్డాయి

1981లో జపాన్ డైవర్లు జపాన్ దక్షిణ దిక్కుగా ట్సుషిమా ద్వీపానికి దగ్గరగా భూ గర్భంలో పాతుకుపోయిన 8,524 టన్నుల 'అడ్మిరల్ నాఖిమోవ్' రష్యన్ క్రూయిజర్ నుంచి 16 ప్లాటినం దిమ్మలను తీశారు. ఒక్కొక్కటి 150,000 డాలర్లు ఖరీదు ఉంటుంది. ఈ ఓడ 1904-5లలో రష్యా-జపాన్ యుద్ధంలో మునిగిపోయింది.

## మితిమీరి తినకుండా ఉండేందుకు సూప్ సహకరిస్తుంది

***కాంప్-బెల్ సూప్ కంపెనీ (యు.ఎస్.ఎ.)లో పరిశోధకులు చెప్పిన ప్రకారం సూప్‌లు (పులుసులు వంటివి) మెల్లిగా తాగేవి కాబట్టి మితి మీరకుండా తినేందుకు ఇవి సహకరిస్తాయి. ఒక కప్పు సూప్ తాగితే ఆ రోజు ప్రతీ రోజు కంటే తక్కువ కాలరీల ఆహారం తీసుకుంటారు.***

"వివేకంతో కూడిన ప్రసంగం బ్రహ్మాండమైన వాగ్ధాటికంటే విలువైనది."
—ఫ్రాన్సిస్ బేకన్

# చిట్టి దేవతలకు చిన్న కథలు

## ధర్మమార్గం

మహాభారతంలో ప్రసిద్ధి పొందిన పంచ పాండవ సోదరులను గురించి మనకందరికీ తెలుసు. యుధిష్ఠరుడు, భీముడు, అర్జునుడు అను ముగ్గురు కుంతి కుమారులు. నకుల, సహదేవులు ఇద్దరు మాద్రి కొడుకులు.



ఒకప్పుడు ఈ పాండురాజు పుత్రులు అడవిలో నివసిస్తుండేవారు. ఒకనాడు వారు ఒక లేడి వెంట వెళ్లారు. ఆ లేడి అతి వేగంగా పరుగెత్తడం వల్ల కొంతసేపటికి అది వారికి కనిపించలేదు. దానికోసం తిరిగి తిరిగి అలసి ఒక చెట్టు క్రింద విశ్రమించారు. ఎండవేడి ఎక్కువగా ఉంది. వారికి విదాహం పట్టుకుంది. పెద్ద అన్న యుధిష్ఠరుడు తనకు త్రాగడానికి కొంచెం మంచినీళ్లు తెచ్చి పెట్టమని నకులుని పంపించారు.

నకులుడు కొంత దూరంలో తేటగా నీళ్లు ఉన్న ఒక చెరువును చూచి అక్కడకు వెళ్లారు. అందులో నీటిని తాగబోతూండగా ఒక అదృశ్యవాణి వినిపించింది.

'ఇది నా చెరువు. ఓ నకులా! మొదట నా ప్రశ్నలకు జవాబులు చెప్పి ఆ తరువాత నీరు త్రాగు' అంది

నకులుడు నాలుగు దిక్కులూ పరికించి చూసాడు ఎవ్వరూ కనిపించలేదు. దాహం ఎక్కువగా ఉంది ఉండబట్టలేక చెరువులో నీళ్లు త్రాగారు. వెంటనే స్మృతి తప్పి చని పోయినట్లు పడిపోయారు.

చాలాసేపు అయినా నకులుడు ఇంకా రాలేదని యుధిష్ఠరుడు ఒకరి తరువాత ఒకరిని

## అవార్డులు

### ఉత్తమ ఫిల్మ్‌కి గోల్డెన్ బేర్ బహూకరణ

*అమెరికా రచయిత, డైరక్టర్ లారెన్స్ కాసడాన్స్ 'గ్రాండ్ కాన్‌యన్'కి కాలిఫోర్నియా లాస్ ఏంజిల్స్‌లో అంతర్జాతీయ బెర్లిన్ ఫిల్మ్ ఉత్సవంలో గోల్డెన్ బేర్ బహుమానాన్ని పొందారు.*

### ఉత్తమోత్తమమైన మలయాళ ఫీచర్ ఫిల్మ్‌కి బహుమానం

*ఎమ్.టి.వాసుదేవన్ నాయర్ డైరక్షన్‌తో తీసిన 'కడవు' (Kadavu)కి 1991లో కేరళ ప్రభుత్వం వారి ఉత్తమోత్తమమైన మలయాళ ఫీచర్ ఫిల్మ్ బహుమానం లభించింది.*

### 1990-91 ఇక్‌బాల్ సమ్మాన్

*సుప్రసిద్ధ ఉర్దూ కవి ఆనంద్ నారాయణ్ ముల్లాకి న్యూఢిల్లీలో అపేక్షణీయమైన '1990-91 'ఇక్‌బాల్ సమ్మాన్' లభించింది.*

"పనిలేని కబుర్లు సంఘటిత సమాజానికి ముప్పు."

తమ్ములను వరుసగా పంపాడు. ఎవరూ తిరిగి రాలేదు.

యుధిష్ఠిరుడు దాహం తీర్చుకోడానికి ఆ చెరువు వద్దకు తానే బయలుదేరి వెళ్లాడు.

దృఢ శరీరంతో మంచి బలవంతులైన తమ్ములందరూ నిస్సహాయంగా స్మృతి తప్పి పడి ఉండటం చూచి, వారందరూ మరణించిన తరువాత నేను బ్రతికి ఉండి లాభం ఏమిటి అనుకున్నాడు.



ఇక్కడ ఏదో తెలియని మహిమ ఉండాలి అనుకుంటూ మంచినీళ్ళు త్రాగడానికి చెరువు లోకి దిగాడు.

అదే వాక్కు వినిపించింది. 'నేను చెప్పినది వినకపోవడం చేత నీ తమ్ములు ఈ అవస్థను పొందారు. నీవు బ్రతకాలంటే మొట్టమొదట నా ప్రశ్నలకు జవాబులు చెప్పి తరువాత నీరు త్రాగు' అని అంది.

'ఒక మనిషి విజ్ఞానవంతుడు ఎలా అవుతాడు?' అని వాణి అడిగింది.

'గ్రంథాలను చదవటం వల్ల కాదు' అంటూ యుధిష్ఠిరుడు 'వివేకవంతులైన బుద్ధిమంతుల సహవాసంతో మనిషికి విజ్ఞానం కలుగుతుంది' అన్నాడు.

'ఆకాశం కంటే ఉన్నతమైనది ఏది?' అని వాణి తిరిగి ప్రశ్నించింది.

'తండ్రి' అని చెప్పాడు యుధిష్ఠిరుడు.

'గాలి కంటే వేగంగా ఏది పయనిస్తుంది' అని వాణి అడిగింది.

'గాలి కంటే వేగంగా బుద్ధి పయనిస్తుంది' అని పాండు పుత్రుడు చెప్పాడు.

'ఒక యాత్రికునకు ఉత్తమ స్నేహితుడు ఎవరు?' అని అడిగింది.

'నేర్చుకోడం ఉత్తమ స్నేహితుడు' అని జవాబు చెప్పాడు.

'మరణించిన తరువాత మనిషిని వెంబడించేది ఏది?' అని వాణి అడిగింది.

'మనిషి ధర్మం' అని బుద్ధిశాలి యుధిష్ఠిరుడు చెప్పాడు.

'ఆనందం అంటే ఏమిటి?' అని వాణి ప్రశ్నించింది

'మంచి శీలం యొక్క ఫలితం' అని జవాబు చెప్పాడు

## మొట్టమొదటి ఇండియన్ బ్యాంక్ 1770లో స్థాపింపబడింది

ది బ్యాంక్ ఆఫ్ హిందుస్థాన్ అని చెప్పబడే *మొట్టమొదటి ఇండియన్ బ్యాంక్ 1770లో కలకత్తాకు చెందిన అలెగ్జాండర్ అండ్ కంపెనీ వారిచే స్థాపించబడింది మొట్టమొదటి పూర్తి భారత దేశపు బ్యాంక్ - పంజాబ్ నేషనల్ బ్యాంక్ 1894లో స్థాపించబడింది*

"రాపిడి ఉన్నచోట చప్పుడు, గోల సహజం."

'నీవు దేనిని వదులుకుంటే నిన్ను అందరూ ప్రేమిస్తారు?' అని వాణి ప్రశ్నించింది.

'గర్వం' అని యుధిష్ఠరుడు జవాబు చెప్పాడు.

'దేనిని త్యాగం చేయడం వల్ల సంతోషం కలుగుతుంది?' అని ప్రశ్నించింది

'కోపం' అన్నాడు యుధిష్ఠరుడు

'దేనిని వదలుకుంటే ధనవంతుడు అవుతాడు?' అని వాణి ప్రశ్నించింది

'అభిమానం' అన్నాడు

'నిజమైన బ్రాహ్మణుడు ఎవరు?'

'వంశం, విద్య వల్ల బ్రాహ్మణుడు కాజాలడు ధర్మబద్ధమైన శీలం వల్ల వాస్తవమైన బ్రాహ్మణత్వం లభిస్తుంది' అన్నాడు

'ప్రపంచంలో ఏది గొప్ప వింత?' అని చివరగా ముఖ్యమైన ప్రశ్న అడిగింది

'మానవులు ప్రతీరోజూ మరణాన్ని చూస్తూనే ఉన్నారు. అయినా కలకాలం జీవించాలని అనుకుంటారు ఇదే ప్రపంచంలో గొప్ప వింత' అన్నాడు యుధిష్ఠరుడు

ఇప్పుడు వాణి 'నీ జవాబులకు నేను సంతసించాను. నీ తమ్ములలో ఎవరినైనా ఒకరు బ్రతకడానికి కోరుకో' అంది

యుధిష్ఠరుడు క్షణకాలం యోచించి 'నా తమ్ముడు నకులుడు బ్రతకాలి' అన్నాడు

ఇంతవరకూ ప్రశ్నలు వేసిన యక్షుడు 'నీవు భీమార్జునులను కోరుకోక నకులుని ఎందుకు కోరుకున్నావు?' అని అడిగాడు.

'ఓ యక్షా! ధర్మం చేతనే పాపాన్ని జయించగలరు. నా తండ్రి కుంతిని, మాద్రిని వివాహం చేసుకున్నాడు. నేను, భీముడు, అర్జునుడు కుంతి కొడుకులం, నేను బ్రతికి ఉన్నాను. మాద్రి కుమారులు నకుల, సహదేవులలో ఒకరు బ్రతికి ఉండటం ధర్మం, న్యాయం' అన్నాడు యుధిష్ఠరుడు

వెంటనే యక్షుడు నిజ స్వరూపమైన యముని రూపంలో ధర్మమూర్తిగా ప్రత్యక్షమయ్యాడు యుధిష్ఠరుని పరీక్షింపదలచాడు యువరాజులందరినీ బ్రతికించాడు అదృశ్యమైపోయాడు

## పక్షులు తెలివిగా ఈగలను పురుగులను వారించుకుంటాయి



పురుగులు, ఇతర వరాన్నభుక్కులైన కీటకాలు జంతువులకు, పక్షులకు మహోపద్రవ కారకాలు. కోతులు అతి నేర్పుగా వీటిని వ్రేళ్లతో పట్టుకుంటాయి. పక్షులు తెలివిగా వారించుకుంటాయి. పక్షులలో జే, కాకి మరియు కొన్ని జాతులు చీమలను ముక్కుతో కరచి పట్టుకుని దాంతో దానికి అపాయం కలుగకుండా శరీరం మీద రుద్దుకుంటాయి. ఈ చీమలు ఫార్మిక్ ఆసిడ్‌ను విడుదల చేస్తాయి. ఇది ముఖ్యంగా పురుగులను, కీటకాలను నశింపచేస్తుంది.

— 'సిజాజ-ఎన్‌ఎఫ్‌ఎస్' సౌజన్యంతో

'జ్ఞాన సిద్ధునకు మోక్షం కరతరామలకం."

# స్లాత్ బేర్

## మమతా పాండ్య

తూర్పు ఇండియాలో ఉండే ఎలుగు బంటి జాతికి చెందిన స్లాత్ బేర్‌ని దక్షిణ అమెరికా స్లాత్ బేర్ అని శాస్త్రజ్ఞులు భ్రాంతి చెందుతారు.



SLOTH BEAR

దీనికి శరీరం అంతా నిడుపాటి తెల్ల తెల్లగా ముతకబొచ్చు, ఛాతీ మీద గుర్రపు నాడా ఆకారంలో మచ్చ, వెనుక కాళ్లు పొట్టిగా, కాళ్లకు కొడవలి ఆకారంలో వంకరగోళ్లు ఉంటాయి. ఇవి భూమిని త్రవ్వడానికి, చెట్లు ఎక్కడానికి వీలుగా ఉంటాయి. పంజాలపైన బొచ్చు ఉండదు. చెట్లు ఎక్కడానికి వీలుగా దళసరి పాటి చర్మంతో కప్పబడి ఉంటాయి.

ఈ ఎలుగుబంటి ముట్టె ముందు తెల్లగా తొండంలా పెద్ద పెదవి ఉంటుంది. ఈ పెదవిని ముందుకు సాచగలదు. ఇతర మాంసాహారపు జంతువులు లాగా కాక ఆహారం బలవంతంగా లాగుకోడానికి, బాగా ఊపిరి పీల్చడానికి వీలుగా ఉంటుంది. పొడు గాటి నాలుకను కూడా ముందుకు సాచగలదు.

ఈ ప్రత్యేక అనుకూలాల వల్ల ఇష్టమైన ఆహా రాన్ని సులభంగా సంపాదించుకుని సంతృప్తిగా తినగలుగుతుంది.

ఒకసారి చెదల పుట్టను చూస్తే ఆ పుట్టను బలవంతంగా పడగొట్టి లోపల చెదపురుగులను గట్టిగా పీల్చేసుకుంటుంది. ఇదేవిధంగా చిన్న చిన్న పురుగులను, ఇతర కీటకాలు వదలిన వ్యర్థ పదార్థాలను కూడా పీల్చేసుకుంటుంది.

సాధారణంగా రాత్రిపూట విచ్చలవిడిగా తిరిగే ఈ స్లాత్ బేర్ వాసన చూసుకుంటూ అడవులలో పండ్ల వృక్షాలవైపు వెడుతుంది.

## శక్తివంచన లేకుండా చెయ్యి



జీవితంలో విజయం పొందడానికి ముఖ్య కీటుకు నీ శక్తి సామర్థ్యాలతో నీవు ఆశించినది పొందడంలో ఉంది. దీనినే ఇంకోవిధంగా చెప్పా లంటే నువ్వు ఏం చేస్తున్నా శక్తివంచన లేకుండ చెయ్యి. శక్తి వంచన లేకుండా చేసేవారికి జీవితం మోసగించదు. కానీ చాలామంది ఇది చేయరు. అందువల్లే అపజయం పొందుతారు. అపజయం పొందకపోయినా ఆశించినది పూర్తిగా పొందలేక పోతున్నాము. — డా. నార్మన్ విన్సెంట్ పీల్

యాశాలలో పండే పళ్లను బాగా తింటుంది. ముఖ్యంగా, మార్చి-ఏప్రిల్ మాసాలలో పూతపూసే ఇప్పచెట్ల పుష్పాలను ఎక్కువగా తింటుంది. వేసవికాలంలో చెట్లపై తేనెపట్లను కొట్టి తేనెను త్రాగుతుంది. ఒక్కొక్కప్పుడు చెరకు తోటలలో పడి చెరకును తినేస్తుంది.

స్లాత్ బేర్ ఎక్కువగా నీరు త్రాగడానికి ఎండ సమయంలో చాలాదూరం వెళుతుంది. ఎండిపోయిన భూమిని ముక్కుతో త్రవ్వి నీటి వనరులను తెలుసుకుంటుంది

వేసవిలోనే ఇవి జతకూడతాయి. జత కూడడానికి ఇంపుగా అరుస్తూ బయలుదేరతాయి. ఏడు నెలల తరువాత శీతాకాలంలో రెండు, మూడు పిల్లలు జన్మిస్తాయి. చిన్నవి రెండు, మూడు సంవత్సరాల పాటు పెద్దవిగా పెరిగే దాకా తల్లితో పాటు తిరుగుతూంటాయి.

స్లాత్ బేర్‌లు ఎండలకు, వానలకు అనుకూలంగా గుహలలోను, పెద్దరాళ్ళ ప్రక్కన నివసిస్తాయి. చలికాలంలో ఇవి ఆరుబయట గడ్డి మైదానాలలో, చెట్ల నీడ క్రింద నిద్రపోతాయి. నిద్రలో ఏదైనా చప్పుడు వింటే అకస్మాత్తుగా లేచి శత్రువులను వాడిగోళ్ళతో ఎదుర్కొని చీల్చేస్తాయి.

ఈనాడు దీని నివాస స్థలాలు తగ్గిపోవడం వల్ల, బొచ్చుకి, దీని గాల్ బ్లేడర్‌కి ఔషధ లక్షణాలు ఉన్నవనుకుని దీనిని చంపడం వల్ల, వీధులలో వీటిని ఆడించడానికి పట్టుకోవడం వల్ల ఒకప్పుడు దేశంలో విస్తారంగా ఉండే ఈ జాతి అంతరించి పోయే పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

— 'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## 12 బిలియను టన్నుల శిలాజ ఇంధనం ఖర్చు అవుతూంది



*1900వ సంవత్సరంలో ప్రపంచంలో 1.6 బిలియను మంది జనం ఉండేవారు. వీరి సరాసరి తలసరి ఆదాయం 400 డాలర్లు మించకుండా ఉండేది. ప్రపంచంలో తలసరి గ్రాస్ నేషనల్ ప్రొడక్ట్ సుమారు 2800 డాలర్లతో, ఈనాడు ప్రపంచంలో 5.1 బిలియను మంది ఉన్నారు. దీని వల్ల లభ్యమయ్యే ఔట్‌పుట్ విలువ 13 ట్రిలియన్ డాలర్లు.*

*ఈ ప్రగతి ఫలితంగా బొగ్గుకు ప్రత్యామ్నాయంగా శిలాజ ఇంధనం (fossil fuel) వినియోగాభివృద్ధి 1900లో 1 బిలియను టన్ను నుంచి 1989 లో 12 బిలియను టన్నులు అయింది. వాతావరణం లోకి విడువబడే మొత్తం కార్బన్ డయాక్సైడ్ ప్రపంచ వ్యాప్తంగా ఉష్ణాభివృద్ధికి ముఖ్యకారణం.*

*పెరిగిపోతూన్న ప్రపంచ జనాభా ఆహార అవసరాలను తట్టుకోడానికి రైతులు ఉపాంత (marginal) ప్రదేశాలను కూడా బాగా దున్ని సారవంతం చేయవలసి వస్తూంది. దీనివల్ల భూమిపై మట్టి కొట్టుకు పోతుంది. ఇది సంవత్సరానికి 24 బిలియను టన్నులు. ఇది ఆస్ట్రేలియాలో గోధుమ పండించే భూ ప్రదేశం అంత ఉంటుంది. ప్రతీ సంవత్సరం పెరిగే 88 మిలియను జనాభాకు ఏయేటికాయేడు తగ్గిపోతూన్న భూ ఉపరి భాగం దున్ని ఆహారం ఉత్పత్తి చేస్తున్నారు.*

*— 'వరల్డ్ వాచ్ ఇన్‌స్టిట్యూట్' సౌజన్యంతో*

"పండితులైనా, పామరులైనా పరితపించే భక్తులందరియందును

# ఊరికే బాధపడిపోకు

ఉన్నట్టుండి అకస్మాత్తుగా మనం నిరాశ పడిపోయి నిస్సహాయులం, ఎందుకూ పనికి రాని వారం అనుకుంటాం. ఒక్కొక్కప్పుడు మన ఆవేశాలను, ఉద్రేకాలను ఎంత నైపుణ్యంగా అదుపులో పెట్టుకోడానికి ప్రయత్నించినా ఏవేవో దురాలోచనలు మనసులో బయలు దేరుతూంటాయి. ఆలస్యంగా వచ్చినందుకు, తప్పుగా చెప్పినందుకు తిట్లు తింటాం.



సమయాన్ని పాటించనందుకు, జోళ్లు పాలిష్ చేయలేదని, బట్టలు సరిగ్గా ఇస్త్రీ చేయలేదని ప్రతీ చిన్న విషయానికీ అనవసరంగా చింత పడిపోతాం. అకస్మాత్తుగా నిరుత్సాహం జనిస్తుంది. నిరాశపడిపోతాం. ఇటువంటి సందర్భాలు ఒకదానికి ఒకటిచేరి ఆత్మ విమర్శనా శక్తిని పోగొడతాయి. మంచి చెడ్డలు తెలియవు. వివేకం ఉండదు.

విచారంతో కృంగిపోయినప్పుడు ధైర్యం అవలంబించడానికి కొన్ని ప్రత్యక్షంగా తెలుసు కున్న సూచనలు ఇక్కడ సూచింపబడ్డాయి.

1. శారీరకంగా : సదారుచేయి, బాగా ఊపిరి పీల్చుకో. శుభ్రమైన ప్రాణవాయువు నా మనస్సును తేలిక పరుస్తోంది అనుకో. మంచి శుభ్రమైన ఎర్రటి రక్తం ధమనులలో ప్రవహిస్తోంది అనుకో. సక్రమమైన వ్యాయామం అవలంబించడం వల్ల కండరాల బిగి సడలుతుంది. మెదడులో ఉత్సాహం, అభినివేశం బయలుదేరుతుంది.

2. కునికిపాట్లు: నిద్ర శారీరకంగానూ, మానసికం గానూ ఉత్తేజాన్ని కలిగిస్తుంది. కాసేపు హాయిగా పడుకుని విశ్రాంతి తీసుకో.

3. వ్రాయి/ప్రక్కవారితో మాట్లాడు: స్నేహితులకు గానీ, చుట్టాలకుగానీ ఒకటి రెండు ఉత్త రాలు వ్రాయి. లేకపోతే ఒకరి పనిని మెచ్చుకుని నాలుగు ముక్కలు వారికి వ్రాయి. ఏదైనా పేపరు ఎడిటర్‌కి ఏదైనా సమాజ సమస్యను తెలియజేస్తూ ఒక ఉత్తరం వ్రాయి. వీధిలో ఈ చివర నుంచి ఆ చివరకు ఒకసారి నడుచుకు వచ్చి మీ స్నేహితునితో మాట్లాడు. లేక ఫోను చేసి స్నేహితునితో నీ ప్రణాళికలను గురించి మాట్లాడు.

4 ఏదో వ్యాపకం పెట్టుకో : నీవు చేయకుండా వదలిపెట్టిన పనికి పూనుకో. గది శుభ్రం చేయడం, ఫ్రిజ్ లోపల తుడవడం,

## వింత ఆచారం

### వివాహాన్ని ప్రకటించాలంటే!

మధ్య అమెరికా గ్వాటెమాలాలో అటిటియన్ సరస్సు దగ్గర నివసించే జుటుహైల్ ఇండియనులలో కాబోయే వరుడు వధువు తల మీద నీటి కుండను పగులగొట్టి వివాహాన్ని ప్రకటిస్తాడు.

"నేను కర్తను అనుకునేవారికి భగవంతుడు ప్రసన్నుడు కాడు."

నేడే చేయడం మొదలైనది ఏదో ప్రస్తుతం. దీని వల్ల మనస్సు నిమ్మళంగా అవుతుంది. కలత చెందిన మనస్సు తేరు కుంటుంది.

5. పాత అలవాటు మానుకో : నీవు ఇంతకు పూర్వం వెళ్లని కొత్త చోటుకి మార్చుకోనం వెళ్లు నీ గురించి ఇతరులు మెచ్చుకున్న విషయాలను డైరీలోకి ఎక్కించు.

6. చిరునవ్వుతో ఉండు : నీవు వాస్తవంగా సుఖంగా ఉన్నట్టు నటిస్తే చాలు నీవు సుఖంగా ఉండగలుగుతావు అంటారు మనస్తత్వ శాస్త్రవేత్తలు.

7. వినోదయాత్ర సంకల్పించుకో : మంచి ట్రావెల్ (యాత్ర) పుస్తకాలు, టూరిజం కరపత్రాలు చదువు. మనస్సుకి ఎంతో హాయి కలుగుతుంది. చుట్టు పట్ల వినోద ప్రదేశాలకు వెళ్ళి ఆనందించడానికి ప్లాను వేసుకో.

8. సంగీతంతో సహకారం పొందు : ఎవరో మనస్సులో మాట్లాడుతూన్నట్టు అనిపించడం, అశాంతిని పోగొట్టుకోడానికి నీకు బాగా ఇష్టమైన సంగీతం కాసెట్ పెట్టుకుని విను. ఇంపుగా ఉండే సంగీతం వల్ల నరాలకు శాంతి ఏర్పడుతుంది.

9. పగటి కలలు : పగటి కలలు కనడం ఎంతో మంచిది అంటారు మనస్తత్వ శాస్త్రజ్ఞులు. లాటరీ గెలిచావు అనుకో. ఆ లాటరీ సొమ్ము ఎలా ఖర్చుచేస్తావో ప్లాను వేసుకో.

10. ఇతరుల బాధకబాధలు విను : ఇతరులకు నీవు కనికరిస్తే నీ అంతట నీవు ఎందుకు కనికరించుకోలేవు? వాళ్ళంతా హాయిగా ఉంటే నీవు మాత్రం ఎందుకు ఉండలేవు? పొరపాట్ల కంటే కూడా ఏదారం చూసే అవకాశం చాలా ఎక్కువ.

11. బద్ధకం తీర్చుకో : ఊహలు మార్చుకోడం కష్టం, మనస్సు మార్చుకోలేవు. కానీ నీ శరీర నిర్మాణాన్ని గ్రహించుకో. మూసిన వేళ్ళు తెరిచి బాగా జావు. భుజాలు సడలించుకో. బద్ధకం తీర్చుకో దీర్ఘంగా ఊపిరి పీల్చు. విశ్రాంతి తీసుకో. దీంతోపాటు నీ మనస్సుకి ఎంతో విశ్రాంతి, శాంతి.

12. ధ్యానం : భగవంతుని ధ్యానించడం వల్ల నీ కష్టాలకు, బాధలకు విడుగడ ఏర్పడుతుంది. ఎంత ఉపశమనం. 'నేను ఒక సామాన్య మానవ మాత్రుడిని అయినా భగవంతుడు మన్నించారు, నన్ను ప్రేమించారు.'

— 'మైలాపూర్ అకాడమీ' సౌజన్యంతో

# టిబెట్‌లో మొట్టమొదటి రాజభవనం



*టిబెట్‌లో ప్రసిద్ధి పొందిన మొట్టమొదటి రాజ భవనం యుమ్‌బుల్‌హాఖాంగ్ (Yumbulhakhang) మొట్టమొదటి రాజు న్యాత్రి ట్సెన్‌పో (Nyatri Tsenpo) పరిపాలనా కాలంలో నిర్మించబడిన ఈ భవనం (1966-1969) చైనాలో సాంస్కృతిక విప్లవంలో నాశనం చేయబడింది. ఈనాడు ఇది పూర్తిగా శిథిలావస్థలో ఉంది*

"దివ్యత్వం (సాధించడానికి ముందు మానవత్వం పనుపి పోవాలి

# హెన్రీ ఫోర్డ్

ఫోర్డ్ మోటారు గురించి మీకందరికీ తెలుసు. దానికా పేరు పెట్టిన వ్యక్తి కథ ఇది.

హెన్రీ ఫోర్డ్ 1863లో యు.ఎస్.ఎలో మిచిగాన్ స్టేట్‌లో జన్మించాడు. ఇతడి తండ్రి ఒక రైతు. హెన్రీ తండ్రి పొలంలోనే పెరిగాడు.




చిన్న బాలుడిగా ఉంటూన్నప్పుడే వ్యవసాయం కంటే యాంత్రిక విషయాలను తెలుసుకోవాలని ఎక్కువ కుతూహల పడేవాడు. 13వ సంవత్సరం వయస్సులో చుట్టుపక్కల ఉండేవారి గడియారాలను మామూలు సూదితో రిపేరు చేస్తూండేవాడు! కొన్ని రోజులకు ఆ పొలంలోనే మెషీన్ షాపు ప్రారంభించాడు. పొలంలో దున్నడానికి ఆవిరితో నడిచే ట్రాక్టరును తయారుచేయడానికి ప్రారంభించాడు. తండ్రికి ఇతడు మెకానిక్‌గా ఉండడం ఎంతమాత్రం ఇష్టంలేదు. అతడికి కొంతభూమిని ఇచ్చి వ్యవసాయం చేసుకోమన్నాడు.

హెన్రీ తన వాటా పొలం అమ్మేసుకుని డెట్రాయిట్‌లో మెకానిక్ ఉద్యోగంలో చేరాడు. తనతోపాటు తన మెకానిక్ షాపును కూడా అక్కడకు తరలించాడు. ఇంటి పక్క ఒక షెడ్‌లో పెట్టాడు.

1892లో హెన్రీ మొట్టమొదట కారును నిర్మించాడు. కొన్ని ఏళ్ళ తరువాత మరో కారుని నిర్మించాడు. '999' అని పిలువబడే ఈ కారు చాలా వేగంగా నడుస్తుంది. అనేక రేసులలోను, పోటీలలోను గెలిచింది.

## చేజారిన అవకాశం

*పూర్వం ఒక గొప్ప ధనవంతుడు మంచిని చేయదలచుకున్నాడు. ఒక రోజు దీనావస్థలో ఉన్న వడ్రంగిని చూసాడు. ఆ ధనికుడు వడ్రంగిని పిలిచి తనకు ఒక అందమైన ఇంటిని కట్టమన్నాడు. 'ఆ ఇల్లు నాకు ఎంతో ఆదర్శవంతంగా ఉండాలి. మంచి పనివాళ్లను నియోగించి, నిర్మాణానికి ఉత్తమోత్తమమైన వస్తువులను వాడాలి, ఎంత ఖర్చైనా ఫరవాలేదు' అన్నాడు. తను పొరుగూరికి వెళుతున్నానని, తిరిగి వచ్చే సమయానికి ఇల్లు పూర్తి అవాలని చెప్పాడు.*

*వడ్రంగి ఇది తనకు లభించిన ఉత్తమ అవకాశం అనుకున్నాడు వెంటనే ఏదో తుక్కు సామాను తీసుకు వచ్చాడు. ఏవీ బాగాచేయలేని వారిని తక్కువ మందిని పిలుచుకు వచ్చాడు. వాళ్లు చేసిన పొరపాట్లను అతుకులు వేసి కప్పాడు. రంగులు పూసాడు. ధనికుడు తిరిగి వచ్చాడు. వడ్రంగి అది చూసి గబగబ అతడిని తలుపు తాళం తీసి లోపలకు తీసుకు వెళ్లాడు. 'నేను మీరు చెప్పినది అక్షరాలా అనుసరించాను. మీరు చెప్పినట్లే మీ గృహాన్ని నిర్మించాను' అన్నాడు. 'నాకు ఎంతో సంతోషం' అని ధనికుడు అంటూ తాళం చెవి ఇల్లు కట్టిన వడ్రంగికి ఇస్తూ 'ఇదిగో తాళం చెవులు ఇవి నీవే. నేను అసలు ఇల్లు నీ కోసం కట్టమన్నాను. నీకు, నీ కుటుంబానికి ఇది నా బహుమానం' అన్నాడు.*

"కేంద్రం పరిధిలేనప్పుడే సౌందర్యం, ప్రేమ విలసిల్లుతాయి."

మందే కార్లను కొనుక్కో వాలని ఆశపడేవారు. అప్పుడు పెద్ద పెద్ద కారు ఫ్యాక్టరీలు లేవు. కార్లు తరుచూ చెడి పోతూండేవి. చాలా చప్పుడు చేసేవి. నాజూకుగా ఉండేవి కావు. జనం సాధారణంగా రైలు బండినో, గుర్రపు బండినో ఉపయో గించుకునేవారు.




ఇంతలో హెన్రి ఫోర్డ్ చౌకగా, మంచి నమ్మక మైన కారును తయారుచేయడానికి నిశ్చ యించుకున్నాడు. చాలామందికి ఒకేరకం కార్లు చాలా తయారుచేయాలని అనుకున్నాడు. 1903లో ఇతడు తన పెద్ద మోటార్ కంపెనీని ప్రారంభించాడు. అయిదేళ్ళలో ప్రసిద్ధి పొందిన T మోడల్ మోటార్ కార్లను మొట్ట మొదట అధిక సంఖ్యలో తయారుచేసాడు. ఇవి చాలా తేలికగా ఉండి, మిక్కిలి వేగంగా పోతుంది. చౌకకు చౌక కూడా. ఎప్పుడూ చెడిపోదు. 20 ఏళ్లలో మిలియనుల కొద్దీ ఈ కార్లను అమ్మాడు.

T మోడల్ తరువాత అనేక నమూనాలు వచ్చాయి. ప్రపంచం అంతటా ఫోర్డ్ కంపెనీలు బయలుదేరాయి. డెట్రాయిట్ దగ్గర ఉన్నదే మిక్కిలి పెద్ద ఫ్యాక్టరీ. దీనికి స్వంతగనులు, స్వంత స్టీలు ఫౌండరీలు, గ్లాస్ వర్క్స్ ఉన్నాయి. కార్ల వివిధ భాగాలు తయారుచేయడానికి కావల సిన హంగులు అన్నీ స్వంతంగా ఉన్నాయి.

# మార్పు ప్రగతికి ముఖ్యం



*ప్రగతికి మూలం మార్పు. నీ భావాలను, ఆలో చనలను, వైఖరులను మార్చుకుంటూన్న కొద్దీ ప్రగతిని పొందుతావు. కొత్త భావాలకు అవకాశం ఇచ్చిన వెంటనే ప్రవృద్ధి పొందుతావు. ఒక్కొక్కప్పుడు బాధాకరం అనిపించినా మార్పు ఎప్పుడూ అవశ్యకం.*

*నిరుత్సాహపరచే వ్యతిరేక పరిస్థితులను మార్చుకోవాలంటే మనసులో నిరుత్సాహపరచే భావాలను మార్చుకో. మానవుడు కృషికి తగిన ఫలితాన్ని అనుభవిస్తాడు! అనురాగం, ప్రేమ, కాంతి, ఓర్పు సహనం, సుఖం, సంతోషం, సౌభాగ్యం మొదలైనవాటికి సంబంధించిన భావాలను జనింపజేసుకో. వాటికి తగిన ఫలితాలను పొందు తావు. ఇదే కారణకార్యధర్మం. మంచినే ఆలోచిస్తే మంచిని పొందుతావు. మంచిని ఆచరిస్తే ఇతరులు నీకు మంచి చేస్తారు.*

*దీనిని నీ జీవితానికి అనువర్తింపజేసుకో. మూడు ప్రశ్నలు వేసుకో. 'నేను ఇక్కడ ఎందుకు ఉన్నాను?' 'నేను ఎక్కడికి వెడుతున్నాను?' 'నా జీవితాశయాలను పొందడానికి ఏఏ మార్పులు పొందాలి?' వీటిని గురించి తీవ్రంగా ఆలోచించి సరైన జవాబులను తెలుసుకుని వాటికి అనుగు ణ్యంగా ప్రవర్తించు.*

*మంచిగా మారాలని నీ మనస్సు మార్చు కుంటేనే తప్ప నీవు మారలేవు. నీకు కావలసినది ఏమిటో తెలుసుకో. నిశ్చయం చేసుకుని దానిని అనుసరించు.*

*— బ్రియాన్ ఆడమ్స్*

"అభిప్రాయాలు గత కాలానికి సంబంధించినవి.
ఆధారం వర్తమాన కాలానికి చెందినది."

# స్వరాజ్యం

మహాత్మాగాంధీ

సత్ప్రవర్తనతో శక్తి సామర్థ్యాలను అభివృద్ధి చేసిన స్వాతంత్ర్య దేశ నిర్మాణ ఉద్యమ ఫలితమే స్వరాజ్యం. అది అవినాభావం ఇది విదేశీ అధికారం లేకుండా పూర్తి స్వాతంత్ర్యం మరియు ఆర్థిక స్వాతంత్ర్యం.



కాబట్టి ఒక ప్రక్క మనకు రాజకీయ స్వాతంత్ర్యం, మరో ప్రక్క ఆర్థిక స్వాతంత్ర్యం ఉంటుంది. ఇవేగాక దీనికి మరి రెండు లక్షణాలు కూడా ఉన్నాయి. వీటిలో ఒకటి నైతిక మరియు సాంఘిక స్వాతంత్ర్యం. మరియొకటి ధర్మవర్తనము అంటే మతము - హిందూమతం, ఇస్లాం మరియు క్రైస్తవ మతం వగైరా. వీటన్నిటి కంటే విశిష్టమైనది స్వరాజ్య చతురం. దీనిలో ఏ కోణం సరిగ్గా లేకుండా వక్రించినా రూపం చెడిపోతుంది. అదేవిధంగా పౌరుల స్వరాజ్యం అంటే వ్యక్తిగతమైన స్వపరిపాలన (Self Rule). అటువంటి స్వరాజ్యంలో ప్రతీ పౌరుడు తన ధర్మాన్ని ఆచరించినప్పుడే ఇది సాధ్యం. దీనిలో ఏ ఒక్కరు తమ హక్కులను గురించి యోచించరు. అవసరమైనప్పుడు ఉత్తమరీతిలో ధర్మాన్ని ఆచరించడానికి అందరూ చేరతారు. సమిష్టి లక్ష్యాన్ని సాధించడానికి ప్రతీ వ్యక్తి, పురుషుడు, స్త్రీ తమ శక్తిని ధారపోస్తారు. అందరూ చదవగలరు. వ్రాయ గలరు. వారి విజ్ఞానం నిరోజుకారోజు ప్రగతి కరంగా ఉంటుంది. అనారోగ్యం, వ్యాధులు కనీస స్థాయికి తగ్గించబడతాయి. ఎవరూ దరిద్రులు కారు - కార్మికులకు ఉద్యోగావకాశాలు ఎప్పుడూ ఉంటాయి. అటువంటి రాజ్యాంగంలో జూదాలకు, త్రాగుళ్ళకు, అవినీతి చర్యలకు, వర్గద్వేషాలకు తావు ఉండదు. ధనికులు తమ ధనాన్ని వివేకవంతంగా ఖర్చు చేస్తారు. ప్రాపంచిక విలాసాలకు, గొప్పలకు అమిత వ్యయంగానీ, దుర్వ్యయం గానీ చేయరు. ఏదో కొద్దిమంది ధనికులు పెద్ద పెద్ద రాజ భవనాలలోను, లక్షలాది సామాన్యులు వెలుతురు లేని నికృష్టమైన పూరి కొంపలలోను నివసించడం అనేది ఉండదు.

న్యాయమైన హక్కులను అతిక్రమించటం ఉండదు. సంఘటిత రాజ్యంలో ఎవరికీ అన్యాయమైన హక్కులు ఉండవు. దురాక్రమణదారులను అధికారం నుంచి తొలగించడానికి బలం ఉపయోగించవలసిన అవసరం ఉండదు.

## పరమాత్ముని విస్మరణ!

యుద్ధ సమయాలలోనే కాని ముందు కాదు
సైనికుడు, దైవం ఒకటే.
యుద్ధాలు విరమించాక, స్థిరపడ్డ తరువాత
దైవాన్ని విస్మరిస్తారు, సైనికుణ్ణి అలక్ష్యం చేస్తారు.

'అదృష్టానిది స్త్రీ స్వభావం - మనం వలచిన కొద్దీ అది వెనుకకు పోతుంది."

# వనితాలోకం

## నల్లని పొడుగాటి జుట్టు అందం

మీ తల నెరుస్తూందా? మీ జుత్తు నల్లగా నిగనిగలాడుతూ పొడుగ్గా ఉండాలని అనుకుంటున్నారా? అయితే జాగ్రత్తగా గమనించండి. బాగా ముదిరిన అర్ధ కొబ్బరి చిప్ప తీసుకోండి. దీనిలో ఉన్న కొబ్బరిని మెత్తగా కోరండి. ఈ కోరుకి ఒక కప్పు వేడి నీళ్లు కలపండి. మిక్సీలో వేసి బాగా కొబ్బరి పాలు చిక్కగా తయారుచేయండి. దానిని ఒక గాజుగ్లాసులోకి వడకట్టండి.



ఒక నిమ్మకాయ కోసి నిమ్మరసం ఈ కొబ్బరి పాలలోకి పిండండి. తల షీకాయతో రుద్దుకుని శుభ్రం చేసుకోండి. తరువాత పై మిశ్రమాన్ని తలకు పట్టించి అరగంట అయిన తరువాత తల మీద స్నానం చేయండి. జుట్టు ఆరబెట్టుకుని కొబ్బరి నూనె పట్టించండి. అప్పుడప్పుడు ఇలా చేస్తూంటే మీ జుట్టుని చూచి అందరూ మోహిస్తారు.

## గది చల్లగా ఉండడానికి

వేసవికాలం, ఎండ, వడగాలి అని భయపడకండి. అందరికీ ఎయిర్‌కండిషనర్లు ఉంటాయా? ఇది లేకుండానే మీ గదిని చల్లగా ఉంచుకోవచ్చు. ఒక టేబిల్ ఫాన్ ముందు ఒక తొట్టి నిండా చల్లటి నీళ్లు పెట్టండి. ఫుల్ స్పీడ్‌లో ఫానును త్రిప్పండి. దీని మీది నుంచి వచ్చే గాలి ఎయిర్ కండిషనర్ గాలి కంటే కూడా ఎక్కువ చల్లగా, హాయిగా ఉంటుంది.

## పెనం తళతళ మెరుస్తూండడానికి

తరచు దోసెలు వేసే పెనాలు తుప్పు పడుతూంటాయి. ఇవి ఎప్పుడూ తళతళా మెరుస్తూండాలంటే వేడిచేసే ముందు పెనానికి ఉప్పు బాగా పట్టించి తుడిచివేయండి. తరువాత మంచిగుడ్డతో పెనం బాగా శుభ్రం చేయండి. ఇలా రెండు మూడుసార్లు చేసిన తరువాత పెనం మంట మీద పెట్టండి. వేడెక్కినప్పుడు రెండు మూడు చుక్కలు నూనె వేసి తిరిగి గుడ్డతో తుడిచేయండి. దోసెలు తయారు చేసిన తరువాత గానీ, చపాతీలు తయారు చేసిన తరువాతగానీ పెనం నీళ్లతో కడగవద్దు. శుభ్రమైన కాగితంతో తుడిస్తే చాలు, లేకపోతే గుడ్డతో తుడిస్తే చాలు. పెనం ఎప్పుడూ తళతళలాడుతూ ఉంటుంది.

## జంతువులకు ఉన్న అనుకూలాలు

మనిషి కంటే జంతువులకు కొన్ని అనుకూలాలు అదనంగా ఉన్నాయి అవి గడియారం కొట్టే గంటలు వినవు మరణం అనే భావం మనసులో లేకుండానే మరణిస్తాయి వాటికి ఉపదేశాలు ఇవ్వడానికి తత్వజ్ఞులు లేరు అంత్యక్రియలు ఆర్భాటంగా ఉండవు అదనపు ఖర్చులు ఉండవు. వాటి మరణ శాసనాల మీద వ్యాఖ్యాలు వ్రాసేవారు ఉండరు

— వోల్టేర్

"నీ సంతృప్తికి నీవు తిను, ఇతరుల సంతృప్తికి బట్టలు ధరించు."

—బెంజమిన్ ఫ్రాంకిన్

'92

# మా మా ౨౦ పరీక్ష

1. ఫ్రీ ఇండియా (స్వాతంత్ర్య భారతం) మొట్ట మొదటి గవర్నర్ జనరల్ ఎవరు?
(ఎ) లార్డ్ హేస్టింగ్స్, (బి) లార్డ్ రిప్పన్, (సి) లార్డ్ మౌంట్‌బాటన్, (డి) లార్డ్ చెమ్స్‌ఫర్డ్
2. ఈ క్రింది వాటిలో ఏ పంట భారతదేశంలో అధిక వైశాల్యంలో పండింపబడే రెండవ పెద్ద పంట?
(ఎ) వరి, (బి) బార్లీ, (సి) గోధుమ, (డి) జొన్న.



3. క్రింది వాటిలో ఏది మున్షీ ప్రేమ్‌చంద్ రచన కాదు?
(ఎ) గోదాన్, (బి) ప్రేమ్ పచిసి, (సి) గీత్ గోవింద్, (డి) రంగ్ భూమి.
4 సింగరేణి బొగ్గు గనులు ఉన్నది:
(ఎ) ఆంధ్రప్రదేశ్, (బి) ఒరిస్సా, (సి) బీహార్, (డి) పశ్చిమ బెంగాల్.
5. ప్రపంచంలో ఉన్న హిందూ సామ్రాజ్యానికి మాత్రమే చెందిన రాజు ఎవరు?
(ఎ) జిగ్మే సింగే వాంగ్‌చుక్, (బి) రావ్ బీరేందర్ సింగ్, (సి) సూర్య థాపా, (డి) బీరేంద్ర బీర్ బిక్రమ్ షా దేవ్.
ఈ క్రింది వాటిలో ఏది బొగ్గు రకంకాదు?
(ఎ) ఆంత్రసైట్, (బి) కోక్, (సి) మోనాజైట్, (డి) లిగ్నైట్.
7 మలేరియా వ్యాధికి ముఖ్యమైన ఔషధం 'క్వినైన్' దీని నుండి లభిస్తుంది:
(ఎ) లవంగపట్ట, (బి) యూకలిప్టస్, (సి) వాటిల్ బెరడు, (డి) సింకోనా బెరడు.
8 లోక్‌సభ ఎన్నికల గురించిన ప్రకటన జారీ చేసేది
(ఎ) ప్రెసిడెంట్, (బి) ప్రధానమంత్రి, (సి) భారత ప్రధాన న్యాయమూర్తి, (డి) ఛీఫ్ ఎలక్షన్ కమిషనర్.

# తెలియని విషయాలు

## ఫ్రెంచ్ టైట్‌రోప్ వాకర్ చార్లెస్ బ్లాండిన్

*సుప్రసిద్ధ ఫ్రెంచ్ టైట్‌రోప్ వాకర్ చార్లెస్ బ్లాండిన్ (1824-97) నయాగరా జలపాతాన్ని (అమెరికా) 50 మీటర్ల (160 అడుగుల) ఎత్తుగా తాడుమీద దాటాడు ఒకసారి ఇతడు గట్టిగా బిగించిన త్రాటి మధ్యకు స్టౌ తీసుకువెళ్లి అక్కడ ఆమ్లెట్ తయారు చేసాడు*

## ప్రపంచంలో అతి చిన్న పేరుగల నది

*ఒరెగాన్ (యుఎస్ఎ)లో లింకన్ నగరంలోని 'D' నది పేరు ప్రపంచంలో అతి చిన్నది. 440 అడుగుల పొడవైన ఈ నది డెవిల్స్ సరస్సును పసిఫిక్ మహాసముద్రంతో కలుపుతుంది.*

"ఆత్మనిగ్రహాన్ని మించిన విలువైన ఆస్తి ఇంకొకటి లేదు.

## మాటల మహిమ

1. చీకు : (ఎ) చవ్వరింపు, (బి) గ్రుడ్డి, (సి) చివుకు, (డి) చీకటి.
2. చీటి : (ఎ) జాబు, (బి) లేఖ, (సి) కలం కారి బట్ట, (డి) వంటలకు పక్షి తెగులు.
3. అకతాయి : (ఎ) దుష్టుడు, (బి) తుంటరి, (సి) కోరిక, (డి) ఆభరణము.
4. తరితీపు : (ఎ) మోహము, (బి) విలాసము, (సి) తహతహ, (డి) సంతోషము.
5. తలిరు : (ఎ) చిగురు, (బి) పల్లవము, (సి) లేత, (డి) తరుణము.
6. నిద్దము : (ఎ) స్నిగ్ధము, (బి) నునుపు గలది, (సి) స్నేహము కలది, (డి) నిద్ర.
7. పస : (ఎ) దురద, (బి) ఉపద్రవము, (సి) యౌవ్వనము, (డి) నవ్వు.
8 గడుసరి : (ఎ) అసాధ్యుడు, (బి) దుష్టుడు, (సి) మాయలమారి, (డి) కఠినుడు.

## తెలివికి పరీక్ష

1. అనుభవంలోకి రాని డబ్బు మాట ఏమవుతుంది?
2. క్రింద లోపించిన సంఖ్య ఏది?

   5 15 45 135

   6 24 X 384
3. ప్రసాద్ కొడుకు తనకు నలుగురే అన్నదమ్ములున్నారంటాడు. కానీ కూతురు అంటుంది తనకు అయిదుగురు అన్నదమ్ములున్నారని. ఎవరు చెప్పింది నిజం?
4. 'సమంర్యళంగ'లో సహజార్థానికి విరుద్ధమైన అర్థమిచ్చే పదం ఏది?
5. 'ఓం'కారంలో కూడి ఉన్న అక్షరాలు ఏవి?
6. నిర్మలమైన అద్దంలో ముఖం ప్రతిబింబం స్పష్టంగా కనిపిస్తుంది. అలాగే నిర్మలమైన బుద్ధిలో స్పష్టంగా కనిపించేది ఏది?

(జవాబులకు వ పేజీ చూడండి)

## నమ్మలేని నిజాలు

### 2700 బిసిలో మొట్టమొదట కుస్తీపట్టు

*2700 బిసిలో మొట్టమొదటి కుస్తీపట్టు ప్రదర్శించబడింది. నైరృతి ఆసియా మెసపటోమియా (ఇప్పుడు ఇరాక్)లో ప్రజలు దీనిని అభ్యసించారు.*

### 9 సంవత్సరాల వయస్సులో మొదటి గుర్రపు పందెం గెలిచాడు

*.1909-1912 సంవత్సరాల మధ్య ఇంగ్లండ్ దేశపు ప్రఖ్యాత జాకీ ఫ్రాంక్ వూటాన్ 9 సంవత్సరాల వయస్సులో మొట్టమొదటి గుర్రపు పందాన్ని గెలిచాడు.*

### బెర్లిన్ గోడ మొదటి ఇటుకలు 1961లో పెట్టారు

*బెర్లిన్ నగరం తూర్పు, పడమరలను విభజించే బెర్లిన్ గోడ మొదటి ఇటుకలు 1961లో పెట్టబడ్డాయి.*

### గోల్ఫ్ బంతిని చంద్రమండలంలో విసిరిన మొదటి వ్యక్తి

*అలాన్ షెపర్డ్ అనే అమెరికన్ చంద్ర మండలం గోల్ఫ్ బంతిని కొట్టిన మొదటి వ్యక్తి!*

### పుట్టకుండానే కిరీటం!

*పర్షియా (ఇప్పుడు ఇరాన్) కింగ్ సాపర్ IIకి పుట్టకుండానే కిరీటం పెట్టారు. పురోహితులకు అతడి తల్లి కుమారునే ప్రసవిస్తుంది అని తెలుసు. అందువేత వాళ్లు ఆమె కడుపు మీద కిరీటం పెట్టి కడుపులో ఉన్న పుట్టని బాలునికి పట్టాభిషేకం చేశారు.*

### 9వ మాసంలో వారసత్వం లభించింది

*ఇంగ్లండు మరియు ఫ్రాన్స్ సింహాసనాలకు హెన్రీ VI కి 9వ నెలలో 1422 ఆగస్టు 31న వారసత్వం లభించింది.*

"గణ తంత్ర రాజ్యంలో ప్రతిగ్రామం స్వయం సమృద్ధితో వర్ధిల్లాలి."

# భావకాలుష్యం-నివారణ

ఇది కాలుష్యయుగం. ఎక్కడ చూసినా కాలుష్యమే. అంతా కాలుష్యమయం. అసలు అణు ఆయుధాల వల్ల ప్రపంచానికి కలిగే ఉపద్రవం అంతా ఇంతా కాదనే సంగతి ఎవరికి తెలియదు? మరో ప్రపంచ సంగ్రామం సంభవించి అటంబాంబులు ఉపయోగించి నప్పుడు సంగతి ఇది. ఇటువంటి మహోపద్రవ పరిస్థితులు ఏర్పడకుండానే ఇప్పటి కిప్పుడే వాయు కాలుష్యం, జల కాలుష్యం, శబ్ద కాలుష్యం, రేడియో ధార్మిక ధూళి కాలుష్యం మొదలైనవాటి వల్ల ప్రపంచం పూర్తిగా వినాశాన్ని కొని తెచ్చుకుంటూంది. ఇదంతా వాతావరణ కాలుష్యమే.

దీని వల్ల ప్రజలలో వివిధ వ్యాధులు - మానసిక, శారీరక వ్యాధులు ఏనాటికానాడు పెరిగిపోతున్నాయి. పెద్ద పెద్ద వైద్యులకు కూడా అంతుబట్టని క్రొత్త వ్యాధులు ఎన్నెన్నో పుట్టుకు వస్తున్నాయి. ఈ సమస్య మానవజాతి మనుగడకే ఒక పెద్ద బెడదగా తయారవుతూంది. ప్రతినిత్యం రోడ్లపై తిరిగే కార్లు, వాహనాలు వదిలే ఎక్జాస్ట్ పొగలు, ఆకాశంలో ఎగిరే విమానాల పొగలు, రొదలు, ఫాక్టరీలు వదిలే పొగలు, బొగ్గు మండటం వల్ల ఏర్పడే కార్బన్ డయాక్సైడ్ వాతావరణంలో విచ్చల విడిగా చేరిపోతున్నాయి. ఇంతవరకూ భూవాతావరణాన్ని రక్షిస్తున్న ఓజోన్ పొర దెబ్బ తింటూంది. భూమి మీద జీవరాశి నశించి పోయే ఉపద్రవ కాలుష్యం దగ్గర పడుతూంది. అడవులు ఎండిపోతున్నాయి. చెట్లు, చేమలు నశించిపోతున్నాయి. అడవులలో జంతుకోటి నాశనమైపోతూంది. కొన్ని ఫాక్టరీలు వదిలే కాలుష్య జలాలు సముద్రంలోను, ఇతర ప్రవాహాలలోను చేరిపోతున్నాయి. నీటిలో జీవరాశులు నశించిపోతున్నాయి.

ప్రపంచంలో జనాభా ఏనాటికానాడు పెరిగి పోతూంది. జనాభా పెరిగే కొద్దీ మానవుని నిత్యావసరాలు పెరిగిపోతున్నాయి. ఈ అవసరాలు పెరుగుతూన్న కొద్దీ కాలుష్యాలు పెరిగి పోతున్నాయి. ఈ కాలుష్యాలన్నిటికీ కారణాలు, నివారణోపాయాలు మానవుడికి తెలుసు. ఇవి దేశదేశానికీ మారుతూంటాయి. నివారణోపాయాలను క్రమపద్ధతిగా ఆచరణలో పెట్టాలి. పెట్టరు.

"ఒకసారి భంగపడితే

## గ్రామీణ ప్రాంతాలలో జనానికి లభించే విద్యుత్



*భారతదేశం జనాభా 80 శాతం గ్రామీణ ప్రాంతాలలో నివసిస్తున్నా వారికి మొత్తం ఉత్పాదించబడే విద్యుత్తులో 20 శాతం మాత్రమే లభిస్తుంది. ప్రణాళిక వ్యయంలో 35 శాతం విద్యుత్ రంగంలో ఖర్చు పెడుతున్నారు. అత్యధికంగా పెట్టుబడుల ఫలసాయాలు గ్రామీణ ప్రాంతాల వారికి లభించడం లేదు. వీరు సామాన్యంగా ఆవుపేడ, వంట చెరకు మీద ఆధారపడి ఉన్నారు. దీని వల్ల అతి విస్తారంగా పరిసర కాలుష్యాలు ఏర్పడుతున్నాయి.*

*— 'యోజనా' సౌజన్యంతో*

ఇక చీటివన్నిటినీ మించిన కాలుష్యం ఒకటి అంతా ఇంతా కాదు.

ఇది చాలా విచిత్రమైన కాలుష్యం. వ్యక్తిగతంగా మానవులు కారకులై సిద్ధింప చేసుకుంటూన్న కాలుష్యం ఇది. మనం ఎప్పుడూ మాట్లాడు తూంటాం. ఒకప్పుడు మెల్లిగా, శాంతంగా మాట్లాడతాం, మరొకప్పుడు ఉద్వేగంతో బిగ్గరగా మాటలాడుతూంటాం కోపంతో మాటలాడు తూంటాం ఇవి మాటలాడే స్థాయి మీద ఆధార పడి ఉంటాయి. దీని ప్రభావం చుట్టూ ఉండే మనుషుల మీదే కాదు. వాతావరణంలో కూడా ప్రభవించి శబ్ద కాలుష్యంగా తయారవు తూంది. ఇది ముఖ్యంగా మన భావం మీద, సంకల్పాల మీద ఆధారపడి ఉంటుంది. వ్యక్తిగత దుస్సంకల్పాల, దురాలోచనల కాలుష్యం అంతరిక్షం అంతా నిండిపోయి మానవజాతి మీద ప్రభావితం అవుతూంది. ఇదే భావ కాలుష్యం దీనివల్ల మనం అప్పుడప్పుడు ఊపిరి సలపక ఉక్కిరి బిక్కిరి అయిపోతూంటాం. భావకాలుష్యం సామాన్యం కాదు.

చక్కని ప్రశాంత వాతావరణంలో, పవిత్రమైన దేవాలయాలలో, భగవంతుని తెలుసుకుని ప్రవర్తించే పెద్దల సమక్షంలో ప్రకృతి రమణీయ మైన ప్రదేశాలలో శాంతి లభిస్తూందంటే అక్కడి వాతావరణం అకలుషితం అన్నమాట.నిర్మలం

మానవులు వ్యక్తిగతంగా కలిగించుకునే భావ కాలుష్యం తగ్గించుకోవాలంటే కొంత సాధన ఉండాలి. మన ఆలోచనలన్నీ మంచి ఆలోచనలుగా ఉండాలి. మన సంకల్పాలన్నీ సత్సంకల్పాలుగా ఉండాలి. మన సంభాషణ తగిన స్థాయిలో సరసంగా ఉండాలి. దీని వల్ల వాతావరణంలో జరిగే భావ కాలుష్య ప్రభావం తగ్గుతుంది. ధ్యానం అభ్యాసం చేసు కోవాలి. భగవన్నామ సంకీర్తనం చేస్తూండాలి. సద్గ్రంధ పఠనం ప్రారంభించాలి. సత్ప్రవచనాలు వింటూండాలి. ఈ విధంగా మంచి ఊహలు పెంచుకుంటూ మంచి సంకల్పాలు వృద్ధి చేసుకుంటూ ప్రార్థనలు చేస్తూంటే ఈ కాలు ష్యాన్ని తప్పకుండా నివారించుకుంటాం. భావ కాలుష్యం వల్ల కలిగే బెడద మనకి ఉండదు.

— వాధూల

## స్త్రీలకు అపాయ సూచనలు

* *గర్భవతిగా ఉండి 38 కి గ్రాలు అంతకంటే తక్కువ, గర్భం చివరి మాసంలో 42 కి గ్రాల భారం*
* *గర్భంతో ఉన్నప్పుడు రక్తస్రావం ఏర్పడుట*



* *ఎత్తు 4 9 అడుగులకు తక్కువగా ఉండడం*
* *రక్తహీనత*
* *ఇంతకు పూర్వపు ప్రసవంలో పుట్టిన బిడ్డ భారం 2 కి గ్రాల కంటే తక్కువగా ఉండటం*
* *గర్భవతిగా ఉన్నప్పుడు గానీ, పరీక్ష చేసే టప్పుడు గానీ కాళ్ళవాపు*
* *అధిక/తక్కువ రక్తపు ఒత్తిడి*
* *18 సంవత్సరాలలోపు, 30 సంవత్సరాలకు పైన వయసులో గర్భం ధరించడం*
* *గర్భం జారుట (abortion) లేక నిర్జీవ ప్రసవం*
* *ఐదవ లేక ఆ తరువాత గర్భం*
* *కవలలు గర్భంలో ఉన్నప్పుడు*
* *గర్భవతిగా ఉన్నప్పుడు పచ్చ కామెర్ల వ్యాధి సోకినప్పుడు.*
* *ఇంతకు ముందు సిసేరియన్ (caesarian) కాన్పు అయితే.*

"కష్టాలను జయించడానికి చిరునవ్వులకుండే శక్తి నిట్టూర్పులకు ఉండదు."

# ఎలా?

## నియాన్‌లైట్ ఎలా పనిచేస్తుంది?

చాలా సంవత్సరాల క్రితం ఒక రసాయనిక శాస్త్రజ్ఞుడు వాతావరణంలో నత్రజని పరిమాణాన్ని అంచనా వేయడానికి ప్రారంభించాడు. ఈ ఉద్యమంలో అతడు శాస్త్రజ్ఞులకు ఇంతకు పూర్వం తెలియని కొన్ని వాయువులు ఉన్నట్టు తెలుసుకున్నాడు చిట్టచివరగా అతి కష్టం మీద నత్రజని కంటే కూడా మిక్కిలి ఎక్కువ తటస్థమైన ఈ వాయువులను వేరుపరచాడు వాటిలో ఒకటి నియాన్ (Neon).

కొంతకాలం వరకూ దాని ఉపయోగాన్ని అతడు తెలుసుకోలేకపోయాడు. తరువాత 1911లో నియాన్ (Neon) వాయువును ప్రత్యేక సొజ్ఞలకు (signs) ఉపయోగించవచ్చునే భావాన్ని సూచించాడు. అధిక ఒత్తిడిలో ఒక వాయు గొట్టంలో ఎలక్ట్రిక్ డిస్చార్జ్ అయినప్పుడు అది కాంతిగా ప్రకాశిస్తుందని రసాయనిక శాస్త్రజ్ఞులకు తెలుసు. ఇట్టి ప్రక్రియలో నియాన్ (Neon) వాయువు ప్రకాశవంతమైన ఎర్రకాంతిని ఇస్తుంది

ప్రత్యేక సొజ్ఞలకు ఉపయోగింపబడే నియాన్ దీపం - ఎలక్ట్రిక్ డిస్చార్జ్ అయినప్పుడు ప్రకాశవంతంగా మండే అపురూపమైన వాయువు - నియాన్ • వాయువుతో నింపిన పొడుగాటి గాజు గొట్టం ఈ గొట్టాన్ని అనేక రూపాలలో వంచి అక్షరాలను తయారు చేయవచ్చు వీటిలో 20 అడుగుల కంటే ఎక్కువ పొడవైన గొట్టంలోనైనా ఎలక్ట్రిక్ డిస్చార్జ్ నిరాటంకంగా ఉంటుంది. పగటి వెలుతురులో కూడా ఇవి ఎక్కువ కాంతి వంతంగా ప్రకాశిస్తాయి మంచు పొగలో కూడా చొచ్చుకుపోయే శక్తి ఈ కాంతికి ఉంది.

వివిధ వాయువులను కలుపుట వల్ల ఇతర రంగులను పొందవచ్చు. పాదరసపు ఆవిరి (Mercury vapour) కలుపుట వల్ల ప్రత్యేకమైన నీలిరంగు వస్తుంది.

నియాన్ (Neon) సొజ్ఞలను బాగా దగ్గరగా పరీక్షిస్తే వీటి చివరలందు ఎలక్ట్రిక్ డిస్చార్జ్ జరుగుతూన్నట్టు చూడవచ్చు.

## భారతదేశంలో ఆసియా అడవి ఏనుగులు



*ఆఫ్రికా ఏనుగులలో 10వ వంతు - 30,000 మరియు 55,000 మధ్య ఉన్న ఆసియా అడవి ఏనుగులను వేటగాళ్లు దంతం కోసం చంపేస్తూండడం వల్ల వాటికి అంతరించిపోయే పరిస్థితులు ఏర్పడుతున్నాయి భారతదేశంలో 20,000 ఆసియా అడవి ఏనుగులు ఉన్నాయి మిగిలినవి బంగ్లాదేశ్, బర్మా, చైనా, మలేషియా, నేపాల్, శ్రీలంకా మొదలైన దేశాలలో ఉన్నాయి ఇంతేగాక 16,000 పెంపుడు ఏనుగులు ముఖ్యంగా కలప పరిశ్రమలో భారతదేశం, బర్మా, థాయ్‌లాండ్, కంబోడియాలో ఉన్నాయి.*

— *'వరల్డ్‌వైడ్ ఫండ్ ఫర్ నేచర్' సౌజన్యంతో*

'శాంతంగా, నెమ్మదిగా స్థిరబుద్ధి కలిగి ఉంటే
ఆరోగ్యం ...

# ప్రాణప్రదమైన రక్తం

రక్తదానం అనేది వైద్యశాస్త్రం ముఖ్యాంగమై పాశ్చాత్య దేశాలలో ప్రాచీన కాలం నుంచీ విస్తారంగా ప్రచారంలో ఉంది. ఒక మానవ శరీరం నుంచి మరియొక మానవ శరీరంలోకి రక్తం ప్రసరింపజేయడం సుమారు 1600 సం.లో అభివృద్ధి పొందింది.

1901లో శాస్త్రజ్ఞులు మానవుల రక్తంలో ప్రత్యేక బ్లడ్ గ్రూప్‌లను తెలుసుకున్నారు. వాటిలో A, B, O, AB మరియు RH గ్రూపులు ముఖ్యమైనవి. క్రొత్తగా దీనిని కనుక్కోడం వల్ల వివిధ బ్లడ్ గ్రూపులుగల మనుషులను వర్గీకరించడానికి వీలుకలిగింది. ఈనాడు గ్రూపు పొందిక గలవారికి రక్తం సులభంగా ఎక్కించగలుగుతున్నారు. ఈ బ్లడ్ గ్రూప్‌లకు ప్రత్యామ్నాయం ఇంకొకటి లేదు కాబట్టి దీనిని మానవుల నుండే పొందాలి.

17 మరియు 65 సంవత్సరాల మధ్య వయస్సులో 110 గ్రాముల బరువు మరియు 12 గ్రాముల శాతం బ్లడ్ హిమోగ్లోబిన్ ఉన్న వారు ఎవరైనా రక్తదానం చేయవచ్చు. రక్తదానం చేసేవారికి ముఖ్యంగా ముందు క్షయవ్యాధి, పచ్చకామెర్లు, రక్తహీనత, బ్లడ్ కాన్సర్, ఫామియా ఫైలేరా, డయాబిటీస్, మలేరియా, గుండె జబ్బులు వగైరా వ్యాధులు లేవని నిర్ధారణ చేసుకోవాలి.

మానవ శరీరంలో 5 లీటర్ల రక్తం ఉంటుంది. దీనిలో 4 1/2 లీటర్లు శరీరంలో [illegible] శరీర క[illegible]నికి పుష్టికర ద్రవాలను సరఫరా చేస్తుంది. మిగిలిన రక్తం శరీరంలో నిల్వ చేయబడి ఉంటుంది. ఇది రక్త స్రావం కలిగినప్పుడు లేక శరీరానికి అదనంగా రక్తం అవసరం అయినప్పుడు వినియోగపడుతుంది.

మంచి కాయపుష్టితో ఆరోగ్యవంతుడైన వ్యక్తి శరీరంలో నిల్వ చేయబడిన రక్తంలో అయిదవ వంతు అంటే 300 మి.లీ. రక్తాన్ని దానం చేయవచ్చు. దీనివల్ల దాతకు ఏవిధమైన ఇబ్బందులు ఉండవు. రక్తదానం తతంగం అంతా 3 లేక 5 నిమిషాలలో పూర్తి అయిపోతుంది. స్వచ్ఛందంగా రక్తం దానం చేసిన వ్యక్తికి ప్రకృతి 24 గంటల లోపలే తిరిగి రక్తాన్ని పూర్తి చేస్తుంది.

ఒక వ్యక్తి సులభంగా ప్రతీ మూడేసి నెలలకు ఒకసారి రక్తదానం చేస్తూ నిస్సహాయులైన రోగుల జీవితాలను సంరక్షించవచ్చు.

## నీ మెదడును గురించి తెలుసుకో



*నీ మెదడు 80 శాతం అంతా నీరు. మెదడులో సుమారు 10 బిలియను (10,000 మిలియను) నాడీ కణాలు (neurons) ఉన్నాయి. ఏ ఒక్కటీ కూడా మరియొక దానిని పోలి ఉండదు. పసిపాప పుట్టడానికి పూర్వం మెదడులో ఒక నిమిషానికి 25,000 కొత్త కణాలు పుడతాయి. ఏడవ సంవత్సరం వయస్సులో పిల్లల మెదడు, పెద్దవారి మెదడు ఒకే భారం, పరిమాణం కలిగి ఉంటాయి.*

'భాష ఎలక్ట్రిక్ బల్బ్‌లో సన్నని తీగలాగా ప్రజ్వలిస్తుంది. మౌనం తీగలో ప్రవహించే విద్యుత్ ప్రవాహం వంటిది.'' —శ్రీరమణ మహ

# ఆందోళన పడకుండా ఉండాలంటే?

ఈ క్రింది సూచనలు ఆందోళన పడి పోకుండా వ్యక్తిగత శాంత స్వభావాన్ని అభివృద్ధి చేసుకోవానికి ఒక మనస్తత్వ శాస్త్ర వేత్త పొందుపరచాడు.

1. మొట్టమొదట కలవరం చెందకూడదని నిర్ణయం చేసుకో. ఉత్సాహవంతమైన ధన భావాలను ప్రవృద్ధి చేసుకుంటూ మంచివి గురించి చిత్తైకాగ్రత వహించు.

2. నీవు ఉన్నచోట ఉన్న దానిని సమయానికి తగినట్టుగా పూర్తిగా వినియోగించుకో.

3. ప్రతీ దానికి గాబరాపడిపోయి కష్టపడిపోకు. ప్రతీ విషయాన్ని తేలికగా తీసుకో.

4. ఎవ్వరినీ నీకు ప్రమాణాలు నిర్ణయించ నీయకు. భగవంతుడు నీకు, నీ జీవితాన్ని ప్రసాదించాడు. నీకు జ్ఞానం ఇచ్చాడు. నీకు అవకాశాలు కలిగిస్తున్నాడు. ఎదుటి వాళ్ళతో సరిపోల్చుకోకు. శాయశక్తులా నీవు చేయ గలిగినదిచేయి. పొరుగువాళ్ళు నీ సహాయం కోరితే సహకరించు. నీవు చేయలేవా? వాళ్లనే చేసుకోనీ.

5 అసూయ పడకు. మాత్సర్యం వద్దు ద్వేషం, ఈర్ష్య ఉంటే నీ శక్తి సామర్థ్యాలను వ్యర్థం చేసుకుంటావు. వ్యక్తిత్వం నాశనం అవుతుంది. ఉద్యమించు, ఊరుకోకు. గతం ఏదైనా సరే మరచిపో.

6. కాళ్లు ముడుచుకుని కూర్చోకు. నలుగురి తోనూ తిరుగుతూండు. ఉత్సాహపరచడానికి ప్రారంభించు. ఒకరిని నీవు సంతోషపెడితే నీకూ సంతోషం కలుగుతుంది.

7. అయినదానికి చింతించకు. శవ పరీక్ష వ్యర్థం. గతాన్ని భగవంతుని దయకు వదలిపెట్టు రాబోయేది దైవ కటాక్షం అనుకో. ప్రస్తుతాన్ని పరమాత్ముని ప్రేమ ఔదార్యాలకు వదలిపెట్టు. గతం మరచిపో. గతం అంతా రద్దు చేసుకున్న చెక్కు లాంటిది. చేతిలో ఉన్న నగదుతో ప్రారంభించు.

8. ప్రతీరోజూ ఇంకొకరికి ఉపకారం చేయి.

9 ఎప్పుడూ స్నేహభావాత్మకంగా ఉండు. అవసర మైన వారికి సహకరించు. అవసరంలో ఉన్నవారికి దేవుని పేరుతో సహకరిస్తే అది మాధవసేవ అవుతుంది.

10. కృతజ్ఞతతో దేవునితో సంభాషించు. ఉన్నదానికి భగవంతుణ్ణి అభినందించు. మన అందరికీ శాంతి కావాలి. అంతర్యమైన మానసిక శాంతి. మనలో మనం ప్రారంభిద్దాం. ఆలోచన వద్దు.

— 'ది క్రిస్టియన్ మదర్'

## సంస్కృతికి ముఖ్యాంశం సంగీతం

సంగీతం ధర్మశాస్త్రంలో పుట్టింది. ఇంకా దాని వ్రేళ్లు అందులోనే ఉన్నాయి సంగీతం సంస్కృతికి ముఖ్యాంశమేగాని విలాసవంతమైన కళ కాదు ఇది మగ, ఆడ విద్యార్థులకు విద్యలో ముఖ్యభాగం. స్వర, లయ, తాళంతో తగిన శిక్షణ వల్ల విద్యార్థుల శీలం వృద్ధి చెందుతుంది పవిత్రతను, భక్తిని ప్రవృద్ధి చేసుకోడానికి నాట్యం, సంగీతం ఎంతో సహకరిస్తాయి

— రాజాజీ

"యజమానివి అయితే అప్పుడప్పుడు కళ్లు మూసుకుంటూండు. సేవకుడవు అయితే అప్పుడప్పుడు చెవులు మూసుకో." —థామస్

# విజ్ఞాన వేదిక

## సౌరశక్తి

భూమి మీద ఒకేఒక గంట సూర్యుని ప్రకాశం అదుపులో పెట్టుకోగలిగితే 18 నెలలకు సరిపోయే శక్తి లభిస్తుంది. అంతరిక్షంలో బ్రహ్మాండమైన సూర్యుని పవర్ ప్లాంట్ భూమికి 149 మిలియను కి.మీ. దూరంగా శూన్యంలో పని చేస్తూంది. అపాయకరమైన కిరణ ప్రసారం ఏదైనా భూతలాన్ని చేరిందంటే అది పూర్తిగా వాతావరణంలో పడకట్టబడి చేరుతూంది.




భూమిని చేరే సూర్యకిరణ ప్రసారం మిక్కిలి పెద్దది. భూమి మీద ప్రతీ చదరపు మీటరు వైశాల్యంలో పడే సూర్యుని కిరణ ప్రసారానికి 1.3 హార్స్ పవర్ శక్తి ఉంటుంది! పై కప్పు మీద సగటు పరిమాణంలో గల సౌర ఫలకాలకు సుమారు 150 హార్స్‌పవర్ ఉంటుంది

శక్తికి విద్యుత్ చెప్పుకోతగిన పెద్ద ఆధారమైనా ఇది 15 శాతం శక్తిని మాత్రమే ఇస్తూంది. కాబట్టి సూర్యకాంతిలో గల శక్తిని విద్యుత్తుగా మార్చుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

21వ శతాబ్దంలో శాస్త్రజ్ఞులు కక్ష్యలో పరిభ్రమించే సౌరశక్తి ప్లాంటులను భూమికి పైన అంతరిక్షంలో 36,000 కి.మీ.ల దూరంలో సూర్యుడు సదా ప్రకాశించే చోట ప్రవేశపెడతారు. ఈ శక్తిజనక ఫ్యాక్టరీలు సూర్యకాంతిని గ్రహించి సూక్ష్మతరంగ రూపంలో భూమిపై వినియోగానికి ప్రసరింపజేస్తాయి. నేడు సౌర ఘటకాల వల్ల జనింపబడే ఒక వాట్ సౌరశక్తికి సుమారు 500 డాలర్లు (రూ.16,000) ఖర్చు అవుతుంది.

# ఇంటి సలహాలు

### ఒకదానికి ఒకటి అంటుకుపోయిన స్టాంపులు విడదీయాలంటే

*ఒకదానికి ఒకటి అంటుకుపోయిన స్టాంపులను లాగకుండా, జిగురుపోకుండా ఫ్రీజర్‌లో కాసేపు పెడితే సులభంగా వచ్చేస్తాయి.*

### బిగుసుకుపోయిన డ్రాయరు సులభంగా రావడానికి

*డ్రాయరు బిగుసుకుపోతే డ్రాయరు అడుగున కొంచెం క్రొవ్వొత్తి మైనం పూస్తే అది మృదువుగా వస్తుంది*

### హాంగర్ నుంచి బట్ట పడిపోకుండా ఉండాలంటే?

*ప్రతీ హాంగరు రెండు చివరల నాలుగైదు రబ్బరు బ్యాండ్లు చుట్టండి లేదా ముతక దారం నాలుగైదు చుట్లు చుట్టండి.*

### పగిలిన గాజుముక్కలు ఏరాలంటే?

*తడిపిన మాదితో అద్దితే గాజు ముక్కలు సులభంగా వచ్చేస్తాయి*

'నీ ఆశయాన్ని బట్టే నీ విలువ తెలుస్తుంది."

# అవీ - ఇవీ

## ఒకే గ్రాము ఫాస్ఫినాల్‌తో ఫలసాయం 20 శాతం పెరుగుదల

కజకస్థాన్‌లో శాస్త్రజ్ఞులు క్రొత్తగా అభివృద్ధి చేసిన సేంద్రియ యౌగికం ఫాస్ఫినాల్ ఒకే ఒక గ్రాం ఒక హెక్టారు భూప్రదేశంలో ఫల సాయాన్ని క్రియాసాధకంగా పెంచడానికి చాలు. బంగాళాదుంప పండించే పొలాలలో దీనిని వాడితే 20 శాతం ఫలసాయం పెరుగు తుంది. సామాన్యంగా మొక్కలకు పట్టే శిలీంధ్ర మరియు వైరల్ తెగుళ్లను బాగా తగ్గిస్తుంది.

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద మీటియోరోలాజికల్ రాడార్ స్టేషన్

ప్రపంచంలో మిక్కిలి పెద్ద వాతావరణ సంబంధమైన (Meteorological) రాడార్ స్టేషన్‌ను ఇండోనేషియాలో పశ్చిమ కాలిమంటాన్ ప్రావిన్స్ ముఖ్య పట్టణమైన పింటియానాక్‌లో నిర్మించ బడుతుంది. భూమధ్యరేఖ మీదుగా నిర్మించ బడే ఈ రాడార్ ఎట్మాస్పియర్ సైన్స్ సెంటర్ (RASC) మూడవది. ఇది భూమి మీద 1000 కి.మీ ల వరకు వాతావరణ పరిస్థితులను కనిపెట్టగలుగుతుంది.

## 10,315 పుటల బ్రహ్మాండమైన జాబు

రాజేంద్ర చంద్ ఠాకూరీ అనే నేపాలీ విద్యార్థుడు మొత్తం మూడు కిలో మీటర్ల పొడవు, 42 కి గ్రా ల బరువు గల 10,315 పుటల బ్రహ్మాండమైన ఉత్తరం ఒక స్నేహితుడికి వ్రాసాడు వ్రాయడానికి సుమారు 5 మాసాలు పట్టిన ఈ ఉత్తరం పంపడానికి ఇతడికి 170 డాలర్లు ఖర్చు అయింది.

## ప్లూటోను మొట్టమొదట కనిపెట్టిన ఖగోళ శాస్త్రజ్ఞుడు

సుప్రసిద్ధ ఖగోళ శాస్త్రజ్ఞుడు డా. ఎఫ్.డి. శర్మ విశదీకరించిన ప్రకారం బాబూజీ కేటకారా అనే భారతీయ శాస్త్రజ్ఞుడు 'ప్లూటో' గ్రహాన్ని మొట్ట కనుగొన్నాడు. ప్లూటో గ్రహం యురేనస్ లేక నెప్ట్యూన్ గ్రహంతో 1910లో కూడుతుందని చెప్పాడు అది నిజంగా సంభవించింది. పాశ్చాత్య ఖగోళ శాస్త్రజ్ఞులు లోవెల్ మరియు పికెరింగ్ ప్లూటో గ్రహం ఉన్నట్లు 1915 తరు వాత చెప్పారు.

## హాస్యం ప్రాముఖ్యత



ఆధునిక మానవుడు జీవితాన్ని విలాసవంతంగా తీసుకోడు అతడి ప్రపంచం అంతా యాతనా మయంగా ఉంటుంది. హాస్యం ప్రాముఖ్యత ఎన్నటికీ మరచిపోకూడదు హాస్యధోరణి వల్ల మన సాంస్కృతిక జీవనం, స్వభావం, నైజం పూర్తిగా మారిపోతాయి

— బెర్ట్రాండ్ రస్సెల్

"లోకాన్ని తీర్చిదిద్దడానికి అందరూ ప్రయత్నిస్తారే కాని తమను తాము తీర్చి 'లేరు. —లియో

## తేలుతూన్న చిన్న పడవ మీద 32 రోజులు బ్రతికాడు

దక్షిణ పసిఫిక్ మహాసముద్రంలో కిరిబాటీ (Kiribati) ద్వీపానికి చెందిన ఇద్దరు పురుషులు నీటిపై తేలే చిన్న పడవమీద 32 రోజులపాటు చేపలను పట్టుకుంటూ చేపల రక్తం త్రాగుతూ జీవసించారు. వీరిద్దరివి 2400 కి.మీ.లు తేలి వెళ్ళిన తరువాత ఒక కొరియా కార్గో ఓడ రక్షించింది.

## ఎలక్ట్రానిక్ పొటాటో

స్కాటిష్ అగ్రికల్చురల్ ఇంజనీరింగ్ కేంద్రంలో లాబొరేటరీలో ఒక ఎలక్ట్రానిక్ పొటాటోను అభివృద్ధి చేసారు. స్ప్రెయింగ్ మ్సూడ్ అనే ఈ అధునాతన సాధనం పొటాటో (బంగాళాదుంప) ఆకారంలో కంప్యూటర్ చిప్‌లతో నిండి ఉంటుంది. ఇది వాస్తవమైన బంగాళా దుంపలతో కూడా పంట పొలాల నుంచి మార్కెట్ దాకా ప్రయాణం చేస్తుంది. మార్గమధ్యంలో రోడ్ల మీద ప్రయాణంవల్ల కలిగే కుదుపులకు బంగాళాదుంపలలో కలిగే మార్పులను ఇది రికార్డు చేస్తుంది. వ్యవసాయోత్పత్తి బంగాళా దుంపలు కన్వేయర్ బెల్టులు మీద, హార్వెస్టింగ్ మరల మీద, గ్రేడింగ్ లైనుల మీద వెళ్లే టప్పుడు కలిగే మార్పులను కొలవడానికి ఇది రూపొందించబడింది. దెబ్బ తిన్న బంగాళా దుంపలను వేరు చేయడానికి ఇది ఒక్కటే సాధనం.

## ఆస్త్మా దగ్గు నివారణకు 'సాల్ట్‌కేవ్' వైద్యం

బాల్టిక్ సముద్రం ప్రక్క లాట్వియాన్ పట్టణంలో 200 మంది ఆస్త్మా రోగులకు 'సాల్ట్‌కేవ్' (ఉప్పుగుహ)లో వైద్యం వల్ల ఉపశాంతి కలిగింది. ఈ ఉప్పు గుహలలోకి వెళ్ళేముందు రోగులకు సముద్రపు వాసన తగులుతుంది. అయోనైజ్ కావించబడిన ఉప్పు ఆవిరి గుహగోడల మధ్య ప్రవహిస్తుంది. లెనిన్‌గ్రాడ్ ఇన్‌స్టిట్యూట్ పుల్మోనాలజీలో అభివృద్ధి చేయబడిన కృత్రిమ వాతావరణ గదిలో సహజ లవణాలు మరియు గాలిలో తేమ కలిసి ప్రత్యేక సంయోగం ఏర్పడుతుంది. దీనివల్ల 80 శాతం పెద్ద మరియు 90 శాతం చిన్న రోగులకు స్థిరమైన అభివృద్ధి కలిగింది.

## వింత నిజాలు

### ప్రపంచంలో బ్రహ్మాండమైన మహాసముద్రం పసిఫిక్

పసిఫిక్ మహాసముద్రం ప్రపంచంలో బ్రహ్మాండమైనది ఇది సుమారు అర్ధ ప్రపంచం అంత ఉంటుంది

### పూర్తిగా పెరిగిన రాకాశి తాబేలు



GIANT TORTOISE

పూర్తిగా పెరిగిన రాకాశి తాబేలు గలపాగోస్ ద్వీపాల (పసిఫిక్ మహాసముద్రం)లో ఉంది ఇది 500 పౌండ్ల భారం తూగుతుంది

### ప్రపంచంలో బ్రహ్మాండమైన ఎలుక

ప్రపంచంలో బ్రహ్మాండమైన ఎలుక కాపీబారా (Capybara) ఇది 50 సెం.మీ.లు పైగా ఎత్తుగా ఉంటుంది 50 కి.గ్రా.ల భారం ఉంటుంది

"మర్యాదగా ఉంటే మర్యాద దక్కుతుంది."

## 'పంచ్' ఆఖరి సంచిక

బ్రిటన్ దేశపు హాస్య వారపత్రిక పంచ్ (Punch) ఆఖరి సంచిక 1992 ఏప్రిల్ 9న వెలువడింది. 151 సంవత్సరాల నుంచీ ప్రచురింప బడుతూన్న ఈ పత్రిక చివరి సంచిక 70,000 కాపీలు మాత్రమే అచ్చుకావింపబడ్డాయి. ఇది పూర్తిగా కలక్టర్స్ ఐటమ్‌గా అమ్ముడైపోయింది. చివరి సంచిక అట్టమీద బొమ్మ విచారంలో మునిగిన మిస్టర్ పంచ్ తన స్నేహితుడు జూడీ మరియు టాబీ కుక్కతో సూర్యాస్తమయంలో తడబడుతూన్నట్లు ఉంటుంది.

## మియోసేనీ కాలపు గుర్రపుశిలాజం కనుగొనబడింది

పమిష్టి U.A.E. - బ్రిటిష్ పాలియెంటో లాజికల్ బృందం అరేబియన్ పెనిన్సులా ద్వీపకల్పంలో నివసించాయి అనుకునే మొట్ట మొదటి గుర్రపుశిలాజాలను కనుగొంది. అబుదాబీ పశ్చిమ ప్రదేశంలో బెయినునాల్ దొరికిన శిలాజాలు సుమారు 5 మరియు 10 మిలియను సంవత్సరాల మధ్య 'మియోసేనీ' (Miocene) కాలానికి చెందినవి.

## పాలలో రసాయనిక అంశం దంతక్షయాన్ని నివారిస్తుంది

దంతక్షయాన్ని నివారించడానికి ఆస్ట్రే లియాలో శాస్త్రజ్ఞులు పాలలో ఒక ప్రత్యేక రసాయనిక అంశాన్ని కనిపెట్టారు. దీనియందు ఆహారం మరియు పానీయాలలో క్షయ నిరోధక పదార్థం ఉన్నట్లు తెలుసుకోబడింది. ఇది సామాన్య దంతక్షయాన్ని కూడా నివారిస్తుంది. ద్రవరూపంగా ఉన్న పాలలో గల ఈ క్షయ నిరోధక పదార్థం కెసీన్-ఎ ప్రోటీన్ (Casein-a Protein) 3 శాతం ఉంటుంది.

## అగ్ని నిరోధకమైన సూపర్ కాంక్రీట్

స్వీడెన్‌లో అగ్ని నిరోధకంగా ఉండే కొత్త రకం 3L కాంక్రీట్ (మిక్కిలి తక్కువ తేలికైన శోషణ శక్తి) కనుగొనబడింది. దీనిని కర్రలాగ రంపంతో కోయవచ్చు. కోసిన ముక్కలను చేర్చి స్క్రూలతో బిగించవచ్చు. ఇది ఉష్ణ నిరోధకం మరియు అగ్ని నిరోధకము కూడా. ఈ సూపర్ కాంక్రీట్ ముఖ్యలక్షణాలు మిక్కిలి సూక్ష్మాతి సూక్ష్మమైన గోళాకారపు పాలిమర్ కణాల వల్ల కలుగుతున్నాయి. ఇవి మిల్లీ మీటరులో 2 పదివేల వంతు వ్యాస పరిమాణం కలిగి ఉంటాయి.

## అంతరించిపోతూన్న రైనో!



రైనోసిరస్ అద్భుతమైనది. మానవ నాగరికతకు బలి అయిపోతూన్న జంతువులు రైనోసిరస్. రైనోలు అంతరించిపోడానికి మానవుని దురాశ మరియు మూఢ విశ్వాసం ముఖ్యకారణాలు. అనేక శతాబ్దాల పాటు ఆసియా ప్రజలు ముఖ్యంగా చైనీయులు రైనో కొమ్ములలో సంభోగశక్తిని వృద్ధి చేసే ఔషధం ఉందని నమ్మేవారు రైనోలు ఉద్రేకం చెందినప్పుడు వాటి రక్తం కొమ్ములలోకి ప్రవహిస్తుందని, దీని వల్ల ఔషధగుణం పెరుగుతుందని, సంభోగశక్తిని ప్రేరేపిస్తుందని వారి విశ్వాసం ఇది ఎంతమాత్రం నిజంకాదు కాని నిజం అనుకుని కొమ్ముల కోసం రైనోలను చంపడం ఇంకా ఆగలేదు.

"సంగీతానికి పశువులు కూడా చెవులు నిక్కబొడుచుకుంటాయి."

—విలియం

## ఫైర్‌మెన్‌కి క్రొత్త 'ఐస్-బాక్స్'

ఫైర్‌మెన్‌కి సోవియెట్ డిజైనర్లు క్రొత్త సూట్ కనిపెట్టారు. దీనికి పూర్తిగా నూటుంతా చల్లబరచే పైపింగ్ విధానం ఉంటుంది ఈ క్రొత్త 'ఐస్ బాక్స్' సరంజామా నమ్మడానికి వీలుకాని 150 డిగ్రీల C ఉష్ణంలో కూడా ఉపయోగించవచ్చు.

— 'మిషా' సౌజన్యంతో

## రిమోట్ సెన్సింగ్ సాటిలైట్ 22 రోజులకు ఒకసారి ఇండియాని చుట్టుతుంది

సోవియెట్ యూనియన్ బైకానూర్ కాస్మో డ్రోమ్ నుంచి 1988లో ప్రవేశపెట్టబడిన భారతదేశపు రిమోట్-సెన్సింగ్ సాటిలైట్ IRS-IA 904 కి.మీ.ల పోలార్ సన్-సింక్రోనాస్ కక్ష్యలో దింపబడింది. సుమారు ఒక టన్ను కంటే కొద్దిగా తక్కువ బరువు ఉన్న ఈ సాటిలైట్ 30 మీటర్ల వస్తువులను కూడా కనిపెట్టగలదు. ఇది పూర్తిగా భారతదేశాన్ని 22 రోజులలో చుట్టి మాపింగ్‌కి అనువుగా ఉండే వ్యవసాయ, జల, భూ సంబంధమైన వివిధ వివరాలను ఇస్తుంది. ఈనాడు భారతదేశం కూడా ఇటువంటి సాటిలైట్స్‌ను ప్రవేశపెట్టిన యుఎస్ఎ, యుఎస్ఎస్ఆర్, జపాను మరియు ఫ్రాన్స్‌లతో చేరింది

## 100 కి.మీ.ల తిమింగిల ప్రయాణం

హంప్‌బాక్ తిమింగిలం యు.ఎస్.ఎ. కాలిఫోర్నియాలో సాక్రిమెంటో నదిలో ప్రయాణం చేసి నావికా నిపుణులను ఆశ్చర్య పరచింది. 24 రోజులపాటు 100 కి.మీ.ల ప్రయాణం చేసి సముద్రంలో ప్రవేశించింది. 40 టన్నుల ఈ జంతువు ఎలక్ట్రానిక్ పరికరం హంప్‌బాక్ తిమింగిలంలా చేసిన శబ్దాలకు చైతన్యవంతంగా ప్రవర్తించింది.

— 'సిఐఇ-ఎన్ఎఫ్ఎస్'సౌజన్యంతో

## 55 మిలియను మంది పిల్లలు పనిచేస్తున్నారు

ప్రపంచం అంతటా నేడు 10 మొదలు 14 సంవత్సరాల మధ్య వయస్సు గల పిల్లలు 55 మిలియను మంది వ్యవసాయరంగంలో, పారిశ్రామిక రంగంలో పనులు చేస్తున్నారని వరల్డ్ కాన్ఫెడరేషన్ ఆఫ్ లేబర్ సమాచారం టెక్స్‌టైల్స్ ఫాక్టరీలు అన్నిటిలోను చిన్న చిన్న ఆడపిల్లలు పనులు చేస్తున్నారు ఇక్కడ శబ్దం, వేడి, కంటికి కలిగే శ్రమ పెద్దవారు కూడా ఎంతమాత్రం భరించలేరు

## 2వ శతాబ్దపు స్థూపం త్రవ్వబడింది

2వ శతాబ్ద బిసికి చెందిన అతి ప్రాచీన జైనస్థూపాన్ని గుంటూరు జిల్లా వర్ధమాను గ్రామంలో పురావస్తు శాస్త్రజ్ఞులు కనుగొన్నారు ఈ స్థూపం భూమట్టానికి 300 అడుగుల ఎత్తున ఉంది

## ప్రార్థన ప్రారంభించు

*పాపం చేయాలనే ప్రేరణ తీవ్రంగా ఉంటే ప్రార్థన ప్రారంభించు*
*నీ అంతరాత్మ 'తప్పు తప్పు' అని ప్రభోదిస్తే ప్రార్థన ప్రారంభించు*
*నీ అంతరాత్మ నీరసించిపోయినప్పుడు*
*నీవు ఆత్మ బలాన్ని ఆశించినప్పుడు -*
*నీ అంతరాత్మ ప్రార్థన ప్రారంభించనీ*

"గాలిలో మేడలు కడితే అవి కూలిపోనక్కరలేదు.
దిట్టంగా ఉండాలంటే క్రింద పునాదులు తీయాలి."

# విజయానికి రహస్యం

స్వామీ చిన్మయానంద

ఒక పని యొక్క విలువ దాని పరిమాణాన్ని బట్టి కాదు. అది నిర్వహించబడిన తీరును బట్టి, దాని విశిష్టతను బట్టి నిర్ణయించబడుతుంది. ప్రపంచంలో ఒక వ్యక్తికి త్సాహం కలిగించి మార్గదర్శకంగా ఉండే దర్శాలు ఆ వ్యక్తి చేసే పనుల విశిష్టతను ప్రవృద్ధి పరుస్తాయి. ఆదర్శాలు వైభవోపేతంగా ఉన్నతాశయాలతో కూడినవైతే క్రియల ర్థకత, సౌందర్యం అధికంగా ఉంటాయి.



మానవాతీతమైన సాధనలను సాధించిన మహనీయులు అందరూ అటువంటి ఉన్నత దర్శాలతో మహాద్భుతంగా అనేక గొప్ప గొప్ప కార్యాలను సాధించారు. వాటి ఫలితాలను తరువాతి తరాల వారు అవిచ్ఛిన్నంగా అనుభవిస్తున్నారు.

ప్రస్తుత ప్రపంచంలో మనిషి తన కార్యక్రమాలను సాధించడానికి ఒక ప్రత్యేక లక్ష్యం అవసరం అనిపిస్తుంది. స్వలాభాపేక్షతో, స్వప్రయోజక దృష్టితో పని ప్రారంభిస్తారు. జీవితంలో అత్యున్నత కార్యసాధనకు ఉత్సాహపరచే ఒక ధ్యేయం గానీ, లక్ష్యం గానీ ఉండదు.

సెక్రటేరియట్‌లో ఒక గుమస్తా అయినా, ఒక పెద్ద కంపెనీలో మేనేజర్ అయినా, ఏ పని చేపట్టినా పనిలో విసుగు, చిరాకు పొందుతాడు. ఆఫీసుకు చేరి పని ప్రారంభించేటప్పటికి నీరసం, విసుగు పట్టుకుంటుంది. అలుపు, ఆయాసం వస్తుంది. సాయంత్రానికి ఇంటికి చేరడానికి కూడా శక్తి ఉండదు ఇటువంటి పరిస్థితులలో ఆ వ్యక్తి నిర్వహించే పని అస్వారస్యంగా ఉంటుంది. అంతేగాక అటువంటి వారు సమాజానికి భారం అనిపించుకుంటారు.

తీవ్రమైన నిరంతర పరిశోధనా ఫలితంగా మన పెద్దలు, గురువులు అటువంటి అలసటకు కారణాలను కనుగొని దాని నివారణకు సూక్ష్మ మార్గం సూచించారు. దానివల్ల మన కార్యక్రమాల ప్రమాణం, సౌందర్యం రెండూ కూడా వృద్ధి చెంది ప్రపంచంలో వాస్తవమైన సుఖ

## ఉల్కల విచ్ఛిత్తి వల్ల ఉల్కా వర్షం కురుస్తుంది

ఉల్కలు భూమి వాతావరణంలోకి దిగిన వెంటనే విచ్ఛిత్తిని చెంది భూతలం మీద ఉల్కా వర్షంగా కురుస్తుంది ఈ ముక్కలు భూమి మీద పడేటప్పుడు ఒక ప్రత్యేక నియమాన్ని అనుసరిస్తాయి. దీనిని తెలుసుకుని సోవియెట్ శాస్త్రజ్ఞులు దీనిపై 40 సంవత్సరాల పాటు తీవ్రమైన అధ్యయనం చేసారు 1947 ఫిబ్రవరి 12న సుమారు 100 టన్నుల భారం గల ఉల్క నుండి శిఖోటె అలిన్ ఉల్కా (మీటియోరైట్) వర్షం కురిసింది. కుజ మరియు గురు గ్రహాల మధ్య నుంచి సెకండుకి 12.4 కి.మీ.ల వేగంతో జారి భూమి వాతావరణంలో చేరింది!

"ప్రార్థిస్తే విశ్వసిస్తారు. విశ్వసిస్తే ప్రేమిస్తారు. ప్రేమిస్తే సేవకు పూనుకుంటారు."

సంతోషాలు ప్రవృద్ధి చెందుతాయి. పూర్తిగా మన అజ్ఞానం వల్ల లేనిపోని వాంఛలు, ఆత్మ సుఖం కోసం కోరికలు పెంచుకుని భౌతిక సుఖాలను ఆశించి అనుభవించడం, నిరంతరం ప్రతిఫలం ఆశించడం చేత మానసిక శ్రమ, ఒత్తిడి అధికం అవుతున్నాయని వారు ఋజువు చేశారు. ఈ భౌతిక సుఖాలను ఆశిస్తూ లేనివాటి కోసం ఆదుర్దా, బెంగ, మనస్తాపం మన ప్రాణాలను క్రుంగ దీస్తున్నాయి.

కాబట్టి మానసికంగా చెడిపోకుండా జీవితంలో మహోన్నతమైన ఒక దివ్య ధ్యేయం ఏర్పరచుకుని దానికోసం సమర్పణ భావంతో సాధించడానికి పూనుకోడంలో దిగ్విజయ రహస్యం ఉంది. అటువంటి కార్యక్రమాలను నిస్వార్థంగా చేపడితే నిరంతర ఉద్దీపన కలిగి ఆత్మ శాంతి అనుభవించ గలుగుతారు. జీవితంలో ఆనందం, సంతోషం కలిగి శక్తి సామర్థ్యాలతో విజయం సిద్ధిస్తుంది.

ధర్మం మానవునికి ఉన్నత ఆదర్శాలను సిద్ధింపచేస్తుంది. కాని నిరంతర స్పర్ధతో కూడిన నేటి ప్రపంచంలో స్వార్థంతో స్వాభిలాషలను, కోరికలను తీర్చుకునే మానవునికి సవిలో విఘ్నాన్ని తెచ్చిపెట్టుకోడం కష్టసాధ్యం. కాని ప్రకృతితో రాజీ కుదరదు. అసంభవం. సాధించిన సాధనలు మానసికమో, పారమార్థికమో, ఫలాభాపేక్షరహితంగా నిస్వార్థమైన సమర్పణ భావంతో కొనసాగాలి. దేశంలో పెద్ద పెద్ద శాస్త్రజ్ఞులు, ఆలోచనాపరులు వ్యక్తిగత సంక్షేమమే గాకుండా సాంఘిక సంక్షేమం, దేశాభివృద్ధి మొదలైన ఉద్యమాలను చేపట్టా లన్నారు. అటువంటి ఒక ప్రత్యేక లక్ష్యాన్ని అనుసరించి ఉద్యమాలు కొనసాగాలి అన్నారు.

ఈ విధంగా ఆచరింపబడిన ధర్మం క్రమ క్రమంగా విశాల దృష్టి సదంగా పరిణమించి మన సాధనకు స్ఫూర్తిని, ఉత్సాహాన్ని కలిగిస్తుంది. స్వార్థరహితంగా ఒక మంచి పని నెరవేరినందుకు మనకు సంతృప్తి, సంతోషం ఏర్పడతాయి. జీవితంలో విజయం ఎక్కడో ఉండదు. వారి వారి హృదయాలలోనే ఉంటుంది. ధర్మాచరణ వల్లనే దానిని పొంద గలుగుతారు.

## నివాసయోగ్యమైన అయిదు నగరాలు



*ఉత్తర ప్రదేశ్‌లో కాన్పూర్ ప్రపంచంలో అయిదు మిక్కిలి పెద్ద నగరాలలో ఒకటి. ఇక్కడ జీవన పరిస్థితులు హీనాతిహీనంగా ఉంటాయి. ఢాకా, లాగోస్ (నైజీరియా), కిన్షాసా (జైర్), రెసిఫ్ (బ్రెజిల్) అనే ఇతర నాలుగు దీని అడుగుజాడల లోనే ఉంటాయి ఈ ప్రదేశాలలో జనాభా విపరీతంగా పెరిగిపోతూండడం ఇటువంటి పరిస్థితులు ఏర్పడడానికి ముఖ్యకారణం. నివాస యోగ్యమైన అయిదు ముఖ్య నగరాలు మెల్‌బోర్న్ (ఆస్ట్రేలియా), మాంట్రియల్ (కెనడా), సియాటిల్ అండ్ అట్లాంటా (యు.ఎస్.ఎ) ఎస్సెన్‌డార్ట్‌ముండ్-డ్యూయిస్‌బర్గ్ (జర్మనీ).*

*— ఫైండింగ్స్ ఆఫ్ ది పాపులేషన్ క్రైసిస్ కమిటీ, వాషింగ్‌టన్ యుఎస్ఎ) — 'హ్యూమన్ రైట్స్' వరల్డ్‌వైడ్ సౌజన్యంతో*

"జ్ఞాపక శక్తి మరల మరల మననం చేయడం వల్ల వృద్ధి చెందుతుంది."

# శ్రీకృష్ణలీలా తరంగిణి-నారాయణతీర్థులు

**సీతా రవిచంద్రన్**

జయ జయ గోకుల బాల, పూరయ మమ కామం, గోవింద ఘటయ, మాధవ మామవదేవ, రామకృష్ణ గోవిందేతి, క్షేమం కురుసతతం, ఏహిముదం దేహి కృష్ణ, శ్రీ నిలయం వశి, కలయకల్యాణాని, కృష్ణం కలయసఖి, బాల గోపాల కృష్ణ, బాల గోపాలమా ముద్ధర, శరణం భవ కరుణాం మొదలైన కీర్తనలు సాంప్రదాయకంగా ప్రసిద్ధ గాయకుల కచ్చేరి లలో, భక్తుల భజన సాంప్రదాయకప్ప గోష్ఠు లలో మనం వింటూన్నవే. ఆంధ్ర, తమిళ, కర్ణాటక, కేరళ రాష్ట్రాలలో సంగీతాభినివేశం, భక్తి సాంప్రదాయం గల ప్రతీ ఇంట్లోను తరచు ఇవి వినిపిస్తూనే ఉంటాయి.



ఈ పాటలను తరంగాలు అంటారు. తరంగా లనే పేరు ముఖ్యంగా నారాయణ తీర్థులు రచించిన శ్రీ కృష్ణలీలా తరంగిణిలో పాటలకే వర్తిస్తుంది. శ్రీ కృష్ణలీలా తరంగిణి ఒక సంగీత నాటకం - యక్షగానం. ఈ యక్షగానం శ్రీ కృష్ణావతారం మొదలు రుక్మిణీ కల్యాణం దాకా 12 భాగాలు ఉంటాయి. ఇవే 12 తరంగాలు. ఏటిలో 153 కీర్తనలు, 302 శ్లోకాలు, 30 దరువులు, 30 గద్యాలు, ద్విపదలు, మంజరులు, చతుష్పదులు చేరి ఉంటాయి. ప్రతీ తరంగానికీ పాట ముందు ఒక సంస్కృత శ్లోకం, గద్య ఉంటుంది. పాట పల్లవి, అనుపల్లవి, చరణాలతో ఉంటుంది. వరాహూర్‌లోని ఆలయంలో భూదేవీ సమేతుడైన రమానాథుని కీర్తిస్తూ రచించిన గ్రంథం ఇది.

ఆంధ్రులై వెలసిన వాగ్గేయ కారకులలో అన్నమాచార్యుల తరువాత గొప్ప ప్రతిభాశాలి నారాయణ తీర్థులు. వేదాంత వేద్యుడు, మహాభక్తుడు. వేదాంతం, సాహిత్యం, సంగీతం, నాట్యం అన్నిటినీ మేళవించి క్రొత్త పద్ధతిలో తెలుగు, సంస్కృతం కలిపి యక్షగానాలు రచించాడు.

నారాయణ తీర్థులు తల్లావఝ్ఝుల వంశంలో 1675 ADలో పుట్టి 70 సంవత్సరాలు జీవించాడు. ఇతడు గోదావరి జిల్లా కూచిమంచి వారి అగ్రహారానికి చెందినవాడని, 18వ శతాబ్దం వాడని కొందరు పరిశోధకుల అభిప్రాయం.

ఇతడు ఆంధ్రప్రదేశ్ గుంటూరు సీమలో మంగళగిరికి దగ్గరగా 'కాజ' అనే గ్రామంలో జన్మించాడు. తండ్రి నీలకంఠశాస్త్రి, తల్లి పార్వతి. నారాయణ తీర్థుల పూర్వాశ్రమం పేరు గోవిందశాస్త్రి. ఇతడు గాంధర్వ దేవుడని బిరుదు పొందిన తండ్రి దగ్గర సంగీతం నేర్చు కున్నాడు. వాసుదేవ పండితుని వద్ద అన్ని శాస్త్రాలు నేర్చుకున్నాడు.

ఈ గోవింద శాస్త్రి వివాహం అయిన తరువాత ఒకనాడు భార్యను చూడడానికి కృష్ణానదికి

“ఒక్క క్షణం ఆత్మావలోకనం ఒక్కొక్కప్పుడు

అవతలి గట్టున వేదాద్రిని చేరడానికి కృష్ణా నదిని దాటుతూండగా ప్రాణాపాయ స్థితి ఏర్పడినప్పుడు ఆపత్సన్న్యాసం స్వీకరించాడట. ఇంతలో దైవికంగా ఒక ఆలంబన దొరకటం చేత దాని సహాయంతో అత్తవారి ఇంటికి వెళ్ళి తాను సన్న్యాసం స్వీకరించిన విషయాన్ని భార్యకి చెప్పి సన్న్యాసం స్వీకరించడానికి అనుజ్ఞను పొంది కాశీకి వెళ్ళిపోయాడు. అక్కడ శ్రీ రామానందుల వారి వద్ద నారాయణ తీర్థులు అనే పేరుతో సన్న్యాసాశ్రమం స్వీకరించాడు. ఆనాటి నుంచి గొప్ప యోగిగా జీవితం గడుపుతూ ఇష్టదైవం శ్రీకృష్ణుని స్తుతి చేస్తూండేవాడు.

ఇతడు సన్న్యాసిగా క్షేత్రాటన చేస్తూ వేదాద్రి నరసింహస్వామిని, ఆకిరిపల్లి శోభనాద్రి దేవుని, శ్రీకాకుళం ఆంధ్ర విష్ణువుని, వరాహ క్షేత్రంలో వరాహూర్ విష్ణువుని స్తుతిస్తూ అనేక కీర్తనలు రచించాడు. ఇంతలో అతడికి కలిగిన పరిణామశూలను నివారించుకోడానికి తిరుపతి వెళ్ళి వేంకటేశ్వర స్వామి దర్శనం చేసుకుని శ్రీవారి అనతిపై దక్షిణాదికి వెళ్ళి, తిరుచ్చెందూరు, తిరుమలై పాడి, తిరువైయ్యారు, గుణ శేఖరం మొదలైన క్షేత్రాలను సందర్శించాడు. చివరకి నడుకావేరికి వెళ్ళుటకు ముందు ఒకరాత్రి కలలో విష్ణుమూర్తి కనిపించి మరునాడు ఉదయం మొట్టమొదట కనిపించిన దాని వెంట వెళ్ళమని చెప్పాడు. అదేవిధంగా మరునాడు లేచిన వెంటనే ఒక వరాహం కనిపించగా నారాయణ తీర్థులు దానిని వెంబడించాడు. ఆ వరాహం భూపతి రాజపురంలో వేంకటేశ్వర దేవాలయం దగ్గర మాయమైపోయిందిట అందుకే ఈ భూపతి రాజపురాన్ని వరాహూరు అంటారు. ఇక్కడే నారాయణ తీర్థులు స్వామికి ఆలయం కట్టించి మూలస్థానం ప్రతిష్ఠ చేయించాడు. దాని ఫలితంగా అతడికి ఆరోగ్యం కలిగింది. తరువాత తీర్థులు తంజావూరు జిల్లాలో కావేరీ నదికి ఉపనది కుముద పల్లికి దక్షిణతీరంలో ఉన్న తిరుపుందురుత్తి గ్రామంలో నివాసం ఏర్పరచుకున్నాడు. అక్కడే సిద్ధి పొందాడు. ప్రతీ సంవత్సరం మాసిమాసం గురువారం శుద్ధ అష్టమి కృత్తికా నక్షత్రంనాడు ఇక్కడ ఉత్సవం జరుగుతుంది.

శ్రీ కృష్ణలీలా తరంగిణి యక్షగానం కాకుండా ఇతడు తెలుగులో పారిజాతాపహరణం యక్షగానం, భక్తి సిద్ధాంత సంబంధమైన శాండిల్య భక్తి సూత్ర వ్యాఖ్య, భక్త్యధికరణమాల, సాంఖ్య సిద్ధాంతానికి చెందిన సాంఖ్య కారికా వ్యాఖ్య, తత్త్వ కౌముదీ వ్యాఖ్య, తర్క శాస్త్రంలో న్యాయ కుసుమాంజలీటీక, న్యాయ ముక్తావళిటీక, భట్ట భాషా ప్రకాశము, యోగ సూత్ర వ్యాఖ్య, సిద్ధాంత బిందు లఘు చరిత్ర మొదలైన అనేక గ్రంథాలను రచించాడు. ముఖ్యంగా భాగవతంలో దశమ స్కందంలో కృష్ణావతార ఘట్టానికి చెందిన వీరి శ్రీ కృష్ణ లీలాతరంగిణే భారతదేశంలో ఇతడి అఖండ ఖ్యాతికి కారణమైంది.

# సెల్యులర్ కమ్యూనికేషనులు

*బ్రిటీష్ వారి ముఖ్యాతి ముఖ్యమైన మార్గదర్శక అభివృద్ధి సెల్యులర్ కమ్యూనికేషనులు టెలిఫోన్ వార్తా సంపర్క సౌకర్యం కార్ల నుండి, రైళ్ల నుండి, వాయు విమానాల నుండి ప్రపంచంలో ఎక్కడికైనా రేడియో సహాయంతో స్థిరమైన స్టేషనులకు పంపవచ్చు. ఈనాడు బ్రిటన్‌లో సుమారు 7,50,000 మంది సెల్యులర్ ఫోన్లను ఉపయోగిస్తున్నారు నగటున 300 పౌండ్లు చెల్లించే వారందరికీ ఈ సౌకర్యం లభిస్తుంది. త్వరలోనే బ్రిటన్‌లో టెలిపాయింట్, కాల్‌పాయింట్ విధానాలు అమలు పరుస్తారు. అతి తేలికగా మడవడానికి వీలుగా ఉండే ఫోనులు చాలా కాలం మన్నే బాటరీలతో 100 మీటర్ల వైశాల్యంలో ఉపయోగంలోకి వస్తాయి.*

*— బ్రిటీష్ ఇన్ఫర్మేషన్ సర్వీసెస్ సౌజన్యంతో*

"వాస్తవాలను లెక్క చేయం కాబట్టి అవి వాస్తవాలు కాకుండా పోవు."

# వార్తలు

## 35,000 సైంటిఫిక్ జర్నల్స్, పీరియాడికల్స్

19వ శతాబ్దం ప్రారంభంలో ప్రపంచంలో సైంటిఫిక్ జర్నల్స్, పీరియాడికల్స్ కేవలం 100 మాత్రమే. 1850 నాటికి ఇది 1000 కి పెరిగింది 1900 నాటికి ఇది 5,000 అందు కుంది. నేడు ఇది అతి తక్కువ అంచనా ప్రకారం సుమారు 35,000

## ప్రపంచంలో చుట్టూ గోడ నిర్మించుకున్న అతిప్రాచీనమైన పట్టణం

ప్రపంచంలో అరిహా (జెరికో) చుట్టూ గోడ నిర్మించుకున్న అతి ప్రాచీనమైన పట్టణం పురావస్తు శాస్త్రజ్ఞులు రేడియో కార్బన్ డేటింగ్ ప్రకారం ఇక్కడ 7800 BCలో 3,000 మంది నివసించేవారని అంచనావేశారు.

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద మిక్స్‌డ్ పానీయం

ఒక హొటల్ అధికారి వెరోనాలో వివిధ జూస్‌లతో వైన్, వోడ్కాలతో 2000 లీటర్ల మిక్స్‌డ్ పానీయం తయారుచేసాడు. దీనిని ఒక మోటారు పడవ ప్రొపెల్లర్‌తో కలపవలసి వచ్చింది ఇదే ప్రపంచంలో మిక్కిలి పెద్ద మిక్స్‌డ్ పానీయం.

## ముడి వజ్రాలకు మధ్యప్రదేశ్ ప్రసిద్ధి

భారతదేశంలో మధ్యప్రదేశ్ ముడి వజ్రాలను ఉత్పత్తి చేసే ముఖ్య ప్రదేశం. ఈ రాష్ట్రంలో పన్నా డైమండ్ బెల్ట్ పన్నా ఛతర్‌పూర్ మరియు సాత్నా జిల్లాలలో ఆవరించుకుంది.

## ఎకరం గడ్డిమైదానంలో మేసే ఆవు

ఒక ఎకరం గడ్డి మైదానంలో మేసే ఆవు సంవత్సరానికి ఒక టన్ను కంటే అధికంగా పాలను ఇస్తుంది.

## ప్రపంచంలో మిక్కిలి ప్రాచీనమైన బట్ట

ప్రపంచంలో అతి ప్రాచీనమైన బట్ట టర్కీలో కనుగొనబడింది. ఈ బట్ట సుమారు 5900 బిసికి చెందినది.

## విజయానికి సూత్రాలు



వినోదానికి ముందు విజయం పొందు
ప్రతీరోజూ ఏదో క్రొత్త విషయం నేర్చుకో
మామూలుగా చేసే నిత్య పద్ధతి కొంచెం మాను
మొత్తం లాభం మీద ఏకాగ్రత వహించు.
సహాయపడడానికి నీ సంసిద్ధతను తెలియజెప్పు.
అల్ప విషయాలను గురించి చింతించకు.
నిర్ణయాలను శీఘ్రంగా ఆచరణలో పెట్టు
నైపుణ్యాల, కీటుకు అలవరచుకో
నమ్మకం, విశ్వాసం, సహకారం పొందు
అన్నిటికంటే యోగ్యత విలువైనది అని గ్రహించు.

— హెర్బర్ట్ కాసన్

'చిరకాల మిత్రుని చేతులారా కౌగలించుకో.' నైజీరియన్ సామెత

## 420 సంవత్సరాలనాటి వైను

1960లో లండన్‌లో అమ్మబడిన ఒక సీసా వైను 420 సంవత్సరాలనాటిది. ఇది ట్యూడర్ వంశానికి చెందిన హెన్రీ VII ఇంగ్లండుకు రాజుగా ఉన్నప్పుడు సీసాలోకి ఎక్కించబడింది.

## ఎన్నటికీ తీరని చింతలు



మన చింతలు, యాతనలు అన్నీ 40 శాతం అసలు జరగని వాటి గురించి అనీ, 30 శాతం గతించిన వాటివి గురించి అనీ, 22 శాతం అనవసరమైనవి, చిన్న చిన్నవి అనీ పరిశీలనల వల్ల తేలింది.

## ప్రపంచంలో మిక్కిలి ప్రాచీనమైన కంపెనీ

ఇంగ్లండులో 1189 ఏడి నుంచీ ఉన్న ఫావర్‌షామ్ ఓయిస్టర్ ఫిషరీ కంపెనీ ప్రపంచంలో మిక్కిలి ప్రాచీనమైనది

## ఆఫ్రికా జాతులలో అయువా పేరుకి మినహాయింపులు

ఆఫ్రికాలో ఫ్రెంచ్ సెనెగల్‌లో లెబ్బొ అనే మహమ్మద్ జాతిలో అయువా (Aoua) అనే పేరు మీద ప్రత్యేకంగా పన్ను వసూలు చేస్తారు. ఒక ఇంట్లో అయువా అని పేరు పెట్టిన పిల్ల పెరిగి పెద్దదై అనేకమందిని వివాహమాడిన ఒక పురుషుని పెండ్లి చేసుకుంటే పెద్ద భార్యగా గుర్తింపబడి ఎంతో గౌరవం, మర్యాద అనేక మినహాయింపులు ఉంటాయి.

## మిక్కిలి పెద్ద నదీ లంక

అస్సాం శిబ్‌సాగర్ జిల్లాలో మజులీ (Majuli) ప్రపంచంలో మిక్కిలి పెద్ద నదీ లంక (river Island). ఈ లంక 100 కి.మీ.ల పొడవు, 10 కి.మీ.ల వెడల్పు ఉంటుంది. చుట్టూ బ్రహ్మపుత్రా, లోహిత్, సుబాన్‌సిరి నదులు ప్రవహిస్తూంటాయి.

## వేరుశనగ సోయాచిక్కుడులో ఉత్తమరకం ప్రోటీనులు

తెలగపిండి, నూనెలు తీసిన పిండి పశువులకు మేతగానూ, భూమికి ఎరువుగానూ ఉపయోగిస్తారు. నూనె తీసిన - వేరుశనగ మరియు సోయా పిండిలో ఉత్తమరకం ప్రోటీనులు లభిస్తాయి ఇది మానవులకు, పశువులకు కూడా వినియోగపడుతుంది.

— 'యోజన' సౌజన్యంతో

## ఈ ఒక్కసారే చూసాను

హెన్రీ వార్డ్ బీచెర్ చర్చిలో చర్చి అధికారి ఉత్తరాలు చూస్తుంటే ఒక ఉత్తరంలో ఒక కాగితం మీద 'మూర్ఖుడు' అని వ్రాసి ఉంది. తరువాత ఆదివారంనాడు చర్చిలో ధర్మోపదేశం చేస్తూ చర్చి అధికారి 'నేను ఎన్నోసార్లు చూసాను సాధారణంగా ఉత్తరం వ్రాసి చాలామంది క్రింద సంతకం చేయడం మరచి పోతారు. కాని ఈసారి ఒక్కసారే వ్రాసినవాడు ఉత్తరం వ్రాయడం మరచిపోయి సంతకం మాత్రం చేసాడు ' అన్నారు.

"సుఖ సంసారం భూలోక స్వర్గం." — జాన్ బ్రౌనింగ్

# జంతువుల వాస్తవాలు

## ప్రపంచంలో అతివేగంగా పరుగెత్తే జంతువు




ప్రపంచంలో అతివేగంగా పరుగెత్తే జంతువు చీటా. చిన్న చిన్న దూరాలు గంటకు 105 కి.మీ. వేగంతో పరుగెత్తుతుంది. ఇవి దక్షిణ ఆసియా మరియు ఆఫ్రికాలలో ఉంటాయి

## దక్షిణ అమెరికా అపూర్వ మర్కటం

సామాన్యంగా కోతులు రాత్రిపూట నిద్రిస్తాయి. పగటిపూట తిరుగుతూంటాయి. కానీ దక్షిణ అమెరికా డౌరొకౌలి (Douroucouli) అనే చిన్న కోతి రాత్రి సంచరిస్తుంది. దీనిని 'నైట్ మంకీ' అంటారు!

## తాటిచెట్టు వంటి సముద్రపు జంతువు

సముద్రంలో నివసించే కోరిమోర్ఫా పామా (Corymorpha Palma) అనే జంతువు తాటి చెట్టులా ఉంటుంది.

## మొసలి కంటికి మూడవ రెప్ప

మొసలికి అర్థ పారదర్శకమైన మూడవరెప్ప ఉంటుంది. మొసలి నీటిలో మునిగినప్పుడు కళ్ళ మీద ఈ రెప్ప జరుగుతూంటుంది.

## జిరాఫీ గుండె




పొడుగాటి మెడద్వారా తలకి రక్తం ప్రవహించ దానికి జిరాఫీకి అధిక రక్తపు ఒత్తిడి ఉంటుంది. దీని గుండె 61 సెం.మీ. పొడవు 76 సెం.మీ.లు మందం ఉంటుంది.

## పవిత్రమైనది

థాయిలాండ్ (ఆసియా) ముఖ్య పట్టణం బాంకాక్‌లోని "ముగ్గురు స్నేహితుల దేవాలయం" (Temple of three friends)లో ఉన్న 15వ శతాబ్దపు బంగారు బుద్ధ విగ్రహం అతి పవిత్రమైనది. మిక్కిలి విలువైనది. 10 అడుగుల ఎత్తైన ఈ విగ్రహం 6 టన్నులు తూగుతుంది. విలువ మాత్రమే 96 మిలియను డాలర్లు.

"మనస్సు చేతలను నియంత్రిస్తుంది కాబట్టి సమాజంలో విజ్ఞానవంతులు శ్రామికులను ,



# మీకు తెలుసా?

## 21 సం.లు వయస్సుకు పైబడిన స్త్రీలకు ఇంగ్లండులో ఓటుహక్కు

ఇటీవలే 1928లో ఇంగ్లండులో 21 సంవత్సరాలకు పైబడిన స్త్రీలు ఓటు వేయడానికి అనుమతించబడ్డారు.

## ప్రపంచపు రెండవ మిక్కిలి పెద్ద ద్వీపపు సరస్సు

తూర్పు ఆఫ్రికాలో 26,828 చదరపు మైళ్ల వైశాల్యంగల విక్టోరియా సరస్సు ప్రపంచపు రెండవ మిక్కిలి పెద్ద ద్వీపపు సరస్సు. ఇక్కడ నుంచే ప్రపంచంలో మిక్కిలి పొడవైన నైల్ నది మధ్యధరా సముద్రంలోకి 4,150 మైళ్ల దీర్ఘ ప్రయాణం ప్రారంభిస్తుంది.

## పట్టుపురుగు వడికే పట్టు నూలు

పట్టుకాయ తయారు చేసుకునేటప్పుడు పట్టుపురుగు ఎక్కడా తెగకుండా 800 గజాల పొడవుగా పట్టును వడుకుతుంది.

## భూమి చుట్టూ ఒకసారి తిరగడానికి

భూమి చుట్టూ ఒకసారి తిరగడానికి చంద్రుడికి 27 రోజుల, 7 గంటల, 43 నిమిషాల, 11.5 సెకండ్లు పడుతుంది.

## విటమిను K ప్రాముఖ్యత

మానవ శరీరంలో రక్తం గడ్డకట్టడానికి విటమిను K అవసరం.

## ప్రపంచపు పెద్ద ద్వీపకల్పం

అరేబియా ప్రపంచపు మిక్కిలి పెద్ద ద్వీపకల్పం. దీని వైశాల్యం 3,250,000 చ.కి.మీ.లు.

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద టాయ్ షాప్

యునైటెడ్ స్టేట్స్ న్యూయార్క్‌లో 5వ అవెన్యూలో ఉన్న F.A.O. ష్వార్జ్ (Schwarz) ప్రపంచంలో మిక్కిలి పెద్ద ఆటవస్తువుల (టాయ్) షాపు.

## బుద్ధితో పనిచేసేవారికి ఆనందం ఎప్పుడూ ఉన్నదే

కాయకష్టాలకు ఓర్చి పనిచేసే శ్రామికులను రాష్ట్రంలో ప్రప్రథమ పౌరులుగా గౌరవించాలి మెదడు లేక బుద్ధితో పనిచేసేవారు వారివెనుక ఉండాలి వారిని ఉత్తములుగా పరిగణించాలి




విసుగు పుట్టించే శారీరక శ్రమ చేసేవారిని ప్రత్యేకంగా గౌరవించాలి శారీరకంగా కష్టాలకు ఓర్చి పనిచేసేవారికి తప్ప ఇతరులకు ప్రతీ పని కూడా కొంత ఆనందాన్ని చేకూరుస్తుంది మన బుద్ధి కుశలత ఎట్టైనా ఉండే బుద్ధితో పనిచేసే వారు శ్రామికులు దేశానికి మిక్కిలి అధికమైన సేవలు చేస్తున్నారని తెలుసుకుని గౌరవించాలి బుద్ధితో పని చేసేవారికి వారి ఆనందం ఎప్పుడూ ఉన్నదే కష్టపడి పనులు చేసేవారిని ప్రోత్సహించి గౌరవించండి

— సి రాజగోపాలాచారి

"అందరూ చిన్నచిన్న విషయాలను దిగ్విజయంతో సాధిస్తారు, అత్యాశతో తప్పిదాలు పడిపోకుండా ఉంటే." — లాంగ్‌ఫెలో

## ఆసియా - ప్రపంచంలో మిక్కిలి అధిక జనసాంద్రతగల ఖండం

ప్రపంచంలో ఆసియా మిక్కిలి అధిక జనసాంద్రతగల ఖండం

## భూమిమీది పక్షులలో దీర్ఘకాలం ఆకాశంలో ఉండేవి

భూమి మీది పక్షులు అన్నిటిలో సాధారణ స్విఫ్ట్ సంవత్సరంలో ఎక్కువ కాలం - 9 నెలల పాటు ఆకాశంలో ఎగురుతూంటుంది

## ఒక వ్యక్తి శరీర భారానికి, రక్తానికి గల సంబంధం

ఒక వ్యక్తి శరీర భారంలో 13వ వంతు రక్తం ఉంటుంది.

## గెరాల్డ్ టిస్సాయన్ ఐస్‌క్రీమ్ కనిపెట్టాడు

1620లో ఫ్రెంచ్ దేశానికి చెందిన గెరాల్డ్ టిస్సాయన్ (Gerald Tissain) ఐస్‌క్రీమ్‌ను కనిపెట్టాడు.

## రక్తం పీల్చే జలగ

రక్తం పీల్చే జలగ సామాన్యంగా మానవ శరీరంలో ఒక ఔన్సు రక్తం పూర్తిగా కడుపు నిండా త్రాగుతుంది

## భారతదేశపు ప్రప్రథమ టెక్స్టైల్ మిల్లు

నూలుబట్టల ఉత్పత్తికి మొట్టమొదట భారతదేశంలో పవర్ మిల్ కవాస్‌జీ నంద భాయి దవార్ 1854లో బొంబాయిలో ప్రారంభించాడు.

## అల్లిగేటర్ వెనుక కాళ్ల మీద నుంచోగలదు

మొసలి జాతికి చెందిన పరీసృపం అల్లిగేటర్ ఆహారం వెతుక్కునేటప్పుడు తోక ఆధారంతో వెనుక కాళ్లమీద నుంచోగలదు.

## భూగ్రహానికి చేరువగా ఉండే నక్షత్రం

భూమికి చాలా చేరువగా ఉండే నక్షత్రం 40,232,500 కి.మీ.ల దూరంలో ఉంది.

## పసిబిడ్డలు ఒకేసారి ఊపిరి పీల్చుకోగలరు, మ్రింగగలరు

పసిబిడ్డలు ఒకేసారి ఊపిరి పీల్చుకోగల మరియు మ్రింగగలరు కూడా. ఇది పెద్ద వారికి అసాధ్యం.

## అధిక ఆయుర్దాయానికి సంబంధించిన బ్లడ్ గ్రైప్

బ్లడ్ గ్రైప్‌కి, ఆయుర్దాయానికి సంబంధం ఉంది సోవియెట్ యూనియన్ కాకాసస్‌లో 'O' గ్రూపు రక్తం గల మనుషులు చాలాకాలం జీవిస్తారు. B గ్రూపు రక్తం గల పురుషులు చాలా తక్కువ కాలం జీవిస్తారు కానీ ఆడవాళ్లలో ఇది వ్యతిరేకంగా ఉంటుంది

## సత్యం అస్వాభావికం అయింది

ప్రజలు అస్వాభావాన్ని గురించి నవ్వుకుంటారు. సత్యం మనకు ఎదురైనప్పుడు నవ్వుకునేట్టుంది అస్వాభావికం అయిపోయింది.

"చేయగలిగిన దానిని, చేయగలను అని అనుకునే దానిని ; ప్రారంభించు

# అసలైన రాజు ఎవరు?

చక్రవర్తి సేవకుడు రాజుగారికి అనేక సంవత్సరాలు విశ్వాస పూర్వకంగా సేవలు చేసాడు. అతడు మరణావస్థలో ఉన్నాడు. దీర్ఘకాలంపాటు తనకు సేవలు చేసిన సేవకుని పట్ల రాజుగారికి ప్రత్యేక అభిమానం; విచారంతో చూడడానికి వెళ్లాడు.



'ఓ స్నేహితుడా!' అని పిలుస్తూ రాజుగారు సేవకుని ప్రక్కచేరి 'నాకు నీవు భక్తి విశ్వాసాలతో అపూర్వ సేవలు చేసావు. దీనికి తగిన ప్రతిఫలం నీకు ముట్టజెప్పాలని ఉంది. నీకు ఏంకావాలో కోరుకో ఇస్తాను' అన్నాడు.

మరణావస్థలో ఉన్న సేవకుడు 'ప్రభూ! తమ చేతుల ద్వారా ఒక మహోపకారాన్ని పొందాలని అనుకుంటున్నాను' అన్నాడు.

'ఏమిటది!' అని ఆతురతతో అడిగాడు రాజు.

'నా మరణానికి ఒక్కరోజు గడువు దయ చేయండి, ఒకే ఒక్క రోజు' అన్నాడు. వెంటనే రాజుగారికి విచారం కలిగింది.

'అయ్యో నేను ఈ భూమండలం మీద గొప్ప చక్రవర్తిని. కాని నీవు అడిగేది నా అధీనంలో లేదు. దానిని భగవంతుడే ప్రసాదించి నీ జీవితాన్ని నిలబెట్టాలి' అన్నాడు.

దీర్ఘ నిస్పృహతో మరణిస్తూన్న సేవకుడు —

'అయితే నాకిప్పుడు తెలిసింది. అనవసరంగా మర్త్యలోకపు రాజు సేవలలో మునిగి పోయాను. భగవంతుని సేవలకు ఎన్నడూ కాలాన్ని వినియోగించలేకపోయాను.' అని వాపోయాడు.

— 'జస్ట్ ఎ మూమెంట్ ప్లీజ్' సౌజన్యంతో

## మర్యాదకి సూచన

*ఒకరి శీలం మర్యాద వల్లే తెలుస్తుంది ఒక యువకుడు ఒక బాంకర్‌కి ఉద్యోగం కోసం అర్జీ పెట్టుకున్నాడు ఆ సమయంలో అందులో ఖాళీ లేదని అతనికి చెప్పారు. బాంకర్‌ని అభినందిస్తూ, విచారంతో ఇంటికి బయలుదేరాడు. తిరిగి వెళ్ళే టప్పుడు క్రింద ఒక గుండుసూది ఉంటే వంగి అది తీసి బల్ల మీద పెట్టాడు. వెళ్లిపోవడానికి ప్రయత్నిస్తూంటే బాంక్ ఆఫీసర్ అతనిని తిరిగి పిలిచి 'మాకు నీ అవసరం ఉంది. నిన్ను ఉద్యోగం లోకి తీసుకుంటాం' అన్నాడు. ఆ యువకుడు ప్రసిద్ధ బాంకర్ అయ్యాడు విజయవంతుడైన సమర్థుడు అయ్యాడు. ఒక చిన్న మంచిపని వల్ల యువకుని మంచి నడత, మర్యాద విదితమైంది.*

## ఆధునిక ఒలింపిక్స్‌లో ప్రప్రథమ గోల్డ్ మెడలిస్ట్

యు ఎస్ ఎ కి చెందిన జేమ్స్ బి. కన్నోలీ 1896లో ఆధునిక ఒలింపిక్స్‌లో హాప్, స్టెప్ మరియు జంప్ క్రీడలలో మొట్టమొదటి గోల్డ్ మెడలిస్టు.

"సౌభాగ్యంలో విద్య భూషణం, ఆపత్తులో అది ఆశ్రయం." —అరిస్టాటిల్

# ఎందుకు?

## తొండకి నాలుక పొడుగ్గా ఎందుకు ఉంటుంది?

తొండ బల్లి జాతికి చెందిన ఒక మంద కొడి ప్రాణి. ఇది తోకను ఒక కొమ్మకు చుట్టి గంటలకొద్దీ నిద్రపోతున్నట్టు కనిపిస్తుంది.

ఎంత బద్ధకంగా కనిపించినా అతి చురుకుగా ప్రవర్తించే ఈగలను ఆహారంగా పట్టుకోవాలి.




ఇది ఏవిధంగా జరుగుతుంది? కొమ్మ మీద తొండకు ఏడు లేక ఎనిమిది అంగుళాల ముందు ఏదో ఒక ఈగ వాలి విహరించడానికి మొదలు పెడుతుంది.

నిద్రపోతున్నట్టు కనిపించే తొండ ఒకసారి కుడికన్ను కొడుతుంది. లోపల గుడ్డు గుండ్రంగా తిరుగుతుంది. దృష్టి ఈగవైపు కేంద్రీకరిస్తుంది. తరువాత ఎడమ కంటి దృష్టిని కూడా ఈగవైపు కేంద్రీకరిస్తుంది. అసలు దీనికి ఏ కంటికాకన్నే విడివిడిగా పని చేస్తాయి. తరువాత తొండ నేరుగా చేసే ప్రయత్నం వల్లనో లేక ఒకవిధమైన అప్రయత్నంగా జరిగే అనియంత్రిత ప్రతీకార చర్యవల్లనో నోటిలో నాలుక క్రింది భాగంలో అకస్మాత్తుగా రక్తం ప్రవహిస్తుంది. వెంటనే దీని వల్ల నాలుక పొడుగ్గా చాచుకుంటుంది.

ఈ నాలుక చివర చీలిన పై క్రింది భాగాలు రెండూ తెరుచుకుంటాయి. ఒక విధమైన జిగట వంటి లాలాజలం పైన ప్రవహిస్తుంది. ఖచ్చితమైన గురితో ఈగను కొడుతుంది. కొట్టీ కొట్టిన ఒక క్షణంలో నాలుక లోపలకు తీసు కుంటుంది. ఈగ తొండ నోటిలో ఉంటుంది. ఈ విధంగా సాగడానికి వీలుగా ఉండే నాలుకతో తొండ ఉన్నచోట నుంచి కదలకుండా కీటకాలను తింటుంది.

## మీ విజ్ఞానం పరీక్షించుకోండి

### జవాబులు

క్విజ్ : 1 (సి) లార్డ్ మౌంట్‌బాటన్, 2. (సి) గోధుమ, 3 (సి) గీత్ గోవింద్, 4. (ఎ) ఆంధ్రప్రదేశ్, 5 (డి) బీరేంద్ర బీర్ బిక్రమ్ షా దేవ్, 6 (సి) మోనాజైట్, 7 (డి) సింకోనా బెరడు, 8 (డి) చీఫ్ ఎలక్షన్ కమిషనర్.

మాటల మహిమ : 1 (ఎ) చప్పరించు, (బి) గ్రుడ్డి, (సి) చివుకు, (డి) చీకటి; 2 (ఎ) జాబు, (బి) లేఖ, (సి) కలంకారి బట్ట; 3 (ఎ) దుష్టుడు, (బి) తుంటరి; 4 (ఎ) మోహము, (బి) విలాసము, (సి) తహతహ, (డి) సంతోషము; 5 (ఎ) చిగురు, (బి) పల్లవము, (సి) లేత, (డి) తరుణము; 6 (ఎ) స్నిగ్ధము, (బి) నునుపుగలది, (సి) స్నేహము కలది, 7. (ఎ) దురద, (బి) ఉపద్రవము; 8 (ఎ) అసాధ్యుడు, (బి) దుష్టుడు, (సి) మాయలమారి, (డి) కఠినుడు.

తెలివికి పరీక్ష : 1 అద్దంలో ముడుపు, 2. 96, 3. ఇద్దరు చెప్పింది నిజమే, 4. సర్వ మంగళం, 5 అ, ఉ, మ, 6. ఆత్మ.

"కష్టం లేకుండా సుఖం ఉండదు కొబట్టి లక్ష్యాన్ని సాధించడానికి కష్టపడాలి."

# పక్షుల ప్రపంచం

## మెడిసిన్ బర్డ్

ఇండోనేషియా బోర్నియోలో మెడిసిన్ బర్డ్ (ఔషధ పక్షి) పింఛము ఎంతో అందంగా ఉంటుంది. దీనిని ఒక్కసారి చూస్తే పసిపిల్లలకు అన్ని రోగాలు నివారణ అవుతాయని నాటు వైద్యులు అంటారు!



## బుష్ టర్కీ అపూర్వ సామర్థ్యం

ఆస్ట్రేలియాకు చెందిన బుష్ టర్కీ పక్షులు గ్రుడ్డు పగిలి పైకి వచ్చిన వెంటనే ఎగురుతాయి.

## స్విఫ్ట్ పక్షి వేగం

స్వాలో వంటి స్విఫ్ట్ పక్షి గంటకి 106 మైళ్ల వేగంతో ఎగురగలదు.

## మిక్కిలి చిన్న సముద్రపు పక్షి

సముద్రపు పక్షులన్నిటిలోను స్టారమ్ పెట్రల్స్ (storm petrels) మిక్కిలి చిన్నవిగా, పొట్టిగా ఉంటాయి.

## సీ గల్స్ దీర్ఘ ప్రయాణం

పెద్ద నిడుపాటి రెక్కలు, కాలివ్రేళ్ళ మధ్య చర్మంగల పాదాలు గల సీ గల్స్ (Sea gulls) మిక్కిలి అధిక దూరం ఎగిరే పక్షులు. ఇవి గంటకు 50 మైళ్ల వేగంతో ఒకరోజుకు 700 మైళ్ళు వెడతాయి.

## ఫీసెంట్ తోక

పైన కిరీటం గల ఆర్గస్ ఫీసెంట్ తోక ఈకలు చాలా నిడివిగా ఉంటాయి. అడవిలో ఏ పక్షులకు అంత పొడవైన ఈకలు, తోకలు ఉండవు.

## అసలైన విద్య

సామాన్య మానవునికి నిత్య జీవితం గడుపుకో డానికి వినియోగపడని విద్య అసలైన విద్య అనిపించుకోదు. శీలాభివృద్ధి కలిగించని పరోపకార బుద్ధితో, సింహం వంటి ధైర్యాన్ని కలిగించనిది విద్య కాదు మనిషికి తనకుతాను తన కాళ్లపై నిలువగల శక్తిని ఇచ్చేదే అసలైన విద్య

## పిరాన్హా మాంసం తినే చేప

పిరాన్హా మాంసం తినే భయంకరమైన చేప ఇవి సాధారణంగా అమెజాన్ మరియు దక్షిణ అమెరికా నదులలో ఉంటాయి సుమారు 38 సెం.మీ లు పొడవుగా పెరుగుతుంది తల పెద్దదిగా మొద్దుబారి ఉంటుంది బలిష్టమైన దౌడలో పదునైన దంతాలు ఉంటాయి

ఇవి వేలకొద్దీ చిన్నచిన్న నీటి గుంటలలో ఎగురు తూంటాయి ఏ జంతువునైనా పెద్ద పెద్ద ఖండా లుగా కత్తిరించేస్తుంది. మనుష్యులను, పెద్ద జంతువులను కొద్ది నిమిషాలలో చంపేస్తుంది!

"తెచ్చుకున్న బంధాలనుండి విమోచనం పొందడమే మోక్షం."

# ఏడు బంగారం

ఒకనాడు ఒక రాజుగారి మంగలి అడవిలో నడిచిపోతూ దారిలో ఒక దయ్యాల చెట్టు క్రింద విశ్రమించాడు అప్పుడు 'నీకు ఏడు జాడీల బంగారం కావాలా?' అనే మాటలు వినిపించాయి నాలుగు ప్రక్కలా చూసాడు ఎవరూ కనిపించలేదు కానీ బంగారం! ఏడు జాడీల బంగారం అంటే ఆశపుట్టి గట్టిగా 'కావాలి, నాకు కావాలి' అని అరిచాడు



వెంటనే అదృశ్యవాణి 'అయితే వెంటనే ఇంటికి వెళ్లు అక్కడ నీకు దొరుకుతుంది' అని వినిపించింది

ఆ మంగలి వెంటనే వేగంగా ఇంటికి వెళ్లాడు నిజంగానే ఇంట్లో ఏడు జాడీల బంగారం ఉంది అందులో ఒకటి మాత్రం నిండలేదు సగం వరకే ఉంది అది చూసి అత్యాశతో విచారించి దానిని నింపితే గానీ ఉండలేకపోయాడు

ఇంట్లో ఉన్న బంగారపు వస్తువులను అన్నిటినీ కరిగించి సగం నిండిన జాడీని నింపాడు ఎంత నింపినా ఆ జాడీ సగానికే ఉంది ఉద్రేకం చెందిపోయాడు ఎంతో కూడబెట్టాడు తను, కుటుంబం సగం తింటూ కూడబెట్టాడు. రోజు రోజూ ఆ జాడీని నింపాడు ఎంత నింపినా ఆ జాడీ అలాగే సగానికే ఉంది

# లుసుకోదగిన విషయాలు

## అంటీబయోటిక్‌ల ఉపయోగం ప్రాచీన ఈజిప్ట్‌లో ప్రారంభమైంది

**వ్యాధి నివారణకు అంటీబయోటిక్కులను మొట్టమొదట ప్రాచీన ఈజిప్ట్‌లో వాడారు. వారు బూజు పట్టిన రొట్టెను వ్యాధి నివారణకు ఉపయోగించారు అదే బాక్టీరియాను బూజులో ఉండే పెన్సిలిన్‌లో కనుగొన్నారు**

## సెల్ఫ్-పేస్టింగ్ స్క్రాప్ బుక్

*సుప్రసిద్ధ రచయిత మార్క్ ట్వైన్ (1835-1910) మొట్టమొదట సెల్ఫ్-పేస్టింగ్ స్క్రాప్ బుక్‌ను కనుగొన్నాడు ఈ పుస్తకంలో ఏమీ వ్రాయని బ్లాంక్ పేజీలకు జిగురు పూయబడి ఉంటుంది ఆ పేజీలను కొద్దిగా తడిపి కట్టింగులను అతికించేవాడు*

## పశ్చిమార్థ గోళంలో ఎత్తైన శిఖరం

*పశ్చిమార్థ గోళంలో అండీస్ పర్వత శ్రేణిలో పశ్చిమ అర్జెంటీనా పర్వత శిఖరాన్ని (22,835 అడుగుల ఎత్తు) 1897 జనవరి 14న స్విస్ గైడ్ అధిరోహించాడు.*

## భూమి మీద మిక్కిలి వేగవంతమైన పక్షి

*భూమి మీద అతివేగవంతమైన పక్షి - స్విఫ్ట్ సంవత్సరంలో కనీసం 9 మాసాల పాటు ఆకాశంలో ఎగురుతూనే ఉంటుంది*

"ముఖ్యమైన విషయాలలో ఏకత్వం, అమూల్యమైన విషయాలలో స్వేచ్ఛ, అన్ని విషయాలలోను దాతృత్వం అవసరం."

ఒకరోజు రాజుగారి దగ్గరకు వెళ్ళి తన జీతాన్ని రెట్టించమని ప్రాధేయపడ్డాడు జాడీ నింపడానికి తీవ్ర ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. దానిని నింపడానికి బిచ్చం ఎత్తుకోడం కూడా ప్రారంభించాడు. జాడీలో ఎంత వేసినా అది నిండకుండా ఉంది ఎప్పటికీ నిండదు. ఎంత వేసినా వెలితిగానే ఉంటుంది.



రాజుగారు చిక్కి అలసిపోయిన మంగలిని చూసి జాలితో 'ఏమిటి సంగతి, నీవు ఇంతకు ముందు జీతం తక్కువగా ఉన్నప్పుడు ఎంతో సుఖంగా ఉండేవాడివి. ఇప్పుడు జీతం రెట్టింపు చేసాను అయినా కృంగి కృశించి పోయి, విచారంగా ఉన్నావు. ఏడు జాడీల బంగారం నీకు దక్కిందా ఏమిటి?' అని అడిగారు

మంగలికి ఆశ్చర్యం కలిగింది. 'ఈ విషయం మీకు ఎవరు చెప్పారు?' అని అడిగాడు.

రాజు పకపకా నవ్వి 'ఇదే దయ్యం ఇచ్చిన ఏడు జాడీల బంగారం తీసుకున్నవారి లక్షణం. నాకు ముందు ఒకసారి ఇస్తానంది. అప్పుడు దీనిని ఖర్చు చేయవచ్చా, ఊరికే ఖజానాలో పెట్టి దాచి ఉంచాలా అని అడిగిన వెంటనే ఆ దయ్యం మాట్లాడకుండా మాయమైపోయింది. ఆ ధనం ఖర్చు పెట్టడానికి వీలులేదు. దాచి పెట్టుకోవాలనే కఠిన నియమం దాంతో పాటే వస్తుంది. వెంటనే వెళ్ళి ఆ జాడీలు తిరిగి దయ్యానికి ఇచ్చెయ్యి యథాప్రకారం నీ సుఖం నీకు దక్కుతుంది' అని రాజు చెప్పాడు

## 92 సంవత్సరాలలో త్రవ్విన బంగారం

చరిత్రను పరిశీలిస్తే ప్రజలు అనేక శతాబ్దాల నుంచి బంగారం కోసం భూమిని తవ్వుతున్నారు మొట్టమొదట బంగారం గనుల నుండి ఈజిప్ట్ మరియు మైసినేలో త్రవ్వారు తరువాత మైదాస్, క్రోయిసస్, పశ్చిమ ఆసియా గనులను ఖాళీ చేసారు. యూరప్‌లో రైన్ లోయలలో పో మరియు మలాగా బంగారం కోసం త్రవ్వబడ్డాయి ఇంగ్లండులో రోమనులకు వేల్స్ చుట్టూ బంగారం గనులు ఉన్నాయి

తరువాత ప్రఖ్యాతి పొందిన గోల్డ్ రష్ అమెరికాలో యుకోన్ మరియు ఎల్డొరాడోలో ప్రారంభమైంది రష్యాలో యురల్, లేనా గనులు 19వ శతాబ్దం మధ్యకాలంలో బంగారాన్ని ప్రపంచంలో అత్యధికంగా లభించజేసాయి

1500 AD మరియు 1900 AD మధ్య ప్రపంచపు బంగారం ఉత్పాదన 18,000 టన్నులు 1900 A D నుంచి నేటివరకు 60,000 టన్నుల బంగారం త్రవ్వబడింది ఈ రేటు చొప్పున త్రవ్వుతూ ఉంటే వచ్చే 70 సంవత్సరాలకే భూగర్భంలో ఉండే బంగారం పూర్తిగా ఖాళీ అవుతుందని భూగర్భ శాస్త్రజ్ఞులు అభిప్రాయాన్ని వెల్లడి చేస్తున్నారు ఇక మానవుడు బంగారం కోసం సముద్ర గర్భాలను వెతుక్కోవలసి వస్తుంది

— ఫ్రాంక్ పీటర్స్

''భావ సహకారం లేనిదే ప్రేమ నిలువదు, ప్రేమలేనిదే సహకారం లేదు''

# శోభాయమానంగా ఉండాలంటే?

మా యోగశక్తి

- కొన్ని నైతిక ప్రమాణాలను, ధర్మాలను అనుసరించు.

- నీ ఆత్మకు నీ మటుకు నీవు సత్యవంతుడుగా ఉండు



- గతంలో మహనీయులని అనిపించుకున్న పెద్దల జీవితాలను ఆదర్శంగా గ్రహించి వారిని అనుకరించు నీ అంతట నీవు తెలుసుకుని నేర్చుకోడంలో ఉండే సత్యాన్ని శోధించడానికి ప్రయత్నించు

- నీకు రెండు వ్యక్తిత్వాలు ఉన్నాయి మొదటిది నీ స్వంతమైన వ్యక్తిత్వం రెండవది సామూహిక, కౌటుంబిక, సామాజిక, గ్రామీణ, రాష్ట్రీయ, దేశీయ, ప్రాపంచిక, ధార్మిక చారిత్రక మరియు సాంస్కృతిక వ్యక్తిత్వం. ఎప్పటికప్పుడు, ఎక్కడికి అక్కడ సర్దుకుంటూ, రాజీపడుతూ, విభాగించుకుంటూ, పరస్పర సహకారంతో ఉన్నత ఆశయాలతో, ఆదర్శాలతో జీవించాలి.

- ఘనకార్యాలు చేస్తూ పరమ సత్యాన్ని పరమానందాన్ని అన్వేషిస్తూ నీ మహోన్నత జీవితానికి సహకరించిన లోకానికి తోడూ, నీడగా ఉండు

- నేను క్రమపద్ధతిలో ఆలోచిస్తున్నానా? అనే ప్రశ్నను వేసుకో బాగా ఆలోచించి ఉద్యమానికి పూనుకో నేను చేసేది ధర్మంగా ఉందా? తెలుసుకో. ఎప్పుడూ పనిలేకుండా ఊరికే కూర్చోకు

## విపరీత ప్రపంచం

ప్రపంచం అంతా విపరీతాలతోను, వ్యతిరేకాలతోను నిండిపోయింది. సుఖం వెనుక దుఃఖం, దుఃఖం వెనుక సుఖం ఉంటుంది. సూర్యుని ఎంత ఎక్కువ ఉంటే ప్రక్కనే నీడ ఉంటుంది.


Mahatma Gandhi

కాంతి ఉన్నచోట చీకట్లు ఉంటాయి. జననం ఉన్నచోట మరణం ఉంటుంది. ఈ ద్వంద్వాలకు చలించకుండా ఉండటం అనాసక్తి భావం. వాటిని జయించాలంటే వదలిపెట్టడం కాదు. వాటికి లొంగిపోకుండా పూర్తిగా అనాసక్తి భావంతో ప్రవర్తించాలి.

— మహాత్మాగాంధీ

- ఈ ప్రపంచంలో ఏం చేయాలి? సన్మార్గాన్ని అవలంబించి, సద్గుణాలను ప్రేమించాలి.

- సుప్రసిద్ధ గ్రంథాలను చదువు మంచి మంచి భావాలను డైరీలో వ్రాసిపెడుతూండు నవలలను చదువుతూ వృథా కాలయాపన చేయకు మానసిక విశ్రాంతికి, వినోదానికి అవి సహకరిస్తాయి నిజమే - కాని వాటికి లొంగిపోయి అలవాటు పడిపోకూడదు యుద్ధాలతో కూడిన చరిత్రనే కాదు, ఆదర్శ వంతులైన మహనీయుల జీవిత చరిత్రలను కూడా చదువుతూండు

- ఒక్క విషయం ఎప్పుడూ జ్ఞాపకం ఉంచుకో నీవు భావించుకున్నట్లుగా నీవు తయారవుతావు

- నీవు శోభాయమానంగా ఆలోచిస్తూ దాని ప్రకారం ఆచరిస్తే జీవితం అంతా శోభాయమానమే నీ శరీరాన్ని, మనస్సుని, విజ్ఞానాన్ని, భావావేశాలను నియమబద్ధంగా క్రమశిక్షణలో ఉంచుకో

- ప్రతీ క్షణం ఒక అమూల్యమైన క్షణం, గతించిన క్షణం తిరిగిరాదు

- కాలం అమూల్యమైన సౌభాగ్యం

- ఈ ప్రపంచంలో తెలుసుకుని ఆచరించడం లోనే ఆనందం అనేది ఉంది అదే శోభ అదే సంతోషం అదే ఉల్లాసం

## సంతోషం సగం బలం!

సంతోషం యొక్క బలం మరియు దాని సహన శక్తి బ్రహ్మాండం ఉదురోమంటూ ఏడ్చేవాడికంటే ఉత్సాహవంతుడు అదే సమయంలో ఎక్కువ పని చేస్తాడు, సమర్థవంతంగా చేస్తాడు, ఓపికగా చేస్తాడు.

— థామస్ కార్లైల్

## స్టాంపుల కథలు

### ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్

*1986*లో స్వీడెన్ రెండు ప్రత్యేక చిత్రాలతో రెండు స్టాంపులను విడుదల చేసింది ఈ రెండూ అంతర్జాతీయ శాంతి సంవత్సరం పాటించే సందర్భానికి అనుగుణ్యంగా శాంతిని, స్వాతంత్ర్యాన్ని నిరూపిస్తాయి మొదటి స్టాంపు మరణాంతకమైన ఆయుధాలపైన ఆలివ్ కొమ్మ శాంతిని ప్రకటిస్తుంది




రెండవది విశ్వవ్యాప్తమైన ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ *(Amnesty International)* సంకేతాన్ని తెలియజేస్తుంది ఇది శాంతిని అభిలషించే సంస్థగా తప్పును తెలుసుకున్న ఖైదీల సంక్షేమానికి మరియు రాజకీయ ఖైదీల న్యాయబద్ధమైన తీర్పులకు పాటు పడుతూంది చిత్రంలో వెనుక విశ్వాసం అనే మంట చేతి గొలుసులను తెంపుతున్నట్లు ఉంటుంది

— కవితారాయ్

## తెలివైన ఆర్థిక నిర్వహణ

**తెలివైన ఆర్థిక నిర్వహణకు మొదటి మాత్రం-వానా కాలానికి కొంత సేకరించడం. తరువాత చిన్నతువరకు పెద్ద బిల్లుకీ వ్యత్యాసం తెలుసుకోడం.**

— హారి కార్స్

"మంచి చెత్తలు మనం చేసిన కర్మను అనుసరించి వస్తాయి"

# కంటి వ్యాధులు

## కాటరాక్ట్

డా.ఆర్. సూర్యప్రకాష్, విష్ణు ఐ క్లినిక్, మద్రాసు

* కాటరాక్ట్ అంటే ఏమిటి?

మానవుని కంటిని సామాన్యంగా ఒక ఫోటో గ్రాఫిక్ కెమెరాతో సరిపోల్చవచ్చు కంట్లో పారదర్శకమైన కండెన్సింగ్ లెన్స్ (కటకం) కాంతిని రెటీనా అనే కంటి తెరపై కేంద్రీక రిస్తుంది కంటి కటకం మబ్బుతేరి కనిపించక పోవడం కాటరాక్ట్ అంటారు ఇది సాధారణంగా మనిషి 40-50వ సంవత్సరం వయస్సులో ప్రవృద్ధిపొందుతుంది




* కాటరాక్టు ఎందువల్ల వస్తుంది?

ఎనభై శాతం కాటరాక్టులన్నీ ప్రధానంగా వృద్ధాప్యం వల్ల వస్తూన్నవే అక్షికటకం జీవ కణాలలో కలిగే మార్పుల వల్ల దాని పార దర్శకత్వం తగ్గుతుంది

కాటరాక్టుకి ఇతర కారణాలు కంజెనిటల్ - పుట్టుకలో వచ్చే లోపాలు - గాయం తగలటం, డయాబిటీస్, మందుల (Cortico steroids) వల్ల సంభవిస్తాయి. సెకండరీ కాటరాక్టు దీర్ఘ కాలపు కంటి వ్యాధి లేక శిథిలత (degeneration) వల్ల సంభవిస్తుంది

* కాటరాక్ట్ లక్షణాలు ఏమిటి?

(ఎ) దృష్టి మాంద్యం - తెరలో నుంచి చూసి నట్టు ఉండటం, మబ్బు కప్పినట్లు ఉండటం
(బి) పోలిఒపియా - ముఖ్యంగా రాత్రిపూట అనేక బింబాలుగా కనపడటం
(సి) ప్రకాశవంతమైన కాంతికి కళ్ళు మిరు మిట్లు గొల్పడం

* కాటరాక్ట్కి చికిత్స ఏమిటి?

కాటరాక్ట్ ప్రవృద్ధి పొందే ప్రథమావస్థలలో రోగికి దృష్టిని క్రమపరచే కళ్ళ జోళ్ళు వల్ల కొంతమేలు కలుగుతుంది వ్యాధి కొంత ముదిరిన తరువాత శస్త్ర చికిత్స తప్ప వేరే చికిత్స లేదు




NORMAL EYE

కంటి సంబంధమైన యాగ్ లేజర్, కాటరాక్ట్ శస్త్ర చికిత్స తరువాత అక్షి కటకంలో ఏర్పడే మెంబ్రేన్ పొరను (Capsule) తీసివేయడానికి ఉపయోగించవచ్చు. ఇదే కంట్లో ఉంటే కొంత

'ఆర్జించుకున్న సంపదకన్నా, విజ్ఞానంకన్నా, సదుపాయాలుకన్నా

కాలానికి పూర్తిగా ముబ్బు తెరిపోతుంది.

* కాటారాక్ట్‌ను మందులతో తగ్గించే విధానం ఏదైనా ఉందా?

ఈ రంగంలో ఎంతో పరిశోధన చేయబడింది కానీ ఒక్కటీ సంతృప్తికరంగా లేదు.

* ఒక వ్యక్తి కంట్లో కాటరాక్ట్ ఆపరేషన్ చేయడానికి ఎప్పుడు వీలుగా ఉంటుంది?




CATARACT EYE

వ్యక్తి మామూలు పనులకు, కార్యక్రమాలకు కాటరాక్ట్ వల్ల అంతరాయం కలిగినప్పుడు శస్త్ర చికిత్స చేయవలసి వస్తుంది ఈనాడు కాటరాక్ట్‌కు నాజూకైన అధునాతన మైక్రో స్కోపులతో ప్రకాశవంతమైన కాంతిలో శస్త్ర చికిత్స చేస్తారు. కాబట్టి పూర్తిగా పెరగని కాటరాక్ట్‌ను కూడా అతిసులభంగా ఆపరేటు చేస్తున్నారు.

* కాటరాక్ట్ శస్త్రచికిత్సలలో ఎన్ని విధాలు ఉన్నాయి?

సాంప్రదాయక విధానం - ముబ్బు తేరిన కటకాన్ని తీసివేయడం ఒకటి విధానం.

* శస్త్రచికిత్స తరువాత రోగి ఎటువంటి అద్దాలు వాడాలి?

శస్త్రచికిత్స జరిగిన ఆరు వారాల తరువాత రోగి మంచి దళసరి అద్దాలు కంటికి పెట్టుకోవాలి. లేకపోతే కాంటాక్ట్ కటకం (Contact lens) పెట్టుకోవాలి. పెద్దవాళ్లు దీనికి అలవాటు పడడం కష్టం.




INTRA OCULAR LENS

మరో ఆధునిక విధానం ఇంట్రాఆక్యులర్ లెన్స్‌ను కంట్లో పెట్టడం (IOL)

IOL ఎలా ప్రవేశపెట్టబడిందో పరిశీలిద్దాం.

1949లో హెరాల్డ్ రిడ్లే అనే ఒక యువకంటి వైద్యుడు కంట్లో ముబ్బుతేరిన కటకాన్ని తీసేసిన తరువాత కృత్రిమ కటకాన్ని పెట్టడం అనే విప్లవాత్మకమైన భావాన్ని ప్రవేశపెట్టాడు కానీ నాణ్యమైన కటకాలు లభించకపోవడం వల్ల, శస్త్రచికిత్సకు సరియైన సాధనాలు లేకపోవడం వల్ల ఫలితాలు అంత సంతృప్తికరంగా లేకపోయాయి



1970వ దశాబ్దం మధ్యలో ఎన్నో అద్భుతాలు జరిగాయి ఈనాడు ఒక్క యునైటెడ్ స్టేట్స్ లోనే 90 శాతం కాటరాక్ట్ శస్త్రచికిత్సలకు

"శాస్త్రజ్ఞానం మానవత్వానికి దాస్యం చేసినప్పుడు సుఖ జీవనం సుసాధ్యం

IOL జరుగుతూంది. భారతదేశంలో కూడా ఇప్పుడు IOL మంచి ఫలితాలతో ప్రచారంలో ఉంది

* ఇంట్రాఆక్యులర్ లెన్స్ (IOL) ప్రవేశపెట్టడంలో గల చిక్కులేమిటి?



Dr. Harold Ridley

చాలా అరుదుగా కార్నియా పొరకు లోపలి వైపు గాయం తగిలినప్పుడు కార్నియా పొర మబ్బుగా ఉంటుంది.

కార్నియా సంబంధమైన వ్యాధి గలవారికి IOL వల్ల మరింత అపకారం జరుగుతుంది.

శస్త్రచికిత్సకు ముందు కంటి బాధలు నియంత్రించబడిన వారిలో కొంతమందికి IOL కంట్లో పెట్టిన తరువాత తిరిగి బాధలు కలుగవచ్చు.

వెనుక భాగం చాంబర్‌లెన్స్ చాలా అరుదుగా జరిగిపోవడం సంభవిస్తుంది.

* ఇంట్రాఆక్యులర్ లెన్స్ పెట్టుటకు సూచనలు ఏవి?

సాధారణ దృష్టిని కోరే ఏరోగ్గైనా ప్రతి బంధకమైన కళ్ళజోళ్ళ బెడద లేకుండా IOL పెట్టించుకోవచ్చు.

ఒక కంట్లో కాటరాక్ట్, మరో కంట్లో సాధారణ దగ్గర దృష్టి.

క్షేత్ర మధ్య దృష్టి చెడిపోయిన ఏ రోగికైనా ఇంట్రాఆక్యులర్ లెన్స్ (IOL) వల్ల పూర్తి క్షేత్ర దృష్టి కలిగించవచ్చు.

మీ కంటికి ఇంట్రాఆక్యులర్ లెన్స్ (IOL) అవసరమో కాదో చెప్పడానికి మీ కంటి వైద్యులే ఉత్తమ నిర్ణేత.

* ఇంట్రాఆక్యులర్ లెన్స్ (IOL) వల్ల కలిగే ఇబ్బందులు :

నూతన సాంకేతికాభివృద్ధుల వల్ల ఇంట్రా ఆక్యులర్ లెన్స్ (IOL) పెట్టడం వల్ల ఇబ్బందులు చాలావరకూ తగ్గుతున్నాయి.

ఈనాడు ఇంట్రాఆక్యులర్ లెన్స్ వల్ల కలిగే ఇబ్బందులు సాపేక్షకము (a) ఒంటి కన్ను కలవారు (b) కంటి గ్లాకోమా నియంత్రించ బడని రోగులు, (c) దీర్ఘకాలిక ఇంట్రాఆక్యులర్ బాధ కలవారు, (d) నీరసించిపోయి కటకాలు చెదిరిపోయిన రోగులు.

IOL శస్త్ర చికిత్స ఎలా చేయబడుతుంది?

సాధారణ కటకానికి పైన కాప్స్యూలు అనే తొడుగు ఉంటుంది. ఇది కంట్లో ఉండనిచ్చి పారదర్శకమైన కటకం తొలిగించబడ తుంది. పై తొడుగులో ఇంట్రాఆక్యులర్ లెన్స్ (IOL) పెట్టి స్థిరపరచబడుతుంది.

* IOL తరువాత కళ్ళజోడు అవసరమా?

సాధారణంగా IOL దూరానికి దృష్టిని సరి చేస్తుంది అయినా దగ్గర దృష్టికి అదనంగా పలచని అద్దాలు పెట్టుకునే అవసరం ఉంటుంది.

"కర్మాచరణము మనస్సును శుద్ధి చేయుటకు ఉపకరించునుగాని

* IOL వల్ల పొందే లాభాలు ఏవి?

(ఎ) దగ్గర సాధారణ దృష్టి ఉంటుంది

(బి) బింబం మరియు ఆకారం చెదరదు

(సి) బింబం పెద్దదిగా కనిపించదు ఉన్నది ఉన్నట్టుగా కనిపిస్తుంది

(డి) దృష్టిక్షేత్రం సాధారణంగా ఉంటుంది



ophthalmologist
Dr. Eric. J. Arnott

(ఇ) బైనాక్యులర్స్‌తో చూడడానికి వీలు ఉంటుంది

(ఎఫ్) బరువైన దళసరి అద్దాలు వాడవలసిన అవసరం ఉండదు

(జి) వృద్ధులకు ఇది ఒక వర ప్రసాదం

* కొన్ని సంవత్సరాలకు ముందు సాధారణ కాటరాక్ట్ పొర తీసివేసిన కళ్ళకు IOL తరువాత పెట్టవచ్చా?

పెట్టవచ్చు. దీనినే సెకండరీ ఇంప్లాంట్ అంటారు. ఇంతకుముందు కంట్లో కాటరాక్ట్ పొర శస్త్ర చికిత్స విధానాన్ని బట్టి ఇంప్లాంట్ రకం ఉంటుంది. క్యాప్స్యూలు తొడుగు కంట్లో ఉంటే పోస్టీరియర్ చాంబర్ లెన్స్ ఇంప్లాంటేషన్ సాధ్యం. లేకపోతే అంటీరియర్ చాంబర్ లెన్స్ ప్రవేశపెట్టబడుతుంది.

# చేదు దోసకాయ ఎప్పుడూ చేదే

దోసకాయలు కొన్ని చేదుగా ఉంటాయి. వాటిని మంచినీటిలో ముంచినా ఆ చేదుపోదు. పంచదార పానకంలో ముంచినా ఆ చేదుపోదు. ఒకసారి తుకారాం చుట్టూ ఉన్న భక్తులు కొందరు తీర్థయాత్రలు చేయాలని నిశ్చయించుకుని తుకారాంని కూడా రమ్మని అడిగారు. తుకారాం అందుకు చాలా సంతోషించి తాను రాలేనని చెప్పి ఒక చేదు దోసకాయను వారి చేతికి ఇచ్చి వారంతా పుణ్య తీర్థాలలో స్నానం చేసేటప్పుడు ఆ దోసకాయను కూడా ఆ నీళ్ళలో ముంచి తీసుకు రమ్మన్నాడు. భక్తులు శ్రద్ధతో అంగీకరించి ఆ దోసకాయను తమతో కూడా తీసుకెళ్ళి తాము స్నానం చేసేటప్పుడు ఆ దోసకాయను ఆ నీటిలో ముంచి తిరిగి వచ్చి దానిని తుకారాంకు సమర్పించారు.

తీర్థయాత్రలు ముగించుకు వచ్చిన భక్తులందరికీ తుకారాం తన నివాసంలో భోజనాలు ఏర్పాటు చేసాడు. రకరకాల రుచికరమైన వంటకాలతోపాటు పుణ్యతీర్థాలలో ముంచి తీసుకువచ్చిన దోసకాయ పులుసు చేసి వడ్డించాడు. భక్తులు ఆప్యాయంగా భోజనం ఆరగిస్తూ పులుసు చేదుగా ఉంది అంటూ గోలపెట్టారు.

ఇది విన్న భక్తుడు తుకారాం అందరికీ నమస్కరిస్తూ 'క్షమించండి. మీరు పుణ్యతీర్థంలో ముంచి తీసుకు వచ్చిన దోసకాయ పులుసు అది. ఇంకా దాని చేదు పోలేదా? పులుసు చేదుగా ఉందా? తీర్థయాత్రలు చేసి వచ్చినా దాని చేదు అలాగే ఉందా?' అని ఆశ్చర్యపోయారు.

బాహ్య ప్రదర్శనల వల్ల ఎంతమాత్రం లాభంలేదు. ఎన్ని తీర్థయాత్రలు చేసినా, ఎన్ని పుణ్య స్నానాలు చేసినా ఏం ఫలం? అంతరంగిక పరిణామం ముఖ్యం. అదే అలవరచుకోవాలి.

ఆచరణము లేనిదే మనసు పరిశుద్ధం ... "

# నిజాలు - నిదర్శనాలు

## పారిశ్రామిక దేశాలలో ఆదాయాలు

సుమారు 3,000 మిలియను మంది తలసరి వార్షిక ఆదాయం పారిశ్రామిక దేశాలలో ప్రజల నెలసరి ఆదాయం కంటే చాలా తక్కువ.

## ఒక మనిషికి రెండు ఎలుకలు!

భారతదేశం పొలాలలో సుమారు 2,400 మొదలు 5,000 మిలియను ఎలుకలు నివాస ప్రదేశాలలో ఉజ్జాయింపుగా ప్రతీ ఒక్క మనిషికి 2 ఎలుకలు ఉన్నట్టు ఇటీవల సలిపిన ఒక సర్వేవల్ల తెలుస్తూంది.

## సాలీనా మిలటరీ మీద 1,000 బిలియను డాలర్లు వ్యయం

ప్రపంచం మొత్తం ప్రతీ సంవత్సరం మిలటరీ మీద 1,000 బిలియను డాలర్లు ఖర్చు చేస్తూంది. 1980 దశాబ్దం చివర ప్రతీ సంవత్సరం మిలటరీ మీద వ్యయం అధిక ఆదాయపు దేశాలలో 860 బిలియను డాలర్లు అయితే, అభివృద్ధి పొందుతూన్న దేశాలలో 170 బిలియను డాలర్లు .ఈ 170 బిలియను డాలర్లలో 38 బిలియను డాలర్లు ఎక్కువగా పారిశ్రామిక దేశాల నుంచి ఆయుధ సామగ్రి దిగుమతికి ఖర్చుచేయబడింది

## 11 శాతం కోల్ మైనర్లకు కోల్ మైనర్ల వ్యాధి

ఇండియన్ జర్నల్ ఆఫ్ ఎన్విరాన్ మెంటల్ ప్రొటెక్షన్ వారు ప్రచురించిన అధ్యయనం ప్రకారం భారతదేశంలో 11 శాతం కంటే అధికం కోల్ మైనర్లు (బొగ్గు త్రవ్వేవారు), 7 4 శాతం మైకా ఫాక్టరీలలో కార్మికులు, 10.6 శాతం రిఫ్రాక్టరి కార్మికులు మరియు 55 శాతం పలక, పెన్సిల్ ఫాక్టరీ కార్మికులు న్యూమోకోనియాసిస్ (Pneumoconiosis) అనే కోల్ మైనర్ల వ్యాధితో బాధపడుతున్నారు పీల్చిన దుమ్ము ఊపిరితిత్తులలో ఉండిపోవడం వల్ల ఈ వ్యాధి కలుగుతుంది

— 'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## యుద్ధపు ఖర్చులు బ్రహ్మాండం

*ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్ ఒకసారి ప్రపంచ నిరాయుధీకరణ గురించి ప్రసంగిస్తూ "ఒక క్రొత్త భారవంతమైన బాంబర్ ఖరీదు ఇలా ఉంటుంది*



*30 కి పైగా నగరాలలో రాతితో నిర్మింపబడే స్కూళ్లు*

*— ప్రతీది 60,000 మంది జనాభా గల పట్టణాలకు వినియోగపడే రెండు ఎలక్ట్రిక్ పవర్‌ప్లాంట్‌లు*

*— అన్ని హంగులు సదుపాయాలతో కూడిన రెండు హాస్పిటళ్లు*

*— 50 మైళ్ళ కాంక్రీట్ హైవే.*

*— ఒక్క ఫైటర్ ప్లేన్‌కి మనం అర మిలియన్ బుషెల్స్ గోధుమను ఇస్తున్నాము*

*— 8000 మందికి పైగా నివసించడానికి అను వైన గృహ వసతులకు అయ్యే ఖర్చును ఒక డిస్ట్రాయర్ మీద పెడుతున్నాము." అన్నారు.*

"మోసాలన్నిటిలోను ఆత్మవంచనను మించిన మోసం మరొకటిలేదు."

## 1991లో భారతదేశం సందర్శించిన విదేశీ టూరిస్టులు

1991లో భారతదేశాన్ని సందర్శించిన టూరిస్టుల సంఖ్య 16,77,461. దీనివల్ల దేశం సంపాదించిన విదేశీ మారక ద్రవ్యం సుమారు రూ. 2,918 కోట్లు.

## యుఎస్‌లో 13.5 శాతం మంది పేదలు

యునైటెడ్ స్టేట్స్‌లో ఉజ్జాయింపుగా 1 3 5 శాతం మంది అమెరికా ప్రమాణాలను బట్టి నిరుపేదలుగా ఉంటున్నారు. నలుగురు సభ్యులు గల ఒక సామాన్య కుటుంబం సంవత్సరానికి యుఎస్ దారిద్ర్యరేఖను సూచించే 13,359 డాలర్లు కంటే తక్కువ ఆదాయంతో 35 మిలియను మంది అమెరికనులు ఉన్నారు.

## 7.50 లక్షల భారతీయులు యుఎస్ఎలో స్థిరపడ్డారు

యుఎస్ఎలో 7.50 లక్షలకు పైగా భారతీయులు స్థిరపడ్డారు. 3 లక్షలకు పైగా యునైటెడ్ కింగ్‌డమ్‌లోను, 2 లక్షలకు పైగా యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్‌లోను, 4 లక్షలకు పైగా సౌదీ అరేబియాలోను, 1 75 లక్షలకు పైగా మలేషియాలోను ఉన్నారు.

## పసిబిడ్డల మరణానుపాతం

స్వాతంత్ర్య సమయంలో భారతదేశంలో పుట్టినప్పుడు సగటు ఆయుఃప్రమాణం 32 సంవత్సరాలు పసిబిడ్డల మరణానుపాతం 1000 మంది సజీవులుగా పుట్టిన వారికి 157. మలేరియా వ్యాధివల్ల 75 మిలియను మందిలో సంవత్సరానికి 7 5 లక్షల మంది మరణించారు.

గత 45 సంవత్సరాలలో ఆరోగ్య సంస్థలు (మెడికల్ మరియు పారా - మెడికల్) విపరీతంగా పెరిగిపోయాయి. దాని ఫలితంగా ఈనాడు పసిబిడ్డల మరణానుపాతం 1000 మంది సజీవులకు 85. ఇది శ్రీలంకా మరియు థాయ్‌లాండ్‌లలో 50 కంటే తక్కువ. ఎంతో అభివృద్ధి పొందినా గ్రామీణ ప్రాంతాలలో 77 శాతం పిల్లలకి, గిరిజన ప్రదేశాలలో 73 శాతం పిల్లలకి తగిన పోషకాహారం లేదు.

## విద్యకు మూలం



*ఆరోగ్యవంతమైన సాంఘిక, రాజకీయ సంస్థలకు విద్య మూలం మనకి ఈనాడు బాలుల శక్తి మరియు అభివృద్ధికి సహకరించగల జాతీయం చేయబడిన విద్య ముఖ్యావసరం ఇది ఉపాధ్యాయుని ఆధారంతోగాక బాలుర అభివృద్ధి కారకంగా ఉండాలి క్రొత్త విద్యావిధానం చిత్త విభ్రమాలకు లోనుకాకుండా క్రమబద్ధమైన పవిత్రమైన జీవశక్తుల ఉపయోగంపై ఆధారపడి ఉండాలి బుద్ధిని సౌందర్య పిపాసకు అనువుగా తీర్చిదిద్దాలి*

— శ్రీ అరవిందో

"హింస ద్వారా సత్యాన్ని తెలుసుకోలేరు
హింసతో సాధించలేని [illegible]"

# సరసోక్తులు

## సృజనాత్మకమైన మనస్సు ఉంటే?

ఖాళీగా ఉన్నప్పుడే కవ్వు ఉపయోగపడు తుంది. మూఢవిశ్వాసాలతోను, పిడివాదాలతోను, నిశ్చయ వాక్యంతోను, ఉదాహరణలతోను నిండి పోయిన మనస్సు వాస్తవంగా, సృజనాత్మకమైన మనస్సు కాదు. — జిడ్డు కృష్ణమూర్తి

## దాని మొండిపట్టును మెచ్చుకోవలసిందే



ఒక ఆమె ఒకరిని గురించి వల్లెత్తు మాట అని ఎరుగదు ఒకరు 'అత్తయ్యా, నీవు ఒక దయ్యాన్ని గురించి కూడా మంచే మాట్లాడతావు అనుకుంటాను' అన్నారు. దానికి ఆమె 'దాని మొండిపట్టును నీవు మెచ్చుకోవలసిందే' అంది.

—'ఈస్ట్ అండ్ వెస్ట్ సీరీస్' సౌజన్యంతో

## గౌరవ మర్యాదలను అంటిపెట్టుకుని ఉండటం భారం

అదృష్టంతో పాటు గౌరవ మర్యాదలుంటే జీవితం కొంతవరకు హాయిగానే ఉంటుంది. కానీ గౌరవ మర్యాదలను అంటిపెట్టుకుని ఉండటం చాలా భారం అనిపిస్తుంది ఆ ప్రసిద్ధిలో మానసిక శాంతిని, ఏకాంతాన్ని రహస్యాన్ని వదలుకోవాలి.

## విషయం కాదు మనమే విసుగెత్తిపోయాం!

ఒకసారి జార్జ్ బెర్నార్డ్ షా ఒక డిన్నర్‌లో మాట్లాడడానికి ఆహ్వానింపబడ్డాడు ప్రేక్షకు లందరూ చివరగా మాట్లాడే షా కోసం నిరీక్షిస్తు న్నారు. అతడు వెంటనే నుంచుని 'లేడీస్ అండ్ జెంటిల్‌మన్, అసలు విషయం కాదు మనమే విసుగెత్తి పోయాం' అని చెప్పి కూర్చు న్నారు.

## చింత చేసే అపకారం

మానసిక చింత సామాన్యం కాదు ఒత్తిడి ఎక్కువ అవుతుంది. చింత శరీరాన్ని దహించి వేస్తుంది అధిక పరిశ్రమతో మరణించినవారిని ఎరుగను కానీ సందేహంతో పోయిన వారిని ఎరుగుదును.

— డా ఛార్లెస్ హెచ్. మేయో

## అందరి ఆనందానికి అందం!

అందరూ చూచి ఆనందించడానికి అందం ఉంది. కానీ పురుములు తాము సృష్టించుకున్న నీడల మీద నిలబడితే వారి కంటికి అవి కనిపించవు. ఆత్మాభిమానం ఆవరించుకునిపోవడం వల్ల తరచు సొగసు, సౌందర్యాలలో ఆనందాన్ని చేజార్చుకుంటాం.

— రెయినార్ జాన్సన్

## ప్రపంచం ఒక అద్దం

ప్రపంచం ఒక పెద్ద అద్దం వంటిది.

'సంస్కార రహితుడుగా పుట్టడంకన్నా అసలు పుట్టక పోవడం మంచిది."

అందులో ఎవరు చూసుకుంటే వారి ప్రతిబింబం కనిపిస్తుంది. కోపంతో ముఖం చిట్లించుకో అలాగే నీ ప్రతిబింబం నీకేసి చూస్తుంది. నవ్వితే సంతోషంగా నవ్వుతుంది. కాబట్టి యువకులు ఎల్లప్పుడూ ఉత్సాహంతో ఆనందంగా ఉండాలి. — థాకరే

రాజీ అనేది సామాన్యంగా ప్రశ్నను జవాబుకు సరిపడ్డట్టుగా మార్చడం.

## మొట్టమొదట మునిగితే

డైవింగ్ బోర్డ్ మీద నిలబడి దూకడానికి భయపడేవారు నీటిలోకి అసలు దూకలేరు. మొట్టమొదట మునిగితే భయం పోతుంది. జీవిత సాగరంలో మునిగితే ఒకదాని తరువాత ఒకటి అన్నీ విజయాలే.

— జాన్ డ్రైడెన్

## వైద్యులు అంటారు

నీవు మెల్లిగా తింటే కొంచెం తింటావు అని వైద్యులు అంటారు. పెద్ద కుటుంబంలో పెరిగిన వ్యక్తి ఎవరైనా ఇలాగే చెబుతాడు

## ఆధునిక విద్యావిధానం కాగితపు పూవు

ఆధునిక విద్యావిధానం కాగితం పూవులా ఉంటుంది. సహజమైన పుష్పం కంటే ఎంతో సొగసుగా ఉంటుంది. సువాసన మాత్రం శూన్యం.

## దీనిని మించిన దానం లేదు

నీకు జ్ఞానజ్యోతి ఉంటే ఇతరులు తమ క్రొవ్వు వొత్తులను వెలిగించుకోడానికి సహకరించు. విజ్ఞాన దానానికి మించిన దానం ఇంకొకటి లేదు.

## తలిదండ్రులు పడేపాట్లు

పిల్లలను కని, పెంచి పెద్దవారిని చేసే తలిదండ్రులపాట్లు ఇంతా అంతా కాదు. వారి ఋణం తీర్చుకోలేవు. వారికి, ఉపాధ్యాయులకు సంతోషంగా ఉండేది ఆచరించు. దాంతోటే వారి తపస్సు పూర్తి అవుతుంది.

— మను

## బూడిద నేలమీద రాలుతుంది

పరువు మీద పడుకుని సిగరెట్టు కాల్చకు. నేలమీద పడే బూడిద నీదే కావచ్చు.

## వివేకవంతుడు సొగసుగత్తె

మూర్ఖుల మధ్య వివేకవంతుడు, గ్రుడ్డి వాళ్ళమధ్య సొగసుగత్తె.

— సాదీ

## సందేహాత్ముడవైతే

సందేహాత్ముడు గోడమీద ఏదైనా చేతివ్రాతచూస్తే ఫోర్జరీ అంటాడు.

## పిల్లలే రేపటి ప్రపంచం!

ఉత్తమ ప్రపంచం కావాలంటే రేపటికి పెట్టుబడి పెట్టాలి. రేపటి ప్రపంచం పిల్లలే.

— పీలీ

## మంచి ఉపదేశం

ఉపదేశకుడికి నీ గురించి ఎలా తెలిసిందో అనిపించేదే మంచి ఉపదేశం.

"ఒక్కొక్కప్పుడు కొద్దిపాటి నిర్లక్ష్యం వల్లే

# తొందరవల్ల పనులు చెడిపోతాయి

ఒకప్పుడు శివాజీ తన సైన్యాన్ని వదలి దారి తప్పి దూరంగా చుట్టుపట్ల జనసంచారం లేని నిర్మానుష్యమైన ప్రదేశానికి వెళ్లాడు. సూర్యాస్తమయం అయింది. చీకటి పడుతూంది. ఎక్కడో దూరంగా రెపరెపలాడే దీపపు కాంతి కనిపించింది. ఆ దిక్కుగా వెళ్లగా ఒక గుడిసె కనిపించింది ఆ గుడిసెలో ఒక ముసలమ్మ శివాజీని పిలిచి లోపలకు తీసుకువెళ్లింది.



పూర్తిగా శ్రమపడిపోవడమే గాక శివాజీకి బాగా ఆకలి వేస్తూంది. ఆ వృద్ధురాలికి పరిస్థితులు తెలిసాయి. చేతులు, కాళ్లు కడుక్కోడానికి వేడి నీళ్లు ఇచ్చింది. ఒక చాపపరచి కూర్చోమంది. శివాజీ శ్రమతీర్చుకోడానికి కూర్చున్నాడో లేదో ఇంతలో ముసలమ్మ ఒక కంచంలో వేడివేడిగా రాగుల ముద్ద పట్టుకువచ్చి శివాజీ ముందు పెట్టింది

శివాజీకి బాగా ఆకలిగా ఉంది. గబగబా కంచంలో ముద్ద తీసుకోడానికి ప్రారంభించాడు. అది బాగా వేడిగా ఉండటం వల్ల చేయి కాలింది. గబాలున వెనక్కు లాక్కున్నాడు. ఇది చూసి ముసలమ్మ 'నీది అంతా శివాజీ స్వభావం' అంది. 'శివాజీతో నన్ను ఎందుకు సరిపోలుస్తావు' అని అడిగితే, ఆ వృద్ధురాలు 'శివాజీ చిన్న చిన్న కోటలు, దుర్గాలు విడిచేసి పెద్ద పెద్ద కోటలను పట్టుకోవాలని పరుగెత్తుతాడు. అలాగే కంచంలో చుట్టూ చల్లగా ఉన్నది తీసుకోకుండా మధ్య వేడిగా ఉన్న చోట పెద్ద ముద్దతీసావు. తొందరవల్ల పనులు చెడిపోతాయి. అబ్బాయి! విజయం పొందాలంటే ఎవరైనా మెల్లి మెల్లిగా జాగ్రత్తగా, ధైర్యంగా ముందుకు అడుగువేస్తూ ఉండాలి. మొట్టమొదటే అతివేగంగా పెద్ద పెద్ద అడుగులు వేస్తే చెప్పుకోవలసినంత ఎవరూ సాధించలేరు మొదట చిన్న చిన్న దుర్గాలు, కోటలు స్వాధీనం చేసుకుంటే శివాజీకి తిరుగు ఉండదు. అను కున్నది సాధించుకు వస్తాడు' అంది. శివాజీకి పూర్తిగా అర్థం అయింది. ముసలమ్మ చెప్పిన దానిని ప్రత్యక్షంగా అచరణలో పెట్టి భారతదేశ చరిత్రలో ముఖ్య స్థానాన్ని పొందాడు.



ప్రాపంచిక విషయాలైనా, అధ్యాత్మిక విషయాలైనా ఎవరూ తొందరపడకూడదు ధైర్యంతో కృత నిశ్చయంతో ముందుకు కొన

(మిగతా 62 వ పేజీలో)

''అదుపు తప్పిన ఆవేశం ఎదుటి వారికి కాదు, నీకే ఎక్కువ హానికరం.''

# సౌందర్య నిరోధకమైన సిగరెట్లు

రోజుకి ఇరవై సిగరెట్లు కొనడం మానేస్తే ఏడాదికి రూ. 4,000లు దాకా ఆదా చేస్తావు.

నీవు కాల్చని ప్రతీ సిగరెట్టుకి నీ ఆయువు అయిదున్నర నిమిషాలు పెరుగుతుంది.



ఇష్టం వచ్చినప్పుడు ఎప్పుడో సిగరెట్టు కాల్చడం మానేస్తాను అనుకోడం తప్పు. ఎన్నటికీ సరి కాదు. నికొటిన్ వ్యసనకారి. నీ ఇష్టం వచ్చినప్పుడు సిగరెట్టు కాల్చడం మానడం అసంభవం. ఇప్పటి కిప్పుడు మానుకో. అదే ఉత్తమం, సులభం, ఆరోగ్యకరం.

మగవారికైనా, ఆడవారికైనా, ఎవరికైనా పొగాకు ప్రమాదకరం. దీనివల్ల నీవు, నువ్వు కట్టుకున్న బట్టలు ఘాటుగా కంపు కొడుతూంటాయి. గ్లూ మరియు పెయింట్ తయారుచేయడానికి ఉపయోగపడే రసాయనిక పదార్థాలన్నీ సిగరెట్టు పొగలో చేరి ఉన్నాయి. అత్తరులు, సెంట్లు, ఆఫ్టర్ షేవ్ లోషనులు, ఇతర సువాసన ద్రవ్యాలు పొగాకు వాసనను కించిత్తు తగ్గించ లేవు. సిగరెట్టు కాలిపోయినా వాసన అలాగే ఉంటుంది.

మంచి ఆరోగ్యవంతమైన చర్మంలో కొల్లేజన్ (collagen) ఉంటుంది. ఈ కొల్లేజన్ శరీరంలో ముడతలను రానీయదు. చర్మాన్ని అరిపోనీయదు. అయితే ఇది కలకాలం ఉండదు. ముప్పై సంవత్సరాల వయస్సు తరువాత శరీరంలో ఇది క్రమంగా తగ్గుతూ వస్తుంది. సిగరెట్లు కాల్చడం మొదలుపెడితే ఇది నీలో త్వరగా అరిపోతుంది శరీరం మీద ముడతలు తొందరగా బయలు దేరతాయి.

సుమారు వెయ్యి కంటే అధికంగా అపాయ కరమైన రసాయనిక పదార్థాలు గల సిగరెట్టు పొగాకును కాల్చకుండా ఉంటే నీ ఊపిరి ఆరోగ్యవంతంగా ఉంటుంది. దుర్వాసన కొట్టదు. ఆరోగ్యానికి ఆరోగ్యం, పరిశుభ్రతకు పరిశుభ్రత దక్కుతాయి.

పొగాకు కాల్చడం మానేసి పుష్టికరమైన, రుచికరమైన ఆహారం తింటే ఆరోగ్యం బాగా ఉంటుంది. సామాన్యంగా సిగరెట్టు కాల్చేవారు ఊపిరితిత్తులు ప్రతీ సంవత్సరం కాన్సర్‌ను ప్రవృద్ధిపరచే ఒక కప్పు తారును పీలుస్తారు అంటే నమ్మండి.

— 'హెరాల్డ్ ఆఫ్ హెల్త్' సౌజన్యంతో

( 61 వ పేజీ తరువాయి)

సాగితే విజయం తథ్యం. అలాకాకుండా తొందర పడితే ఉద్యమం ఫలించదు. అందరికీ నవ్వు లాటగా ఉంటుంది.

— 'యువభారతి' సౌజన్యంతో

"శాంతి లేనివారికి సుఖం లేదు."

# నిశ్చింతగా ఉండటం ఒక కళ

డా. క్లైవ్ డి. హార్లీ

మనం తరచు జీవితంలో ఏర్పడే విపరీత పరిస్థితులను, మహోన్నత సత్యసంఘటనలను ఎలా ఎదుర్కొంటామా అని ఆశ్చర్యపడి పోతూంటాము. ఈ చిన్న చిన్న భయాలు, నిత్య జీవితాన్ని నిస్సారం చేసే సమస్యలు మనకు యాతనామయంగా ఉంటాయి.



జీవితంలో ఏర్పడే ఈ విపరీత పరిస్థితులను ఎప్పటికప్పుడు సరిదిద్దుకోకపోవడం వల్ల అవి పేరుకుపోయి ముఖ్యమైన మన లక్ష్యాన్ని పొందనీయకుండా చేస్తాయి. శాంతంగా, నెమ్మదిగా ఉండడం పుట్టుకతో వచ్చేది కాదు. అయితే ప్రయత్నించి అలవాటు చేసుకోవచ్చు.

దీనికి మొట్టమొదట ఈ ప్రత్యేక కళను బాగా అభ్యసించి నేర్చుకున్న నిపుణుల జీవితాలను పరిశీలించడం ఒక నిశ్చయమైన మార్గం. ఇటువంటి పుణ్యపురుషుల, స్త్రీల అనుభవాలు ఈ క్రింది కిటుకులు సూచిస్తున్నాయి.

1. హాస్య స్వభావం : రెండవ మహా సంగ్రామ కాలంలో ఇండియా బర్మా థియేటర్‌లో పరాజయం ఏర్పడినప్పుడు ఫీల్డ్ మార్షల్ స్లిమ్ తన సిబ్బందిని ఉద్దేశించి 'పరిస్థితులు ఇంకా అధ్వాన్నంగా ఉండి ఉండవచ్చు' అన్నాడు. 'ఎలాగ' అని గొంతు వినిపించింది. దానికి స్లిమ్ 'వానవచ్చి ఉండవచ్చు' అన్నాడు.

తక్షణం సమయానుకూలంగా హాస్యంగా చెప్పడం అందరికీ సాధ్యం కాదు. కాబట్టి రెండు మూడు కథలు చెప్పి పరిసర స్థితులను మెరుగు పరచవచ్చు.

## కాలం క్షణకాలం ఆగదు

కాలం క్షణకాలం ఆగదు.
కాలం దుర్నివారం
కాలం దూరం తెలియని
అపార పారావారం
క్షణాలు, దినాలు,
పక్షాలు, మాసాలు
సంవత్సరాలు, యుగాలు
కల్పాలు, కల్పాంతరాలు
చరచరా సాగిపోతున్నాయి
గిరగిరా తిరిగిపోతున్నాయి
కాలం అజేయం
కాలం అమేయం

— 'అరుణశ్రీ'

## శీలానికి కఠిన పరీక్ష

రహస్యాన్ని ఉన్నది ఉన్నట్టుగా ఉంచడం శీలానికి కఠిన పరీక్ష కాదు. రహస్యం వెల్లడైనప్పుడు ఇంతవరకు నీకు తెలుసునని చెప్పకుండా ఉండటమే శీలానికి కఠిన పరీక్ష

2. తొందరపడకుండా నీస్కైము నీవు తీసుకో : ఒత్తిడివల్ల తొందరగా పనులు చేయ బోతాం. కొంచెం తాత్సారం వల్ల అను చితమైన అసందర్భపు పనులు చేయం. కొంచెం ఆలస్యం చేస్తే మరచిపోయిన వాటిని మనసులో జ్ఞాపకం తెచ్చుకుంటాం.

3. అధికారం చెలాయించకు వివాదం మానుకుని సమాధాన పడడానికి అందరూ ఒప్పుకోరు. తగవులాటలోగానీ, వివాదంలో గానీ పరిష్కార మార్గాన్ని సూచించి మాట్లా డటం ప్రారంభించు. ఎదుటివాళ్లు మరో విషయాన్ని గురించి బాగా తీవ్రంగా ఆలోచించడానికి తగిన అవకాశం కలిగించు. ఆతరువాత వాళ్ల ప్రతిక్రియ ఎలా ఉంటుందో గమనించు. ఈవిధంగా ఎంతోమంది లాభం పొందారు

4. కారణాలు తెలుసుకో . తీవ్రమైన విమర్శలకు, నిందలకు బుద్ధి చెడగొట్టుకోనక్కర లేదు. చాలామటుకు నిందలు ఏదో, ఎవరిమీదో కోపంతో మోపినవే గానీ నేరుగా నీమీద కాదు ఇంకో ముఖ్య విషయం గ్రహించాలి. దెబ్బలాటలకు, తగవులకు ఇద్దరూ ఉండాలి

5. సిద్ధంగా ఉండు . 1963 మేలో గార్డాన్ కూపర్ అంతరిక్షయానంలో నౌకను నియంత్రించే ఆటోమేటిక్ సాధనలు చెడి పోయాయి. కూపర్ విశ్రాంతగా ఏమాత్రం ఆందోళన పడిపోకుండా మాన్యువల్ కంట్రోల్‌ల సహాయంతో సక్రమ మార్గంలో విమానాన్ని నడిపించగలిగాడు. అతడు ప్రత్యేక పరి స్థితులలో అవలంబించవలసిన పనులను జాగ్రత్తగా నెరవేర్చాడు.

ముందు చూపు అవసరం : ముందు ఏం జరుగుతుందో తెలుసుకోకుండా ఏపనికి భాధ్యత వహించకు. అసంభవాన్ని ఆశించడం ఒక ప్రతిజ్ఞ వంటిది.

శాంత స్వభావం అనేక రకాలుగా మనకు ఉపయోగపడుతుంది. మన ఆరోగ్యం ఒత్తిడి సమయాలలో సమాధాన పరచుకునే మన సామర్థ్యం మీద ఆధారపడి ఉంటుందని వైద్యులు అంటారు. అమూల్యమైన దీని ఫలితం ఏమి టంటే మనం మనంగా ప్రవర్తించగలుగుతాం.

## 39 సంవత్సరాలలో భూమి మీద జనాభా రెట్టింపు అవుతుంది

*ప్రస్తుతం ప్రపంచంలో 5 24 బిలియను (5,240 మిలియను) మంది జనం ఉన్నారు. ప్రపంచంలో ప్రతి సంవత్సరం 90 మిలియను మంది అధికంగా*



*పెరుగుతున్నారు ఈ ప్రస్తుత రేటు ప్రకారం పెరిగి పోతూన్న ప్రపంచ జనాభా 2000 సంవత్సరానికి 6.3 బిలియను (6,300 మిలియను), 2020 నాటికి 8.3 బిలియను (8,300 మిలియను) అవుతుంది. 39 సంవత్సరాలలో ప్రపంచ జనాభా రెట్టింపు పెరుగుతుంది.*

— *'వరల్డ్ పాపులేషన్ రిఫరెన్స్ బ్యూరో, వాషింగ్టన్' సౌజన్యంతో*

"కర్మలన్నీ జ్ఞానంలో పరిసమాప్తి పొందుతున్నాయి."

# వినోద

అంతర్జాతీయ తెల
సంపాదకవర్గం
:సంపాదకుడు:
లయన్. కె.వి.గోవిందరావు బి.ఏ.,ఎల్.ఎల్.బి

గౌరవసహాయసంపాదకులు:
కొండముది దత్తాత్రేయశర్మ
వి.బాలకుమార్ ఎం.ఏ.,బి.ఎల్.

సభ్యులు:
కె.వి.ఎస్.శరత్‌బాబు బి.ఏ.,బి
ఎం.ఎస్.విజయకుమార్
కె.రత్నకుమారి

నవంబరు 1992



[redacted]

:చందా వివరాలు:

సంవత్సర చందా రూ. 42/-
ఎయిర్ మెయిల్(1సం.) రూ.200/-
...మెయిల్(1సం.) రూ.1...

9, దేశికా రోడ్,
మద్రాస్ - 600004
ఫోన్: 73527

ముఖచిత్రం
కలర్ ట్రాన్స్‌పరెన్సీ
సత్యమూ...

# ధ్యానం

## చెడు తలపులను చేరనీయకు!


జేమ్స్ ఎలెన్

దుష్ట తలంపుల నుండి బయట పడేందుకు మానవుడు ప్రయత్నిస్తూంటే, అతడు మంచి దారిలోకి రావడమే కాకుండా ఇతరులలో కనిపించే ఈర్ష్యా సూయల వంటి వాటిని కూడా తన నుంచి పోగొట్టుకునే ప్రయత్నం చేస్తున్నాడని చెప్పాలి. దీనివల్ల తనను దుష్టబుద్ధిగా భావిస్తున్న ఇతరుల అభిప్రాయాలను కూడా మరో దారికి మళ్లిస్తున్నాడన్న మాట ఒక వ్యక్తిని కానీ, ఒక పార్టీని కాని, ఒక మతాన్ని కాని, ఒక ప్రభుత్వాన్ని కాని దుష్టత్వం కలవిగా భావిస్తే నిన్ను కూడా వారు అదే కోవలో జమకడతారని మరచి పోవద్దు. తనను విమర్శించే, ఖండించే వారిని విమర్శించడం, ఖండించడం చేయకపోవటం ద్వారా దుష్టత్వానికి దూరం కావచ్చు. ఇంతవరకు ఏది దుష్టత్వమని తాను భావిస్తున్నాడో దానికి దూరంగా ఉండి మంచి మార్గంలోకి రావచ్చు. ఇది సాధన ద్వారా సమకూరుతుంది. సాధన చేస్తే

(మిగతా 3 వ పేజీలో)

# సంపాదకుని పేజీ

## చరిత్ర చెక్కిన శిల్పం మానవుడు

రహదారిపై నున్న దీపస్తంభం మాదిరి చరిత్ర కూడా మార్గదర్శిగా మానవాళికి త్రోవ చూపుతుంది కానీ మానవుడు చరిత్ర పట్ల అంధుడుగా ప్రవర్తిస్తున్నాడు చరిత్ర చెప్పే పాఠాలు ఏనాడూ నేర్చుకోడు. పోనీ తన తప్పుల నుండైనా గుణపాఠం గ్రహించడు. అందు వల్లనే చరిత్ర పునరావృతమౌతుందని చెబు తూంటారు



జీసస్ క్రీస్తు, సోక్రటీస్ వంటి సంస్కరణాభిలాషులు శిలువకు, విషానికి బలి అయ్యారు. అయినా మూఢాభిప్రాయంతో ప్రవర్తించే జనులు ఎటువంటి సంకోచం, అటంకం లేకుండా అబ్రహాంలింకన్, గాంధీజీ, మార్టిన్ లూథర్ కింగ్ వంటి మహనీయుల్ని పొట్టనబెట్టుకున్నారు ఇలాచేసి అధ్యాత్మికంగా దివాలా తీసిన, క్రియా శీలత లేని ఒక వర్గానికి ప్రతినిధులమని ఈ మూర్ఖులు ఋజువు చేసుకున్నారు.

'ఓపికతో ఉండేవారికి అన్నీ లభిస్తాయి, న్యాయం కూడా.'

న్యాయ విరుద్ధమైన సాంఘిక నీతికి తాము వారసులమని చాటుకున్నారు. వంచన, అవినీతి, ఈర్ష్య వల్ల వచ్చే దుష్ఫలితాలను చరిత్ర విప్పి చెబుతున్నా మానవులు వీటిని వదలకుండా తీవ్రంగా పట్టుపట్టి మరీ కొన సాగిస్తున్నారు.

అత్యాశ, దాని దుష్ఫలితాలను వెల్లడించే ఉదాహరణలు కోకొల్లలుగా చరిత్రలో కనిపిస్తున్నా మానవాళికి చీమ కుట్టినట్లయినా ఉండదు! యుద్ధం అంటే వాస్తవంగా ఏమిటో, దానివల్ల ప్రజలు ఎన్ని కష్టనష్టాలకు గురి అవుతారో చరిత్ర పుటలు వివరిస్తాయి. అయినా మానవులు యుద్ధానికి కాలు దువ్వుతూ 'నీకు శాంతి కావాలంటే సమరానికి సంసిద్ధం కమ్మని' నినాదాలు ఇవ్వడం మానరు!

శాంతి సమావేశాలు ఏవిధంగా విఫల మయ్యాయో ఒకవ్రక్క చరిత్ర చెబుతున్నా శాంతి, భద్రతల సంరక్షణ కోసం ప్రపంచ వ్యవస్థలు రూపొందాలని ప్రజలు ప్రయత్ని స్తున్నారు గుడ్డితనంతో ఎంత మాత్రం వీరు చరిత్రను అవగాహన చేసుకోలేదని దీనిని బట్టి తెలుస్తుంది

ఊహాగానం చేయకుండా, భ్రమలో పడకుండా యదార్థం చెప్పాలంటే మానవుడు కళ్ళుండీ చూడలేక, మనస్సు ఉండీ స్పందించక చేసిన తప్పులే మళ్ళీ మళ్ళీ చేస్తూ సాగిపోతున్నాడు

( 2 వ పేజీ తరువాయి)

మానవుడు ఆధ్యాత్మిక శిఖరాలను అధిరో హించి అత్యున్నత మోక్షప్రాప్తిని పొంద వచ్చు.

## సెక్రటరీ పక్షి




*ఆఫ్రికాలో పొడుగాటి కాళ్ళు గల సెక్రటరీ పక్షి విషపాములను చంపి తింటుంది. ఈ పక్షి పాము తలమీద రెక్కలతో కొట్టి వాడియైన గోళ్ళతో చీల్చి తింటుంది. అదే సమయంలో పాము కాటుకి అందకుండా అకస్మాత్తుగా అతివేగంగా పైకి ఎగురు తుంది. పాము బాగా అలసిపోయినప్పుడు సెక్రటరీ పక్షి దానిని పట్టుకుని గాలిలోకి అనేక పొర్లు విసిరి పాము తలను ఛితగగొట్టేస్తుంది.*

## దక్షిణ ఆఫ్రికాలో బంగారు గనులు యాదృచ్ఛికంగా కనుగొనబడ్డాయి

*దక్షిణ ఆఫ్రికాలో ఒక వ్యక్తి రోడ్డు మీద నడు స్తుండగా కాలికి తగిలి పైకి లేచిన రాయి తళతళా మెరుస్తూంటే దానిని బట్టి ప్రపంచ ప్రసిద్ధి పొందిన బంగారు గనులు యాదృచ్ఛికంగా కనుగొనబడ్డాయి గోల్డ్ రషర్లు భూమిని త్రవ్వడం ప్రారంభించారు. షాఫ్టులు ఇప్పుడు 900 అడుగుల లోతు దాకా వెడతాయి. అక్కడ ఉష్ణోగ్రత 100°C ఉంటుంది. దక్షిణ ఆఫ్రికా గనులలో 25,000 మైళ్ళ సొరంగాలు ఉన్నాయి. భూతలానికి తెచ్చిన బూడిదరంగుగా ఉండే ఒక టన్ను గ్రే ముడి ఖనిజంలో 1 పౌండు విలువ బంగారం లభిస్తుంది. ఇప్పుడు బంగారం ఉత్పత్తి బాగా తగ్గిపోతూంది. ఈనాడు దక్షిణ ఆఫ్రికాలో బంగారం కంటే ఆరెంజ్‌ల ఉత్పత్తి అధికమైంది!*

"ప్రశాంతచిత్తుడు కామక్రోధాది ఉద్రేక కారణాలకు అతీతుడు."

# జపాన్! శతాయుష్మాన్ భవ!!

పురాణాల్లో - నారదుడు, ధృవుడు, హనుమంతుడు - వీరిని చిరంజీవులుగా చెబుతున్నారు. ఇవి వుక్కిటి పురాణాలని కొట్టివేసే వారికి వర్తమానంలో ఒక చక్కటి వార్త అందుతుంది. ప్రపంచంలోని అన్ని దేశాల వారిలో



జపానీయులే దీర్ఘకాలం జీవిస్తారని వెల్లడయింది. 1986లో పుట్టిన ఒక జపాన్ బాలుడు 75 ఏళ్ళపాటు నిరాఘాటంగా జీవిస్తే అదే సంవత్సరంలో జన్మించిన జపాన్ బాలిక దాదాపు 81 సంవత్సరాలపాటు బ్రతికి బట్టకడుతుంది. బ్రిటన్‌లో శిశువుల జీవిత ప్రమాణం కన్నా జపాన్ శిశువుల జీవన ప్రమాణం మూడేళ్లు ఎక్కువ.

1965 నుంచి 1986 వరకు విశ్లేషిస్తే జపాన్‌లో జీవిత ప్రమాణం పురుషులలో ఏడున్నర సంవత్సరాలు, స్త్రీలలో ఎనిమిది సంవత్సరాలు పెరుగుదల కనిపించింది. ఈ అభివృద్ధికి కారణాలను అన్వేషించిన లండన్‌లోని "మిడిల్‌సెక్స్ స్కూల్ ఆఫ్ మెడిసిన్' జపాన్ సమాజాన్ని అధ్యయనం చేసింది. దీనివల్ల వైద్య సదుపాయాల పెరుగుదల పెద్ద వ్యాధుల వల్ల మరణాల సంఖ్య తగ్గుదల, జపాన్‌లో ఆరోగ్య సంరక్షణ కోసం చేసే వ్యయం - ఇవన్నీ అక్కడి జనం దీర్ఘకాలం జీవించేందుకు దోహదం చేస్తున్నాయని వెల్లడయింది.

జపానీయుల ఆహారం - తక్కువ కొవ్వు పదార్థాలు, అధికంగా చేప నూనెల వాడకం - కూడా దీర్ఘాయుర్దాయంపై చెప్పుకోదగిన ప్రభావం చూపలేదు (ఈ ఆహారం వల్ల హృద్రోగాలు, కాన్సర్ వ్యాధుల్ని కొంతవరకు అరికట్టగలిగినా అధికంగా ఉప్పు వాడకం గుండెపోటు ఎక్కువగా వచ్చేందుకు తోడ్పడుతుంది)

ఆర్థిక వనరుల కారణంగా జపానీయులకు దీర్ఘాయువు సమకూరుతున్నదని పరిశోధకులు తేల్చివేశారు. పశ్చిమ దేశాలలో కంటే జపాన్‌లో తమ వృత్తి పట్ల నిబద్ధత, సంతృప్తి ఎక్కువగా కనిపిస్తుంది అనేక పశ్చిమ దేశాలలో కంటే జపాన్‌లోని అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థ పేద, ధనిక తారతమ్యాన్ని బాగా తగ్గించి వేసింది ఆరోగ్య భాగ్యానికి ఆర్థిక సౌభాగ్యం దోహదం చేస్తుందని ఋజువవుతుంది!

-- 'హెల్' సౌజన్యంతో

## రాగి పాత్రలలో ఉంచిన నీరు

* తాగే మంచినీరు రాగి పాత్రలలో నిల్వ చేసుకుంటే రెండు గంటల తరువాత అవి క్రిమి రహితం అవుతాయి తరువాత ఆ పాత్రను శుభ్రంగా తోమి కడగాలి

* కుళాయి నీరు పెదల్పుగా ఉన్న పాత్రలో ఎండలో ఉంచితే క్లోరిన్ వాసన పోతుంది లేకపోతే బొగ్గు ఉంచిన ప్లాస్టిక్ బక్కెట్‌లో రాత్రి ఉంచితే పొద్దుటికి వాసన పోతుంది

—'ఎవె విత్ ది పాయిజనస్ కెమికల్స్' సౌజన్యంతో

"పరిశుద్ధమైన మనస్సు గలవారు భక్తిపూర్వకంగా నాకు ఒక దళాన్నో ఒక పుష్పాన్నో, ఒక ఫలాన్నో లేక నీటినో అర్పిస్తే దానిని నేను గ్రహిస్తాను."

# :సంతోషానికి సోపానాలు: నిరంతరకృషి, ఏకాగ్రత, భక్తితత్పరత

డా.బి.డి.జెట్టి

[ప్రజా జీవితంలో డాక్టర్ బసప్ప దానప్పజెట్టి గణనీయమైన పాత్ర నిర్వహించారు విజయ శిఖరాలను అందుకున్నారు క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు కర్ణాటక ముఖ్యమంత్రిగా, పాండిచ్చేరి



లెఫ్టినెంట్ గవర్నర్‌గా, ఒరిస్సా గవర్నర్‌గా పని చేసారు 1974 నుండి 1979 వరకు భారత ఉపరాష్ట్రపతి పదవి నిర్వహించారు దేశ సమైక్యతకు నిస్వార్థ, నిర్విరామ కృషి చేసిన వ్యక్తిగా శ్రీ జెట్టికి 1990 నేషనల్ సిటిజన్స్ అవార్డు లభించింది ప్రస్తుతం దక్షిణ భారత హిందీ ప్రచార సభ వైస్ ఛాన్సలర్ పదవి నిర్వహిస్తున్న శ్రీ జెట్టి 'విస్డమ్' సంపాదకునికి ఇచ్చిన జవాబులు ..]

ప్రశ్న జీవితంలో మీరు నేర్చుకున్న ముఖ్యమైన మూడు పాఠాలు ఏమిటి?

జవాబు : 1. ఏకాగ్ర దృష్టితో, నిరంతర నిష్ఠతో వ్యావృత్తి నిర్వహించడం....
2. ఏ పరిస్థితుల్లోనూ మూలసూత్రాలకు భిన్నంగా నడవకపోవడం....
3 ఏ రంగంలోనైనా నిజాయితీతో పనిచేయడం....

ప్రశ్న మీ జీవితంలో మరువలేని అనుభవం ఏమిటి?

జవాబు : లోక్‌సభలో జనతా పార్టీ, దాని మిత్ర పక్షాలు అత్యధిక సంఖ్యాబలం సాధించిన తరువాత 1977 మార్చి 24వ తేదీన శ్రీ మొరార్జీ దేశాయి భారత ప్రధానిగా ప్రమాణ స్వీకారం చేసారు. అప్పటి దేశీయాంగ మంత్రి శ్రీచరణ్‌సింగ్ కాంగ్రెస్ పాలనలో ఉన్న తొమ్మిది రాష్ట్రాల ముఖ్యమంత్రులకు ఒక విజ్ఞాపన చేసారు. కాంగ్రెస్ ప్రభుత్వాలు పదవిలో ఉండటం ప్రజాభీష్టానికి వ్యతిరేకంగా ఉంటుంది కనుక తమ శాసనసభలను

## గీతలో ఉపయోగించిన శ్రీకృష్ణుని పేర్లు 38

విష్ణువుకి వెయ్యి పేర్లు ఉన్నా గీతలో 38 పేర్లు మాత్రమే ఉపయోగింపబడ్డాయి అవి - అచ్యుతుడు అనంతుడు, అప్రతిమ ప్రభావుడు, అరిసూదనుడు జనార్ధనుడు. దేవుడు, దేవదేవుడు, దేవవరుడు, దేవేశుడు, పరమేశ్వరుడు, పురుషోత్తముడు, ప్రభువు భగవంతుడు, ఆద్యుడు, కమల పత్రాక్షుడు, కృష్ణుడు కేశవుడు, భూతభావుడు, భూతేశుడు, మధుసూదనుడు మహాత్ముడు, మహాబాహువు, మాధవుడు, యాదవుడు, యోగి, యోగీశ్వరుడు, కేశి నిసూదనుడు, గోవిందుడు, జగత్పతి, జగన్నివాసుడు, వార్ష్ణేయుడు, వాసుదేవుడు విశ్వమూర్తి, విశ్వేశ్వరుడు, విష్ణువు, సర్వుడు, సహస్రబాహువు, హృషికేశుడు.

చేసి, కొత్తగా ఎన్నికలు జరిపించుకోమని ఆయన కోరారు. కానీ ఆ తొమ్మిది రాష్ట్రాల ముఖ్యమంత్రులు ఈ అభ్యర్థనను త్రోసి కాక ఆరు రాష్ట్రాలవారు తమ శాసనసభలను కేంద్ర ప్రభుత్వం రద్దు చేయకుండా ఇన్‌జంక్షన్ ఆర్డర్ ఇవ్వాలని సుప్రీంకోర్టులో దావా దాఖలు చేసారు. అయితే సుప్రీంకోర్టుకు చెందిన ఏడుగురు సభ్యుల రాజ్యాంగ ధర్మాసనం ఏకగ్రీవంగా ఈ దావాలను ఏప్రిల్ 29న త్రోసివృచ్చింది. ఆదేరోజు సాయంత్రం కేంద్ర మంత్రి మండలి ఈ తొమ్మిది శాసన సభలను రద్దు చేయమని తాత్కాలిక రాష్ట్రపతిగా పనిచేస్తున్న నాకు సలహా ఇచ్చింది. అప్పుడు ఈ విషయం పరిశీలించేందుకు కొంత వ్యవధి కావాలని నేను కోరటం జరిగింది. శాసనసభల రద్దు ఉత్తర్వుపై సంతకం చేసేందుకు నేను నిరాకరించటంతో ఏప్రిల్ 30న రాజ్యాంగ సంక్షోభం తలెత్తింది. అయితే అన్నీ కూలంకషంగా పరిశీలించిన తరువాత నేను ఉత్తర్వుపై సంతకం పెట్టడంతో తొమ్మిది కాంగ్రెస్ పాలిత రాష్ట్రాలు రాష్ట్రపతి పాలన క్రిందికి వచ్చాయి. నేను ఏ రాజకీయపక్షం ఒత్తిడికీ తలవొగ్గకుండా ప్రజాభిప్రాయాన్ని పాటించి సరైన నిర్ణయం తీసుకున్నాను. నా జీవితంలో అత్యంత క్లిష్టమైన సమయం ఇదే.

ప్రశ్న: జీవితంలో విజయం సాధించేందుకు, సుఖంగా గడిపేందుకు మీ సూత్రం ఏమిటి?

జవాబు: జీవితంలో నా విజయానికి కారణం - 75 శాతం నిజాయితీగా పనిచేయడం, 25 శాతం దైవకరుణగా భావిస్తాను. నేను నిర్వహించిన ఉన్నత పదవులన్నీ ఈ సూత్రాల ఆధారంగా అమలు జరిపినవే. అందువల్లనే నిర్వహించిన కార్యకలాపాలన్నీ నాకు తృప్తిని, సంతోషాన్ని కలిగించాయి.

ప్రశ్న: మీరు ఎక్కువగా ఆరాధించే నాయకుడు ఎవరు? దానికి కారణం ఏమిటి?

జవాబు: పరిపాలనా రంగంలో నా ఆదర్శ నాయకుడు మాజీ ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయ్. అత్యంత క్లిష్ట సమయాల్లో కూడా ఆయన తన నియమాలను వదలుకోలేదు.

ప్రశ్న: మీరు పఠించిన ఉద్గ్రంథం ఏది? ఎందుకు చదివారు?

జవాబు: నేను చదివిన ఉత్తమ గ్రంథం శ్రీ బసవేశ్వరుల వ్యాఖ్యానాలు అలాగే ఇతర శైవ పండితుల వ్యాఖ్యానాలు కూడా చదివాను. వీరి భావాలు సరళాలు, ఆచరణ సాధ్యాలు, శాస్త్రీయాలు, హేతుబద్ధాలు. స్వచ్ఛమైన జీవితాన్ని గడపగోరే ప్రజలకు సహాయకారులు ఈ జ్ఞానులు 'నీవు జీవించు, ఇతరులనూ జీవించనివ్వు' అనే సిద్ధాంతాన్ని ప్రబోధించినవారు.

## సుఖ సంతోషాలకు చిట్కా



ఒక కప్పు స్నేహపూర్వక సంభాషణ,
రెండు కప్పుల అవగాహన,
నాలుగు పెద్ద చెంచాల సమయం,
ఒక చిటికెడు అనురాగం,
ఒక చుక్క హాస్యం
అన్నిటినీ రంగరించి యథేచ్ఛగా ఉపయోగించాలి.

"ఒకరికి మంచిదని తోచిన పనిని అందరూ ఆచరించాలని

# హాస్యతోరణం

## ఇంతే తేడా

ఆసారస్వత సభలో తన మిత్రుణ్ణి అవహేళన చేసే అభిప్రాయంతో ఒక రచయిత తన తోటి రచయితని అధ్యక్షుల వారికి పరిచయం చేస్తూ 'వీరు హెన్నప్పగారు! మీ చూపులకి కనిపిస్తున్నంత అవివేకి మాత్రం కారు' అన్నారు



హెన్నప్ప ముఖం పాలిపోయింది అయినా వెంటనే తేరుకుని దెబ్బకు దెబ్బ తీసాడు. 'నిజమేనండీ! నాకూ, నా స్నేహితుడికీ మధ్య ఉన్న ముఖ్యమైన తేడా కూడా ఇదే' అన్నాడు. (అతడు పైకి తెలివైన వాడివలే కనిపించినా అవివేకి అని అర్థం!)

## ముఖ్యమైన దానిని భద్రపరచాను!

ఒకసారి దక్షిణాఫ్రికాలో మహాత్మాగాంధీ ఓడ ప్రయాణం చేస్తున్నారు. గాంధీని విమర్శిస్తూ తాను రాసిన ఒక సుదీర్ఘ రచనను ఒక ఆంగ్లేయుడు ఆయనకు అందించాడు. గాంధీజీ దానిని పైపైన చూసి కాగితాలకు గుచ్చిన గుండు సూదిని మాత్రం పెట్టెలో భద్రం చేసుకున్నారు. ఆ కాగితాల్ని పక్కన పడవేశారు.

'గాంధీ! వాటిని చదవండి! ముఖ్యమైన విషయాలు!' అన్నాడు ఆంగ్లేయుడు.

'మీరు ఏమీ బాధపడకండి! ముఖ్యమైన దానిని ఇప్పటికే భద్రపరచాను' అన్నారు గాంధీ

## నన్ను ఎట్లా తిడుతున్నాడో చూడండి!

సుప్రసిద్ధ నిఘంటుకర్త డాక్టర్ జాన్సన్‌ను ఒక చేపలు పట్టే స్త్రీ దుర్భాషలాడింది. అటువంటి దుర్భాషలను తిరిగి ఆమెపై ప్రయోగించలేకపోయిన జాన్సన్ తీవ్ర స్వరంతో ఇలా

నామవాచకానివి,



"సుఖం అభిలషించే వారు కోరికలను చంపుకోవాలి. అన్ని ;

వ

[illegible]ధానాని, సమ్యక క్రియా విశేషణానివి, వద సముచ్ఛయానివి....'

● మత్స్య భామినికి అక్షరమ్ముక్కరాదు. ఈ మాటలన్నీ కందిరీగల్లాగా గుచ్చుకున్నట్లు ఆమె భావించి ఇలా బయటపడింది. "అమ్మల్లారా! అయ్యల్లారా! అటు చూడండి! ఆ మనిషి నన్ను ఎట్లా తిడుతున్నాడో చూడండి!"

## కీలెరిగి వాత

మార్క్‌ట్వైన్ మిస్సోరి (Missouri) నుంచి పత్రిక తెస్తున్న రోజుల్లో ఒక చందాదారు గా ఇలా వ్రాసాడు. 'నాకు మీ పత్రికలో సాలీడు కనిపించింది. ఇది శుభ శకునమా? సూచకమా?'

'నికి ట్వైన్ ఇచ్చిన జవాబిది: "మా పత్రికలో పురుగు కనిపించడం శుభశకునం అశుభమూ కాదు. నిజానికి సాలీడు పత్రికను పరిశీలిస్తున్నది ఏ వ్యాపారి 'టన ఇవ్వలేదా అని మాత్రమే. అలా 'టనలు ఇవ్వని వ్యాపార సంస్థకు చేరుకుని అడ్డంగా గూడు కట్టుకుని సుఖంగా ం గడుపుకుందామని ఆ సాలీడు దేమో!..."

## వావస్

శ్రావస్తిపురంలో ఒక వ్యక్తి బుద్ధుణ్ణి దూషించాడు. అందుకు ఆయన ఏమీ చలేదు. తరువాత బుద్ధుడు ఇలా అడగడం జరిగింది: 'ఒక వ్యక్తి మరో వ్యక్తికి కానుక ఇవ్వాలనుకున్నాడనుకోండి. ఆ రెండో వ్యక్తి దానిని తీసుకోకపోతే అది ఎవరికి తుంది?'

'ఇందులో ఏముంది? ఇచ్చిన వ్యక్తికే చెందు !' అని తేలిగ్గా ఆ వ్యక్తి జవాబిచ్చాడు.

'నిజమే' అన్నారు బుద్ధుడు.

# నమ్మలేని నిజాలు

## 40 మిలియను మంది జనం మానసిక రోగాలతో బాధపడుతున్నారు

*అభివృద్ధి పొందుతున్న దేశాలలో 40 మిలియను మందికి పైగా జనం కుదర్చని తీవ్రమైన మానసిక రోగాలతో బాధపడుతున్నారు.*

*— 'వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్' సౌజన్యంతో*

## చిరపుంజీలో అత్యధిక వర్షపాతం రికార్డు అయింది



*1861వ సం.లో మేఘాలయా (ఈశాన్య ఇండియా)లో చిరపుంజీలో 'అత్యధికంగా 905 అంగుళాలు (22,987 మి.మీ.లు) వర్షం రికార్డు అయింది.*

## అయస్కాంత వైద్యం

*గజ్జి, ఆస్తమా, నొప్పులు, అనిద్ర వంటి అనేక వ్యాధులను అయస్కాంత చికిత్సతో కుదర్చవచ్చు. అయస్కాంతాలను ఉపయోగించి చికిత్స చేసి వ్యాధులు నివారించడం పశ్చిమ దేశాలలో బాగా ప్రసిద్ధి పొందింది. ఒక అయస్కాంతాన్ని శరీరానికి అనువర్తింపజేసినప్పుడు అయస్కాంత తరంగాలు శరీరంలో సూక్ష్మ ధమన్యా సారల ద్వారా ప్రవేశించి సెకండరీ కరెంటులను ప్రేరేపింపజేస్తాయి. ఈ కరెంట్లు కలిగించే వేడికి నొప్పులు, వాపులు తగ్గుతాయి. హార్మోనుల స్రావం కూడా క్రమబద్ధమవుతుంది.*

"శరీరమే ఆత్మ అనుకునేవారు, జన్మమెత్తుట విషయాలను

# ధర్మో రక్షతి రక్షితః

సి. సుబ్రహ్మణ్యం,
(మహారాష్ట్ర గవర్నర్)

మానవాళికి ఏకైక ఆశాదీపం - భారత సంస్కృతి. చరిత్ర వెలుగు రేకలు విచ్చుకునే నాటికే ఈ సంస్కృతి 'ధర్మం' అనే మహదాశయాన్ని నలుదెనలా ప్రసరింపజేసింది.




మానవ ప్రయత్నం, ఆత్మ నిగ్రహం, ఇంద్రియ నిగ్రహం వంటి ఉదాత్త గుణాలను ఉద్ధరించింది. అహింస, సత్యం, దొంగతనం చేయక పోవడం, జితేంద్రియత్వం, నిష్కామం వంటి మహనీయ విధానాలను అవలంబించింది. మానవ ప్రవర్తన, దృక్పథం ఈ ఆధ్యాత్మిక, నైతిక సూత్రాలకు అనుగుణంగా రూపొంది ఒక లక్ష్య సాధనకు తోడ్పడటం జరిగింది. యుగాల నుండి పరంపరానుగతంగా వచ్చిన ఈ భారతీయ సంస్కృతి సంపద మన జీవితాలను ప్రభావితం చేసి సక్రమ మార్గంలో పెట్టింది.

ఏ మానవ సమాజానికి కూడా విభిన్నంగా కనిపించని ఈ క్రమశిక్షణే ధర్మమనే ఆ మహత్తర ఆశయానికి అనుబంధితమైంది. ఇది లేనినాడు మనిషి మృగంగా మారగలడని భారత వివేక జనుల వాక్కు. 'సంఘం' అనబడే వివిధ మానవుల కలయికకు మూలాధారం ధర్మమే. స్వప్రయోజనాలకు ఇతరులను ఉపయోగించుకునే స్వార్థ పరత్వం నుండి తప్పించి, సేవా దృక్పథం అలవరచి ఉన్నత పథంలోకి నడిపేది ఈ ధర్మమే.

భారతదేశంలో వ్యక్తమైన విశ్వాసం లేకపోవడమే కాక అతడి కార్య కలాపాలు అనుమానాలకు లోనై ప్రజా బాహుళ్యంలో చెడు అభిప్రాయాలను కలిగిస్తున్నాయి. విలువలకు సంబంధించిన ప్రతీ అంశాన్ని మనం ఈ విధంగా కొట్టి పారవేసేందుకు పూనుకున్నాము. ఇటువంటి దుస్థితి రావడం మరణం కన్నా హీనమైనది.

"ఏ గుణముంటే నరుడు నరుడ

## ఆధునిక విజ్ఞానంలో అద్భుతం

### వ్యర్థ ఇంధనం నుంచి నీరు

సామాన్యంగా మూసె బావుల నుండి సహజ వాయువులను లభించ చేసుకోడం లాభదాయకం కాదు. అందుచేత వాటిని మండించేస్తారు. కాని పశ్చిమ జర్మనీలో ఒక ఫర్మ్ ఈ వ్యర్థ ఇంధనం నీరును లభింపజేసుకునే విధానాన్ని కనిపెట్టారు. వాయువులో గల గంధకాన్ని పూర్తిగా తీసివేసి వాయువుని మండిస్తారు. ఈ మ. వాయువులు ఘనీభవించినప్పుడు పరిశు. నీరు ఏర్పడుతుంది. సుమారు 90 శాతం మి. ఉన్న ఒక కిలోగ్రాం సహజ వాయువు కిలో గ్రాముల నీటిని ఇవ్వగలదు. వాయువు దహనచర్య వల్ల ఉత్పన్నమయ్యే ఉష్ణాన్ని స్థానికంగా విద్యుత్తు సరఫరాకి వినియోగించవచ్చు. ఒక కిలోగ్రాం వాయువు 13 Kwh విద్యుత్తుని ఇస్తుంది.

ఆలోచన ద్వారా మానవుడు అభివృద్ధి చెందుతాడు. అన్ని ఆధునిక సంస్కృతులు విస్తృత శాస్త్రీయ, సాంఘిక, రాజకీయ ఆలోచనా ధోరణులలో ఉద్భవించినవే. కొద్దిగా మాట్లాడు, ఎక్కువగా ఆలోచించు, ఎక్కువగా పనిచెయ్యి - ఇవే ప్రజా జీవితంలో ఆదర్శాలు కావాలి. కొద్దిగా మాట్లాడటం ద్వారా మనం ఆలోచనలలో, కార్యకలాపాల నిర్వహణలో ఉత్తేజం పొందుతాము దురదృష్టవశాత్తు మనం ఈనాటి ప్రజాజీవితంలో దీనికి పూర్తిగా విరుద్ధమైన పరిస్థితిని చూస్తున్నాము.

మన పరిపాలనా రంగాన్ని పటిష్ఠ పరచి ప్రజలకు కావలసిన ఆర్థిక పుష్టి, విద్య, సాంఘికాభివృద్ధి, ఉన్నత సంస్కారం ఇవ్వవలసి ఉంది స్వప్రయోజనాల కన్నా దేశసేవకు మనం అంకితం కావలసి ఉంది ఈ ప్రజాసేవా స్ఫూర్తి నేడు మన సమాజంలో అంతగా కనిపించడం లేదు.

ప్రజా సేవారంగంలో ఉన్నవారంతా నిజమైన యోగులవలే సమాజానికి ఉత్పత్తి కేంద్రాలుగా తయారుకావాలి ఈ అభివృద్ధిలో "నాణ్యత" ఈనాడు ఎంతో ముఖ్యం ఇది బడి చదువుల వల్ల కాక నిజమైన విద్య నేర్చుకుంటేనే వస్తుంది

'స్వప్రయోజనం కన్నా సేవా కాంక్ష ముఖ్యం' అనే ఆదర్శం రాజకీయ, సాంఘిక, సేవా రంగాలలో పనిచేసే ప్రతి కార్యకర్తకు వర్తిస్తుంది. స్వాతంత్ర్య పోరాట దినాల్లోని త్యాగ బుద్ధి, సేవాదృష్టి, ఆత్మ సంయమనం నేడు మృగ్యమయ్యాయి. వాటి స్థానాల్లోకి వచ్చిన పదవీ కాంక్ష, లాభదృష్టి, విలాస జీవితం - ఇవే రాజకీయ నాయకులను ముందుకు నడుపుతున్నాయి దేశంలోని రాజకీయ శక్తులను పునరుజ్జీవింపచేసే ముందు ఈ విషయాలను గురించి అత్యంత శ్రద్ధ తీసుకోవడం అవసరం.

పార్లమెంటరీ ప్రభుత్వ విధానంలో మంత్రుల అధికార పరిమితుల్ని తగ్గించాలని గట్టిగా చెబుతూ రాజాజీ మంత్రులు విధాన నిర్ణయాలు చేసేందుకు మాత్రమే పూనుకోవాలని వీటి అమలు బాధ్యత, పరిపాలన యావత్తూ సివిల్ సర్వీస్ అధికారులకే అప్పగించాలన్నారు. మంత్రులు నిత్య పరిపాలనా వ్యవహారాలలో అనుచిత జోక్యం చేసుకున్నట్లయితే అధికారులక్కు పాలనారంగంపై ఆసక్తి సన్నగిల్లుతుంది.

## మీరు జీవితంలో శ్రేష్ఠతను పొందగలుగుతున్నారా?



మనం ఎక్కడ ఉన్నా, ఏ మూల ఏ సందులో ఉన్నా పిల్లలను, పెద్దలను, స్త్రీలను మీరు జీవితంలో శ్రేష్ఠతను పొందగలుగుతున్నారా అనేది ప్రభుత్వం అడగవలసిన ప్రశ్న నీవు చేస్తున్న పని, నీవు ఆలోచించే యోచనలు, సమాజం లేక సాంఘిక బాంధవ్యం, నీవు జీవించే జీవితం శ్రేష్ఠతతో కూడి ఉందా? దానికోసం ప్రయత్నం చేస్తున్నావా? సమాజ సంక్షేమాన్ని ధ్యేయంగా పెట్టుకుని ఎప్పుడూ మంచినే చేయాలనే ఉద్దేశం ఉండాలి. ఇదే మానవుని పరమధ్యేయంగా ఉండాలి

— స్వామి రంగనాథానంద

ఐశ్వర్యం చేత, విద్య చేత ...డు వానిలో తక్కువ

అవినీతి మార్గాలు తొక్కేందుకు మంత్రులకు, అధికారులకు ఎన్నెన్నో అవకాశాలు వస్తాయి. తమకు విచక్షణాధికారాలు ఉన్నప్పటికీ అధికార వర్గం మంత్రుల ఇష్టానిష్టాలను బట్టి నడుచు కోవలసి వస్తుంది.

అశోక చక్రవర్తి కాలం నుండి తరువాత రాజుల కాలం వరకు మన నాగరికత మత సామరస్యం నేర్పింది. అయితే ఇటీవలి కాలంలో కొన్ని శక్తులు ఈ ప్రాథమిక సూత్రాన్ని త్రోసిపుచ్చి మతం పేరిట కలహాలు, హింసాకాండ, కుల విభేదాలు రెచ్చ గొట్టడం ఎంతో దురదృష్ట కరం! కులతత్త్వం, మతోన్మాదం, ప్రాంతీయ తత్త్వం మన సమాజపు కూకటి వ్రేళ్లను కూల్చి వేస్తున్నాయి. మన నాగరికత చెప్పిన ఉపదేశాలను స్వీకరించకుండా కొన్ని అవాంఛనీయ శక్తులు భిన్నత్వంలోని ఏకత్వానికి గండి కొట్టడం ఎంత శోచనీయం! ఈ పరిస్థితిని చక్క దుకు ఇంకా ఆలస్యం కాలేదు.

క్రమబద్ధమైన రాజకీయ అభివృద్ధి సాధించేందుకు ధర్మాచరణతో ముడిపడిన గాంధీజీ నైతిక సూత్రాలను మన రాజకీయ పక్షాలు, నాయకులు అవలంబించి అమలు జరపాలి.

వర్తమాన ప్రపంచంలో మారుతున్న పరి స్థితులకు అనుగుణంగా, ప్రాచీన ధర్మ సిద్ధాంతాల ప్రాతి పదిక మీద నడుస్తూ మన జాతి మళ్లీ వికాసం చెందుతుందా? సమాజ కల్యాణానికి దోహదం చేసే విధంగా నేటి రాజకీయ రంగం ఒక ఉదాత్త వృత్తిగా రూపు దిద్దుకుని ఉన్నత లక్ష్యాలను సాధించుగాక!

(— రాజాజీ స్మారకోపన్యాసం నుండి)

— 'వేక్ అప్ ఇండియా' సౌజన్యంతో

## "హంబగ్"

ఛార్లెస్ డార్విన్ ఒకసారి గ్రామంలో ఒక స్నేహి తుడిని సందర్శించడానికి వెళ్ళినప్పుడు ఆ ఇంట్లో ఇద్దరు పిల్లలు సుప్రసిద్ధ వైజ్ఞానికవేత్తను ఎగతాళి




వేయదలచుకున్నారు వాళ్లు ఒక సీతాకోకచిలుకను, గొల్లభామను, ఒక పేడపురుగును, ఒక జెర్రిని పట్టుకున్నారు జెర్రి శరీరానికి సీతాకోకచిలుక రెక్కలు, గొల్లభామ కాళ్లు, పేడ పురుగుల తల అంటించారు. దానిని జాగ్రత్తగా తీసుకువచ్చి డార్విన్‌కి ఇచ్చి అది ఏ ప్రాణి? అని గుర్తించమన్నారు డార్విన్ బగ్‌వైపు ఒకసారి చూసి పిల్లలతో 'మీరు దీనిని పట్టుకున్నప్పుడు ఏదైనా జోరుమని హమ్మింగ్ శబ్దం చేసిందా' అని అడిగాడు పిల్లలు అవు నన్నారు 'అయితే ఇది హంబగ్' అన్నాడు.

## హరిత గృహ ప్రభావం

వాతావరణ ప్రమాణాలలో ఉష్ణోగ్రత పెరుగుదలను హరిత గృహ ప్రభావం (Greenhouse effect) అంటారు ఇది వర్షపాతంలోను మరియు గాలి ప్రసార విధానాలలోను మార్పులు కలిగిస్తుంది. దీని ప్రభావం వల్ల భారతదేశం తూర్పు భాగాలలో నిరంతరం వరదలు ఏర్పడుతున్నాయి.

రాష్మీ మయూర్, ఎన్విరానమెంటలిస్ట్

1893, 1895లలో అతడు మానవ ప్రయాణానికి ఉపయోగించే శక్తివంతమైన రెండు విమానాల వంటి ఆర్నితాప్టర్స్ (Orinthopters) అనే చోదక పరికరాలను నిర్మించాడు. అయితే 1896లో అతడు గ్లైడర్ ప్రమాదంలో మృత్యువాతపడ్డాడు. పైలెట్ పొరపాటువల్ల జరిగిన మొట్టమొదటి ప్రమాదం ఇదే. ఆయన వ్రాసిన 'విమాన యానానికి ఆధారం పక్షి పయనం' అనే గ్రంథం విమాన యానానికి బైబిల్ వంటిది 'త్యాగాలు చేయక తప్పదు' అనేవి ఆయన తుది పలుకులు


Wright airplane, 1908

లిలియన్‌తాల్ మరణం తరువాత 29 ఏళ్ళ విల్బర్ రైట్‌లో విమానయానం పట్ల ఆసక్తి కలిగింది. ఇతడు తన తమ్ముడు ఆర్విల్ రైట్‌తో కలిసి అమెరికా ఓహియోలోని డేటన్‌లో బైసికిళ్ళ నిర్మాణం చేసేవాడు. ఈ అన్నదమ్ములు విమానయానం గురించిన పుస్తకాలన్నీ క్షుణ్ణంగా చదివారు. 1899లో గాలిపటం లేదా గద్ద ఆకారంలో ఉండే ఒక విమానాన్ని తయారుచేసి పరిశోధనలు ప్రారంభించారు. దీని రెక్కలు వంగి ఉన్నాయి. ఇదే మొట్టమొదటి భారీ విమానం అని చెప్పవచ్చు. సమతల ప్రదేశాలలోని గాలి ఒత్తిడి వల్ల ఇది సాగిపోయేది.

తరువాత రైట్ సోదరులు పూర్తి స్థాయి గ్లైడర్లతో పరీక్షలు ప్రారంభించారు. ఒక గద్ద లేదా గాలిపటం ఆధునిక విమానయానానికి పితామహి అని చెప్పాలి. అమెరికా వాతావరణ శాఖ వారి సమాచారం ప్రకారం రైట్ సోదరులు పెనుగాలులు వీచే ప్రదేశాన్ని ఎన్నుకొని




1900లో ఉత్తర కరోలినాలోని కిట్టీ హాక్‌లో తమ విమానయానాన్ని ప్రారంభించారు.

## సుభాషితాలు

*మాటలాడు టొకటి మనసులో నొక్కటి*
*ఒడలి గుణ మదొకటి నడత యొకటి*
*ఎట్లు కలుగు ముక్తి యిట్టులుంచగ తాను*
*విశ్వదాభిరామ వినురవేమ!*

*[దుర్జనులు చెప్పునదొకటి, చేయునదొకటి. మనస్సులో ఒకటి, నడతలో ఒకటి. ఇట్టి నీచులకు ముక్తి ఎట్లబ్బును?]*

* * *

*ఎఱుక లేని దొరల నెన్నాళ్లు కొలిచిన*
*బ్రదుకు లేదు వట్టి భ్రాంతి కాని.*
*గొడ్డు టావు పాలు కోరిన చేపునా?*
*విశ్వదాభిరామ వినురవేమ!*

*[మూర్ఖులగు ప్రభువుల నెన్నాళ్లు సేవించినను ఆ సేవ నిష్ఫలం. గొడ్డు టావును పిదికిన పాలు లభింపవు గదా!]*

"సొకులు చెప్పడం ఘోరాతిఘోరం, అసత్యాన్ని కప్పి పుచ్చేది సొకు."

మూడు గ్లైడర్లను తయారు చేసారు. ఇవి ప్రాథమిక అవ  తట్టుకోగలవని పరీక్ష చేసి సంతృప్తి పడ్డారు. దీని తరువాతే వారు




'ఫ్లయర్ 1' అనే విద్యుత్ వాహక వ్యోమ యంత్రాన్ని తయారుచేసారు. 1903 డిసెంబర్ 17న ఆర్విల్ మొట్టమొదటిసారిగా ఒక క్రమబద్ధమైన విమానయానాన్ని చేసాడు. విమానం - అనేదాన్ని రైట్ సోదరులు వాస్తవ రూపంలోకి తెచ్చారు.




విమానమనేది ఎగిరే యంత్రం. గాలి కంటే బరువుగా ఉండి రెక్కలు కలిగి ఉంటుంది. విమానం పయనించేటప్పుడు నాలుగుశక్తులు ఒకేసారి పని చేస్తాయి. బరువు, లిఫ్ట్ (పైకెత్తడం), తోపు లేక పోటు, లాగడం లేక ఈడ్చటం అనే ఈ నాలుగు అంశాలలో బరువు విమానాన్ని గురుత్వాకర్షణ శక్తి వల్ల క్రిందికి లాగుతూంటుంది. లిఫ్ట్ విమానాన్ని పైకి లేపుతుంది. విమానం రెక్కలు గాలిని చీల్చుతూ ఈ పనికి సహాయపడతాయి. ఈ తోపులాటలో విమానం వెనుకకూ, ప్రొపెల్లర్ విధానం వల్ల మళ్ళీ విమానం ముందుకు రావడం జరుగుతుంది.

రెండు కారణాల వల్ల విమానం కుదుపు లేకుండా పయనిస్తుంది: ఇంజన్ల నుండి కావలసిన తోపిడి, రెక్కల శక్తి వల్ల గురుత్వాకర్షణ శక్తిని అదుపులోకి తేవడం.

## స్టాంపుల కథ

### చరిత్ర కాలానికి ముందు పెయింటింగు

*దక్షిణ ఆఫ్రికా గుహలలోను, రాతి ఆశ్రయాల లోను అనేక వేల రాతి పెయింటింగులు ఉన్నాయి*

RSA 30c

*ఈ పెయింటింగులు అన్నీ శిలాయుగపు కాలంలో ప్రజల జీవితాన్ని, సంస్కృతిని చాటుతున్నాయి. పైన చూపబడిన దక్షిణ ఆఫ్రికా స్టాంప్ బుష్మెన్ వేట జీవితాన్ని ప్రతిబింబిస్తోంది. వీరు విలాసంగా ఒకచోట కూడి నృత్యం చేస్తూంటారు. ఈ నృత్యంలో అందరూ స్త్రీలే, వారందరి మధ్య డోలును పట్టుకున్న వ్యక్తి తప్ప. దీనికొక సామాజిక లక్షణం ఉండి ఉండవచ్చు.*

— *కవితా రాయ్*

'వ్రాసి సంతకం పెట్టలేని దానిని నోటితో చెప్పకు''

విమానంలో మూడు ప్రధాన భాగాలు రెక్కలు, అంతర్భాగం, చివరిభాగం. ఫ్యూజ్‌లేజ్ అనే పాసింజర్ల విభాగం, పైలట్ కాక్‌పిట్, రడ్డర్ (చుక్కాని) అనే టెయిల్ అసెంబ్లీలోని ఊర్ధ్వ భాగం ఇవన్నీ విమానంలో అమర్చబడ్డాయి.


DE HAVILLANDOTTER

టెయిల్ అసెంబ్లీలో మరో భాగం ఎలివేటర్. ఇవన్నీ కాక్‌పిట్‌లో ఉన్న పైలట్ కంట్రోల్‌లో ఉంటాయి

గాలి వత్తిడితో రెక్కలు విమానాన్ని ఆకాశ వీధుల్లోకి లేవనెత్తుతాయి విమానపు రెక్కల


Frank Whittle (wartime pose)

అంచులు విమానం దిగేటప్పుడు, వెళ్లేటప్పుడు స్పీడ్‌ను కంట్రోల్ చేస్తాయి. రెక్కల మీద ఎలిరాన్స్ (Ailerons) విమానం ప్రక్కకు తిరిగేందుకు తోడ్పడతాయి!

విమానాన్ని ఒడిదుడుకులు లేకుండా నిలుపుతుంది. పైలట్ చుక్కాని త్రిప్పి విమానాన్ని కుడివైపుకుగానీ, ఎడమప్రక్కకు గానీ మళ్లించుకోవచ్చు. విమానపు తోకభాగంలో ఉండే యంత్రాలను ఎలివేటర్లు అంటారు. వీటిని స్టెబిలైజర్లతో అనుసంధించారు. పైలట్ ఆదేశాల ప్రకారం ఈ ఎలివేటర్లు విమానాన్ని పైకిగానీ, క్రిందికి గానీ తీసుకుపోతాయి. కేవలం ఎలివేటర్లు, ఎలిరాన్స్ కదుపుతూ పైలట్ విమానాన్ని భద్రంగా నడుపుతాడు


Frank Whittle

మొదటి ప్రపంచ యుద్ధానికి ముందుగా అమెరికాలో ప్రప్రథమ ప్రపంచ వాణిజ్య విమాన సర్వీస్ ప్రారంభించారు. 1914 జనవరి 1 నుంచీ ఏప్రిల్ 14 వరకు సెయింట్ పీటర్స్‌బర్గ్ నుంచి ఫ్లోరిడాలోని టంపా వరకు ఒక విమానాన్ని నడిపారు 1918లో సంఘర్షణలు సమసి పోగానే పౌర విమానయానం ప్రారంభించారు. "ఏ అభివృద్ధి అయినా అవసరాన్ని బట్టే ఉంటుంది" అనే సూక్తి యుద్ధ సమయంలో బాగా అనుభవంలోకి వస్తుంది. శాంతి సమయాల్లో కాకుండా యుద్ధ సమయాల్లోనే విమానాల అభివృద్ధి జోరుగా సాగింది.

ప్రథమ, ద్వితీయ ప్రపంచయుద్ధాల మధ్య

"పండ్లతో నిండిన వృక్షం ఎప్పుడూ వంగే ఉంటుంది."

ఎయిర్‌క్రాఫ్ట్ ఇంజన్‌ను బ్రిటన్, తయారుచేసాయి. 1930లో సర్ ఫ్రాంక్ విటిల్ తయారుచేసిన ఈ జెట్ ఇంజన్ గాస్ టర్బైన్‌తో వేడి గాస్‌ను ఉత్పత్తి చేసి విమానాన్ని నడిపే ప్రక్రియతో పని చేసింది.



Concorde

1952లో బ్రిటన్‌కు చెందిన డి హవిల్లాండ్ కామెట్ చేసిన ప్రయాణం ఒక ఖరీదైన విధ్వంసంగా అభివర్ణిస్తారు. 1958లో మీడియం రేంజ్ మార్గాలలో పయనించేందుకు ప్రవేశపెట్టిన ఫ్రెంచ్ కారవెల్లీ విమానం అఖండ విజయం



Boeing 747

సాధించింది ఇటీవలి సంవత్సరాలలో జుంబో జెట్, 1970లో అమెరికన్ ఎయిర్‌లైనర్ బోయింగ్ 747, 1969లో సూపర్‌సోనిక్ ఎయిర్‌లైనర్ కంకార్డ్ విమాన ప్రయాణీకుల సౌకర్యార్థం ఏర్పడిన అభివృద్ధులు జుంబో జెట్ యం కొద్ది ఫ్లయిట్స్‌లో ఎక్కువమంది ప్రయాణీకుల్ని చేరవేయడం. తద్వారా ఇంధనం వాడకంలో పొదుపు, వాతావరణ కాలుష్యం తగ్గింపు, గగన వీధిలో రద్దీ తగ్గింపు అమలు చేయడం. బోయింగ్ 747 63 అడుగులు ఎత్తు ఉంటుంది. 6 అంతస్తుల భవంతిని గుర్తుకు తెస్తుంది. దానిలో 490 మంది ప్రయాణం చేయవచ్చు. అంటే ఒక చిన్న గ్రామ జనాభాతో సమానం అన్నమాట.

ప్రస్తుతం బోయింగ్ 600 ప్రయాణీకులు పయనించే విమానం నిర్మిస్తూంది పసిఫిక్ మహాసముద్రాన్ని ఒక్క ట్రిప్‌లోనే దాటే విధంగా 1 000 సీట్లు గల 'సూపర్ జుంబో నిర్మాణం కూడా తలపెట్టింది. జుంబో మాదిరిగా కాకుండా ఆంగ్లో ఫ్రెంచ్ కంకార్డ్ వారి సూపర్ సోనిక్ ఎయిర్‌లైనర్ కొద్దిమంది ప్రయాణీకుల్ని బహుదూర ప్రాంతాలకు అత్యంత వేగంతో తీసుకువెళ్లే ప్రయత్నాలు జరుపుతూంది. దీని వేగం శబ్దవేగం కంటే రెట్టింపు ఉంటుంది

## యుగయుగాల నుంచి సబ్బు

*పశ్చిమ ఆసియాలో నేటి ఇరాన్ మరియు ఇరాక్ ప్రదేశాలలో సుమారు 2500 బిసిలో సుమేరియనులు ఒక రకం మోటురకం సబ్బును తయారుచేసి వాడుకునేవారు ఆ కాలంలో మేక క్రొవ్వు, కొయ్యబూడిద కలిపి సబ్బు తయారు చేసుకునేవారు కానీ AD రెండవ శతాబ్దంలోనే బట్టలు ఉతుక్కోడానికి, శరీరం శుభ్రం చేసుకోడానికి సబ్బు ఉపయోగాన్ని తెలుసుకున్నారు సుమారు 130 నుంచి 200 AD మధ్య సబ్బును శరీరం శుభ్రం చేసుకోడానికి ఉపయోగించేవారని సుప్రసిద్ధ వైద్య విజ్ఞానవేత్త గేలన్ (Galen) పేర్కొన్నాడు రోమన్ సామ్రాజ్యపు కాలంలో సబ్బు చాలా ప్రసిద్ధిలోకి వచ్చింది క్రమక్రమంగా అనేక ఇతర దేశాలకు పాకిపోయింది*

—'బిజినెస్ ఇండియా' సౌజన్యంతో

"గుణాలను దోషాలుగా ఎత్తిచూపడం అసూయ."

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1 ఈ క్రింది భారతదేశపు ఉపరాష్ట్రపతుల్లో ఎవరు రాష్ట్రపతి కాలేకపోయారు?
(ఎ) జకీర్ హుస్సేన్, (బి) ఎస్ రాధాకృష్ణన్, (సి) జి ఎస్ పథక్, (డి) బి డి జెట్టి

2 చంద్రుని పరిభ్రమణకాలం ఎంత?
(ఎ) 26 50, (బి) 29 50, (సి) 28 50, (డి) 27 32



3 'యాజ్ యు లైక్ ఇట్' రచయిత
(ఎ) షేక్స్పియర్, (బి) మాక్సిమ్ గోర్కీ, (సి) చార్లెస్ డికెన్స్, (డి) వాల్టర్ స్కాట్

4 రాకేష్ శర్మ ఎలా ప్రముఖుడయ్యాడంటే
(ఎ) రష్యన్‌లతో వ్యోమయానం చేయటం ద్వారా, (బి) మౌంట్ ఎవరెస్ట్ అధిరోహించటం ద్వారా, (సి) అంటార్కిటికా సాహస యాత్రకు నాయకత్వం వహించడం ద్వారా, (డి) ఇంగ్లీష్ ఛానల్ ఈదటం ద్వారా

5 ఇండియాలో తయారైన మారుతి కార్లను మొదటిసారిగా కొనుగోలు చేసిన విదేశం
(ఎ) ఇంగ్లండ్, (బి) డెన్మార్క్, (సి) హంగేరీ, (డి) స్పెయిన్, (ఇ) బెల్జియం

6 ఈ క్రింది వాటిలో దేనికి "ధన్వంతరీ అవార్డులు" ఇస్తారు?
(ఎ) సైన్స్ అండ్ టెక్నాలజీ, (బి) సాహిత్యం, (సి) క్రీడలు, (డి) వైద్యం, (ఇ) ఆర్థిక రంగం

## మన శరీరంలో

రక్త ప్రసార విధానం

* మనిషి ముష్టి (clenched fist) కంటే పెద్దదిగా ఉండని హృదయం రోజుకి సగటున 1500 గాలనుల రక్తాన్ని పంపుచేస్తుంది

* పెరిగిన సగటు మనిషి బ్లడ్ ప్రెషర్ 120/80 ఉంటుంది మొదటి సంఖ్య హృదయం సంకోచించినప్పుడు ప్రెషర్‌ను తెలియజేస్తుంది రెండవ సంఖ్య రెండు సంకోచాల మధ్య హృదయం విరామావస్థలో ప్రెషరును తెలియజేస్తుంది

* శరీరంలో మిక్కిలి పెద్ద ధమని అయోర్టా (aorta) తోటలో ఉపయోగించే గార్డెన్ హోస్ సైజులో ఉంటుంది చిన్న నాళాలు, కెపిలరీలు అతి సన్నగా ఉంటాయి రక్త కణాలు వీటిలో ఒకదాని వెనుక ఒకటి కదులుతూంటుంది

* ప్రతి నిమిషం ఒక క్వార్ట్ రక్తం మెదడు ద్వారా ప్రవహిస్తుంది

* శరీరంలో ఆరు క్వార్ట్‌ల కంటే కొంచెం ఎక్కువగా రక్తం ఉంటుంది

* స్త్రీ శరీరంలో ఎర్రరక్త కణాలు సుమారు 109 రోజులు జీవిస్తాయి పురుషుడివి సరాసరి 11 రోజులు అధికంగా జీవిస్తాయి

* శరీరంలో రక్తనాళాలు ఈ చివర నుంచి ఆ చివర దాకా వరుసగా పెడితే దాంతో భూగోళాన్ని రెండుసార్లు చుట్టవచ్చు

— 'ఈస్ట్ వెస్ట్ సీరీస్' సౌజన్యంతో

"చెత్త పనులే తప్ప మంచిపనులు చేయడం అలవాటు లేని

7. ఎముకలలోని ప్రధాన రసాయనిక భాగం (ఎ) మెగ్నీషియం, (బి) కాల్షియం, (సి) ఫాస్ఫరస్, (డి) పొటాషియం
8 అమృతసర్, లాహోర్‌ల మధ్య ఇండియా వైపునగల సరిహద్దు పట్టణం (ఎ) శ్రీ గంగానగర్, (బి) సర్దార్‌గర్, (సి) ముకెరియన్, (డి) కథువా

## మాటల మహిమ:

1 నల్లనయ్య (ఎ) కృష్ణుడు, (బి) కలువపూవు, (సి) విష్ణుమూర్తి, (డి) రాక్షసుడు
2 ధన్యుడు (ఎ) శ్లాఘ్యుడు, (బి) సుఖము కలవాడు, (సి) అదృష్టవంతుడు, (డి) కృతార్థుడు
3 నిమజ్జనము (ఎ) మునుగుట, (బి) లీనమగుట, (సి) నిద్రించుట, (డి) అణగుట
4 నెలవంక (ఎ) బాలచంద్రుడు, (బి) మన్మథుడు (సి) నేరేడు చెట్టు, (డి) వచ్చుకర్పూరం
5 శతమానము (ఎ) వలమెత్తు వెండి, (బి) తూము, (సి) మంగళ సూత్రము (డి) నూరు
6 విహారు (ఎ) అందము, (బి) విహారము, (సి) వేట, (డి) సంచారము
7 సంధ్యారాగము (ఎ) సింధూరము, (బి) సంజకెంజాయ, (సి) సాయంకాలము, (డి) మెఱపు
8 హాలాహలము (ఎ) విషపేధము, (బి) ఒళ్లి, (సి) నాగలి, (డి) నల్లకంఠ పాము

## తెలివికి పరీక్ష

1 రణగొణ ధ్వనులకు దూరంగా, మస్తిష్క విన్యాసాలకు దూరంగా, ప్రపంచ యుద్ధాలకు దూరంగా, తప్పులకు, ఒప్పులకు దూరంగా స్వచ్ఛశీతలంగా శాంతి ధామంగా, పెంగ్విన్ పక్షులకు మాత్రం నివాసంగా, శాస్త్రజ్ఞులకు అభేద్యంగా ఉన్న స్థలం ఇది (ఎ) కాశ్మీర్, (బి) స్విట్జర్లాండ్, (సి) లక్ష దీవులు, (డి) అంటార్కిటికా
2 మహాభారతం అసలు పేరు చెప్పండి? (ఎ) బృహత్ కథ, (బి) సహస్ర సంహిత, (సి) జయసంహిత, (డి) రాజతరంగిణి
3 ఇటీవలి కుంభకోణాల్లో మన దేశంలోని కొన్ని సంస్థలు, వ్యక్తుల పేర్లు పదేపదే వినవస్తున్నాయి మరి స్టాక్ ఎక్స్ఛేంజ్ ప్రధాన వ్యాపార కేంద్రం 'వాల్‌స్ట్రీట్' ఏ దేశంలో ఉందో చెప్పగలరా?
4 'జయ జయ జయ ప్రియభారత జనయిత్రీ దివ్యధాత్రి' అనే అద్భుత గీత రచయిత ఎవరు?
5 మట్టి, శంకర్, లక్ష్మణ్, సుధీర్‌ధర్ - మీకు తెలిసిన పేర్లే - వీరందరి ఉమ్మడి వ్యావృత్తి ఏది? (ఎ) వాద్య సంగీతం, (బి) సినిమా దర్శకత్వం, (సి) కార్టూన్స్ వేయడం, (డి) ఇవేవీ కావు
6 'నా రాజకీయ గురువు' అని గాంధీజీ చెప్పుకున్న వ్యక్తి ఎవరు?

(జవాబులకు ప పేజీ చూడండి)

## ఒక కిలోగ్రాం తడిలేని విషం



సాధారణంగా అనేక దేశాల్లో విషం ముఖ్యంగా అనేక మందులు తయారుచేస్తారు. ఒక కిలోగ్రాం తడిలేని పాము విషం ఉత్పత్తి చేయడానికి 10 000 పైన పైగా పాములు అవసరం ఉంటుంది

"...లో ఉండే సౌందర్యాలు ఏ వస్తువు

# ఆరాధనా మందిరాలా? ఆరోగ్య కేంద్రాలా?

ఎస్.పి పద్మనాభన్

హిందూ దేవాలయాలు ధార్మిక చింతనకు, మతతత్వ ప్రచారానికి మాత్రమే ఉపయోగ పడతాయని మనలో చాలామంది అభిప్రాయం. దీనిని గురించి విశ్లేషిస్తే దేవాలయ నిర్మాణ విధానం, దాని నిర్మాణానికి ఉపయోగించిన సామాన్లు పరికిస్తే మనకు మరో దృక్కోణం గోచరిసుంది


Hindu temple

మొదటగా మనం విఘ్నేశ్వరుని ముందు గుంజిళ్లు తీస్తాము ఇది వ్యాయామశాలలో తీసే బస్కీలు లేదా ఇంకా వాటికంటే ఎక్కువే అని చెప్పవచ్చు

రెండో విషయం దేవాలయ ప్రాకారం గ్రానైట్ (నల్లరాళ్ల)తో తాపడం చేస్తారు మనం ఆ రాళ్ళ మీద వట్టికాళ్లతో నడుస్తాము ఈ నాపరాళ్ల పై నున్న సన్నని రంధ్రాల మీద మన అరికాళ్ల ఒత్తిడి పడుతుంది మన అరికాళ్లలో ఎన్నో నరాల కూడళ్లు ఉన్నాయి ఒక ప్రత్యేకస్థానంలో ఒత్తిడి కలిగితే దానికి సంబంధించిన అవయవం కదలబారి సక్రమంగా పని చేయడం ప్రారంభిస్తుంది ఇలా మన శరీరంలోని ప్రతీ అవయవం ఒత్తిడికి లోనై సమర్థవంతంగా పని చేయటం జరుగుతుంది. దీనిని భారతీయ వైద్య విధానంలో 'అక్యుప్రెషర్' అని పిలుస్తున్నారు.

దేవాలయ ప్రాకారంలో గురుముద్రలో చెట్టు క్రింద కూర్చుని ఉన్న దక్షిణామూర్తి విగ్రహం కనిపిస్తుంది. మనం ఆ మూర్తి ఎదుట కూర్చుని జపం చేసుకోవాలనేది సంప్రదాయం ఆయన దక్షిణాభిముఖంగా ఉన్నందువల్ల మనం కూర్చున్నప్పుడు ఉత్తర ముఖంగా ఉండి ధ్యానం చేస్తాము. దీని ఫలితంగా ఉత్తర దిశలోని అయస్కాంత శక్తి ప్రభావానికిలోనై రక్తప్రసరణ సక్రమంగా

## అంచనాకట్టి నిర్ణయించు కోవడం మంచిది

*అంచనాకట్టి నిర్ణయించుకోవడం నీకెంతో లాభకరం! నీకు పరాజయం కలిగించేది సంఘటనలు కావు 'పరాజయ భయమే' నీకు అపకారం చేస్తుంది*

*ఏదైనా చేయడానికి ముందు ఆలోచించకుండా తీసుకున్న నిర్ణయానికి, అంచనా కట్టుకున్న నిర్ణయానికి గల భేదం తెలుసుకోవాలి పందెం కట్టడం, జూదం ఆడడం ఆలోచించకుండా చేసే నిర్ణయాలు.*

*ప్రతీ ఆలోచించని నిర్ణయానికి నిరుపయోగం అనే భావన ఉంటుంది లేకపోతే ఒక విధమైన ఆవేశం ఉంటుంది*

*కష్టపడి సంపాదించుకున్న డబ్బునుగాని ప్రత్యేకంగా ఒకదాని కోసం దాచుకున్న సొమ్మునుగాని యోచించకుండా ఖర్చు చేయడానికి పూనుకోడం, ప్రమాదకరమైన ఆటలలో పాల్గొనడం మొదలైనవి ఆలోచించకుండా చేసే నిర్ణయాలు*

*—కె.ఎస్ వెంకటరామన్ 'హిప్నాటిక్' సౌజన్యంతో*

జరిగి, నెప్పులు, బాధల నుండి విముక్తి పొంది మానసిక శాంతి లభిస్తుంది ఇలా ఈ స్వయం ప్రవర్తక అయస్కాంత చికిత్స మనకు అందు బాటులోకి వస్తుంది


(Shiva)

ప్రతీ శివాలయంలో ఔషధశక్తిగల ఏదో ఒక చెట్టు ఉంటుంది మనం అక్కడ కూర్చుని ధ్యానం చేస్తున్నప్పుడు ఈ చెట్ల నుంచి వచ్చే గాలి మన శరీరాన్ని స్పృశించి మనలో ఉన్న క్రిముల్ని నశింపజేస్తాయి మన ఊపిరి తిత్తుల్ని శుభ్రపరుస్తాయి అపరిశుభ్ర పదార్థాలను, ఇతర లోపాలను తొలగిస్తాయి ఒక దృష్టాంతంగా చెప్పదగిన ప్రకృతి వైద్యం ఇది

మనం ప్రాకారంలో కనీసం మూడుసార్లు ప్రదక్షిణం చేసినందువల్ల (నడక) ఒకరకం వ్యాయామం చేసినట్లే నడక మన శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచుతుంది ఇది సామాన్యంగా వాడుకలో ఉన్న దినవారీ వ్యాయామం క్రింద ఉదహరించవచ్చు

ప్రధాన దైవ విగ్రహాల సన్నిధిలో నిలబడి నప్పుడు, నిపుణుల చేత ఎంపిక చేయబడి సుదూర పర్వత ప్రాంతాల నుండి తెచ్చిన ప్రత్యేక రాళ్లతో నిర్మాణమైన ఈ విగ్రహాల నుండి వెలువడే కాంతికిరణ ప్రసారంలో మనం మునకలువేస్తాము ఈ శిలలు సూర్య చంద్రులు, వరుణ వాయువులు, సర్వ జగత్తు ప్రభావానికి లోనై అపరిమితశక్తి కలిగి ఖనిజాలు, విద్యుత్ మరియు ఇతర అపూర్వ గుణాలు కలిగి ఉంటాయి ఈ విగ్రహాల ఎదుట మనం నిలుచున్నప్పుడు మన శరీరం, మనస్సు పునరు జ్జీవనం పొందినట్లు భావిస్తాము అందువల్లనే మనం విగ్రహాల ముందు కనీసం నడుముభాగం వరకైనా వివస్త్రంగా నిలబడాలని చెప్పటం జరుగుతున్నది ఈ విధానం ఇప్పుడు కేరళ దేవాలయాల్లోనూ, తమిళనాడులోని కొన్ని దేవాలయాల్లోనూ అమలు జరుగుతున్నది

ఆఖరిగా మనం 'నమస్కారం' చేసే పద్ధతి కూడా వ్యాయామశాలలో 'దండాల' పద్ధతిని పోలి ఉంటుంది ఇది మెడ, తుంటి, మోచేయి, మోకాలు, చీలమండలం మొదలైన శరీరంలోని వివిధ భాగాలు తేలికగా పని చేసేందుకు సహాయపడుతుంది

ఇవన్నీ ఉమ్మడిగా హిందూ దేవాలయాన్ని ఒక ఆరోగ్యకేంద్రంగా, వ్యాయామశాలగా, ప్రకృతి వైద్య చికిత్సా కేంద్రంగా రూపొందిస్తున్నాయి

## భారతదేశంలో మొట్టమొదట ప్రారంభింపబడిన రైలుమార్గం

*భారతదేశంలో బొంబాయి విక్టోరియా టెర్మినస్ మరియు థానేల మధ్య మొట్టమొదటి రైలు మార్గం ప్రారంభింపబడింది 1853 ఏప్రిల్ 16న ఈ 20 మైళ్లు రైలుమార్గం మీద మొట్టమొదటి రైలు బయలుదేరింది భారతదేశంలో మొట్టమొదటి స్టీమ్ లోకొమోటివ్ "ఫెయిరీ క్వీన్" దీనిని లాగింది*

<u>'కులీనతను నిర్ణయించేవి యోగ్యతా పత్రాలు</u>

# మీకు తెలుసా?

## తిత్తిలో బిడ్డల్ని దాచుకునే జంతువులు




'కంగారు' జంతువులు తమ తిత్తిలో బిడ్డను దాచుకుని కాపాడుకుంటాయి

## భారత రాజ్యాంగం అమలు తేది

1949 నవంబరు 26న రాజ్యాంగ పరిషత్తు భారత రాజ్యాంగాన్ని పొందుపరిస్తే 1950 జనవరి 26న అమలులోకి తెచ్చారు

## ప్లాస్మా - నాలుగో పదార్థం

స్థూల ద్రవ్యాలలోని - ఘన పదార్థాలు, ద్రవ పదార్థాలు, వాయు పదార్థాలతోపాటు ప్లాస్మా (రక్తంలో తెల్లని ద్రవం) కూడా నాలుగో పదార్థంగా చేరింది

## నీటి గుర్రాల పుట్టుక

పళుసరి చర్మంగల ఆఫ్రికా జంతుజాలమైన చిన్న నిటి గుర్రాలు (వేపీ హిప్పోపోటముసెస్) నీటి అడుగున జన్మిస్తాయి.

## ఓస్మోసిస్ ఏమిటి?

మొక్కలు తమ వ్రేళ్లనుండి నీటిని గ్రహించే పద్ధతిని ఓస్మోసిస్ అంటారు.

## స్కౌట్స్ స్థాపకుడు

బాలుర స్కౌట్స్‌ను లార్డ్ బేడన్-పొవెల్ స్థాపించాడు

## అష్టకోణాల ఆకృతి

ఎనిమిది కోణాలు లేదా ఎనిమిది వైపులుగల ఆకృతికి 'అక్టా హెడ్రాన్' అని పేరు పెట్టారు

## నేషనల్ సైన్స్ దినోత్సవం

ప్రతీ సంవత్సరం ఫిబ్రవరి 28వ తేదీన నేషనల్ సైన్స్ దినోత్సవం జరుపుతారు.

## స్పెయిన్ కరెన్సీ

స్పెయిన్‌లో 'పిసిటా' (Peseta)ను కరెన్సీకి ప్రమాణంగా వాడుతారు

## పడుకుని కలగన్నాను



"జీవితం హాయి అని నేను నిద్రలో కలగన్నాను
నిద్రలేచి జీవితం విద్యుక్త ధర్మం అని తెలుసుకున్నాను.
అయితే నా కల కల్లా?
శ్రమించు ఓ హృదయమా! ధైర్యంతో
తెలుస్తుంది అది నీకు కల, కల్ల కావని -
మధ్యాహ్నపు వెలుతవంటి వాస్తవం అని"

— ఎల్లెన్ హూవర్

"పరమాత్ముని పొందడానికి ఉపాయం పరమా

## జాతీయ చిహ్నం



భారత జాతీయ చిహ్నం లేక ముద్రగా మూడు సింహాలతో కూడిన ధర్మచక్రం 1950 జనవరి 26 నుండి అమలులోకి వచ్చింది

## అణుశక్తి

నూతన అణుయుగంలో ఒక టన్ను అణు ఇంధనం ద్వారా 6,00,000 టన్నుల బొగ్గును కాల్చితే వచ్చే శక్తి ఉద్భవిస్తుంది

## బ్రిటిష్ మ్యూజియం

లండన్‌లోని బ్రిటిష్ మ్యూజియం ప్రపంచంలోని వస్తు ప్రదర్శనశాలలన్నిటిలో పెద్దది.

## నిశ్శబ్ద శబ్దం

'నిశ్శబ్ద శబ్దం' అంటే అల్ట్రాసోనిక్, ఇన్‌ఫ్రాసోనిక్ శబ్దాలన్నమాట

## రోజుకు 1500 గ్రుడ్లు

రాణి తేనెటీగ ఒక రోజుకు 1500 గ్రుడ్లు పెడుతుంది. ఇది తన జీవితకాలంలో 10 లక్షల (ఒక మిలియను) గ్రుడ్లు పెడుతుంది.

## పిరమిడ్ల శ్రేణి

ఈజిప్ట్‌లోని గిజా పిరమిడ్ల శ్రేణి ప్రపంచంలోని పిరమిడ్ల శ్రేణులన్నిటిలో పెద్దది

## 10 మీటర్ల కొండ చిలువ




10 మీటర్ల పొడవుగల కొండ చిలువలో 600 ప్రక్కటెముకలు ఉంటాయి

## వజ్రాల గని



దక్షిణ ఆఫ్రికాలోని కింబర్లీలో ప్రపంచంలోనే పెద్దదైన వజ్రాల గని ఉంది

"శాస్త్రాలు వల్లించినంత మాత్రాన ప్రయోజనం లేదు
ఆచరణలో అచరణ సామర్థ్యం ఉండాలి"

# 19వ శతాబ్ది సర్కస్ ప్రదర్శనలో ప్రధమగణ్యుడు

ఫినిస్ టి. బర్నం 19వ శతాబ్దికి చెందిన ప్రముఖ కళాకారుడు 1835లో జోయిస్ హీత్ (Joice Heth) అనే అసాధారణ వృద్ధ మహిళను ప్రదర్శనలో ప్రవేశ పెట్టడంతో అతని పేరు ప్రాచుర్యంలోకి వచ్చింది! ఆమె అమెరికా అధ్యక్షుడు జార్జ్ వాషింగ్‌టన్‌కు నర్స్‌గా పనిచేసిందని చెప్పేవాడు తరువాత ప్రసిద్ధి చెందిన మరుగుజ్జు 'జనరల్ టామ్ థంబ్'ను (ఛార్లెస్ ఎస్ స్ట్రాట్టన్) ఆయన రంగం మీదికి తెచ్చాడు


Joker

ఆయన 1871లో ప్రారంభించిన 'గ్రేటెస్ట్ షో ఆన్ ఎర్త్' (ఇంతకు ముందు చూడని స్థాయిలో సర్కస్) అఖండ విజయం సాధించింది 1881లో బర్నం తన ప్రత్యర్థి జె ఎ బెయిలీతో కలిసి 'బర్నం అండ్ బెయిలీ సర్కస్'ను పెద్ద ఎత్తున ప్రారంభించాడు తరువాత ఇది రింగ్‌లింగ్ బ్రదర్స్ సర్కస్‌తో కలిసిపోయింది వీటి ఉమ్మడి ప్రదర్శనలు విజయవంతంగా సాగిపోయాయి

బర్నం ఇంగ్లీషు భాషకు కొత్తగా మూడు పదాలు చేర్చాడు ''బల్లీహూ'' (Ballyhoo) అపరిమిత ప్రచార విజయానికి అతడు పెట్టిన పేరిది ''జంబో'' (Jumbo) - అతి పెద్దదని అర్థం వస్తుంది 1881లో తన సర్కస్‌లోకి చేర్చిన ప్రపంచంలోని అతి పెద్ద ఏనుగు పేరు ఇది


Circus

''వైట్ ఎలిఫెంట్'' (White elephant) ఖరీదైన పరాజయానికి అతడు పెట్టిన పేరు టూంగ్ టలాంగ్ అనే తెల్ల ఏనుగు ప్రేక్షకాదరణ పొందలేకపోయింది దీనికి తెల్ల రంగు పూశారని ప్రజలు భావించారట!

## నిత్యజీవితంలో హాస్యం




'లైఫ్ ఇన్స్యూరెన్స్ కాదు. ఫైర్ ఇన్స్యూరెన్స్ కావాలి! నా బాస్ ఏదో ఒకదానికి ఎప్పుడూ నిప్పులు జల్లుతూంటాడు!'

''మానవులకూ, మృగాలకూ తేడా స్వల్పమే. కొందరు మానవులు ఆ స్వల్పాన్ని కూడా తీసివేస్తారు ''

# పుస్తకం పలికింది....

అనగా అనగా ఒకసారి ఓ లైబ్రరీ పుస్తకం తనని చేతుల్లోకి తీసుకున్న వ్యక్తితో మాట్లాడింది ఆ మాటలు మనం తప్పక వినవలసినవి అవి ఇవిగో'



"మురికి చేతుల్తో నన్ను ముట్టుకోవద్దు నీ తరువాత మరో బుజ్జి పాప నన్ను తన చేతుల్లోకి తీసుకుంటే అప్పటి నా ఆకారం చూసి నాకే సిగ్గేస్తుంది నన్ను వర్షంలో తడపవద్దు పిల్లలకు మాదిరిగానే పుస్తకాలకూ జలుబు చేస్తుంది నీ పెన్నుతోకాని, పెన్సిల్‌తోకాని నాపైన మార్కులు వేయవద్దు అప్పుడు నా రూపం అసహ్యంగా మారుతుంది చదివేటప్పుడు మోచేతుల్ని నా మీద మోపవద్దు నాకు నొప్పి పుడుతుంది నన్ను తెరిచి టేబిల్ మీద బోర్లావేసి పోవద్దు నిన్ను అలా చేస్తే నీవు ఒప్పుకుంటావా?

నన్ను చదువుతూ ఎంతవరకు చదివావో గుర్తుంచుకునేందుకు నా పేజీ చివర్లను మడవ వద్దు నీవు ఎక్కడ నిలిపివేశావో అక్కడ ఒక చక్కని చిన్న పుస్తకం గుర్తు (book mark) పెట్టు తరువాత నన్ను మూసి ప్రక్కన పెట్టితే అప్పుడు నేను హాయిగా విశ్రాంతి తీసుకుంటాను

నీ తరువాత నేను చాలామంది చిన్నారి పిల్లలను దర్శిస్తాననే విషయం మరచిపోవద్దు బహుశా నిన్నే మరోసారి నేను కలిసే అవసరం రావచ్చు. అప్పుడు మురికితో నిండి, చిరిగిపోయి, ముసలితనం కప్పుకున్న నా ఆకారం చూసి నీకు విచారం కలుగవచ్చు నేను తాజాగా, శుభ్రంగా ఉండేటట్లు తోడ్పడితే నీవు సుఖంగా ఉండేందుకు నేను సహాయపడతాను"

## అందమైన ప్రేమ సామ్రాజ్యం




మాతృభూమి తోటి మానవులను ప్రేమ పద్ధానంతో సేవలు చేస్తూ మాతలం మన అందమైన ప్రేమ సామ్రాజ్య నిర్మాణానికి అంకితమైతే ఎటువంటి పూజలు చేసినా తప్పక భగవంతుని తెలుసు కుంటాడు

— బాబూ రాజేంద్ర ప్రసాద్

"నిజమైన మహనీయునికి మొదటి పరీక్ష అతని 'వినయం' అని

# అవీ - ఇవీ

## ప్రథమ వైద్య పత్రిక

ఇండియా ప్రథమ వైద్య వార్తాపత్రిక 'మెడి న్యూస్' 1992 జూన్ 12న వెలువడింది. ఇది పూర్తిగా రంగులలో ముద్రితమైన చిన్నసైజు మాసపత్రిక. ఖరీదైన విదేశీ వైద్య పత్రికలను కొనలేని డాక్టర్లకు ఇది ఎంతో ఉపయోగపడు తుంది. ఇండియాకు ప్రత్యేకంగా కావలసిన విషయాలను ఇందులో ప్రచురిస్తారు.

## తాటి చెట్టుకు తమ్ముడు

23 మీటర్ల పొడవున్న పాకిస్థాన్ సివిల్ ఉద్యోగి మహమ్మద్ ఆలం చెన్నా ప్రపంచంలో అధిక ఎత్తుగల వ్యక్తిగా నమోదయ్యాడు అతడు లండన్ పర్యటన చేసినప్పుడు డబల్ డెక్కర్ బస్సు పై అంతస్థులో ఉన్న ప్రయాణీకులతో, కరచాలనం చేసేవాడు అతని కోసం ప్రత్యేకంగా కట్టిన ఇంటి లోకప్పు 45 మీటర్ల ఎత్తులో ఉంటుంది అతని పడక 3 మీటర్లు పొడవు ఉంది.

## జీవననాణ్యతగల కెనడా

ఐక్యరాజ్య సమితి 'జీవన నాణ్యత' గురించి జరిపిన విశ్లేషణలో కెనడా ప్రథమస్థానం పొందింది జీవిత పరిమాణం, విద్య ఆదాయం, కొనుగోలు శక్తి వంటి వాటిని గురించి 160 దేశాలను విశ్లేషించారు. అగ్రస్థానంలో ఉన్న 12 దేశాలలో ద్వితీయ స్థానం జపాన్, తృతీయ స్థానం నార్వేకు లభించాయి. స్విట్జర్లాండ్, స్వీడెన్, యునైటెడ్ స్టేట్స్, ఆస్ట్రేలియా, ఫ్రాన్స్, నెదర్లాండ్స్, బ్రిటన్, ఐస్‌లాండ్, జర్మనీలు తరువాత స్థానాలలోకి రాగా ఇండియా1 21వ స్థానంలో, బంగ్లాదేశ్ 135వ స్థానంలో, ఆఫ్ఘనిస్థాన్ 158వ స్థానంలో ఉన్నాయి.

## ఇండియాకు పాతకాపులే

సోవియెట్ పండితుడు డాక్టర్ ఏ. బస్కీ అభిప్రాయం ప్రకారం ప్రాచీన భారత దేశానికి అణ్వాయుధాలు పరిచయమైనవే! బ్రహ్మాస్త్ర ప్రయోగం వల్ల ఏర్పడిన ఉష్ణోగ్రత వంటి విషయాలు ఎంతమాత్రం అతిశయోక్తులు కావని ఆయన చెబుతున్నాడు.

— రష్యన్ గ్రంథం 'హైపోథిసిస్' సౌజన్యంతో

## బీవరేజీల మార్కెట్ విలువ రూ. 220 కోట్లు



తెలుపు, గోధుమరంగు, చాక్‌లెట్ రంగులతో బీవరేజీలు మూడు రకాలుగా ఉన్నాయి. వీటి మొత్తం అమ్మకపు విలువ రూ 220 కోట్లు అని అంచనా వేయబడింది తెల్లటి బీవరేజి 20,000 టన్నుల అమ్మకంతో ప్రథమస్థానంలో ఉంది.

తెల్లటి బీవరేజీలలో హార్లిక్స్ మార్కెట్‌లో శాతం వహిస్తుంది గోధుమ రంగు కాడ్బరీస్ బోర్నవిటా మార్కెట్‌లో 46 శాతం వ్యాప్తి పొందింది.

— 'బిజినెస్ ఇండియా' సౌజన్యంతో

"కేవలం గురి చూస్తే చాలదు, దానిని సాధించ గలగాలి."

## ఘనుడీ నేపాలీయుడు

36 సంవత్సరాల నేపాలీయుడు అంగ్ రీటా షెర్పా హిమాలయాల్లోని 8,848 మీటర్ల ఎత్తుగల మౌంట్ · సాగరమాత (మౌంట్ ఎవరెస్ట్)ను 1992 మే 15న ఎటువంటి కృత్రిమ ప్రాణవాయువు లేకుండా ఏడవసారి అధిగమించాడు. అతడు ఛిలియన్ సాగర్‌మాత సాహసయాత్రా బృందంలో సభ్యుడు.

## రెండువేల ఏళ్లనాటి బౌద్ధ శిథిలాలు

ఆంధ్రప్రదేశ్‌లో విశాఖపట్నం - భీముని పట్నం మార్గంలో ఉన్న తొట్లకొండ, బావికొండ, పావురాల బీడుల్లో 2000 ఏళ్ల నుంచి పరి రక్షించబడుతున్న బౌద్ధ శిథిలాలు ఒక విలక్షణ రాతిస్తూపంతో సహా వెలికి తీసారు. ఆ కాలంలో బ్రహ్మాండమైన బౌద్ధ సమ్మేళనాలు ఇక్కడ జరిగేవని, నౌకా వాణిజ్యం వర్ధిల్లిందని ఈ శిథిలాల వల్ల తెలుస్తూంది.

## మౌంట్ ఎవరెస్ట్ ఎక్కిన త్రిసభ్య బృందం

1992 మే 10వ తేదీ సాయంత్రం 4 గంటలకు ముగ్గురు సభ్యులు గల ఇండో - టిబెటన్ సరిహద్దు పోలీస్ బృందం హిమాలయాల్లోని మౌంట్ ఎవరెస్ట్‌కు చేరుకుంది. మనీల్ శర్మ, కన్హయ్యాలాల్, ప్రేమ్‌సింగ్ ఈ బృందంలో సభ్యులు. 1984లో మౌంట్ ఎవరెస్ట్‌ను విజయవంతంగా అధిరోహించిన బృందంలో ప్రథమ మహిళా పర్వతారోహకురాలు బచేంద్రిపాల్ ఉంది.

## సూపర్ కంప్యూటర్

అమెరికాలోని నెక్ కార్పొరేషన్ ప్రపంచంలోనే అతి శీఘ్రంగా పనిచేసే ఒక క్రొత్త సూపర్ కంప్యూటర్‌ను ప్రవేశపెట్టింది. ఈ కొత్త SX - 344 R సెకండ్‌కు 25 6 బిలియన్ లెక్కల్ని వేస్తుంది. దీని పరంపరాగత కంప్యూటేషన్ వేగం 25.6 గిగాఫ్లాప్స్.

# చేపల వింతలు

## ఎర్ర సముద్రపు చేపలు పగడాలను మ్రింగుతాయి

*రాళ్ళకు కొద్దిగా అంటుకున్న జంతు కణాలకు ఆశపడి పశ్చిమ ఆసియా ఎర్ర సముద్రంలో నివసించే సూడోస్కారస్ చేపలు పగడాల ముక్కలను మ్రింగుతాయి.*



## గౌరామి చేపలు గాలి పీల్చడానికి గట్టు మీదికి వస్తాయి!

*భారతదేశంలో ఉండే గౌరామి చేపలు నీటిలో ఉండలేవు. నక్రమ కాలావధులలో బయటకు వచ్చి గాలిని మ్రింగుతూంటాయి!*

## రిబ్బన్ చేపలకు శరీరం కంటే మీసాలు పెద్దవి

*రిబ్బన్ చేపలకు వాటి శరీరానికి 5 రెట్లు పొడవైన మీసాలు ఉంటాయి.*

## సాగేనారతో పారాచూట్ నిర్మాణం

ఉక్రేనియన్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ ఆర్టిఫిషియల్ అండ్ సింథటిక్ ఫైబర్ (సోవియెట్ యూనియన్) లోని నిపుణులు ఎలాస్టిక్ ఫైబర్ (సాగేనార), ఓవెన్ త్రెడ్‌లతో పారాచూట్ తయారుచేసారు. దీని ద్వారా అనేక అంతస్తుల భవనాల నుంచి కొద్ది నిమిషాల్లోనే మనుమల్ని క్రిందికి చేర్చవచ్చు. పారాచూట్‌లో ఉన్న వ్యక్తి తన భుజాలను విస్తరించటం ద్వారా దిగేటప్పుడు వేగాన్ని మార్చుకోవచ్చు

## లోకజ్ఞానం కంప్యూటర్లు

1990 దశాబ్దంలో కంప్యూటర్ సాంకేతిక రంగంలో ప్రపంచంలోనే ఆధిక్యత సంపాదించేందుకు జపాన్ ఇప్పుడు 'లోకజ్ఞానం' కల కంప్యూటర్లను ప్రవేశపెట్టబోతున్నది మేధావుల తెలివి తేటల్ని ఈ మెషీన్లలో పొందు పరుస్తారు వీటితో ప్రజలు మాట్లాడవచ్చు. వీటిని సులభంగా ఉపయోగించుకోవచ్చు.

## తొలి మానవ శిలాజాలు

ఇటీవల దక్షిణ ఆఫ్రికాలోని జొహనెస్ బర్గ్ సమీపంలోని గుహల్లో త్రవ్వకాలు జరిగినప్పుడు తొలిమానవ శిలాజాలు లభించాయి. వీటిలోని రెండు దంతాలు 25 మిలియన్ల సంవత్సరాలనాటివి విట్‌వాటర్‌స్రాండ్ యూనివర్శిటీలో అధ్యయనం చేస్తున్న అమెరికా శాస్త్రవేత్త లీ బెర్గర్ అభిప్రాయం ప్రకారం ఈ దంతాలు 25 మిలియను సంవత్సరాల క్రితం జీవించిన ఒక యువకునివి (తోకలేని కోతి వంటివాడు).

## భారీ లారీ

ప్రభుత్వరంగ సంస్థ భారత్ ఎర్త్ మూవర్స్ లిమిటెడ్ [illegible] ఎలక్ట్రిక్ రేర్ డంప్ ట్రక్ దేశంలోని లారీలలో పెద్దది. 1200 అశ్వశక్తి గల ఇంజనుతో విద్యుత్ చోదిత చక్రాలు గల ఈ ట్రక్కు 125 టన్నుల బరువు మోస్తుంది.

## ప్రాచీన గ్రంథం

కెయిరోకు దక్షిణంగా 124 కి.మీ.ల దూరంలో ఉన్న హెనస్సియా (Ehnassia) అనే గ్రామంలో క్రీ.పూ. 4వ శతాబ్దం నాటి ప్రాచీన గ్రంథాన్ని ఈజిప్ట్ పురాతత్వవేత్తలు కనుగొన్నారు. ఈ 490 పేజీల వ్రాతప్రతిలో ప్రాచీన యూదు ప్రజల 'ఓల్డ్ టెస్టమెంట్'లోని కొన్ని మత సిద్ధాంత సారాంశాలు, డేవిడ్ స్తోత్రాలు ఉన్నాయి

## దీర్ఘకాల జీవి

ప్రపంచంలో ఎక్కువకాలం బ్రతికే జీవిని అమెరికా శాస్త్రవేత్తలు కనుగొన్నారు. 600 హెక్టేర్లలో రాకీ మౌంటెన్స్‌లో పెరిగే ఫంగస్ ఇది. వాషింగ్టన్ రాష్ట్రంలోని మౌంట్ ఆడెమ్స్ పర్వత పాదాల దగ్గర పెరిగే ఈ శిలీంధ్రం 400 నుంచి 1000 సంవత్సరాల వయస్సు గలది.

## మృత్యుంజయుని మృతి

1912లో 'టిటానిక్' నౌకా విధ్వంసంలో బ్రతికి బట్టకట్టిన మార్జోరి నివెల్ రాబ్ ఎట్టకేలకు తన 103వ ఏట ఇటీవలే బోస్టన్ (అమెరికా)లో శాశ్వతంగా కన్నుమూసారు. ప్రపంచంలో అతి విలాసవంతమైన పెద్ద నౌకగా పేరొందిన 'టిటానిక్' సౌతాంప్టన్ (ఇంగ్లండ్) నుండి న్యూయార్క్ (యుఎస్ఎ)కు వయనిస్తూ 1912 ఏప్రిల్ 14 అర్ధరాత్రికి కొంచెం ముందుగా ఒక మంచుకొండకు ఢీకొని ధ్వంసమైంది.

●

# ముక్కు చూడు - ముక్కందం చూడు

ఎల్లవేళలా ముక్కును పరిశుభ్రంగా ఉంచుకోవాలి. ముక్కులో ఏదైనా అవరోధం కాని, అంటువ్యాధి కాని ఏర్పడితే డాక్టర్‌తో సంప్రదించాలి.




ముక్కులో ఏవైనా నోస్ డ్రాప్స్ (మందు బొట్లు), ఆయింట్‌మెంట్స్ (లేపనాలు), లోపలికి పీల్చుకునే ఇన్‌హేలర్లు ఉపయోగించే ముందు డాక్టర్‌ను సంప్రదించాలి. ముక్కు రంధ్రాలను రెంటిని కలిపి ఒకేసారి చీద కూడదు. దీనివల్ల ముక్కుల్లో ఉన్న అంటు వ్యాధి చెవుల్లోకి పాకే ప్రమాదం ఉంది

ముక్కును శుభ్రం చేసేందుకు ఘాటైన యాంటీ సెప్టిక్ లోషన్లను ఎప్పుడూ ఉపయోగించ కూడదు. ఉప్పు నీటి సొల్యూషన్ ఉపయోగించ వచ్చు. అర (టీ చెంచా) చెంచా ఉప్పు, ఒక గ్లాసు వేడినీటిలో కలిపితే ఈ సొల్యూషన్ తయారవుతుంది. ఈ సొల్యూషన్‌ను రెండు ముక్కు రంధ్రాల్లోకి గట్టిగా పీల్చి నోట్లోకి వచ్చేటట్లు చేసుకుని తరువాత దానిని బయటికి ఉమ్మి వేయాలి.

ముక్కు రంధ్రాలలో అవరోధం ఏర్పడినా, ఎడినాయిడ్స్ వ్యాకోచం చెందినా పిల్లలు నోటి ద్వారా గాలి పీలుస్తారు. అప్పుడు వెంటనే డాక్టర్‌ను సంప్రదించాలి.

ముక్కులోపల ఎప్పుడూ ఆరోగ్యకరంగా ఉంచుకోవాలి.

మీరు తరచుగా జలుబు భారంతో బాధపడు తుంటే డాక్టర్‌ను సంప్రదించడం మంచిది.

# మానవుని మెదడులో 10 బిలియను భాగాలు




*సుమారు 3 పౌండ్లు తూగే మానవుని మెదడు చాలా చిన్నది. కానీ దానిలో 10 బిలియను భాగాలు ఉన్నాయి. దానికి దేన్నైనా నేర్పించవచ్చు. ఆలోచనతో కాలం వృధా కాకుండా ఇది కంప్యూటర్లను నిర్మిస్తుంది. ముందుగానే పథకాలు ఏర్పరచుకుని అర్థం చేసుకో గలుగుతుంది. నిబంధనలను తెలుసు కుంటుంది. మానవుని మెదడు అతి నైపుణ్యంగా రూపొందించబడిన మెకానిజం!*

—'ఇన్‌స్పిరేషనల్ కోట్స్' సౌజన్యంతో

కం ఆనందం''

# కామెర్ల వ్యాధికి ప్రకృతి చికిత్స

హెచ్.కె. బబ్రూ

కామెర్ల రోగం లేక పసికర్ల వ్యాధి లివర్ (కాలేయం)లోని అవకతవకలవల్ల సామాన్యంగా వస్తుంది. లివర్ సెల్స్ ఉత్పత్తి చేసే పిత్తరస సంబంధమైన కార్యకలాపాలు నిరోధించబడటం వల్ల ఈ వ్యాధి సంక్రమిస్తుంది. కామెర్ల వ్యాధిలో ఎన్నో రకాలు ఉన్నాయి. అయితే అన్ని రకాల్లో కూడా చర్మం, కళ్లు పచ్చబడటం కనిపిస్తుంది.



మన శరీరంలో రొమ్ము భాగానికి, ఉదరానికి నడుమ అడ్డంగా ఉండే స్నాయువు క్రింద లివర్ ఉండి ఒక రసాయనిక పరిశోధనశాల మాదిరిగా పనిచేస్తుంటుంది ఇక ఎంత మాత్రం అవసరం లేని హార్మోన్లను నిలిపివేసి, టిష్యూల నిర్మాణానికి అవసరమైన ఎమినో యాసిడ్‌ను సమ్మేళనం చేసి, శక్తికి కావలసినంత మేరకు చక్కెర కొవ్వు పదార్థాలుగా ప్రొటీన్లను మార్పుతుంది. టిష్యూ వ్యర్థ పదార్థాల తొలగింపుకు కావలసిన లెసిథిన్, కొలెస్టరాల్, బైల్, బ్లడ్ అల్బుమిన్‌లను ఉత్పత్తి చేస్తుంది. విటమిన్లను, ఖనిజాలను నిల్వ ఉంచుతుంది.

పిత్తరసం సరైన పోషణకు అత్యంతావశ్యకం. ఇది జీర్ణక్రియపై అత్యంత ప్రభావం చూపుతుంది. శరీరంలోని పోషక పదార్థాలు చెడిపోకుండా కాపాడుతుంది. ఇది ప్రేవుల్లోకి వెళ్లేందుకు అవరోధిస్తే గాస్, ఇతర ఇబ్బందులు ఏర్పడతాయి.

కామెర్ల వ్యాధి లివర్ సరిగ్గా పని చేయుటం లేదని సూచిస్తుంది. పిత్తరసం అవరోధం వల్ల ఇది వస్తుంది. పిత్తరస లవణాలు, ప్రేవుల వర్ణం దెబ్బతింటాయి. దీని ఫలితంగా పిత్తరసం రక్తంలో కలిసి చర్మానికి పసుపు పచ్చనిరంగు తెస్తుంది. సూక్ష్మ జీవుల వల్ల వచ్చే 'హెపటైటిస్',

## మనో వైవిధ్యం



ఇంట్లో దయ
సమాజంలో మర్యాద
వ్యాపారంలో నాణ్యత
పనిలో సదాలోచన
ఆటలో విలాసం
అసహాయులకు సహాయం
క్రూరులకు విరోధం
అదృష్టహీనులకు కనికరం
పశ్చాత్తాపులకు మన్నన

'సరైనదేదో తెలుసుకుని కూడా దానిని చేయలేక పోవడమంటే

మూత్ర పిండాలలో రాళ్లు, లివర్ వాపు వంటి వ్యాధులన్నీ పిత్తరస అవరోధం ఫలితమే. అనీమియా, టైఫాయిడ్, మలేరియా, పచ్చ జ్వరం, క్షయ వ్యాధి వంటి లివర్ సంబంధ వ్యాధులవల్ల కూడా పచ్చ కామెర్లు వచ్చే అవకాశం ఉంది.




అతినీరసం, తలనెప్పి, జ్వరం, అజీర్ణం, వికారం, కళ్లు, నాలుక, చర్మం, మూత్రం - పసుపు పచ్చని రంగుకు మారటం - కామెర్ల వ్యాధికి చిహ్నాలు. లివర్ ప్రాంతంలో నొప్పిగా కూడా ఉంటుంది.

ఆహారంలో మార్పులు మరియు వ్యాయామం ద్వారా సామాన్య స్థితిలో ఉన్న కామెర్ల వ్యాధిని నివారణ చేయవచ్చు. అయితే పిత్తాశయం లోని అవరోధాల కారణంగా ఏర్పడిన పసికర్లను బాగు చేయుటంలో అలస్యమౌతుంది. వ్యాధి తీవ్ర లక్షణాలన్నీ సమసిపోయేవరకు రోగి విశ్రాంతి తీసుకోక తప్పదు

ఒక వారంరోజులపాటు రోగికి పండ్లరసం ఇవ్వాలి. నిమ్మ, ద్రాక్ష, బేరి పండ్లు, కారెట్, బీట్, చెరకు రసాలు ఇవ్వవచ్చు. పేగుల పరిశుద్ధి కోసం రోగి నిరాహారంగా ఉన్నన్ని రోజులు వేడినీటితో ఎనీమా చేయించాలి.

వ్యాధి తీవ్రత తగ్గగానే పండ్లరసాల ఆహారం నిలిపివేసి సామాన్యమైన ఆహారం ఈ క్రింది విధంగా ఇవ్వాలి. నిద్రలేవగానే రెండు టీ స్పూన్ల నిమ్మరసంతో కలిపిన ఒకగ్లాసు వేడినీళ్లు. అల్పాహారం ఆపిల్, బొప్పాయి, ద్రాక్ష, బెర్రీ, మామిడి పండ్లలో ఏదో ఒకటి తినాలి. ఒక కప్పు గోధుమ జావ లేక ఒక స్లైస్ గోధుమ బ్రెడ్ కొద్దిగా వెన్నరాసుకుని తినాలి. ఉదయం మధ్యలో నారింజరసం ఇవ్వాలి. మధ్యాహ్న భోజనంలో పూర్తిగా గోధుమతో తయారు చేసిన రెండు చిన్న చపాతీలు స్వల్పంగా నెయ్యికాని, వెన్నకాని చేర్చి తీసుకోవాలి ఒక కప్పు వెజిటబుల్ సూప్, ఉడికించిన ఆకు కూరలు - కారెట్, మిథి సాగ్, స్పినాచ్ వంటివి ఇవ్వాలి ఒక గ్లాసు మజ్జిగ తీసుకోవాలి.

## జీవితం



జీవితం అనేది పెద్దపెద్ద త్యాగాలతోను, ధర్మాలతోను నిర్మింపబడలేదు చిన్న చిన్న విషయాలతో, చిరునవ్వులతో, కారుణ్యాలతో, చిన్న చిన్న ఉపకారాలతో, బాధ్యతలతో ఉంటుంది. వీటిని తప్పకుండా అభ్యాసం చేసుకుంటే సుఖం, సౌభాగ్యం లభిస్తుంది

— సర్ హంఫ్రీ దవే

'ఆనందము బయట నుంచి తెచ్చుకునే దాన్నిబట్టి గాక నీవద్ద నున్నది ఇతరులకు ఇచ్చిన దాన్నిబట్టే ఉంటుంది.''

మధ్యాహ్నం తరువాత: నారింజరసం లేక కొబ్బరి నీరు ఇవ్వాలి. రాత్రి భోజనం: పూర్తి భోజనానికి తగినన్ని చపాతీలు కొద్దిగా నెయ్యి లేక వెన్నతో తీసుకోవాలి. మిథి, పాలక్ వంటి ఆకు కూరలు తీసుకోవాలి. కావాలంటే తేనె కలుపుకుని ఒక గ్లాసు వేడిపాలు త్రాగాలి.



కనీసం రెండు వారాల వరకు నెయ్యి వెన్న, మీగడ, నూనెలు వంటి కొవ్వు పదార్థాలను విసర్జించాలి. తరువాత కూడా వీటి వాడకం బాగా తగ్గించాలి. కొవ్వు పదార్థాలు చేరని తేలికరకం కార్బోహైడ్రేట్ ఆహారం క్రింద కూరగాయలు, పండ్లు తీసుకోవాలి. అజీర్తి బాధలు లేకుండా చూసుకోవాలి. పప్పులు, కాయధాన్యాల వంటి పేగులలో పులిసే పదార్థాలు తీసుకోవటం నిలిపివేయాలి.

నిమ్మరసంతో కలిపిన నీటిని ఎక్కువగా తీసుకుంటే దెబ్బతిన్న లివర్‌సెల్స్ రక్షించబడతాయి. వేడినీళ్ళు చన్నీళ్ళతో ఒకదాని తరువాత మరొకటి పొత్తి కడుపుపై కాపడం పెట్టాలి. 120 డిగ్రీల F వేడి ఉండే విధంగా ఒక నిమిషం కాపు కాయాలి మరో విడతగా 60 డిగ్రీల F చల్లదనంతో 5 నిమిషాలు కాపు పెట్టాలి. ఈ చికిత్స ఒక గంటసేపు కాని, పదిసార్లు కాని చేయాలి. ప్రతీ 5 గంటల వ్యవధిలో ఈ పద్ధతి ప్రకారం చేస్తూండాలి. చర్మం, మూత్రపిండాల ద్వారా ఏర్పడిన వర్ణం మారిపోయేందుకు, కామెర్ల వ్యాధి వల్ల వచ్చే దురదను పోగొట్టుకు... ను ప్రతి రోజు 10 నిమిషాల పాటు 104 డిగ్రీల F వేడినీటిలో రోగి స్నానం చేస్తే హాయిగా ఉంటుంది. ఉత్థాన పాదాసనం, భుజంగాసనం, విపరీతకరణి శవాసనం, అనులోమ-విలోమ ప్రాణాయామం వంటి ఆసనాలు కూడా కామెర్ల వ్యాధి చికిత్సకు తోడ్పడతాయి.

ఆహార విషయాల్లో తగిన జాగ్రత్త తీసుకుని, సామాన్యమైన వ్యాయామం చేస్తూ, సూర్యరశ్మిని చల్లగాలిని తరచుగా అనుభవిస్తూ సాగిపోయే వారిని లివర్ వ్యాధుల నుండి కాపాడవచ్చు.

## కొంపె "మిస్" జాగ్రత్త!

*ఈ ఏడు మిస్సులు మన నానా యాతవలకు ముఖ్య కారణాలు—*



మిస్ ఇన్ఫర్మేషన్
మిస్ కొటేషన్
మిస్ రిప్రజెంటేషన్
మిస్ ఇంటర్‌ప్రెటేషన్
మిస్ కన్‌స్ట్రక్షన్
మిస్ కన్సెప్షన్
మిస్ అండర్‌స్టాండింగ్
జాగ్రత్త!

— డబ్ల్యు.జి. బుయిట్కర్

# అంతరిక్షంలో

## భూమినుండి మరోగ్రహానికి పయనం

2,116 పౌండ్ల బరువు గల సోవియెట్ యూనియన్ అంతరిక్ష ఉపగ్రహం 'వీనస్ III'ను 1965 నవంబర్ 16న భూమి నుండి మరో గ్రహానికి ప్రయోగించారు. ఇది 1966 మార్చి 1వ తేదీ ఉదయం 6 56 నిమిషాలకు (గ్రీన్‌విచ్ కాలమానం) వీనస్ (శుక్రగ్రహం)ను తాకింది. మన కళ్లకు కనిపించే అయిదు గ్రహాలలో కాంతివంతమైన గ్రహం శుక్రగ్రహం.



## తెల్లని పొట్టి నక్షత్రం

100 కాంతి సంవత్సరాల దూరంలో ఉండి చంద్రుని కంటే సగం వ్యాసం గల ఒక తెల్లని పొట్టి నక్షత్రం ఎల్‌పి 327-186ని అమెరికా లోని మిన్నిపోలిస్‌లో 1962 మే లో కనుగొన్నారు

## మానవులతో అంతరిక్షయానం

చంద్రుని పైకి మొదటిసారి అంతరిక్ష యానం చేసిన అమెరికా వ్యోమగాములు ఫ్రాంక్ బొర్మన్, జేమ్స్ ఎ.లోవెల్, విలియం ఆండెర్స్ 'అపోలో VIII' అంతరిక్ష వాహనంలో 1968 డిసెంబరు 21-27లలో పయనించారు.

## బాక్టీరియా సర్వసంచారి

అమెరికా వైమానిక వ్యోమ పరిపాలనా సంస్థ 1967 ఏప్రిల్‌లో 135,000 అడుగుల ఎత్తున (25 మైళ్లకు పైగా) బాక్టీరియా (సూక్ష్మ క్రిములు)ను కనుగొన్నట్లు తెలియజేసింది.

## చంద్రునిపై మొదటి చోదిత వాహనం

సోవియెట్ యూనియన్ ప్రయోగించిన 'లునొఖడ్ 1' చంద్రునిపై కాలుమోపిన మొదటి చక్రాల వాహనం 1970 నవంబర్ 17న ఇది తిరగటం ప్రారంభించింది 6.54 మైళ్లు పూర్తి చేసింది. 30 డిగ్రీలు ఏటవాలుగా కూడా పయనించడం జరిగింది. ఇది 1971 అక్టోబర్ 4న పనిచేయటం నిలిపివేసింది

## రోదసిలో 'నడక'

సోవియెట్ యూనియన్ అంతరిక్ష యాత్రికుడు లెఫ్టినెంట్ కల్నల్ అలెక్సీ అర్ఖిపోవిచ్ లియోనోవ్ కృత్రిమ ఉపగ్రహం 'వాస్‌ఖడ్ 11'ను 1965 మార్చి 18 ఉదయం 8 30 గంటలకు (గ్రీన్‌విచ్ కాలమానం) వదలి రోదసిలో ఇరవై నిమిషాల పాటు నడిచాడు. ఒక చోట 16 అడుగుల దూరాన్ని 12 నిమిషాల, 9 సెకండ్లలో ఈదటం జరిగింది

## దేవా నాకు ప్రసాదించవా!

*"నేను మార్చుకోలేని విషయాలను అంగీకరించగల స్థిమితాన్ని, మార్చుకోగల విషయాలను మార్చుకోడానికి ధైర్యం, భేదాన్ని తెలుసుకోగల వివేకాన్ని దేవా నాకు ప్రసాదించు"*

...కో, ఆ తరువాత భగవంతుణ్ణి నమ్ము!"

# విశ్వవిఖ్యాత హస్తరేఖా వ్యాఖ్యాత

చీరో - ప్రపంచ ప్రఖ్యాతి చెందిన ఒక స్తరేఖా శాస్త్రవేత్త ఇతడి అసలుపేరు లూయీస్ హమ్మన్ (Louis Hammon). చీరో నే గ్రీక్ పదానికి 'హస్తరేఖా వ్యాఖ్యాత' అని ర్థం.




చీరో (Cheiro) సాహసికుడైన యువకుడు తూర్పుదేశాలను చూడాలని అతడు ఇంగ్లండు నుంచి నావికాయానం చేసాడు ఇండియా చేరుకుని ఉత్తర ప్రాంతానికి పయనించి హిమాలయ పర్వత పాదాల చెంత స్థిరపడ్డాడు అక్కడున్న ఒక కుటీరంలోని హిందూ అధ్యాపకుని వద్ద రెండేళ్లకు పైగా హస్త సాముద్రిక శాస్త్రం అభ్యసించాడు హస్తసాముద్రికం కరతలామలకం చేసుకుని లండన్‌కు తిరిగివచ్చి 1888లో అద్భుత రీతిలో ఈ కొత్తవృత్తిని చేపట్టాడు.

ఈ హస్తరేఖా శాస్త్రనిపుణుడు అనేకమంది వ్యక్తుల హస్తాలు పరిశీలించి వారి గుణ గణాలు, ఆరోగ్యం, జీవితకాలం, మేధాశక్తి మొదలైన వివరాలన్నీ ఖచ్చితంగా అంచనా వేసి చెప్పాడు.

ఆయన చెప్పిన అనేక అద్భుత జోస్యాలు ఫలించాయి. 1928లో చీరో ఇండియా

## ఎదుటివాళ్లు నీవు చెప్పేది వినాలంటే?

ఎదుటివాళ్లు నీవు చెప్పేది వినడానికి అవలంబించవలసిన పన్నెండు మార్గాలు—



* వాదం లాభకరంగా ఉండాలంటే నీవు వాదించడం మానుకోడమే ఉత్తమం.
* ఎదుటివారు చెప్పేదానిని గౌరవించు. ఎవ్వరినీ నీవు తప్పు అనవద్దు.
* నీవు పొరబడితే వెంటనే ఒప్పుకో. నొక్కి చెప్పు.
* స్నేహపూర్వకంగా ప్రారంభించు.
* ఎదుటివాళ్లు 'ఔను' 'ఔను' అనేటట్లు చెప్పాలి.
* ఎదుటివాళ్లని ఎక్కువగా మాట్లాడనీ.
* అంతా ఎదుటివారి ఉద్దేశమే అన్నట్లు అనిపించు.
* చిత్తశుద్ధితో ఇతరుల దృష్టితో పరిశీలించు.
* ఎదుటివారి భావాలను, కోరికలను మన్నించు.
* ఉత్తమ భావాలతో నచ్చజెప్పు.
* నాటకీయతను అభినయించు.
* సవాలు చేయకు.

"విద్యావంతుడయ్యే వరకు ఒక ప్రాణి మానవజీవిగా అనిపించుకోడు."

జరుగుతుందని, బుద్ధుడు, బ్రహ్మల అనుచరుల మధ్య ముస్లిముల మధ్య విభజించ బడుతుందని జోస్యం చెప్పాడు. ఆయన చెప్పినట్లే 1947లో ఇండియాను హిందూ, ముస్లిములు విభజించుకున్నారు. రష్యన్ చక్రవర్తి నికొలస్ II విషాద మృతి, ఇటలీ రాజు హంబర్ట్ హత్యల గురించి ఆయన ముందే చెప్పాడు.



ఆయన చెప్పినట్లే 1917లో వచ్చిన రష్యా విప్లవంలో జార్ అతని కుటుంబ సభ్యులు దారుణంగా చంపబడ్డారు. 1900 జూలై 29న ఇటలీ రాజు హంబర్ట్ అరాజకవాది మోంజా చేత హత్య చేయబడ్డాడు.

ఆహారం కోసం అతి తీవ్రమైన పోరాటం జరిపిన అరాచకపు మూకల వల్ల టెహరాన్ గవర్నర్ జైలుపాలవుతాడని పర్షియా షా ముజఫర్-ఉద్-ద్దీన్‌కు ఒకసారి చీరో చెప్పాడు. తరువాత అయన చెప్పినట్లే జరిగింది. ఎర్షియాలో కొట్లాటలు జరిగాయి. ఇంగ్లండుకు చెందిన ప్రఖ్యాత సాహితీవేత్త ఆస్కార్ వైల్డ్‌కు ఎదురయ్యే దుర్దశ గురించి చీరో ముందుగానే చెప్పాడు. రచయితగా ఆస్కార్ వైల్డ్ అద్భుత విజయాలు ఎన్నో సాధించినా చివరిదశలో ఫ్రాన్స్‌లో తన సర్వస్వం కోల్పోయి గుర్తింపులేని విధంగా, అతి హీనదశలో, కటిక దారిద్ర్యం అనుభవించి కన్నుమూసాడు.

1893లో చీరో అమెరికా వెళ్లినప్పుడు "న్యూయార్క్ వరల్డ్" సంపాదకుని కోరికపై డాక్టర్ హెన్రీ సి.ఎఫ్.మెయర్ హస్తరేఖలు పరిశీలించాడు. ఈ హస్తరేఖలున్న వ్యక్తి అత్యధిక మానసిక ఒత్తిడులకు గురై జైలులో మరణిస్తాడని చీరో జోస్యం చెప్పాడు. డాక్టర్ మెయర్ ఒక క్రూర హంతకుడు, 17 హత్యలు చేసినట్లు ఒప్పుకున్నవాడు. అతనికి ఉరిశిక్ష విధించారు. ఉరిశిక్ష అమలు జరిగేలోగా మానసిక వైకల్యం తోనే చనిపోయాడు!

తాను వెళ్లిన చోట్లలో హస్తరేఖా ప్రవీణుడుగా చీరో అఖండ విజయం సాధించాడు ఆయన గ్రంథాల రాయల్టీలతో సహా మొత్తం చీరో ఆస్తి విలువ 25,000,000 రూపాయలు ఉంటుంది.

తను ఏ గంటలో మరణించేది కూడా చీరో ముందుగానే చెప్పుకున్నాడు సుదీర్ఘ అనారోగ్యం తరువాత 1936లో అమెరికాలోని లాస్ ఏంజెల్స్‌లో ఆయన శాశ్వతంగా కన్నుమూసాడు

## మూడవ ప్రపంచంలో భారతదేశం స్థానం

*దేశ సంరక్షకోత్పాదక రంగంలో (Defence Production) విస్తరణ మరియు ప్రగతులకు మూడవ ప్రపంచంలో భారతదేశం అత్యున్నత స్థానాన్ని పొందుతూంది ఆయుధాల ఉత్పత్తిలో బ్రెజిల్ తరువాత ద్వితీయ స్థానాన్ని పొందుతూంది. దేశీయ విజ్ఞానంలో ఆధునిక పరికరాలతో రూపొందించి నిర్మించబడిన మొట్టమొదటి జలాంతర్గామి ఇక మూడు సంవత్సరాలలో పరీక్షకు సిద్ధమవుతుంది. 2000 సంవత్సరం నాటికి భారతీయ నౌకలలో 95 శాతం యుద్ధ సామగ్రి అంతా దేశీయంగా తయారు చేయబడుతుంది.*

"నీవు వారితో ఏకీభవించక పోయినా సరే ఇతరుల

# నిజాలు - నిదర్శనాలు

## పశుసంపదలో ప్రథమస్థానం

ప్రపంచ పశుసంపదలో ఇండియా అగ్రస్థానంలో ఉంది. 269 మిలియన్ పశువులు భారతదేశంలో ఉన్నాయి. సంవత్సరానికి పేడ ఉత్పత్తి 865 మిలియన్ టన్నుల నుండి 1,335 మిలియన్ టన్నుల వరకు ఉంటుంది. పేడను కాల్చటం ద్వారా ఇండియాలో మనం 2000 మెగావాట్లకు సమానమైన విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేస్తున్నాము

— 'బిజినెస్ ఇండియా' సౌజన్యంతో

## పోషకాహార లోపం వల్ల పిల్లల మరణాలు

ఇండియాలో ప్రొటీన్ల కొరత, పోషకాహార లోపం వల్ల ప్రతీ సంవత్సరం 1 5 మిలియను మంది పిల్లలు చనిపోతున్నారు ఇండియాలో 80 శాతం పిల్లలు పోషకాహార లోపం వివిధ దశల్లో అనుభవిస్తూండగా వారిలో ప్రతి 10 మందిలో ఒకరు తీవ్రంగా వ్యాధులకు లోనవటం జరుగుతూంది.

— 'స్వస్థ్ హింద్' సౌజన్యంతో

## యుద్ధరంగం కోరుతున్న వెండి

ప్రపంచ వ్యాప్తంగా యుద్ధరంగం 6.3 శాతం అల్యూమినియం, 3.9 శాతం క్రోమియం, 11.1 శాతం రాగి, 5 1 శాతం ఇనుప ఖనిజం, 8.1 శాతం సీసం, 6.3 శాతం నికెల్, 6.9 శాతం వెండి, 5.1 శాతం తగరం, 7 నుండి 8 శాతం వరకు విద్యుచ్ఛక్తి (పెట్రోలియంతో సహా)ని వినియోగించుకుంటూంది

## దేశంలో నగరు జనాభా

భారతదేశంలో ఒక జిల్లాలో సగటున 1.8 మిలియను మంది జనాభా నివసిస్తుంటారు. బొంబాయి, మద్రాసు, కలకత్తా, ఢిల్లీ వంటి ప్రధాన నగరాల్లో ప్రతి చదరపు కిలోమీటరుకు 10,000 జనాభా ఉంది.

— '1991 సెన్సెస్ సర్వే' సౌజన్యంతో

## మనస్సులో భూతాలు

*ప్రపంచంలో జీవిస్తూ పవిత్రతను పొందడం ఎలా? అడవులకు వెళ్లాలా? కొండ గుహలలోకి వెళ్లాలా? అవి మనకు ఏం మంచిని కలిగిస్తాయి?*



Bhagavad Gita

మనస్సు మన స్వాధీనంలో లేనప్పుడు గుహలలో నివసించి లాభం లేదు అక్కడ కూడా అదే మనస్సు అవే తొందరలను కలిగిస్తుంది. గుహల్లో దయ్యాలూ, భూతాలు కనిపిస్తున్నాయంటే అవి మనస్సులో ఉన్నవే. మనస్సు స్వాధీనంలో ఉంటే మనం ఎక్కడ ఉంటే అక్కడే లభిస్తుంది పవిత్రత

— భగవద్గీత

"యుద్ధ బీజాలకు క్షేత్రాలు మానవ మస్తిష్కాలే."

## రూ. 3,969 కోట్లు లోటు

1991-92లో రూపాయలవరంగా లెక్కిస్తే మన వర్తకంలో లోటు రూ. 3,969 కోట్లు కాగా 1990-91లో ఇది రూ. 10,643 కోట్లుగా ఉంది.

## ఉత్తరప్రదేశ్‌లో దారిద్ర్యం

ఇండియాలోని అన్ని రాష్ట్రాలలో కంటే ఉత్తర ప్రదేశ్‌లో దారిద్ర్యరేఖకు దిగువనున్నవారు 4.48 కోట్ల మంది కాగా బీహార్‌లో 3.36 కోట్లు, మధ్యప్రదేశ్‌లో 2.24 కోట్లు, మహారాష్ట్రలో 2 14 కోట్ల మంది ఉన్నారు.

## 29.9 శాతం ప్రజలు దారిద్ర్య రేఖకు దిగువన

ఇండియాలో 23 76 కోట్లు అంటే 29 9 శాతం మంది ప్రజలు దారిద్ర్య రేఖకు దిగువ నున్నారు. వీరిలో 19 59 కోట్ల మంది గ్రామీణ ప్రాంతాలలో నివసిస్తున్నారు

## నిమిషానికి 31 మంది జన్మిస్తున్నారు

1991 జనాభా లెక్కల సర్వే ప్రకారం ఇండియాలో ప్రతీ నిమిషానికి 31 మంది జన్మిస్తున్నారు. దేశ జనాభా 2000 సంవత్సరానికి 1007 మిలియన్లకు చేరుకోవచ్చు. ఇక్కడ ప్రతి చదరపు కిలోమీటరుకు సగటున 267 మంది నివసిస్తున్నారు

## శ్రీలంకలో శిశుసంక్షేమం

1970లో 1000 మందికి 129, 1982లో 105 మంది, 1988లో 94 చొప్పున శిశు మరణాల సంఖ్య భారతదేశంలో తగ్గుదల చూపుతున్నా ఇతర అభివృద్ధి చెందిన దేశాలతో పోలిస్తే ఇది ఎక్కువే. శ్రీలంకలో శిశుమరణాల సంఖ్య తగ్గుతూంది. ప్రతీ 1000 పుట్టుకలలో 37 మాత్రమే మృత్యువాత పడుతున్నాయి.

— 'స్వస్థ హింద్' సౌజన్యంతో

## కార్ల ఉత్పత్తి

1950 నుండి ప్రపంచ వ్యాప్తంగా జనాభా పెరుగుదల రెండింతలయింది. 1950 నుండి కార్ల ఉత్పత్తి కూడా ఏడురెట్లు పెరిగింది! నేడు ప్రపంచవ్యాప్తంగా4 00 మిలియన్ల కార్లు రోడ్ల మీద తిరుగుతున్నాయి మరో 20 ఏళ్లలో ఇవి 700 మిలియన్లకు చేరుకోవచ్చు!

## కాగితం సగటు వాడకం

ఇండియాలో కాగితం సగటు వాడకం 2 9 కి గ్రాలు కాగా, అమెరికాలో 334 కి.గ్రా.లు, జపాన్‌లో 224 కి గ్రా లు, తైవాన్‌లో 134 కి.గ్రా ల కాగితం వాడుతున్నారు

## మితాహారం వల్ల జీవిత ప్రమాణం పెరుగుతుంది

*చాలా (రోజులపాటు) తినవలచుకున్న వాళ్లు బాగా మితంగా తినాలి అంటే మితాహారం వల్ల ఆయుః ప్రమాణం పెరుగుతుంది అని అర్థం*

*—లూయిస్ కార్నర్స్*

## అతి ముఖ్యమైన గుణాలు

*బాగా విజ్ఞాన వికాసం పొందిన వ్యక్తి గుణాలలో - కృతజ్ఞత గల హృదయం, యోచనలో కూడిన మనస్సు, స్నేహపూర్వకమైన చిరునవ్వు, ప్రేమాభిమానంతో కూడిన పలుకు, సహకరించే చేయి, ధైర్యం కూడా చేరి ఉంటాయి*

"కాంచనం కోసం పిపీలికగొట్టు ఎలా వెంపరలాడతాడో దేవుడి కోసం ఏ మనస్సుని అలా ఆరాటపడనివ్వు."

# విష కక్కే ఊసరవెల్లులు

టి.ఎస్.ఎన్.మూర్తి

బల్లులు లేదా ఊసరవెల్లులన్నీ విష పూరితాలనే దురభిప్రాయం మనలో ఉంది. కానీ అమెరికా ఎడారి ప్రాంతాల్లో నివసించే రెండురకాల ఊసరవెల్లులే విషపూరితాలు



GILA MONSTER (POISONOUS LIZARD)

అని నిర్ధయించారు. అరిజోనాలోని గిలాలో నివసించే 'గిలా మాన్‌స్టర్', మెక్సికో (సెంట్రల్ అమెరికా)లో నివసించే 'బీడెడ్ లిజార్డ్' (వెన్ను మీద పూసల మాదిరిగా ఉండే వింత బల్లి) నిజానికి విషం గల బల్లులు లేక ఊసరవెల్లులు. ఇవి కరిస్తే చనిపోయినవారు కొందరు కనిపిస్తున్నా ఇవి మనుమలకు అను కున్నంత తీవ్రమైన ఇబ్బందుల్ని కలిగించవని చెబుతున్నారు. వివిధ వర్ణాలతో పైకి చక్కగా కనిపించే సరీసృపాలు ఈ రెండింటి కంటే ఎక్కువ విషపూరితాలని పలువురి విశ్వాసం.

పూసల కళ్లు, విచిత్రమైన రంగు, చీలికలైన నాలుక, పాముల వలే నాలుకను వెలుపలికి, లోనికి త్రిప్పుతూ ఉండటం - వీటితో ఈ భారీ సరీసృపాలు వేటినైనా చంపేందుకు సిద్ధంగా ఉండి శత్రువుల్ని దరిచేరనివ్వవు. భారీ తోకలతో, బరువైన శరీరాలతో ఇవి మత్తుగా సాగిపోతూంటాయి. తమకు ఆహారంగా ఉపయోగపడే జంతువుల్ని కూడా ఇవి పట్టుకోవు. గూళ్ల మీది పక్షులు, పిల్లలక పాలిచ్చే చిన్న అడవి జంతువులు, ఇతర సరీసృపాల, పక్షుల గ్రుడ్లు వీటి ఆహారం. ఇటువంటి సోమరి జంతువులు ఎవరైనా తమపై అత్యాచారం జరిపితే తక్షణమే సంసిద్ధమై ఎదుర్కొంటాయంటే నమ్మశక్యం కాదు. వీలరక్త మిశ్రమవర్ణం గల నాలుకల్ని బయటికి పెట్టి శరీరాల్ని ముందుకు జరుపుకుంటూ, బుసలు పెడుతూ శత్రువు శరీరంలో గుచ్చేందుకు అనువైన విషపు కోరలతో విఫణంగా సాగి పోతాయి. బుల్‌డాగ్స్ మాదిరిగా ఉండే వీటి పట్టు నుండి విడిపించుకోవటం ఎవరికీ సాధ్యంకాదు.

వీటి విషపుతిత్తులు సర్పాలలో మాదిరిగా పై దవడలో కాకుండా అదృష్టవశాత్తు క్రింది దవడలో అమరి ఉండటం వల్ల త్రాచుపాము మాదిరిగా శీఘ్రగతిలో కాటువేసేందుకు వీలు కావటంలేదు. అందువల్ల ఈ ఊసరవెల్లులు కాటువేసిన తరువాత కొంతకాలం నిరీక్షించి బలి అయిన జీవి మాంసాన్ని నములు

## గీతార్థ సంగ్రహం

*భగవద్భక్తి గలవారికి ఈశ్వర ప్రసాదము వల్ల ఆత్మజ్ఞానం కలిగి అత్యంత సహజంగా మోక్షం లభిస్తుంది. ఎక్కడ యోగీశ్వరుడైన శ్రీ కృష్ణమూర్తియు, ఎక్కడ ధనుర్ధరుడైన అర్జునుడును ఉంటారో అక్కడ లక్ష్మి, విజయం, ఐశ్వర్యం, నీతి ఉంటుంది.*

"జ్ఞానం లేని న్యాయబుద్ధి బల హీనమైనది, నిష్ప్రయోజనకరమైనది. కరమైనది, భయంకరమైనది."

# తెలుపు

మిసెస్ మరియోలా

వైట్‌లైట్: ఏడురంగుల కలయిక విబ్ గయార్ (Vibgyor) - మధ్యాహ్నం వేళల్లో సూర్య కాంతి రంగు. ఈ వర్ణ క్రమాన్ని ప్రథమంగా ఐజాక్ న్యూటన్ కనుగొన్నారు. తెల్లరంగు వేడి మిని గ్రహించదు. అందువల్లనే క్రికెట్ ఆటగాళ్ళు, తదితరులు తెల్లని దుస్తులు ధరించి పగటి వేళల్లో తమ పనులు నిర్వహించుకుంటారు.



వైట్‌కాలర్ జాబ్: గొడ్డలి, మట్టి తాకకుండా, దుస్తులు చెడకుండా, శారీరక శ్రమ పడకుండా ఉండే ఆఫీసర్లు, అటువంటి శ్రేణిలోనివారు చేసే ఉద్యోగాలు.

వైట్ కాంప్లెక్షన్: బ్రిటీష్‌వారు తెల్లగా, నీగ్రోలు నల్లరంగులో ఉంటారు. ఇది చర్మంలో మెలానిన్ అనే రంగువల్ల ఏర్పడుతుంది. ఇది శరీరంలో ఎక్కువైతే ఆ వ్యక్తి నల్లగా ఉంటాడు. లేకపోతే చక్కగా కనిపిస్తారు. అలాకాకుండా మధ్యే మార్గంగా కూడా ఉండవచ్చు.

వైట్ పేపర్: పార్లమెంటుకు సమాచారం అందించేందుకు ప్రభుత్వం చేత తెల్లకాగితంపై ముద్రించి విడుదల చేయబడిన ఒక శ్వేత పత్రం.

## వివాహమే సమాధానం

మానవుని జీవితంలో వివాహం అతి సహజం. కాబట్టి వివాహ జీవితంలోనే నీకు అసలైన పరిపూర్ణ సుఖం లభిస్తుంది

స్త్రీ పురుషుల అన్యోన్య సంబంధం వల్లనే మానవత్వం పరిపూర్ణత చెందుతుంది స్త్రీకి పురుషుని శారీరక బలం, మనోబలం అవసరం. పురుషునికి స్త్రీ సౌకుమార్యం, నైపుణ్యమైన సూక్ష్మ పరిశీలనా విధానం అవసరం స్త్రీ పురుషులు ఇద్దరూ సమైక్యంగా విజయాన్ని సాధిస్తారు

పురుషుడు ఒక్కడే ఒంటరిగా సమైక్య జీవనంలో ఉన్న విలువను సాధించలేడు. స్త్రీ లేనప్పుడు అతడు అసంపూర్ణమైన ప్రాణి. కత్తెరలో సగం భాగంలా ఉంటాడు



నీకు ఒక వివేకవతి మరియు ఆరోగ్యవంతమైన భార్య లభించినప్పుడు ఆమె సౌభాగ్యంతో నీ వృత్తి వ్యాపారం విజయవంతంగా కొనసాగుతుంది.

— బెంజమిన్ ఫ్రాంక్లిన్

"ఏ తోటలో పెరిగినా గులాబి ఎలా అందమైందో, ఎటువంటి దీపంలో నుంచి వచ్చినదైనప్పటికీ కాంతి మంచిదే."

వైట్ హౌస్: వాషింగ్టన్ డిసిలో ఉన్న అమెరికా అధ్యక్షుని అధికార భవనం.

వైట్ ఎలిఫెంట్: అధీనంలో ఉన్న పనికి రాని వస్తువు. ఖరీదైనది. ఒక బికారికి మారుతి కారు ఇస్తే అతను పేదరికం వల్ల దానిని నిభాయించుకోలేడు. కనుక ఆ మారుతికారు అతడికి ఒక వైట్ ఎలిఫెంట్!

వైట్ మనీ: బాగా గడించిన వారెవరైనా ప్రభుత్వానికి పన్ను కట్టి తీరాలి. ఆ విధంగా లెక్కలలో చూపిన డబ్బును 'వైట్ మనీ'గా పిలుస్తారు.

వైట్ లై: ఒక వ్యక్తిని రక్షించేందుకు, ఒక సమస్యను పరిష్కరించేందుకు చెప్పే అపాయం లేని, అమాయకమైన అబద్ధం.


Polar bear

వైట్ బేర్స్ (పోలార్ బేర్స్): ఆర్కిటిక్ (పోలార్) ప్రాంతంలో నివసించే తెల్ల ఎలుగు బంట్లు. వీటి లివర్‌లో విటమిన్ A అధికంగా ఉంటుంది.

## ముఖ్యమైన మంచిగుణాలు

*బెంజమిన్ ఫ్రాంక్లిన్ అనుసరించిన మంచి గుణాలలో ముఖ్యమైనవి:*



*క్లుప్త సంభాషణ: అనవసరమైన వ్యర్థ ప్రసంగం చేయకుండా నీకూ, ఇతరులకు పనికివచ్చే మాటలే మాట్లాడాలి. క్లుప్తంగా మాట్లాడాలి.*
*క్రమపద్ధతి: అన్నిటినీ క్రమపద్ధతిలో పెట్టుకుని కాలానుగుణ్యంగా ఆచరిస్తూండు.*
*కృతనిశ్చయం: నీవు చేయవలసినది, ఆచరించవలసినది నిర్ణయించుకో. నిర్ణయించుకున్నది తప్పనిసరిగా ఆచరించు.*
*మితవ్యయం: నీకు, నీతో ఉన్న ఇతరుల మంచికి ప్రయత్నించు. దుబారా ఖర్చు చేయకు.*
*పరిశ్రమ: కాలం వ్యర్థం చేయకు. ఎప్పుడూ ఏదో ఉపయోగపడే పని చేస్తూండు. అనవసరమైన పనులు వదలుకో.*
*నిష్కాపట్యం: మోసం చేయడానికి పూనుకోకు. న్యాయంగా ఆలోచించు. న్యాయబద్ధంగా మాట్లాడు.*
*న్యాయం: ఇతరులకు అపకారం చేసి తప్పుచేయకు. నీ ధర్మం వల్ల నీవు పొందే లాభాలను వదలకు.*
*సమతను పాటించు: అతికి పోవద్దు. ఓర్పు సహనం అవసరం అని తెలుసుకో.*
*శుభ్రత: శరీరం, బట్టలు, పరిసరాలు ప్రతిచోట్లో పరిశుభ్రతను పాటించు.*
*శాంతి: చిన్న చిన్న విషయాలను గురించి చింత పడిపోవద్దు. శాంతం అభ్యాసం చేసుకో.*

"నిజమైన ప్రేమ విశ్వజనీనమైనది."

# అక్కడా - ఇక్కడా

## మంచినీటి ప్లాంట్

ఉప్పునీరు నుంచి మంచి నీటిని ఉత్పత్తి చేసే ఇండియాలోని ప్రప్రథమ మొబైల్ వాటర్ ప్లాంట్‌ను హైదరాబాద్ భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్ పరిశోధన, అభివృద్ధి విభాగం తయారు చేసింది. ప్రతీరోజూ 15,000 లీటర్ల త్రాగేనీటిని ఇది సరఫరా చేస్తుంది.

## ఆసియాలోని మొదటి స్ట్రెప్టోమైసిన్ ప్లాంట్

పూనె (మహారాష్ట్ర) సమీపంలోని పింప్రి వద్ద స్థాపించబడిన హిందూస్థాన్ యాంటీ బయాటిక్స్ సంస్థ ఆసియాలో మొట్టమొదటి స్ట్రెప్టోమైసిన్ ప్లాంట్ నెలకొల్పింది 213 లక్షల వ్యయంతో నిర్మించిన ఈ ప్లాంట్ ప్రతీ సంవత్సరం 80 నుంచి 90 టన్నుల స్ట్రెప్టోమైసిన్ ఉత్పత్తి చేసి దేశానికి దాదాపు కోటి రూపాయల విదేశీ మారక ద్రవ్యాన్ని ఆదా చేస్తున్నది

## కొత్తరకం తీర్పు

తనను కొట్టాడనే అభియోగం చేసిన వ్యక్తిని ముద్దు పెట్టుకోమని దోషిని కైరోలో ఒక జడ్జి ఆదేశించాడు. బహిరంగంగా చుంబిస్తే వైమనస్యాలు సమసిపోతాయని ఆ న్యాయమూర్తి విశ్వాసం. సాక్షుల ఎదుట దోషి అలాగే ముద్దు పెట్టుకున్నాడు. జడ్జి అతణ్ణి విడుదల చేసారు.

## జీరో బేస్ బడ్జెట్ విధానం

భారత ప్రభుత్వ శాఖలన్నీ జీరోబేస్ బడ్జెట్ విధానాన్ని అమలు చేస్తున్నాయి. ఈ విధానంలో ఇప్పుడు కొనసాగుతూన్న ప్రాజెక్టులకయ్యే ఖర్చు కూడా అవసరమో కాదో పునఃపరిశీలించి అనుమతిస్తారు. ఇది అభివృద్ధి పనులకయ్యే వ్యయానికీ, అభివృద్ధేతర రంగాలలోని వ్యయానికీ వర్తిస్తుంది.

## జపాన్‌లో అణు విద్యుత్ కేంద్రాలు

2030 నాటికి జపాన్ విద్యుత్ అవసరాలలో 58 శాతం వరకు అణుశక్తి సమకూర్చగలదని ఒక జపాన్ ప్రభుత్వ నివేదిక వెల్లడిస్తూంది ప్రస్తుతం జపాన్‌లో మొత్తం 24 52 మిలియను కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసే 32 అణు కేంద్రాలు ఉన్నాయి అణుశక్తి నుంచి విద్యుత్ ఉత్పత్తి చేసే ప్రపంచ దేశాల్లో జపాన్ నాలుగో స్థానంలో ఉన్నది.

## సర్ప సంతానం

క్యూబెక్ (కెనడా)లో గ్రాన్‌బీ జంతు ప్రదర్శన శాలలోని ఒక సర్పం 77 పిల్లల్ని కన్నది. ఈ జాతి పాములకు సాధారణంగా2 0-25 పిల్లలు కలగటం, అసాధారణంగా5 0 పిల్లలు పుట్టటం జరుగుతుంది!

## ఒకటిపోతే ఇంకొకటి

*సిగరెట్లు కాల్చే అభ్యాసాన్ని నివారించడానికి లండన్‌లో ఒక ఆంటీ స్మోకింగ్ క్లినిక్‌లో నికొటిన్ చేర్చిన చ్యూయింగ్ గమ్‌ను ఉపయోగిస్తున్నారు. ఈ క్లినిక్‌ను సందర్శిస్తూన్న 40 శాతం మంది సిగరెట్లు కాల్చేవారు సుమారు ఒక సంవత్సరం పై నుంచీ సిగరెట్లు కాల్చడం మానివేసినా వీరిలో 10 శాతం మంది నికొటిన్ చేర్చిన ఈ చ్యూయింగ్ గమ్‌కి అలవాటు పడిపోయారు.*

'ప్రకృతి పట్ల మానవుడు క్రూరదృష్టి ప్రసరిస్తే ప్రకృతి కూడా మానవుడి పట్ల కనికరం చూపదు.''

# విజ్ఞానవేదిక

## అట్లాంటిక్ మహాసముద్రం

ప్రపంచంలోని పెద్ద సముద్రాల్లో రెండో స్థానం అలంకరిస్తున్న అట్లాంటిక్ మహా సముద్రం అమెరికాను యూరప్, ఆఫ్రికాలనుండి వేరు చేస్తుంది అట్లాంటిక్ మహాసముద్రం దాదాపు 83,000,000 చ కి మీ ల ప్రాంతంలో విస్తరించుకుని ఉంది



ఒక ఇసుక గడియారం ఆకారంలో ఉన్న ఈ అట్లాంటిక్ ఉత్తరం నుండి దక్షిణానికి 14,400 కి మీ ల పొడవు కలిగి ఉంది దీనిలోని ఉత్తర భాగం ఆర్కిటిక్ మహాసముద్రంలో కలిసిపోగా, అంటార్కిటిక్ మహాసముద్రం దక్షిణ భాగం వరకు విస్తరించింది అట్లాంటిక్ మహాసముద్రంలోని వెడల్పయిన భాగం ఉత్తర ఆఫ్రికాలోని మొరాకోనుండి అమెరికాలోని ఫ్లోరిడాకు 6400 కి మీ ల దూరం వరకు విస్తరించి ఉంది నార్వే, గ్రీన్‌లాండ్ (ఉత్తర యూరప్)ల మధ్య కేవలం 1,490 కి మీ ల మేరకే ఇది ప్రవహిస్తుంది

**అట్లాంటిక్ ఉపరితల శీతోష్ణ స్థితిలో తేడా** ఉంటుంది ఉష్ణమండల ప్రదేశాల్లో 27 డిగ్రీల సెంటిగ్రేడ్ ఉష్ణోగ్రత ఉంటే ఆర్కిటిక్, అంటార్కిటిక్ సముద్ర ప్రాంతాల్లో - 2 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉంటుంది అంతేకాక అనేక తీర ప్రాంతాలలో నీటి శీతోష్ణస్థితి గడ్డ కట్టించే దశలో ఉంటుంది

ఐస్‌లాండ్ నుండి అంటార్కిటికా వరకు అట్లాంటిక్ సముద్రతీరం వెంబడి 'ఎస్' ఆకారంలో ఒక పర్వతశ్రేణి సాగిపోతుంది 'మిడ్-అట్లాంటిక్ రిడ్జ్' అని దీన్ని పిలుస్తారు. ఇది అట్లాంటిక్ సముద్రతలాన్ని రెండు లోయలుగా విభజిస్తుంది ఈ కొండల వరుస సముద్ర మట్టానికి 3000 మీటర్ల దిగువన ఉంది దీనిలోని కొన్ని చెదురు మదురు శిఖరాలు-అజోరిస్, అస్సెంషియన్, ట్రిస్టన్ డకన్హ-వంటి ద్వీపాలుగా ఏర్పడ్డాయి.

మరికొన్ని అట్లాంటిక్ తీర భాగాలు మృదువుగా ఉండి చదునైన పీఠభూములుగా రూపొందాయి వీటిలో స్కాట్లండ్ (బ్రిటన్) నుండి న్యూఫౌండ్‌లాండ్ (కెనడా-ఉత్తర అమెరికా) వరకు విస్తరించిన టెలిగ్రాఫ్ పీఠ భూమి ఒకటి టెలిఫోన్, టెలిగ్రాఫ్ కేబుల్స్ ఇచ్చట వేసినందువల్ల దీనికీ పేరు వచ్చింది.

ప్యూర్టో రికోకు ఉత్తరంగా మిల్‌వాకీ డెప్త్ అనే ప్రదేశం అట్లాంటిక్ సముద్రంలోనే లోతైన ప్రదేశం ఇది 9,000 మీటర్ల లోతు ఉంటుంది ఉత్తర అట్లాంటిక్ సముద్రంలోని గల్ఫ్ జలాలు యూరప్ తీరాలకు తమ ఉష్ణ మండల ప్రదేశాల వేడినీటిని అందిస్తాయి

కాడ్, హాలిబట్, షెల్‌ఫిష్, హెర్రింగ్ అనే ప్రధాన మత్స్యాలు అట్లాంటిక్ మహాసముద్రంలో

"సంతోషం కూడా మంచుబిందువు లాగా సున్నితమైనది నవ్వుతూనే నిమ్రమిసుంది"

లభిస్తాయి న్యూ ఫౌండ్‌లాండ్‌కు సుమారం లోని 'గ్రాండ్ బాంక్స్' ప్రపంచంలోనే ప్రధానమైన చేపల ఉత్పత్తి కేంద్రాలుగా పేరు పొందాయి

పదిహేనవ శతాబ్దిలో మానవుని సాహసిక ప్రవృత్తి అట్లాంటిక్ మహాసముద్రంలోని రహస్యాలను వెలికి తెచ్చేందుకు పూనుకుంది 1487లో పోర్చుగీస్ నావికుడు బర్తలోమియో డియాస్ అట్లాంటిక్ మహాసముద్రం దాటి, కేప్ ఆఫ్ గుడ్ హోప్‌ను చుట్టి, ఆఫ్రికాకు దగ్గరి దారిగా ఆసియాకు ఒక క్రొత్తమార్గాన్ని తెరిచాడు.

1492లో క్రిస్టఫర్ కొలంబస్ అనే మరో నావికుడు అట్లాంటిక్ మహాసముద్రానికి పశ్చిమ దిశలో పయనించి ఆసియాకు సముద్ర మార్గం కనుగొనే ప్రయత్నంలో అమెరికా ప్రధాన భూభాగాన్ని, వెస్ట్ ఇండీస్‌ను కనుగొన్నాడు

తరువాత 100 ఏళ్లలో అమెరిగో వెస్పుక్కి, జాన్ కాబట్, గియోవన్నీ డ వెర్రజానో మొదలైన సాహసికులు అట్లాంటిక్ మహాసముద్రంలో పాత యూరప్ ప్రాంతం నుండి న్యూ వరల్డ్ (అమెరికా) వరకు ప్రయాణించి వెనుతిరిగి వెళ్లారు

400 ఏళ్ల తరువాత 1919లో బ్రిటిష్ వైమానికులు అల్‌కాక్ మరియు బ్రౌన్ మొదటి సారిగా ఏకబిగిన ఎక్కడా ఆగకుండా అట్లాంటిక్ సముద్రం మీద విమానయానం చేసారు కొలంబస్‌కు అట్లాంటిక్ మహా సాగరాన్ని దాటేందుకు 73 రోజులు పట్టింది ఈనాడు శీఘ్రంగా పయనించే జెట్ విమానాలు అట్లాంటిక్ మహాసముద్రాన్ని ఆరుగంటలకంటే తక్కువ వ్యవధిలో దాటుతున్నాయి

# క్రికెట్ వార్తలు

## 310వ వికెట్ తీసి లిల్లీ క్రొత్త రికార్డును స్థాపించాడు

*ప్రఖ్యాత ఫాస్ట్ బౌలర్ ఆస్ట్రేలియా క్రికెట్ క్రీడాకారుడు డెన్నిస్ లిల్లీ 1981లో 310 వ వికెట్ తీసి క్రొత్త రికార్డును స్థాపించాడు*



## 1913-14 టెస్ట్ సిరీస్‌లో 49 వికెట్లు తీసిన బార్నెస్

*బౌలర్‌గా ప్రఖ్యాతి గడించిన బ్రిటిష్ క్రీడాకారుడు సిడ్నీ ఫ్రాన్సిస్ బార్నెస్ (1873-1967) దక్షిణ ఆఫ్రికాలో జరిగిన 1913-14 టెస్ట్ సిరీస్‌లో 49 వికెట్లు తీసి రికార్డు స్థాపించాడు*

## మొట్టమొదటి క్రికెట్ నిబంధనలు 1744 లో రూపొందించబడ్డాయి

*క్రికెట్ నిబంధనలు మొట్టమొదట 1744లో రూపొందించబడి 1752లో నవంబరు మాసపు న్యూ యూనివర్సల్ మ్యాగజైన్‌లో అచ్చుకావించబడ్డాయి తరువాత ఇవి ఒక కరపత్రంగా అచ్చు వేయబడినవి*

"ఇతరుల కష్టాలలో మనం పాలు పంచుకున్నా, ఇతరుల సుఖాలలో మన సుఖాన్ని వెదుక్కున్నా మనం దేవుణ్ణి ప్రేమిస్తున్నట్లే"

# చిట్టి దేవతలకు చిన్న కథలు

## ఆరోగ్యమే మహాభాగ్యం

కె.వి.ఎస్. సంతోష్

‘నిమ్మపండ్లు, నిమ్మపండ్లు, నిమ్మపండ్లోయ్!’ అనే మాటలు చెవిని పడుతూంటే ప్రతీ ఉదయం ఆరు గంటలకు నిద్ర లేస్తాను ఆ ముసలమ్మ ఖచ్చితంగా ఆరింటికి మా వీధిలో నిమ్మపండ్లు అమ్ముతుంటుంది



ఆమెను గురించి తెలుసుకోవాలనే కోరికతో ఒకరోజు ఆమె కేక వినబడగానే బయటికి వెళ్లి పిలిచాను ఆమె లోపలికి వస్తూ నవ్వు ముఖంతో ఇలా అంది “బిడ్డా! నేను ఒకే ధర చెబుతాను రూపాయికి ఆరు పండ్లు నీకు ఎన్ని ఇచ్చేది?”

ముందు ఆమెను సుఖంగా కూర్చోమన్నాను. ‘అవ్వా! నీకు ఎనభై దాటి ఉండవచ్చు బ్రతుకు గడవడానికి ఇంత కష్టపడుతున్నావు నీకో మంచి నౌకరీ చూపిస్తాను మా ఔట్‌హౌస్‌లో ఉండి తోటపని చూసుకో నీకు అన్నం పెట్టి నెలకు రూ 200లు జీతం ఇస్తాను మరి ఇక్కడే ఉంటావా?’ అని అడిగాను

ముసలమ్మ ఒకటే నవ్వటం! ఆమె ప్రవర్తన నాకు ఆశ్చర్యం కలిగించింది ఆమె దీర్ఘ నిశ్వాసం ఒకటి విడిచి నా కళ్లలోకి చూస్తూ నెమ్మదిగా ‘బిడ్డా నా కథ వింటావా?’ అంది.

నాకు కుతూహలం పెరిగిపోయింది ‘అవ్వా! వినాలనే ఉంది చెప్పు త్వరగా’.. అన్నాను

### క్రింది వాటి విషయంలో జాగ్రత్త సుమా!




పొద్దూ పద్దూ లేకుండా సదా వాగుతూండేవాడు, కపట వ్యాపయుడు, చెవులలో తులసీ దళమును పెట్టుకుని తన భక్తిని ప్రదర్శించువాడు, పాచి పట్టిన మురుగు గుంటలోని అనారోగ్యకరమైన చల్లని నీరు

— శ్రీరామకృష్ణ పరమహంస

“మానసికంగా క్రుంగిపోకుండా పరాజయాన్ని భరించగలగటమే ధైర్యానికి పరీక్ష”

'నా భర్త చనిపోయి పదేళ్లయింది నాకు పిల్లలు లేరు' అని ఆమె ప్రారంభించింది

'అవ్వా! ఒంటరిదానివి కదా! మాతో ఉండ రాదా? ఏదో కొద్దిగా పని చేసుకుని హాయిగా ఉండవచ్చు' అని నేను అన్నాను



'బిడ్డా తొందరపడవద్దు నా కథ పూర్తిగా చెప్పనివ్వు' అన్నది అవ్వ

నేను మౌనం వహించాను 'మా ఊళ్లో కొద్దిగా పొలం, ఒక పూరిల్లు ఇచ్చి నా భర్త చనిపోయాడు నేను ఒక నిమ్మచెట్టు పెంచాను ప్రతిరోజు ప్రొద్దున్నే నిమ్మపళ్లు బుట్ట నిండా వేసుకుని పట్నం వస్తాను ఐదు రూపాయలు దొరికేదాకా అమ్ముకుంటాను మిగిలిన పళ్లు అనాథాశ్రమానికి దానంగా ఇస్తాను నాకు నాలుగు రూపాయలు దొరికితే చాలు మిగిలిన రూపాయి పెట్టి తినుబండారాలు కొని మా ఊళ్లో పేద పిల్లలకు పంచి పెడతాను ప్రతీ రోజూ నడుస్తూన్నందువల్ల నా ఆరోగ్యం బాగా ఉంది నేను అమ్మిన నిమ్మపళ్లు కొన్నవాళ్లు కూడా వాటిని తిని ఆరోగ్యంగానే ఉంటున్నారు నాకు కొద్దిపాటి వ్యాయామం, కొద్దిగా డబ్బు కావాలి ఇప్పుడు నేను చేస్తున్న పనివల్ల రెండూ లభిస్తున్నాయి అటువంటప్పుడు నేను తక్కువ పని, ఎక్కువ డబ్బు కోరుకోవటం ఎందుకు? నాకు మంచి ఆరోగ్యంతో పాటు అవసరమైనంతవరకు డబ్బు ఇస్తున్నందుకు ఆ దేవుడికి ఎప్పుడూ దణ్ణం పెడుతుంటాను'' అన్నది అవ్వ

నేను అవాక్కయ్యాను ఆ అవ్వ నిరాడంబరత్వానికి, గాఢ విశ్వాసానికి, తృప్తికీ ఆశ్చర్యపడ్డాను నా కళ్లు జలపూరితాలై, నా హృదయంలో ఆరాధనాభావం ఉప్పొంగగా ఆమెతో ఇలా అన్నాను ''అవ్వా! నిజంగా నీవు గొప్పదానివి ఇవ్వాళ నేను ఒక విలువైన పాఠం నేర్చుకున్నాను తప్పక ప్రతీరోజూ మా ఇంటికి రా! నేను నిమ్మ పండ్లు కొంటాను ప్రతీరోజూ నిమ్మపండ్లు అమ్ముతున్న నిన్ను చూడడంలో నాకు ఎంతో ఆనందం లభిస్తుంది''

సీత తృప్తి - [illegible]

## ఆస్కార్ అవార్డులు పొందిన ప్రప్రథములు



జెనెట్ గెయినార్ మరియు ఎమిల్ జెన్నింగ్స్ వరుసగా ఉత్తమ నటుడు మరియు ఉత్తమ నటిగా మొట్టమొదట ఆస్కార్ అవార్డులను పొందారు

''నెమ్మదిగా పెరుగుతున్నానని భయపడవద్దు ఉన్నచోటే ఉన్నానని [illegible]

# ఒక తండ్రి అందిస్తున్న దశ ఆదేశాలు

1 నీలోని సహోదరభావం నీబిడ్డ తనతోటి వారిని గౌరవంగా చూసేందుకు తోడ్పడుతుంది

2 నీ నిష్పాక్షికత అతడు చదువులో, ఆటలో మంచి క్రీడాకారుని (గెలుపు ఓటములతో సంబంధం లేని) దృష్టిని కలిగిస్తుంది



3 నీ దృష్టాంతం అతనిలో సమాజానికి వెన్నెముక వంటి కుటుంబ స్ఫూర్తి కలిగిస్తుంది

4 నీ సాహచర్యం వల్ల ఉభయుల మధ్య సదవగాహన పెంపొంది అతన్ని అనుచరునిగా మారుస్తుంది

5 నీ బోధన అతనిలో ప్రేమ, గౌరవం, స్వదేశ చట్టాలను గౌరవించే గుణం కలిగిస్తాయి

6 నీ ప్రోత్సాహం కష్ట కార్యాలను సాధించేందుకు అతడికి తోడ్పడుతుంది

7 సామాజిక రంగంలో నీ నాయకత్వ లక్షణం ప్రభుత్వ నిర్వహణలో స్థానికంగా పాల్గొని పనిచేసే ప్రాధాన్యాన్ని ప్రబోధిస్తుంది

8 నీ స్వయం పోషకత్వం అతనిలో స్వతంత్రేచ్ఛను రగుల్కొల్పి స్వయంకృషితో పనులు నిర్వహించే విధానాన్ని ప్రోత్సహిస్తుంది.

9 భవిష్యత్తు రక్షణ కోసం నీ ముందుచూపు అతనిలో బాధ్యతాదృష్టిని అభివృద్ధి చేస్తుంది

10 నీ మార్గ దర్శకత్వం ఒక స్వేచ్ఛా సమాజంలో పౌరుడుగా నెరవేర్చవలసిన బాధ్యతలను సూచించి, విధుల నిర్వహణకు అతణ్ణి సంసిద్ధుణ్ని చేస్తుంది

— 'ఇన్‌స్పిరేషనల్ కోట్స్' సౌజన్యంతో

## భారతదేశంలో అటవీ ప్రదేశం



1991 ఫారెస్ట్ రిపోర్ట్ ప్రకారం భారతదేశంలో 19.49 శాతం భూభాగం అడవులతో నిండి ఉంది. 11.73 శాతం దట్టమైన అరణ్యాలు, 7.63 శాతం విస్తారంగ అడవులు మరియు 0.13 శాతం మాంగ్రోవ్ అడవులు విస్తరించుకున్నాయి. దేశంలో అటవీ ప్రదేశం 1987-89 సంవత్సరాలలో 56,000 హెక్టేరులకు పెరిగింది

‘‘మనకు మనం హాని చేసుకోకుండా ఇతరులకు హా:

# అలనాటి నాగరికతకు అద్దం పట్టిన మొహంజొదారో

మొహంజొదారో (మృతజీవుల నగరం) ఒకనాటి సింధులోయ నాగరికతకు, హరప్పా సంస్కృతికి ప్రధాన నగరం కాగా నేడు అది పాకిస్థాన్‌లో ధ్వంసమై శిథిలావస్థకు చేరుకున్న చోటుగా కనిపిస్తుంది

ruins of Moenjodaro

కరాచీ (సింధు రాష్ట్రం)కి 400 కి.మీ.ల దూరంలో బ్రహ్మాండమైన ఇండస్ నదీ ఎడమ ఒడ్డున నిర్మితమైన 5000 ఏళ్ళనాటి మొహంజొదారో 'నాగరికత వేకువలో విరిసిన ఆశ్చర్యకరమైన ఒక స్మారక చిహ్నంగా' అభివర్ణించబడింది

వరుసగా నిర్మించిన ఇళ్ళు, విస్తారమైన భూగర్భ మురికినీటి పారుదల సౌకర్యాలు, స్నాన గృహాలు, క్రమబద్ధమైన నిర్మాణాలు కలిగిన మొహంజొదారో మానవుని నిర్మాణ చాతుర్యానికి, ఉమ్మడి సంక్షేమ కాంక్షకు అసమాన దృష్టాంతంగా నిలుస్తుంది

భూమి తనలో దాచుకుని శతాబ్దాలుగా ఈ మొహంజొదారో శిథిలాలను రక్షించుకుంది 1922లో ఇక్కడ జాగ్రత్తగా త్రవ్వకాలు జరిపిన పిదప ఎన్నో అద్భుతాలు వెలికి వచ్చాయి నీటి ప్రవాహం వల్ల ఏర్పడిన తేమ నేలలోని లవణాలను పీల్చుకుని ఈ శిథిలాలలోకి చొచ్చుకురావటం వల్ల ఎండ వేడిమికి ఈ శిథిలాల లోని రాళ్ళ మధ్య చేరిన లవణ పదార్థాలు కరిగి నిర్మాణాలకు దెబ్బ తగలటం జరుగుతూ వచ్చింది ప్రాచీన కుడ్యాలు కూలిపోవటం ప్రారంభమైంది ఈవిధంగా కొన్ని దశాబ్దాలలో మొహంజొదారో సర్వనాశనమై పోయే స్థితి దాపురించింది.

1974 నుంచి నీటి దురాక్రమణను అరికట్టేందుకు కొన్ని మిలియన్ల డాలర్లు వ్యయం చేస్తున్నారు భూమట్టానికి చేరిన నీటిని తొమ్మిది మీటర్ల వరకు కుంచించేందుకు వీలుగా ఇరవై ఆరు బావులను త్రవ్వారు ఇండస్ నదీ గర్భం పశ్చిమ దిశగా శిథిలాల వైపుకు విస్తరించకుండా నిలిపివేశారు అయినా ఇంకా చేయవలసింది ఎంతో ఉంది ప్రపంచంలో ఈ అత్యంత పురాతన నగరాన్ని రక్షించేందుకు 7 మిలియన్ డాలర్లు అవసరమౌతాయని నిపుణుల అంచనా

— 'యునెస్కో' సౌజన్యంతో

## నత్తివాళ్ళకు ఎడమచెవి బాగా వినిపిస్తుంది

అంటు బాగా సింపంగోళంగా ఉన్నప్పటికీ నత్తి వాళ్ళు ఎడమచెవికంటే కుడిచెవితో బాగా వినలేరు సామాన్యంగా ఎడమచేతి అభ్యాసం గల పిల్లలను కుడిచేయి అలవాటు చేసుకోమని బలవంతం చేసినప్పుడు వారిలో ఎక్కువగా నత్తి కనిపిస్తుంది దీనిని బట్టి సోవియెట్ వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు రెండు సలహాలను ఇస్తున్నారు నత్తివాళ్ళతో మాట్లాడేటప్పుడు ఎడమను అభ్యాసం చేసుకోవాలి రెండవది వారికి ఎడమవైపు మాట్లాడాలి

“మానవుడు సంప్రదాయం ఆధారం చేసుకుని ఆలోచనా శక్తిని

# ఈ శతాబ్దంలో

## ప్రపంచ ప్రథమ మహిళా అధ్యక్షురాలు

ప్రెసిడెంట్ జువాన్ డొమింగో పెరాన్ మరణించగానే ఆయన భార్య సెనొరా మరియా ఎస్టెలా పెరాన్ అర్జెంటీనా (ద అమెరికా) అధ్యక్షురాలిగా 1974 జూలైలో పదవీ స్వీకారం చేసి ప్రపంచంలోని మొట్టమొదటి మహిళా అధ్యక్షురాలు

## సుదీర్ఘకాల ప్రధాన మంత్రిత్వం


DR. SALAZAR

ప్రొఫెసర్ డాక్టర్. అంటోనియో డి ఒలివైరా సాలాజార్ పోర్చుగల్ (పశ్చిమ యూరప్) ప్రధానమంత్రిగా 36 సంవత్సరాల 83 రోజులు పనిచేసారు ఆయన కోమాలోకి పోయిన 11 రోజుల తరువాత - 1968 సెప్టెంబరు 27వ తేదీన - మార్పు జరిగింది

## పాశ్చర్ ఇన్స్టిట్యూట్ స్థాపన

కుక్క కాటుకు చికిత్స చేసే పాశ్చర్ ఇన్స్టిట్యూట్‌ను 1900లో కసౌలి (హిమాచల్ ప్రదేశ్)లో స్థాపించారు

## రబ్బర్ సాగు


మొట్టమొదటిసారిగా రబ్బర్ సాగు 1900లో కేరళలో ప్రారంభించారు

## ఐదు నక్షత్రాల డీలక్స్ హోటల్

ఇండియాలో మొట్టమొదటి ఐదు నక్షత్రాల డీలక్స్ హోటల్ - అశోకా హోటల్ - 1956 అక్టోబర్ 30న ఢిల్లీలో ప్రారంభించారు. మొట్టమొదటిసారి యూరప్ వెలువల జరిగిన యునెస్కో సమావేశం ప్రతినిధుల వసతి కోసం దీనిని నిర్మించారు

## బోయింగ్ 747 విమానం

బ్రహ్మాండమైన బోయింగ్ 747 విమానం 1970లో (షెడ్యూల్డ్ సర్వీస్‌తో) విమాన యానంలోకి ప్రవేశించింది దీంట్లో ఒకేసారి 490 మంది ప్రయాణం కొనసాగించవచ్చు.

## జలాంతర్గత నది

క్రామ్‌వెల్ కరెంట్ అనే నీటి అడుగు

"కష్టాలను ఎదుర్కొని అధిగమించకపోతే, పోరాటాలలో పాల్గొని జీవితం విశేషంగా శోభావిహీనంగా

భాగంలో సాగే 250 మైళ్ల వెడల్పు గల నదిని 1952లో కనుగొన్నారు ఇది పసిఫిక్ సముద్ర ఉపరితలానికి 300 అడుగుల అడుగున తూర్పుదిశగా భూమధ్యరేఖకు 3500 మైళ్ల పొడవున ప్రవహిస్తూంది దీని ఘన పరిమాణం అమెరికాలోని మిసిసిపి నది కంటే 1000 రెట్లు ఎక్కువ

## టాటా కంపెనీ స్థాపన




ఇండియాలో మొట్టమొదటి ఉక్కు కర్మాగారం టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ బీహార్‌లోని సాక్చి (జంషెడ్‌పూర్)లో 1908 మార్చి 1న స్థాపించబడింది 1911లో ఇక్కడ ఉత్పత్తి ప్రారంభమైంది

## ఇన్‌ఫ్లుయెంజా మృతులు

1918లో ఇన్‌ఫ్లుయెంజా అంటువ్యాధి ప్రపంచమంతటా వ్యాపించి అనేకమంది ప్రాణాలు తీసింది అప్పుడు ఇండియాలో 5 మిలియన్ల జనం ఈ వ్యాధికి గురయ్యారు

## విశాలమైన టేబిల్‌క్లాత్

ప్రపంచంలో అతి విశాలమైన టేబిల్‌క్లాత్ 60 గజాల పొడుగు, 2 1/2 గజాల వెడల్పు గలది ఉత్తర ఐర్లండ్‌లోని బెల్‌ఫాస్ట్‌లో 1972 జనవరిలో థాయ్‌లెండ్ రాజు భూమిబల్ కోసం నేయబడింది

## ఉత్తర ధృవం చేరిన మొదటి ఆసియావాసి

పశ్చిమ బెంగాల్‌కు చెందిన కృష్ణనగర్ వాసి శరత్‌కుమార్ రాయ్ 1927లో ఉత్తర ధృవం (ఆర్కిటిక్ ప్రాంతం) చేరుకున్న మొదటి ఆసియా వాసి చికాగో నేచురల్ హిస్టరీ మ్యూజియంలో భూగర్భ శాస్త్రవేత్తగా పనిచేస్తున్న రాయ్ రాసన్ మాక్మిలన్ నాయకత్వాన ఉత్తరధృవ సాహసయాత్రలో చేరాడు అమెరికాలోని అలాస్కాలో ఒక పర్వతాగ్రానికి 'మౌంట్ శరత్' అని అతని గౌరవార్థం పేరు పెట్టారు

## నడిచే వ్యక్తి నమూనా

నిలువుగా నడిచే ఒక వ్యక్తి అవశేషాల్ని ఇథియోపియా (ఆఫ్రికా)లో 1974లో కనుగొన్నారు అతడు 3,000,000 సంవత్సరాల క్రితం జీవించినవాడు కావచ్చు దీనిని మానవ జాతి పూర్వీకుల నమూనాగా శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు

## మనిషి అభ్యసించవలసిన నాలుగు ముఖ్య గుణాలు

న్యాయ పథాన్ని పయనించాలంటే మనిషి నాలుగు ముఖ్య విషయాలను అభ్యాసం చేసుకోవాలి ఏంగాను ఏది పొరపాటో స్పష్టంగా ఆలోచించటం, న్యాయయుక్తంగా లేనివారిని ప్రేమించటం నిష్ఠ ఉంటే నిజాయితీగా ప్రవర్తించటం, దేవుని యందు విశ్వాసం

– ట్రైయన్ ఎడ్వర్డ్స్ సౌజన్యంతో

"ప్రేమికులు ఒకరినొకరు ప్రేమించుకోవటం కాక ఎన్నో ఇతర విషయాలను కూడా పరస్పరం ప్రేమించగలిగితే ఆ ప్రేమ శాశ్వతంగా

# వీరిని గురించి తెలుసుకోండి

డాక్టర్ హరివంశరాయ్ బచ్చన్: డా. బచ్చన్ సుప్రసిద్ధ హిందీ కవి, రచయిత. ఆయన జీవిత చరిత్ర 'దశద్వార్ సె సోపాన్ తక్' బహువర్ణ శోభితమైన అధునిక మహాకావ్యంగా పేరు పొందింది. 'మధుకావ్య' త్రయీ రచనతో అతని ముప్పైలలో కవిగా కొత్తసృష్టికి నాంది పలికారు దేశంలోనే అత్యంత ప్రతిష్ఠాకరమైన 'సరస్వతీ సమ్మాన్' గ్రహీత డా.బచ్చన్.

ఒట్టొ వాన్ బిస్మార్క్ ప్రష్యా రాజనీతివేత్త జర్మన్ సామ్రాజ్యానికి మొదటి ఛాన్సలర్ 19వ శతాబ్ది ద్వితీయార్థంలో యూరప్‌కు చెందిన ప్రముఖ నాయకుడు 'ఐరన్ ఛాన్సలర్'గా పిలువబడిన వ్యక్తి

జేన్ ఆస్టిన్ (1775-1817) ఆంగ్ల రచయిత్రి ప్రథమ మహిళా నవలాకారిణి పదిహేనేళ్ల వయస్సుకే మొదటి పుస్తకం వ్రాసిన వనిత 'సెన్స్ అండ్ సెన్సిబిలిటీ'ని 1811లో ప్రచురించిందామె 'ప్రైడ్ అండ్ ప్రెజుడీస్', 'ఎమ్మా' ఆమె వ్రాసిన అనర్ఘ నవలా రత్నాలు. చిన్నసైజు ఆంగ్లేయ సమాజాల్లోని నిత్య జీవితాలకు అద్దం పట్టే విధంగా సునిశిత దృష్టి, సున్నిత హాస్యం, సుఖాంత రచనలు ఆమె సొమ్ములు

ఐజక్ అసిమోవ్ (1920-1992). సైన్స్‌కు సంబంధించిన వాస్తవాలు, కల్పితాలను సారవంతంగా రచించిన వ్యక్తి 33 ఏళ్లపాటు ఒక అద్భుత శాస్త్రీయ కల్పనల పత్రికలో 400 వ్యాసాలు వ్రాయటమేకాక దాదాపు 500 గ్రంథాలు రచించారు కూడా

## ప్రపంచ అవగాహనకి సుస్పష్టమైన దృష్టి అవసరం



ప్రతీ ఒకరు కూడా వాళ్ల దృష్టిని అనుసరించే ప్రపంచాన్ని చూస్తారు ఒక వ్యక్తి కంటికి నల్ల అద్దాలు తగిలించుకుంటే అతడికి ప్రపంచం అంతా చీకటిగా కనిపిస్తూ ఆకాశంలో తెల్లగా ఉండే చంద్రుడు కూడా నల్లగానే ఉన్నాడని పిస్తుంది ఉన్నది ఉన్నట్లు ప్రపంచాన్ని చూడాలంటే సుస్పష్టమైన దృష్టి అవసరం హస్తినాపుర రాజ్య సభలో ఎవడు దుష్టుడో తెలుసుకోడానికి నిర్ణయించి నప్పుడు ధర్మరాజుకి ఎవడూ దుష్టుడుగా కనిపించలేదు ప్రతీవారిలోను అతడికి ఏదో మంచి కనిపించింది అందరూ ధర్మాత్ములు లాగే కనిపించారు దుర్యోధనుడు విమర్శకు పూను కున్నప్పుడు అతడికి ధర్మాత్ములలో కూడా ఏదో క్రౌర్యం కనిపించింది. అతడికి రాజ్యసభ అంతా దుర్మార్గులతో నిండి ఉన్నట్లు కనిపించింది.

— 'మా యోగశక్తి' సౌజన్యంతో

"మన వ్యక్తిగత జీవితంలో ఇతరులతో ఏమాత్రం ప్రమేయం లేనిది వివాహం. కానీ ఈ వివాహం విషయంలో ప్రతీవాళ్ళూ వచ్చి చెప్పి బా గామనుకుంటారు."

# తలిని మరపించే ఉల్లి

డొమినిక్ జె.అజావెడో

బట్టతల నుంచి పాముకాటు వరకు సర్వ రోగ సంజీవని ఉల్లి. డాక్టర్లు రోగులకు ఉల్లి గుణాలను గురించి చెబుతూండటం ఇప్పటి మాట కాదు. ఈ నీరుల్లి లేక ఎర్రగడ్డ వెనుకటి రోజుల్లో నావికులకు (తాజాపండ్లు, కూర గాయలు దొరకనందువల్ల) వచ్చే 'శీతాదము' (scurvy) అనే వ్యాధిని అరికట్టేదట. ఇటీవల




న్యూకాజిల్ విశ్వవిద్యాలయానికి చెందిన ఒక వైద్య బృందం ఉడకబెట్టిన, వేయించిన ఉల్లి పాయల్ని రోగులకు సిఫార్సు చేసింది. శరీరంలో ప్రమాదకరమైన రక్తం గడ్డకట్టడాన్ని రూపుమాపే విధంగా రక్తంలోని శక్తిని పెంచు తుంది ఉల్లి. సామాన్యమైన ఉల్లిపాయ భయంకరమైన 'కరొనరీ థ్రాంబోసిస్' వ్యాధిపైన ప్రయోగించే ఒక శక్తివంతమైన ఆయుధంగా తయారయింది.

వడదెబ్బ నుంచి తట్టుకునేందుకు జనం ఉల్లిపాయల్ని జేబుల్లో వేసుకుంటారు. ఒక యువకుడు హఠాత్తుగా రోగగ్రస్తుడైనప్పుడు వైద్య సదుపాయం లభించేలోగా ఒక వృద్ధ వనిత తెల్ల ఉల్లిని చిదిమి అతని తలపై

## సూపర్ హైస్పీడ్ రైళ్ళు

జర్మనీలో పెద్యూళ్ల కమర్షియల్ సర్వీస్‌లో గంటకు 317 కి.మీ.ల వేగవంతమైన సూపర్ హైస్పీడ్ రైళ్లు నడుపబడుతున్నాయి. జర్మన్ గవర్నమెంట్ ICE-Intercity Express (నగరం లోపల ఎక్స్‌ప్రెస్) రైలు సర్వీసులో 41 రైళ్లు ఉంటాయి. ప్రతీదానికి 600 మంది ప్రయాణీకులకు సౌకర్యంగా 12 పాసింజరు కార్లు ఉంటాయి. ICE ప్రతీ గంటకు ఒకసారి హాంబర్గ్-మ్యూనిక్, హాంబర్గ్ - బేసిల్ మరియు ఫ్రాంక్‌ఫర్ట్ - మ్యూనిక్ సెక్టారులలో నడుపబడుతాయి. కారేజీలు సీట్ టెలిఫోనులు (జర్మనీలో ఏ నగరానికైనా డైరెక్ట్ డయలింగ్), ఫ్లోర్ హీటింగ్, ఎలక్ట్రిక్ సౌకర్యంతో



(Intercity Express)

నిర్వహించబడే ఛైంఘులు మొదలైన అనేక సదుపాయాలతో ఉంటాయి. మంచి విశిష్టమైన రెస్టారెంట్, స్నాక్ బార్ కూడా ఉంటాయి.

— 'ఫైనాన్షియల్ ఎక్స్‌ప్రెస్' సౌజన్యంతో

'ఎవరో ఒకరు పూనుకుని చేస్తే కాని ఈ ప్రపంచంలో పనులు వాటంతట అవి సమకూడవు.''

— జేమ్స్ ఎ గార్‌ఫీల్డ్

పెట్టి కట్టింది. కొన్ని నిమిషాల్లోనే జ్వరం తగ్గిపోయింది.

ఉల్లి అద్భుత రోగ నివారిణి! పేద ప్రజల బలవర్ధక ఔషధం కూడా! ఈజిప్టులోని బ్రహ్మాండమైన గిజా పిరమిడ్ల నిర్మాణంలో పాల్గొన్నవారికి ఉల్లి, వెల్లుల్లి ఆహారంగా సమకూర్చేవారని చరిత్ర చెబుతూంది. ఇంతటి కఠినమైన నిర్మాణానికి కావలసిన శక్తి సామర్థ్యాలు వీటివల్ల లభిస్తాయని వారి విశ్వాసం. మోసెస్, అరన్ ఇజ్రాయిలీలను ఈజిప్టు నుంచి సినాయ్ ఎడారుల్లోకి తరలిస్తున్నప్పుడు దారిలో వారు ఉల్లిగడ్డలనే భుజించారు. యూదులు ఈ చిన్న మొక్క మీది మమకారంతో ఒక నగరానికి 'అనియన్' అని పేరు పెట్టుకున్నారు ఈ నగరం సూయెజ్ జలసంధి సమీపంలో క్రీ.పూ. 173లో నిర్మించారు. దీనిని నిర్మించిన వ్యక్తి పేరు ఆనియస్. ఆనియన్ నగరం 343 ఏళ్లపాటు వర్ధిల్లింది.

గ్రీకులు, రోమన్లు కూడా వైద్యంలో ఉల్లిని వాడుకున్నారు. రోమన్లకు ఉల్లి ఎంత ప్రియమైనదో వారు దీనిని బ్రిటన్‌కు తీసుకువెళ్ళడమే చెబుతుంది. ఇక బ్రిటిష్‌వారైతే తొలి చూపులోనే ఉల్లిని ప్రేమించారు. బ్రిటిష్ రాజ కుటుంబం భోజనాల బల్ల మీద ఉల్లికి స్థానం లభించింది నిజానికి మొదటి ఎలిజబెత్ రాణి ఉదయపు అల్పాహారంలో ఉల్లి ఊరగాయ ఉండేది.

1664లో లండన్ నగరాన్ని ప్లేగు వ్యాధి కబళించినప్పుడు ప్రతి ఇంట్లో ఎవరో ఒకరు బలి అయ్యారు. ఈ వ్యాధి సోకని సురక్షిత స్థానాలు ఉల్లి, వెల్లుల్లి దుకాణాలే!

## మత ప్రసక్తి లేని దేశం

శాంతియుతము, [illegible], పరస్పర దేశంతో కూడిన సహజీవనం అనే భావం క్రొత్తది కాదు. మనలో ఏనాటినుంచో ఉంది. భారతదేశం మత ప్రసక్తిలేని సెక్యులర్ అంటే భారత దేశం భౌతిక సుఖ ఆరాధిస్తుందని కాదు: దేశకాలాతీతమైన ప్రపంచాన్ని పాటించేది, విశ్వవ్యాప్తమైన ధర్మాన్ని అనుసరించదని కాదు.



Dr. S. Radhakrishnan

భారతదేశం ఒక ప్రత్యేక మతానికి కట్టుబడి ఉండదని భావం అన్ని మతాలకు సమానమైన గౌరవం ఇస్తుందని, దేశంలో సర్వమత సహనాన్ని ప్రబోధిస్తుందని దీని అర్థం. ఆర్య, ద్రావిడ, హిందూ, బౌద్ధ మతాలు అన్నీ సమైక్యతతో ఉంటాయని అర్థం. ఈనాడు మనం సమైక్యతతో జీవిస్తూ, సమైక్యతతో మరణిస్తామనేది గ్రహించగలిగాం. సమైక్యతతో జీవించటం అంటే సహనభావం ఉండాలి. ఏదో ప్రత్యేక ధర్మాన్ని, ప్రత్యేక తత్త్వాన్ని అనుసరిస్తామంటే వివాదం బయలు దేరుతుంది. ఆరాటం ప్రబలిపోతుంది. పరస్పర సహనభావంతో ఎవరి ధర్మాలను, తత్త్వాలను వారు అనుసరిస్తే దేశాభివృద్ధికి సహకరించగలుగుతారు. వివిధ మతాలు దేశ సౌభాగ్యానికి సహకరిస్తాయి. సర్వతో భద్రమైన భవిష్యత్తు ఉంటుంది.

— డా.ఎస్. రాధాకృష్ణ

"ఎవరైతే ప్రశ్నిస్తాడో అతడు అయిదు నిమిషాలపాటు 'అవివేకి' అనిపించుకుంటాడు. అసలు ప్రశ్నే వెయ్యని వ్యక్తి జీవిత[illegible] అవివేకిగానే మిగులుతాడు."

# నృత్యకళా ప్ర

## ఒడిస్సీ

ఒడిస్సీ - దక్షిణ భారతాన్నీ, ఉత్తరాదినీ ఏకసూత్రంగా అలరించే ఒక ప్రాచీన సంప్రదాయ నృత్యం. కొన్ని శతాబ్దాలపాటు ఒరిస్సా దేవాలయాల్లో ప్రసిద్ధి పొందిన ఒడిస్సీ ఇటీవలి కాలంలోనే భారతదేశమంతటా ప్రాచుర్యం పొందుతూంది ఇప్పుడు బాలికలు ఎక్కువగా ఈ నాట్యాభ్యాసాన్ని అలవరచుకుంటున్నారు



ODISSI DANCE

ఒడిస్సీ పునరుద్ధరణకు ప్రధాన పాత్ర వహించినవారు కేలుచరన్ మహాపాత్ర ఆయన ఎన్నో కొత్త అంశాలను ప్రవేశపెట్టి వాటికి నృత్యరూపమిచ్చారు ఒడిస్సీకి సంగీత స్వరాలు సమకూర్చిన వ్యక్తి భువనేశ్వరమిశ్రా ప్రముఖ సాహిత్యవేత్తలు కేలుచరన్ పట్నాయక్ పంకజ్ చరణ్‌దాసులు కూడా ఒడిస్సీ అభివృద్ధికి తోడ్పడ్డారు

ఒకే కుటుంబానికి చెందినది కనుక ఒడిస్సీ కూడా భరతనాట్యానికి సన్నిహితంగా ఉంటుంది. అయితే ఒడిస్సీ సంగీతం మాత్రం ఉత్తర భారతానికి అనుగుణంగా ఉంటుంది ఈ అందమైన కలయికవల్లనే ఒడిస్సీ ప్రజాదరణ పొందింది. ఒడిస్సీ నృత్యం ప్రధానలక్షణం - సున్నితంగా, కవి తాత్మకంగా ఉండటం!

భరతనాట్యం చేస్తున్నప్పుడు నృత్యాంగన శరీరపు వొంపులు స్పష్టంగా, వాడిగా కనిపిస్తాయి

## ఆత్మవిశ్వాసం లోపిస్తే

* ఇతరులను పరిచయం చేసుకోవటం చాలా కష్టం

* నీకు ఉపకరించే నిర్ణయాలు తీసుకోవటం కష్టమైపోతుంది చాలాకాలం పడుతుంది ఏవైనా నిర్ణయాలు తీసుకుంటే వాటిని ఆచరణలో పెట్టటం సులభసాధ్యం కాదు

* నీ చుట్టూ ప్రపంచం విరోధంగా ఉంటుంది భద్రత కనిపించదు



* ఇతరులు నిన్ను అభిమానిస్తున్నారు, నిన్ను మెచ్చుకుంటున్నారు అనే సందేశాలు చెవిని పడవు, వినిపించవు

* ఇతరులు నిన్ను గురించి ఏమనుకుంటున్నారో అని తాపత్రయపడిపోతావు

— 'పార్థా బులెటిన్' సౌజన్యంతో

"అహింసా విధానంలోని శాంతిని ఏ ఋషిలోనైనా మీరు చూడవచ్చు, కానీ దానిలోని 'శక్తి'ని మాత్రం గాంధీజీలోనే చూస్తారు."

— రమణ మహర్షి

ఒడిస్సీలో శరీరపు వొంపులు వర్తులంగా ఉంటాయి. తల, అవయవాలు లేని ఒక మొండి విగ్రహం మాదిరిగా మారి కదలికలు తేవటం ఒడిస్సీ నృత్య విధానంలో ప్రధానంగా కనిపిస్తుంది


Keluchaian Mohapatra

ఒడిస్సీలో కూడా నవరసాలు అభినయిస్తారు కానీ అందరూ ఆనందించేవి, అందరికీ దృగ్గోచరమయ్యేవి శృంగార, భక్తి రసాలే కనుక


movements of the torso

వీటికే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు ఒడిస్సీ సాహిత్యం కూడా ఎక్కువభాగం ఈ రస ప్రాధాన్యం గానే ఉంటుంది. నృత్య కళాకారులు కూడా ఈ రసాలతో కూడిన నృత్యాలనే ఇష్ట

ఇక శృంగార ప్రాధాన్యత గురించి చెప్పాలంటే ఒడిస్సీ 'గీత గోవిందం' ఆధారంగా రూపొందింది. ఒక పూర్వ పురుముని కోసం రచించిన ప్రణయకావ్యం - గీత గోవిందం.

●

## మానవుని అద్భుతసృష్టి

పుస్తక ప్రపంచం మానవుని అపూర్వ సృష్టి. మానవుడు నిర్మించినది ఇంకేదీ కలకాలం ఉండదు. స్మారక భవనాలు కూలిపోతాయి. రాజ్యాలు నశించి పోతాయి నాగరికత పాతబడిపోయి నశించి పోతుంది ఏ యుగంలో క్రొత్తజాతులు క్రొత్త వాటిని నిర్మిసారు



కానీ ప్రపంచంలో వివిధ గ్రంథాలు వీటి ఎన్నిటినో చూస్తాయి కలకాలం ఉంటాయి వ్రా నప్పుడు ఎంత క్రొత్తగా ఉంటాయో అంత క్రొత్తగా ఉంటాయి. శతాబ్దాలక్రితం కాలగర్భంలో కలి పోయిన విషయాలను మానవులకు తెలియ జేస్తూంటాయి.

"మన భావాలు వెలిబుచ్చేందుకు గాక వాటిని నిగూఢ పరచేందుకు

# సరసోక్తులు

## ర్పరితనం

సమాచారం తెలుసుకోవటం, తెలివితేటలు కలిగి ఉండటం - వీటి మధ్య తేడాను గ్రహించటం అవసరం. తెలివితేటలనేవి శక్తి సామర్థ్యాలను తెలుపుతాయి. అది సమాచారం తెలుసుకోవడం కాదు. విషయసేకరణ చేసే సమర్థత కలిగి ఉండటం - అది నేర్పుకాదు, నేర్పరితనం అభివృద్ధి చేసుకోడానికి తోడ్పడుతుంది.

— విలియం హెచ్.రాబర్ట్స్



## వెదకులాట

తుమ్మెదలు లక్షలాది సంవత్సరాల నుంచి ఒక ప్రభుత్వ విధానం ఏర్పరచుకుని సాగిపోతూండగా మానవజాతి ఇంకా గుడ్డిగా వెదుకులాడుకుంటూనే ఉంది.

## ఇరుగు - పొరుగు

మంచి ఇరుగు పొరుగుకి లక్షణం - మీరు రటిదోళ్ళే కవిపిస్తే పొరుగు అతను నవ్వులు ఎందించడానికి మాత్రమే పరిమితమై గోడ దూకకపోవటం.

## ఇద్దరూ ఇ

ప్రపంచమంతా సక్రమంగా నడిచిన నాడు తాను పని చేస్తానని, అప్పుడు పరమానందాన్ని అనుభవిస్తానని చెప్పే వ్యక్తి నది ఒడ్డున కూర్చుని ఈ నీరంతా సముద్రంలోకి పోగానే నేను దీనిని దాటి వెళతానని చెప్పే వ్యక్తిని మరపిస్తాడు.

— స్వామి వివేకానంద

## దీనిభావమేమి?

అమెరికాలోని డెట్రాయిట్‌లో ఫోర్డ్ మోటార్ వర్క్స్ సందర్శించేందుకు వచ్చిన ఒక గర్భిణీ స్త్రీ డాక్టర్ రాకకోసం ఎదురుచూస్తోంది. ఆ ఫ్యాక్టరీ ఉద్యోగి ఆమెతో ఇలా అన్నాడు 'మీరు ఇక్కడికి ఎందుకు వచ్చారు? మీ పరిస్థితిలో ఉన్న విజిటర్లను మా ఫ్యాక్టరీలోకి రానివ్వరని తెలియదా?'

'ఓహ్! నేను ఈ ఫ్యాక్టరీలోకి కాలుపెట్టినప్పుడు ఈ పరిస్థితిలో లేను స్వామీ!' అని ఆమె జవాబిచ్చింది.

## నినాదం

ఉత్పత్తి చేయటమో, వినాశం చెందటమో - ఇదే మన నినాదం కావాలి.

— డాక్టర్ వి.వి.గిరి

## నాలుగు స్తంభాలు

ప్రపంచాన్ని రక్షించేవి నాలుగు· మేధావుల పాండిత్యం, గొప్ప వ్యక్తుల న్యాయబుద్ధి, సజ్జనుల ప్రార్థనలు, ధీరుల శౌర్య సాహసాలు.

— మహమ్మద్

## అసిధారా వ్రతం

ప్రజాపరమైన భారీ ప్రణాళికలను అమలు చేసేవారు అనుకోని అవాంతరాలు, అనూహ్యమైన ఆశాభంగాలు, విద్యుత్‌ఘాతాల వంటి అవమానాలు ఎదుర్కొనడమే గాక మూఢ జనుల ఊహా జనిత తీర్పులకు కూడా తలవొగ్గ వలసి ఉంటుంది.

— ఎడ్మండ్ బర్క్

## మనస్తత్వం

మనిషితో రెండురకాల ఇబ్బందులు వస్తాయి. అతడు క్లిష్టంగా ఉండే సత్యాలను నేర్చుకోడు. అత్యంత సరళంగా కనిపించే సత్యాలను గుర్తుంచుకోడు.

— రెబెక్కా వెస్ట్

## కార్యకలాపాలు

మనం చేసే పనులు కాల ప్రవాహంలోకి విసిరే రాళ్ల మాదిరిగా అదృశ్యమవుతాయి కాని వాటి అలలు శాశ్వతత్వం సంతరించు కుంటాయి.

## ఫాషన్

ఫాషన్ - అనాకారితనానికి నమూనా. దానిని ఎంతగా అసహ్యించుకుంటున్నామంటే మనం ప్రతి ఆరునెలలకు ఫాషన్లను మార్పు చేయవలసి వస్తోంది.

— ఆస్కార్ వైల్డ్

## పరిచయ భాగ్యం

అతి సన్నిహితత్వం అవమానాల్ని, పిల్లల్ని పుట్టిస్తాయి.

— మార్క్ ట్వైన్

## కష్టాలు నేర్పే పాఠాలు

కష్టదశ - స్త్రీ పురుషులలోని గుణాలను బాగా వెలికి తెచ్చే సారవంతమైన నేల. పురుషుని వైఫల్యాలు అతనిలోని శక్తి సామర్థ్యాలను, దృఢ నిశ్చయాన్ని ప్రోదిచేస్తే అతని కష్టాలు నైతిక శక్తికి, ధీరత్వానికి దారి తీస్తాయి. అతని విజయాలు స్వయంపోషకత్వానికి స్ఫూర్తినిస్తాయి.

— డబ్ల్యు. మాథ్యూస్

## ప్రత్యేక లక్షణాలు

మహా సాహసం, అంతులేని ధైర్యం, బ్రహ్మాండమైన శక్తి సామర్థ్యాలు - వీటన్నిటినీ మించి వినయశీలం - ఈ ప్రత్యేక లక్షణాలు ఏవ్యక్తినైనా, జాతినైనా పునరుజ్జీవింపచేస్తాయి.

## అంచనా

ఏ ప్రభుత్వమైనా అది ప్రజలకు సమకూర్చే జీవన నాణ్యతను బట్టి దాని సమర్థత అంచనా వేయబడుతుంది.

— రాల్ఫ్ బర్టన్ పెర్రీ

## ప్రతికూలత

నీ పరిస్థితులు సరిగ్గా లేవంటే అది నీకు అవసరం కాబట్టే. వాటిని ఎదుర్కోడానికి కావలసిన శక్తిని, సామర్థ్యాన్ని కలిగించుకుంటావు. అవి కష్టంగా ఉన్నాయంటే అసలు నీలో ఏదో ఒక లోపం ఉందన్నమాట. ఆ లోపాన్ని నివారించుకునే దాకా నీకు కష్టాలు సంభవిస్తూనే ఉంటాయి. ఎప్పటికప్పుడు వివేకవంతుడవు, బలిష్ఠుడవు అవుతున్నావని సంతోష పడు. అప్పుడు ఎటువంటి పరిస్థితులు కూడా జీవితాన్ని దుఃఖమయం చేయలేవు. నీ కష్ట పరిస్థితులను గురించి చింతపడిపోవడం మాను. నీ చుట్టూ ఉండేవారి జీవితాలను పరిశీలించి చూడు.

"అపాయాన్ని క్షమించి విడిచిపెట్టటంలో కాకుండా, దానిని

# అధికుడెవరు?

[ఒకసారి నారద మహర్షి శ్రీకృష్ణ భగవానుణ్ణి సందర్శించారు. వారిద్దరి మధ్య జరిగిన సంభాషణ...]



కృష్ణ: ఓ నారదా! అందరికంటే అధికుడెవరు?

నారద: నీవే ప్రభూ!

కృష్ణ: కాదు, కాదు, కాదు! పంచభూతాల్లో ఏది గొప్పది?

నారద: భూమాత ప్రభూ!

కృష్ణ: మరి మూడువంతుల భూభాగం నీటిలో మునిగి ఉంది కదా!

నారద: అవును ప్రభూ! కనుక నీరే గొప్పది!

కృష్ణ: కానీ అగస్త్య మహర్షి అన్ని సముద్రాల లోని నీటినీ ఒకేసారి ఔపోసనపట్టాడు కదా!

నారద: ఆమాట నిజమే! అగస్త్యుడే గొప్పవాడు!

కృష్ణ: అయితే చూడు నారదా! ఆ అగస్త్యుడు ఇప్పుడు అనంతాకాశంలో కేవలం ఒక నక్షత్రంలా మాత్రమే వెలుగుతున్నాడు!

నారద: అలా అయితే ప్రభూ! ఆకాశమే అన్నిటికంటే అధికమైనది.

కృష్ణ: అది ఎలా కుదురుతుంది? మహా విష్ణువు వామనావతారం ఎత్తినప్పుడు ఈ ఆకాశాన్నంతటినీ ఒకే ఒక పాదంతో మూసి వేసాడు కదా!

నారద: అలా అయితే వామనుని పాదమే ఘనమైనది ప్రభూ!

కృష్ణ: తన పాదం కంటే వామనుడే గొప్పవాడు కాదా?

నారద: నేను మొదట్లో చెప్పిందే యదార్థం ప్రభూ! నీవే అందరికంటే అధికుడివి!!

కృష్ణ: లేదు నారదా! నిజమైన భక్తుడి హృదయ కుహరంలో నేను దాగి ఉంటాను. అక్కడి నుంచి నేను బయటికి రాలేను ఇక నేనెలా గొప్పవాణ్ణి అవుతాను? కనుక నా భక్తుడే అందరిలోకీ అధికుడు నన్ను వశపరచుకుని తన హృదయంలో బందీ చేసుకునే శక్తి గలవాడు అతడే అక్కడే నేను సుఖంగా నివసిస్తూంటాను

— 'శ్రీ సత్యసాయి బాల వికాస్' సౌజన్యంతో

## ప్రపంచంలో భూసరిహద్దులు అధికంగాగల దేశం

ప్రపంచంలో చైనాకి భూసరిహద్దులు అధికంగా ఉన్నాయి దీనికి 13 దేశాలు-ఉత్తర కొరియా, సోవియెట్ యూనియన్, మంగోలియా, ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్, ఇండియా, నేపాల్, భూటాన్, బర్మా, లావోస్, వియత్నాం, మకావో మరియు హాంగ్‌కాంగ్ సరిహద్దులుగా ఉన్నాయి

## అవి కాంతిని ప్రసరిస్తాయి!

లైట్‌హౌసులు గంటలు కొట్టవు, గుళ్ళు పేల్చవు కాంతివంతంగా ప్రకాశిస్తూ దీపాన్ని చూచేటట్టు ఆకర్షిస్తాయి

# ఆరోగ్యానికి సులభసూత్రాలు

సి.డి.హమ్మండ్

"తిండి కలిగితే కండ కలదోయ్
కండ కలవాడేను మనిషోయ్" అన్నాడు మహాకవి.

ఈ రోజుల్లో ఎక్కడ విన్నా తిండి పురాణమే ఏమి తినాలి? ఎప్పుడు తినాలి? ఎలా తినాలి? ఎక్కడ తినాలి? ఎంత తినాలి? — ఈ విషయాలను చర్చించుకుంటూ జనం తమకాలంలో ఎక్కువ భాగం గడుపుతున్నారు. నిజానికి ఈ 20వ శతాబ్ది సంఘ జీవితంలో ఆహారం, భుజించడం అనే అంశాలే ప్రధానపాత్ర వహిస్తున్నాయి



గత కొన్నేళ్లుగా 'సహజ ఆహారం' అనే అంశం పైన ప్రజలలో ఓ క్రొత్త అవగాహన ప్రారంభమైంది. కొలెస్టరాల్, కొవ్వు నిల్వలు, ఫైబర్, మైక్రోన్యూట్రియంట్స్ వంటి విషయాల మీదికి ప్రజల దృష్టి మరలింది. ఆహారం ప్రత్యామ్నాయంగా విటమిన్ సప్లిమెంట్స్ సిఫార్సు చేస్తున్నారు 'ప్రకృతివైపు మరలండి' అనే ఉద్యమాన్ని ఉపయోగించుకుని ఆహార పదార్థాలు తయారుచేసే సంస్థలు పూర్తి ధాన్యపు ఆహార పదార్థాలు, పీచు రొట్టెలు, పోలీ అన్‌శాచురేటెడ్ అయిల్స్ వంటివి విడుదల చేస్తున్నాయి.

ఇన్ని రకాల పదార్థాల మధ్య, సమాచారాల మధ్య సంతులిత ఆహారం ఏది? అనే ప్రశ్న ఉదయిస్తుంది. ఆరోగ్యప్రదమైన జీవితం గడిపేందుకు కావలసిన పోషక పదార్థాలు కల ఆహారం సామాన్యులకు కావాలి. దీనికి నాలుగు సులభమైన నిబంధనలు పాటిస్తే చాలు.

ఒకటో నిబంధన. విభిన్న తరహాలు గల వివిధ ఆహారపదార్థాలను తినండి. విభిన్నత్వం వల్ల జీవితం సుగంధ భరితం అవుతుంది. ఆహారపు విలువలు కల పదార్థాలను తీసుకోండి. ఏ వస్తువు అధికంగా తినవద్దు.

రెండో నిబంధన. పొలాల నుండి రాగానే ఆ పదార్థాలను భుజించండి మిషన్ ద్వారా శుద్ధి చేయని పదార్థాలు, తాజాపండ్లు, కూరగాయలు వీటిలో అన్ని విటమిన్లు, ఖనిజ పదార్థాలు ఉంటాయి. శరీరం సామాన్యమైన ఎదుగుదలకు దోహదం చేస్తాయి.

మూడో నిబంధన. కొంత. విరామం ఇచ్చి భుజించండి. దీనివల్ల మీ జీర్ణకోశం బాగా పని చేస్తుంది ఆహారంలోని పోషక పదార్థాలను మీకు అందజేస్తుంది మీ రక్త ప్రసరణకు బాగా దోహదం చేస్తుంది.

నాలుగో నిబంధన· మీకు కావలసిన బరువుకు తగినట్లుగానే ఆహారం తీసుకోండి. ఎంతమేరకు బరువు ఉంటే హాయిగా ఉంటుందో మీకే తెలుస్తుంది. కొవ్వు పదార్థాలు, చక్కెర వస్తువులు లేని ఆహారం తీసుకుంటే అనవసరమైన బరువు (కిలోలు, పౌండ్లు) మీ దగ్గరకు రాదు.

ఆఫ్ హెల్త్ సౌజన్యంతో

●

'ప్రతీ జీవి ఆధ్యాత్మికానందాన్ని కోరుకుంటాడు. కానీ
పంచంలోని భౌతిక మూల వ

# యోగ్యతకు కొలమానం శీలమే!

ఆ రోజుల్లో నోబెల్ గ్రహీత సర్.సి.వి. రామన్ బెంగళూరులోని ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ సైన్స్‌కు డైరక్టర్‌గా పని చేస్తుండే వారు. ఆ ఇన్స్టిట్యూట్‌లో ఒక ఉద్యోగం కోసం ఆయన ఇంటర్వ్యూలు జరుపవలసి వచ్చింది



Sir C V Raman

ఇంటర్వ్యూకు వచ్చిన అభ్యర్థుల్లో ఒక యువకుడు సరైన సమాధానాలు ఇవ్వలేక పోయాడు. కనుక ఆ ఉద్యోగం వస్తుందనే ఆశ ఏమాత్రం పెట్టుకోవద్దని రామన్ అతనితో చెప్పారు. తన అదృష్టాన్ని మరోచోట పరీక్షించుకోమని, తక్షణం అక్కడి నుంచి వెళ్లిపొమ్మని రామన్ అతడికి సలహా ఇచ్చారు. నిరాశా హృదయంతో ఆ యువకుడు నెమ్మదిగా ఆ గదిలో నుంచి బయటికి నడిచాడు. మెట్లు దిగి అక్కడి విశ్రాంతి గదిలో ఒంటరిగా నిల బడ్డాడు. కొనేపటికి రామన్ కూడా క్రిందికి దిగి వచ్చారు. ఆ యువకుడు ఇంకా అక్కడే తారట్లాడడం గమనించారు

ఆయనకు చికాకు కలిగింది. పిలిచి పెట్టి ఆ ఉద్యోగం మీద ఆశ వదలుకోమని మరోసారి ఆ యువకుడితో చెప్పారు.

అప్పుడు ఆ యువకుడు రామన్‌కు చేతులు జోడించి వినయపూర్వకంగా చెప్పాడు: "అయ్యా! ఈ ఆఫీసు తెరిచే సమయం కోసం నేను వేచి ఉన్నాను. ఇక్కడ గుమాస్తా పొర పాటుగా లెక్కించి నా ప్రయాణ భత్యానికి, ప్రయాణ ఖర్చుకు అయిన దానికంటే రూపాయలు ఎక్కువ ఇచ్చాడు. ఆ డబ్బు అతనికి వాపసు చేసి వెళ్లిపోదామని ఆగాను. కాని వేరే ఉద్దేశంతో కాదు. నేను ఇక్కడ ఉండటం మీకు విసుగని పిస్తే నన్ను క్షమించండి."

అతని నిరాడంబరతకు, చిత్తశుద్ధికి రామన్ ప్రభావితుడయ్యారు. అతని భుజంపై మృదువుగా తట్టారు. అతనికి ఉద్యోగం ఇచ్చేందుకు అంగీకరించారు.

బహుశా శీలమందే ఉత్తమ యోగ్యతగా రామన్ పరిగణించి ఉండవచ్చు.

— సదానంద మొహంతి

## మొట్టమొదటి ప్రెషర్ కుక్కర్

*మొట్టమొదటి ప్రెషర్ కుక్కర్ 1678లో డెనీస్ పాపిన్ అనే ఫ్రెంచ్ వైద్యుడు తయారుచేసాడు. ఇతడు రెండేళ్ల తరువాత రెండు ఉపన్యాసాలలో రాయల్ సొసైటీలో వర్ణించి, ఇంగ్లండ్ రాజైన రెండవ చార్లెస్‌ను ఆశ్చర్యపరచాడు.*

*1949లో పుల్‌పెర్ సంస్థకు చెందిన ఒక సేల్స్ మెన్ లండన్ వేలంలో 1678 మరియు 1700 అని గుర్తించబడిన రెండు ఇనుప పెనాలను కొన్నాడు. ఇతడు వీటిని తన పరిశోధన లాబొరేటరీకి పంపాడు. అక్కడ నిపుణులు వీటిని పరీక్షించి ప్రెషర్ కుక్కర్‌ను రూపొందించారు.*

"రెండు రకాల డాక్టర్లే ఉంటారు. తెలివితేటలతో వైద్యం చేసేవారు, మాటలతో వైద్యం చేసేవారు."

# మీ హృదయం పదిలం

గుండె! మానవ శరీరంలోని ఒక ముఖ్యమైన అవయవం. ఇది సహజసిద్ధంగా కొట్టుకునే ఒక మానవ గడియారం.

గుండె రాత్రింబవళ్లు నిర్విరామంగా పని చేస్తుంది. రక్తప్రసరణ చేస్తూ శరీరంలోని వివిధ భాగాలు పని చేసేటట్లు చూస్తుంది.




శరీరంలోని భాగాలకు స్వచ్ఛమైన రక్తాన్ని పంపి మనల్ని బ్రతికిస్తుంది కొన్ని సంవత్సరాల సేవ తరువాత ఒక యంత్రం గానీ, ఒక మోటారు కానీ ఏవిధంగా పనికి రాకుండా పోతాయో అలాగే గుండె కూడా ఒత్తిడులకు తట్టుకోలేకపోవచ్చు

గుండె జబ్బులు, రక్తనాళాల వ్యాధులు - మరణానికి ప్రధాన కారణాలు అంటువ్యాధులు, తీవ్రమైన రక్తపుపోటు, రక్తం గడ్డ కట్టుకు పోయే వ్యాధులు, పుట్టుకతో వచ్చిన వికార రూపాలు, కేంద్ర నాడీమండలం మీది గాయాలు గుండె జబ్బులు వచ్చేందుకు దోహదం చేస్తాయి.

మన జీవితకాలంలో ముందుగానే గుర్తించి వైద్యం చేసుకోని గొంతుకకు సంబంధించిన అంటువ్యాధులు, వాటివల్ల వచ్చే వాత రోగాలు కూడా గుండెపోటుకు దారి తీస్తాయి.

పుట్టుకతో వచ్చిన గుండెజబ్బులకు మూల కారణం పుట్టుకతో వచ్చిన వికార రూపం కావచ్చు తల్లి నుంచి అంటువ్యాధి సంక్రమించటం, గర్భవతిగా ఉన్నప్పుడు తల్లి ఎక్స్ (రే) కిరణాలకు గురి కావటం, ఆమె కొన్ని ఔషధాలు సేవించడం- ఇవి కూడా గుండె జబ్బులకు దారి తీయ వచ్చు ఆమె గర్భవతిగా తొలిమాసాల్లో ఉన్నప్పుడు వీటిని నయం చేసుకోవచ్చు కూడా.

నలభై, ఆపై వయస్సు గల వారంతా తమ బరువు విషయం గమనించటం అత్యావశ్యకం. వీరు కొవ్వు పదార్థాలను విసర్జించాలి. జంతు సంబంధమైన క్రొవ్వు పదార్థం వంటివి నిత్య భోజనంలోకి రాకుండా చూసుకోవాలి.

వృద్ధులు, వయసు పైబడుతున్నవారు ఆకుపచ్చని కూరలు, కూరగాయలు ఎక్కువగా భుజించాలి పనిలో, విశ్రాంతిలో, తిండిలో, త్రాగటంలో కూడా పరిమితి పాటించాలి.

మధుమేహం, రక్తపుపోటు, వాత రోగాలు మొదలైనవాటికి సక్రమంగా చికిత్స చేయించు కోవాలి అంటువ్యాధులు, అధిక బరువు, పొగ త్రాగటం, మానసిక ఒత్తిడి, అలసటల నుంచి వైదొలగాలి తేలికరకం వ్యాయామం అనుదినం చేయడం మంచిది. గుండెనొప్పి కలవారికి ఎప్పుడూ డాక్టర్ సంప్రదింపులు అవసరం. వీరు రక్తపుపోటు ఎప్పుడూ తగ్గుదలలో ఉండేటట్లు చూసుకోవాలి

"ఒక్క పిసరు వెర్రితనం లేకుండా ఎక్కడా మేధావి కనిపించడు."

# లక్ష్యాలు, మార్గాలు ఒకటి కావాలి

జవహర్‌లాల్ నెహ్రూ

మన లక్ష్యాలకు, దానిని సాధించేందుకు అనుసరిస్తున్న మార్గాలకు అత్యంత సన్నిహిత సంబంధం ఉండి తీరాలని నా అభిప్రాయం

మన లక్ష్యం మంచిదైనప్పటికీ మనం ఎంచుకున్న మార్గం తప్పుడు మార్గమైతే అది మన లక్ష్యాన్ని భ్రష్టు పట్టిస్తుంది




కనుక లక్ష్యాలు, మార్గాలు విభిన్నంగా ఉండకూడదు ఇవి కలిసిమెలిసి పయనించవలసినవే

గతంలో అనేకమంది ప్రముఖ వ్యక్తులు మనకి పాఠం నేర్పినా దురదృష్టవశాత్తు మనం దానిని గుర్తుంచుకోలేదు

నా స్ఫూర్తి ప్రదాత, నా సంరక్షకుడు మహాత్మా గాంధీ ఎప్పుడూ నైతిక విలువల ప్రాధాన్యం గురించి చెబుతూండేవారు 'క్ష్యాల సాధన కోసం భ్రష్టు మార్గాలు త్రొక్కదని ఆయన ఆదేశం.

మేము ఆయనకు సాటిరాకపోయినా మాకు చేతనైనంత వరకు ఆయన బోధనలను అమలు చేసేందుకు ప్రయత్నించాము. పరిమితంగానే వాటిని అమలు చేసినప్పటికీ అవి సత్ఫలితాలనే ఇచ్చాయి

శక్తివంతమూ, బృహత్తరమూ అయిన ఒక దేశంతో మనం చిరకాలం పోరాడి జయం పొందాము. ముఖ్యంగా విజయం పొందడానికి అనుసరించిన విధానానికి ఉభయ పక్షాలకు గొప్పతనం ఆపాదించవలసి ఉంటుంది స్నేహ, సహకార సంబంధాల ద్వారా శాంతియుత మార్గంలో ఇటువంటి క్లిష్ట సమస్యకు పరిష్కారం సాధించుకోవడమనేది చరిత్రలో అరుదుగా కానీ కనిపించదు

## సిగరెట్టు కాల్చని స్త్రీలకు అధికంగా కాల్చే పురుషులతో వివాహాలు

జపాన్‌లో పధ్నాలుగు సంవత్సరాలపాటు 2 65,000 మంది మీద అధ్యయనం చేసి అసలు సిగరెట్టు కాల్చే అభ్యాసంలేని స్త్రీలలో సిగరెట్లు కాల్చని పురుషులను వివాహమాడిన స్త్రీలకంటే, అధికంగా సిగరెట్లు కాల్చే పురుషులను వివాహమాడిన స్త్రీలు రెండు రెట్లు ఊపిరితిత్తుల కాన్సర్ వ్యాధితో మరణించే అవకాశాలున్నాయని తెలుసుకున్నారు అంతేగాకుండా "పాసివ్ స్మోకర్స్" అంటే సిగరెట్లు కాల్చేవారు వదిలే పొగాకు ఘాటుకు ప్రభావితులైనవారికి, కూడా ఊపిరితిత్తుల కాన్సర్ సంభవిస్తుందని తెలుసుకున్నారు

—సుభాష్ సన్రా

'హర్యానా రివ్యూ' సౌజన్యంతో

"మనిషి రెండు చెవులు, రెండు కళ్లు, ఒక నాలుకతో జన్మించాడు

# వార్తలు

## వాతావరణ సూచన

వ్యోమ నౌకలు మూడు రోజులపాటు ఖచ్చితంగా వాతావరణ సూచనలు చెప్పగలిగితే ప్రపంచ వ్యాప్తంగా సంవత్సరానికి రూ 48,000 కోట్లు ఆదా అవుతాయి.

## శోధన నాళికలో శిశూదయం

జూన్ 17న లూధియానాలో గుర్మెయిల్ కౌర్, రంజిత్‌సింగ్ దంపతులకు ఓ టెస్ట్‌ట్యూబ్ బేబీ జన్మించాడు. పంజాబ్‌లో మొట్టమొదటి ఈ 'శోధన నాళిక శిశువు' 2.8 కిగ్రాల బరువు ఉన్నాడు

## ఓల్డ్ ఈజ్ గోల్డ్

జర్మనీలో వృద్ధుల నిష్పత్తి ఎక్కువగా ఉందని ప్రపంచ ఆరోగ్య సంస్థ వారి 350 పేజీల గణాంక వివరాల వార్షిక గ్రంథం తెలియజేసింది

## బలే మంచి చౌక బేరము

ప్రపంచంలోని వాణిజ్య కేంద్రాలన్నిటిలో ఢిల్లీ, కలకత్తాలే బహు చౌక ప్రదేశాలని తెలుస్తున్నది నార్వే రాజధాని ఓస్లో అతి ఖరీదైన నగరమట.

—'బిజినెస్ ఎక్స్‌పెన్సెస్ గైడ్' సౌజన్యంతో

## ప్రముఖ ప్రచురణకర్త

వాషింగ్టన్ డి.సి.లోని అమెరికా ప్రభుత్వ ముద్రణా కార్యాలయం ప్రపంచంలోని అతి పెద్ద ప్రచురణకర్తగా పేర్కొనబడింది. దీని డాక్యుమెంట్స్ విభాగం సూపరింటెండెంట్ ప్రతీ సంవత్సరం 150,000,000 అంశాలకు చెందిన పత్రాలను జారీ చేస్తూంటాడు.

## వారసత్వం

జపాన్ మొదటి చక్రవర్తి జిమ్ము టెన్నో లేక జిన్ము ఆ శ్రేణిలో 125వ వాడు ప్రస్తుత జపాన్ చక్రవర్తి అకిహిటో జపాన్‌ను మొదటి చక్రవర్తి 660 నుండి 581 వరకు (క్రీ.పూ.) పరిపాలించాడని సంప్రదాయ సిద్ధంగా తెలుస్తున్నా క్రీ.పూ. 40 నుండి 10 వరకు ఆయన పాలించి ఉండవచ్చు

## మీ విజ్ఞానం పరీక్షించుకోండి

### జవాబులు

క్విజ్- 1 (సి) జి.ఎస్.పథక్, 2 (డి) 27 32, 3 (ఎ) షేక్స్పియర్, 4 (ఎ) రష్యన్‌లతో వ్యోమయానం చేయడం ద్వారా, 5 (సి) హంగేరీ, 6 (డి) వైద్యం, 7 (బి) కాల్షియం, 8. (డి) కథువా.

మాటల మహిమ - 1 (ఎ) కృష్ణుడు, (సి) విష్ణుమూర్తి, 2 (ఎ) శ్లాఘ్యుడు,(బి) సుఖము కలవాడు, (సి) అదృష్టవంతుడు, (డి) కృతార్థుడు; 3 (ఎ) మునుగుట, (బి) లీనమగుట, (సి) నిద్రించుట; 4 (ఎ) బాలచంద్రుడు; 5 (ఎ) పలమెత్తు వెండి, (బి) తూము, (సి) మంగళసూత్రము; 6 (సి) వేట, (డి) సంచారము; 7 (ఎ) సింధూరము, (బి) సంజ కెంజాయ; 8 (ఎ) విషభేధము, (బి) బల్లి, (డి) నలికండ్ల పాము.

తెలివికి పరీక్ష - 1 (డి) అంటార్కిటికా, 2 (సి) జయ సంహిత, 3 న్యూయార్క్, 4. దేవులపల్లి కృష్ణశాస్త్రి, 5. (సి) కార్టూన్స్ వేయడం, 6. గోపాలకృష్ణ గోఖలే.

---

"సరిగ్గా ఉండటం కంటే తప్పొప్పుల్ని కనిపెట్టటం తేలికయినవని. అందువల్లనే ప్రపంచం విమర్శకులతో నిండిపోయింది."

## ఇనుప ఖనిజం నిల్వలు

ప్రపంచంలో ఎక్కువ భాగం ఇనుప ఖనిజం నిల్వలు బ్రెజిల్‌లో ఉన్నాయి. అక్కడ 58,000 మిలియను టన్నులు లేదా ప్రపంచ ఉపరితల నిల్వలలో35 శాతం నిల్వలు ఉన్నాయి.

## మృత్యు విలాసం

ఊపిరితిత్తుల కాన్సర్, గొంతు కాన్సర్ వ్యాధులకు స్కాట్లండ్ వాసులు ఎక్కువగా బలి అయ్యారు. 100,000 మందిలో 66 9 శాతం మంది మృత్యువాత పడ్డారు.

—'వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్' సౌజన్యంతో

## మరణ మృదంగం

దేహంలోని రక్తప్రసారానికి సంబంధించిన వ్యాధుల వల్ల ఆస్ట్రేలియాలో ఎక్కువమంది చనిపోతున్నారు. హృద్రోగాలవల్ల, కీళ్ల వ్యాధులవల్ల 50 శాతం మంది ఆస్ట్రేలియన్లు మరణిస్తున్నారు. స్వీడెన్ రెండో స్థానంలో ఉండగా యునైటెడ్ స్టేట్స్, యునైటెడ్ కింగ్‌డమ్, నార్వే, ఐర్లండ్- తరువాతి స్థానాలలో ఉన్నాయి

## డాలర్ మహాత్మ్యం

ఇప్పుడు అమెరికా డాలర్‌ని మధ్య వర్తిత్వ మార్పిడి కరెన్సీగా( Intervention currency) రిజర్వ్ బాంక్ ఆఫ్ ఇండియా ఉపయోగిస్తున్నది. ఇంతకు ముందు బ్రిటన్ పౌండ్ స్టెర్లింగ్‌కు ఈ గౌరవం ఉండేది.

## పాము కాటు

త్రాచు, క్రైట్, రస్సెల్ విషసర్పం, రంపపు పొలుసుల విషసర్పం-వీటివల్ల భారత దేశంలో ఎక్కువ మరణాలు సంభవిస్తున్నాయి. మనదేశంలోని మరిగిపోయిన తేమతో కూడిన వాతావరణంలో 52 రకాల విషసర్పాలు జీవిస్తున్నాయి.

## జనాభా! నీ పేరు ఇండియా?

ప్రపంచ జనాభాలో 15 శాతం మంది ఇండియాలోనే ఉన్నారు!

## కొత్త రకం స్టాంపులు

హిమాలయ సానువుల్లోని భూటాన్ దేశం మనతో మాట్లాడే, త్రీ డైమన్షనల్ స్టాంపుల్ని తయారు చేసింది

## చెత్తనుండి పాదరక్షలు

అమెరికా ఓరిగాన్‌లో ఉన్న నార్త్ వెస్ట్ క్వాలిటీ ఇన్నొవేషన్ కంపెనీ కొత్తరకం పాదరక్షలు తయారు చేస్తోంది ప్లాస్టిక్, తుక్కుగుడ్డలు, పేపర్ సంచులు, పాత టైర్లు, ఫోమ్ రబ్బర్, రంపపు పొడి ఉపయోగించి ఈ పాదరక్షలు తయారు చేస్తున్నారు!

—'పార్థా బులిటెన్' సౌజన్యంతో

## బృహత్ నౌకా నిర్మాణం

ఇండియాలో నిర్మించనున్న బృహత్ నౌకకు 'జవహర్‌లాల్ నెహ్రూ' అని పేరు పెట్టారు 86,000 టన్నుల శక్తిగల ఈ నౌకను కొచ్చిన్ నౌకా నిర్మాణ కేంద్రంలో నిర్మించారు.

## అసలైన సుఖం

అసలు ఈ ప్రపంచంలో వాస్తవమైన సుఖం కాలం గడిచేకొద్దీ ప్రేమ విశ్వాసాలు ప్రవృద్ధి పొందే కుటుంబాలలోను, తీవ్రమైన శ్రమ లేకుండా జీవితావసరాలు లభించే ఇండ్లలోనూ, అతి జాగ్రత్తగా ధర వివరాలు తెలుసుకున్న తరువాత విలాస వస్తువులు కొనుక్కునే ఇండ్లలోనూ ఉంటుంది.

—ఆల్‌ఫ్రెడ్ ఎడ్వర్డ్ న్యూటన్

"మంచితనం, వివేకం సమ్మిళితమే చమత్కారం."

—ఐ. ఇ. ...

# ఉడుతా ఉడుతా హూత్!

ఇ.కె. నరేశ్వర్

మైదాన భూముల్లో నివసిస్తున్న మనలో చాలామందిమి చెట్ల మీదికి గెంతుతూ, చెంగు చెంగున దూకే ఉడుతల్ని చూస్తూంటాము. అయితే ఎగిరే ఉడుత విచిత్రంగా కనిపిస్తుంది.



FLYING SQUIRREL

పైగా ఇటువంటి ఉడుతలు ప్రపంచమంతటా కనిపిస్తూంటాయి. ఇండియాలో ఎగిరే ఉడుతలలో ఎన్నో రకాలు కాశ్మీర్ నుండి అస్సాం వరకు ఉన్న హిమాలయ అటవీ ప్రాంతాలలో నివసిస్తున్నాయి. ఒక చిన్న సైజు తిరువాన్కూరు ఉడుత పశ్చిమ కనుమల్లోని దక్షిణ ప్రాంతంలో కూడా, కనిపిస్తుంది ఎగిరే ఉడుతల్ని రెండు వర్గాలుగా విభజించారు. 45 సెం.మీ. శరీరం, శిరస్సు కల పెద్దరకం ఉడుతలు, 25 నుంచి 30 సెం.మీ.లు కల చిన్న రకం ఉడుతలు.

ఎగిరే ఉడుతలు సాధారణ ఉడుతలకన్నా పెద్దవిగా ఉండటమే కాక గుబురు తోక కలిగి చెట్ల మీద కాపురం చేస్తూంటాయి. ఎగిరేందుకు వీలుగా వీటి శరీర నిర్మాణం ఉల్లిపొరవంటి చర్మపు ముడతలతో ఉంటుంది. ఇది పారాషూట్‌లా పని చేస్తుంది. చెట్టు మీది నుంచి దూకినప్పుడు తన అవయవాలను విస్తరిస్తుంది. దీనివల్ల ఎగిరేందుకు చర్మం బాగా సాగి ఎక్కువ పరిధిని ఏర్పరుస్తుంది. దీని గుబురు తోక చుక్కాని మాదిరిగా పని చేస్తుంది. ఇటువంటి అద్భుత ప్రక్రియతో ఈ ఎగిరే ఉడుతలు మృదువుగా, శీఘ్రంగా ప్రయాణిస్తాయి. కేవలం ఒక వైపుకు మొగ్గడం ద్వారా తన గమ్యాన్ని మార్చుకునే నేర్పు కూడా ఈ ఉడుతకు ఉంది ఎగిరే ఉడుతలు గెంతుతూ అలా గాలిలో పయనిస్తాయి. అయితే పక్షులు, గబ్బిలాల మాదిరిగా ఒకేసారి ఏకధాటిగా పయనించవు. ప్రకృతినే వాటినుంచి (predators) రక్షణ పొందేందుకు వీలుగా ఉడుతలు పరిణామ క్రమంలో ఈ ఎగిరే విధానాన్ని కనుగొన్నాయి.

పశ్చిమ హిమాలయాల్లో కనిపించే ఎర్ర ఉడుతలు ఎగిరే ఉడుతల్లో ఎక్కువగా కనిపించే రకాలు ఎరుపు గోధుమ వర్ణంగల పైపూత కలిగి, వెలవెలబోతూన్న వసుపు పచ్చని క్రింది భాగాలతో, గుబురైన తోకతో ఉండే ఈ ఉడుతలు తమ కలుగుల్లోనుంచి చీకటి పడుతూన్న సమయంలో వెలికి వచ్చి వేకువ ఝామున తిరిగి ఇళ్ళకు చేరుకుంటాయి. రాత్రి వేళల్లో చెట్ల మీద జీవనం కొనసాగించేందుకు అనువుగా వీటికి విశాల నేత్రాలు ఉన్నాయి. మట్టి రంగులో ఉండే తిరువాన్కూర్ ఉడతలు తాము నివసించే చెట్టుతో కలిసిపోయి తమ ఉనికి కప్పి పుచ్చుకునే సామర్థ్యం కలిగి ఉంటాయి.

ఈ ఎగిరే ఉడుతలకు తమ ఆహారాన్ని

'ప్రతీ మనిషి తను ఏది సక్రమంగా చేయగలుగుతాడో దాన్ని మాత్రమే చేస్తే ఆ పని చక్కగా దిద్ది తీర్చబడడమే కాక సౌకర్యంగా,

పెప్పి చేసేందుకు, పొడి చేసేందుకు వీలైన దంతాలు ఉన్నాయి. వివిధ వృక్షాలనుంచి లభించే పండ్లు, కాయలు - వీటికి ఎంతో ఇష్టమైన పదార్థాలు. బెరడు, బంక, జిగురు, చిన్న పురుగులు, పురుగుల గ్రుడ్లు - వీటి ఆహార పదార్థాల్లో ముఖ్య భాగాలు.



Flying squirrel

ఎగిరే ఉడుతలు ఒకదానితో ఒకటి మాట్లాడ డానికి అరిచో లేక గునగునలాడుతూంటాయి గొంతు మార్చి మాట్లాడే వ్యక్తుల మాదిరిగా ఉడుతలు కూడా తమ స్వరాన్ని మారుస్తుంటాయి కాబట్టి వీటి స్వరం తెలుసుకోవడం మాత్రం కష్టమే.

ఒక చెట్టు తొర్రలోనో, కొమ్మల మీదనో వీటి నివాసం వీటి గూడు హాయిగా ఉంటుంది. మెత్తటి ఎండు గడ్డితో, పొడి ఆకులతో కట్టుకుంటాయి.

ఎగిరే ఉడుతలు చెట్ల నుంచి అరుదుగా క్రిందికి దిగి వస్తాయి. నేల మీద వీటి సంచారం ఉల్లిపొర చర్మపు మడతలవల్ల తక్కువగానే ఉంటుంది. ఈ వ్రేలాడే భాగాలు ఉపయోగంలో లేనప్పుడు ప్రక్కలకు ముడుచుకుంటాయి కేవలం ఉత్సాహం కొద్దీ ఈ అహ్లాదకరమైన బుజ్జి జంతువులు ఇలా చెట్ల మీద గెంతులు వేస్తూంటాయి. ఒక్కోసారి అంచనా తప్పి క్రిందికి పడటం, దెబ్బలు తగలటం కూడా కద్దు. దావు తప్పి కన్ను లొట్టపోయినట్టుగా గట్టి దెబ్బలు తగిలిన ఉడుత శరీరం బాగయ్యే దాకా కొన్నాళ్లపాటు ఎటూ కదల కుండా ఉంటుంది

బందీ అయిన ఎగిరే ఉడుత మనిషితో స్నేహం చేసి రుచికరమైన వస్తువుల్ని కోరి సంపాదించుకుంటుంది మచ్చిక చేను కునేందుకు సులభమైనా ఉడుతలు చాలా సుకుమార జీవులు ఇవి దీర్ఘకాలం ఖైదీగా జీవించలేవు

# ఉత్సాహవంతుడు

వెచ్చని వేసవి ఎండ పచ్చని వరిపొలాల మీద, అడవులలో వృక్షాల మీద కాసినట్టు ఉత్సాహవంతుడు నిరంతరం ఇతరులపై ప్రభావితమయె మహోన్నత మైన వ్యక్తిత్వంతో జీవిస్తాడు దీనివల్ల వారిలో నిబిడమై ఉన్న ఉత్తమశీలం చైతన్యవంతమై ఇతోధిక ధైర్యంతో, సంతోషంతో ఆనందంగా ఉంటారు.



ఇటువంటి వ్యక్తులే ఇతరులు జీవించడానికి ప్రపంచాన్ని సౌఖ్యవంతం చేస్తారు ప్రతీరోజూ ఉదయం వీరిని సందర్శించడంవల్ల ఇతరులు ధన్యులు అవుతారు వారితో సంభాషిస్తే ఉత్తేజ వంతంగా ఉంటుంది శక్తి సామర్థ్యాలు వృద్ధి పొందుతాయి. జీవితేచ్ఛతో ఏ ఉద్యమానికైనా సిద్ధ పడతారు

—ఒరిసన్ స్వెట్ మార్డెన్

"మన అందరిలో మూడు వ్యక్తిత్వాలు ఉన్నాయి. మనం ప్రదర్శిం చేది, మనకు ఉన్నది, మనకు ఉన్నదని మ

# వసుధామ

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక

సంపాదకవర్గం

: సంపాదకుడు:

లయన్. కె. వి. గోవిందరావు బి.ఎ., ఎల్ ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు:

కొండముది దత్తాత్రేయశర్మ

వి. బాలకుమార్ ఎం.ఏ., బి.ఎడ్.,

సభ్యులు:

కె.వి.ఎస్. శరత్‌బాబు బి.ఎ., బి.కాం., బి.ఎ.

కె.వి.ఎస్. విజయకుమార్ బి.కాం.,

కె. రత్నకుమారి

ఈ సంచికలో

డిసెంబరు 1992



: చందా వివరాలు:

3 సంవత్సరాల చందా రూ.120/-
సంవత్సర చందా రూ. 42/-
ఎయిర్ మెయిల్ (1సం॥) రూ 200/-
సీ మెయిల్ (1సం॥) రూ 100/-

: చందా పంపవలసిన చిరునామా:

రత్నా ఏజన్సీస్
9, దేశికా రోడ్, మైలాపూర్
మద్రాస్ - 600004
ఫోన్: 73327

ముఖ చిత్రం
కలర్ ట్రాన్సపరెన్సీ
వికీ హేండా

# సంపాదకుని పేజీ

## గుణవంతుడు మానవుడు




సద్గుణవంతుడైన మానవుడు అజేయుడు. ఏ శత్రువు కూడా అతణ్ణి ఓడించలేదు, అవమాన పర్చలేదు. అతని న్యాయబుద్ధి, పవిత్రత తప్ప మరే ఇతర రక్షణా అతనికి అవసరం లేదు. మంచిని జయించటం చెడుకు దుస్సాధ్యం. కనుక గుణవంతుణ్ణి హీనస్థితికి దిగజార్చటం జరగని పని. అనాదరం, అసూయ, ద్వేషం, క్రోధం - అతని దరిచేరవు. అతణ్ణి బాధించవు. అతణ్ణి గాయపరచాలనుకున్నవారే చివరికి అవమానాలపాలవుతారు.

గుణవంతునకు దాచవలసినవేవీ ఉండవు. రహస్యంగా పనులేవీ చేయడు. ఇతరులకు తెలియకుండా గుట్టుగా ఉంచే ఆలోచనలు, కోరికలు ఉండవు. అందువల్లనే అతడు నిర్భయుడు, గౌరవనీయుడు. అతని శరీరం నిటారుగా నిలుస్తుంది. అతడి పలుకు సూటిగా, నిస్సందేహంగా వినిపిస్తుంది. ఎదుటివారి ముఖంలోకి అతని చూపు నిలుస్తుంది.

## శీలానికి పునాది బాల్యం

ప్రతీ వ్యక్తీ తన గుణ శీలాల నిర్మాణ శిల్పి కావాలి. సహృదయం, దాతృత్వగుణం, సమైక్య దృష్టి శీలానికి పునాది రాళ్ళు. నైతిక సూత్రాలకు బద్ధుడయ్యేటట్లు ప్రతీ వ్యక్తికీ ఈ అంతర్గత గుణమే సహాయపడుతుంది.



శీల సంపద సమకూర్చుకోవటం బాల్యదశ నుండే ప్రారంభమౌతుంది. చివరి వరకూ కొనసాగుతుంది. సద్గుణాలు అలవడేటట్లు, సక్రమ విధానంలో ఆలోచనలు సాగేటట్లు పిల్లలకు తలిదండ్రులు శిక్షణ ఇస్తే తరువాత

## అంత్యక్రియలకు అమూల్య హారం

*ఫ్రాన్స్ రాజధాని పారిస్ పౌర అధికార సంస్థ అంత్యక్రియలకు అతి ఖరీదైన హారాన్ని పంపింది 1963 నవంబర్ 25న అమెరికా అధ్యక్షుడు జాన్ ఎఫ్. కెన్నెడీ అంత్యక్రియల సందర్భంలో వాషింగ్టన్ డిసి కి ఈ హారం పంపబడింది దీని ఖరీదు 1,200 డాలర్లు*

'పేదలకున్న అణకువ ప్రదర్శించే భాగ్యవంతులూ, ధనికుల ఔదార్య బుద్ధి కలిగిన పేదలూ - భగవంతుని ముద్దు బిడ్డలు.'

జీవితంలో వారు తప్పు త్రోవలు తొక్కి అథః పతనం చెందే అవకాశం ఉండదు.

ఈనాటి యువతీ యువకుల్ని వారి తల్లిదండ్రులు తల మీదికెక్కించుకుని వారికి ఎలా పని చేయాలో, ఎలా నేర్చుకోవాలో, ఎలా సక్రమ మార్గంలో సంపాదించుకోవాలో బోధించ లేకపోతున్నారు. తమ బిడ్డ అట్కాా ధోరణికి దోహదం చేసే ఏ తల్లిదండ్రులైనా ఆ వ్యక్తికి, సమాజానికి హాని చేస్తున్నవారే అవుతారు. పిల్లల్లో అభివృద్ధి చేసిన పొదుపరితనం, స్వయం పోషకత్వం, క్రమశిక్షణ వంటి మంచి గుణాలు ఆ తరువాత వారికి ఎంతో తోడ్పడతాయి. మంచి అలవాట్లు, ఉన్నత ఆదర్శాలు కల పిల్లలు శీలవంతులై ఉంటారు. ఇవన్నీ వారి భావి జీవిత ఆశయాలకు, ప్రవర్తనకు స్ఫూర్తినిస్తాయి.

శీలవంతులే సమాజానికి మనస్సాక్షులు. వీరు ప్రజా బాహుళ్యం గౌరవాభిమానాలను, వారి ఆరాధనను చూరగొంటూ అత్యున్నత శ్రేణికి చేరుకుంటారు. జార్జ్ వాషింగ్టన్ శీలవంతుడైన ఒక మహావ్యక్తి. ఆయన కమాండర్ ఇన్ ఛీఫ్‌గా పనిచేసినప్పుడు అమెరికా సేనావాహిని ద్విగుణీకృతమైనట్లు భావించేవారు. భారత ద్వితీయ ప్రధాని లాల్ బహదూర్ శాస్త్రి కూడా తమ ఉత్తమ శీల సంపదతో అశేష ప్రజాదరణ పొందారు.

## ప్రపంచంలో బ్రహ్మాండమైన పెద్ద పెద్ద చెట్లు, మొక్కలు




* యుఎస్ఎ కాలిఫోర్నియాలోని సెక్వోయా *(Sequoia)*

* మధ్య అమెరికా మెక్సికోలోని జెయింట్ కాక్టస్.

* దక్షిణ అమెరికా అమెజాన్ నది చుట్టు ప్రక్కల ఉండే రాయల్ వాటర్ లిల్లీ.

* ఆగ్నేయ ఆసియాకు చెందిన మలేషియాలోని రాఫ్లేసియా *(Rafflesia)*.

* ఆస్ట్రేలియాలోని యూకలిప్టస్.

# చూడవేడుక - బార్సిలోనా ఒలింపిక్స్ 1992

మెడిటరేనియన్ సముద్ర తీరాన స్పెయిన్ దేశానికి చెందిన వేడుకల నగరం బార్సిలోనా ఈ నగరంలో 1992 ఒలింపిక్ క్రీడలు జూలై 25న ప్రారంభమయ్యాయి 1988 అక్టోబర్ 2న సియోల్ (ద కొరియా)లో ఒలింపిక్ పతాకాన్ని బార్సిలోనా మేయర్ పాస్కల్ మరగాల్‌కు అందజేశారు


main stadium

65,000 మంది పట్టే మాంట్‌జుక్ స్టేడియంలో ప్రారంభ ఉత్సవం, ముగింపు ఉత్సవం జరిగాయి ట్రాక్ పోటీలు, ఫుట్‌బాల్ పోటీలు కూడా ఇక్కడే నిర్వహించారు 1929లో నిర్మించిన ఈ ప్రాచీన స్టేడియం పాత రూపురేఖలు మార్చకుండానే ఒక ఇటాలియన్-స్పెయిన్ వాస్తు శిల్పుల బృందం అనేక మార్పులు చేసి స్టేడియం అంతర్భాగాన్ని పునర్నిర్మించారు

బార్సిలోనాకు గర్వకారణం, ఒలింపిక్ నిర్మాణాలలో ఉత్తమ నిర్మాణం అని పేరు పొందిన న్యూ పలవ్ సంత్ జోర్డి ఇన్‌డోర్ స్టేడియంలో 17,000 మందికి స్థలవసతి ఉంది ఇక్కడే జిమ్నాస్టిక్స్, హాండ్‌బాల్, వాలీబాల్ ఫైనల్స్ జరిగాయి మరో మూడు ఒలింపిక్ కాంప్లెక్స్‌లు బార్సిలోనాలోనే నిర్మించారు గుర్రపుస్వారీ పందేలు, జూడో, టేక్వాండో, బాణాలు, సైక్లింగ్ పోటీలు ఇక్కడ జరిపేందుకు వసతులు ఉన్నాయి బార్సిలోనాకు ఉత్తరంగా ఉన్న బన్‌యోలిస్ లేక్‌లో పడవ నడిపే పోటీలు, తెడ్లతో నడిచే చిన్న పడవల పోటీలు జరిగాయి

ప్రపంచ వ్యాప్తంగా వందల మిలియన్ల ప్రజానీకం స్వయంగా వచ్చి లేదా టెలివిజన్లలో చూసి ఈ బ్రహ్మాండమైన ప్రారంభోత్సవ దృశ్యాలకు పరవశించి ఆనందించారు 9,000 మంది కళాకారులు, క్రీడాకారులు పాల్గొన్న ప్రారంభోత్సవం నాటి అత్యద్భుత విన్యాసాలు మూడు గంటలపాటు జరిగాయి


Olympic flag

గ్రీస్ నుండి వచ్చిన ఒలింపిక్ జ్యోతిని ప్రధాన స్టేడియంకు చెందిన టవర్ పైనున్న గాస్‌ను తాకేందుకు అగ్ని శిఖలా దూసుకు వెళ్ళిన బాణంతో వెలిగించారు ఈ బాణ ప్రయోగం చేసేందుకు స్పెయిన్‌కు చెందిన ప్రముఖ విలుకాడు అంటోనియో రెబెల్లో 1,500 సార్లు ప్రాక్టీస్ చేసాడు! స్పెయిన్ రాజు జువాన్ కార్లోస్ ఈ క్రీడలను ప్రారంభించాడు 172 దేశాలకు చెందిన క్రీడాకారులు స్టేడియంలో విన్యాసాలు చేస్తూ సాగిపోయారు

ఒలింపిక్స్‌లో 25 రంగాలకు చెందినవారికి 257 పతకాలు బహూకరించే ఏర్పాట్లు జరి

“నీ అధికారంతో ఉన్నంతవరకు సక్రమంగా వినియోగించుకో
మిగిలినవన్నీ ఎలా జరుగుతాయో అలాగే స్వీకరించు”

— ఎపిక్టిటస్

గాయి 159 మంది పురుషులు, 86 మంది స్త్రీలు, 12 మంది ఉభయులుగా వీటిని స్వీకరించారు దీనిలో దాదాపు 12,000 క్రీడాకారులు తమ దేశాల తరఫున సగర్వంగా పాల్గొన్నారు అథ్లెటిక్స్, ఈతల పోటీలలో పాల్గొన్న వారికి అత్యధిక సంఖ్యలో పతకాలు లభించాయి




కోబీ (కార్టూన్ కుక్క) బార్సిలోనా క్రీడల చిహ్నంగా (mascot) పెట్టారు బార్సిలోనా ఒలింపిక్ ఆర్గనైజింగ్ కమిటీ పేరులోని మొదటి అక్షరాలను కూర్చి (COOB) ఈ పేరు పెట్టారు




Cobi (the cubist cartoon dog)

ఒక తెల్లని నేపథ్యంపై ఎరుపు, నీలం, పసుపు, నలుపు, ఆకుపచ్చ రంగుల 5 రింగుల వలయాలు ఒకదాన్ని ఒకటి అనుబంధించుకునే విధంగా రూపొందించారు. ఇదే ఒలింపిక్ చిహ్నం స్నేహపూర్వకంగా చేతులు కలిపిన అయిదు ఖండాలకు ఇది ప్రాతినిధ్యం వహిస్తుంది. ఈ అయిదురంగుల్లో ఏదో ఒక రంగు ప్రతీదేశం జాతీయ పతాకంలో కనిపిస్తుంది

కామన్వెల్త్ ఆఫ్ ఇండిపెండెంట్ స్టేట్స్ సిఐఎస్ (మాజీ సోవియెట్ యూనియన్) 45 బంగారు పతకాలు సాధించి ప్రథమస్థానం పొందింది యునైటెడ్ స్టేట్స్ 37, జర్మనీ 33, చైనా 16, క్యూబా 14 బంగారు పతకాలు గెలుచుకున్నాయి



అమెరికాకు చెందిన మైక్ మార్ష్ పురుషుల 200 మీటర్ల పరుగు పందెం 20 01 సెకండ్లతో నెగ్గి బంగారు పతకం సాధించాడు వాలీబాల్ పోటీల్లో నెదర్లాండ్స్‌ను బ్రెజిల్ ఓడించి బంగారు పతకం పొందింది సూపర్ హెవీ వెయిట్ ఫైనల్స్‌లో క్యూబా మల్లయోధుడు రాబర్టో బల్లాడో రిచర్డ్ ఇగ్‌బెనిన్స్‌ను 13-2తో ఓడించి బంగారు పతకం కైవసం చేసుకున్నాడు

పెద్ద పరుగు పందాలలో దక్షిణ కొరియాకు చెందిన హ్వాంగ్ యంగ్-చో బంగారు పతకం గెలుచుకోగా, జపాన్‌కు చెందిన కొయిచి మోరిషిటా ద్వితీయ స్థానంలోకి వచ్చాడు. ఇతనికి వెండి పతకం లభించింది. అశ్విక పోటీలలో ఆస్ట్రేలియా బంగారు పతకాలన్నీ కొల్లగొట్టింది.

"దృశ్యానికి 'దూరం' వశీకరణ మంత్రంగా ఉపయోగపడుతుంది"
— థామస్ కాంప్‌బెల్

మహిళల వ్యక్తిగత సైక్లింగ్ పోటీలలో 81 కి.మీ.ల దూరాన్ని 2 గంటల 4 నిమిషాల 42 సెకండ్లలో పూర్తి చేసిన ఆస్ట్రేలియా వనిత కాథరిన్ వాట్ ప్రథమస్థానం పొందింది.



చైనాకు చెందిన ఫు మింగ్స్రియా మునక పోటీలలో 10 మీటర్ల వేదిక పైనుండి దూకి బంగారు పతకం సాధించింది ఈమె 50 పాయింట్ల తేడాతో విజయం సాధించటం ఘనకార్యమని చెప్పాలి. 450 కేజీల బరువు ఎత్తటం ద్వారా సిఐఎస్‌కు చెందిన అలెగ్జాండర్ కుర్‌లొవిట్స్ బంగారు పతకం సాధించాడు

ఇండోనేషియాకు చెందిన అలాన్ బుడి కుసుమ పురుషుల సింగిల్స్ బాడ్మింటన్ ఫైనల్స్‌లో బంగారు పతకం గెల్చుకున్నాడు. అతని ప్రియురాలు సుసి సుశాంతి కూడా మహిళల బాడ్మింటన్ సింగిల్స్ పోటీలో దక్షిణ కొరియాకు చెందిన బేంగ్ సూ హుయూన్‌ను ఓడించి బంగారు పతకం గెలుచుకుంది.

పురుషుల 400 మీటర్ల హర్డిల్స్ పోటీలలో అమెరికా క్రీడాకారుడు కెవిన్ ఎంగ్ 46 78 సెకండ్లలో దాటి తొమ్మిదేళ్ళ రికార్డు బ్రద్దలు కొట్టి బంగారు పతకం గెలుచుకున్నాడు.

మహిళల 100 మీటర్ల హర్డిల్స్‌లో గ్రీకుకు చెందిన పరస్కెవి పటవ్‌లిదు 12.64 సెకండ్లలో దాటి బంగారు పతకం సాధించింది. క్రీడల కాణాచి అయిన గ్రీసుకు చెందిన వనిత ఒలింపిక్ అథ్లెటిక్స్ మెడల్ గెలుపొందటం ఇదే మొదటిసారి!

పురుషుల లాంగ్ జంప్‌లో అమెరికాకు చెందిన కార్ల్ లూయిస్ బంగారు పతకం పొందాడు అతని ఆరు జంపుల్లో 8.67 మీటర్ల మొదటి జంప్ మంచి ఫలితాలు తెచ్చింది. 1984 లాస్ ఏంజెల్స్ క్రీడల్లో అతనికి లాంగ్ జంప్‌లో బంగారు పతకం లభించింది. అలాగే 1988 సియోల్ ఒలింపిక్స్‌లో కూడా బంగారు పతకం పొందాడు




ఈత పోటీల్లో చైనా సాధించిన మొదటి బంగారు పతకం జువాంగ్ యాంగ్ ద్వారా లభించింది. ఆమె అమెరికాకు చెందిన ప్రపంచ రికార్డు స్థాపించిన జెన్నీ థామ్సన్‌ను 100 మీటర్ల ఫ్రీస్టైల్‌ను 54 64 సెకండ్లలో ఈది ఓడించింది.

అమెరికాకు చెందిన క్వీనోసీ వాట్స్ (22 ఏళ్ళ

"ఉరుము మంచిదే ఉరుము మనసులో ముద్రవేసేదే, కానీ అసలు పని చేసేది మెరుపే కదా!"

మార్క్ ట్వైన్

విద్యార్థి) ఒలింపిక్ పురుషుల 400 మీటర్ల టైటిల్‌ను 43.50 సెకండ్లలో ముగించారు. అయితే బుచ్ రెనాల్డ్స్ స్థాపించిన 43.29 సెకండ్ల రికార్డు అధిగమించలేకపోయాడు. ఫ్రాన్స్‌కు చెందిన ప్రపంచ ఛాంపియన్ మేరీ జోస్ పెరిక్ 1988 సియోల్ ఒలింపిక్ ఛాంపియన్ ఓల్గా బ్రిజ్‌గినాను మహిళల 400 మీటర్ల పందాన్ని 48.83 సెకండ్లలో పరుగెత్తి ఓడించింది.



శాలి గున్నెల్ (బ్రిటన్) మహిళల 400 మీటర్ల హర్డిల్స్‌లో బంగారు పతకం సాధించింది. ఈమె 28 ఏళ్ళక్రితం అన్ పాకర్ చూపిన అడుగుజాడల్లో నడిచి ట్రాక్ గోల్డ్ మెడల్ (ఒలింపిక్స్) సాధించిన ద్వితీయ బ్రిటీష్ వనితగా నిలుస్తుంది.

ట్రిపుల్ జంప్‌లో యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన మైక్ కాన్లీ 18.17 మీటర్లు దూకి బంగారు పతకం సాధించాడు. 18 మీటర్ల మార్క్‌ను అధిగమించిన మొదటి వ్యక్తి ఇతడే. బైలోరష్యా (C I S)కు చెందిన విటలీ షెర్బో ఆరు బంగారు పతకాలు గెలుచుకుని అత్యంత విజయవంతుడైన జిమ్నాస్ట్‌గా రూపొందాడు.

నెదర్లాండ్స్‌కు చెందిన ఎలెన్ వాన్ లాంగిన్ అనే 26 ఏళ్ళ ఎకనామిక్స్ విద్యార్థిని మహిళల 800 మీటర్ల పోటీని 1 నిమిషం 55.54 సెకండ్లలో పూర్తి చేసి బంగారు పతకాన్ని పొందింది. 1948 లండన్ ఒలింపిక్స్‌లో ఫానీ బ్లాంకర్స్ కోయిన్ నాలుగు బంగారు పతకాలు గెలుచుకున్న తరువాత ఈవిడే స్వర్ణపతకాన్ని పొందిన మొట్టమొదటి డచ్ వనిత.

బ్రిటన్‌కు చెందిన లిన్‌ఫోర్డ్ క్రిస్టీ పురుషుల 100 మీటర్ల పందెంలో బంగారు పతకం సాధించి 32 ఏళ్ళ వయస్సులో భూమిపైన అతి త్వరితంగా పరుగెత్తే వ్యక్తిగా రూపొందారు. ఇతడు 9.96 సెకండ్లలో ఈ పందెం గెలిచాడు. అమెరికాకు చెందిన గెయిల్ డివర్స్ మహిళల 100 మీటర్ల పోటీ 10.82 సెకండ్లలో ముగించి బంగారు పతకం సాధించింది.



ఇటలీకి చెందిన ఫాబియో కసర్టెల్లి పురుషుల రోడ్ రేస్ సైక్లింగ్ పోటీని (194 కి.మీ.) 4 గంటల 35 నిమిషాల 21 సెకండ్లలో ముగించి బంగారు పతకం పొందాడు. డచ్‌కి చెందిన హెండ్రిక్ డెక్కర్ రెండో స్థానంలోకి వచ్చాడు. 1968లో పియర్‌ఫ్రాంకో వియన్నెల్లి ఇటలీకి చెందిన చివరి రోడ్ రేస్ సైక్లింగ్ ఛాంపియన్.

మహిళల జిమ్నాస్టిక్స్ పోటీల్లో రుమేనియాకు చెందిన లవిని కొరిని మిలొసొవిక్ 10 పాయింట్లు పొంది బంగారు పతకాన్ని గెలుచుకుంది.

"మానవునికి నిజమైన ప్రేమ్యలు ఆత్మస్త్రవాం, శ్రమ"

— రూసో

దక్షిణ కొరియా వనిత యువాన్ - జియాంగ్ ఛో అస్త్ర నైపుణ్య పోటీలో 70 మీటర్ల దూరంలో లక్ష్యాన్ని 72 షాట్స్ ద్వారా 40 సార్లు ఛేదించి, 338 పాయింట్లు సాధించి క్రొత్త ప్రపంచ రికార్డు నెలకొల్పింది



అల్జీరియాకు చెందిన హసిబా బవుల్‌మెర్కా మహిళల 1 500 మీటర్ల పందెంలో బంగారు పతకాన్ని కైవసం చేసుకుంది స్పెయిన్ పోలెండ్‌ను 3-2 తేడాతో ఓడించి ఒలింపిక్ సాక్కర్ (Soccer)లో బంగారు పతకం గెలుచుకుంది స్విట్జర్లాండ్‌కు చెందిన టెన్నిస్ ఆటగాడు మార్క్ రోసెట్ స్పెయిన్‌కు చెందిన జోర్డి అరెసిబోను ఓడించి మొదటి బంగారు పతకాన్ని సంపాదించాడు అమెరికా క్రోషియాను Croatia) ఓడించి పురుషుల బాస్కెట్ బాల్ ఫైనల్స్‌లో బంగారు పతకాన్ని సాధించింది

యుక్రేన్‌కు (C I S) చెందిన సెర్జి బుబ్కా పురుషుల పోల్ వాల్ట్‌లో ఏ విధమైన మెడల్ పొందలేకపోయాడు అతని జట్టులో సభ్యుడు మాక్సిం తరసోవ్ 5 80 మీటర్లతో బంగారు పతకాన్ని సాధించాడు

మహిళల హాకీలో స్పెయిన జర్మనీని 2-1 తేడాతో ఓడించి బంగారు పతకం గెలుచుకుంది పురుషుల హాకీలో జర్మనీ 2-1 తేడాతో ఆస్ట్రేలియాను ఓడించి బంగారు పతకం గెలుచుకుంది

అమెరికాకు చెందిన జెన్నిఫర్ కాప్రియాటీ ఒలింపిక్ టెన్నిస్ బంగారు పతక విజేతలలో అతి పిన్న వయస్కురాలుగా పేరొందింది ఈ 16 ఏళ్ళ వడుచు జర్మనీకి చెందిన ఛాంపియన్ స్టెఫీ గ్రాఫ్‌ను మూడు సెట్లలో ఓడించి బంగారు పతకం పొందింది

4x100 మీటర్ల స్ప్రింట్ రిలే పోటీలో అమెరికా బంగారు పతకం సాధించింది కార్ల్ లూయిస్, మైక్ మార్ష్, లిరాయ్ బురెల్, డెన్నిస్ మిచెల్ ఈ బృంద సభ్యులు మహిళల 4x100 మీటర్ల రిలే పందెంలో కూడా అమెరికా బంగారు పతకాన్ని గెలుచుకుంది



61 మంది సభ్యుల బృందం గల ఇండియా 12 విభాగాలకే పరిమితమైంది అనుకున్నట్లుగానే ఏ ఒక్క మెడల్ సాధించకుండా భారత క్రీడాకారుల బృందం తిరిగి వచ్చింది అస్త్ర విద్యలో ప్రీ-క్వార్టర్ ఫైనల్‌లోనే లింబారాంను పోటీ నుంచి తొలగించారు కెనడాకు చెందిన క్లాడ్ రూసో 102 పాయింట్లకు 100 పాయింట్లు సాధించాడు అథ్లెటిక్స్‌లో షైనీ విల్సన్ 800 మీటర్ల సెమీ ఫైనల్స్‌లో విజయం సాధించలేకపోయినా ఆ దూరాన్ని 2 01 90 రికార్డ్ టైములో పరుగెత్తి కొత్త జాతీయ రికార్డు స్థాపించింది హాకీలో ఇండియా న్యూజిలాండ్‌ను 3-2తో ఓడించింది 1 నుండి 3వ స్థానం వరకు ఏడ

(మిగతా 9 వ పేజీలో)

"హృదయం స్వచ్ఛంగా లేకపోతే విశ్వాసం మూఢ నమ్మకంగా మారి అధోగతి పాలవుతుంది"

# ండా - జాతికి జీవగర్ర

ప్రతిబింబం ఎటువంటిదో పౌరునికి జాతీయ పతాక అటువంటిది అతని ఆశలకు ప్రతిబింబమది భారత స్వాతంత్ర్య పోరాటం ప్రారంభమైనప్పటి నుంచి జరుగుతున్న వివిధ రాజకీయ పోకడలు, మత వైషమ్యాలు, ప్రజల ఉత్సాహ తరంగాలు పేటిస్తిపిక జాతీయ పతాక ఎటువంటిదం



కలకత్తాలోని పార్సి బగాన్ స్క్వేర్ (గ్రీన్ పార్క్)లో 1905 ఆగస్టు 7న మొదటి భారత జాతీయ జెండా ఎగురవేసారని చెబుతారు ఎరుపు, పసుపు, ఆకుపచ్చ రంగులతో సమతలంగా ఉన్న చారలతో దీన్ని తయారుచేసారు పైనున్న ఎర్రచారలో ఎనిమిది తెల్లని తామరలు ఒకే పంక్తిలో చిత్రితం కాగా, పసుపుపచ్చ చారలో గాఢ నీలవర్ణంతో దేవ నాగరలిపిలో వందే మాతరం అని వ్రాయబడింది అడుగున గల ఆకుపచ్చ గీతలో ఒక తెల్లని సూర్యుడు ఎడమవైపునా, తెల్లని చంద్రవంక, నక్షత్రం కుడివైపునా చిత్రించబడ్డాయి

1907లో ఫ్రాన్స్ రాజధాని పారిస్‌లో మేడం కామా, ఆమె అజ్ఞాత విప్లవ సహచరులు కలిసి రెండవ పతాకం ఎగురవేసారు (ఇది 1905లో జరిగిందని కొందరి అభిప్రాయం). ఈ రెండవ జెండా కూడా మొదటి జెండా మాదిరిగానే ఉంది పై చారలలో మాత్రం ఏడు నక్షత్రాల కమలం చిత్రితమైంది (ఏడు నక్షత్రాలు సప్తర్షులని సంస్కృతంలో చెబుతారు) ఈ జెండా బెర్లిన్ (జర్మనీ) సోషలిస్ట్ సమావేశంలో కూడా ఆవిష్కరించబడింది

1917లో హోం రూల్ ఉద్యమ సమయంలో మూడవ పతాకం డా. అనిబిసెంట్, లోకమాన్య తిలక్ ఎగురవేసారు అప్పుడే భారత స్వాతంత్ర్యోద్యమం ఒక ఖచ్చితమైన రూపు తీసుకుంది ఈ జెండాలో ఐదు ఎర్రని గీతలు నాలుగు ఆకుపచ్చ గీతలు సమతల రేఖలుగా చిత్రితమయ్యాయి ఎడమవైపు పైన చివర భాగాన నాలుగు వంతుల చోటు ఆక్రమిస్తున్న యూనియన్ జాక్ (బ్రిటీష్ పతాకం) మధ్యలో ఏడు నక్షత్రాలు ఉన్నాయి చంద్రవంక, నక్షత్రం కూడా ఒక మూల చిత్రితమయ్యాయి

---

( 8 వ పేజీ తరువాయి )

రావడంవల్ల మెడల్స్ పొందే అర్హత కోల్పోయింది టెన్నిస్ డబుల్స్‌లో రమేష్ కృష్ణన్, లియాండర్ పేస్ - జాన్ ఫిట్జ్‌గెరాల్డ్, టాడ్ వుడ్‌బ్రిడ్జ్ జంటను ఓడించి క్వార్టర్ ఫైనల్స్‌కు చేరుకున్నారు

ఆగస్టు 9న జరిగిన XXV ఒలింపిక్స్ ముగింపు ఉత్సవం సాదారణంగానూ, గంభీరంగానూ జరిగింది అంతర్జాతీయ ఒలింపిక్ కమిటీ ప్రెసిడెంట్ జువాన్ ఆంటోనియో సమరాంచ్ క్రీడా పోటీల ముగింపు ప్రకటిస్తూ అమెరికన్ నగరం అట్లాంటాలో మరో నాలుగేళ్ళకి ప్రతీ దేశంలోని యువజనం సమావేశమౌతారని తెలియజేసారు ప్రపంచ ప్రజల మధ్య సన్నిహిత అవగాహనకు, శాశ్వత స్నేహానికి దారులు తీసిన ఆధునిక చరిత్రలోని అతి పెద్ద క్రీడోత్సవం పరిసమాప్తమైంది ●

"ఒక పువ్వును కానీ, సీతాకోక చిలుకను కానీ దాని చూపుల్ని బట్టి నీవు నిర్ణయించుకోవచ్చు, కానీ మానవునితో మాత్రం అలా వీలుకాదు."

బ్రిటిష్ సింహాసనం క్రింద ఇండియాకు అధినివేశ ప్రతిపత్తి ఇవ్వాలనే ఆశయాన్ని మూడో జెండాలోకి యూనియన్ జాక్ ప్రవేశం సూచిస్తున్నది. బ్రిటిష్ వారితో రాజకీయ ఒడంబడికను సూచిస్తున్న ఈ జెండా దేశ ప్రజల ఆమోదాన్ని పొందలేదు. ఒక నూతన క్రియాశీల నాయకత్వం కావాలన్న కోరిక 1921లో మోహన్‌దాస్ కరంచంద్ గాంధీని అగ్రస్థానంలోకి తెచ్చింది. ఆయన ద్వారా ప్రథమ త్రివర్ణ పతాక ఉద్భవించింది.

ఆనాటి మద్రాస్ ప్రెసిడెన్సీలోని బెజవాడ (నేటి విజయవాడ)లో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశాల్లో ఒక ఆంధ్ర యువకుడు ఒక జెండా తయారుచేసి గాంధీజీ దగ్గరకు తెచ్చాడు. భారతదేశంలో రెండు ప్రధాన మతాలుగా ఉన్న హిందూ, ముస్లిములకు ప్రాతినిధ్యం వహిస్తున్న రెండు రంగులు - ఎరుపు, ఆకుపచ్చ - ఈ జెండాలో ఉన్నాయి. ఇతర మతాలకు ప్రతిబింబంగా తెలుపు చారను, అభివృద్ధికి చిహ్నంగా రాట్నాన్ని చేర్చమని గాంధీజీ సూచించారు ఈ త్రివర్ణ పతాకం గాంధీజీ అనుమతి పొంది, ప్రజాదరణకు నోచుకుని అన్ని కాంగ్రెస్ సమావేశాల్లో ఆవిష్కరించబడింది

కొన్ని సంవత్సరాల తరువాత జెండాలోని రంగుల ప్రాధాన్యం గురించి వివాదం రాగా హిందువులు, ముస్లిములు ఒకరిపట్ల ఒకరు శత్రుత్వం వహించటం, జెండా విషయంలో మత కలహాలు చెలరేగటం జరిగింది.

1931 - జెండా చరిత్రలో ఒక మైలురాయి. జాతీయ చిహ్నంగా త్రివర్ణ పతాకను ఆమోదిస్తూ కాంగ్రెస్ సమావేశం తీర్మానం చేసింది. కాషాయం, తెలుపు, ఆకుపచ్చ రంగులతో కొత్త పతాక రూపుదాల్చింది మత ప్రాధాన్యం లేని జెండా ఇది. కాషాయరంగు ధైర్యానికి, త్యాగానికి; తెలుపు రంగు సత్యానికి, శాంతికి; ఆకుపచ్చ రంగు విశ్వాసానికి, శరణాగత రక్షణకు చిహ్నాలుగా భావించబడ్డాయి. తెల్లని చార మీద నీలి రంగు చర్ఖా కూడా జెండాలో చేర్చారు.

అచిరకాలంలో భారతీయుల స్వాతంత్ర్య దీప్తికి చిహ్నంగా ఈ త్రివర్ణ పతాక జాతీయ పతాకగా రూపొందింది.

1947 జూలై 22న రాజ్యాంగ పరిషత్తు త్రివర్ణ పతాకను స్వతంత్ర భారత జాతీయ పతాకగా స్వీకరించింది. ఈ పతాకంలోని రంగులు, వాటి ప్రాధాన్యం విషయంలో ఏ విధమైన మార్పులు రాలేదు. చర్ఖాకు బదులుగా అశోకుని ధర్మచక్రం ఆ స్థానం అలంకరించింది ●

## విస్‌డమ్ పాతకాపీలు

*మే '84, జూన్ '84, ఆగస్టు '84 నుంచీ నవంబరు '84, మార్చి '85 నుంచీ జూలై '85, ఫిబ్రవరి '86 నుంచీ ఏప్రిల్ '86, జూన్ '86, సెప్టెంబరు '86 నుంచీ డిసెంబరు '86, జనవరి '87 నుంచీ మే '87, ఆగస్టు '87, డిసెంబరు '87; జనవరి '88, మార్చి '88 నుంచీ డిసెంబరు '88, జనవరి '89 నుంచీ డిసెంబరు '89, జనవరి '90 నుంచీ సెప్టెంబరు '90, నవంబరు '90, డిసెంబరు '90; ఫిబ్రవరి '91 నుంచీ డిసెంబరు '91, జనవరి '92 నుంచీ జూన్ '92 కాపీలు మావద్ద ఉన్నవి 1984 కాపీల వెల రూ. 7 50లు; 1985 కాపీల వెల రూ 6 50లు, 1986 కాపీల వెల రూ. 12 00లు; 1987 కాపీల వెల రూ 11 50లు; 1988 కాపీల వెల రూ 18 75లు; 1989 కాపీల వెల రూ. 24 50లు; 1990 కాపీల వెల రూ. 25 50లు; 1991 కాపీల వెల రూ. 26 50లు; 1992 కాపీల వెల రూ. 22 00లు రిజిస్టర్డ్ పోస్ట్‌లో పొందడానికి కాపీల వెలతో పాటు రూ. 6.00లు చేర్చి M O పంపాలి. 'రత్నా ఎక్సెప్రెస్' 9, దేశికా రోడ్డు, ఆళ్వారుపేట, మద్రాను - 600 004*

— సర్క్యులేషన్ మేనేజర్

'మిగిలిన ప్రత్యామ్నాయ మార్గాలన్నీ ఖాళీకాగానే మనుషులూ, ప్రభుత్వాలూ సవ్యంగా ప్రవర్తిస్తాయి.

# చిట్టిదేవతలకు చిన్నకథలు

## తరగని పెన్నిధి-దానగుణం

అతని సంపద అపారం అతని ఔదార్యమూ అంతే. అతని ఇంటికి వెళ్లి శూన్య హస్తాలతో తిరిగి వచ్చినవారు లేరు. ఆయన ఆపన్నులకు భోజనం పెట్టి, వస్త్రాలు ఇచ్చి కోరిన సహాయం అందజేస్తాడు. 'దాతల్లో మహాదాత' అనే పేరు నాలుగు చెరగులా వ్యాపించింది భరత వంశజుడైన రంతిదేవ మహారాజు ఆయన మహాభారత ఇతిహాసంలో ఆయన పేరు పేర్కొనబడింది



ఆయనకు దుర్దినాలు దాపురించగా సంపద అంతరించిపోయింది సేవకులు, నౌకర్లు డబ్బుతో పాటే ఇల్లు విడిచి వెళ్లిపోయారు ఆయనను వీడిపోనిది ఒక్కటే - దానం చేయటం అనే అలవాటు మాత్రమే అయితే చేతిలో ఏమీ లేని రోజు, ఒక్క తిండి గింజయినా లేని రోజు రానే వచ్చింది ఈ పరిస్థితిలో నిరాహార దీక్షకు పూనుకున్నాడు 48 రోజుల పాటు దీక్ష కొనసాగించాడు. 49వ రోజు వేకువన అలసిన కళ్లు విప్పి చూసాడు క్షీరాన్నం, నెయ్యి, పూరీలు, మంచినీరు మొదలైన సామగ్రిని ఒక పళ్ళెంలో పెట్టుకుని నిలుచున్న వ్యక్తి దృగ్గోచరమయ్యాడు. భగవంతునికి కృతజ్ఞతలు చెప్పి వీటిని భుజించేందుకు ఉపక్రమించాడు.

అప్పుడు ఏమైందో గమనించండి! ఎక్కడి నుంచో ఒక బ్రాహ్మణుడు ఊడిపడ్డట్టుగా వచ్చాడు. రాపిడి గొంతుకతో 'ఓరాజా! యాభైరోజుల నుండి నేను ఏమీ తినలేదు. నీ కంటే ఎక్కువ ఆకలితో ఉన్నాను. నాపైన దయతలచి తినేందుకు ఏదైనా ఇవ్వు' అన్నాడు. రంతి దేవుడు పళ్లెంలో ఉంచిన తన చేతిని బయటికి తీసి ఆ క్షీరాన్నం, నెయ్యి బ్రాహ్మణునికి సమర్పించాడు. ఆ బ్రాహ్మణుడు వాటిని భుజించి అదృశ్యమయ్యాడు. ఇంతలో

## సుభాషితాలు

తెలుసుకొనుము తెలియగోరిన విషయంబు
[illegible]
[illegible]
విశ్వదాభిరామ వినురవేమ!
తెలియని విషయము, [illegible]
[illegible]
[illegible]

ఒక్క వానచుక్క చినుకు ముత్యంబయ్యె
వేరుచుక్క చినుకు నీళ్ళ గలసె
ప్రాప్తమున్న చోట ఫలమేల తప్పురా?
విశ్వదాభిరామ వినురవేమా!

ప్రాప్తియున్న చోట వద్దన్నను ఫలము లభించును. నీటి బొట్టు ముత్యపు చిప్పలో పడిన ముత్యమగును. నీటిలోపడిన ఆ నీటిలోనే కలిసిపోవును!

నిజమైన వేదాభిప్రాయాలు రావటం అభ్యున్నతికి ఆరోగ్యకరమైన

మరో వ్యక్తి ఇలా అరుస్తూ వచ్చాడు "ఓ రాజా! ఆకలి నుంచి రక్షించు 51 రోజులుగా తిండిని తినటం కాని ధాన్యపు గింజను చూడడం కానీ చేయలేదు" రాజు అతనికి సంతోషంగా



పూరీలను అందించాడు ఇక మంచినీళ్ళు మాత్రమే మిగిలాయి రాజు గ్లాసు ఎత్తి నీటిని త్రాగబోతున్నాడు ఆ గ్లాసు రాజు పెదవులను తాకేలోగా నాలుగు కుక్కల్ని వెంట పెట్టుకుని మరో వ్యక్తి అరుదెంచాడు "ఓ రాజా! నీవు ఆ నీటిని త్రాగితే ఒక మనిషి మాత్రమే రక్షించబడతాడు. దాన్ని మాకు ఇచ్చావంటే మేము ఐదుగురం కాపాడబడతాము" కించిత్ ఆలస్యం చేయకుండా రాజు నీటిని ఆ వ్యక్తికీ. శునకాలకూ ఇచ్చి దప్పిక తీరి వారు సంతోషంగా ఉండటం చూసి ఆనందించాడు తనకంటే ఎక్కువ అవసరం కలవారికి సేవచేసే అవకాశం కలిగించినందుకు భగవంతునికి కళ్ళు మూసుకుని కృతజ్ఞతలు తెలుపుకున్నాడు సంతోషం, సంతృప్తి ముప్పిరి గొన్న హృదయంతో - ఆ ఆనందం ముఖం మీద ప్రస్ఫుటం కాగా - రాజు తన ఎదుట నిలబడిన మరో వ్యక్తిని చూసేందుకు కళ్ళు తెరిచాడు సౌమనస్యం మనశ్శాంతి ముప్పిరి గొనగా రాజు ఇలా అన్నాడు "అయ్యా! మీకు సమర్పించుకునేందుకు నా వద్ద ఏమీ మిగలలేదు అయితే నా బతుకు శరీరం మీకే విధంగానైనా ఉపయోగిస్తే దానికి నేను సిద్ధంగా ఉన్నాను" ఆ అజ్ఞాత వ్యక్తి నిజరూపం ధరించాడు అతడు మరెవరో కాదు, ఆ భగవంతుడే దిగి వచ్చాడు! భగవంతుడు అతనితో అన్నాడు "ఓ రాజా! నీ త్యాగానికి నేను సంతృప్తి చెందాను నేను ఆకలితో ఉంటే ఆహారం ఇచ్చావు దిగంబరంగా ఉంటే వస్త్రాలు ఇచ్చావు దుఃఖంలో ఉంటే ఓదార్చావు నీ ఆనందం ఇలాగే కొనసాగు గాక" ఈ మాటలు చెప్పి భగవంతుడు అదృశ్యుడయ్యాడు రాజుకు కోల్పోయిన సంపద, అధికారం తిరిగి చేకూర్చాడు

## మాటలన్నిటికీ అతీతం




ఓ శివా! నీవు సర్వాంతర్యామివి అనే విషయం మరిచిపోయి కాశీ క్షేత్రానికి యాత్ర చేశాను మానసికమైన యోచనలన్నిటికీ అతీతుడవని మరచి నిన్ను గురించి యోచించాను అన్ని మాటలకు అతీతుడవని మరచి నిన్ను ప్రార్థించాను నేను ఆచరించిన ఈ మూడు పాపాలను క్షమించు

—ఆదిశంకర

శ్రమ శరీరాన్ని ఏవిధంగా పటిష్టం చేస్తుందో, కష్టాలు మనస్సుని శం చేసాయి"

# వయసా! నీకు వందనం!!

విజయానికి వయస్సు అవరోధం కాదు. ప్రతివారినీ విజయం వరిస్తుంది ఆరోగ్యం, ఆనందం, ఐశ్వర్యం - కావాలని కోరుకుని వయస్సుతో నిమిత్తం లేకుండా గట్టిగా కృషి చేస్తే వీటిని సాధించుకోవచ్చు



2 వృద్ధాప్యం వచ్చిందని మనిషి తలపోస్తాడు ఆచిదంగా ఆలోచిస్తే ముప్పై ఏళ్లకే వృద్ధాప్యం తెచ్చుకుని నీళ్లు చల్లుకోవచ్చు. క్రొత్త ప్రదేశాలు జయించాలని, కొత్త సవాళ్లు ఎదుర్కోవాలని నీవు తలచురుంటే తొంభై ఏళ్లు వచ్చినా నీవు విజయాన్ని సాధిస్తావు

3 నీవు అనుకున్నట్లే నీ వయస్సు ఉంటుంది వయస్సు నీ జీవన గమనం పొడుగునా నీతో వచ్చేదే కాని కేవలం చివరి సంవత్సరాలలో వచ్చేది కాదని శాస్త్రవేత్తలు చెబుతున్నారు.

4 ప్రభుత్వంలో అత్యున్నత అధికార శ్రేణిలో - విద్య, మతం, సైన్స్ మున్నగు రంగాలలో మధ్య వయస్సు దాటినవారే ఉంటారు ఏ దేశంలో అయినా అత్యున్నత పదవుల్లో ఉన్న అధికార వర్గంలో మధ్య వయస్సు మళ్లుతున్నవారే సగానికి పైగా ఉంటారు చరిత్ర నిర్మాతలు యువకులు కారు - మధ్య వయస్కులు. ఉన్నత స్థానాల్లోకి వెళ్లే సమయానికి వారే పెద్ద వయస్సు వారవుతారు 'కాలెండర్ వయస్సు' ఆధారంతో జీవితంలో రిటైర్ కావద్దు. మీ మంచి కాలం ఇప్పుడే. ఇంకా మంచికాలం ముందున్నది.

5 జీవిత సౌభాగ్యం మీలోనే ఉంది. సంతోషం, శాంతి, సౌఖ్యం - మీ ఆలోచనల నుంచి, విశ్వాసాల నుంచి ఉద్భవిస్తాయి. యౌవ్వనంతో, సంతోషంగా ఉండటం మీ మనస్సుని బట్టి ఉంటుంది యువకుడుగా ఉన్నానని భావించుకోండి ఆరోగ్యంగా ఉన్నానని భావించుకోండి బాగా వర్థిల్లుతున్నానని భావించుకోండి

— బ్రెయిన్ ఆడమ్స్ - సైకాలజిస్ట్

# అద్భుత ప్రపంచం

## నత్త నడకకు మరోపేరు ఈ విచిత్ర గడియారం

*డెన్మార్క్‌లోని కోపెన్‌హాగన్ టౌన్ హాల్‌లో ఉన్న ఓల్‌సెన్ గడియారంలో 14,000 భాగాలు ఉన్నాయి. దీనిని తయారు చేయడానికి 10 సంవత్సరాలు పట్టింది ఇది 570,000 విభిన్న విధాలుగా పని చేస్తుంది ఒక పూర్తి వలయం చుట్టేందుకు ఈ గడియారం యొక్క దివ్య ధృవం (Celestial pole) 25,700 సంవత్సరాలు తీసుకుంటుంది. ప్రపంచంలోనే అతి నెమ్మదిగా సాగే యంత్ర పరికరాల కూర్పుగల ఈ గడియారం 300 ఏళ్ళలో 0.5 సెకండ్ల వరకు కాలాన్ని ఖచ్చితంగా చూపుతుంది.*

"ఎవడైతే కేవలం తనకోసమే సంపాదించుకుంటాడో అతడు స్వర్గమనీ, సద్గుణమనీ ఎన్ని చెప్పినా కీడునే కొని తెచ్చుకుంటాడు."

# సంఘర్షణామయం జీవితం

ఒక ప్రభుత్వోద్యోగి ఒకసారి ఒక మత ప్రవక్తను ఇలా అడిగాడు· "మన జీవితంలో జరుగుతున్న ప్రతిక్షణం సంఘర్షణామయంగా ఉంటుందనే పాతకాలపు పలుకులకు అర్థం ఏమిటి? ఉదాహరణకు ఇవ్వాళ నా జీవితంలో



నాకెటువంటి ఘర్షణ ఎదురుకాలేదు ఉదయాన్నే నిద్రలేచి ముఖక్షౌరం పూర్తిచేసుకుని, స్నానం చేసి, వార్తా పత్రికలు చదివి, ఉపాహారం సేవించి ఆఫీసుకు వెళ్ళాను రోజంతా పనిచేసి ఇప్పుడు ఇంటికి వెళుతున్నాను ఉదయం సాయంకాలంగా మారింది అయినా నేను ఎక్కడా సంఘర్షణ పడినట్లు కనిపించడం లేదు"

ప్రవక్త చిరునవ్వు నవ్వి ఇలా చెప్పాడు ఈ సంఘర్షణను గమనించేందుకు నీకు అంతర్దృష్టి కావాలి పోరాడే నేర్పు గల వ్యక్తికే యుద్ధం అంటే ఏమిటో అర్థమౌతుంది పోరాటం అంటే తెలియని నీబోటి వ్యక్తులకు పోరు తటస్థించినా అది అర్థం కాదు. యుద్ధాన్ని గుర్తించలేని వారు విజయానికి బదులు పరాజయాన్నే పొందుతారు

ఈరోజు నీవు చాలా యుద్ధాల్లో ఓడిపోయావు విజయం కోసం నీవు పట్టించుకోనందువల్ల పరాజయాన్ని కూడా నీవు గుర్తించలేదు ఎన్నో సార్లు పరాజయం పొందినా దానిని గమనించ లేదు

ఒకసారి జ్ఞాపకానికి తెచ్చుకుంటే· ఈ ఉదయం నీకు బెడ్ టీ వేకువ ఝామునే అందినప్పుడు నీ పనిమనిషిని శిక్షించావు. ఈరోజున మొదటి అపజయం ఇదే

తరువాత స్నానాల గదిలో నీ సబ్బు పెట్టెను విసిరికొట్టావు సబ్బు సులభంగా చేతిలోకి రాలేదనే కోపంతో ఇది నీ రెండో పరాజయం క్రింద లెక్క వేసుకో

ఇక నీవు కారులో వెళ్తున్నప్పుడు ఒకరు నీ కారుకు అడ్డురాగా, నీ కారు నిలిచిపోతే అతడిపైన తిట్ల వర్షం కురిపించావు ఇది నీ మూడో ఓటమిగా భావించుకో!

ఇప్పుడు నిన్ను నీవే అంచనా వేసుకో ఇవ్వాళ ఆఫీసులో ఏదైనా విజయం సాధించావో లేక పరాజయ పరంపరల నెదుర్కొన్నావో?"

# నమ్మలేని నిజాలు

[illegible]

[illegible] సానుభూతితో వ్యవహరించటం" — ఆర్నాల్డ్ బెన్నెట్

# నిజాలు - నిదర్శనాలు

## 1991-92లో విదేశీ యాత్రికులు

మనదేశాన్ని 1991-92లో సందర్శించిన విదేశీ యాత్రికులు 1,781,892 మంది. 1990-91లో కంటే ఇది 10.4 శాతం పెరిగింది.

## తేనీటి వాడకం



ప్రపంచ తేయాకు ఉత్పత్తిలో 28 శాతం లేక 700 మిలియను కిలోగ్రాములు ఇండియాలోనే ఉత్పత్తి జరుగుతూంది. దీనిలో 500 మిలియను కిలోగ్రాముల వాడకం కూడా మనదేశంలోనే అవుతూంది. ఈ విధంగా ప్రపంచంలోనే అత్యధిక తేయాకు ఉత్పత్తి ఇండియాలోనే జరుగుతున్నాయి.

## పోస్ట్ కార్డు ఖర్చు రూ 1.25

15 పైసల పోస్ట్ కార్డ్ వల్ల ప్రభుత్వానికి రూ 1.25లు ఖర్చు అవుతుంది. 75 పైసల ఇన్‌లాండ్ లెటర్ వల్ల రూ 1.41 పైసలు వ్యయమవుతుంది. సంవత్సరానికి పోస్ట్ కార్డులు 79.9 కోట్ల రూపాయలు, ఇన్‌లాండ్ లెటర్లు 57.36 కోట్ల రూపాయలు ఖజానాకు నష్టం తెస్తున్నాయి.

## జాతీయ రహదారులు

ప్రస్తుతం భారతదేశంలోని జాతీయ రహదారుల క్రింద 33,612 కి.మీ.ల రోడ్లు ఉన్నాయి. దేశం మొత్తం రోడ్ల నిడివితో పోలిస్తే ఇది రెండు శాతమే అయినా మూడోవంతు రోడ్డు ట్రాఫిక్ దీనిమీదనే జరుగుతూంది.

## విశ్వవిద్యాలయాల్లో వృద్ధి

1950 నుండి 1985 వరకు ఇండియాలోని విశ్వ విద్యాలయాలు 20 నుండి 157కు వృద్ధి పొందాయి. కళాశాలలు 695 నుండి 5,482కు పెరిగాయి. విద్యార్థుల ప్రవేశం 1.74 లక్షల నుండి 33.65 లక్షలకు పెరిగింది. 1950లో 21,000 విశ్వవిద్యాలయ అధ్యాపకులు ఉండేవారు. ఇప్పుడు వీరి సంఖ్య 2.5 లక్షలకు చేరుకుంది.

## స్త్రీ పురుషుల సంఖ్య

20వ శతాబ్ది తొలి దశలో ఇండి 1000 మంది పురుషులకు 972 మంది మహిళలు ఉండేవారు. 1991 జనాభా లెక్కల ప్రకారం ప్రతి 1000 మంది పురుషులకు 929 మంది స్త్రీలు ఉన్నారు. 1981 జనాభా లెక్కల కంటే ప్రతి వెయ్యి మంది పురుషులకు 5గురు స్త్రీలు తక్కువగా ఉన్నారు.

— 'యోజన'

# అపూర్వ విషయాలు

## సూక్ష్మాతి సూక్ష్మమైన బీజాలు

ఎపిఫైటిక్ (Epiphytio) చెట్ల గింజలు మిక్కిలి సూక్ష్మమైనవి. ఒక ఔన్సుకి 35,000,000 విత్తనాలు ఉంటాయి.

"నేర్చుకోవడం వల్ల బోధిస్తూ, బోధించడం వల్ల నీవు నేర్చుకుంటావు."

— రైట్ ఆనరబుల్ శ్రీనివాసశాస్త్రి

## 1,56,504 గ్రామాలకు రక్షిత నీటి వసతి

1984లో ఇండియాలో 1,61,722 గ్రామాలను సమస్యాత్మక గ్రామాలుగా గుర్తించారు 1991 నాటికి 1,56,504 గ్రామాలకు పూర్తిగా కాని, పాక్షికంగా కాని రక్షిత నీటి సరఫరా చేసారు దేశం మొత్తం మీద ఏ విధమైన నీటి వసరులు లేని 5,218 గ్రామాలకు మాత్రమే రక్షిత మంచినీటి సౌకర్యం కలిగించవలసి ఉంది

## తోళ్ల ఉత్పత్తి మూడొంతుల పెంపు

ఇండియాలో తోళ్ల ఉత్పత్తి విలువ 1984-85లో 17,205 మిలియను రూపాయలు కాగా 1990-91లో 52,900 మిలియను రూపాయలకు వృద్ధి చెందింది పాదరక్షల భాగాల ఎగుమతిలో ఇండియా భాగం 9 5 శాతం కాగా పదును చేసిన తోళ్ళు వస్త్రాలు 3 శాతం, పాదరక్షలు 0 7 శాతం మాత్రమే ఎగుమతి అవుతున్నాయి

## ఏడాది వయస్సు రాకముందే 241 లక్షల శిశుమరణాలు

నయం చేయదగిన వ్యాధుల వల్ల ఇండియాలో ప్రతి సంవత్సరం 241 లక్షలమంది పిల్లలు ఏడాది వయస్సు రాకముందే చనిపోతున్నారు 5 ఏళ్ళు రాకముందే 15 లక్షల మంది పిల్లలు మరణిస్తున్నారు ప్రతి గంటకు 400 మంది శిశువులు ప్రాణాలు కోల్పోతున్నారు

## పశు సంపదకు ప్రధానస్థానం

ఇండియా పశువుల్లో 11 జాతులకు చెందినవి రూ 84,691 కోట్లు ఖరీదు చేస్తాయి జాతీయ సంపదకు పశుగణాభివృద్ధి శాఖ 15 శాతం మేరకు సహాయపడుతూంది దేశంలోని 193 మిలియన్ల పశు సంపదలో పాడి పశువులు అత్యధిక సంఖ్యలో ఉన్నాయి వీటి ఖరీదు రూ 36,600 కోట్లు ఉంటుంది పాల నుండి ఎముకల వరకు లెక్కిస్తే పశుసంపద వల్ల రూ 79,180 కోట్ల మేరకు (మార్కెట్ విలువ) ఉత్పత్తి జరుగుతున్నది

# చేపల వింతలు

## వేడినీటిని కోరే వింత చేపలు

బర్రకుడ (Barracuda) - దుష్టస్వభావం కలిగి, విధ్వంసక నౌక (డెస్ట్రాయర్) ఆకారంలో ఉండే ఉష్ణ నీటి చేప వేడినీటిని ఇష్టపడుతుంది అమెరికాలోని కరోలినా తీరం నుంచి వెస్ట్ ఇండీస్‌లోని కరేబియన్ తీరం వరకు - సముద్ర జలాలలో ఈ చేపలు కనిపిస్తాయి ఈ తరగతికి చెందిన చేపల కంటే ఇవి చాలా ప్రమాదకరమైనవి బర్రకుడ - ఇతర చేపలను తిని బతుకుతుంది అయితే వాసన చూసి కాక తన చూపుకి కనిపించిన వాటిని వేటాడుతుంది అందువల్ల వాని దృష్టిలోకి వచ్చిన మనిషిని దాడి ఎదుర్కోలేము అనేక రకాల బర్రకుడ చేపల్లో - పెద్ద బర్రకుడ 2 మీటర్ల పొడవు ఉంటుంది దీని కోరల వంటి పళ్ళు 1 87 సెంటీమీటర్లు పొడవు ఉంటాయి

"జ్ఞానం వినయంతో కలిస్తే ద్విగుణీకృతంగా ప్రకాశిస్తుంది"
— విలియం పెన్

# వేద విజ్ఞానగని - మాక్స్‌ముల్లర్

సుప్రసిద్ధ వేద పండితుడు ఫ్రెడరిక్ మాక్స్ ముల్లర్ 1823 డిసెంబర్ 6వ తేదీన జర్మనీలోని డిస్సూలో జన్మించాడు అతని తండ్రి విల్‌హెల్మ్ ముల్లర్ లైబ్రేరియన్‌గా పని చేస్తూండేవాడు అతడు నాటి ప్రసిద్ధ గేయ రచయిత కూడా.



మాక్స్ ముల్లర్ శాస్త్రీయ వేదాంతాన్ని లీప్ జిగ్ యూనివర్శిటీలో అభ్యసించాడు సంస్కృతాభ్యానం చేయమని హెర్మన్ బ్రోక్ హౌస్ అతణ్ణి ప్రోత్సహించాడు 1845లో మాక్స్ ముల్లర్ పారిస్ వెళ్ళి ఇ.బర్నాఫ్ జరుపుతున్న ఋగ్వేద తరగతులకు హాజరయ్యాడు

అతని కోసం ఒక క్రొత్త ప్రపంచం ద్వారాలు తెరుచుకున్నాయి సాయనుల వ్యాఖ్యానంతో ఋగ్వేదాన్ని ప్రచురించాలని నిర్ణయించుకున్నాడు. 1846లో మాక్స్ ముల్లర్ లండన్ సందర్శించాడు. ఈస్ట్ ఇండియా కంపెనీ అతని గ్రంథ ముద్రణకయ్యే వ్యయం భరించేందుకు అంగీకరించింది 1849లో మొదటి సంపుటి ప్రచురించారు అప్పుడు ముల్లర్ వయస్సు 26 ఏళ్ళు. మొదటి ముద్రణ 500 ప్రతులు అతి త్వరలో విక్రయించబడగా ద్వితీయ ముద్రణ కయ్యే ఖర్చు భరించేందుకు విజయనగరం మహారాజా అంగీకరించారు. విజయనగరం మహారాజు సర్ పూసపాటి ఆనంద గజపతిరాజుగారి దాత్ క్రింద సాయనాచార్యుల వ్యాఖ్యానంతో ఋ సంహిత నాలుగు సంపుటాలు లండన్‌లో ప్రచురించబడ్డాయి 1859లో ముల్లర్ ప్రాచీన సంస్కృత సాహిత్య చరిత్ర' అనే గ్రంథాన్ని ప్రచురించాడు ఋగ్వేదం ప్రాధాన్యాన్ని భారత, గ్రీస్ దేశాల సామ్యాన్ని దానిలో ఉగ్గడించాడు.

## భూమి మీద బిలియనుల కోటీ కీటకాలు



భూమి మీద ఏ ఒక్క నిమిషంలోనైనా బిలియనుల కోట్ల కీటకాలు ఉన్నాయని అంచనా వేయబడింది. వీటిలో వివిధ జాతులకు చెందిన 25 మిలియన్ల కీటకాలు ఉష్ణ ప్రదేశపు ప్రతీ చదరపు మైలు ప్రదేశంలో గాలిలో ఎగురుతూంటాయి

— 'వేక్ అప్ ఇండియా' సౌజన్యంతో

"దారిద్ర్యాన్ని పారద్రోలేందుకు ఏకైక ఇంద్రజాలం: కష్టపడి పని చేయడం, దూరదృష్టిని కలిగి ఉండటం, దృఢసంకల్పం, క్రమశిక్షణ."

మాక్స్ ముల్లర్ అద్భుతంగా ఉపన్యాసాలిచ్చే వాడు. ధార్మిక సంబంధమైన అంశాలపై ఉపన్యాసాలు ఇవ్వమని ఆయనకు ఆహ్వానాలు అందేవి ఈ ఉపన్యాసాలన్నీ పుస్తకరూపంలో వెలువడ్డాయి. వేదాలతో పాటు ముల్లర్ పార్శీల జెండ్ - అవెస్తా (Zend-Avesta) వంటి మత గ్రంథాలు, బౌద్ధుల 'త్రిపీటకాలు' అధ్యయనం చేసాడు. 'మతం మూలం - దాని అభివృద్ధి', 'మతం అనే శాస్త్రం యొక్క పరిచయం' వంటి ఉపన్యాసాలు పుస్తకరూపంలో వెలువడ్డాయి.

మతానికి సంబంధించిన రంగంలో మాక్స్ ముల్లర్ నిర్వహించిన ప్రధానమైన పని తూర్పు దేశాల్లోని పవిత్ర గ్రంథాల నుండి వేదాంగాలను తీసుకుని అనువదించటం రెండు సీరీస్‌లో 50 గ్రంథాలుగా ఇవి వెలువడ్డాయి. 1874లో ప్రాచ్య దేశీయుల అంతర్జాతీయ సమావేశంలో ఈ పనికి ఉపక్రమించాడు. 'లెక్చర్స్ ఆన్ ది సైన్స్ ఆఫ్ లాంగ్వేజ్' అనే ముల్లర్ గ్రంథం రెండు సంపుటాలుగా 'సైన్స్ ఆఫ్ లాంగ్వేజ్' పేర 1891లో ప్రచురితమైంది

'ఇండియా - మనకు అది బోధించేదేమిటి?' అనే మాక్స్ ముల్లర్ ప్రసిద్ధ గ్రంథం ఇండియన్ సివిల్ సర్వీస్ అభ్యర్థుల కోసం ఆయన చేసిన ఉపన్యాసాల ఆధారంగా వెలువడింది ప్రాచీన భారతీయ సంస్కృతీ ప్రాధాన్యాన్ని దీనిలో ఆయన అభ్యర్థులకు నొక్కి చెప్పాడు

'భారతీయ తత్త్వశాస్త్రంలోని ఆరు పద్ధతులు' అనే ముల్లర్ చివరి రచన 1899లో లండన్‌లో ప్రచురించారు. ఇండియాలోని అన్ని వేదాంత విధానాలను చర్చించిన మొదటి రచన ఇదే

1900 అక్టోబర్ 28న ఆయన శాశ్వతంగా ఆక్స్‌ఫర్డ్‌లో కన్నుమూసినప్పుడు ఆయన మేధా సంపత్తిని, మానవతా దృక్పథాన్ని ప్రముఖులంతా కొనియాడి ఘనంగా నివాళులర్పించారు.

1901లో ముల్లర్ ఆత్మకథ 'ఒక తునక' (A Fragment) అనే గ్రంథంగా ప్రచురించారు.

— 'జర్మన్ న్యూస్' సౌజన్యంతో

# చీమల కాలనీలలో ఆడవి మాత్రమే ఉంటాయి



చీమల కాలనీలలో ఆడవి మాత్రమే ఉంటాయి మగవి ప్రత్యేక సమయాలలో సంపర్కంలేని ఆడ వాటితో చేరడానికి వచ్చి ఒక్కసారి చేరిన తరువాత చచ్చిపోతాయి ఒకే గూటిలో ఉండేవన్నీ ఆడవే అవి అన్నీ గ్రుడ్లను పెడతాయి వాటి నుంచి ఆడచీమలు పుట్టుకువస్తాయి ఉత్పత్తి కాబడే గ్రుడ్లను, వాటి నుంచి వచ్చే చీమలను ఆడ చీమలు నియంత్రిస్తూంటాయి

ఆస్ట్రేలియాకు చెందిన వీవర్ చీమలలో ఆడచీమ శరీరం మీద ఒకేవిధమైన ద్రవం స్రవిస్తుంది దీనిని ఇతర ఆడచీమలు నాకుతాయి అది నాకిన వెంటనే వర్కర్ చీమలు వంధ్యత్వాన్ని పొందుతాయి ఆడవి కొన్ని గ్రుడ్లను పెట్టినా వాటి నుంచి పిల్లలు రావు ఈ గ్రుడ్లు సాధారణంగా రాణి చీమకు, ఇతర చిన్న చీమలకు ఆహారంగా ఉపయోగపడతాయి

— 'సిఐఇ - ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

"వీరోచిత కృత్యాల సుగంధ పరిమళమే - కీర్తి."

సోక్రటీస్

# తాతలనాటి గాథలను త్రవ్విపోస్తున్నారు...

పురాతత్త్వశాస్త్రం మానవుని భూతకాలం గురించి అధ్యయనం చేస్తుంది మానవ శరీర అవశేషాలు ప్రత్యక్ష సాక్ష్యాలుగా మనకు లభిస్తున్నాయి. జనాభా, వ్యాధులు, జీవిత ప్రమాణం, దహన ఆచారాలు వంటి సమాచార మంతా ఈ అధ్యయనం ద్వారా తెలుస్తుంది



వ్యర్థ పదార్థాల నుండి ప్రాచీనుల పరిశ్రమల వివరాలు తెలుసుకోవడం ఒక ప్రధాన విషయంగా భావించబడింది ఉదాహరణకు ఇంగ్లీష్ హెరిటేజ్ లాబొరేటరీ యొక్క టెక్నాలజీ విభాగంవారు లోహాలు, ఎనామిల్, నున్నని మెరిసే రాళ్లు, రంగులు, వర్ణాలు, సున్నాలు, ప్లాస్టర్, కాల్చిన బంకమట్టి, ఇటుకలు మొదలైన వాటిని అధ్యయనం చేసేందుకు ఎక్స్‌రే ఫ్లోరోసెన్స్, ఆటోమిక్ అబ్జార్ప్షన్, స్కానింగ్ ఎలక్ట్రాన్ మైక్రోస్కోపీ, మెటల్లోగ్రాఫీలను ఉపయోగిస్తున్నారు ఒక శాస్త్రవేత్త (1100 నుండి 1500 ఎ డి ) మధ్యకాలానికి సంబంధించిన పుర్రెను పరీక్షించడానికి క్రానియోమెట్రీ (craniometry) అనే పరికరాన్ని ఉపయోగిస్తాడు ప్రాచీనకాలానికి సంబంధించిన జాతుల సంబంధాల గురించి పరిశోధించేందుకు ఇది ఉపయోగించటమే కాక ఆ కాలంనాటి జన సమూహాల కదలికల గురించి కూడా అధ్యయనం చేసేందుకు తోడ్ప

పోయినప్పటి వయస్సు నిర్ణయానికి దంతాలను ఆధారంగా తీసుకుంటారు మానవుని ఆహార, విహారాలను గురించి సమాచారం తెలుసుకునేందుకు మృగాల ఎముకలు కూడా పరీక్షిస్తారు మొక్కలు, విత్తనాలు, కొయ్య అవశేషాలు, మట్టి నమూనాల వంటివి కూడా సమాచార సేకరణకు సహాయపడతాయి.

(లండన్ పిక్చర్స్ సర్వీస్)

— 'సైన్స్ రిపోర్టర్' సౌజన్యంతో

●

# జపాన్ వచ్చేతరం బుల్లెట్ ట్రెయిన్



*జపాన్ వచ్చేతరం బుల్లెట్ ట్రెయిన్ ఒక పెద్ద వెడ్జ్ (ముంగ) ఆకారంలో డ్యూరాల్యూమిన్ (విమానాల తయారీకి ఉపయోగించే లోహమిశ్రమం)తో తయారైన దానిని 1995లో నడుపుతారు. 'స్టార్ 21' అనే ఈ ట్రెయిన్ గంటకి 400 కిలోమీటర్ల వేగాన్ని అధిగమిస్తుంది.*

— 'ఎకనామిక్ టైమ్స్' సౌజన్యంతో

# కలసి నిద్రిస్తే కలదు సుఖం

అన్ని ఖండాలలో నివసిస్తున్న ప్రజల నిద్రకు సంబంధించిన అలవాట్లను ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీకి చెందిన ఫ్రైబర్గ్ యూనివర్శిటీ సర్వే చేసింది. దీనివల్ల నిద్రించే సదుపాయాలు తక్కువగా ఉన్నప్పటికీ దక్షిణ ఆసియా, తూర్పు ఆసియాల్లోని పారిశ్రామిక దేశాలవారే పశ్చిమదేశాల వారి కంటే ఎక్కువ సుఖంగా నిద్రిస్తారని వెల్లడయింది.



పారిశ్రామికాభివృద్ధి సాధించిన పశ్చిమ దేశాలలో మూడోవంతు లేదా నాలుగోవంతు జనాభా నిద్రాభంగం కలిగినవారుగా ఫ్రైబర్గ్ యూనివర్శిటీ న్యూరొలాజికల్ క్లినిక్‌కు చెందిన విన్‌ఫ్రెడ్ ఇఫిల్స్‌బర్గ్ చెబుతున్నారు.

రణగొణ ధ్వనులు చేసే బస్సుల్లోనూ, రైళ్ళల్లోనూ దూర ప్రయాణాలు చేస్తూ హాయిగా నిద్రపోయే ఆసియావాసులను చూసి ఆసియా చూడవచ్చిన పశ్చిమ దేశాల యాత్రికులు ఆశ్చర్యంతో ముక్కు మీద వేలు వేసుకుంటున్నారు. అటువంటి దుర్భర పరిస్థితుల్లో పశ్చిమ దేశవాసుల్లో అధిక సంఖ్యాకులకు కంటి మీదికి కునుకురాదు.

దాదాపు అన్ని దేశాల్లో కూడా జనం రాత్రి వేళల్లో నిద్రకుపక్రమించి మరునాటి ఉదయమే మేల్కొని పనుల్లోకి వెళ్తుంటారు. అయితే యుకటన్‌లోని మాయన్ల తరహావేరు. వీరు ఉదయం 3 గంటలకు మేల్కొని పనులు ప్రారంభిస్తారు. టెర్రా డెల్ ఫ్యూగోలోని యహాన్లు మరో తరహావారు. ఎప్పుడు అలసట అనిపిస్తే అప్పుడు నిద్రలోకి జారుకుని, ఎప్పుడు అలసట తీరితే అప్పుడు మేల్కొంటారు. సుదీర్ఘకాలం ఎటువంటి అలసట లేకుండా, నిద్ర లేకుండా కూడా ఉండగలరు. తరువాత ఎక్కువకాలం విశ్రాంతి తీసుకుని ఈ దీర్ఘశ్రమను పోగొట్టు

## పొగాకులో కనుగొన్న అపాయకర ద్రవ్యాలు



1 నికోటిన్ - మరణాంతకమైన విషం, 2 తారు - పొగాకు సిగరెట్టు కాల్చేవాళ్ళ వ్రేళ్లకు మరక ఏర్పడినట్లే పొగాకు కాల్చేవాళ్ల ఊపిరి తిత్తులలో మరక ఏర్పడుతుంది, 3 అమ్మోనియా - సాధారణంగా పంట గదుల్లో బాగా శుభ్రం చేసుకోడానికి వాడే ద్రవం, 4 ఫార్మాల్డీహైడ్ - క్రిమి సంహారానికి వాడే విష పదార్థం, 5 హైడ్రోజన్ సల్ఫైడ్ - కుళ్లిన గ్రుడ్లలా కంపు కొట్టే విష వాయువు 6 హైడ్రోజన్ సైనైడ్ - ఒక రకం విష వాయువు, 7 కార్బన్ మోనాక్సైడ్ - సాధారణంగా కారు ఎగ్జాస్ట్ పొగలో ఉండే విష వాయువు, 8 ఆర్సెనిక్ - మరొక మరణాంతక విష పదార్థం

'నిజాయితీని ఒకసారి తాకట్టు పెట్టటం జరిగితే మళ్లీ ఎన్నటికీ విడుదల కాలేదు''

కుంటారు మలేషియాకు చెందిన టెమియర్, సరవాక్‌కు చెందిన ఇబాన్‌లు ఆరుగంటలు మాత్రమే నిద్రపోతారు. వీరిలో నాలుగోవంతు మంది రాత్రివేళల్లో వంట చేస్తూనో, కట్టెలు కొడుతూనో కాలం గడుపుతూ ఉంటారు భోజనాల వేళల్లో తప్పించి పగటివేళల్లో మిగతా సమయమంతా నిద్రించేవారు కూడా ఉన్నారు

మధ్య యుగాల్లో కుటుంబాలన్నీ కలసి నిద్రించేవి ఒక్కొక్కసారి అతిథులు కూడా అదే గదిలో, అదే పక్క మీద పడుకునేవారు. ఈ సామూహిక నిద్ర ప్రజల్లో ఐక్యతాభావాన్ని కలిగించేది కుమార్తెల వంటి కుటుంబ సభ్యుల కదలికలను గమనించి, వారిని అదుపు చేసేందుకు వీలుగా ఉండేది ఈనాటి బోర్డింగ్ స్కూళ్ళలో ఉన్న పెద్ద శయనాగారాలు వ్యక్తి ఏకాంతాన్ని పోగొడుతున్నాయి.

దక్షిణ న్యూగినీలో కొందరు వ్యక్తులు మరణించిన బంధువుల పుర్రెలపైన నిద్రిస్తారు. ఈ కపాలాలకు మాయాశక్తులు ఉంటాయని, తమ నిద్రాశక్తిని ఇవి పెంచుతాయని వీరి విశ్వాసం నిద్ర పట్టేందుకు అసాధారణమైన మాలీసు (శరీరాన్ని తోమటం లేదా రుద్దటం) విధానాలు ఉపయోగిస్తున్నారు టాంగాలో ధనికులు గంటల తరబడి, ఒక్కొక్కసారి రాత్రంతా కూడా నౌకర్ల చేత మాలీసు చేయించుకుంటారు నౌకర్లు నిద్రరాని వారి వెనుక భాగాల్ని, తొడల్ని మృదువుగా రుద్దుతూ తోముతారు ఈ విధానం వల్ల నిద్రలేని వారికి విశ్రాంతి కలగటమే కాక సుఖనిద్ర కూడా పడుతుంది నౌకర్లు లేనివారు ఈ సుఖప్రాప్తి కోసం తమ సంతానంలో ముగ్గుర్నో, నలుగుర్నో తమ మీదికి ఎక్కించుకుని కాళ్ళతో తొక్కించుకుంటారు

— 'జర్మన్ న్యూస్' సౌజన్యంతో

## జ్ఞానోన్నతి



LEO TOLSTOY

జ్ఞానోన్నతి తర్కం మీదా ఆధారపడలేదు. బుద్ధి విభజించుకోగల భౌతికశాస్త్రం, చరిత్ర, రసాయనిక శాస్త్రం వగైరా ప్రాపంచిక విజ్ఞాన శాస్త్రాల మీదా కాదు జ్ఞానోన్నతి ఒక ప్రత్యేకత. జ్ఞానోన్నతికి ఒకే విజ్ఞానశాస్త్రం తెలిసి ఉంటుంది, అదే సంపూర్ణ శాస్త్రం సృష్టిని, ఆ సృష్టిలో మానవుని స్థానాన్ని వివరించే సంపూర్ణశాస్త్రం ఇటువంటి విజ్ఞానాన్ని అవగాహన చేసుకోవాలంటే అంతర్యాన్ని పవిత్రం చేసుకోవాలి ఆంతరంగిక మానవీయతను పునరుద్ధరించుకోవాలి ఒకరు తెలుసుకునే ముందు విశ్వాసంతో పరిపూర్ణతను సాధించాలి ఈ ఆశయాలను సిద్ధించుకోవడానికే మన హృదయంలో భగవంతుడు ఆత్మజ్యోతిని ప్రకాశింపజేస్తున్నాడు

— లియో టాల్‌స్టాయ్

## బంగారం ఉపయోగం హరప్పా వారసత్వం

హరప్పా సంస్కృతి (ఇండస్ లోయ నాగరికత)కి చెందిన వారులు ప్రపంచానికి బంగారం వినిమయం, యోగ విజ్ఞానం, కొలమానంలో దశాంశ పద్ధతిని నేర్పారు

— డా ఎస్ ఆర్ రావ్, ప్రఖ్యాత పురావస్తు శాస్త్రజ్ఞుడు

"కొంచెం సాహసం చేయలేక పోవటం వల్లనే ఈ ప్రపంచంలో ఎంతో సామర్థ్యం నష్టపోవటం జరుగుతున్నది"

# విజ్ఞాన వేదిక

## ఒలింపిక్ క్రీడల చరిత్ర

ప్రపంచంలోని అనేక దేశాలు పాల్గొనే ఆటల పోటీలు-ఒలింపిక్ గేమ్స్ నాలుగేళ్ళ కొకసారి జరుగుతాయి. దీనిలో ట్రాక్ అండ్ ఫీల్డ్ - అథ్లెటిక్స్, స్విమ్మింగ్, బాక్సింగ్, జిమ్నాస్టిక్స్ వంటి వివిధ పోటీలలో పాల్గొనేందుకు అనేక




దేశాలనుండి వచ్చిన పలువురు ఔత్సాహిక క్రీడాకారులు పాల్గొంటారు చలికాలంలో జరిగే పోటీలు ప్రత్యేకంగా 'వింటర్ ఒలింపిక్స్'గా జరుగుతాయి

మంచి క్రీడా నైపుణ్యం, శారీరక పటుత్వం గొప్ప లక్షణాలుగా భావించే ప్రాచీన గ్రీస్‌లో ఒలింపిక్ క్రీడలు ప్రారంభమయ్యాయి 776 బి.సి.లో ఒక రోజుకు మాత్రమే పరిమితమై పరిగెత్తే పందెంగా ప్రారంభమైన పోటీలు క్రమేపి ఐదు రోజులకు విస్తరించాయి క్రీస్తుకు 800 ఏళ్ళ ముందు పెలోపొన్నెసెస్ వాయవ్య తీర ప్రాంతంలోని ఒలింపియా మైదానంలో ఈ క్రీడలు నిర్వహించబడ్డాయి. కొన్నాళ్ళు సిటీ స్టేట్స్‌కే పరిమితంగా ఉన్నా తరువాత ఇతర దేశాల అథ్లెట్స్ కూడా పాల్గొన్నారు. నడక పందేలు, దూకటం, బంతి విసరటం, ఈటె విసరటం, కుస్తీ, రథాల్ని తోలటం వంటి పోటీల్లో పురుషులు పాల్గొనేవారు. అవనవ్య మార్గాలు అవలంబించిన క్రీడాకారులు జుల్మానా కట్టవలసి వచ్చేది ఈ డబ్బును ఒలింపిక్ దేవతల ప్రధాన పురుషుడు 'జెస్' విగ్రహ నిర్మాణానికి వినియోగించేవారు ఈ విగ్రహాన్ని స్టేడియం ముఖద్వారం వద్ద నెల కొల్పేవారు ప్రాచీన గ్రీసులోని ఒలింపిక్ చరిత్ర మొత్తం పరికిస్తే ఇటువంటివి 13 విగ్రహాలు మాత్రమే స్థాపించబడినట్లు తెలుస్తుంది

కొన్నేళ్ళకు గ్రీక్ నాగరికత పతనస్థితికి చేరుకుంది ఒలింపిక్ పోటీలు అవినీతిమయాలు కాగా క్రమేణా అంతరించిపోయాయి. ఒక ఒలింపిక్ పోటీల్లో (66 ఎ.డి ) అసమర్థుడైన ఆటగాడు - రోమన్ చక్రవర్తి నీరోను రథాల పోటీలో గెల్పించారు! క్రైస్తవ మతం వ్రేళ్ళు పాతుకుంటున్న సమయంలో (394 ఎ.డి ) రోమన్ చక్రవర్తి థియోడొసియస్ I ఒలింపిక్ క్రీడలను అనాగరికమైనవిగా నిర్ణయించి నిషేధించాడు

1878లో గ్రీస్‌లో ప్రాచీన ఒలింపిక్ స్టేడియం అవశేషాలు త్రవ్వి తీయబడ్డాయి 1896లో ఆధునిక చరిత్రలో మైలురాయి అనదగిన ఆధునిక క్రీడోత్సవాలను ఏథెన్స్‌లో పునరుద్ధ రించేందుకు బేరన్ పియరీ డీ కొబెర్టిన్ అనే

---

### ప్రపంచంలో మొట్టమొదటి వార్తాపత్రిక

చైనాలో టాంగ్ [illegible] (618-906 AD)లో [illegible] టిపావ్ (Ti-pao) [illegible] రిపోర్ట్ [illegible] మొట్టమొదటి వార్తాపత్రిక [illegible]

---

"మన బిడ్డలయందు ఏమి చూస్తున్నామో - అంపరియందు దానిని చూడడమే బ్రహ్మస్థితిని పొందడం." (అమ్మ)

ఫ్రెంచి జాతీయుడు తేల్చుకున్నాడు. వివిధ జాతులకు చెందిన యువజనులు మైత్రీ బంధంతో ఏకం కావటానికి ఒలింపిక్ క్రీడలు ప్రధాన పాత్ర వహిస్తాయని అతడు భావించాడు ఇంటర్నేషనల్ ఒలింపిక్ కమిటీ (ఐఒసి)ను స్థాపించాడు. ఒలింపిక్ క్రీడాస్థలి నిర్ణయం, పోటీ నిబంధనలు రూపొందించడం, క్రీడలు నిర్వహించి అజమాయిషీ చేయటం - ఒలింపిక్ కమిటీ చేసే పనులు.




1896లో ఏథెన్స్‌లో జరిగిన ఒలింపిక్ పోటీలలో 13 దేశాలకు చెందిన 311 మంది క్రీడాకారులు మాత్రమే పాల్గొన్నారు వీరిలో 230 మంది గ్రీస్ నుంచి వచ్చినవారు కాగా మిగిలినవారంతా విదేశీ యాత్రికులే 1896 నుంచి ఒలింపిక్ పోటీలు నాలుగేళ్ళకొకసారి నిర్వహిస్తున్నారు. మొదటి రెండు ప్రపంచ యుద్ధాలు జరిగిన 1916, 1940, 1944లలో మాత్రం ఒలింపిక్ క్రీడలు జరగలేదు 1896లో పోటీదారుల సంఖ్య 311 కాగా 1 992 బార్సిలోనా ఒలింపిక్స్‌లో 12,000 మంది పాల్గొన్నారు

1900లో మొదటిసారిగా మహిళలు ఒలింపిక్ ఆటల్లో పోటీ చేసారు. అప్పుడు వీరు టెన్నిస్, గోల్ఫ్ పోటీలలో పాల్గొన్నారు.

1912లో మహిళల ఈత పోటీలు ప్రవేశ పెట్టారు. 1928లో మహిళల అథ్లెటిక్స్ కూడా



ఒలింపిక్స్‌లో భాగంగా రూపొందాయి 1924లో ఫ్రాన్స్‌లోని చమొనిక్స్‌లో మొదటి శీతాకాలం ఒలింపిక్ క్రీడలు నిర్వహించబడ్డాయి.

# క్రికెట్ వార్తలు

## 6996 పరుగులు చేసిన డాన్ బ్రాడ్‌మన్

*ఆస్ట్రేలియా క్రికెట్ యోధుడు డాన్ బ్రాడ్‌మన్ 1928 మరియు 1948 మధ్య క్రికెట్ టెస్టులలో 6996 పరుగులు చేసాడు చివరి టెస్టు ఇన్నింగ్సులో అసలు పరుగులు చేయకుండానే అవుటయ్యాడు దీనితో ఇతడి సగటు 99 94 అయింది*

## విస్‌డెన్ - క్రికెట్ "బైబిల్"

*క్రికెట్ 'బైబిల్' విస్‌డెన్ (విస్‌డెన్స్ క్రికెటర్స్ అల్మనాక్) ప్రతీ సంవత్సరం ప్రచురిస్తారు. 1,000 పుటలు పైగా ఉండే ఈ ప్రచురణలో గత సంవత్సరంలో అన్ని ఫస్ట్-క్లాస్ క్రికెట్ మాచ్‌ల వివరాలు, రికార్డులు, టూర్స్ వగైరా ఉంటాయి. ససెక్స్ మరియు ఇంగ్లండు జట్టులో ఆడిన జాన్ విస్‌డెన్ దీనిని మొట్టమొదట 1864లో ప్రచురించాడు*

**"శత్రువు బాణాన్ని ఎదుర్కోవడం సులభం; కాని, స్నేహితుని కత్తిపోటు తప్పించుకోవటం కష్టం. అలాగే బాధలనుంచి బయటపడటం తేలిక; సంపదల ఊబి నుంచి వెలికిరావడం కష్టం." — బైబిలు సూక్తి**

నేడు ఒలింపిక్ పోటీలు వేసవి క్రీడలు (2 వారాలు), చలికాలం పోటీలు (10 రోజులు)గా జరుగుతున్నాయి. వేసవి పోటీల్లో ట్రాక్ అండ్ ఫీల్డ్ పోటీలకు ప్రాధాన్యం ఇస్తారు వందల మిలియన్ల ప్రేక్షకులు టెలివిజన్లలో ఈ పోటీలను వీక్షించి తమ దేశాల అదృష్టం అంచనా వేసుకుంటారు. ఈత, కుస్తీ, సైకిల్ తొక్కటం, బాస్కెట్‌బాల్ పోటీలు, పడవ నడపటం, చిన్న విహార నౌక నడపటం, అశ్వారోహణ పోటీలు, కత్తిసాము, ఫుట్‌బాల్, బరువు ఎత్తడం, తుపాకీ కాల్చటం (షూటింగ్) - వీటిల్లో పోటీలు జరుగుతాయి

మంచుతో నిండిన పర్వతాలు ఉన్న దేశాల్లో శీతాకాలం ఒలింపిక్ పోటీలు (Winter Olympic Games) నిర్వహిస్తారు స్కేటింగ్, ఐస్ హాకీ, బాబ్‌స్లెడ్డింగ్, టొబొగానింగ్ వంటి మంచుకు సంబంధించిన క్రీడల పోటీలు జరుగుతాయి

ఎలిస్ (గ్రీస్) నుండి అంచెలవారీగా క్రీడాకారులు పరుగులతో తెచ్చే ఒలింపిక్ జ్యోతి - క్రీడోత్సవాల ప్రారంభానికి నాంది పలుకుతుంది ప్రతీ పోటీల్లో విజేతకు ఒక బంగారు పతకం లభిస్తుంది. రెండవ స్థానంలో వచ్చిన వారికి వెండి పతకం ఇస్తారు. మూడవ స్థానం పొందిన వారికి కంచుపతకం బహూకరిస్తారు.

ఆస్ట్రేలియా, మెక్సికో, అమెరికా, జపాన్, కొరియా వంటి వివిధ దేశాల్లో ఒలింపిక్ క్రీడలు నిర్వహించబడ్డాయి. ఎక్కువ భాగం యూరప్‌లోనే ఈ పోటీలు జరిగాయి. చలికాలం ఒలింపిక్ పోటీలు కూడా ప్రధానంగా యూరప్ లోనే జరిగాయి. వీటిని అమెరికా, జపాన్‌లలో కూడా నిర్వహించారు.

ఇటీవలి ఒలింపిక్ క్రీడల పోటీలలో అత్యధిక పతకాలు అమెరికా, రష్యాలు గెలుచుకున్నాయి.

## అవకాశం అమూల్యం

ఒకసారి మహాఘనత వహించిన అలెగ్జాండర్ చక్రవర్తి అథినియన్ శిల్పశాలను సందర్శించాడు ఎక్కడ చూసినా శిల్పాలే కనిపించాయి అక్కడ ఎగిరే పాదాలుగల ఒక ముసుగు బొమ్మ ఆయన్ని బాగా ఆకర్షించింది

'దీనిపేరేమిటి?'

'అవకాశం'

'దీనిముఖాన్ని ఎందుకు కప్పారు?'

'మనుమలు దైవాధీనంగా బ్రతుకుతుంటారు ఎదుటకు వచ్చినా దీనిని గమనించకుండా పోతూంటారు '

'ఈ బొమ్మ పాదాలకు రెక్కలెందుకు?'

'ఒకసారి విడిచి పెడితే అవకాశం జారి పోయినట్లే కాబట్టి '

— 'ఇన్‌స్పిరేషనల్ కోట్స్' సౌజన్యంతో

## ఏకపక్ష పాలనకు స్వస్తి చెప్పిన పోలెండ్

తూర్పు యూరప్‌లో ఏకపక్షపాలనకు స్వస్తి చెప్పిన దేశాలలో పోలెండ్ మొదటిది ఇది 1989 ఆగస్టు 19న జరిగింది సాలిడారిటీ పార్టీకి చెందిన టడిజ్ మజావిక్కి ప్రధానమంత్రి అయ్యారు

'కల్పన - ఒక సృజనాత్మక శక్తి కల్పన ఎంత గొప్పగా పదునుగా, చురుకుగా ఉంటే ఫలితం అంత మెరుగ్గా ఉంటుంది''

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1 అతిమేలైన గ్రామ పరిపాలనకు పేరొందిన భారత రాజవంశం ఏది?
(ఎ) చాళుక్యులు, (బి) పల్లవులు, (సి) చోళులు, (డి) చేరులు, (ఇ) రాష్ట్రకూటులు



2 జాతిపిత మహాత్మాగాంధీ ఈ అభిప్రాయంలో ఉండేవారు
(ఎ) పాత సంప్రదాయాలన్నిటినీ పాటించాలి, (బి) పాత సంప్రదాయాలన్నిటితో విభేదించాలి, (సి) మన నైతిక విలువలకు వ్యతిరేకంగా ఉండే సంప్రదాయాలను ఆచరించకూడదు, (డి) శాస్త్రీయ పద్ధతులు ఆధారంగా ఉండే సంప్రదాయాలనే ఆచరించాలి

3 ఈ క్రిందివాటిలో మాంసకృతులు (ప్రొటీన్లు) ఎక్కువగా ఉండే వస్తువులేవి?
(ఎ)పప్పులు, (బి) పాలు, (సి) వెన్న, (డి) కూరగాయలు

4 'లైఫ్ డివైన్' గ్రంథకర్త ఎవరు?
(ఎ) జవహర్‌లాల్ నెహ్రూ, (బి) ముల్క్ రాజ్ ఆనంద్, (సి) అరబిందో ఘోష్, (డి) స్వామీ శివానంద.

5 ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ క్విట్ ఇండియా ఉద్యమం ప్రకటించిన చోటు
(ఎ) కలకత్తా, (బి) బొంబాయి, (సి) ఢిల్లీ, (డి) నాగపూర్, (ఇ) కటక్.

6 రిఫ్రిజిరేటర్‌లో శీతోష్ణస్థితి నిలకడగా ఉండేందుకు దేన్ని ఉపయోగిస్తారు?
(ఎ) థర్మోస్టాట్, (బి) థర్మామీటర్, (సి) బరోమీటర్, (డి) మనోమీటర్.

7 చంద్రునిపై కాలిడిన మొదటి మానవుడు నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ అతని వ్యోమనౌక ఈగిల్ చంద్రునిపై ఏ ప్రాంతంలో నిలిచింది?
(ఎ) సీ ఆఫ్ సెరినిటీ, (బి) ఫ్రా మౌరో, (సి) ఓషన్ ఆఫ్ స్టారమ్స్, (డి) సీ ఆఫ్ ట్రాన్క్విలిటీ

8 ఇండియాలో ప్లానింగ్ కమిషన్ ఎక్స్ ఆఫీషియో ఛైర్మన్
(ఎ) కేంద్ర పరిశ్రమల శాఖ మంత్రి, (బి) కేంద్ర ప్రణాళికా మంత్రి, (సి) ప్రధాన మంత్రి, (డి) ఫైనాన్స్ కమిషన్ ఛైర్మన్

## జీవితంలో హాస్యం




నాకు B Sc మాలు కాదు, M A, M.Sc, మాలు కావాలి

"సీసా మూతి ఇరుకుగా ఉన్నప్పుడు దానిలోని ద్రవం బయటికి వచ్చేముందు ఎంత ధ్వని పుట్టిస్తుందో ఇరుకు మనసుగల మనుషులు కూడా అలాగే ప్రవర్తిస్తూంటారు" — జొనాథ

## మాటల మహిమ

1. వంశి: (ఎ) స్త్రీ, (బి) పిల్లనగ్రోవి, (సి) రక్తనాళము, (డి) వెదురు బియ్యము.
2. వనజ: (ఎ) అడవి యల్లము, (బి) అడవి ప్రత్తి (సి) చిన్న కచ్చోరము, (డి) అడవి పెసర.
3. వనజము: (ఎ) అడవిలో పుట్టినదీ, (బి) అడవి ఏనుగు, (సి) అడవి మాదీ ఫలము, (డి) పద్మము, తామరపువ్వు.
4. తెల్లని దొర: (ఎ) విష్ణుమూర్తి, (బి) శివుడు, (సి) బలరాముడు, (డి) ఇంద్రుడు.
5. దర్శకుడు: (ఎ) చూచువాడు, (బి) పరిశీలించు వాడు, (సి) చూపువాడు, (డి) విపుణుడు.
6. దూరదర్శి: (ఎ) గ్రద్ధ, (బి) పండితుడు, (సి) దూరమందలి దానిని చూచువాడు/ చూపునది, (డి) ఋషి.
7. నగారా: (ఎ) నెమలి, (బి) పెద్ద ఢంకా, (సి) డోలు, (డి) స్త్రీ
8. ధన్యా: (ఎ) ఉసిరిక, (బి) దాది, (సి) దనియపు మొక్క, (డి) కృతజ్ఞత

## తెలివికి పరీక్ష

1. 'నారిమణం' చమురు క్షేత్రం ఎక్కడ ఉంది?
   (ఎ) మహానది డెల్టా, (బి) కృష్ణానది డెల్టా, (సి) కావేరీ డెల్టా, (డి) గోదావరి డెల్టా.
2. మెట్రోగోల్డ్విన్ మేయర్ సంస్థ తీసిన చిత్రాల ప్రారంభంలో మీకు వినిపించేదేమిటి?
3. 'మోనాలిసా'.
   (ఎ) హాలీవుడ్ తార, (బి) టెన్నిస్ క్రీడాకారిణి, (సి) ఒక ప్రసిద్ధ పెయింటింగ్.
4. చంద్రుని పైకి వెళ్ళిన వ్యక్తికి ఆకాశం ఏ రంగులో కనిపిస్తుంది?
   (ఎ) తెలుపు, (బి) నలుపు, (సి) నీలం, (డి) నారింజ.
5. ఖ్వాజా అహ్మద్ అబ్బాస్ ఎవరనగా?
   (ఎ) ప్రముఖ పారిశ్రామికవేత్త, (బి) పాకిస్థాన్ మాజీ ప్రధాని, (సి) ఉర్దూ కవి, (డి) రచయిత, జర్నలిస్టు, ఫిలిం నిర్మాత.
6. 'సహస్రఫణ్' పేర శ్రీ పి.వి.నరసింహారావు హిందీలోకి అనువదించిన ప్రసిద్ధ తెలుగు నవల:
   (ఎ) వేయి పడగలు, (బి) మాలపల్లి, (సి) చివరికి మిగిలేది, (డి) రాజశేఖర చరిత్ర.

(జవాబులకు    వ పేజీ చూడండి).

## నాకు అవసరం లేని వస్తువులు!




సోక్రటీస్ మితవ్యయువు జీవిత విధానం తెలిసిన ఒక వ్యక్తి ఒకరోజున ఆ తత్త్వవేత్త మార్కెట్‌లో ఒక అంగడిలో తళతళలాడుతూన్న వస్తువులను పరిశీలిస్తూండగా గమనించి, ఎప్పుడూ ఏమీ కొనని సోక్రటీస్‌ని 'ఎందుకు మార్కెట్‌కి వచ్చావని' ప్రశ్నించాడు 'మార్కెట్‌లో నాకెప్పుడూ అవసరం లేని వస్తువులు ఎన్ని ఉంటాయో చూస్తూంటే నాకు ఆశ్చర్యంగా ఉంటుంది' అని సోక్రటీస్ జవాబు చెప్పాడు

— 'సత్య సాయి బాల్ వికాస్'

'ప్రకృతి ఒక గ్రంథం - భగవంతుడు గ్రంథకర్త.'' హార్వే

# ఉరుకుల పరుగుల వింతప్రాణి-నల్లలేడి

నీటా కాల్విన్

భారత సంస్కృతి, చరిత్రల్లో నల్లలేడి ప్రస్తావన - ఆ పరిమాణంలోని ఏ ఇతర అడవి మృగాల కన్నా ఎక్కువగా వినవస్తుంది




నల్లలేడికి మత సంబంధమైన ప్రాధాన్యం కూడా ఉంది దానిని చూడటమే శుభసూచకమని కొందరు భావిస్తారు శిల్పాలలో, ముద్రలలో, రాజస్థాన్ చిన్న చిత్రాల వర్ణ పటాలలో దీనిని విస్తారంగా చిత్రీకరించటం జరిగింది

మొగల్ చక్రవర్తుల కాలంలో నల్లలేడిని వేటాడటం రాజకుమారుల అభిమాన క్రీడగా ఉండేది ఉరుకులు, పరుగులు తీసే ఈ మృగాలపైకి తమ పెంపుడు చిఱుత పులుల్ని ఉసిగొల్పి, అవి తరమటం చూస్తూ మొగలులు ఆనందించేవారు. అత్యల్ప కాలంలోనే చిఱుత పులుల స్థానంలోకి తుపాకులు వచ్చి చేరాయి. వీటితో పెద్ద ఎత్తున వేటాడటం జరుగుతుండటంతో ఈ నల్లలేళ్ళు ప్రమాద పరిస్థితిలో ఉన్న జంతుజాలం క్రింద పరిగణింపబడ్డాయి.

నల్లలేడి 0 75 మీటర్ల ఎత్తు, 40 కిలోల బరువుతో ఉంటుంది. వయసులో ఉన్న మగ లేడి తెల్లని క్రింది భాగంతో, వెల్వెట్ నల్లకోటు ధరించినట్లుండి అందంగా కనిపిస్తుంది. మూడేళ్ళ వయస్సు రాగానే మగలేడికి నల్ల రంగు వస్తుంది అంతకు ముందు పసుపు రంగు గల ఆడజింక మాదిరిగా ఉంటుంది. దక్షిణ భారతదేశంలో లేళ్ళు గాఢమైన గోధుమ వర్ణంలో ఉంటాయి పొందుగోరే సమయంలో ఆడలేళ్ళను ఆకర్షించేందుకు ఈ వర్ణ సముదాయం తగిన పాత్ర వహిస్తుంది.

అందమైన శరీరపు వర్ణాన్ని మరపించే విధంగా 50 నుండి 65 సెం.మీ.ల పొడవు

## వీరిని గురించి తెలుసుకోండి

*డా కుర్ట్ పాల్ రిచ్టెర్ ఇతడు బయోరిథమ్స్ కనిపెట్టి శరీరం పుష్టికర ఆహార రీత్యా సమతా స్థితిని పొందే విధానాన్ని తెలుసుకున్నాడు ఆకలి బాధ, నిద్ర, దాహం, ప్రత్యేక పోషకాంశాల ఆవశ్యకత అన్నీ కూడా మానవ శరీర వివిధ వ్యాపార విధానాలలో కొన్ని ఇవన్నీ కూడా మెదడులో కొన్ని ప్రత్యేక భాగాల వల్ల జరుగుతున్నాయని తెలుసుకున్నాడు.*

*లార్డ్ బీవర్ బ్రూక్ 1879లో విలియం మాక్స్ వెల్ ఎయిట్కెన్‌గా జన్మించాడు ఇతడు డెయిలీ ఎక్స్‌ప్రెస్, సండే ఎక్స్‌ప్రెస్, ఈవినింగ్ స్టాండర్డ్ మొదలైన అనేక వార్తాపత్రికలకు స్వంతదారుడైయాడు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో మినిస్టర్ ఆఫ్ ఎయిర్‌క్రాఫ్ట్ ప్రొడక్షన్ మరియు మినిస్టర్ ఆఫ్ సప్లై (1940-42) పదవి వహించాడు. ఇతడు 1964లో మరణించాడు*

"మనలో చాలామందితో వచ్చిన చిక్కల్లా ఒక్కటే! విమర్శ వల్ల బాగుపడలేకపోవటం, పొగడ్తల్నే కోరుకోవటం."

కలిగి, స్ప్రింగ్ వలె చుట్టుకుని ఉండే కొమ్ములు మగలేళ్ళకు ఉంటాయి. జింక కొమ్ముల వలె అప్పుడప్పుడు పడిపోవడం, అవి మళ్ళీ ముకు రావటం లేకుండా నల్ల లేళ్ళ కొమ్ములు - ఎద్దులు, గొఱ్ఱెలు, మేకల వలె శాశ్వతంగా ఉంటాయి ఆడలేళ్ళకు కొమ్ములు ఉండవు. సునిశిత దృష్టి, వేగం - వాటి రక్షకులు.

గంటకు 80 లేక 90 కి.మీ ల వేగంతో నల్లలేళ్ళు పయనిస్తాయి ఇవి అపాయం శంకిస్తే వరుగెత్తకుండా గెంతులు వేస్తూ, దూకుతూ పారిపోతూంటాయి ప్రతి గెంతుకలో 5 లేక 6 మీటర్ల దూరం దాటిపోతుంది. ఇలా గెంతుతూ పోతున్నప్పుడు చిఱుతపులి కూడా వీటిని దాటిపోలేదు. ఇవి నివసించే మైదాన ప్రాంతాలు, వచ్చగడ్డి భూములు ఇలా పరిగెత్తేందుకు ఎంతో తోడ్పడతాయి!

వ్యవసాయ పంటలు తక్కువ ఎత్తులో ఉండేచోట్లు, వచ్చగడ్డి పొట్టిగా పెరిగే చోట్లు నల్లలేళ్ళు ఇష్టపడతాయి చిన్న నదులు, ప్రవాహాలు ఉండే నివాస భూములు వీటికి అదర్శాలు వేసవిలో మాడిపోయే ఎండల్లో కూడా రోజంతా మేతమేస్తూ ఉంటాయి ఎప్పుడో గాని చెట్ల నీడకు చేరుకోవు

నల్లలేళ్లు 20 లేక 30 గుంపుగా చేరి సంచారం చేస్తూంటాయి సంవత్సరం పొడుగునా గర్భధారణ చేస్తాయి అయితే ఫిబ్రవరి, మార్చి నెలలు ప్రధాన ఋతువు ఈకాలంలో మగలేళ్ళు తలను ప్రక్కకు త్రిప్పుకుని సంచరిస్తుంటాయి మగలేళ్ళలో స్పర్ధలు చెలరేగినప్పుడు కొమ్ములతో పొడుచుకుంటాయి

నల్లలేళ్ళు తమ స్త్రీ జాతిని తీవ్రస్థాయిలో కాపాడుకుంటాయి. అలాగే తమ నిర్దేశిత ప్రాంతాన్ని కూడా రక్షించుకుంటాయి. తమ ప్రాంతాల్ని గోళీలు లేదా చిన్న ఉండలతో గుర్తుపెట్టుకుంటాయి చెట్లమీద, కొమ్మల మీద, గడ్డిమీద పడిన (తమ స్రవించే గ్రంధుల) మరకలను చెరిపివేస్తాయి

అప్పుడే జన్మించిన చిన్నారి నల్లలేళ్ళను వాటి తల్లిలేళ్ళు పొడుగాటి వచ్చగడ్డిలో దాచిపెడతాయి ఈ బుజ్జి లేళ్ళు వాసన రావు కనుక అడవికుక్కలు, తోడేళ్ళు వంటి పరాన్నభుక్కులు వీటిని గమనించలేవు ఈ చిన్నారి లేళ్ళు తగినంత శక్తి సమకూర్చుకోగానే తమ మందలో కలసిపోతాయి

నల్లలేళ్ళు వచ్చగడ్డి, గింజలు, వ్యవసాయ పంటలు మేస్తూంటాయి కాయధాన్యాలంటే ప్రత్యేకంగా ఇష్టపడతాయి మూంగ్, మోత్, ఛనాలను తింటాయి ఆవాలు, గోధుమ పైర్లను కూడా ముట్టడిస్తాయి

— 'సిఇఇ ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## ఉత్తేజాన్ని కలిగించే 'టీ'



టీ కేంద్ర నాడీ విధానాన్ని ఉత్తేజపరచి, గుండెకు ఆరోగ్యాన్ని చేకూరుస్తుందని రుమాటిజం రీసెర్చ్ యూనిట్‌లో డా డొనాల్డ్ రాజపాక్సే పరిశోధన ఫలితంగా తేలింది టీలో థియోఫిలీన్ (Theophyline) ఉంటుందని ఇది రక్తనాళాలకు విశ్రాంతిని కలిగించి గుండెపోటు రాకుండా చేస్తుందని వీరు అంటున్నారు

'నైపుణ్యం, ప్రేమ కలిసి పనిచేసే - ఒక అత్యుత్తమ సృష్టిని ఎదురు చూడవచ్చు''

జాన్ రస్కిన్

## 50 భాషల్లో భగవద్గీత

మహాభారత ఇతిహాసంలోని ఆధ్యాత్మిక సంభాషణం, భగవదనుగ్రహగీతం అయిన భగవద్గీతను చైనీస్, హంగేరియన్, అరబిక్, జపనీస్ వంటి 50 భాషల్లోకి అనువదించారు కేంబ్రిడ్జి (ఇంగ్లండు), హార్వర్డ్ (అమెరికా) యూనివర్శిటీలతో సహా ప్రపంచంలోని 7,000 పైగా విశ్వవిద్యాలయాల్లో 'గీత'ను ఉపయోగించు కుంటున్నారు

## పెద్ద బస్ రూట్

**అతి పొడవైన** బస్సు మార్గంలో - మియామి నుంచి శాన్‌ఫ్రాన్సిస్కో (యుఎస్ఎ)కు ఏర్పాటు చేసిన గ్రేహండ్ వారి 'సూపర్ క్రూయిజర్' - 3,240 మైళ్ళ దూరాన్ని 81 గంటల, 50 నిమిషాలలో ప్రయాణిస్తుంది (సగటు ప్రయాణ వేగం గంటకు 39 59 మైళ్ళు)

## స్వయంచాలిత వస్త్రాల కర్మాగారం

ఇండియాలో మొట్టమొదటి స్వయంచాలిత వస్త్రాల కర్మాగారం (automated fabric plant) హర్యానాలోని భివానీలో ప్రారంభ మైంది రూ 32 70 కోట్ల వ్యయంతో నిర్మించిన ఈ ప్లాంట్ జపాన్ నుంచి వచ్చిన 84 యంత్రాలతో జపాన్ ప్లాంట్‌కు అచ్చమైన ప్రతిరూపంగా కనిపిస్తుంది

## అతిశీతల వాయుసొరంగం

యూరప్‌లోని అతిశీతల వాయుసొరంగం పని కొలోన్‌లోని జర్మన్ ఏరోస్పేస్ రీసెర్చి ఎస్టాబ్లిష్‌మెంట్ వారు ప్రారంభించారు. ఇక్కడ - 173 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రత దగ్గర విమానాల నమూనాలను పరీక్షలకు గురిచేస్తారు విమానం ప్రయాణం చేసినప్పుడు 10,000 మరియు 12,000 మీటర్ల ఎత్తున ఉష్ణోగ్రత - 40 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉంటుంది. శాస్త్రజ్ఞుల కృషివల్ల అంతరిక్ష పరిశోధన, అంతరిక్ష ప్రయాణీకుల భద్రత అభివృద్ధి చెందుతాయి.

— 'జర్మన్ న్యూస్' సౌజన్యంతో

## ప్రపంచంలో ఉత్తమ విమానాశ్రయం

*ప్రపంచంలో సింగపూర్ ఛాంగీ (Changi) విమానాశ్రయం అత్యుత్తమమైన విమానాశ్రయంగా గణుతికెక్కింది ఇది సంవత్సరానికి 24 మిలియను ప్రయాణీకులకు ప్రయాణ సౌకర్యం కలిగిస్తుంది*




*ఆసియా పసిఫిక్ ప్రదేశంలో ఇది చాలా పెద్దది. ప్రపంచం అంతా 110 నగరాలను 2,050 ఫ్లైట్స్‌తో కలుపుతుంది. హాలండ్ ఆమ్‌స్టర్‌డామ్‌లో షిఫోల్ విమానాశ్రయం (Schiphol Airport) రెండవస్థానాన్ని స్విట్జర్లాండ్ జ్యూరిచ్‌లో క్లోటెన్ విమానాశ్రయం (Kloten airport) తృతీయ స్థానాన్ని పొందుతున్నాయి.*

— 'ఎకనామిక్ టైమ్స్' సౌజన్యంతో

"గతాన్నీ, భవిష్యత్తునూ, విశ్వంలోని మూడొంతులనూ 'కల్పితం' వరి పాలిస్తే 'వాస్తవం' అనేది వర్తమానానికే పరిమితమౌతుంది."

## ఐస్ హాకీ విజేత - స్వీడెన్

ప్రపంచ ఐస్ హాకీ విజేతగా వరుసగా రెండో సంవత్సరం కూడా స్వీడెన్ ఫిన్లాండ్‌ను 5-2 స్కోరుతో ఓడించింది. 1992 మే 10న ప్రేగ్ (జెకోస్లొవేకియా)లో ఈ పోటీ జరిగింది.

## శనిగ్రహం మీది ఉపగ్రహం

టిటాన్ - శనిగ్రహం మీది బ్రహ్మాండమైన ఉపగ్రహం విద్యుదుత్పత్తి కేంద్రంగా పనిచేసేటట్లు కనిపిస్తున్నది. శనిగ్రహం అయస్కాంత క్షేత్రం టిటాన్ ఉపరితల వాతావరణం పరస్పర ప్రభావం కలిగి ఉన్న కారణంగా ఈ విద్యుత్ ఉత్పత్తి జరుగుతున్నదని వాయేజర్-1 వ్యోమశకటంతో సంబంధం గల ఒక అమెరికా శాస్త్రవేత్త అభిప్రాయం

## కార్బోహైడ్రేట్ల సామర్థ్యం

మసాచుసెట్స్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీకి చెందిన డాక్టర్ రిచర్డ్ ఉర్ట్‌మెన్ అభిప్రాయం ప్రకారం మానసిక విషాదాన్ని అరికట్టే మెదడులోని ఒక ప్రధాన రసాయనాన్ని కార్బోహైడ్రేట్స్ అభివృద్ధి చేస్తాయని వెల్లడయింది. 'సెరటోనిన్' అనే ఈ రసాయనం మానసిక విషాదం, జీర్ణశక్తి, నిద్ర - వీటిల్లో క్లిష్టపాత్ర నిర్వహిస్తుంది

## చిన్నసైజు గ్రీటింగ్ కార్డ్

ఒక గిరిజనుని చిత్రంతో ప్రపంచంలోనే అతి చిన్న గ్రీటింగ్ కార్డును మధ్యప్రదేశ్‌లోని కొండ ప్రాంతం బస్తర్ జిల్లాలోని కొంటగాన్‌కు చెందిన సుశీల్ సకుజా తయారుచేసాడు

## ఎవరెస్ట్ ఎక్కిన ద్వితీయ భారత వనిత

1992 మే 12న హిమాలయాల్లోని ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించిన ఇండో-టిబెటన్ సరిహద్దు పోలీస్ సుబేదార్ శ్రీమతి సంతోష్ యాదవ్ ఈ శిఖరారోహణ చేసిన రెండవ భారతీయ వనితగా నిలుస్తారు. ఈమె ప్రపంచంలో అత్యంత ఉన్నతమైన శిఖరాగ్రం మీద నిలిచిన మొదటి మహిళా పోలీస్ ఉద్యోగిని.

## ప్రపంచంలో పెద్ద దూరదర్శిని

అమెరికాలోని అరిజోనాలో 3000 మీటర్ల ఎత్తున ఉన్న మౌంట్ గ్రహం (కొండ)పైనే ప్రపంచంలోనే పెద్ద దూరదర్శినిని నెలకొల్పుతున్నారు 'కొలంబస్' అనే పేరుగల ఈ టెలిస్కోప్ ఇతర నక్షత్రాల చుట్టూ సంచారం చేసే గ్రహాలను పరీక్షిస్తుంది. పెద్ద బైనాక్యులర్‌ను పోలి ఉండే ఎనిమిది మీటర్ల నడిమి కొలతగల రెండు అద్దాలను ఒకే ఒక ఫ్రేమ్‌లో బిగించి తయారుచేసిన టెలిస్కోప్ ఇది

## ఊదా నీలివర్ణాలు శ్రీకృష్ణునికి సంకేతాలు



కాంచీపురంలో పట్టుచీరలలో ఊదా నీలి వర్ణాలు శ్రీకృష్ణునికి సంకేతాలు. వసంతకాలంలో నీటితో నిండిన నీలి మేఘానికి పోలుస్తారు

"ఇతరులలోని బలహీనతల్ని, తప్పుల్ని ఎత్తి చూపటం కంటే మనలోని బలహీనతల్ని, తప్పుల్ని తెలుసుకోవటం చాలామంచిది."

# ఆధునిక ఒలింపిక్ క్రీడలలో అసాధారణ ప్రతిభా విన్యాసాలు

'న్స్ (1896):

గ్రీన్ మరొప్పికి చెందిన 25 ఏళ్ళ గొర్రెల కాపరి స్పిరిడన్ లూయిస్ జీవితంలో ఏనాడూ పరుగెత్తనివాడు, పెద్దపరుగు (మరాథాన్) పందెంలో గెలుపొందాడు.



పారిస్ (1900):

చిన్నతనంలోనే పోలియో వ్యాధిగ్రస్థుడై, చక్రాల కుర్చీలో సంవత్సరాల తరబడి గడిపిన అమెరికా క్రీడాకారుడు రే ఇవ్రీ స్టాండింగ్ హైజంప్, స్టాండింగ్ బ్రాడ్‌జంప్, స్టాండింగ్ హాప్, స్టెప్ అండ్ జంప్‌లలో మూడు బంగారు పతకాలు సంపాదించుకున్నాడు.

సెంట్ లూయిస్ (1904).

దాదాపు నాలుగోవంతు దూరం కారులో ప్రయాణించాడనే ఆరోపణ రుజువైనందున మరాథాన్ (పెద్దపరుగు) పందెంలో గెలుపొందిన అమెరికాకు చెందిన ఫ్రెడ్ లోర్జ్‌ను అనర్హుడిగా నిర్ణయించారు.

లండన్ (1908):

40,000 మంది ప్రేక్షకులు హర్షధ్వానాలు, కరతాళ ధ్వనులు చేస్తూండగా దక్షిణ ఆఫ్రికాకు చెందిన 19 ఏళ్ళ యువకుడు వాకర్ 100 మీటర్ల పోటీలో అద్భుత విజయం సాధించాడు.

స్టాక్‌హోమ్ (1912).

ఈత, స్వారీ, పరుగు, కత్తిసాము, రివాల్వర్ షూటింగ్, (పెంటథలాన్ - pentathlon) పోటీల్లో అమెరికన్ జిమ్ థోర్పె విజయం సాధించాడు. అలాగే 10 ఆటలు (డెకథ్లాన్-decathlon) 2 రోజుల పోటీలలో కూడా గెలుపొందాడు అయితే ఆ తర్వాత అతనికి బంగారు పతకాలు ఇవ్వకుండా తిరస్కరించారు అతడు అమెచూర్‌గా పోటీలలో పాల్గొనడానికి అనర్హుడని, బేస్ బాల్ పోటీల్లో ప్రొఫెషనల్‌గా పాల్గొన్నాడని ఆరోపించారు. 1983లో ఇంటర్నేషనల్ ఒలింపిక్ కమిటీ అధ్యక్షుడు జువాన్ అంటోనియో సమరంచ్ జిమ్ థోర్పెకి మరణానంతరం ఈ పతకాలు తిరిగి బహూకరించారు.



ఆంట్‌వెర్ప్ (1920):

ఫిన్లాండ్‌కు చెందిన 'ఫ్లయింగ్ ఫిన్' పావో

"ఒక నిర్దిష్ట అభిప్రాయాన్ని మనసులో పెట్టుకుని ప్రతిరాత్రి నిద్రకు

సుర్మి మూడు ఒలింపిక్స్‌లో - 1920 (అంట్‌వెర్ప్), 1924 (పారిస్), 1928 (అమ్‌స్టర్‌డాం)- పాల్గొన్నాడు. 10 పోటీల్లో పాల్గొని 7 సార్లు మొదటి (బంగారు పతకాలు) స్థానం, 3 సార్లు రెండవ (వెండి పతకాలు) బహుమతి గెలుచుకున్నాడు



పారిస్ (1924)

19 ఏళ్ళ వయస్సుగల అమెరికన్ ఈతగాడు జానీ వెస్‌ముల్లర్ 50 గజాల నుండి 880 గజాల పరిమాణంగల పందాలలో పాల్గొని ప్రపంచ రికార్డ్సు స్థాపించాడు. అనంతరం "టార్జాన్ ది ఏప్‌మాన్" చిత్రంలో పాత్రధారణ చేసి సినిమా నటుడుగా ప్రసిద్ధి పొందాడు

అమ్‌స్టర్‌డామ్ (1928)

పెన్నిగర్ కెప్టెన్‌గా ఇండియా హాకీ జట్టు 3-0తో నెదర్‌లాండ్స్ (హాలెండ్)ను ఓడించి ఒలింపిక్స్‌లో భారతదేశానికి మొదటి బంగారు పతకం గడించి పెట్టింది

లాస్ ఏంజిల్స్ (1932)

ప్రపంచంలో ఉత్తమ ఈతగాళ్ళుగా జపానీయులు మొట్టమొదటిసారి ముందుకు వచ్చారు ఇండియా రెండోసారి హాకీలో బంగారు పతకం గెలుచుకుంది

బెర్లిన్ (1936)

100 మీటర్లు, 200 మీటర్లు, బ్రాడ్ జంప్, 400 మీటర్ల రిలేలో ఫస్ట్ లెగ్‌లలో విజయం సాధించి అమెరికన్ నీగ్రో జెస్సీ ఓవెన్స్ బంగారు పతకాలు కైవసం చేసుకున్నాడు

ధ్యాన్‌చంద్ నాయకత్వాన భారతహాకీ జట్టు ఒలింపిక్స్‌లో వరుసగా మరోసారి బంగారు పతకాన్ని గెలుచుకుంది

తన 13వ ఏట మర్జోరి గెస్ట్రింగ్ అనే అమెరికన్ (లోతు మునకలో నిపుణుడు) బంగారు పతకం గెలుచుకున్నాడు

లండన్ (1948)

ఇద్దరు బిడ్డల తల్లి, డచ్ గృహిణి అయిన ఫాన్నీ బ్లాంకర్స్-కొయిన్-100, 200 మీటర్ల డాష్, 80 మీటర్ల హర్డిల్స్, 400 మీటర్ల రిలే రేస్‌లలో విజయం సాధించి నాలుగు బంగారు పతకాలు సంపాదించుకుంది



17 ఏళ్ళ చిన్న వయస్సులోనే బాబ్ మథియాస్-డెకథ్లాన్ చాంపియన్-ప్రపంచ రికార్డు స్థాపించగా, వరుసగా నాలుగోసారి

ఇండియా ఒలింపిక్స్ హాకీ పోటీల్లో బంగారు పతకం సాధించింది.

హెల్సింకీ (1952)

జెకొస్లోవేకియాకు చెందిన ఎమిల్ జటోపెక్ తనస్వంత ఒలింపిక్ రికార్డ్‌నే 42 సెకండ్లతో అధిగమించి 10,000 మీటర్ల పరుగు పందెం గెలిచాడు అతడు 5000 మీటర్ల పందెం కూడా గెలిచి ఒలింపిక్ పోటీలలో 14 నిమిషాల, 6 6సెకండ్లతో ఒక క్రొత్త రికార్డు సృష్టించాడు



అప్పటి ఒలింపిక్ రికార్డ్‌ను 6` నిమిషాల తేడాలో అధిగమించి మరాథాన్ పరుగు పందెంలో బంగారు పతకం సాధించాడు ఒలింపిక్స్‌లో వరుసగా ఇండియా ఐదోసారి హాకీలో బంగారు పతకం గెలుచుకుంది.

మెల్‌బోర్న్ (1956)

5000 మీటర్లు, 10,000 మీటర్ల పందేలలో గెలుపొంది సోవియెట్ యూనియన్‌కు చెందిన వ్లాడిమిర్ కుట్స్ మొదటి ట్రాక్ స్టార్‌గా రూపొందాడు

పాకిస్తాన్‌తో గట్టి పోటీని ఎదుర్కొని విజయం సాధించి ఇండియా వరుసగా మరోసారి ఒలింపిక్స్ హాకీలో బంగారు పతకం గెలుచు కుంది.

17 సంవత్సరాల్ల వయస్సు గల ఆస్ట్రేలియన్ ముర్రే రోజ్ 400 మీటర్లు, 1500 మీటర్ల ఫ్రీస్టైల్ ఈత పోటీలలో గెలుపొంది రికార్డులు బ్రద్దలు చేసాడు.

రోమ్ (1960):

అబిబ్ బికిలా అనే ఇథియోపియన్ రాజ ప్రాసాద ,కావలాదారుడు ఆనాటి రికార్డును అధిగమించి 2 గంటల, 15 నిమిషాల, 16.2 సెకండ్లతో (అప్పటి రికార్డు కంటే ఎనిమిది నిమిషాలు తక్కువ టైములో) మరాథాన్ పోటీలో విజయం సాధించాడు.

అమెరికాకు చెందిన ఓటిస్ డేవిస్ 400 మీటర్ల రేస్‌ను 44 9/10 సెకండ్లలో పూర్తిచేసి గెలుపొందాడు ఇండియాకు చెందిన మిల్ఖా సింగ్ - ఆనాటి 400 మీటర్ల పరుగు పందెంలో ప్రపంచ రికార్డ్ సృష్టికర్త-నాలుగో స్థానం సంపాదించాడు అప్పటి ఒలింపిక్ రికార్డ్ 45 9 సెకండ్లకు బదులుగా 4 5.6 సెకండ్లలోనే పూర్తి చేసాడు



కాసియస్ క్లే లైట్ హెవీవెయిట్ కుస్తీ పోటీలో బంగారు పతకం సాధించాడు. తరువాత 'మహమ్మద్ అలీ' అనే పేరుతో అతడే

"దృఢత్వంతో పనులు నెరవేర్చ గలిగినప్పుడు దుడుకుతనం అనవసరం."

ప్రపంచ ప్రసిద్ధి చెందిన మల్లయోధుడుగా పేరుపొందాడు.

టోక్యో (1964)

రోమ్‌లో కోల్పోయిన హాకీ కిరీటాన్ని ఇండియా తిరిగి గెలుచుకుంది.పాకిస్తాన్‌ను ఒక గోల్‌తో ఓడించింది. ప్రముఖ హాకీ ఆటగాడు ప్రీతి పాల్‌సింగ్ ఇండియా చేసిన 22 గోల్స్‌లో 11 గోల్సు సాధించి పెట్టాడు. అద్భుతమైన మరాథాన్ (పరుగుపందెం) మొనగాడు అబిబ్ బికిలా (ఇథియోపియా) 2 గంటల 12 నిమిషాల 11 సెకండ్లతో గెలుపు సాధించి తన రికార్డును తానే అధిగమించాడు.



మెక్సికో (1968)

అమెరికాకు చెందిన డిక్ ఫాస్బరీ హై జంప్‌లో 'ఫ్లాప్' (flop) పద్ధతిలో 7 అడుగుల 4 4 1/2 అంగుళాలు దూకి కొత్త రికార్డు సృష్టించాడు 22 ఏళ్ళ వయస్సుగల అమెరికన్ బాబ్ బీమన్ ఇంతకుముందు రికార్డుకన్నా 2 అడుగలు ఎక్కువగా 2 9 అడుగుల 2 1/2 అంగుళాలు దూకి అనూహ్యమైన క్రొత్త ప్రపంచ రికార్డు స్థాపించాడు 1991 వరకు ఈ రికార్డును ఎవరూ అధిగమించలేదు

మ్యూనిఖ్ (1972)

అమెరికా ఈతగాడు మార్క్ స్పిట్జ్ నాలుగు వ్యక్తిగతం, మూడు రిలే పోటీల్లో గెలుపొంది ఏడు బంగారు పతకాలు సంపాదించి ఆల్ టైమ్ రికార్డు సృష్టించాడు.

15 సంవత్సరాల ఆస్ట్రేలియా బాలిక షేన్ గౌల్డ్ 3 బంగారు పతకాలు, ఒక వెండి పతకం, ఒక కంచు పతకం గెలుచుకుంది. ఈమె ఏడు రోజుల్లో 12 సార్లు ఈదటం జరిగింది.

ఒక కొత్త 'ఫ్లయింగ్ ఫిన్' లెస్సీ వీరెన్ మధ్య దూరం డబుల్స్ పోటీలో గెలుపు సాధించాడు 10,000 మీటర్ల పోటీలో బంగారు పతకం పొందిన తరువాత, 5000 మీటర్ల పోటీలో క్రొత్త ఒలింపిక్ రికార్డు 13 నిమిషాల, 36.4 సెకండ్లతో సృష్టించాడు

ఏకైక గోల్‌తో జర్మనీ పాకిస్తాన్‌ను ఓడించి ఒలింపిక్స్ హాకీ కిరీటాన్ని గెలుచుకుంది. మైకేల్ క్రవుజ్ చేసిన ఒకే గోల్‌తో ఈ విజయం లభించింది.

మాంట్రియల్ (1976)

రుమేనియాకు చెందిన అద్భుత క్రీడాబాలిక ఎల్విన్ నడియా కొమనెసి జిమ్నాస్టిక్స్‌లో పదికి పది మార్కులు సంపాదించుకుంది. అయిదు పతకాలు గెలుపొందింది

మాస్కో (1980)

తూర్పు జర్మనీకి చెందిన 21 సంవత్సరాల వంట మనిషి గెర్డ్ విస్సింగ్ హై జంప్‌లో 2.36 మీటర్లలో అత్యద్భుతమైన ప్రపంచ రికార్డు స్థాపించాడు.

వ్యక్తిగత జిమ్నాస్టిక్ పోటీల్లో సోవియెట్ యూనియన్‌కు చెందిన అలెగ్జాండర్ డిట్యాటిన్ ఎనిమిది పతకాలు గెలుపొందాడు. మ్యూనిఖ్ ఒలింపిక్స్‌లో అమెరికా ఈతగాడు స్పిట్జ్

"నిజంగా గొప్ప వ్యక్తులు ఇచ్చే సందేశం ఏదో ఒక ప్రత్యేక దేశానికి మాత్రమేకాదు. విశాల ప్రపంచమంతటికీ."

సంపాదించిన 7 పతకాలను ఇతడు అధిగ మించాడు.

ఏథెన్స్ (గ్రీస్)కు చెందిన బాంకు ఉద్యోగి స్టిలియనోస్ మగియకిస్ గ్రెకో - రోమన్ మల్లయుద్ధం పోటీలో ఒలింపిక్ పతకాన్ని కైవసం చేసుకున్నాడు 20 ఏళ్ళ పాటు లభ్యం కాని బంగారు పతకాన్ని గ్రీస్ దేశానికి గడించి పెట్టాడు!



లాస్ ఏంజిల్స్ (1984)

1936 బెర్లిన్ క్రీడల్లో జెస్సీ ఓవెన్స్ 100 మీటర్లు, 200 మీటర్లు డాష్ పోటీలలో, లాంగ్ జంప్, 4×100 మీటర్ల రిలే పరుగు పందాలలో సాధించిన నాలుగు బంగారు పతకాలను అమెరికా వాసి కార్ల్ లూయిస్ కూడా సాధించి ఓవెన్స్‌తో సమానమయ్యాడు

ఫ్రాన్స్ బ్రెజిల్‌ను 2-0తో ఓడించి ఫుట్ బాల్‌లో బంగారు పతకం పొందింది ఉత్తర అమెరికాలో ఏనాడూ రానంతమంది 101,799 ప్రేక్షకులు హాజరై ఈ ఫుట్‌బాల్ ఛాంపియన్ పోటీని తిలకించారు

ఇండియా క్రీడారంగ ఉజ్జ్వల తార పి.టి. ఉష 400 మీటర్ల పరుగు పందెంలో ఫైనల్స్‌కు చేరుకున్న మొదటి భారత వనిత కానీ ఆమె ఒక సెకండ్‌లో నూరో వంతు తేడా వల్ల కంచు పతకం పొందలేకపోయింది.

సియోల్ (1988).

హాలెండ్‌కు చెందిన మోనిక్ నాల్ మహిళల 82 కి.మీ.ల సైకిల్ రోడ్ రేస్‌లో గెలుపొంది బంగారు పతకం సాధించింది. ఆమె రమారమి వేగం గంటకు 40 706 కి.మీ.లు.

మహిళల మునక పోటీలలో చైనా పాఠశాల బాలిక క్యూ-యాన్‌మి అమెరికాకు చెందిన మైకేల్ మిచెల్‌ను ఓడించి బంగారు పతకం గెలుచుకుంది.

అమెరికా వాసి కార్ల్ లూయిస్ లాంగ్ జంప్‌లో 8 72 మీటర్లు దూకి బంగారు పతకం పొందాడు. ఒలింపిక్ చరిత్రలో లాంగ్ జంప్‌లో రెండుసార్లు బంగారు పతకాలు గెల్చుకున్న మొదటి అథ్లెట్ ఇతడే

గత 64 సంవత్సరాలలో మొదటిసారిగా మహిళల టెన్నిస్ ఛాంపియన్‌గా పశ్చిమ జర్మనీకి చెందిన స్టెఫీ గ్రాఫ్ ఎంపికయింది ఆమె తన ప్రత్యర్థి అర్జెంటీనా వాసి గాబ్రియెలా సబటినిని 6-3, 6-3 స్కోర్‌తో ఓడించింది.

హైజంప్‌లో 7 40 మీటర్లు దూకి ఒలింపిక్స్‌లో రికార్డు సృష్టించిన అమెరికా వాసి జాకీ జాయ్‌నర్ కెర్సీ బంగారు పతకం గెలుచుకున్నాడు.

ఒకే ఒక ఒలింపిక్ పోటీలో ఇంతవరకు ఆరు బంగారు పతకాలు గెలుచుకున్న తూర్పు జర్మనీ ఈత ప్రవీణురాలు క్రిస్టిన్ ఒట్టోకు 11,000 డాలర్లు వ్యయం చేసి 20 కారట్ల బంగారంతో తయారుచేసిన కిరీటాన్ని బహూ కరించారు.

"ఏ పనీ నేర్చుకోవద్దు నీవు నేర్చుకోనందువల్ల నీ కోసం ఆ పని చేసి పెట్టేవాడు నీకెప్పుడూ దొరుకుతాడు"

# రాజు మనసు వెన్న, రాణి మనసు మిన్న

సదానంద మొహంతి

ఒరిస్సాలోని మయూర్‌భంజ్ మహారాజు శ్రీరామచంద్ర భంజ్ దేవ్ యొక్క సరళ స్వభావం, సామాన్యమైన అలవాట్లు, అణకువ గల మనస్తత్వం, మేధాశక్తి, పాలనాదక్షత, ఉన్నత హృదయం, కార్యదీక్ష - ప్రతీవారి ప్రశంసలను, అభిమానాన్ని చూరగొన్నాయి.

1912లో జరిగిన ఒక ప్రమాదంలో ఆకస్మికంగా కన్నుమూసేవరకు 1882 నుంచి సంస్థానాన్ని ఆయనే పరిపాలించేవాడు ఒరిస్సాలో మయూర్‌భంజ్ సంస్థాన చరిత్రలో ఆయన పరిపాలించిన స్వల్పకాలం ఒక స్వర్ణయుగంగా చెప్పాలి

ఒకరోజు ఉపాహారం స్వీకరించేందుకు మహారాజు ఉపవిష్టుడై, భుజించేందుకు ఉపక్రమిస్తున్న సమయంలో హఠాత్తుగా ఆయన ఆ పదార్థాలను తాకకుండా ఆగిపోయాడు ఏమి జరిగిందోనని మహారాణి ఆందోళన పడింది ఎవరినీ శిక్షించనంటే అసలు సంగతి చెబుతానన్నారు రాజు అందుకు రాణి అంగీకరించింది అప్పుడు మహారాజు ఆహార పదార్థాలతో ప్రమాదవశాత్తు కలిసి పోయిన ఒక బొద్దింకను చూపించాడు ఆరోజు ఉపాహారం తీసుకోకుండా మామూలు గానే తన పనులు నిర్వర్తించుకున్నాడు

మహారాణి కూడా చాలా నెమ్మది మనిషి, సరళ స్వభావురాలు, సద్గుణశీల ఎవరినీ కఠినంగా కోప్పడటం కానీ, అనవసరంగా దండించటం కానీ చెయ్యదు అయితే తన భర్త ఉపాహారం తీసుకోకపోవటం ఆమెను కొంత కలతబరచింది వంట మనిషితో ఇకపైన జాగ్రత్త వహించమని సౌమ్య ధోరణిలోనే చెప్పింది.

లజ్జ, భయం ముప్పిరిగొనగా వంట మనిషి మహారాజ మందిరంలోకి వెళ్ళి కైమోడ్పి ఇలా విన్నవించుకున్నాడు "ఘనత వహించిన ప్రభువులు నా నిర్లక్ష్యాన్ని మన్నించ ప్రార్థన మరోసారి ఈవిధంగా జరగదని నేను ప్రమాణం చేస్తున్నాను జరిగినదానికి నేను ఎంతో విచార పడుతున్నాను ప్రభూ!" అప్పుడు మహారాజు దయార్ద్ర హృదయంతో అన్న మాటలు ఇవి. "నీవు నాదగ్గరకు ఎందుకు వచ్చావు? నేనేమన్నా నిన్ను అన్నానా? వెళ్ళు! వెళ్ళి నీ పనులు చూసుకో భవిష్యత్తులో జాగ్రత్తగా, శ్రద్ధతో పనులు చేసుకో తమ విద్యుక్త ధర్మం నెరవేర్చేటప్పుడు ఎవరికైనా ఇటువంటి పొరపాట్లు సహజంగా జరుగుతుంటాయి"

ఆ రాత్రి భోజన సమయంలో మహారాజు వినోద ధోరణిలో మహారాణితో మాట్లాడుతూ ఇలా వ్యాఖ్యానించాడు "ఆడవారు తాము చెప్పిన మాట మీద నిలవరు. ప్రొద్దున జరిగిన ఉదంతం ఎవరితోనూ చెప్పనని నీవు మాట ఇచ్చావు. అయినా దాన్ని నిలబెట్టుకోలేకపోయావు"

తన భర్త ఉదార హృదయాన్ని తనలో తానే మెచ్చుకుంటున్న మహారాణి మౌనంగా ఉండి పోయింది ●

# ఆధునిక విజ్ఞానంలో అద్భుతం

## ఆశాకిరణం - లేజర్ బీమ్

కళ్ళజోళ్ళు, కాంటాక్ట్ లెన్సులు అవసరం లేకుండా 'లేజర్ బీమ్' అనే కొత్త విధానంతో కంటికి కటకాల మారాన్ని మార్చి, స్పష్టంగా కన పడేటట్లు చేసి నేత్రాలలోని లోపాలను సరిచేస్తున్నారు

"ఓడిపోతే పోయేదేమీ లేని మనుషులతో మనం పోరాడినప్పుడు-అది

# తేనెటీగల మధుర జీవితం

నీటా ఎడ్విన్

ఇండియాలో మూడు రకాల తుమ్మెదలు కనిపిస్తాయి, రాతి తుమ్మెద, చిన్న తుమ్మెద, తేనెటీగలు వీటిల్లో తేనెటీగలే మచ్చిక అయ్యాయి రాతి తుమ్మెదలు పెద్దవిగా ఉండి ఎక్కువ తేనెను ఇచ్చేవైనప్పటికీ వాటి బహిరంగ అలవాట్లు, విపరీత స్వభావం కారణంగా మచ్చిక కాలేక పోతున్నాయి




తేనెటీగలు కలసికట్టుగా నివసిస్తాయి పిల్లలను పెంచటం, ఆహారం సేకరించటం వంటి పనులు పంచుకుంటాయి అడవిలోని తేనె టీగలు బోలైన చెట్లలో, రాతి పగుళ్ళ మధ్య గూళ్ళు నిర్మించుకుంటాయి ఇవి పరిశుద్ధమైన మైనంతో తేనె పట్టులు తయారుచేస్తాయి. షట్కోణాకారంలో ఉండే చిన్న గదుల్లోనే తేనె పట్టులు తయారవుతాయి ఈ గదుల్లో తేనెను నిల్వ చేసి, తమ బిడ్డలను పెంచి పోషిస్తాయి తేనెటీగలకు సాధారణ ఆహారం తేనె, పుప్పొడి

ఒక తేనెటీగల నివాస స్థలంలో ఒకే ఒక రాణి ఈగ, 50,000 నుండి 60,000 కూలి ఈగలు, మరో వంద మగ ఈగలు లేక సోమరి ఈగలు ఉంటాయి పని ముమ్మరంగా ఉండే కాలంలో, పుష్పించే కాలంలో 80,000 ఈగలు అక్కడ ఉంటాయి.

రాణి ఈగ ఈ నివాస స్థలానికి తల్లి వంటిది. ఇది కూలి ఈగ, సోమరి ఈగలకంటే పెద్దదిగా ఉంటుంది. రాణి ఈగ చేసేవనల్లా గ్రుడ్లను పెట్టటమే నాలుగైదేళ్ళ జీవిత పరిధిలో దాదాపు 2 మిలియన్ల గ్రుడ్లను పెడుతుంది.

రాణి ఈగ ఒక రసాయనిక పదార్థాన్ని ఉత్పత్తి చేయటం ద్వారా ఈ సముదాయాన్ని పరిపాలిస్తుంది ఈ రసాయనం వల్ల కూలి ఈగలు గ్రుడ్లు పెట్టలేవు

సోమరి ఈగలు లేక మగ ఈగలు ఒకే ఒక పని నిర్వహించవలసి ఉంటుంది రాణి ఈగతో సంపర్కం చేయటం ఈ సోమరి ఈగలు అత్యల్పకాలమే జీవిస్తాయి. రాణి ఈగతో కలసిన తరువాత చనిపోతాయి

కూలి ఈగలు తేనెటీగల కుటుంబంలోని స్త్రీ పరిచారికలు వంధ్యత్వం వల్ల ఇవి గ్రుడ్లు పెట్టలేవు కూలి ఈగల ఉత్పత్తి 21 రోజులు జరుగుతుంది గ్రుడ్ల దశలో మూడు రోజులు, పురుగుదశలో ఆరురోజులు, చిన్న దశలో పన్నెండు రోజులు ఉంటాయి శైశవం నుండి మరణాంతం వరకు కూలి ఈగలు పని చేస్తూనే ఉంటాయి నాలుగు నుంచి ఆరు వారాల జీవన పరిధిలో ఇవి రకరకాల పనులు నిర్వహిస్తాయి వీటి పెరుగుదలతో పాటు ఇవి చేసే పనుల్లో కూడా మార్పులు జరుగుతాయి

తేనె సేకరించడానికి వీలైన అవయవాలు కూలి ఈగలకే ఉంటాయి తేనె ఇచ్చే పుష్పాలను వెదికి తెచ్చేందుకు ఈ కూలి ఈగలకు వాసన, రంగు, చూపు - మార్గదర్శకంగా పనిచేస్తాయి. మానవులకు విభిన్నమైన రీతిలో వీటికి

'గమనింపు, విలంబన-కారణంగా నిజం గట్టి పడుతుంది తొందర పాటువల్ల, అస్థిరతవల్ల అసత్యం పటిష్ఠ మౌతుంది.'' — టసిటస్

రంగుల దృశ్యం కనిపిస్తుంది. ఇవి ఎరుపు రంగును చూడలేవు. కానీ మనకు కనిపించని గాఢ ఊదారంగును (ultra violet) ఇవి చూస్తాయి.



వీటి శరీరాల మీద చిన్న వెంట్రుకలు అంచులు కట్టి ఉంటాయి. పువ్వులలోని తేనెను సేకరిస్తున్నప్పుడు పుప్పొడి రేణువుల్ని పోగు చేస్తాయి. వీటిని వెనుక నున్న కాళ్ళకు బదిలీ చేస్తాయి. ఈ కాళ్ళు పుప్పొడి సంచులుగా పేరు పొందాయి

వీటికి పువ్వులలోని సుదూర భాగంలోకి నాలుకను చొప్పించి తేనెను గ్రోలేందుకు వీలుగా పొడవైన నాలుక ఉంది ఈ తేనెను 'తేనె కడుపు' అనే పేరుతో పిలువబడుతున్న పొట్టలోని ఒక కొలువలో భద్రపరుస్తాయి. తేనె పట్టుకు చేరుకోగానే ఇవి తేనెను చిన్న ఈగల నోటిలోకి జారవిడుస్తాయి. అవి కూడా మిగతా వాటికి ఇదే పద్ధతిలో అందజేస్తాయి. ఈ విధంగా అనేక ఈగల కడుపుల్లోకి జారిపోతున్నప్పుడు తేనె ఏకోన్ముఖంగా కలిసి పోతుంది తేనెటీగలు చేస్తున్న ఈ బ్రహ్మాండమైన ఉత్పత్తి గాఢమైన వసువు వచ్చని ద్రవంగా రూపొందుతుంది దీన్నే తేనె అని మనం పిలుస్తాము

తేనె దొరికే చోటు ఈగ కనుగొనగానే గూటికి చేరుకుని వలయాలుగా తిరుగుతుంది. ఇదొక వలయాల నృత్యం చుట్టు ప్రక్కల ఉన్న ఈగలు ఈ తేనెటీగ శరీరంలో నుంచి వచ్చే పువ్వు పరిమళం ఆఘ్రాణిస్తాయి అది ఆహారంగా అందిస్తున్న పదార్థంలోని రసాయనిక వస్తువులను కూడా గ్రహిస్తాయి నిర్ణీత స్థలం ఎక్కడో గమనించిన ఈగలకు ఉత్తేజం కలుగుతుంది.

తేనెటీగలు నివసిస్తున్న చోటుకు నిర్ణీత స్థలం దూరంగా ఉన్న పక్షంలో తోకల్ని కదలించే నృత్యం లేదా 'ఎనిమిది అంకెల నృత్యం' చేస్తాయి ఈగలు వేటాడి వెదకి తెలుసుకున్న స్థలంలో పొట్టలను కదలిస్తూ ఎనిమిది అంకె వేస్తున్న విధంగా నృత్యం చేస్తాయి. ఈ నృత్యం నిర్ణీత స్థలాన్ని నిర్దేశించడమే కాక సూర్య అభిముఖంగా ఎంతదూరం తాము పయనించవలసి ఉంటుందో వెల్లడి చేస్తుంది

తేనె, మైనం - ఉత్పత్తి చేస్తున్నందుకు తేనెటీగలు అత్యంత ప్రశంసార్హాలు అంతే కాకుండా పంటలకు, చిన్న చెట్లకు పువ్వు రజస్సును కలిగించేందుకు వీలుగా పువ్వు పరాగానికి దోహదం చేయటం అన్నిటికంటే ఘనకార్యం అని చెప్పాలి

— 'సిఐఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## ఉరికంబం ఎక్కిన మొదటి భారత అమర వీరుడు

ఉరికంబం ఎక్కి ఆయువులర్పించిన మొదటి భారత అమరవీరుడు పశ్చిమ బెంగాల్‌లోని మిడ్నపూర్ జిల్లాకు చెందిన హబీబ్‌పూర్ వాస్తవ్యుడు ఖుదీరాం బోస్ 1907 డిసెంబరు 6న బెంగాల్ గవర్నర్ ప్రయాణం చేస్తున్న రైలుమీద బాంబులదాడిని నిర్వహించినందుకు బ్రిటిష్ ప్రభుత్వం ఈ 19ఏళ్ళ యువకుణ్ణి 1908 ఆగస్టు 11న ఉరి తీసింది

'కొంతమంది వ్యక్తుల ఆధిక్యత కేవలం స్థానికమే సహచరులు అల్పులు కనుక వీరికి ఆధిక్యత లభించింది '' — శామ్యూల్ జాన్సన్

# ఈ శతాబ్దంలో

## మొదటి హిందీ కథానిక

పండిట్ మాధవ్ ప్రసాద్ మిశ్రా వ్రాసిన మొట్టమొదటి అధికారిక హిందీ కథానిక 'లడ్కీ కీ బహదూరి' 1904లో 'సుదర్శన్' అనే ఒక హిందీ పత్రికలో ప్రచురించారు. కలకత్తాలో దార్పుడుగాళ్ళతో వీరోచిత పోరాటం జరిపిన ఒక బాలిక కథ ఇది

## మొదటి ఆపిల్ చెట్ల పెంపకం




1915లో అమెరికన్ మిషనరీ శామ్యూల్ ఇవాన్స్ స్టోక్స్ సిమ్లా (హిమాచల్ ప్రదేశ్)కు 52 మైళ్ళ దూరంలోని కోట్‌ఘర్ గ్రామంలో కాలిఫోర్నియా (అమెరికా) నుంచి తెచ్చిన మొదటి ఆపిల్ చెట్లను నాటించాడు. తరువాత సత్యానంద అనే పేరుతో హిందువుగా మారాడు.

## పురాతన ప్రచురణ సంస్థ 1912లో ఇండియా రాక

ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ ప్రెస్ ప్రపంచంలోని పురాతన ప్రచురణ సంస్థ (బ్రిటన్‌లో 1478లో స్థాపించబడింది) 1912లో ఇండియాలోకి కాలుమోపింది. ఇ. వి రియో బొంబాయిలో ఒక కార్యాలయం ప్రారంభించారు.

## శాశ్వత అక్షరాలు

ప్రపంచంలోనే అతి పెద్దవిగా ఉండే శాశ్వత అక్షరాలు - 600 అడుగుల అక్షరాలు - 'రెడీమిక్స్' అనే స్పెల్లింగ్ కలవి. 1971 డిసెంబర్‌లో పశ్చిమ ఆస్ట్రేలియాలోని తూర్పు బల్లడోనియా సమీపంలో ఉన్న నుల్లార్బర్‌లో భూమి మీద నిర్మించబడ్డాయి.

## ప్రపంచంలోనే చిన్నదేశం

ఇటలీ రాజధాని రోమ్‌లో అంతర్భాగంగా ప్రపంచంలోనే అతి చిన్న స్వతంత్ర దేశం - స్టేట్ ఆఫ్ వాటికన్ సిటీ - 1929 ఫిబ్రవరి 11న ఉద్భవించింది. ఇది 108 7 ఎకరాల విస్తీర్ణంలో ఉంది.

## ఖురాన్ సూక్తుల అపూర్వ పఠనం

1967 అక్టోబర్ 14న మహమ్మద్ అలీ హలిసి అనే టర్కీలోని అంకారా వాసి ఆరు గంటల కాలంలో 6,666 ఖురాన్ సూక్తులు జ్ఞాపకశక్తితో పఠించాడు

## మొదటి టార్చ్‌లైట్ బ్యాటరీ కర్మాగారం

1926లో ఇండియాలోనే మొట్టమొదటి టార్చ్‌లైట్ బ్యాటరీ కర్మాగారం ఎవరెడీ (ఇండియా) కంపెనీ కలకత్తాలో స్థాపించింది

## మధ్యయుగాల నాటి శరీర అవశేషాలు

ఇటలీలోని అబ్రుజ్జి సమీపంలో లాగా పర్వతం వద్ద మధ్యయుగాల నాటి 8 అడుగుల 3 అంగుళాల పొడవైన ఒక భయంకర మహాకాయం అవశేషాలను కనుగొన్నట్లు 1972 ఫిబ్రవరి 10న భూగర్భ శాస్త్రవేత్తలు ప్రకటించారు.

"మానవుని సంతోషానికి ఆవశ్యకం-అతడు తనకు తాను మానసికంగా విశ్వాసపాత్రుడుగా మెలగటమే" — థామస్ పైన్

## పురాతత్త్వ శాఖ స్థాపన

భారత ప్రభుత్వం వారి పురాతత్త్వ శాఖ 1904లో పని ప్రారంభించింది. 1933లో కేంద్ర శాసనసభ ప్రాచీన కట్టడాల సంరక్షణ చట్టాన్ని ఆమోదించింది.

## స్వతంత్ర భారత తొలి ప్రధాని నెహ్రూ


Nehru

దేశ విభజనానంతరం 1947 ఆగస్టు 15న ఇండియా న్యూఢిల్లీ రాజధానిగా బ్రిటీష్ పాలన నుండి విముక్తి పొందింది. ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధుడు, ప్రసిద్ధ రచయిత జవహర్‌లాల్ నెహ్రూ చేత నాటి వైస్రాయ్ లార్డ్ లూయీ మౌంట్‌బాటన్ స్వతంత్ర భారత ప్రథమ ప్రధానిగా ప్రమాణ స్వీకారం చేయించాడు.

## 65,000,000 మంది దర్శించిన ఎక్స్‌పో '70

1970 మార్చి నుండి సెప్టెంబర్ 13 వరకు జపాన్‌లోని ఒసాకాలో 815 ఎకరాల స్థలంలో జరిగిన ఎక్స్‌పో '70 ప్రదర్శనం 65,000,000 ప్రేక్షకుల్ని 183 రోజులపాటు ఆకర్షించింది. 30,000,000 డాలర్లకు పైగా లాభం సంపాదించింది.

## ఇండియాలో మొదటి విమాన ప్రయాణ సౌకర్యం

ఇండియాలో మొట్టమొదటి విమానయాన సర్వీస్‌ను 'టాటా సన్స్ లిమిటెడ్' వారు 1932 అక్టోబర్ 15న ప్రారంభించారు. ఆ రోజున టాటా స్వయంగా విమానంలో కరాచీ (సింధ్, పాకిస్తాన్) నుంచి బొంబాయికి పయనించారు.

## చింతకు కారణం

యువకులు, వృద్ధులు కూడా ఏమిటో ఊరికే చింతపడిపోతారు. దీనికంతా మూలకారణం తెలిసినా తెలియకపోయినా స్వార్థపరత్వం. మన స్నేహితులనుకున్నవారు నిర్లక్ష్యం చేసినప్పుడు మనం చేసిన పనిని ఒకరు మెచ్చుకోనప్పుడు



మనం చింతపడిపోతుంటాం. దురదృష్టవశాత్తు ఇంకొకరి మీద ఆధారపడిన మన నాటి విధానం మీదే ప్రభావితం అవుతుంది. కొన్ని నిమిషాల పాటు బాహ్య ప్రపంచాన్ని మరిచిపోయి అంతరంగా ధ్యానంలోకి దిగితే మనం ఎంతో ఉత్సాహవంతంగా, ఆత్మవిశ్వాసంతో, ధైర్యంతో ఉండగలుగుతాం.

"నీవు ఏదో ఒకటి చెప్పాలనుకున్నావు కాబట్టి ఉపదేశాలు చేయవద్దు, నీవు చెప్పవలసిన దానిలో విషయం ఉంటే తప్ప." — రిచర్డ్ వాట్లే

# ఈ తాళాల వింత కథ విన్నారా?

అరవింద్

ప్రపంచంలో అతి పెద్ద తాళం 4,000 ఏళ్ళనాటి ఈజిప్షియన్ తాళం అది ఈనాటికీ భద్రపరచబడింది. ఫరోస్ (pharaohs) భవంతి శిథిలాలలో దొరికిన ఈ తాళం కొయ్యతో చేయబడింది తాళం రంధ్రంలో అమర్చిన అడ్డగడియ ఎన్నో కొయ్య మేకుల సహాయంతో మూయబడింది అడ్డగడియలో ఏటవాలుగా ఒక కొయ్యదుంగను జొప్పిస్తే మేకులు పైకివచ్చి గడియ తెరుచుకుంటుంది.



ఈజిప్ట్ తాళాల తరువాత గ్రీస్, రోమ్‌ల నుంచి ఇంకా మేలైన తాళాలు వచ్చాయి. ఇవి మిశ్రమ లోహంతో తయారుచేసిన కప్పు తాళాలు. వీటి బీగాలు లేక (తాళం) చెవులు రింగుల మాదిరిగా చేతి వ్రేళ్ళలో ధరించవచ్చు. చైనా, రష్యా జపాన్‌లలో ప్రత్యేకంగా చెక్కిన తాళాలు తయారు చేసేవారు

చైనాలో 13వ శతాబ్దిలో కోడ్ (సాంకేతికమైన మాటలు) తాళాలు వ్యాప్తిలోకి వచ్చాయి. ఈ తాళాలు తెరిచేందుకు బీగాలు అక్కరలేదు. తాళం మీదున్న వివిధ చిహ్నాలను బట్టి కోడ్ మాటలు ఉపయోగించి తాళం తెరవవచ్చు. ఈ కోడ్ మాటలు తాళం యజమానికి మాత్రమే తెలుస్తాయి. నేడు అభివృద్ధి చెందిన దేశాలలో ఈ రకం తాళాలు బాగా ఉపయోగిస్తున్నారు.

1778లో ఇంగ్లండులో రాబర్ట్ బర్రాన్ రెండు విధాల పనిచేసే లీవర్ టంబ్లర్ తాళం నిర్మాణానికి ప్రత్యేక అనుమతి (పేటెంట్) పొందాడు. ఒక నిర్దిష్టమైన ఎత్తులో బీగం తిప్పితే కాని ఈ తాళం తెరుచుకోదు. 1818లో జెరిమయ్య చుబ్ తాళాలను మరింత అభివృద్ధి చేసాడు 2,3 లీవర్లకు బదులు 1 లీవరు పెట్టి తాళం తయారు చేసాడు. ఏదైనా కారణం చేత లీవర్లు వదులైతే సరైన బీగం లేకుండా తాళం తెరచుకోనివిధంగా స్ప్రింగ్ నిరోధిస్తుంది

1784లో జోసెఫ్ బ్రహం స్థూపరూపంలో ఒక ప్రత్యేక తాళం తయారు చేసాడు దీనికి 40 కాంబినేషన్లు ఉంటాయి 40 బీగాలు ఉపయోగిస్తే కాని తాళం తెరుచుకోని విధంగా తయారు చేయవచ్చు

ఈ తాళాలతో పాటు పిండెల్ అనే ఒక తాళాల తయారీదారుడు 32 గంటల కాల నిర్ణయంగల ఒక గడియారాన్ని చేర్చి 'టైమ్ లాక్' తయారు చేసాడు జర్మనీ రెండు బీగాలతో తెరచుకునే తాళం తయారు చేసింది 1780లో ఫ్రాన్స్ 'అరెస్టింగ్ లాక్' అనే తాళం తయారు చేసింది సింహపునోరు ఆకారంలో ఉండే ఈ తాళాన్ని తప్పుడు బీగంతో తెరిచేందుకు ఎవరైనా ప్రయత్నిస్తే అతడి చేతుల్లో ఆసింహం వాడి దంతాలు గుచ్చుకుపోతాయి.

ప్రస్తుతం వివిధ రకాల తాళాలు తయారు

"ఇద్దరే ఇద్దరు సంపూర్ణ సత్పురుషులు - మరణించిన వారు, జన్మించనివారు."

— చైనా సామెత

చేస్తున్నారు. గొలుసు తాళం, కప్ప తాళం, లీవర్ టంబ్లర్, గొట్టంవంటి తాళం మొదలైనవి తయారయ్యాయి. రహస్యమైన కోడ్ ద్వారా మాత్రమే కాంబినేషన్ తాళం తీయగలుగుతారు. షైమ్ లాక్స్ బాంకుల్లో ఉపయోగిస్తారు. సాయంకాలం ఐదుగంటలు కాగానే బీగంలో కాలం ఉదయం పది గంటలుగా మారుతుంది ఈలోగా ఎవరెంత ప్రయత్నం చేసినా తాళం తియ్యలేరు. ఎలక్ట్రానిక్ లాక్ డోర్‌కు కూడా ఈ ప్రత్యేకత ఉంది ఇంటి యజమాని వద్ద కానీ లేదా అతని అనుమతి పొందిన వ్యక్తి వద్ద కానీ ఒక ప్లాస్టిక్ కార్డు ఉంటుంది. ఇది కోడ్ వర్డ్స్ ఉన్న బీగం వంటిది

బ్రిటన్‌కు చెందిన ఛన్ కంపెనీ తయారు చేసిన కాట్‌లాక్ తాళాలు మ్యూజియంలలో ఉపయోగిస్తారు ఎవరైనా దొంగ దీన్ని బద్దలు కొట్టేందుకు ప్రయత్నిస్తే దీని లోపలున్న నున్నితమైన రేకు పగిలిపోతుంది. దీనితో తాళం లోపల మరో తాళం మూసుకు పోతుంది. కొన్ని సందర్భాల్లో దొంగలు లీవర్‌ను బ్రద్దలు చేసే ఉద్దేశంతో తాళంలో ప్రేలుడు పదార్థాలు పెడతారు దీనికి విరుగుడుగా కంపెనీ వారు ఒక క్రొత్త ఏర్పాటు చేసారు తాళం రంధ్రంలో పెట్టిన ప్రేలుడు పదార్థంకానీ, రసాయనం కానీ అవతలవైపుకు చేరి అక్కడనుంచి నేలమీదికి పడిపోయే ఏర్పాట్లు చేసారు.

ఇండియాలో గాడ్రెజ్ కంపెనీవారి 8 లీవర్ల "నవతాళ్" కంప్యూటర్ పద్ధతి ప్రకారం తయారయింది గాడ్రెజ్‌వారి నైట్‌లాచ్, డోర్ లాక్, ఫ్లోర్ లాక్, ఫ్లాట్ లాక్, సేఫ్ లాక్ వంటివి బాగా ప్రసిద్ధి పొందాయి ఇండియాలోని కెగ్ ఎంటర్‌ప్రైజెస్ వారు తయారు చేసిన ప్రఖ్యాత తాళం 'మాగ్‌లాక్' - మాగ్నటిక్ కాంబినేషన్ కలిగి ఉంది. కోడ్ నెంబర్ ఆధారంగా మాగ్నటిక్ బీగం తయారుచేశారు అందువల్ల ఏ ఇతర బీగం దీనికి పనికిరాదు. మరో డూప్లికేట్ బీగం కావాలంటే కంపెనీవారే తయారుచేసి ఇవ్వాలి.

బొంబాయికి చెందిన అగస్టస్ డాల్టన్ తయారు చేసిన తాళాలు ఒక మాటతోనో, మరో పలుకుతోనో తెరుచుకుంటాయి. తాళం యజమాని ఏదో ఒక మాటనో, ఒక వాక్యాన్నో నిర్ణయించుకుంటే దాని ప్రకారం తాళం తయారు చేస్తారు. అయితే ఆ మాటకానీ, వాక్యంకానీ 30 అక్షరాలకు మించరాదు. ఈ తాళానికి ఎలక్ట్రానిక్ పద్ధతి ఉన్నందువల్ల తప్పుడు కోడ్ ఉపయోగిస్తే తాళానికున్న గంట మ్రోగుతుంది.

అమెరికాలో మిలటరీ ప్రాధాన్యంగల భద్రతా ప్రదేశాలకు కాని, అణుకేంద్రాల రక్షిత స్థలాలకు కాని వెళ్ళే ప్రతివ్యక్తి ఒక గ్లాస్ ట్యూబ్ (నాళిక) మీద తన చేతిని పెట్టవలసి ఉంటుంది. తక్షణమే ఆ చేతిని కంప్యూటర్ ఎక్సరే తీసి ఆ వ్యక్తికి ప్రవేశార్హత ఉందో, లేదో తెల్పి చెబుతుంది ఉందని వస్తే ప్రవేశ ద్వారం తెరవబడుతుంది లేజర్ కిరణాల సాంకేతిక పరిజ్ఞానంతో మరో నమూనా తయారు చేసారు.

—'హర్యానా రివ్యూ' సౌజన్యంతో

## స్త్రీలం ...ండెపోటు

*50 సంవత్స... ...టని స్త్రీలలో వచ్చే ఒక రకమైన గుండెపోటు-మయోకార్డియల్ ఇన్‌ఫార్‌క్షన్ (MI) — సిగరెట్లు త్రాగటం, హైపర్‌టెన్షన్ అంజినా, మధుమేహం, 'A' టైప్ రక్తం, కుటుంబంలో MI ఉండటంవల్ల వస్తుంది*

— 'జర్నల్ ఆఫ్ అమెరికన్ మెడికల్ అసోసియేషన్' సౌజన్యంతో

"నీవు విజయం సాధించ్వాలనుకుంటే మెట్ల అడుగుల వంక నివ్వెరపోయి చూడకు-మెట్లమీద అడుగు పెట్టు."

# వారలు

## ప్రతివ్యక్తికి రోజుకు 70 లీటర్ల నీరు

అభివృద్ధి చెందుతున్న దేశంలో ఒక వ్యక్తికి త్రాగేందుకు, ఇతర అవసరాలకు ప్రతిరోజు కనీసం 70 లీటర్ల నీరు అవసరమౌతుందని ఆరోగ్య ప్రమాణాలు చెబుతున్నాయి

## తైవాన్‌లో విదేశీ మారకద్రవ్యం




తూర్పు ఆసియాలోని తైవాన్‌లో ప్రపంచం లోనే అత్యధిక విదేశీ మారక ద్రవ్య నిల్వలు 80 బిలియన్ డాలర్లు (80,000 మిలియన్ డాలర్లు) ఉన్నాయి.

## వాహనాల పెంపు పదిరెట్లు

1971లో ఇండియాలో వాహనాల సంఖ్య 18 లక్షలు కాగా 1991లో 193 లక్షలకు పెరిగింది. అంటే 10 రెట్లకు మించిన పెరుగుదల. ఈ రోజున 10 కుటుంబాలకు ఒక వాహనం చొప్పున ఉన్నదన్నమాట.

## ప్రపంచంలో పురాతన స్టాక్ ఎక్చేంజ్

1602లో నెదర్లాండ్స్‌లోని ఆమ్‌స్టర్‌డాంలో స్థాపించబడిన స్టాక్ ఎక్చేంజ్ ప్రపంచంలోనే పురాతనమైన స్టాక్ ఎక్చేంజ్.

## పాసింజర్ల ట్రాఫిక్ 80 శాతం

1960-61లో మొత్తం రోడ్ ట్రాఫిక్‌లో 42 శాతంగా లెక్కించబడిన పాసింజర్ ట్రాఫిక్ ఇప్పుడు దాదాపు 80 శాతం వరకు పెరిగింది.

—'బిజినెస్ ఇండియా' సౌజన్యంతో

## ప్రమాదాల మరణాల పెరుగుదల

కాన్సర్, హృదయ సంబంధ వ్యాధుల వల్ల సంభవించే మరణాల తరువాత ప్రమాదాల వల్లనే ఎక్కువ మంది ప్రపంచ వ్యాప్తంగా చని పోతున్నారని ప్రపంచ ఆరోగ్య సంస్థ అధ్యయనం ద్వారా వెల్లడయింది.

## శ్రీలంకలో అధిక ఆయుః ప్రమాణం

దక్షిణ ఆసియాలోని శ్రీలంకలో పురుషుల జీవిత ప్రమాణం 68 సంవత్సరాలు, స్త్రీల ఆయుః ప్రమాణం 73 సంవత్సరాలుగా ఉంది ఇండియాలో పురుషులకు 58 ఏళ్ళు స్త్రీలకు 59 ఏళ్ళు ఆయుః ప్రమాణంగా ఉంది.

— 'పాపులేషన్ రిఫరెన్స్ బ్యూరో' సౌజన్యంతో

## 134 ఏళ్ళు జీవించిన వ్యక్తి

*తమిళనాడులోని తంజిమంగళం తాలూకాకు చెందిన చెల్లూరు గ్రామ వాస్తవ్యుడు, వ్యవసాయ దారుడు రామస్వామి తన 134వ ఏట 199 సెప్టెంబర్ 23న మరణించాడు. చివరిరోజు వరకు ఆయన దృఢంగా, ఆరోగ్యంగా ఉన్నాడు. 10వ లోక్‌సభ ఎన్నికల్లో ఓటు హక్కు వినియోగించుకున్నాడు.*

"భయపెట్టే వ్యక్తిని ఎవరూ ప్రేమించరు." — అరిస్టాటిల్

# పదాల పుట్టుక

### శ్రీమతి మేరియోలా క్రిస్టి

* జర్నల్: ప్రతిరోజు చేసే పనికి సంబంధించిన వివరాలు ఉన్న డైరీ.
* ఫోర్ట్‌నైట్: 14 రాత్రులు (రెండు వారాలు) ఈ రూపం ధరించింది
* బస్: 'ప్రతివారి కోసం' అనే అర్థంగల 'ఓమ్ని బస్'కు హ్రస్వరూపం




* కరాటే: జపాన్‌లోని ఒక దీవిలో కొందరు నిర్బంధానికి గురయ్యారు ఆయుధాలు లేకుండా పోరాడి విడుదల కావాలనే కోరికతో ఒక పద్ధతిని కనుగొన్నారు కరాటే - అంటే శూన్యహస్తమని అర్థం ఆత్మరక్షణ చేసుకోవటం, దెబ్బలు కొడుతూ, కాళ్ళతో తన్నుతూ శత్రువును ఎదుర్కొనటం కరాటే లక్షణం
* డ్రాయింగ్ రూం రాత్రి భోజనం తరువాత విశ్రాంతి కోసం వెళ్ళే గది - 'విత్‌డ్రాయింగ్ రూం' అసలు పేరు దీనిలో 'విత్' వదలి వేయబడింది
* న్యూస్: ఇన్ఫర్మేషన్ ఫ్రం నార్త్, ఈస్ట్, వెస్ట్, సౌత్.
* క్యూ ఒకానొకప్పుడు ఎలిజబెత్ రాణి దర్శనార్థం ప్రజలు బారులు తీరి నిల్చినప్పుడు (క్వీన్స్ క్వెస్ట్) 'రాణిని వెదుకబోతున్న జనం' అని ఎవరో వ్యాఖ్యానించారు ఆమాటే క్యూగా మారింది.
* మోపెడ్ 'మోటారైజ్డ్ పెడలింగ్'కు హ్రస్వ రూపం.
* అగ్‌మార్క్ 'అగ్రికల్చురల్ మార్కెటింగ్' నుంచి వచ్చిన పేరు కొన్ని వస్తువులపై ఈ ముద్ర వేస్తారు
* టిప్స్ పాతకాలంలో సత్రంలో బస చేసే ప్రయాణీకులు నౌకర్ల కోసం ఒక పెట్టెలో నాణెములు వేసేవారు దానిమీద సత్వర సేవ

## తోటి మానవునితో మానవుడిలా జీవించాలంటే




పక్షుల లాగా ఆకాశంలో గాలిలో ఎత్తుగా ఎగరడం నేర్చుకున్నాం చేపల లాగా నీటిలో లోతుగా ఈదడం నేర్చుకున్నాం కానీ ఏం పాపమో ఆధునిక మానవుడు భూమి మీద తోటి మానవునితో మానవుడిలా జీవించడం నేర్చుకోలేకపోయాడు

—డా॥ ఎస్ రాధాకృష్ణ

"మూర్ఖుడు చివరిలో చేసే పనిని వివేకవంతుడు ముందుగానే నిర్వర్తిస్తాడు."

— స్పానిష్ సామెత

అందించటం కోసం (To insure prompt service - TIPS) అని వ్రాసి ఉండేది - ఇదే టిప్స్ పద్ధతికి దోవ తీసింది.



* పాప్ మ్యూజిక్ పాపులర్ మ్యూజిక్‌కు హ్రస్వ రూపం

* జీప్ ద్వితీయ ప్రపంచ యుద్ధ సమయంలో (1939-1945) ఒక కొత్త గేర్ సిస్టంతో వాహనం తయారు చేసారు దానిపేరు 'జనరల్ పర్పస్ వెహికల్ - జి పి ' దాన్నే 'జీప్' అంటున్నారు

* నైలాన్ రసాయనాల ద్వారా తయారైన నార ప్రథమంగా న్యూయార్క్, లండన్‌లలో తయారు చేసారు



* కె.డి భారతీయ భాషల్లో ఒక మోటు మనిషి, తగాదాలమారి, గొడవ చేసే వ్యక్తిని "కె.డి." అని పిలుస్తారు ఇంగ్లీషులో 'దుర్మార్గుడు' అనే అర్థం వచ్చే పదమిది

## మొట్టమొదటి టైప్‌రైటింగ్ మెషీన్

మొట్టమొదటి టైప్‌రైటింగ్ మెషీనును యుఎస్ఏ డెట్రాయిట్‌కు చెందిన విలియం ఆస్టిన్ బర్ట్ తయారు చేసాడు అతడు ఒకే మెషీన్ తయారుచేసాడు. 1833లో ఫ్రాన్స్‌లో మార్సెల్స్‌కు చెందిన క్జేవియర్ ప్రొజిన్ నేటి ఆధునిక మెషీన్ వంటి టైప్ మెషీన్‌ను కనిపెట్టాడు. దానికి కేంద్రం దగ్గర కొట్టే అనేక బార్లు ఉన్నాయి



మొట్టమొదటి బాగా వినియోగపడే మెషీన్‌ని యుఎస్ఏ మిల్‌వాకీకి చెందిన క్రిస్టొఫర్ లాథమ్ షోలెస్, కార్లోస్ గ్లిడ్డెన్, శామ్యూల్ సోయాల్ 1867లో కనుగొన్నారు అభివృద్ధి పరచబడిన నమూనా ఒకటి 1874లో మార్కెట్‌లో ప్రవేశించింది ఇదే నేటి ఆధునిక మెషీనుకి ఆధారం పేపరు సిలిండరు, లైన్ స్ప్రింగ్, క్యారేజ్ రిటర్న్ మెకానిజం, ఇంక్ చేసిన రిబ్బనుతో ప్రింటింగ్, యూనివర్సల్ కీబోర్డ్ మొదలైనవి ఉన్నాయి

## తీపి నీటి సరస్సు

ఉంటల్లోని చెల్యువెన్క్స సరస్సులో తియ్యటి నీరు లభిస్తుంది. సోడా, సోడియం క్లోరైడ్ కలసిన ఘాటైన ధాతువులు ఈ నీటిలో కనిపిస్తాయి ఈ సోడావల్లనే నీటికి తీపిదనం వచ్చింది ఈనీళ్లలో సబ్బు లేకుండా వస్తువుల్ని శుభ్రం చేసుకోవచ్చు నూనె మరకలు కూడా తేలిగ్గా పోతాయి

●

"విజ్ఞాన శాస్త్రం మనకు సత్యాన్ని వాగ్దానం చేసింది అంతే కానీ శాంతినీ, సంతోషాన్ని అది ఎన్నడూ వాగ్దానం చేయలేదు."

# చనుబాలు సర్వశ్రేష్ఠం

డా. ఉషా రఘుపతి

తల్లిపాలు బిడ్డకు సహజమైన ఆహారం. పెరిగే బిడ్డకు కావలసిన పోషక పదార్థాలను తగినంతగా తల్లిపాలు సరఫరా చేస్తాయి.



ఇది సంతులిత ఆహారం కనుక బిడ్డ అజీర్తి బాధలు లేకుండా హాయిగా నిద్రిస్తుంది బాగా పెరుగుతుంది తొలిదశలో బిడ్డకు వచ్చే అంటు వ్యాధుల నుండి రక్షించే శక్తి తల్లి పాలకే ఉంది

తల్లి దృష్టిలో కూడా చూస్తే ఈ క్రింది సదుపాయాలు ఉన్నాయని తెలుస్తుంది

1 ఎప్పుడు అవసరమైతే అప్పుడు తల్లిపాలు ఇవ్వవచ్చు. పాలు వృధా అయ్యే అవకాశం లేదు.

2. కుంచించుకున్న గర్భసంచి ఉత్తేజమై తల్లికి సుఖ సంతోషాలు చేకూర్చగలదు

3. వెచ్చని తల్లి ఒడిలో నిద్రించే పాప వల్ల తల్లీ బిడ్డల ఆత్మీయానుబంధం పెరుగుతుంది. బిడ్డకు రక్షణ ఇస్తున్న భావం తల్లిలో కలుగుతుంది.

ప్రసవానంతరం, అక్లిష్ట దశ నుండి బయట పడిన వెంటనే బిడ్డను తల్లిపాలకోసం దగ్గరకు చేర్చవచ్చు ఇది 10,12 గంటలు లేదా ఒక్కొక్క సారి 24 గంటలు కూడా పట్టవచ్చు దీని తరువాత బిడ్డ ఒక్కొక్క రొమ్మును ప్రతి నాలుగు గంటలకు 5, 7 నిమిషాలపాటు చీకవచ్చు ఇలా బిడ్డ పాలు గ్రహించటం నేర్చుకుంటుంది. పాలకు ముందు వెలువడే ద్రవం కూడా బిడ్డను ఉత్తేజపరుస్తుంది

తల్లిలో పాలధార మొదలుకాగానే బిడ్డకు ప్రతి 3, 4 గంటలకు పాలు ఇవ్వవచ్చు. మొదట్లో బిడ్డ అవసరాన్ని గమనించి పాలు ఇవ్వాలి పెరిగేకొద్దీ ఒక పద్ధతి ప్రకారం బిడ్డ పాలు గ్రహిస్తుంది ఏడ్చినప్పుడల్లా పాలు ఇవ్వటం మంచిదికాదు బిడ్డ తరచుగా ఏడుస్తున్నా, కూనిరాగాలు తీస్తున్నా పూర్తిగా పరీక్ష చేయించటం అవసరం.

## అవార్డు

### 'అవార్డ్స్ ఆఫ్ ఆనర్' రెండుసార్లు పొందిన సంస్థ

నేషనల్ సేఫ్టీ కౌన్సిల్ ఆఫ్ చికాగో (యుఎస్ఎ) వారి 'అవార్డ్స్ ఆఫ్ ఆనర్' పురస్కారం రెండుసార్లు ప్రజారంగ సంస్థ 'నేషనల్ ఫెర్టిలైజర్స్ లిమిటెడ్'కు దక్కింది 1990లో 3.10 మిలియన్లు, 1991లో 3.28 మిలియన్ల పనిగంటలను ప్రమాదాలు లేకుండా నిర్వహించినందుకు రెండుసార్లు ఈ అవార్డులు ఇచ్చారు

"పరిశ్రమతో ఎల్లవేళలా వెంటవచ్చేది అదృష్టమే"

— ఆలివర్ గోల్డ్‌స్మిత్

తల్లి ఆరోగ్యం బాగా ఉన్నంతకాలం ఇండియాలో చనుబాలు ఇవ్వటం ఎంతకాలం వీలైతే అంత కాలం మంచిది. బిడ్డకు 5, 6 నెలల వయస్సు రాగానే చనుబాలు చాలవు. బిడ్డ దాని మీదే పూర్తిగా ఆధారపడకుండా అనుబంధ ఆహారం ఇవ్వాలి. రెండో ఏడు వచ్చేవరకు పాక్షికంగా చనుబాలు ఇస్తూండవచ్చు.

చనుబాలు ఇవ్వకూడని పరిస్థితులు కూడా కొన్ని ఉన్నాయి:

1. తల్లిలో ఊపిరితిత్తుల క్షయవ్యాధి ఉన్నప్పుడు...
2. ఆమెలో కుష్ఠువ్యాధి ఉన్నప్పుడు...
3. చనుబాల వల్ల తల్లికి మానసికమైన ఒత్తిడులు కలుగుతున్నప్పుడు - తల్లికి ఇంటి వెలుపల ఏదైనా పని పాటలు చేయవలసిన పరిస్థితి ఏర్పడినప్పుడు లేదా బిడ్డ పట్ల వైముఖ్యం ఉన్నప్పుడు....
   తల్లికి గుండెజబ్బు, మూత్ర పిండాల వ్యాధి, తీవ్రమైన పాండురోగం ఉన్నప్పుడు...
5. రొమ్ము కాన్సర్ - రొమ్ము మీద హాని కలిగించే గడ్డ ఉన్నప్పుడు...

బిడ్డకు చనుబాలు ఇవ్వటం తాత్కాలికంగా నిలిపివేయవలసిన పరిస్థితులు మరికొన్ని:

1 తీవ్రంగా టైఫాయిడ్, న్యుమోనియా వ్యాధులు తల్లికి వచ్చినప్పుడు...
2. రొమ్ము నొప్పి, చంటి మొనలు పగలటం, రొమ్ముపై లోతైన పగుళ్ళు ఏర్పడటం జరిగినప్పుడు...

బిడ్డ సరిగ్గా పాలు చప్పరించలేని పరిస్థితి ఏర్పడినప్పుడు చనుబాలు ఇవ్వటం నిలిపివేయాలి:

1. పాలు తాగే సహజ చర్య లేకపోవటం....
2. పగిలిన అంగిలి, తొర్రి పెదవి వంటి శారీరక వైకల్యాలు కలిగి ఉండటం...
3. నోరు పుండు కావటం....

పాలిచ్చే తల్లి గర్భవతి అయ్యే అవకాశాలు తక్కువ. అత్యధిక స్త్రీల గర్భధారణ గురించి పరిశీలిస్తే ఇది నిజం కావచ్చు. అయితే కుటుంబ నియంత్రణకు చనుబాలు ఇవ్వటం ఒక్కటే నమ్మకమైన పద్ధతి మాత్రం కాదు!

## తెలుసుకోదగిన విషయాలు

### మోనాలిసా చిత్రం




*మోనాలిసా చిత్రాన్ని చిత్రించడానికి లియోనార్డో డా విన్సీకి నాలుగు సంవత్సరాలు పట్టింది.*

### ప్రపంచంలో మధురాతి మధురమైన పండు

*ఆఫ్రికా నైజీరియాలో సెరెండిపిటీ బెర్రీ పండు సహజమైన మధురాతి మధురమైన పండు. ఇది పంచదార కంటే 1,500 రెట్లు ఎక్కువ తీపి!*

### గుయారా జలపాతం

*దక్షిణ అమెరికా పరానా (Parana) నది మీద పెరాగ్వే మరియు బ్రెజిల్ మధ్య గుయారా జలపాతంలో నీటి పరిమాణం ఉత్తర అమెరికా నయాగరా జలపాతంలో నీటి పరిమాణం కంటె 9 రెట్లు ఎక్కువ.*

"అసలు ఎంపిక చేసుకోకపోవటమే ఒక్కొక్కప్పుడు మంచి ఎంపికగా కనిపిస్తుంది."

# ఉత్తేజ కేంద్రం, మేధా చిహ్నం-మెదడు

కేంద్ర నాడీ మండలంలో అత్యంత ప్రధానమైనది, చిక్కైనది - మెదడు తనకు తాను పని చేయని నాడీ విధానాన్ని, సున్నితమైన జ్ఞానేంద్రియాలను ఉత్తేజపరిచే సమన్వయ కేంద్రంగా పని చేస్తుంది జీవకణాలలోని ఖాళీలను పూరించేందుకు గంటకు 200 మైళ్ళ వేగంతో నరాలలో ఉత్సాహశక్తిని ఉద్దీపింపచేస్తుంది. ఈ సంకేతాలన్నీ ఒక గమ్యంవైపే సాగిపోతుంటాయి




చూపు, వినికిడి, వాసన, రుచి, స్పర్శ, వేడిమి, బాధ వంటి జ్ఞానేంద్రియాలను మెదడు అజమాయిషీ చేస్తుంది శరీరం కదలిక, ఆలోచన, జ్ఞాపకశక్తి - వీటిని కూడా నిర్దేశిస్తుంది

నాడీ కణాలతో నిర్మితమైన మెదడు పురుషునిలో దాదాపు 1.4 కిలోల బరువు ఉంటుంది. స్త్రీ మెదడు 9 కిలోల బరువు ఉంటుంది వీటిలో 10 బిలియన్ల (10,000 మిలియన్ల) జీవాణువులు ఉంటాయి మెదడులోని ప్రతీ జీవాణువు రెండు పనులు నిర్వహిస్తుంది జ్వలించటమో లేక నిల్చిపోవటమో?

మెదడులోని ముఖ్యభాగాలు- బృహన్మస్తిష్కం (సెరిబ్రం), సెరిబెల్లం (చిన్న మెదడు), స్టెమ్. మెదడులో 90 శాతం బరువుగల సెరిబ్రం జ్ఞాపశక్తికి కేంద్రంగా, మేధా పటిమకు స్థానంగా భావించబడుతూంది సెరిబెల్లం కండరాల విధిని నిర్దేశించి శరీర కదలికలను సమన్వయపరుస్తుంది శరీర స్థితిని, సమతౌల్యాన్ని నిర్వహిస్తుంది కండరాల ఒత్తిడిని, పని తీరును, చక్కదిద్ది 'నడక' వంటి కదలికలను సమన్వయిస్తుంది.

మెదడును వెన్నెముకతో కలిపే 'స్టెమ్' భాగం నరాల జీవాణువులతో కూడిన ఒక లావు త్రాడులాగా వీపు ప్రక్కటెముకలను తాకుతుంది తద్వారా శరీరంలోని ఇతర నరాలన్నిటికీ మెదడుతో సంబంధం కలుగజేస్తుంది

మెదడు మొత్తం సన్నని చర్మపుపొరతో చుట్టుకుని ఉంటుంది దీనివల్ల గాయాల నుంచి రక్షణ కలుగుతుంది. దీనిలోని ధమనులు మెదడుకు రక్తప్రసరణం చేస్తాయి

శరీరం విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు రక్తంలోని ప్రాణవాయువు 25 శాతం మేరకు మెదడు వినియోగించుకుంటుంది అయినప్పటికీ శరీరపు బరువులో మెదడు 2 శాతం మాత్రమే ఉంటుంది

ప్రాణవాయువు లేని పక్షంలో మెదడులోని జీవాణువులు మరమ్మత్తుకు వీలులేనంతగా దెబ్బతిని నశిస్తాయి మెదడు జీవాణువులను పునరుజ్జీవింప చేయలేదు. ఆధునిక నాగరికత ఫలితంగా పుర్రెలోని రక్తనాళాలు రోగగ్రస్తం కావటం, దీని ఫలితంగా నరాల వ్యాధులు రావటం జరుగుతున్నది

(మిగతా 49 వ పేజీలో)

"అలవాట్లు, ఆశలు, విశ్వాసాలు నిర్మించుకునే సమయం యౌవన దశే."

జాన్ రస్కిన్

# విజయశ్రీ విహారభూమి - ఉజ్జయిని

ఎన్.రామకృష్ణ

ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్రాలలో ఉజ్జయిని ఒకటి ప్రాచీనకాలంలో అమరావతి, అవంతిక, పద్మావతి, శివపురి, విశాల — అనే వివిధ పేర్లతో వ్యవహరించబడేది జైన మతస్థుడైన అవంతి పాలకుడు సుధన్వ మహారాజు ఈ ప్రదేశానికి 'ఉజ్జయిని' అని నామకరణం చేసాడు 'ఉజ్జయిన' అంటే జైనమతం అభివృద్ధి చెందిన స్థలమని అర్థం



River Kshipra

మాళ్వదేశానికి రాజధాని ఉజ్జయిని విఖ్యాతి చెందిన రాజేంద్రుడు విక్రమాదిత్యుడు ఇక్కడి నుండే పరిపాలించాడు శాలివాహనుడు కూడా ఇక్కడి నుంచే రాజ్యాన్ని ఏలాడు విక్రమ శతాబ్దం, శాలివాహన శతాబ్దం - ఇక్కడి నుంచే వ్యవహరించబడ్డాయి భర్తృహరి, వరరుచి, కాళిదాసు, హర్షుడు, ధన్వంతరి, భానుడు, బాణుడు, దండి, భవభూతి మొదలైన మహాకవులు, పండితులు ఇక్కడే నివసించారు నగరాన్ని ఆనుకుని ఉన్న చిన్న కొండ నగర సౌందర్యానికి దోహదం చేస్తున్నది క్షిప్రా నది ఒడ్డున ఎన్నో స్నాన ఘట్టాలు నిర్మించారు ఇక్కడికి 2 కి.మీ.ల దూరంలో ప్రాచీన నగరం మాళ్వా ఉన్నది. ఈ నగరం చుట్టూ నిర్మించిన కోట విక్రమాదిత్యుని నిర్మాణం.

కాళికామాతకు సమర్పించిన రెండు ప్రసిద్ధ దేవాలయాలు ఉజ్జయినీలో ఉన్నాయి. వీటిలో ఒక దేవాలయంలో విక్రమాదిత్య చక్రవర్తి పూజలు చేసి, అర్చనాదులు నిర్వహించేవారు. 2 కి.మీ.ల దూరంలో ఉన్న మరో దేవాలయంలో కాళిదాసు ఆరాధన చేసేవారు

క్షీరసాగర మధన సమయంలో అమృతం ఒక కలశంలో నింపారు కొందరు దానిని సంగ్రహించేందుకు ఒకరి చేతుల నుండి మరొకరి చేతులలోకి మార్చటం జరిపారు. దీని ఫలితంగా అమృతం చింది హరిద్వార్, ప్రయాగ (అలహాబాద్), నాసిక్, ఉజ్జయినీలలో పడింది. దీని వల్ల ఉజ్జయిని ప్రఖ్యాతి పొందింది

క్షిప్రానది ఉద్భవానికి అత్రి మహాముని మూల కారకుడు ఈ నదికి ఎన్నో దివ్యశక్తులు ఉన్నాయని ప్రతీతి ఇది మహా కాళేశ్వర దేవాలయ సమీపంలో ప్రవహిస్తుంది ఇక్కడ 'శివగంగ' పేర పుష్కరిణి ఉంది ఈ పుష్కరిణి జలాలు ఎప్పటికప్పుడు రంగు మారుతుంటాయి. ఉజ్జయినిలోని ప్రసిద్ధ

( 48 వ పేజీ తరువాయి)

మెదడు నిర్మాణంలోని క్లిష్టత, వివిధ విభాగాలతో దాని సంబంధాలు, దాని జీవ రసాయన శాస్త్రం - వీటినిబట్టి ఒక వ్యక్తి మేధాశక్తి ఉంటుంది కాని అతని మెదడు సైజునిబట్టి కాదని సాధారణంగా విశ్వసించబడుతున్నది

"నీ శత్రువుల్ని గమనించు నీ తప్పుల్ని మొదటగా కనుగొనేది వారే."

విఘ్నేశ్వరుని ఆలయంలో 'జనగణపతి'ని ప్రజలు దర్శించి పూజిస్తారు.


Maha Kaleswar

శ్రీకృష్ణ బలరాముల విద్యా గురువైన సాందీప మహర్షి ఆశ్రమం కూడా ఉజ్జయినీలోని ఒక ప్రముఖ స్థలంగా పేర్కొనవచ్చు. అదేవిధంగా భర్తృహరి గుహ కూడా మరో ముఖ్యమైన చోటు.

'సింహహస్త కుంభమేళా' పేరుతో పన్నెండేళ్ల కొకసారి ఉజ్జయినీలో కుంభమేళా జరుపుతారు

పశ్చిమ రైల్వేలో ఉజ్జయిని ఒక కూడలి. మధ్యప్రదేశ్‌లో రట్లాం, ఇండోర్, ఫతేబాద్, చంద్రావతి గంజ్ నుంచి ఉజ్జయిని చేరుకోవచ్చు. విక్రమాదిత్యుడు ఆరాధించిన కాళికాదేవి 'హర సిద్ధి మాతా' అని పిలువబడుతుంది

దేవాలయంలోని ప్రధాన లింగం భూమట్టానికి క్రింద ఉంటుంది పద్మ పురాణంలో ప్రస్తావించబడిన మూడు ప్రఖ్యాత శివలింగాలు - తారక లింగం, హాటక లింగం, మహాకాళ లింగం - వీటిలో ఒకటిగా ఉజ్జయిని శివలింగం పేరొందింది. ఉదయపూర్ జయసింహ రాజా నిర్మించిన ప్రఖ్యాత నక్షత్ర వేధశాల (Observatory) ఉజ్జయిని దక్షిణ భాగంలో ఉంది.

మౌర్య చక్రవర్తి అశోకుడు 263 బి.సి.లో ఉజ్జయినిని రాజధానిగా చేసుకున్నాడు. 1295 ఎ.డి. నుండి 1317 ఎ.డి. వరకు అల్లావుద్దీన్ ఖిల్జీ ఈ ప్రదేశాన్ని పరిపాలించాడు. ఇది 1531 ఎ.డి.లో గుజరాత్‌లో కలుపుకోబడింది. 1571 ఎ.డి.లో మొగల్ చక్రవర్తి అక్బర్ దీన్ని జయించాడు. 1810 ఎ.డి.లో ఇది సింథియా మహారాజుల పాలన క్రిందికి వచ్చింది.

ఉజ్జయినికి విజయాల నగరమనే అర్థం కూడా ఉంది. చైనా యాత్రికుడు హుయాన్ త్సాంగ్ వంటి విదేశీయులు ఈ నగరాన్ని గురించి వ్రాశారు.

## తేనెటీగలకు అపాయం లేకుండా వాటి విషం గ్రహించడం



రష్యాలో శాస్త్రజ్ఞులు తేనెటీగలకు ఏ మాత్రం అపాయం లేకుండా వాటి నుండి విషాన్ని సంగ్రహించడానికి ఒక పరికరాన్ని కనిపెట్టారు. తేనెటీగల విషానికి వ్యాధి నివారక లక్షణాలు ఉన్నాయి. దీనిని అనేక ఔషధాల తయారీలో ఉపయోగిస్తారు. ఒక పల్చటి గాజు పలక దానిపై తీగవల ఉండే పరికరాన్ని తేనెపట్టు మీద ఉంచుతారు తీగవల గుండా ప్రేరక విద్యుత్తును పంపుతారు దీనివల్ల తేనెటీగలకు కలిగిన అసౌకర్యంతో అవి రేగి వలను ఎదుర్కొని ఆ గాజు పలకల మీద కొద్ది కొద్దిగా విషాన్ని వదులుతాయి.

'నా శత్రువుల్ని నాకు అత్యంత ఉపకారులుగా భావిస్తాను నా బలహీనతల్ని బహిరంగ పరచి, నాగురించి చెడుగా మాట్లాడే వారు నాకు మహోపకారం చేస్తున్నారు.''
— శ్రీ ఆచార్య వినోబా భావే

# ఈ విశాల విశ్వంలో వింతగొలిపే పుస్తకాలు

**ధర్మేష్ వి. దావంకర్**

ఎర్నెస్ట్ రైట్ నవల 'గాడ్స్‌బీ' పూర్తిగా సృజనాత్మక రచన. 'ఇ' అనే అక్షరం వాడకుండా 50,110 మాటలతో ఈ రచన చేశారు. ఈ 'ఇ' లేని నవల పూర్తి చేసేందుకు ఆయనకు 165 రోజులు పట్టింది. 1939లో అమెరికాలో ప్రచురించినప్పుడు దీని వెల 3 డాలర్లు. ఈ రోజున ఒక ప్రతి కావాలంటే 1000 డాలర్లు ఇవ్వాలని పుస్తక విక్రేతలు డిమాండ్ చేస్తున్నారు.



ఇటువంటి అరుదైన పుస్తకాల గురించి మాట్లాడుకునేటప్పుడు గుటెన్‌బర్గ్ బైబిల్‌ని ఎంతో విలువైన గ్రంథంగా చెప్పవచ్చు. 1454లో పశ్చిమ జర్మనీలో మెంజ్‌లో ముద్రితమైన ఈ బైబిల్ ఒక కాపీని 1978లో అమెరికాలోని టెక్సాస్ యూనివర్శిటీ కైవసం చేసుకుంది. ఈ గ్రంథాన్ని 2,400,000 డాలర్లకు కొన్నారు.

అతి పురాతన ముద్రిత గ్రంథం కొరియాలో తయారైందని కొద్దిమందికే తెలుసు. అక్షరాలను తలక్రిందులు పద్ధతిలో ఉంచి కొయ్య బ్లాక్‌లతో ముద్రణ చేయటం బౌద్ధ ఆరామాలలో అమలు చేసేవారు. 704 ఎ.డి.లో కొరియాలోని క్యంజియులో ముద్రితమైన బుద్ధ సూత్రాలే ప్రపంచంలో ప్రాచీనమైన మొదటి ముద్రిత కాగితపు చుట్టలని తెలుస్తూంది

## మీ విజ్ఞానం పరీక్షించుకోండి

### జవాబులు

**క్విజ్** : 1 (సి) చోళులు, 2. (సి) మన నైతిక విలువలకు వ్యతిరేకంగా ఉండే సంప్రదాయాలను అచరించకూడదు, 3. (ఎ) పప్పులు, 4 (సి) అరబిందో ఘోష్, 5. (బి) బొంబాయి, 6 (ఎ) థర్మోస్టాట్, 7. (డి) సీ ఆఫ్ ట్రాన్క్విలిటీ, 8. (సి) ప్రధాన మంత్రి.

**మాటల మహిమ** : 1. (బి) పిల్లనగ్రోవి, (సి) రక్తనాళము, (డి) వెదురు బియ్యము; 2. (ఎ) అడవి యల్లము, (బి) అడవి ప్రత్తి, (సి) చిన్న కచ్చోరము, (డి) అడవి పెసర; 3. (ఎ) అడవిలో పుట్టినది, (బి) అడవి ఏనుగు, (సి) అడవి మాదీ ఫలము, (డి) పద్మము, తామరపువ్వు 4. (బి) శివుడు, (సి) బలరాముడు, 5 (ఎ) చూచువాడు, (బి) పరిశీలించువాడు, (సి) చూపువాడు, (డి) నిపుణుడు, 6 (ఎ) గ్రద్ద (బి) పండితుడు, (సి) దూర మందలి దానిని చూచువాడు, చూపునది, (డి) ఋషి, 7 (బి) పెద్ద ఢంకా; 8. (ఎ) ఉసిరిక, (బి) దాది, (సి) దనియపు మొక్క,

**తెలివికి పరీక్ష**: 1. (సి) కావేరీ డెల్టా, 2 సింహగర్జన, 3 (సి) ఒక ప్రసిద్ధ పెయింటింగ్, 4 (బి) నలుపు, 5. (డి) రచయిత, జర్నలిస్టు, ఫిలిం నిర్మాత, 6. (ఎ) వేయి పడగలు

"మెచ్చుకోలు-ఒక అద్భుతమైన విషయం ఇతరులలోని శ్రేష్ఠత్వం మనను కూడా చెందేటట్లు చేస్తుంది!" — ఓల్టైర్

అరుదైన గ్రంథాలు హెచ్చు ధరలు సంపాదిస్తే ఆశ్చర్యపడనక్కరలేదు. అయితే 1962లో ప్రచురితమైన ఒక రచనకు 15 లక్షల రూపాయలు లభించటం మాత్రం ఆశ్చర్యకరమైన అంశమే! స్పానిష్ పెయింటర్ సాల్వడర్ డాలీ వ్రాసిన 'ది అపోకలిప్స్' అనే పుస్తకానికి ఈ మూల్యం లభించింది'

'సూపర్ బుక్' అని పిలువబడుతున్న ప్రపంచంలోనే అతి పెద్ద పుస్తకం అమెరికాలో ప్రచురించారు 9 అడుగులు × 10 అడుగులు చుట్టుకొలతలతో 300 పేజీలుగల ఈ గ్రంథం 253 కిలోల బరువుంది 1976లో అమెరికా కొలరాడోలోని డెన్వర్‌లో ఈ బృహద్గ్రంథాన్ని ప్రచురించారు

అతి చిన్న పుస్తకం తయారుచేసిన ఘనత జపాన్‌కు చెందుతుంది 'అరి' (చీమ) అనే పేరుగల ఈ పుస్తకం 1 18×1 18 అంగుళాలు ఉంటుంది 1980 జూన్‌లో టోక్యో (జపాన్) లోని అసాహి హొంషియో దీన్ని ముద్రించింది

కొందరు ఎందుకూ ఎవరికీ ఉపయోగించని విలువలేని పుస్తకాలు వ్రాసి తమ కాలాన్ని ఇతరుల కాలాన్ని వృథా చేస్తారు ఈ క్రింది శీర్షికలతో వెలువడే పుస్తకాలను మీలో ఎందరు కొంటారో చెప్పండి 'టేబిల్ తుడిచే గుడ్డల్ని మడవటం', 'స్నానాల తొట్టెల్లో సినీ తారలు', 'లాస్ ఏంజిల్స్ లోని మురికి కాల్వల వైభవాలు', 'ఇంగ్లీష్ విహార యాత్రలు' వంటివి వీటిల్లో కొన్ని మాత్రమే

హిమాలయ రాజ్యం భూటాన్‌లోని టెక్ట్సాంగ్ బౌద్ధ సన్యాసుల మఠంలో విచిత్ర గ్రంథాలను విలోకించవచ్చు ఒకటి విడిచి మరొక పంక్తి బంగారంతోనూ, తెల్లని అక్షరాలతోనూ నల్లని పేజీల పైన వ్రాయబడిన ఒక చిన్న పుస్తకం ఇక్కడ ఉన్నది. బంగారపు ఇంక్‌ని నిజమైన బంగారంతోనే తయారుచేసారు. ప్రపంచంలో విచిత్రంగా కనిపించే పుస్తకం ఇదే కావచ్చు

— 'ది టీనేజర్' సౌజన్యంతో

●

## 10,000 డాలర్లకు నేను దానిని కొంటాను


VOLTAIRE

ఒకసారి వోల్టేర్ ప్రష్యా రాజుతో క్లీవ్స్‌లోని అతని కోటలో భోజనం చేస్తున్నారు తరువాత సంభాషణలో ఫ్రెంచ్ నిరీశ్వరవాది ఎత్తాన్ని నిరసించడానికి అవకాశాన్ని జారవిడుచుకోలేదు అతిథులు మొత్తం మొదట నిశ్శబ్దంగా వినడం ప్రారంభించారు ఇంతలో లావుగా ఉండే బుర్గో-మాస్టరు కోపంతో లేచి ఎగతాళి చేయడం ప్రారంభించాడు

'నా మాటకు వస్తే' అంటూ వోల్టేర్ స్వర్గంలో 'నా చోటు ఒక ప్రష్యన్ డాలర్‌కి అమ్ముతాను' అన్నాడు 'వోల్టేర్ మహాశయా' అంటూ బుర్గో-మాస్టర్ 'మేము ప్రష్యాలో స్వంతవారుడికి చెందుతుందో లేదో తెలుసుకోకుండా ఖరీదైన వస్తువు దేనినీ కొనం స్వర్గంలో నీ చోటుకి అర్హత చూపించుకుంటే దానిని పదివేల డాలర్లకు కొంటాను' అన్నాడు దానికి నిరీశ్వరవాది జవాబు చెప్పలేకపోయాడు.

"భాగ్యం-ఒక మంచి చెలికత్తె-కానీ బహు చెడ్డ గృహ యజమానురాలు "

— బేకన్

# 'వుని మనిషి ఎవరు?

స్వామీ కృష్ణానంద

వేదాంగాలు చదవటం, వేదాంత గ్రంథాలు అధ్యయనం చేయటంద్వారా శాంతం, నిష్కాక్కికత, నిర్మోహం వంటి ఉన్నత మానవ విలువలను అభివృద్ధి చేసుకోవచ్చు అయితే చిక్కుగా కనిపించే కొన్ని వేదాంత గ్రంథాలు అపాయ కరమైన ధోరణులు కలిగి వాస్తవానికి సహాయ కారులు కావు ఇంతేకాక ఇట్టి వేదాంతం అభ్యసించేవారు అర్హతలేనివారు, అహంకారులు, స్వార్థపరులు, జీవులపట్ల ప్రేమలేనివారుగా తయారవుతారు



మనదేశంలోని వివిధ ప్రాంతాలలో దేవుణ్ణి గురించి ప్రసంగించేవారు, ధ్యాన సమావేశాలు జరిపేవారు మనకు తటస్థపడుతుంటారు లేదా ఇటువంటివారిని గురించి మనం వింటూంటాము వీరు అధిక సంఖ్యలో ప్రజల్ని ఆకర్షిస్తారు కూడా అయితే నిజానికి వీరంతా గొప్ప వ్యక్తులా?

కాదు నిజమైన మహనీయుడు తనకు తాను గొప్పగా చెప్పుకుని ముందుకురాడు మూఢులైన అనుయాయుల అబద్ధపు విశ్వాసాలు ఎవరినైనా గొప్పవ్యక్తిగా చిరకాలం ఉంచలేవు! చెట్ల వ్రేళ్లు ఏవిధంగానైతే పైకి కనిపించకుండా ఉండి వృక్షాల్ని పోషిస్తాయో, అలాగే సమాజాభివృద్ధికి తోడ్పడేవని నిశ్శబ్దంగా, అగోచరంగా చేయాలి.

ఈ కుహనా (గొప్ప) వ్యక్తులు సంఘంలోని అజాగ్రత్త పరుల్ని తప్పుదారుల వెంట నడి పించటమూ వారి అహంకారాన్ని ఆమో దించటమూ వంటి పనులు చేస్తారు ఆధునిక సమాజంలోని విచక్షణగల ప్రజలు ఇటువంటి గ్రుడ్డి నమ్మకాలను దరిచేరనివ్వరు హేతు బద్ధమైన సందేహాలను సంశోధించి సత్యాన్వేషణకు కృషి చేస్తారు

భగవంతుణ్ణి గురించి ఒకవ్యక్తి ఎంత తేటగా, శక్తివంతంగా మాట్లాడినా అది అతని మేధాశక్తిని తెలుపుతుందే కాని దైవత్వాన్ని ఆపాదించదని మనం గుర్తు పెట్టుకోవటం అవసరం మానవునిలోని విశ్వజనీన ప్రేమ, దయ, నిస్వార్థత, ఔదార్యం మాత్రమే వినయ గుణాలుగా వికసించి అతణ్ణి దైవత్వంలోకి నడిపిస్తాయి ఈ క్రింది సంస్కృత సూక్తి నేను జ్ఞాపకం చేసుకుంటాను "ఆ పక్షి ముక్కు బంగారంతో చేసినా, పాదాలు ఎర్రటి కెంపులతో నిర్మించినా, రెక్కల మీద ముత్యాల కాంతి ప్రకాశింపినా, కాకి కాకే కాని రాజహంస కాబోదు"

## హర్యానాలో అక్షరాస్యత

హర్యానాలో అక్షరాస్యత 35 శాతమే అక్కడ 15 నుండి 35 ఏళ్ళ వరకు వయస్సు ఉన్న వారిలో 21 మిలియన్ మంది నిరక్షరాస్యులుగా ఉన్నారని అంచనా

— 'ది టైమ్స్ ఆఫ్ ఇండియా' సౌజన్యంతో

"చదరంగంలో మాదిరిగానే జీవితంలో కూడా ముందు ఆలోచన వల్ల విజయం కలుగుతుంది."

# ఉల్లాస పరిచే వ్యావృత్తి - తపాలా బిళ్ళల సేకర

ఉల్లాసంగా తీరిక సమయాల్లో చేసే అన్ని సరదా పనుల్లో పోస్టల్ స్టాంపుల సేకరణ మకుటం వంటిది. 'తపాలా బిళ్ళల అధ్యయనం' లేక 'ఫిలటలీ' అని కూడా దీనిని వర్ణిస్తున్నారు. ఈ తపాలా బిళ్ళల సేకరణ అనేది ఏదో ఒక దేశానికి పరిమితం కాదు అందువల్లనే ప్రపంచ వ్యాప్తంగా ప్రజలందరూ ఉత్సాహంతో పాల్గొని ఆనందిస్తున్నారు




స్టాంపులను విడుదల చేసిన మొదటి దేశం గ్రేట్ బ్రిటన్. ప్రపంచంలో ఆ దేశంలో మాత్రమే విడుదల చేసిన తపాలా బిళ్ళలపైన స్వంత పేరు ముద్రించుకోవటం జరగడంలేదు 1839లో జాబులకు ముందుగానే డబ్బు చెల్లించాలనే అంశంపైన ప్రజల సూచనలు కోరుతూ బ్రిటీష్ ప్రభుత్వం ఒక పోటీ నిర్వహించింది ఈ పోటీకి 2500 ఎంట్రీలు వచ్చినా ఏదీ సంతృప్తి కలిగించలేకపోయింది

ఆ సమయంలో సర్ రౌలండ్ హిల్ ఒక కొత్త సూచనతో ముందుకొచ్చాడు కవరు మీద ఒక లేబిల్ (చీటి) అంటించటమనే సూచన చేసాడు. అలా 1840 మే 6వ తేదీన ప్రపంచంలోనే మొట్టమొదటి తపాలా బిళ్ళ విడుదల అయింది.

ఒక పెన్నీ 'బ్లాక్', రెండు పెన్నీల 'బ్లూ' స్టాంపులు విడుదల చేసారు. విక్టోరియా మహారాణి శిరస్సు గల చిత్రంతో ఈ స్టాంపులు తయారయ్యాయి పెన్నీ బ్లాక్‌లో 2,880 విభిన్న రకాల స్టాంపులు వచ్చాయి. వీటి మీద తపాలా బిళ్ళ రద్దు ముద్ర (కాన్సిలింగ్ పోస్టుమార్క్) బాగా కనపడేది కాదు కాబట్టి వీటిని 1841లో ఉపసంహరించుకున్నారు అప్పుడు రంధ్రాలు వేసే మెషీనులు (perforating machines) తయారు కాలేదు తపాలా బిళ్ళల్ని కత్తెరతో కత్తిరించవలసి వచ్చేది రంధ్రాలు వేసే మెషీనులు 1851లో మొదటిసారిగా తయారుచేసారు.

మొదటి తపాలా బిళ్ళల సేకరణ ఎప్పుడు ప్రారంభమైందో, మొదటి సేకరణదారుడెవరో కూడా ఎవరికీ తెలియదు తపాలా బిళ్ళలు వెలువడటం మొదలుకాగానే వీటిని సేకరించటం ప్రారంభించినవారు బ్రిటీష్ మ్యూజియంలో ఉద్యోగి డా జాన్ గ్రే కావచ్చు లేదా డా. గ్రే ప్రారంభించిన సమయంలోనే స్టాంపుల సేకరణ జరిపిన మరో ఫ్రెంచి వ్యక్తి విక్టర్ వెటిజిల్ అయినా కావచ్చు 1861లో స్ట్రాస్‌బర్గ్‌లో మొదటి తపాలా కేటలాగు ముద్రితమైంది

## విషాదం నుంచి వెలుగు

పురుగులు ! ఉత్సాహంగా ఉంటాయి కానీ గొంగళి పురుగు నుంచే అందమైన సీతాకోక చిలుక పుడుతుంది. ఎడారులు ఎంతో ఉత్సాహంగా ఉంటుంది కాని అక్కడి నుంచే వేసవి మందానికి పైన మిణుగురులు జన్మిస్తున్నాయి మాలిన్యం నుంచి పుష్పాలు. విషాదం నుంచే వెలుగు పుట్టుకొస్తున్నాయని మనం తెలుసుకోవాలి

“మమ్మల్ని ఆకర్షణలలోకి లాగకు, కానీ కీడునుంచి తప్పించు”

1863లో స్టాంప్స్ సేకరించే వారికోసం ఒక పత్రిక తొలిసారి ప్రారంభమైంది. (ఇప్పుడు ఇటువంటి పత్రికలు 250 ఉన్నాయి). 1865లో పారిస్ (ఫ్రాన్స్)లో మొదటి తపాలా బిళ్ళల వేలంపాట జరిగింది.



అమెరికా ప్రెసిడెంట్ ఫ్రాంక్లిన్ డి. రూస్‌వెల్ట్ స్టాంపుల సేకరణలో అత్యుత్సాహం చూపేవారు. అత్యధిక సంఖ్యలో స్టాంపులను సేకరించిన వ్యక్తి కూడా ఆయనే ఈనాడు ప్రపంచంలో స్టాంపుల సేకరణలో ప్రసిద్ధి చెందినది - బ్రిటీష్ చక్రవర్తి ఐదవ జార్జి స్టాంపుల సేకరణ. 300 ఆల్బములు పైగా ఉన్న ఈ స్టాంపులను బకింగ్‌హామ్ పాలెస్‌లో భద్రపరచారు. ప్రతీ రోజూ వీటిల్లో కొత్తవి చేరుతూంటాయి. లండన్‌లోని బ్రిటీష్ మ్యూజియంలో అపురూపమైన ఎన్నో స్టాంపులు సేకరించి భద్రపరచారు. స్విట్జర్లాండ్‌లోని బెర్న్‌లో ఉన్న యూనివర్సల్ పోస్టల్ యూనియన్ కూడా ఎన్నో అమూల్య స్టాంపుల సేకరణ జరిపింది.

అలా అని పాతస్టాంపులు మాత్రమే అరుదైనవి కాదు. వీటిలో కొన్ని అతి ఆధునికమైన తపాలా బిళ్ళలు కూడా ఉన్నాయి 1918లో ఒక యువకుడు వాషింగ్టన్ జనరల్ పోస్టాఫీసుకు వెళ్ళి అప్పుడే విడుదలయిన 24 సెంట్ల ఖరీదు గల ఎయిర్ మెయిల్ స్టాంపులు 100 కొన్నాడు. కొన్నాళ్ళకు వీటి విలువ రెట్టింపు లేదా ఇంకా ఎక్కువ కావచ్చునని అతని ఉద్దేశం. కొన్ని గంటల తరువాత పోస్టాఫీస్ గుమాస్తా అతని ఇంటికి వెళ్ళి స్టాంపుల్ని గురించి వాకబు చేసాడు ఆ స్టాంపుల ముద్రణలో పొరపాటు జరిగిందని, అవి తప్పుగా ముద్రించబడ్డాయని, వాటిని ఎవరికీ విక్రయించకూడదని చెప్పాడు.

## 10 మొదలు 15 మిలియను మందికి బొద్దింకలంటే ఎలర్జి

యునైటెడ్ స్టేట్స్‌లో ఎలర్జిస్టు అండ్ నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హెల్త్ వారి అధ్యయన ఫలితంగా అమెరికాలో 10 మొదలు 15 మిలియను మందికి బొద్దింకలంటే ఎలర్జీ అని తేలింది ముక్కు కారటం, ఒళ్ళు మంట దగ్గర నుంచి ఊపిరి తీసుకోవడమే



బ్రహ్మాండం అయిపోయి కొంతమంది సుకుమారులకు షాకు వల్ల మరణందాకా రకరకాల ఎలర్జిక్ రియాక్షనులు కలిగిస్తున్నాయి బొద్దింకలంటే భయపడిపోయే ఆస్త్మా రోగులకు బొద్దింక వల్ల వ్యాధి విపరీతంగా పరిణమిస్తుంది గత 25 సంవత్సరాలలో యునైటెడ్ స్టేట్స్‌లో కీటకాలకు ఎలర్జీ అభివృద్ధి చెందడానికి ముఖ్య కారణం నివాస గృహాలు గాలి ప్రవేశించకుండా ఎయిర్‌టైట్‌గా నిర్మించడం వల్లనే అని శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. అభివృద్ధి పొందుతూన్న దేశాలలో బాగా వెలుతురు ప్రవేశించే ఇండ్లలో నివసించేవారికి ఎలర్జీలు తక్కువగా ఉంటున్నాయి

— 'సిఇఇ - ఎస్ఎఫ్ఎస్' సౌజన్యంతో

"వినటం నేర్చుకో! అప్పుడు చెడుగా మాట్లాడేవారివల్ల కూడా నీకు లాభం చేకూరుతుంది."

— ప్లూటార్క్

అయినప్పటికీ ఆ యువకుడు స్టాంపుల షీటు తిరిగి ఇచ్చేందుకు నిరాకరించాడు కొన్నాళ్ల తరువాత అతడే దీనిని 15,000 డాలర్లకు విక్రయించాడు ఇప్పుడు ఈ స్టాంప్ విలువ ఒక్కొక్కటి 1000 పౌండ్లకు పైగా ఉంటుంది

అరుదైన స్టాంపుల్లో ఫోర్జరీలు కూడా ఎక్కువే ఫోర్జరీ స్టాంపుల్ని అసలైన స్టాంపులని చెప్పి అమ్ముకునేవారు ఎంతో డబ్బు సంపాదిస్తున్నారు. ఉదాహరణకు ఒక ఆంగ్లేయ తపాలా గుమాస్తా స్వంతంగా షిల్లింగ్ స్టాంపుల్ని ముద్రించి మంచి లాభాలకు అమ్ముకునేవాడు ఈ గుమాస్తా చనిపోయేవరకు ఈ సంగతి బయటికి రాలేదు.

1856లో ముద్రించిన బ్రిటీష్ గయానాలోని ఒక సెంట్ బ్లాక్ మజెంటా స్టాంప్ ప్రపంచంలోనే అపూర్వం, అమూల్యం అయిన స్టాంపుగా చెబుతారు అటువంటిది ఇప్పుడు ఒక్కటే లభ్యమవుతున్నట్టు తెలుస్తొంది బ్రిటీష్ గయానాలో నివసిస్తున్న ఒక బాలుడు 1872లో ఇటువంటి స్టాంపును సేకరించి స్నేహితుడికి 6 డాలర్లకు అమ్మివేసాడు ఈ స్టాంప్ ధర తరువాత పెరుగుతూ వచ్చింది చివరికి ప్రఖ్యాత స్టాంప్ కలక్టర్ కౌంట్ ఫిలిప్ వాన్ ఫెర్రరీ 150 పౌండ్లకు దీన్ని కొనటం జరిగింది

కౌంట్ 1917లో చనిపోగానే ఫ్రెంచి ప్రభుత్వం అతని సేకరణలను స్వాధీనం చేసుకుని 800,000 పౌండ్లకు విక్రయించింది వీటిలో చాలావాటిని అమెరికన్ కోటీశ్వరుడు కీర్తిశేషుడు ఆర్థర్ హింద్ కొన్నాడు అలాగే ఈ స్టాంప్‌ను కూడా 15,000 పౌండ్లు ఇచ్చి కొన్నాడు 1970లో దీనిని 280,000 డాలర్లకు మళ్లీ విక్రయించారు.

1847 నాటి రెండు పెన్స్ ఖరీదు గల మరుషియస్ ఆరెంజ్ పోస్టాఫీస్ స్టాంపులు 1968లో 380,000 డాలర్లకు విక్రయించారు.

'కర్టిస్ జెన్నీ' (Curtiss Jenny) అనే 24 సెంట్లు ఖరీదుగల 1918 నాటి స్టాంపులు నాలుగు 1.1 మిలియన్ డాలర్లకు విక్రయమై స్టాంపుల అమ్మకాలలో ప్రపంచ రికార్డు సృష్టించాయి. దీనిపైన ఒక బోర్లించిన విమాన ప్రతిబింబం ముద్రితమై ఉంటుంది 1989 అక్టోబర్ 12న న్యూయార్క్‌లోని క్రిష్టీ వారు వేసిన వేలంలో ఒక పేరు చెప్పని (అనామక) [illegible] వీటిని కొన్నాడు ●

## మొదటి పనితో ప్రారంభించు

బెతల్‌హాం స్టీల్ మాజీ అధ్యక్షుడు మరియు సంవత్సరానికి ఒక మిలియను డాలర్లు వేతనం పుచ్చుకునే ఛార్లెస్ స్క్వాబ్ ముఖ్యమైన పెద్ద పెద్ద పనులు చెయ్యటానికి వీలుకాకుండా చెయ్యవలసిన చిన్నచిన్న పనులు ఎక్కువ పేరుకు పోవటం చూసి ఐవీలీ అనే ఒక మేనేజ్‌మెంట్ కన్సల్టెంట్‌ను సంప్రదించాడు. [illegible] కన్సల్టెంట్ స్క్వాబ్‌కు ఒక చిన్న కాగితం ఇచ్చి 'రేపు నీవు చెయ్యవలసిన ఆరు ముఖ్యమైన విషయాలను ప్రాధాన్యతా క్రమంగా వ్రాసి పెట్టుకో



రేపు ఉదయం మొట్టమొదట మొదటి పనితో ప్రారంభించు దాన్ని పూర్తిచేసి తరువాత రెండవ పనిని ప్రారంభించు' అన్నాడు స్క్వాబ్ అలాగే చేసి అది తనకు బాగా ఉపకరించినట్లు తెలుసుకున్నాడు తన స్నేహితులకు కూడా అలాగే చేయమని చెప్పాడు కన్సల్టెంట్‌ను అభినందిస్తూ 25,000 డాలర్ల చెక్కును పంపాడు

"మరణం - జీవితంలో గొప్ప నష్టమైనదేమీ కాదు మనం బ్రతికి ఉన్నప్పుడు మనలోని మంచి గుణాలు మరణించటమే అతి తీవ్రనష్టం."

# మీకుతెలుసా?

## మంచు నడక

ప్రకృతి సిద్ధమైన బహిరంగ మంచు నడక ప్రదేశం ఆగ్నేయ ఆసియా మొత్తం మీద సిమ్లా (హిమాచల ప్రదేశ్)లోనే ఉంది

## పురాతత్త్వ భూమి

రాజస్థాన్‌లోని శ్రీగంగా నగర్ జిల్లాలో ఉన్న కాళిబంగన్ (పిలి బంగన్ సమీపం) సింధు నాగరికతకు సంబంధించిన ఒక పురాతత్త్వ స్థలంగా భావిస్తున్నారు

## నిప్పుకోడి మృతి

ప్రపంచంలోనే వృద్ధురాలైన నిప్పుకోడి 1972లో దక్షిణ ఆఫ్రికాలోని కేప్ ప్రావిన్స్‌లో మరణించింది అప్పుడు దీని వయస్సు 62 సంవత్సరాల, 3 నెలలు

## కారు ప్రయాణం చేసిన మొదటి ప్రెసిడెంట్

కారులో ప్రయాణం, విమానంలో ప్రయాణం చేసిన మొదటి అమెరికన్ అధ్యక్షుడు థియడోర్ రూస్‌వెల్ట్

## జలమయం అర్థగోళం

దక్షిణ అర్థగోళం జలమయంగా ఉండే చోటు. భూమధ్యరేఖ దిగువన గల నేలలో 19 1 శాతం మాత్రమే పొడిగా ఉంటుంది

## పేరులో పెన్నిధి

జ్యూరిచ్ (స్విట్జర్లాండ్) నగరంలోని ప్రముఖ బ్యాంకర్లు, పెట్టుబడిదార్లను 'గ్నోమ్స్' అనే ప్రజాభిమానం గల పేరుతో పిలుస్తారు.

## తిండికేమిలోటు

ప్రతి సంవత్సరం నగటు మనిషి ఒక టన్ను మేరకు ఆహారం, పానీయాలు స్వీకరిస్తాడు.

## నెచ్చెలి

టార్జాన్ స్నేహితురాలి పేరు జేన్

## జపాన్ సాలెపురుగు

జపాన్ సాలె పురుగుల కాళ్లు 12 అడుగులు, ఆపైన సాగి ఉంటాయి!

## కలువ భూమి

కెనడాను తెల్ల కలువల భూమిగా పిలుస్తారు

## మన ప్రాతిపదిక లింకు




మన అందరికీ సామాన్యమైన ఒకటే ప్రాతిపదిక లింకు-మనం అందరం ఈ ప్రపంచంలో నివసిస్తున్నాము మనం అంతా ఒకే గాలిని పీలుస్తున్నాం మనం అందరం మన పిల్లల భవిష్యత్తును భావించుకుంటాం మనం అందరం మర్త్యులమే.

—జాన్ ఎఫ్ కెన్నెడీ

"అసంఖ్యాక మేధావంతుల భావాలు, అనుభవాల క్రోడీకరణే మన విజ్ఞానం."

— రాల్ఫ్ వాల్డో ఎమర్సన్

## చైనాలో పింగాణీ పాత్రలు

తెల్లని, పలచని, చక్కని బంకమట్టితో చైనాలో మొదటిసారిగా పింగాణీ పాత్రలు తయారుచేసారు.

## ఈదలేవు

తిమింగిలాలు వెనుకవైపు ఈదలేవు.

## సుదీర్ఘ ప్రయాణం

గూని తిమింగిలాలు సంవత్సరానికి రమారమి 4,000 మైళ్ళు ప్రయాణం చేస్తాయి.

## యుద్ధంలో రాజుగారు

బ్రిటిష్ రాజు జార్జ్ II యుద్ధరంగంలో పోరాడిన చివరి బ్రిటన్ రాజు. ఇతడు 1743లో డిట్టింజన్‌లో జరిగిన యుద్ధంలో పాల్గొన్నాడు.

## పట్టుపురుగు గూడు

ఒక పట్టు పురుగు గూడు రెండు మైళ్ళ పొడవు గల సిల్క్ వస్త్రాన్ని ఉత్పత్తి చేస్తుంది.

## మహిళా గవర్నరు

ఇండియాలో మొట్టమొదటిసారి ఒక రాష్ట్రానికి నియమించబడిన మహిళా గవర్నర్ సరోజినీ నాయుడు.

## వెనుకంజ కాదు

ఈగలు ఎప్పుడూ వెనుకకు దూకుతూ పారిపోతూంటాయి!

## కండరాల కదలిక

శరీరానికి కదలిక చేకూర్చే కండరాలు 75 శాతం ప్రాణవాయువు వినియోగిస్తాయి.

## బరువు లేని లిథియం

లోహాలలో అతి తేలికైనది లిథియం. హైడ్రోజన్ బాంబుల్లో దీనిని ప్రధానంగా ఉపయోగిస్తారు.

## రసాయనిక పదార్థాలు

మనకు తెలిసిన 10 శాతం రసాయనిక పదార్థాలు ప్రకృతిలో నుంచి వచ్చినవి కావు. మానవుడు సృష్టించినవే.

## విప్లవ చిహ్నం

బాస్టిల్లీ ముట్టడి ఫ్రెంచి విప్లవానికి ప్రారంభ చిహ్నం. ప్రతీ సంవత్సరం జూలై 14న ఫ్రాన్స్‌లో ఉత్సవంగా జరుపుతారు.

## ఒకరోజు ముందు

మౌండీ గురువారం గుడ్‌ఫ్రైడేకి ముందు రోజు.

## చిరునవ్వులు



మానవులకు చిరునవ్వు పువ్వులకు సూర్యరశ్మి వంటిది అత్యల్పమే కావచ్చు కానీ జీవిత పథంలో ఇది వెదజల్లినప్పుడు వాటి మంచి ఊహించ శక్యం కాదు

—ఎడిసన్

'ఇతరులను సంస్కరించేముందు నిన్ను నీవు సంస్కరించుకో.''

# మానవదేహం భగవంతుని అమూల్య బహుమాన

"దేహో దేవాలయ ప్రోక్తో జీవో దేవం సనాతన" అని ఉపనిషత్తులు ఉద్ఘోషిస్తున్నాయి. భగవంతుని ఆలయమే ఈ శరీరం. న్యూటెస్టమెంట్‌లో సెయింట్ పాల్ ఇలా ప్రశ్నిస్తాడు.



'నీవే దేవుని ఆలయానివి భగవంతుని ఆత్మ నీలో నివసిస్తున్నదని ఇంకా తెలుసుకోలేదా?' జొరాష్ట్రియన్ ధర్మశాస్త్ర గ్రంథాలు కూడా మానవునిలో అంతర్గర్భితమైన అగ్నిని గురించి చెబుతాయి. అతని శరీరమే ఒక అగ్ని దేవాలయమని గుర్తు చేస్తాయి.

ప్రతీ మానవజీవి ఒక సాగిపోతున్న దేవాలయం. భగవంతుడు అతడి హృదయ కుహరంలో అధిష్ఠించబడ్డాడు. ఆలయ రక్షకులెవరు? శమదమములు - సమాన దృష్టి, ఇంద్రియ నిగ్రహం. దేవాలయంలోని అమూల్య సంపద ఏమిటి? సర్వజీవుల్లో భగవంతుడు కలడనే భిజ్ఞ.

ఈ దేవాలయంలో మ్రోగే గంట ఏమిటి? దేవుని ఉనికి తెలిపే ఓంకారము లేక ప్రణవ నాదము. ప్రేమను నూనెగా, విశ్వాసాన్ని వత్తిగా, వినయ విధేయతలు అగ్గిపుల్లలుగా, భక్తి గౌరవాలనే జ్యోతిని వెలిగించే భగవద్భక్తుడు జీవాత్మ.

ఈ దేవాలయంలో ఆరాధన చేస్తున్న భక్తుడు సమర్పించే కైంకర్యాలేమిటి? అతడు ఉపయోగిస్తున్న ఆకు - అతని శరీరమనే ఆకు. పుష్పం - అతని నిర్మల హృదయ కుసుమం. ఆ హృదయంలో ఎటువంటి కోరికలు, ... పేరాశ, మమకారాలు, గర్వం, ద్వేషము వంటివి మచ్చుకైనా కానరావు. నిష్కళ్మషమైన అతని హృదయ ఫలంలో అతని చేతల ఫలితాల ప్రభావం ఏమీ ఉండదు. అభిషేకానికి భక్తుడు ఉపయోగించే జలాలు - హృదయం ఉప్పొంగి...

## సిగరెట్టు కాల్చే [illegible]లో కొంతమందికి ఊపిరి తీసుకోవడం కష్టం



సిగరెట్టు కాల్చని వారిలో కంటే కాల్చేవారిలో కొంతమందికి ఊపిరి పీల్చడం కష్టంగా ఉంటుందని, వాళ్లకి బ్రోంకైల్ వ్యాధులు వస్తాయని ఆ... సిడ్నీలో ప్రిన్స్ హెన్రీ హాస్పిటల్‌లో పరిశోధనను నిర్దేశించే ప్రొ జాన్ కోలీబాచ్ చెబుతున్నారు. వీరికి ఊపిరితిత్తులకు తక్కువ సంకోచశక్తి ఉండి, ... ద్వారాలు సన్నగా ఉంటాయని అంటున్నారు

"జీవించే హక్కుకు సంపూర్ణ మూల్యం చెల్లించిననాడే మనకు స్వాతంత్ర్యం ల[illegible]ంది"

నప్పుడు అతని కళ్ల వెంట జాలువారిన ఆనంద అశ్రు మాలికలు అతడు సమర్పించే టెంకాయ ఏమిటి? టెంకాయ పైపెచ్చును ఊడదీసి రెండు ముక్కలు అయ్యేటట్లు దానిని పగుల గొడతాడు. ఆ టెంకాయ ముక్కలను భగవంతునికి సమర్పిస్తాడు. తనలోని అహంభావాన్ని నశింపజేసుకుని భగవంతుని మ్రోల శరణాగతి పొందటం దీని సంకేతం. కామక్రోధాలనే పైపెచ్చులను తొలగించి, అహంకారమనే టెంకాయ చెక్కను పగులగొట్టి తనలోని పవిత్రమైన, మృదువైన, తీయనైన భక్తిభావాలను భగవంతునికి సమర్పిస్తాడని అంతరార్థం.

భక్తుడు విభూతిని నొసటిదాల్చి ఒకింత నోట్లో వేసుకుంటాడు. ప్రపంచం యొక్క అవాస్తవికతకు 'విభూతి' సాంకేతిక చిహ్నం. ఈ ప్రపంచం స్థిరం కాదనీ, తనకూ సర్వవ్యాపియైన భగవంతునకూ మధ్య అడ్డుగా నిలిచే కోరికలను బూడిదగా మార్చాలని 'విభూతి' భక్తునికి గుర్తు చేస్తుంది.

కర్పూరం ఏవిధంగా తన పరిమళాలను నలువైపులా వెదజల్లుతుందో భక్తుడు కూడా ఇతరులకు ఓదార్పు, స్ఫూర్తి ఇవ్వాలని 'హారతి' లోని అంతరార్థం. ఏవిధమైన శేషం మిగల కుండా కర్పూరం వెలిగిపోయినట్లుగా భక్తుడు కూడా సంతోషించేందుకు, బాధపడేందుకు ఏమీ మిగలని విధంగా - తన జీవిత యాత్ర వివిధ కార్యకలాపాలతో నిండిపోవాలని ప్రార్థించాలి.

నిశ్చయంగా మానవ శరీరం, ఈ పవిత్ర దేవాలయం - భగవంతుడిచ్చిన ఒక అమూల్య కానుక.

— ఉపాసనా ఫనిబుండా
— 'శ్రీ సత్యసాయ్ బాల్ వికాస్' సౌజన్యంతో

# రైనోసిరస్ అంతరించి పోతూంది

రైనోసిరస్ నేటి మానవ నాగరికతా ప్రభావానికి గురైన జంతువు. ఇది అంతరించి పోవడానికి




మానవుని అత్యాశే ముఖ్యకారణం. అనేక శతాబ్దాలుగా ఆసియా దేశపు ప్రజలు ముఖ్యంగా చైనీయులు రైనో కొమ్ములకు కామేచ్ఛను ప్రవృద్ధి చేసే గుణం ఉందని విశ్వసిస్తున్నారు. దీని కొమ్ములు పొడిచేసి ఆ చూర్ణాన్ని మందులలో ఉపయోగిస్తారు. రైనో ఉద్రేకించి ఉన్నప్పుడు రక్తం కొమ్ములలోకి ప్రవహిస్తుంది. దీని వల్ల కామేచ్ఛను కలిగించే ఔషధ గుణం కొమ్ములలో వృద్ధి పొందుతుంది అంటారు! ఇది వట్టి భ్రమ. కానీ కొమ్ముల కోసం దీనిని చంపడం ఎంతమాత్రం తగ్గలేదు. అసలైన రైనో కొమ్ము ఒక అంగుళం ముక్క 500 డాలర్లకు, క్రొత్త రైనో రక్తం పౌండు 70 డాలర్లకు అమ్ముతారు. రైనో చర్మం పౌండు 15 డాలర్లు. దీని మూత్రం, పేడ కూడా అమ్ముడైపోతున్నాయి. ఇవి వాస్తవంగా దేనికి ఉపయోగించుతున్నాయో కొంతమందికే తెలుసు!

# బాధా చిహ్నాల ప్రయాణ వేగం

శరీరంలో దెబ్బ తగిలిన భాగం నుంచి మెదడుకు ఆ బాధా చిహ్నాలు గంటకు 200 మైళ్ళ వేగంతో చేరుకుంటాయి. 'ఓహ్' అని బాధ ప్రకటించేందుకు ఆ వ్యక్తికి క్షణంలో సగం కాలం పడుతుంది.

"భయంకన్నా ఏ ఇతర మోహం కూడా బుద్ధి యొక్క క్రియాశీలతను, ఆలోచనాశక్తిని దోచుకోలేవు."
— ఎడ్మండ్ బర్క్

# జీవిత విజయానికి నాలుగు సూత్రాలు

హెచ్. కర్స్టెన్

రూల్ 1 పరిస్థితుల్ని చూసి దుఃఖ పడవద్దు దానివల్ల వచ్చే సత్ఫలితమేమి ఉండదు దుస్థితిని గురించి తలపోస్తూ నిద్ర లేని రాత్రులు దిగులుతో గడిపితే అది నీ మానసిక, శారీరక శక్తిని కూడా హరిస్తుంది



దిగులుపడుతూ వృథా చేస్తున్న కాలాన్నీ, శక్తినీ పరిష్కార మార్గం కోసం వెచ్చించు అప్పుడు నీ ఆందోళన తొలగిపోతుంది

రూల్ 2 హెచ్చరిక! జ్ఞాపకం పెట్టుకో అత్యున్నత స్థానానికి చేరేముందు నీవు అట్టడుగును కూడా తాకాల్సి ఉంటుంది అడుగుకు చేరినప్పుడు ఇక ఒకటే మార్గం! పైకి రావటమే!

రూల్ 3 పరాజయాన్ని శ్రద్ధగా విశ్లేషించుకో! ఎందుకిలా జరిగింది? భవిష్యత్తులో ఇంకా నీవు ఏం చేయాల్సి ఉంటుంది? ఈవిధంగా ఆలోచిస్తే నీవు అవసరమైన పరిజ్ఞానం అలవరచుకుని, మరోసారి పరాజయం పాలవకుండా, గట్టి రక్షణ కవచాన్ని నిర్మించుకోగలుగుతావు

రూల్ 4 నీవు నూతనంగా, స్పష్టంగా నిర్వచించుకున్న లక్ష్య సాధనకు ఒక సక్రమమైన పథకం తయారుచేసుకో దాన్ని కార్యక్రమాలుగా, కాలనిర్ణయ పట్టికలుగా విభజించుకో అప్పుడు అమలు చేయడం ప్రారంభించు అంతకు ముందు కంటె అన్నివిధాలా మెరుగ్గా ఉన్నానని చివరిలో నీవే గుర్తిస్తావు

ప్రతీ విషయాన్ని నిర్మాణాత్మక ధోరణిలో చూసే అలవాటు చేసుకో సందేహాలు, హానికరమైన విమర్శలు విడనాడి నమ్మకం నింపుకుని సంతోషం కలిగించే ఆశాపూరితమైన అంశాలను అన్వేషించు న్యాయం, సత్యం అనేవి కూడా నీటి అడుగునున్న బిరడా వలె పైకి రాకమానవు నీ స్వయంశక్తిపై నమ్మకం పెంచుకో

ఇవన్నీ ఆచరిస్తే నీవు తలపెట్టిన ఏ కార్యమైనా విజయవంతమై తీరుతుంది సదాలోచనల వల్ల సకల విజయాలు ఉరుకులతో నీ ముందుకు వస్తాయి

## మానవుడు ఆత్మస్తుతి పరాయణుడు

మానవుడు ఆత్మస్తుతి పరాయణత్వంలో ఎవరికీ సాటిరాడు అతడు తన సద్గుణాలను ప్రదర్శన చేసుకుంటాడు తన తప్పులను అంగిలిదాటి రానివ్వడు తన మదదృష్టాలను పెద్దవి చేసి చెప్పుకుంటాడు తప్పేదో, ఒప్పేదో నిర్ణయించే మధ్యవర్తిత్వం కూడా తానే వహించి దానితో మానవతను వేరిజు వేస్తాడు, ప్రపంచాన్ని మదింపు చేస్తాడు

"ఎవరికో ఒకరికి నీవు అవసరమయ్యేటట్లు చూసుకో!"

రాల్ఫ్ వాల్డో ఎమర్సన్

# తుషార శీతల సుందరం-అంటార్కిటికా ఖండం

కె.ఎన్. మేనన్

1820లో నదానియెల్ పాల్మర్ అనే అమెరికన్ అన్వేషకుడు అంటార్కిటికాను కనుగొన్నాడు. అప్పుడు దాన్ని అతని పేరు మీదుగా 'పాల్మర్‌లాండ్' అని పిలిచేవారు




అయితే ఆ భూమి మీదికి చొచ్చుకుపోవాలని ఆయన ప్రయత్నించలేదు. 19వ శతాబ్దిలో ఈ ఖండం గురించి అధ్యయనం చేసేందుకు వివిధ యత్నాలు జరిగాయి. ఈ సాహస [illegible] సరైన పరికరాలు లేనందువల్ల విఫలమయ్యాయి. అధిక శక్తి గల విమానాలు, అంతరిక్ష ఛాయాగ్రహణం, రేడియో సమాచారం వంటివి వచ్చిన తరువాత తీరప్రాంతాన్ని, లోతట్టు ప్రాంతంలోని అధిక భాగాన్ని పటం గీసే ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి.

ఇండియా, చైనా కలిపితే వచ్చే వైశాల్యం కంటే ఎక్కువ వైశాల్యంతో 14,000,000 చ.కి.మీ.ల విస్తీర్ణంలో అంటార్కిటికా ఖండం ఉంటుంది. చలికాలంలో తీరప్రాంతం నుండి 1000 కి.మీ.ల మేరకు విస్తరించిన మంచు ఈ ఖండం సైజులో రెండింతలుగా బ్రహ్మాండమైన టేబిల్ ఆకారంలో తేలే మంచు దిబ్బలు 100 కి.మీ.ల ఎత్తు వరకు పెరిగి భూమి మీద ఎక్కడా చూడని అద్భుత దృష్టి భ్రమ కలిగిస్తాయి.

ఈ మహాఖండంలోని మంచు పలకలు ప్రపంచంలోని 90 శాతం మంచుతో నిండి కరిగిపోయే పరిస్థితిలో సముద్ర మట్టాన్ని పెంచి ఎన్నో నివాస భూముల్ని ముంపుకు గురిచేయగల శక్తిగలవిగా ఉంటాయి.

## ఒలింపిక్స్ క్రీడాస్థలి

*1996 ఒలింపిక్ క్రీడలు అమెరికాలోని అట్లాంటాలో జరుగుతాయి. జార్జియాకు రాజధాని అయిన అట్లాంటా అమెరికా లోని పెద్దనగరాలలో ఒకటి. దాదాపు 1000 పారిశ్రామిక సంస్థలు ఈ నగరంలోనూ,పరిసరప్రాంతాల్లోనూ ఉన్నాయి. ఇవి విమానాలు, రసాయనాలు, ఎరువులు, ఫర్నిచర్, ఉక్కు - మొదలైన వాటిని ఉత్పత్తిచేస్తాయి. యునైటెడ్ స్టేట్స్ ప్రజారోగ్యశాఖవారి నేషనల్ కమ్యూనికబుల్ డిసీస్ సెంటర్ కూడా అట్లాంటాలోనే ఉంది*

*నీగ్రోల పౌరహక్కుల ఉద్యమ నాయకుడు డాక్టర్ మార్టిన్ లూథర్ కింగ్ అట్లాంటాలోనే జన్మించాడు 1968లో హత్యానంతరం అతని కాయాన్ని ఇక్కడి మోర్‌హౌస్ కాలేజి వద్ద ఖననం చేసారు.*

## ఏమైందండీ!

హెడ్‌క్లర్క్ సామాన్యంగా ఆలస్యంగా వస్తుంటాడు ఆరోజు ఉదయం మేనేజర్ ఆయనకోసం కాచుకు కూర్చున్నాడు. 10.30కు ఈ పెద్ద గుమాస్తాగారు రాగానే మేనేజర్ గట్టిగానే చెప్పాడు "నారాయణా! నువ్వు ఆఫీసులో 10 గంటలకల్లా ఉండవలసింది" "ఎందుకు? ఏమైందండీ?" అని ప్రశ్నించాడు నారాయణ.

"నేను ఉపాధ్యాయురాలినైతే - బోధించే దానికన్నా నేను నేర్చుకునేందుకే అది ఎక్కువగా ఉపయోగిస్తుంది — మేడమ్ దెలూజీ

ఉత్తర ధృవ ప్రాంతంలో మాదిరిగా ఇక్కడ కూడా ఆరుమాసాల పాటు నిరంతరం చీకటి ఉంటుంది. తరువాత పగటి వెలుగు కొన్ని నెలలు కొనసాగుతుంది వేసవి నెలల్లో చలి కాలంలో గడ్డ కట్టిన మంచు కరిగి ఉపరితలం పైన బ్రహ్మాండమైన గోతులు ఏర్పడి విడుదుల్ని (కాంవుల్ని) తనలో విలీనం చేసుకుంటుంది. నులి వెచ్చని వేసవి నెలలు డిసెంబర్, జనవరులే.



ఇక్కడ స్థానిక పక్షి జాతులేవీ లేవు. కానీ స్వల్పకాలం మాత్రం ఉండే సరళమైన వేసవి మాసాల్లో లక్షలాదిగా సముద్రపు పక్షులు, పెంగ్విన్ పక్షులు అంటార్కిటికాకు వలస వచ్చి ఈ నిశ్శబ్ద ఖండంలోకి జీవన చైతన్యాన్ని ధ్వనులను తీసుకువస్తాయి.

ఈ ఖండాన్ని చుట్టుకుని హిందూ మహా సముద్రం, అట్లాంటిక్, పసిఫిక్ - కూడలి భాగాలు ఉన్నాయి. ప్రపంచంలోని తుఫాను జలాలివి. భయంకరమైన పడమటి గాడ్పుల ఉధృతిని అరికట్టేదేదీ లేదు. ప్రపంచంలో హెచ్చు సంఖ్యలో సీల్, వేల్, కాడ్, హెర్రింగ్ మొదలైనవి ఈ జలాల్లో లభిస్తాయి. ప్లాంక్టన్ అనే అధిక విలువ గల సముద్ర ఆహారం కూడా ఇది సమకూరుస్తుంది. దీనివల్ల ఎటువంటి అంటువ్యాధి అయినా నిరోధించబడుతుంది. యాంటీబయొటిక్‌గా శక్తివంతంగా పని చేస్తుంది. అమూల్య ఆహార సేకరణలో భాగంగా, ప్రకృతి సిద్ధమైన ప్రొటీన్‌గా ఇక్కడ లభించే 'క్రిల్' అనే చిన్న చేప ఉపయోగిస్తుంది.

## నిదానమే ప్రధానం

*మటుజురా కత్తియుద్ధంలో మొనగాడు కావాలని కోరుకున్నాడు. అతనికి శీఘ్రచలనం లేనందువల్ల ఖడ్గ ప్రవీణుడు కాలేడని తండ్రి చెప్పాడు. మటుజురా ప్రముఖ ద్వంద్వ యుద్ధనిపుణుడు బాంజో దగ్గరకు వెళ్ళాడు. తనను శిష్యుడుగా స్వీకరించమని కోరాడు.*

*'మీతో ప్రతి నిమిషం గడుపుతూ, మీకు నౌకరుగా ఉంటే నిపుణుణ్ణి కావడానికి ఎంతకాలం పడుతుంది?' అని అడిగాడు.*

'పదేళ్ళు... బాంజో చెప్పాడు.

'మా తండ్రి వృద్ధుడవుతున్నాడు, పదేళ్ళలోగానే నేను ఇంటికి తిరిగి వెళ్ళి ఆయన్ను జాగ్రత్తగా చూసుకోవాలి కనుక నేను ఎక్కువ కష్టపడి నేర్చుకుంటే ఎంతకాలం పడుతుంది?'...మటుజురా ప్రశ్న

'ముప్పైఏళ్ళు'...బాంజో జవాబు.

'అదేలా? మొదట మీరు పదేళ్ళన్నారు. నేను ఎక్కువ కష్టపడి చేస్తానన్నాను. ఇప్పుడు మూడు రెట్లు కాలం పెంచుతున్నారు. నన్ను ఇక స్పష్టంగా చెప్పనివ్వండి నేను ఇంకా ఎక్కువ కష్టపడి నేర్చుకుంటాను. ఎంతకాలం పడుతుంది?' అని మటుజురా ప్రశ్నించాడు.

*'డెబ్బై సంవత్సరాలు! ఇంత హడావిడిగా ఉండే విద్యార్థి బహు నెమ్మదిగానే నేర్చుకుంటాడు' అన్నాడు బాంజో.*

*—జెన్ కథలు- 'ఇన్‌స్పిరేషనల్ కోట్స్' సౌజన్యంతో*

'క్రూరత్వం తప్పకుండా పే... వలిగిస్తుంది, కనికరం ఆనందాన్ని అందిసుంది ''

నాచు జాతులు కొన్ని ఈ ఖండంలో కనిపిస్తాయి. క్లోరోఫిల్ గల ఆల్గే, మైక్రోస్కోపిక్ పుట్టగొడుగులు - లోతట్టు ప్రాంతాల్లోని పర్వత ప్రదేశాల్లో కనిపిస్తాయి

ఈ ఖండంలో మంచు కప్పుకున్న పీఠభూమి సముద్ర మట్టానికి 10 000 అడుగుల ఎత్తున ఉంటుంది ఇక్కడి కొండలు 5000 మీటర్ల మేరకు విస్తరించి మనోహరంగా ఉంటాయి ఈ ఖండంలో 2 శాతం మంచు నుంచి విడివడి ఉంటుంది - పొడి భూముల్లో మన్ను కనిపిస్తుంది



ప్రపంచంలోని బ్రహ్మాండమైన చమురు నిక్షేపాలు, బొగ్గు గనులు, ఇనుప ఖనిజ నిక్షేపాలు, యురేనియం, క్రోమ్, గ్రాఫైట్, బంగారం, ప్లాటినం వంటి అమూల్య లోహాలు, ఖనిజాలు అంటార్కిటికాలో నిల్వ ఉన్నాయని అంచనా

పరిశోధన, అన్వేషణలకు ప్రాధాన్యం ఇవ్వాలనే మిషతో ఏడు దేశాలు ఈ ఉపఖండం మీద హక్కుల కోసం పోటీ పడుతున్నాయి "ఇది ఎవరికి స్వంతం?" అనే ప్రశ్న లేకుండా ఇక్కడి సైనిక కార్యకలాపాలను నిషేధిస్తూ కేవలం శాంతియుత ప్రయోజనాల దృష్ట్యా సహకార పద్ధతిలో శాస్త్రీయ అన్వేషణ సాగించుకునేందుకు వీలుగా ఒక అంతర్జాతీయ ఒడంబడిక జరిగింది ఈ ఉపఖండంలోని ప్రకృతి వనరులు అందరికీ, మానవాళికి వారసత్వంగా అందాలని అన్ని దేశాల సమాన సంక్షేమానికి వినియోగపడాలని అభివృద్ధి చెందుతున్న దేశాలు భావిస్తున్నాయి

1982 జనవరిలో మొదటి భారతీయ శాస్త్రజ్ఞుల సాహస యాత్రా బృందం అంటార్కిటికా పైన అడుగుపెట్టింది రాళ్ళు, మంచుగడ్డలు, గాలి, శాంపుల్స్ తీసుకుని తిరిగి వచ్చింది. ఒక అభివృద్ధి చెందుతున్న దేశం విజయవంతంగా జరిపిన మొదటి అంటార్కిటికా సాహసయాత్ర ఇదే

— 'ఇండియన్ అండ్ ఫారిన్ రివ్యూ' సౌజన్యంతో

## అడవి గొర్రెలు

అడవి గొర్రెలు దక్షిణ సైబీరియా, మధ్య ఆసియా (సోవియెట్ యూనియన్) పర్వత ప్రాంతాలలో మాత్రమే కనిపిస్తాయి

## చక్కదనాలన్నిటిని మించిన చక్కదనం

నాలుగు రోడ్ల కూడలిలో నిలబడి 'శాంతి కావాలి' అని గొంతు చించుకు అరిచినంత మాత్రాన, మన అభిప్రాయాలకు వ్యతిరేకంగా ఉన్నవారి ముద్రలు బట్టలు కొట్టినంత మాత్రాన 'శాంతి' అవతరించదు

మన చుట్టూ ఎంతో సౌందర్యం ఉంది ఎంతో ఉత్తేజం కనిపిస్తున్న అయినప్పటికీ ఈ లోకంలో మనం జీవించే తీరు కుంచితం చేత సౌజన్యాన్ని వెతికేందుకు మనం ప్రయత్నం చేయాలి అన్వేషించిన కొద్దీ ఈ లోకంలోని ఔచిత్యం మనకే కనిపిస్తుంది

చక్కటి పుస్తకాలు, చక్కటి చిత్రాలు, చక్కటి వస్త్రాలు, చక్కదనంగల సమస్తం నాగరికతకు చిహ్నాలు అయితే ఈ చక్కదనాలన్నిటినీ మించిన చక్కదనం, నిజమైన సౌందర్యం ఇతరుల మేలు కోసం పాటుపడే స్వార్థరహితులలో ఉంది —

— పండిట్ నెహ్రూ, 'జగతి' సౌజన్యం

"ప్రభుత్వంలో చేరేందుకు నిరాకరించిన మేధావులు అనుభవించే శిక్ష - చెడ్డ వ్యక్తులతో కూడిన ప్రభుత్వం క్రింద జీవించటమే." — ప్లేటో

# విస్‌డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక

సంపాదకవర్గం

: సంపాదకుడు:

లయన్. కె. వి. గోవిందరావు బి.ఏ., ఎల్.ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు:

కొండముది దత్తాత్రేయశర్మ

వి. బాలకుమార్ ఎం.ఏ., బి.ఎడ్.,

సభ్యులు:

కె. వి. ఎస్. శరత్‌బాబు బి.ఎ., బి.కాం., బి.ఎడ్.,

కె. వి. ఎస్. విజయకుమార్ బి.కాం.,

కె. రత్నకుమారి

ఈ సంచికలో

మే 1993



: చందా వివరాలు:

3 సంవత్సరాల చందా రూ 120/-

సంవత్సర చందా రూ. 42/-

ఎయిర్ మెయిల్ (1సం॥) రూ 200/-

సీ మెయిల్ (1సం॥) రూ 100/-

: చందా పంపవలసిన చిరునామా:

రత్నా ఏజన్సీస్

3, దేశికారోడ్, మైలాపూర్

మద్రాస్ - 600004

ఫోన్: 73327

-: ముఖచిత్రం: కలర్‌ట్రాన్స్‌పరెన్సీ:-

వికే హేండా

★ తెలుగు విస్‌డమ్‌కు ఇది 12 వ సంవత్సరం ★

# ధ్యానం

## మానవుని దృఢసంకల్పం




మానవుడు ఒక తీర్మానం (దృఢ సంకల్పం) చేసుకున్నట్లయితే - తన పరిస్థితి పట్ల అసంతృప్తిగా ఉన్నాడని దీని అర్థం తనకు తననే పరిగ్రహించటం ప్రారంభించి, తన శీలం (స్వభావం), జీవితం నుండి ఉద్భవించిన మానసిక బలంతో ఉత్తమంగా రూపొందడానికి అభిలషిస్తాడు తన దృఢమైన తీర్మానానికి నిజంగా కట్టుబడి నట్లయితే, అతడు తన ఉద్దేశాన్ని నేర్పుగా దిద్ది తీర్చుకోవటంలో విజయం సాధిస్తాడు

ఋషుల ప్రతిజ్ఞలన్నీ తమ ఇంద్రియాల మీద విజయం సాధించేందుకు చేసిన పవిత్ర తీర్మానాలే పవిత్ర పురుషుల ఆకర్ష ణీయమైన మహత్కార్యాలు, దైవ స్వరూపు లైన గురువుల మహిమాన్విత విజయాలు - చలించని తీర్మానాల ఫలితంగా లభించినవే, వాస్తవరూపం దాల్చినవే

# సంపాదకుని పేజీ

## విద్యాభ్యాసంలో విజయం

శ్రద్ధగా చదువుకోవటం ఒక కళ దాన్ని అభ్యాసం చేసుకుని మేలు పొందాలి శ్రద్ధగా చదవటమనేది విజయానికి నిశ్చయమైన దారి శ్రద్ధగా చదివేందుకు సరైన మార్గాన్ని గురించి సంవత్సరాల తరబడి అనుభవం మనకు చెబుతుంది

శ్రద్ధగా చదివేందుకు అనుకూలమైన అనేక విధానాలు, సూచనలు అనుసరించ దగినవే అయినా శ్రద్ధగా చదివేందుకు - మూలకారణమైన ముందుకు నడిపే అసలు కారణం ఒక జ్వలించే కోరిక

క్రమబద్ధమైన (చదివే) అలవాటు ద్వారా చిన్న కథలు, ఉపవాచకాలు, వివేకాన్ని కలిగించే పుస్తకాలు, వార్తాపత్రికలు - వీటిని చదవటంవల్ల చదవటంలో వేగం, ఒక విషయం గురించి కీలకాంశాలను గ్రహించుకునే సామర్థ్యం, వీటిని సరిగా అర్థం చేసుకుని వివరించగల మనశ్శక్తి అభివృద్ధి చెంది అమూల్యమైన ప్రయోజనాలు పొందవచ్చు

క్రమబద్ధమైన చదువుకు ఏర్పాటు చేసుకునే టప్పుడు - పాఠ్యపుస్తకాలు, నోట్సు, ప్రశ్నా పత్రాలు, సూచన (రిఫరెన్స్) పుస్తకాలు వంటి సంబంధిత సరంజామా సిద్ధం చేసుకునేందుకు ప్రాధాన్యం ఇవ్వాలి ఉత్తమమైన పుస్తకాలు కూడా సరైన పరిసరాల స్థితి - ధారాళంగా గాలి, వెలుతురు, చదివే చోటు ప్రశాంతంగా ఉండటం - ఇవి లేనప్పుడు ఉపయోగించవు సంపూర్ణమైన ఏకాగ్రత విషయాన్ని బాగా గ్రహించేందుకే కాక - చదవటం, వ్రాయటం, మాట్లాడటం వీటిని సమర్థవంతంగా నేర్చు కునేందుకు దోహదం చేసుంది

"[illegible]"

ఒక పుస్తకం చదివే సమయంలోనే సూక్ష్మ బుద్ధితో నోట్సు (జ్ఞాపకముంచుకోదగిన గుర్తులు) వ్రాసుకునేందుకు శ్రద్ధ తీసుకోవాలి లేదా విషయంలో బోధపడని ప్రశ్నలకు, వాక్యాలకు క్రింద గీత పెట్టుకోవాలి విషయాన్ని బాగా అర్థం చేసుకుని అవసరమైనప్పుడు మీ స్వంత మాటల్లో దాన్ని చెప్పవచ్చు విషయం (subject) గురించిన కూలంకష పరిజ్ఞానం కావాలన్నా విస్తృతమైన అవలోకనం చేయాలన్నా తగినంతగా సంబంధిత గ్రంథాలను అధ్యయనం చేయటం అత్యంత ఆవశ్యకమైన పని



ప్రతి పరిస్థితికి ఒక సులభమైన దారి ఉన్నట్లే చదువులో కూడా జ్ఞాపకశక్తికి ఒక సులభమైన, ఖచ్చితమైన మార్గం ఉన్నది దీనివల్ల జ్ఞాపకశక్తి పెంపొంది, దృఢంగా నిలుస్తుంది ఒక పేరు, మాట, రూపం, పరిస్థితి జ్ఞాపకం తెచ్చుకోవటానికి వాటికి సంబంధించినది ఏదైనా గుర్తుపెట్టుకుని మనకు అవసరమైన మాటను సులభంగా, సాధారణంగా గుర్తుకు తెచ్చుకోవటం -ఇదే క్రాస్ మెమరీ (Cross memory). ఎకనమిక్స్ విద్యార్థులు - "కప్ అండ్ డిష్" - అనే రెండు మాటలను "క్రాస్ మెమరీ"లో ఉపయోగించుకుంటారనేది తెలిసిన విషయం. ఈ రెండు మాటలకు చెందిన ప్రతి అక్షరం డబ్బు యొక్క లక్షణాలను తెలియజేస్తుంది తద్వారా వీరు పూర్తి మార్కులు తప్పకుండా సంపాదించుకుంటారు.

కొందరు విద్యార్థులు విషయాన్ని కంఠోపాఠం చేస్తారు దీనివల్ల స్పష్టమైన అవగాహన, జ్ఞాపకశక్తి అనే సహజమైన అభివృద్ధికి అవరోధం ఏర్పడుతుంది

అతి నీలలోహిత (Ultra - violet) కిరణాలు ఉత్తమస్థితిలో ఉండే ప్రాతఃకాలాల్లో చదివితే అధిక లాభాలు పొందవచ్చు ప్రాతఃకాలం చదివేందుకు ఆదర్శవంతమైనది - జీవశాస్త్ర రీత్యా మనస్తత్వ శాస్త్రరీత్యా ఒక నిపుణుని సహాయంతో యోగాసనాలు నేర్చుకోవటం మేథకు పదును పెడుతుంది జ్ఞాపకశక్తిని పెంపొందిస్తుంది శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచుతుంది

అన్నిరకాల దురలవాట్ల నుండి దూరంగా ఉండటంవల్ల శారీరక, మానసిక శక్తులు సంరక్షించబడి, తద్వారా ముఖ్యమైన వాటిపై ఖచ్చితమైన అవగాహన పెంపొందించుకునేందుకు, మనసును కేంద్రీకరించేందుకు వీలవుతుంది

## నీతి సూత్రాలు

నా నీతి సూత్రాలు సామాన్యమైనవి కష్టించి పనిచెయ్యటం, అనుమతించిన మేరకు నిర్వహించటం, ఇతరుల మంచి అభిప్రాయాలను, చెడు అభిప్రాయాలను సమానంగా తీసుకోవటం, స్నేహితునిపై హీనమైన మోసయత్నం చెయ్యకపోవటం, ఏ విషయం గురించి క్రోధం పెంచుకోకపోవటం, పరిస్థితులకు తగినట్లు నడుచుకోవటం, స్వార్థం లేకుండా జీవితంలో ఎప్పుడూ సంతృప్తితో ఉండటం

—జార్జి జీన్ నాథన్

"మీ విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చటంతో తృప్తి చెందకండి మీ కర్తవ్యానికి మించి పనిచెయ్యండి" — ఆండ్రూ కార్నెగీ

# మన రాష్ట్రాలు

## పాండిచేరి

దక్షిణ భారతదేశంలో కేంద్రపాలిత ప్రాంతం పాండిచేరి 492 చ.కి.మీ.ల విస్తీర్ణంతో, నాలుగు జిల్లాలతో - పాండిచేరి, కారైకాల్, మాహే, యానాం - అలరారుతుంది మద్రాసు నగరానికి 162 కి.మీ.ల దక్షిణదిశలో ఈ కేంద్ర పాలిత ప్రాంతం రాజధాని పాండిచేరి - తమిళ నాడులోని దక్షిణ ఆర్కాట్ జిల్లా లోపల ఉంటుంది జింజినది ప్రవహించే మార్గం వద్ద - 293 చ.కి.మీ.ల మేరకు విస్తరించిన పాండిచేరి, దాని పరిసర గ్రామాలు ఉన్నాయి




ఈ కేంద్రపాలిత ప్రాంతానికి సుదూరంగా, విడివిడి విభాగాలుగా - కారైకాల్ (తమిళనాడు) మాహే (కేరళ), యానాం (ఆంధ్రప్రదేశ్) - ఉన్నాయి

1991 జనాభా లెక్కల ప్రకారం ఈ కేంద్ర పాలిత ప్రాంతం జనాభా 7 89,416 పాండి చేరి విభాగం జనాభా మాత్రమే 4,44 417 ఇన్ని ప్రాంతాల జనాభా - అత్యధిక సంఖ్యాకులైన హిందువులు, ముస్లిములు, క్రైస్తవులతో-కూడి ఉంది స్త్రీ పురుష విభజనరీత్యా చూస్తే ప్రతి 1,000 మంది పురుషులకు 982 మంది స్త్రీలు ఉన్నారు ఒక చ.కి.మీ. విస్తీర్ణంలో 1,605 మంది జనసాంద్రత ఉంది తలసరి ఆదాయం 3,777 రూపాయలుగా ఉంది వీరు మాట్లాడే భాషలు ఫ్రెంచ్, ఇంగ్లీషు, తమిళం, మలయాళం, తెలుగు ఇక్కడ దాదాపు 1,500 ఫ్రెంచ్ కుటుంబాలు ఉన్నాయి - ఫ్రెంచ్ జాతీయతను ఎంపిక చేసుకున్న భారతీయులు వీరు

దాదాపు 2200 సంవత్సరాల క్రితం దక్షిణ భారతంలో వ్యాపారం నిర్వహించేందుకు రోమన్లు వచ్చినప్పుడు పాండిచేరి 'పొడుకే' (Podouke) అని పిలువబడేది తూర్పు తీరంలో డేన్స్ (డెన్మార్క్), డచ్ (హాలండ్) వారు చిన్న వాణిజ్య కేంద్రాలు 16, 17

## ఒంటరితనానికి అద్భుత చికిత్స

ఇన్నిరకాల ఒంటరితనానికి అద్భుతమైన చికిత్స ఇతరులపట్ల నిజమైన శ్రద్ధ కలిగి ఉండటం, తోటి వ్యక్తులపట్ల - దూరంవాళ్లైనా దగ్గరివాళ్లైనా - యదార్థమైన ప్రేమ కలిగి ఉండటం ఒంటరితనంతో బాధపడే వ్యక్తికి అది ఎంతటి భయంకరమో - ఒంటరితనం అనుభవించే వ్యక్తి గ్రహించగలిగితే, ప్రయత్నపూర్వకంగా తనశక్తి సామర్థ్యాలను ఉపయోగించి ఇతరులను ఒంటరితనం నుంచి వెలికి తీసుకురాగలిగితే, ఆక్షణంనుంచే ఒంటరితనం అతణ్ణి వదిలివేస్తుంది ఒంటరితనంతో బాధపడుతున్నవారికీ ఒంటరిగా ఉన్న వయోజనులకు ఇదే నిజమైన చికిత్స

— జెనీ చియాంగ్

"జ్ఞానం లేని న్యాయబుద్ధి బలహీనమైనది, నిరుపయోగమైనది న్యాయబుద్ధి లేని జ్ఞానం ప్రమాదకరమైనది, భయంకరమైనది"

-- డాక్టర్ శామ్యూల్ జాన్సన్

శతాబ్దులలో నెలకొల్పినప్పుడు దీన్ని "పుదుచేరి" (Puduchery) అని పిలిచేవారు

1674లో ఫ్రెంచ్ ఈస్ట్ ఇండియా కంపెనీ మొట్టమొదటిసారిగా పాండిచేరిలో ఒక కొత్త నివాసస్థానం (సెటిల్మెంట్) ఏర్పాటు చేసింది


Pondicherry

ఫ్రెంచి ఏజెంట్‌గా ఉన్న ఫ్రాంకోయిస్ మార్టిన్ ఈ పట్టణాన్ని స్థాపించాడు 1738లో తంజావూరు రాజు నుండి ఫ్రెంచివారు కారైకాల్‌ను పొందారు 1721లో బడగర పాలకుడు మాహేను ఫ్రెంచి వారికి ఇచ్చాడు 1731లో యానాం వీరి స్వాధీనం లోకి వచ్చింది

18వ శతాబ్దిలో పాండిచేరి గవర్నరుగా ఉన్న డూప్లె ఇండియాలో ఫ్రెంచి సామ్రాజ్యాన్ని స్థాపించాలనుకున్నాడు కానీ వెంటవెంటనే వచ్చిన యుద్ధాలలో బ్రిటిషువారు ఫ్రెంచి వారిని ఓడించి, చివరకు ఇండియాలోని భాగ్యవంతమైన రాష్ట్రాలలో స్థిరపడ్డారు పాండిచేరి రాజకీయ ప్రాధాన్యాన్ని కోల్పోయింది 1816లో బ్రిటిషువారు దీనిని, ఇతర ప్రాంతాలను ఫ్రెంచివారికి ఇచ్చారు 19వ శతాబ్దిలో బెంగాల్‌లోని కలకత్తాను మినహాయిస్తే - పాండిచేరి పట్టణం అతి సుందర నగరంగా పునర్నిర్మితమైంది

1816 సెప్టెంబర్ 26 నుండి 1954 అక్టోబర్ 31 వరకు దాదాపు 140 సంవత్సరాలు పాండి-చేరి ఫ్రెంచ్ పాలనక్రింద ఉంది ఒక ఫ్రెంచి నివాస ప్రాంతంగా పాండిచేరిలో ఫ్రెంచి పద్ధతిలో ఎన్నో సంస్థలు స్థాపించబడ్డాయి.

1954 నవంబర్ 1న ఇండియాలోని తమ ప్రాంతాల పరిపాలనను ఫ్రెంచి ప్రభుత్వం స్వతంత్ర భారత ప్రభుత్వానికి అప్పగించింది 1956 మే 28న పాండిచేరి, కారైకాల్, మాహే, యానాంలతో కూడిన ఒక అప్పగింత ఒప్పందంపై సంతకాలు చేశారు. 1962 ఆగస్టు 16న స్థిరపర్చే పత్రాలపై (Instruments of ratification) సంతకాలు జరిగాయి 1962లో భారత రాజ్యాంగానికి 14వ సవరణ చేయటం ద్వారా ఈ నాలుగు ఫ్రెంచి భూభాగాలు ఇండియాను విలీనం చేయబడి ఒక కేంద్రపాలిత ప్రాంతంగా రూపొందాయి


Dupleix

నేడు పాండిచేరిని ఒక లెఫ్టినెంట్ గవర్నర్ ద్వారా భారత రాష్ట్రపతి పరిపాలిస్తున్నాడు ముఖ్యమంత్రి, అతని మంత్రి మండలి సలహా ప్రకారం పరిపాలన జరుగుతుంది 33 మంది సభ్యులతో కూడిన శాసనసభకు ముఖ్యమంత్రి బాధ్యత వహిస్తాడు సహజంగా

మంత్రి మండలి సభ్యులు పరిపాలన ప్రత్యక్షంగా నిర్వహిస్తారు ఈ కేంద్రపాలిత ప్రాంతం మద్రాసు హైకోర్టు శాసనాధికారం క్రిందకు వస్తుంది



Beach, Pondicherry

ఈ కేంద్రపాలిత ప్రాంతం జనాబాలో దాదాపు 65 శాతం మంది వ్యవసాయం, దానికి సంబంధించిన పనులు చేస్తుంటారు సాగుచేసే భూమిలో 90 శాతం నీటిపారుదల కలిగినదే

ఆహారధాన్యాలలో బియ్యం, జోవర్ (Jowar), బజ్రా (bajra), రాగులు పండుతాయి వాణిజ్య పంటలలో వేరుశెనగ, పత్తి, చెఱకు ఉన్నాయి ఈ ప్రాంతంలో అడవులు లేవు

ఇప్పుడు ఇక్కడ 18 పెద్ద తరహా, 53 మధ్య తరహా, 3,903 చిన్న తరహా పరిశ్రమలు ఉన్నాయి ఈ పరిశ్రమల ద్వారా 45,000 మందికి పైగా ఉద్యోగావకాశాలు పొందుతున్నారు

ఎలక్ట్రానిక్స్ పరిశ్రమలను ఆకర్షించేందుకు ఒక ఎలక్ట్రానిక్స్ ఇండస్ట్రియల్ ఎస్టేట్ నెలకొల్పబడింది

1972 మార్చి 1 నాటికే ఈ కేంద్రపాలిత ప్రాంతంలోని అన్ని గ్రామాలకు విద్యుత్ సౌకర్యం కలిగించారు

పాండిచేరి అక్షరాస్యతలో దేశం మొత్తం మీద 7వ స్థానంలోనూ, కేంద్రపాలిత ప్రాంతాలలో 4వ స్థానంలోనూ ఉంది కారైకాల్, మాహే, యానాం ప్రాంతాలు 100 శాతం అక్షరాస్యత సాధించినట్లు ప్రకటించబడింది

కుటుంబ నియంత్రణలో వార్షిక లక్ష్యాలను సాధించటంలో పాండిచేరి ప్రథమస్థానంలో ఉంది విశ్వవ్యాప్త సంరక్షణ కార్యక్రమం తల్లులకు, బిడ్డలకు వర్తింపజేయుటం 100 శాతం మేరకు జరిగింది

నైపుణ్యంతో కూడిన పట్టణాభివృద్ధికి పాండిచేరి పట్టణం ఒక ఆదర్శంగా నిలుస్తుంది ఇక్కడి భవనాలు స్పష్టమైన ఫ్రెంచ్ శిల్ప శైలులతో నిండి ఉంటాయి




Park monument

భారతీ పార్క్ అందంగా రూపొందించబడింది ఈ పార్క్ మధ్యభాగంలో ఉన్న స్మారక చిహ్నం ఫ్రెంచి చక్రవర్తి నెపోలియన్ III (1808-73) కాలంలో నిర్మించబడినట్లు తెలుస్తున్నది

## పుర్బియా భాష

*1961లో అతి కొద్ది మందికి మాత్రమే తెలిసిన పుర్బియా భాషను అఖిల భారత చిత్రం "గంగా-జమునా"లో ఉపయోగించారు దిలీప్ కుమార్ నటించిన ఈ చిత్రం దేశమంతటా అఖండ విజయం సాధించింది*

"తను తప్పు చేశానని అంగీకరించడానికి మనిషి ఎన్నడూ సిగ్గుపడనక్కరలేదు ఇదే మరొకంగా చెప్పాలంటే - నిన్నటి కంటే అతడు ఈ రోజు తెలివిగలవాడయ్యాడు" జొనాథన్ స్విఫ్ట్

యాత్రికులను ఆకర్షిస్తుంది విల్లియనూర్‌కు వాదావు 8 కి.మీ.ల దూరంలో ఉన్న తిరువందర్ (శివుడు) దేవాలయంలోని కొన్ని శిల్పాలు 7వ శతాబ్ది ఏ.డి. నాటివి




పాండిచేరి రైల్వేస్టేషన్ సమీపంలోని సేక్రెడ్ హార్ట్ చర్చి - కమానులతో కట్టబడిన శిల్పాలకు ప్రసిద్ధి పొందింది

అరోవిల్లి - వేకువ నగరం - పాండిచేరి పట్టణానికి ఉత్తరంగా 10 కి.మీ.ల దూరంలో, కోరమాండల్ తీరంలో, 20 చదరపు మైళ్ళ, విస్తీర్ణంతో, శ్రీ అరవిందుల పేర నిర్మించ బడింది. ఒక చలువరాతి కమలంలో 129 దేశాలకు చెందిన మృత్తిక (మట్టి)ను - మానవ ఐక్యతకు చిహ్నంగా వేయటంతో 1968 ఫిబ్రవరి 28న ఈ టౌన్‌షిప్ నిర్మాణానికి శంకుస్థాపన జరిగింది

పాండిచేరికి ఉత్తరంగా 12 కి.మీ.ల దూరంలో నెలకొల్పిన పాండిచేరి సెంట్రల్ యూనివర్శిటీ ఒక విద్యాబోధన మరియు నేర్చుకునే సౌకర్యం గల విశ్వవిద్యాలయం

కొనపాలయం ఆటబొమ్మలు (పుదుచేరి బొమ్మయ్యగా ప్రసిద్ధి) వాటి రంగులకు, పాతకాలపు ఆకర్షణకు ప్రసిద్ధి పొందాయి

పెద్ద జిల్లాలలో రెండవది కారైకాల్ సారవంతమైన కావేరీ డెల్టా (నదీ ముఖం చుట్టబడిన ప్రాంతం)లో ఉంది. పట్టణ మధ్య భాగంలో ఉన్న కారైకాల్ అమ్మైయార్ దేవాలయంలో వార్షికంగా 'మాంగని' ఉత్సవం పవిత్రతకు ప్రతిరూపమైన ప్రముఖ కవయిత్రి, యోగిని పునితవతి అమ్మాళ్ గౌరవార్థం జరుపుతారు

కారైకాల్‌కు 5 కి.మీ.ల దూరంలో ఉన్న తిరునల్లార్‌లో శనేశ్వరస్వామికి అంకితమైన ప్రసిద్ధ దేవాలయం ఉంది. భారతదేశంలోనే ఇటువంటి ఏకైక దేవాలయం ఇదే కావచ్చు

కేరళ తీరంలోని మాహే తెల్లిచేరికి 8 కి.మీ.ల దూరంలో ఉంది. ఇక్కడ మాహే పట్టణం మరియు మూడు గ్రామాలు ఉన్నాయి




మాహేలోని శ్రీకృష్ణ దేవాలయ సౌందర్యం - ఈ స్థలాన్ని ఒక విచిత్రమైన ఆకర్షణతో నింపుతుంది

యానాం - ఆంధ్రతీరంలోని ఒక ఇరుకైన (కొద్ది విస్తీర్ణం గల) భూమి - యానాం పట్టణం, ఆరు గ్రామాలు దీనిలో చేరి ఉంటాయి ●

"భగవంతుడు ప్రతిదాన్నీ వీక్షిస్తాడు - రాత్రివేళ గాఢాంధకారంలో ఒక నల్లరాతి పైనున్న నల్లటి రంధ్రాన్ని (బొరియ) కూడా చూస్తాడు"

— అరబ్ సామెత

# గత చరిత్ర గల "జల్లికట్టు"

పొంగల్ (సంక్రాంతి) పండుగలో భాగంగా జరిగే క్రీడ - "జల్లికట్టు" పండుగ రెండవ రోజు - మాట్టు పొంగల్‌నాడు ఈ క్రీడ ప్రత్యేకంగా నిర్వహించబడుతుంది.

మగవారు ప్రపంచానికి తమ పురుషత్వాన్ని ప్రదర్శించి చూపే క్రీడ - "జల్లికట్టు." ఈ క్రీడలో మచ్చిక కాని ఎద్దులు ఎన్నుకోబడతాయి వాటి కొమ్ములు వాడిగా చేయబడి, అవి కొవ్వు పెంచుకుని బాగా బలిసేటట్లు - తగిన విధంగా పోషించబడతాయి ఆ ఉత్సవం రోజున వీటి యజమానులు ఈ ఎద్దుల కొమ్ములకు ఖరీదైన వస్త్రాలు. అలంకరణ సామాన్లు ముడి వేసి ఒక ఆటస్థలంలో కాచుకున్న ప్రజల మధ్యకు స్వేచ్ఛగా వదిలివేస్తారు ఒక వృషభం ఆటస్థలం చేరుకున్నప్పుడు, దాన్ని అదుపు చేసి, దాని కొమ్ములకు ముడివేసిన విలువైన వస్తువులను స్వాధీనం చేసుకునేందుకు ఎవరికైనా స్వేచ్ఛ ఉంటుంది

"జల్లికట్టు" - క్రీడ తమిళులకు మాత్రమే- ప్రత్యేకమైనది దాదాపు 5000 సంవత్సరాల నాటి సంగం కాలానికి చెందిన ఈ క్రీడకు సుదీర్ఘమైన గత చరిత్ర ఉన్నది

ప్రాచీనకాలంలో ఒక బాలిక రజస్వల కాగానే, ఒక ఎద్దును కొని ఈ క్రీడ కోసం పెంచి పోషిస్తారు ఆమె వివాహ సమయంలో - ఈ ఎద్దును ఎవరైతే అదుపు చేస్తారో అతడు ఆ అమ్మాయిని వివాహం చేసుకునేందుకు అర్హుడని చాటుతారు వృద్ధులైనవారు కూడా తమ పరాక్రమాన్ని ప్రదర్శించి భాగస్వామిని చేపడతారు అయితే ఈ సంప్రదాయం ఇప్పుడు అమలు జరగటం లేదు కానీ ఈ క్రీడలోని మూల అంశాలు ఇప్పటికీ కనిపిస్తాయి

— "ది టీనేజర్" సౌజన్యంతో ●

## స్నేహం

స్నేహం - ఒక శక్తి సంపన్నమైన నౌక
అది ఎన్నో పెనుగాలుల్ని తట్టుకుని సాగుతుంది
అది పయనించే ప్రతి చోట
ఆశీస్సులను ప్రపంచానికి ప్రసాదిస్తుంది

అది నిరుత్సాహులకు సహాయపడుతుంది
చింతాక్రాంతులకు ఉల్లాసం కలిగిస్తుంది
చీకటి మబ్బులను పారద్రోలుతుంది
అది పదవిహీనులకు సహాయ హస్తాన్ని
అందిస్తుంది



స్నేహం - ఒక మంగళప్రదమైన
శాంతి, ప్రేమలతో నిండిన నౌక
అది స్వర్గం నుండి తెచ్చిన
సూర్యకాంతిని ప్రతీచోటికి చేరుస్తుంది

తీయని స్వర్గం కంటే ఎక్కువగా
ప్రపంచాన్ని ఒక మేలైన స్థలంగా రూపొందిస్తుంది
అలసట చెందిన యాత్రికుల అడుగుల క్రింద
మెత్తని కాలి బాటలను పరుస్తుంది

— కరెన్ ముట్స్

— 'ఇన్‌స్పిరేషనల్ కోట్స్' సౌజన్యంతో

"అసలు ఏమీ చెప్పకపోయినా, రెండుసార్లు ముందుగా ఆలోచించటమే
- రాజకీయతంత్రం (చాతుర్యం)"

# మామిడి పండ్లతో పసందైన పదార్థాలు

రమ

ఋతువులో ప్రతి గృహిణి మామిడితో ఊరగాయ తయారు చేస్తుంది మామిడి కాయలతో చేసే మరికొన్ని వంటకాలను ఇక్కడ అందిస్తున్నాము ఇవి చల్లగా, రుచికరంగా ఉంటాయి



**మాంగో ఖీర్** తియ్య మామిడి గుజ్జు తీసి వడగట్టండి తరువాత దీన్ని ఒక స్టెయిన్‌లెస్ పాత్రలో పోసి, దానితో సమానమైన నీటిని కలపండి అతి నెమ్మదిగా (వేడిచేసి) ఉడక బెట్టండి దీనికి చక్కెర పాకం (షర్బత్) కలుపుతూ బాగా కదపండి అది గట్టిపడగానే, కొబ్బరి పాలు చేర్చి మరోసారి కాగపెట్టండి స్టవ్ నుంచి తీసి ద్రాక్ష వంటి ఎండిన పండ్లను దీనితో కలపండి

**మాంగో ఐస్‌క్రీం** ఒక కిలో పండిన మామిడి పండ్లు, 5 చెంచాల చక్కెర, 1½ లీటర్ల పాలు, 4 ఔన్సుల మీగడ, ఒక ఔన్స్ రోజ్-వాటర్ మామిడి పండ్లను తోలు ఒలిచి, గుజ్జును ఒక మిక్సర్‌లో వేసుకోండి అరకప్పు పాలను చేర్చండి ప్రత్యేకంగా చక్కెర వేసిన పాలను కాచండి అది గట్టిపడగానే మామిడి రసం దీనిలో పోసి కలియబెట్టండి దీనికి రోజ్ వాటర్ కూడా చేర్చండి మీ ఫ్రిడ్జ్‌లోని ఐస్-ట్రేలో వీటన్నిటిని భద్రం చెయ్యండి పేరుకు పోయిన తరువాత మీగడ చేర్చి, మళ్ళీ ఘనీ భవింప చేయండి (గడ్డ కట్టుకునేటట్లు చేయండి)

**మామిడి హల్వా** 8 కప్పుల పండిన మామిడి పళ్ళరసం, 1 కిలోగ్రాం చక్కెర, 4 పైంట్ల (pints) పాలు (1 పైంటు = 12 ఔన్సులు), ½ కిలో గ్రాం నెయ్యి, ½ కప్పు బాదంకాయల తునకలు, ఎండిన ద్రాక్షపళ్ళు మొదలైనవి

## విస్డమ్ పాతకాపీలు

మే '84, జూన్ '84, ఆగస్టు '84 నుంచీ నవంబరు '84 మార్చి 85 నుంచీ జూలై '85 ఫిబ్రవరి 86 నుంచీ ఏప్రిల్ '86, సెప్టెంబరు '86 నుంచీ డిసెంబరు 86, జనవరి '87 నుంచీ మే '87 ఆగస్టు '87, డిసెంబరు '87, జనవరి '88, మార్చి 88 నుంచీ డిసెంబరు '88, జనవరి '89 నుంచీ డిసెంబరు 89, జనవరి '90 నుంచీ సెప్టెంబరు '90, నవంబరు 90, డిసెంబరు 90 ఫిబ్రవరి 91 నుంచీ డిసెంబరు 91, జనవరి 92 నుంచీ డిసెంబరు 92 కాపీలు మావద్ద ఉన్నవి 1984 కాపీల వెల రూ 7 50లు, 1985 కాపీల వెల రూ 6 50లు, 1986 కాపీల వెల రూ 10 50లు, 1987 కాపీల వెల రూ 11 50లు, 1988 కాపీల వెల రూ 18 75లు, 1989 కాపీల వెల రూ 24 50లు, 1990 కాపీల వెల రూ 25 50లు, 1991 కాపీల వెల రూ 26 50లు, 1992 కాపీల వెల రూ 33 00లు రిజిస్టర్డ్ పోస్ట్‌లో పొందటానికి కాపీల వెలతో పాటు రూ 6 00లు చేర్చి M O పంపాలి 'రత్నా ఏజెన్సీస్' 9, వేశికా రోడ్డు, ఆళ్వారుపేట, మద్రాను - 600 004

— సర్క్యులేషన్ మేనేజర్

ఒక పెద్ద బాణలిలో మామిడిరసం, చక్కెర, పాలు వేడిచేయండి మధ్యస్థమైన వేడిలో వీటిని బాగా కలియతిప్పుతూ ఉండండి - ఈ మిశ్రమం గట్టిపడేవరకూ ఇది లేహ్యం మాదిరిగా తయారు కాగానే నెయ్యి చేర్చి కలియబెట్టండి పాత్ర అంచులకు అంటుకు పోకుండా ఈ మిశ్రమాన్ని కలియబెట్టండి కొద్ది నూనెను ఒక పళ్ళెనికి పూయండి ఈ మిశ్రమాన్ని దానిలో పోయండి తర్వాత గింజలు మొదలైన వాటితో దీన్ని అలంకరించండి

మామిడితో పుష్టికర పదార్థం ½ కిలో మామిడి పండ్లు, 200 గ్రాముల పాలు, నారింజ పండ్ల పానీయం లేక ఒకటి, రెండు నిమ్మరసపు బొట్లు, 6 ఔన్సుల మీగడ మరియు చక్కెర మామిడి పండ్ల రసాన్ని ఒక మిక్సర్‌లో పోయండి చక్కెర మరియు నారింజ, నిమ్మ రసాలను వేడినీటిలో చేర్చండి మామిడి రసం, పాలు, మీగడలను కూడా దీనికి కలపండి తరువాత మిక్సర్‌లో కాసేపు వేయండి తయారయిన వస్తువు రుచికరంగా ఉంటుంది

బర్ఫీ మిక్సర్‌లో చూర్ణమయిన (దంచిన) ఒక పూర్తి కప్పు కొబ్బరిని తీసుకోండి ఒక పక్వమైన మామిడి పండు రసం తీసుకుని, ఒక చెంచాడు నెయ్యి చేర్చి వేడి చేయండి ఇది గట్టిపడగానే స్టవ్ నుంచి తీసి ఒక కప్పు పాలు, కొబ్బరి, ఒక చెంచాడు చక్కెర కలిపి బాగా గట్టిపడి, పాత్రకు అంటుకోనంత వరకూ కలియబెట్టండి ఏ పండ్లనైనా దీనికి కలిపి చల్లపడనివ్వండి తరువాత సలు చదరుగా కోసి - అత్యంత రుచికరమైన బర్ఫీగా తయారుచేసుకోండి

పులావ్ బసుమతి బియ్యం 3 కప్పులు, 1 కిలో పక్వమైన మామిడి పండ్ల రసం, 1 లీటర్ పాలు, 1 కప్పు జున్ను, 2 కప్పుల చక్కెర, 3 చెంచాల నెయ్యి, 2 నిండు చెంచాల రోజ్‌వాటర్ (పన్నీరు), ½ చెంచా కుంకుమ పువ్వు, 25 బాదంకాయలు, 10 ఏలకకాయలు, 6 లవంగాలు, 4 దాల్చిన చెక్కలు, చిటికెడు ఉప్పు పాలను, మామిడి రసాన్ని కలిపి - రెండు సమభాగాలుగా ఉడికించండి మూడు సార్లు బియ్యాన్ని కడిగి శుభ్రం చేసి వడ బోయాలి ఒక స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలో - మామిడిరసం, పాల మిశ్రమంతో కలిపి ఉంచాలి దీనికి ఒక కప్పు నీరు, లవంగాలు, ఏలకకాయలు, దాల్చిన చెక్క, ఉప్పు చేర్చాలి కొంతసేపు కాగానే రోజ్‌వాటర్ (పన్నీరు), కుంకుమ పువ్వు చేర్చి, మొత్తమంతా మూత బెట్టి తేలికపాటి వేడిలో ఉడకబెట్టాలి ఇది సిద్ధం కాగానే బాదంకాయ ముక్కలను దీనిపైన గుచ్చాలి రుచికరమైన పులావ్ మీ కోసం సిద్ధమైంది

— "హర్యానా రివ్యూ" సౌజన్యంతో ●

## సౌర విధానంలో ఏకైక చంద్రుడు




టీటాన్ - సౌర విధానంలో శనిగ్రహాన్ని పరి భ్రమిస్తున్న చంద్రుడు భూమిలో జీవరాశి పుట్టుకకు ముందున్న వాతావరణాన్ని ప్రతిబింబిస్తుంటాడు అక్కడ గాఢమైన సేంద్రియ నత్రజని వాతావరణం ఉందని భావిస్తున్నారు

"మానవ ముఖం నుండి చలికాలాన్ని బయటికి పంపే సూర్యుడే - నవ్వు (హాస్యం)"

— విక్టర్ హ్యూగో

# ఓర్పుకు సంకేతం, విశ్వాసానికి ప్రతిరూపం

కనికరం (దయ) గల జంతువులలో అత్యంత అపఖ్యాతిపాలైనది గాడిద ఎవరినైనా అవమానపర్చేందుకు అతణ్ణి 'గాడిద' అని పిలవటం గాడిదకే అవమానం ఓర్పుకు, విశ్వాసానికి, గట్టిదనానికి (నిబ్బరానికి) - గాడిద ఒక ఆదర్శం (లేక) ప్రతిరూపం




అన్ని సాహిత్యాల్లో గాడిద కనిపిస్తుంది జమునా నదిని దాటుతూ దివ్యబాలకుడైన శ్రీకృష్ణుని తీసుకుని పోయేటప్పుడు ఓండ్ర పెట్టవద్దని వసుదేవుడు గాడిదను ప్రార్థించాడు ఈసఫ్ నీతి కథల్లో, హితోపదేశంలో, పంచతంత్రంలో గాడిద ప్రస్తావన ఉంది

సైనిక దళాలకు కంచరగాడిద నమ్మకంగా, దృఢంగా, నిబ్బరంగా కొండశిఖరాల పైన సహాయం అందజేస్తుంది ఈ మిత్రుని సహాయం లేకుండా రజకుడు తన వృత్తిని కొనసాగించలేడు ఇసుకలో తడి గుడ్డల బరువు మోస్తూ గాడిద ఎంతో ఓర్పుతో సహాయపడుతూంది.

తన చర్మం మృదువుగా, పట్టుమాదిరిగా నిలువుకునేందుకు ఈజిప్టు రాణి క్లియోపాత్రా గాడిద పాలలో స్నానం చేసేది ఆయుర్వేద శిశుచికిత్సలో - గాడిదపాలను చూర్ణాలు (పొడి) ఇచ్చేందుకు సాధనంగా

గాడిద పెద్ద బరువులు మోసే జంతువు కూడా మనదేశంలోని దేశదిమ్మరులు - ఎప్పుడు వారి మకాములను మరోచోటికి మారుస్తున్నా - ఇంటిసామాన్లు, మంచాలు, కోళ్ళు, పిల్లలు, ఇల్లాలితో సహా - అందరూ గాడిద వీపు మీద పయనించేవారే!

సుప్రసిద్ధ వ్యాసకర్త ఆర్ ఎల్ స్టీఫెన్‌సన్ తన అభిమాన పాత్రమైన గాడిదతో కలిసి అన్ని భావావేశ యాత్రలు చేసాడు విక్టోరియా రాణి తన అభిమాన పాత్రమైన శునకబండిని లాగేందుకు ఒక తెల్ల గాడిదను పెట్టుకుంది సుదీర్ఘకాలాన్ని వెల్లడించేందుకు గాడిద సంవత్సరాలను చెబుతుంటారు. క్రికెట్‌లో డాంకీ - డ్రాప్ ఒక యోర్కర్ లేక గూగ్లీ, బౌన్సర్ లేక బంపర్, ఇదొక తరహా బౌలింగ్ క్రికెట్‌లో ఆటగాళ్ళను తరచుగా గందరగోళ పెట్టేది

సమయం, నిర్దేశం (దిశ) - విషయంలో గాడిదలకు మంచి వివేకం ఉంది గుఱ్ఱం-తన చోదకుడు లేకపోతే ఒక లక్ష్యం లేకుండా తిరుగుతుంటుంది కాని గాడిద ఇంటికే ముక్కు సూటిగా దోవ తీస్తుంది సముద్రపు ఒడ్డున పిల్లలతో స్వారీచేస్తున్న గాడిదకు - విశ్రాంతి కోసం వచ్చే అనేకమంది కంటే పట్టణం బాగా తెలుసు అది సముద్ర తీరంలోని క్రిక్కిరిసిన గుంపులోనుండి నడిచి, రోడ్లు దాటేటప్పుడు ట్రాఫిక్ దీపాలవద్ద వేచి ఉంటుంది

తరచుగా వాటికి అప్పగించిన పనిచేయక పోవటం వల్లనే గాడిదలకు "అవివేకపు (మూర్ఖ) గాడిద"లని పేరు వచ్చింది. అనేక

"మైత్రితో నిండిన బాంధవ్యాలు, మర్యాదలు అధిక లాభాలను పంచి పెడతాయి దీనికయ్యే ఒకే ఒక వ్యయం - వీటిని అలవర్చుకునే గట్టి పట్టుదల"

— జాన్ వసంత్

గుఱ్ఱాలకంటే గాడిదలే తమ మనసును దృఢ పర్చుకుంటాయి తర్ఫీదు సమయంలో గంతులేసే గుఱ్ఱాలను గాడిదలు ఉపశమింపజేస్తాయి

గాడిదలు తమ దవడలను, ముక్కును తగిల్చి గుర్రాల నోటిని మూస్తే గుఱ్ఱాల గుఱక, కాలితో నేలను తన్నటం నిల్చిపోతుంది ఒక పెద్ద పందెంలో పాల్గొనే ముందు గుఱ్ఱాల ఉద్రేకింపజేసే నరాలు విశ్రాంతి తీసుకోవడానికి ఇది ఆవశ్యకమని భావించబడుతున్నది

అత్యంత తుచ్ఛ జంతువుగా గాడిద గురించి తలపోస్తున్నా జీసస్‌ను ఆహ్వానించిన వాటిలో మొదటిది గాడిదే బరువులు మోసే ఈ ఓర్పుగల జంతువు మానవునికి (లొంగిన) నెచ్చెలి అయిన గాడిద జీసస్ జన్మించినప్పుడు ఒక స్థానం సంపాదించుకుంది ఈజిప్టుకు పారిపోయేందుకు జోసెఫ్ గాడిదనే అధిరోహించాడు కాథలిక్కులకు చెందిన ఏ చిత్రాల కాలండరు కూడా - మేరీ, చిన్నారి జీసస్ గాడిద పైన స్వారీ చేసే చిత్రం లేకుండా పూర్తికాదు

అది పైకి కనిపించేటంత మందమతి కాదు స్పెయిన్‌లో ఒక మృదుపానీయాల వ్యాపారికి చెందిన గాడిద అసాధారణ బుద్ధి సూక్ష్మత కలదిగా ఉండేది తను పంపిణీకి వెళ్ళేటప్పుడు ఈ పానీయాలను చేర్చే నౌకరు గాడిదను కూడా వెంటపెట్టుకు వెళ్ళేవాడు ఒక రోజు ఈ నౌకరు జబ్బుపడినప్పుడు ఈ గాడిద స్వయంగానే వెళ్ళివచ్చింది ఇతర సందర్భాలలో ఏవిధంగా తిరిగి వస్తుండేదో అదేవిధంగా అన్ని చోట్లకు వెళ్ళివచ్చింది అయితే అది ఒక తప్పు చేసింది ఆ నౌకరు పిచ్చాపాటీ మాట్లాడేందుకు ఆగే పాదరక్షల విక్రయదారుని దుకాణం వద్ద కూడా గాడిద నిలబడటం జరిగింది!

ప్రాచీనకాలం నుండి ప్రస్తుతకాలం వరకు మానవుడూ, యంత్రమూ ఎంతో అభివృద్ధి చెందారు. గాడిద మాత్రం తన్నులు తింటూ, ఓండ్రపెట్టుతూ, పనిచేసుకుంటూ మనతోనే నిల్చిపోయింది గాడిద ఎంత ఉపయోగకరమంటే - ఇంత చౌకగా మగగాడిద వలె పనిచేసే దాన్ని మనిషి మరేది కనిపెట్టలేదు ఒక గాడిదను బుద్ధివిహీనగా - అది ఎంత సేవచేసినా మనిషి చేయగలడని దేవుడికి తెలియకపోలేదు అందువల్లనే ఆయన దానికి మందమైన చర్మాన్ని అనుగ్రహించాడు- శీతోష్ణస్థితికి, పరిహాసానికి రక్షణగా

## ప్రపంచంలో 8000 మీటర్ల ఎత్తునున్న 14 పర్వత శిఖరాల విజేత



*1986 అక్టోబర్ 16న ప్రపంచంలోని అతి ఎత్తైన శిఖరం - మౌంట్ లోట్సే (8,516 మీటర్ల ఎత్తునున్నది) అధిరోహించటం ద్వారా ఇటాలియన్ పర్వతారోహకుడు రెయినోహోల్డ్ మెస్నర్ (42) ప్రపంచంలో 8000 మీటర్ల ఎత్తునున్న మొత్తం 14 శిఖరాగ్రాలను అధిరోహించటంలో మొదటివాడయ్యాడు 1978లో ప్రాణవాయువు లేకుండా ప్రపంచంలోని అతి ఎత్తైన మౌంట్ ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించిన మొదటి పర్వతారోహకుడు కూడా ఇతడే*

" మర్యాదకు వెంటనే లోపడేది - నిర్బంధిస్తే ఎంతమాత్రం లోపడదు "

మహాత్మాగాంధీ

# మంచి ఆరోగ్యానికి ఆవశ్యకం - మానసిక అభ్యాసం

డా. క్లైవ్ డీ. హర్లీ

క్రమమైన, తెలివైన శారీరక అభ్యాసం వ్యాయామ శిక్షణ)పైనే శరీర శ్రేయస్సు చాలా భాగం ఆధారపడుతుందని మనకు తెలుసు మేథ రోగ్యకరమైన అభివృద్ధికి కూడా ఇటువంటి శిక్షణ ఆవశ్యకమనే విషయం మనం గ్రహించుకో లేకపోతున్నాము శరీరానికి వ్యాయామ శిక్షణ ఎంత అవసరమో, బుద్ధికి మానసిక శిక్షణ కూడా అంతే అవసరం ఉబ్బే కండరాలు ఒక రోజులో ఎలా పెంపొందవో అలాగే చురుకైన,



ఆరోగ్యవంతమైన బుద్ధి కూడా ఒక రోజులో రూపొందదు అనేక మంది శారీరకంగా యోగ్యమైన వారిగా ఉండేందుకు ఏ విధంగా శ్రద్ధ తీసుకు .-రో మన బుద్ధులను కూడా చురుకుగా ఉంచుకునేందుకు ఆ విధంగానే మనం కూడా శ్రద్ధ తీసుకోవాలి అప్పుడే జీవితంలో అభిలాష పెంపొందుతుంది

వ్యాయామ శిక్షణకు అనుబంధించబడిన సాంప్రదాయిక పరిభాష "అటెన్షన్" (శ్రద్ధ-సావధానత), "స్టాండ్ ఎట్ ఈజ్" (సుఖంగా, సౌకర్యంగా, విశ్రాంతిగా నిలబడటం), "రైట్ ఎబౌట్ టర్న్" (కుడిప్రక్కకు - ఇంచుమించుగా - తిరగటం) - మొదలైనవి మానసిక పరిజ్ఞానంలో కూడా అత్యంత ప్రదానమైనవి మానసిక అర్హత (పొందిక)కు మనం చేస్తున్న అభ్యాసంలో వీటిని ఉపయోగించుకుందాము

1 అటెన్షన్ మానసికంగా అభివృద్ధి పొందేందుకు అవసరమైనది ఏకాగ్రత అనే కళ 'సీతాకోక చిలుక' వంటి బుద్ధి ఒక దాని నుండి మరోదానిలోకి తుళ్ళున ఎగురుతూ ఉంటుంది అది అతి కష్టంగా ఉన్నదని ఒక పనిని విడనాడి మరోదానివైపు తిరగటం, అది కూడా సరిగా లేదని నిర్ణయించుకోవటం - దీనివల్ల చేసేది అతి తక్కువ కాగా అసంతృప్తి మిగులుతుంది

మన మేథను అదుపు చేసి, క్రమశిక్షణలో పెట్టుకోవటం నేర్చుకోవాలి ఇక్కడ "అదుపు" అనేది ఆచరణాత్మకమైన పదం ఏకాగ్రత అంటే - మన బుద్ధుల్ని ఒకే విషయం.మీద కదలకుండా స్థిరపర్చటం కాదు చేతిలో ఉన్న సమస్యపై వివిధ దృక్పథాలను పరిశీలించి, అదుపుతో కూడిన ఆలోచనలు సాగించటం అని అర్థం

ఏకాగ్రతకు ఒక ఉత్తమ వ్యాయామం ఏమంటే ఒక ఊహాత్మక (కాల్పనిక) సమస్య తీసుకుని, దాని మంచి చెడులను గురించి ఆలోచించండి చివరకు ఒక నిర్ణయానికి రండి మరో వ్యాయామం మీకు నిజంగా ఆసక్తి లేని అంశంతో ఉన్న ఒక పత్రికనో, పుస్తకాన్నో తీసుకుని దానిలోని ఒక పారాగ్రాఫ్‌ను

"అందంగా ఉండే దేన్నైనా చూసే అవకాశాన్ని ఎన్నడూ వదలొద్దు,
ఎందుకంటే సౌందర్యం - దేవుని చేతివ్రాత"

— ఆర్ డబ్ల్యు ఎమర్సన్

పూర్తిగా చదవండి మళ్ళీ మళ్ళీ చదవండి దానిలోని ఒక్కమాట కూడా వదలకుండా చదివే వరకూ ఇది కొనసాగించండి. ఒక పద్ధతి, విధానం ప్రకారం చేయటం అనేది - ఏకాగ్రతను అభివృద్ధి చేసుకునేందుకు మరో మార్గం రేపటి పని గురించిన ఒక ప్రణాళిక సిద్ధం చేసుకుని, దాన్ని కచ్చితంగా పాటించి నట్లయితే ఎంతో సహాయపడుతుంది

మన అనుభవంలో స్పష్టమైన విషయం ఏదో ఒక దానిలో ఆసక్తి చూపించటం కూడా మన ఏకాగ్రతకు దోహదం చేస్తుంది ఆసక్తి అనేది ఏదో ఒక విషయం గురించిన మనో వైఖరిని బట్టి ఉంటుంది మనకు తక్షణ ఆసక్తిలేని విషయంపైన మనం శ్రద్ధ చూపవలసి వచ్చి నప్పుడు మనం ఆ విషయానికి మనల్ని అనువర్తింపజేసుకునే కొద్దీ మన ఆసక్తి ఆ విషయంపై పెరుగుతూందని తెలుసుకుంటాము'

2 "స్టాండ్ ఎట్ ఈజ్" పూర్తిగా పనిలో లీనమైపోయి, విరామం లేకుండా ఉంటే ఎవరినైనా మందకొడిగా చేస్తుంది మనం ఒక్కొక్కసారి సెలవులు మొదలైనవి - పని పూర్తి కావటం కోసం కోల్పోతాము అయితే వాస్తవానికి మనం కొంత సమయం విశ్రాంతికి, సేద తీర్చుకునేందుకు వినియోగించినట్లైతే - ఆ పనిని ఇంకా సమర్థవంతంగా చేయగలిగేవాళ్ళం

మనకు కావలసిన మనో వినోదానికి ఒక మార్గం "సరదాలు" (Hobbies) 'కాఫీ బ్రేక్ కూడా మనుషులు చేసే పనిని గణనీయంగా పెంపొందిస్తుంది బ్రేక్ తరువాత పని ప్రారంభించగానే పెరుగుదల కనిపిస్తుంది మనో వినోదం లేక సేద తీర్చుకునేందుకు సూచించిన వ్యాయామాలు బుద్ధిపైన మంచి ఫలితం చూపిస్తాయి ఇది శరీరానికి ఉప శమనం కలిగించే వేడినీటి స్నానం కలిగించే ఫలితం వంటిది. కొందరు ఈ రెండు విధాలను లాభదాయకంగా భావించి స్నానం చేస్తున్నప్పుడే సేద తీర్చుకునే వ్యాయామాలు కూడా కలిపి చేయటం జరుగుతున్నది

3 "రైట్ ఎబౌట్ టర్న్" సగానికి పైగా మన మానసిక చింతకు కారణాలు మనం మర్చి పోవలసిన విషయాలకు సంబంధించినవిగా ఉంటాయి గత తప్పిదాలను గురించి గాఢంగా ఆలోచించటం, మనల్ని గురించి ఇతరులు పలికిన నిర్దయ గల మాటలు,

## శాశ్వత ఫలితం సిద్ధించాలంటే....



ఉత్తమమైన, శాశ్వతమైన ఫలితాల కోసం చిన్న వైనా వరంవరగా సాగే, నిర్విరామ అనుదిన ప్రయ త్నాలు చేయక తప్పదని ప్రతి విద్యార్థీ గ్రహించి తీరాలి ఒకే పర్యాయం చేసే ప్రయత్నం ఎంత మాత్రం ఫలం ఇవ్వదు విజ్ఞానం — అది శాస్త్రానికి సంబంధించినదైనా, కళలకు చెందినదైనా లేదా మానవ వృత్తులకు సంబంధించినదైనా - ప్రతి రోజు శ్రమించి, కష్టపడితేనే సిద్ధిస్తుంది

— ఇగ్నేస్ జె పడేరివిస్కీ

కార్యాలను గురించి ఆలోచించటం, ఇంతకు ముందు మనం చేసిన పనులు, మనం చెప్పిన మాటలను గురించి ఆలోచించటం - ఇవన్నీ మానసిక చింతకు కారణాలు

ఈ విధంగా మనకు మనమే గతంతో సంకెళ్ళు వేసుకుని తద్వారా వర్తమాన, భవిష్యత్ కాలాలను చెడగొట్టుకుంటాము ఇటువంటి పనుల నుండి పూర్తిగా విడివడాలి వాస్తవానికి 'రైట్ ఎబౌట్ టర్న్' చేయాలి నిర్దయ గల మాటలస్థానే ప్రేమ ప్రపూర్ణమైన భావాలు ప్రవేశపెట్టాలి మలినమైన ఆలోచనల స్థానంలో సౌందర్య భావాలను ప్రవేశపెట్టాలి అతిత్వరలోనే ఈ విధానం ప్రతిఫలించి, 'రైట్ ఎబౌట్ టర్న్' అనే ఆదేశాన్ని ప్రతిబింబిస్తుంది

4 ''ఫార్వర్డ్ మార్చ్'' శరీరానికీ, బుద్ధికీ - నిర్ణీతకాలం విశ్రాంతి, మనోవినోదం కావల్సి ఉన్నప్పటికీ కఠినమైన శ్రమ కూడా - శారీరకమైనదీ, మానసికమైనదీ - సాధారణ ఆరోగ్య జీవితానికి అత్యంత అవశ్యకమని మనం గుర్తించాలి

ఉదాహరణకు దుఃఖం (విషాదం), ఆత్మ న్యూనతలకు చికిత్స చాలా సులభం ఇతరులకు సేవ చేయటం, వారి కష్టసుఖాలలో పాలు పంచుకోవటం - మొదలైన పనుల వల్ల మన కష్టాలు మర్చిపోవచ్చు మన మానసిక ఆరోగ్యానికి - విచారంతో క్రుంగిపోవడం, జడత్వం (మందకొడితనం) - ప్రాణాంతకమైనది తరచుగా వేరొకరి బరువులో భాగం పంచుకోవటం ద్వారా మన బరువు మనం మోసే శక్తిని సంపాదించుకుంటాము

అదేవిధంగా, భయానక పరిస్థితులు ఏర్పడినప్పుడు, చురుకుదనం (క్రియాశీలత) మాత్రమే సహజమైన విరుగుడు మందు. వాస్తవంగా చెప్పవలసినదేమంటే భయానికి ఉత్తమ చికిత్స - నీవు భయపడేదాన్ని చెయ్యటమే. ఒకసారి ఆ భయానక కార్యం నెరవేరిస్తే ఇక దాన్ని గురించిన భయం చెల్లాచెదరవుతుంది ముందుగా దాన్ని గురించిన ఆలోచన, ఆందోళన అసలు క్రియ కన్నా బాధాకరంగా ఉంటుంది

కనుక ఈ సులభమైన, పరిచయమైన వ్యాయామ శిక్షణకు చెందిన పనులు - అటెన్షన్, స్టాండ్ ఎట్ ఈజ్, రైట్ ఎబౌట్ టర్న్, ఫార్వర్డ్ మార్చ్ - ఆరోగ్యకరమైన ఆనందదాయకమైన బుద్ధులను పెంపొందించుకునేందుకు అనువర్తింపచేయాలి

## వ్యక్తి జీవితంలో దుర్దినం



తను జీవిస్తున్న బ్రతుకుపట్ల పరిపూర్ణ సంతృప్తిపొంది, తన ఆలోచనలపట్ల, తన కార్యకలాపాలపట్ల సంతృప్తి చెంది, తనకు తెలిసి కూడా తను చేయగలదానిని చేయకుండా తన అంతరాత్మకు కవాటాలు మూసినప్పుడు ఆవ్యక్తి జీవితంలో అదొక విచారకరమైన రోజు అవుతుంది

— ఫిలిప్స్ బ్రూక్స్

# పదాల పుట్టుక

డి.ఎస్ మాథుర్

* మెకడమైజ్ (పక్కా రోడ్డు వేయటం): ఒక స్కాటిష్ ఇంజనీర్ మెక్ఆడం (McAdam) పేర మెకడమైజ్ పదం ఏర్పడింది విరిగిన చిన్న రాళ్ళతో (కంకర) రోడ్లను కప్పి నునుపైన (చదునైన) కఠిన ఉపరితలం ఏర్పరచాడు


Boycott

* బాయ్‌కాట్ (బహిష్కారం లేక వెలి) కెప్టెన్ బాయ్‌కాట్, ఐర్లెండుకు చెందిన ఒక స్థలాల (వ్యాపారి) ప్రతినిధి తన (ఐరిష్) ఇరుగు పొరుగు వారిచేత అన్ని సాంఘిక, వ్యాపార లావాదేవీల నుంచి బహిష్కరించబడినవాడు

* శాండ్విచ్ (రెండింటిమధ్య ఒక పదార్థాన్ని ఉంచటం) - ఒక ఎర్ల్ ఆఫ్ శాండ్విచ్ (ఇంగ్లీషు ప్రభువు) ఒకసారి బిలియర్డ్స్ ఆటలో మునిగి డిన్నర్‌కు వెళ్ళలేకపోయాడు రొట్టెముక్కల మధ్య ఏరకమైన ఆహారాన్నైనా సరే పెట్టి తన వద్దకు తీసుకురమ్మని బట్లర్‌ను కోరాడు ఆట ఆడుతూనే దాన్ని భుజించాడు మరునాడు అది పత్రికలో ఒక వార్తగా రూపొందింది

* మకింటోష్ (వానకు తడవకుండా చేసే కోటు) ఆరంభంలో ఒక రబ్బర్ పూత (మలాము)తో తయారైన - వాటర్‌ప్రూఫ్ ఓవర్‌కోట్ (వర్షాన్ని చొరబడనీయని గుడ్డతో చేసిన కోటును) తయారుచేసిన మకింతోష్ అనే పరిశోధకుని పేరునుండి "మకింటోష్" ఉద్భవించింది

* టాంటలైజ్ (పీడించు, ఆశపెట్టి బాధించు) గ్రీక్ ఇతిహాసంలో జూస్ కుమారుడైన టాంటలస్ తన తండ్రి రహస్యాలను వెలికి చెప్పినందుకు శిక్షించబడ్డాడు అతని తలపైన ఒక పండును ఉంచి గడ్డంవరకు నీరు వచ్చేటట్లు నిలబడమని చెప్పారు అతడు నీటిని లేదా పండును చేరేలోగా నీరు వెనక్కి తగ్గటం జరిగేది

## చంద్రుని పైనుంచి కాంతిపుంజం ప్రసారం

*1962 మే 9వ తేదీన ఒక ఆప్టికల్ లేజర్ ఉపయోగించి చంద్రుని పైనుండి ఒక కాంతి పుంజాన్ని ప్రతిఫలింపచేశారు మసాచుసెట్స్ (యునైటెడ్ స్టేట్స్) కేంబ్రిడ్జిలోని, మసాచుసెట్స్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో 48 అంగుళాల టెలిస్కోప్‌కు ఈ లేజర్‌ను అనుసంధానం చేశారు చంద్రునిపైనున్న చుక్క ఆరు కిలోమీటర్ల వ్యాసం కలిగి ఉంది*

## 3000 ఏళ్ళనాటి సమాధి

*దక్షిణ యూరప్‌లోని ఈవియా ఐలెండ్ (గ్రీస్)లో 1981లో కనుగొనబడిన 3000 సంవత్సరాలనాటి సమాధిలో విలువైన బంగారు వస్తువులు, ఒక అందమైన ప్రాచీన వస్త్రం ఉన్నాయి దాని సమీపం లోని మరో సమాధిలో నాలుగు గుఱ్ఱాల అవశేషాలు కనిపించాయి మొదటి సమాధిలో పూడ్చబడిన స్త్రీయొక్క ప్రాముఖ్యతను ఇవి బహుశా తెలియ జేస్తుండవచ్చు*

"జ్ఞానాన్ని మార్పిడి చేసుకోవటమే సంభాషణ, వాదం - జ్ఞానహీనతను మార్పిడి చేసుకోవటం"

— అలెగ్జాండర్ కింగ్

ఇక్కడ అర్థమేమిటంటే ఒక మనిషిని బాధించేందుకు లేదా హింసించేందుకు - ఒక వస్తువును అతనికి ఆశచూపి దాన్ని అందకుండా చేయటం




* బుష్ షర్ట్ 30వ దశాబ్దం తొలిదశలో ఇండియాలో బ్రిటిష్ ఆర్మీ ఆఫీసరుగా ఉన్న కలొనెల్ బుష్‌కు దీని (ఆరంభ) ఖ్యాతి దక్కుతుంది. అప్పుడు అతడు లాహోర్‌లో నియామకంలో ఉన్నాడు. ఆరంభంలో ఆ బుష్ చొక్కాకు నాలుగు జేబులు, ఒక బెల్టు, భుజాలకు పట్టీలు ఉండేవి.

* గై (విచిత్ర వేష ధారులు, ఆకారంగల వ్యక్తి) 'గై' అనే వ్యక్తి 1605 నవంబరులో 'గన్‌పౌడర్ ప్లాట్' అనే ఒక పన్నాగం - లండన్‌లోని పార్లమెంట్ హౌస్‌ను పేల్చివేసేందుకు రూపొందించాడు. కానీ అతనితో కుట్ర చేసిన భాగస్తులలో ఒకడు ఈ ప్రమాదం గురించి ముందుగానే తన శ్రేయోభిలాషి అయిన లార్డ్ మాంటేగ్‌ను ఉత్తరం ద్వారా హెచ్చరించాడు. పన్నాగం బయటపడిపోయింది. గై ఫాక్స్ అరెస్టయ్యాడు, చిత్రహింసలకు గురి అయ్యాడు, ఉరితీయబడ్డాడు. గన్ పౌడర్ పన్నాగం (నవంబర్ 5న) వార్షికోత్సవం నాడు గై ఫాక్స్ ప్రతిరూపం తయారు చేసి ప్రజలు హేళన చేస్తుంటారు.

# హాస్యతోరణం

## ఖగోళ శాస్త్రానికి కాల నిర్ణయం!



ఒక ఖగోళ శాస్త్రజ్ఞుడు తన సంపన్న విందు భోజనానికి హాజరైన ఒక 15 ఏళ్ళ అమ్మాయి చెప్పిన విశేషం విని వినోదించాడు. యౌవనపు నిష్కాపట్యంతో ఆ అమ్మాయి హఠాత్తుగా ప్రశ్నించింది 'మీరేమి చేస్తుంటారు?'

'నేను ఖగోళ శాస్త్రం అధ్యయనం చేస్తుంటాను' అని శాస్త్రవేత్త జవాబిచ్చాడు.

'నిజంగా?' అంటూ ఆ విశాలనేత్రాల యువతి ఉక్కిరిబిక్కిరై, "నేను గత సంవత్సరమే ఖగోళ శాస్త్రం చదవటం పూర్తి చేశాను!" అంది.

## స్థల ప్రాముఖ్యం

భూమ్యాకర్షణ శక్తి కనిపెట్టటం గురించి ఫిజిక్స్ ఉపాధ్యాయుడు క్లాసులో బోధిస్తున్నాడు. ఆయన చెప్పాడు "సర్ ఐజాక్ న్యూటన్ నేల మీద కూర్చుని పైకి వంక చూస్తున్నాడు. ఒక యాపిల్ పండు అతని తల మీద పడింది. దానితో అతనిలో ఆలోచనలు రేకెత్తి, భూమ్యాకర్షణ శక్తిని కనుగొనటం జరిగింది. ఇది ఆశ్చర్యకరంగా లేదా?"

'అవునండీ! కానీ అతను తన క్లాసురూంలోనే కూర్చుని ఉపాధ్యాయులు చెప్పే పాఠాలు వింటూ ఉన్నట్లయితే భూమ్యాకర్షణ శక్తి సిద్ధాంతాన్ని కనిపెట్టగలిగేవాడే కాడు!"

# చమత్కారం - వారి ఆభరణం

ప్రొఫెసర్ డా.ఎస్.వి.చిట్టిబాబు

వైస్-చెయిర్మన్, తమిళనాడు స్టేట్ కౌన్సిల్
ఫర్ హైయర్ ఎడ్యుకేషన్



Dr S V Chittibabu

భారతదేశంలోని అగ్రశ్రేణి విద్యావేత్తలలో ఒకరైన డాక్టర్ ఎస్.వి. చిట్టిబాబు 1975 నుండి 1978 వరకు మదురై కామరాజ్ యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్‌గా, 1980 లో తమిళనాడు రాష్ట్ర ప్రణాళికా సంఘం పూర్తి కాలపు సభ్యుడుగా, 1980 నుండి 1986 వరకు అన్నామలై యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్‌గా పనిచేశారు. విదేశాల్లో జరిగిన అనేక విద్యా గోష్ఠులలో భారతదేశ ప్రతినిధిగా పాల్గొన్నారు!

ప్రతివ్యక్తీ ఎల్లవేళలా హాస్యప్రియత్వం కలిగి ఉండాలి ఈ హాస్యప్రియత్వంవల్లనే గొప్ప వ్యక్తులు వెలిబుచ్చిన చమత్కార సంభాషణలను, చింత గొలిపే అభిప్రాయాలను, ఆత్మశక్తి కలిగించే చతురోక్తులను గ్రహించి అనుభవించవచ్చు వీరి జీవితాల నుండి మనం అనేక వినోదాత్మక సంఘటనలు సేకరించి ఉదాహరణలుగా ఉపయోగించు కుంటున్నాము తప్పక గుర్తుంచుకోదగిన కొన్ని వినోదాత్మక సంఘటనలను గురించి ఇప్పుడు తెలుసు కొందాము.

ఆంగ్ల కవీశ్వరుడు జాన్ మిల్టన్ అంధత్వం ప్రాప్తించగానే ఒక స్త్రీని వివాహం చేసుకున్నాడు అయితే ఆమె గయ్యాళిగా తయారైంది కానీ అతని స్నేహితుడైన డ్యూక్ ఆఫ్ బకింగ్ హామ్ ఆమెను 'గులాబి' అని పిలిచేవాడు దీనికి మిల్టన్ పరిహాసపూర్వకంగా వ్యాఖ్యానిస్తూ "నేను రంగులకు సంబంధించిన న్యాయమూర్తిని కాను నీవన్నది నిజమేనేమో, ప్రతిరోజు ముళ్ళస్పర్శ అనుభవిస్తున్నాను"

లార్డ్ రస్సెల్‌ను ఒక ఖ్యాతి గడించిన వ్యక్తి అడిగాడు "బహు భర్తృత్వం లేదా బహు భార్యాత్వానికి అత్యంత కఠినమైన శిక్ష ఏది?" దీనికి లార్డ్ రస్సెల్ ఏ మాత్రం సంశయించ కుండా జవాబిచ్చాడు "ఇదరు అతగార్లు"




గొప్ప ఇటాలియన్ కవి, "దైవికమైన చమత్కారం"కు ప్రసిద్ధి చెందిన వ్యక్తి అయిన డాంటే ఒక పర్యాయం వెరోనా రాజు సిగ్నర్ స్కాలా రాజసభను సందర్శించాడు అప్పుడు రాజు అడిగాడు "సిగ్నర్ డాంటే!

... మరొకటి ప్రతిబింబిస్తాయి ప్రతి ...

... సంసారం చేసేవారి ... వాసంగా ఉంటుంది"

మీవంటి అఖండ మేథా సంపన్నుణ్ణి నా రాజసభకు చెందిన వారు ద్వేషించటమేమిటి? నావంటి మూర్ఖుణ్ణి విపరీతంగా వారు


DISRAELI

ప్రేమించడమేమిటి?'' అహంభావంతో, దుడుకు తనంతో కూడిన ఈ ప్రశ్న కోపకారణం కాగా డాంటే ఇలా జవాబిచ్చాడు ''మనకు బాగా ప్రతిబింబంగా కనిపించిన వారినే మనం ఎక్కువగా ఇష్టపడతామనే విషయం మీరు ఒప్పుకున్నట్లయితే, ప్రభువులు దీనికి ఆశ్చర్యపడనక్కరలేదు''

దురదృష్టానికీ, ఆపద (విపత్తు)కూ తేడా ఏమిటో చెప్పమని ఒకసారి డిస్రేలీని ఎవరో అడిగారట. దానికి ఆయన శాంతంగా ఇచ్చిన జవాబు ''గ్లాడ్స్టన్ థేమ్స్ నదిలో పడినట్లయితే అది దురదృష్టం! ఎవరైనా అతణ్ణి కాపాడితే అది విపత్తు''

ఇంగ్లండ్ చాన్సలర్‌గా లార్డ్ బేకన్ పని చేస్తున్నప్పుడు ఒక చమత్కారి అయిన నేరస్థుణ్ణి ఆయన దగ్గరకు తీసుకువెళ్ళారు ''గౌరవనీయు ! తమరు నన్ను విడుదల చేసేందుకు ఆనందిస్తారు కారణమేమిటంటే మనం ఒకే కుటుంబానికి చెందినవాళ్ళం నా పేరు హాగ్ హాగ్ బేకన్‌కు బంధువు''

''వ్రేలాడే వరకు (ఉరి) మాత్రం కాదు'' .అని చివాట్లు పెట్టాడు బేకన్

తనను విపరీతంగా విసిగిస్తున్న ఒక చిక్కిపోయిన (సన్నని) మనిషితో డగ్లస్ జిర్రాడ్ ఇలా వ్యాఖ్యానించాడు ''అయ్యా, మీరు ఒక గుండు సూది మాదిరిగా ఉన్నారు అయితే దానికి తలగాని, మొనగాని లేవు''

ఫ్రెంచ్ చక్రవర్తి నెపోలియన్ బోనాపార్టీకి వర్తక వ్యాపారాలన్నా, ఆపని చేసేవారన్నా ఎంతమాత్రం ఇష్టముండేది కాదు ఆంట్వెర్ప్ నగర సమీపంలోకి చేరుకుంటున్న సమయంలో నెపోలియన్‌కు అఖండ స్వాగతం ఇచ్చే ఉద్దేశంతో ఒక వాణిజ్య ప్రతినిధి వర్గం ఆయన్ని కలిసింది అప్పుడు నెపోలియన్ చెప్పిన మాటలు ''నాకు వర్తకులంటే


NAPOLEON

ఇష్టంలేదు! ఒక షిల్లింగ్‌కు తన దేశాన్ని కూడా అమ్మే మనిషి వర్తకుడే''

ఎంతో ప్రాముఖ్యమైన విషయం గురించి ఆలోచనకు కూర్చుని, తరువాత తన దగ్గరకు వచ్చిన లార్డ్స్‌తో (ప్రభువులతో) ఆంగ్ల సార్వభౌముడు జేమ్స్ I చెప్పేవాడు ''మంచిది,

[illegible]

మీరు కూర్చున్నారు బాగానే ఉంది. మరి పొదిగిన వేమిటి?"

ఒకసారి బ్రిటిష్ రాజనీతివేత్త విన్స్టన్ చర్చిల్ రైలు దాదాపు తప్పిపోయారు దానికి



Churchill

చర్చిల్ సతీమణి బాగా కలవరపడ్డారు అప్పుడు చర్చిల్ అంతరంగిక కార్యదర్శి ఆమెను ఊరడించేందుకు ప్రయత్నిస్తూ చెప్పాడు 'విన్స్టన్ ఎంత గొప్ప క్రీడాకారుడంటే ఆయన ఎప్పుడూ ముందుగా వెళ్ళేందుకు రైలుకు అవకాశం ఇస్తారు"

అమెరికా రాజనీతివేత్త అబ్రహాం లింకన్ 1846లో కాంగ్రెస్ ప్రచారం నిర్వహిస్తున్న సమయంలో పీటర్ కార్ట్రైట్ నిర్వహిస్తున్న ఒకదైవోపదేశ సమావేశానికి హాజరయ్యే అవకాశం లభించింది స్వర్గానికి వెళ్ళదలచిన వారిని లేచి నిలబడమని ఆ మత బోధకుడు కోరాడు లింకన్ తప్ప మిగిలిన వారందరూ లేచి నిల్చున్నారు నరకానికి వెళ్ళేందుకు ఇష్టంలేని వారెవరో తెలుసుకోగోరుతున్నానని మత బోధకుడు చెప్పాడు మళ్ళీ లింకన్ మినహా మిగిలిన వారంతా లేచి నిలబడ్డారు అప్పుడు కార్ట్రైట్ ఇలా చెప్పాడు "నా విజ్ఞప్తులకు ప్రతి స్పందించని లింకన్‌ను చూడటం నాకు విచారాన్ని కలిగిస్తున్నది అతడు స్వర్గం వెళ్ళేందుకు ఇష్టపడకపోయినా, లేదా నరకానికి వెళ్ళకపోయినా, తాను ఎక్కడికి వెళ్ళాలను కుంటున్నాడో మనకు తెలియజేయగలడా?" లింకన్ నెమ్మదిగా లేచి నిలబడి ఇలా వ్యాఖ్యానించాడు "నేను కాంగ్రెస్‌కు వెళ్తున్నాను"

"ఆర్ కె ఎస్" అని ప్రజాదరణ పొందిన డాక్టర్ ఆర్ కె షణ్ముగం చెట్టియార్ ఒక ఆదర్శప్రాయుడైన పార్లమెంటేరియన్ అవశ్యకమైన వివరణల సహాయంతో, శక్తివంతమైన వాదనా పటిమతో కేంద్ర శాసన సభలో ఆయన ఉపన్యాసాలు చేసేవారు అంతేకాక హాస్య చమత్కార పూరితమైన వినోదకర ప్రసంగాలు చేసేవారు శాసన సభ స్పీకర్ అయిన తరువాత



Lincoln

ఒక సందర్భంలో డా ఆర్ కె ఎస్ సంప్రదాయ సిద్ధమైన విగ్ (టోపా) లేకుండా శాసనసభలోకి వచ్చారు దీన్ని గురించి ఒక సభ్యుడు ప్రశ్నించగా అత్యంత చమత్కారంతో ఆయన జవాబిచ్చాడు "స్పీకర్‌కు తలకాయ ఉన్నంత వరకు, విగ్ (టోపా) అనేది ఒక అలంకారం మాత్రమే అవుతుంది" ●

# ప్రపంచంలో అతి నిగూఢ సమాధి

ఈజిప్ట్‌లో గిజా సమీపంలో ఉన్న చియోప్స్ పిరమిడ్ (ఈజిప్టు రాజుల సమాధి) అత్యంత ఖచ్చితంగా నిర్మించబడినదీ మరియు ప్రపంచంలోని అత్యంత నిగూఢ సమాధి భవనమనీ భావించబడుతూంది.




"ఛాంబర్ ఆఫ్ నాలెడ్జ్" (విజ్ఞానపు గది) ఇంతవరకూ లభించని చియోప్స్ రాజు యొక్క మమ్మీ (జాగ్రత్త చేయబడిన శవం) రహస్యాల్ని వెలికి తీయాలని అనేక దేశాలకు చెందిన అసంఖ్యాకమైన పండితులు శతాబ్దాల తరబడి ప్రయత్నించి తమ జీవితాలను త్యాగం చేసారు. ఇప్పుడు వింటర్‌బెర్గ్ పురావస్తు శాస్త్రజ్ఞుడు, రచయిత అయిన సిగ్‌ఫ్రైడ్ వాచ్స్‌మన్ ఒక సంచలనాత్మక శాస్త్రీయ పరిశోధన చేసాడు.

చియోప్స్ పిరమిడ్ వాస్తవానికి 146 మీటర్ల ఎత్తు, 230 మీటర్ల చుట్టుకొలతతో ఉన్నదని అతడు నిరూపించాడు. రహస్య ప్రవేశమార్గాలు, గదుల మార్గాల గురించి ఇదివరకు చేసిన అంచనాలకు దీనివల్ల పూర్తిగా కొత్తకోణాలు తలెత్తాయి. ఎట్టకేలకు ఇది పిరమిడ్ రహస్యానికి తాళం చెవిని అతనికి లభింపజేసింది.

వాచ్స్‌మన్ గిజా పీఠభూమిలో 900 ఫోటోలు తీసి ప్రతి చిన్న విషయాన్ని కూడా శ్రద్ధగా పరిశీలించాడు. కైరోలోని ప్రత్యేక పురావస్తు పటాలను కూడా అధ్యయనం చేసి, పాత రికార్డులను ఉపయోగించి, ఒక ప్రాచీన ఈజిప్షియన్ రేఖాగణిత పద్ధతిని పునరుద్ధరించాడు. దీని ఫలితంగా పిరమిడ్ వాస్తు శిల్పం లేక భవన నిర్మాణ శాస్త్రంలోని నిగూఢ ఆకృతులు (కట్టడాలు) అతనికి బహిర్గతం అయ్యాయి. ఏనాడూ అధిరోహించని మృత్యు గోడను - కేవలం కొన్ని సెంటీమీటర్ల వెడల్పు కలది - గాలి వెళ్ళే ఉత్తరపు చిన్న తూము (రంధ్రం) అతడు చివరకు కనిపెట్టగలిగాడు. చియోప్స్ పిరమిడ్‌లో ఇంతవరకు కనిపెట్టని ఛాంబర్స్ (గదులు) - ఇంకా రెండు ఉన్నాయని అతడు విశ్వసిస్తున్నాడు. వీటిల్లో ఒకటి చియోప్స్ మమ్మీదనీ, మరొకటి నాల్గవ ఫారో రాజ వంశానికి చెందిన శక్తిమంతుడైన చియోప్స్ తన కాలానికి సంబంధించిన శాస్త్రీయ విజ్ఞాన సంపత్తినీ ప్రమాణ పత్రాల రూపంలో భద్రపరచిన 'ఛాంబర్ ఆఫ్ నాలెడ్జ్'దీ కావచ్చునని అతడు నమ్ముతున్నాడు.

— 'జర్మన్ న్యూస్' సౌజన్యంతో

## ఆరు మార్గాలలో మూర్ఖుని గుర్తింపు!

ఆరు విషయాల ద్వారా ఒక మూర్ఖుని గుర్తించవచ్చు. కారణం లేకుండా కోపం, దండగ మాటలు, వృద్ధి లేని మార్పు, ఒక ఉద్దేశం లేని విచారణ, పరిచయం లేని వారి పైన విశ్వాసం ఉంచటం, స్నేహితుల్ని విరోధులుగా చేసుకోవటం.

# ఈ శతాబ్దంలో

## ప్రపంచంలో ఎత్తైన భవనం

ప్రపంచంలోని అత్యంత ఎత్తైన కార్యాలయ భవనం - చికాగో (యునైటెడ్ స్టేట్స్)లోని సియర్స్ టవర్ - నిర్మాణం 1973 మేలో పూర్తయింది. ఈ భవనం ఒక కిలోమీటర్ ఎత్తుకు కేవలం 57 మీటర్లు మాత్రమే తక్కువగా ఉంటుంది.

## ప్రపంచ ప్రథమ మహిళా పోలీస్

ప్రపంచంలో ప్రథమ మహిళా పోలీస్ ఆలైస్ వెల్స్ - 1910 సెప్టెంబర్‌లో లాస్ ఏంజిల్స్ (యుఎస్ఏ) పోలీస్ దళంలో చేరింది.

## గర్భస్థ పిండానికి శస్త్ర చికిత్స

1981లో బోస్టన్ (యుఎస్ఏ)లోని బ్రిగ్‌హాం ఉమెన్స్ హాస్పిటల్ డాక్టర్లు తల్లి గర్భంలోని పిండానికి మెదడు శస్త్రచికిత్స చేసి మెదడులో ప్రోగవుతున్న అధిక ద్రవాన్ని వెలుపలికి తీయగలిగారు. గర్భస్థ పిండానికి జరిగిన మొట్టమొదటి శస్త్రచికిత్స ఇదే.

## నౌకలో ప్రపంచం చుట్టిన మొదటి మహిళ

సిడ్నీ (ఆస్ట్రేలియా)కు చెందిన 34 సంవత్సరాల వయస్సుగల నౌకా నిర్మాత మిసెస్ కే కొట్టీ ఒంటరిగా పయనించి, ఎక్కడా ఆగకుండా, 1988 జూన్ 5న ప్రపంచాన్ని చుట్టి వచ్చిన ప్రథమ మహిళగా పేరు తెచ్చుకుంది. 1987 నవంబర్ 29న ఆమె సిడ్నీని విడిచిపెట్టి సముద్రంలో 187 రోజులు గడిపిన తరువాత సిడ్నీ హార్బర్ ముగింపు రేఖ దాటారు.

## 4 నిమిషాలలో మైలు దూరం పరుగు

1954 మే 6వ తేదీన బ్రిటిష్ వ్యాయామ క్రీడాకారుడు రోగర్ బన్నిస్టర్ నాలుగు నిమిషాలకంటే తక్కువ వ్యవధిలో మైలుదూరం పరుగెత్తిన మొదటి వ్యక్తిగా రికార్డు నెలకొల్పాడు.

## 1907లో విటమిన్ల పరిశోధన

1907లో ఎఫ్.జి. హాప్కిన్స్ మొట్టమొదటిసారి విటమిన్లను (ఆరోగ్య జీవితానికి అవసరమైన వస్తువులు) కనుగొన్నాడు. ప్రప్రథమంగా 'విటమిన్' అని పేరుపెట్టాడు.

## హత్యకు గురైన మొదటి కేంద్రమంత్రి

భారతదేశంలో హత్యకు గురైన మొట్టమొదటి కేంద్రమంత్రి 'లలిత్ నారాయణ్ మిశ్రా'. ఆయన రైల్వే శాఖ మంత్రిగా ఉన్నప్పుడు 2-1-1975న సమస్తిపూర్ రైల్వే స్టేషన్లో బాంబు ప్రేలి మరణించారు.

— వేముల్లి గంగాధర్

## 230 మిలియన్ స్త్రీలు పాండు రోగగ్రస్తులు

అభివృద్ధి చెందుతున్న దేశాల్లోని దాదాపు 230 మిలియన్ స్త్రీలు రక్తహీనత లేక పాండురోగంతో బాధపడుతున్నారు. ఆఫ్రికా, ఆసియా, లాటిన్ అమెరికాలలోని 464 మిలియన్ స్త్రీలలో సగం మంది వీరు ప్రాతినిధ్యం వహిస్తున్నారు.

—'వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ రిపోర్ట్' సౌజన్యంతో

వి.హనుమంతురావ్, నేమ

హేమా పటేల్

# ఉచ్చులో చిక్కని బుద్ధి - అదే మనిషికి పునాది

సత్యమంటే ఏమిటి? ఏది సత్యమో, ఏది అసత్యమో మనం ఏవిధంగా భేదం తెలుసుకోగలుగుతాము? ప్రాచీనకాలం నుండీ తత్త్వశాస్త్ర చరిత్రలో ఇవే ప్రధాన అంశాలుగా ఉన్నాయి



మనల్ని మనం తెలుసుకుని మానవుని ప్రవర్తన గురించి కచ్చితంగా అర్థం చేసుకోవటం ద్వారా సత్యాన్ని గ్రహించవచ్చునని మనం నమ్ముతున్నాము

లాభనష్టాలు ఇష్టాయిష్టాల మీటిని ఆధారంగా మానవుడు ఆలోచించి అనుసరిస్తున్నాడు అతను పలురకాలైన తన కోరికల ప్రకారం ప్రవర్తిస్తున్నాడు స్వప్రయోజనానికి సంబంధించిన తలంపులతో మనం చిక్కుకు పోయినట్లే, పరిస్థితులను మనం కోరిన విధంగా చూసేందుకే సిద్ధపడతాము కాని అవి నిజంగా ఎలా ఉంటాయో అలాగే వాటిని చూడలేము అప్పుడు మన తీర్పుకు పునాది - ఏది న్యాయమైనదని కాదు, ఏది మనల్ని ఇష్టపర్చేది సంతోషపెట్టేది అనేదే అవుతుంది

నిజాన్ని సరిగా అవగాహన చేసుకుని సక్రమమైన తీర్పులు ఇచ్చుకునేందుకు మనం మదింపు చేసే తీర్పుల నుండి, ముందుగా ఏర్పరచుకున్న అభిప్రాయాల నుండి బయటపడి ఆ విషయం యొక్క తాత్పర్యాన్ని లేదా దాని ముఖ్యోద్దేశాన్ని వెలకట్టగలగాలి ఉచ్చులో చిక్కుకుపోని మేధ లాభనష్టాలు, ఆదర్శం, పదవి, సాంఘిక స్థాయి - వీటికి అతీతంగా ఉంటుంది తెలుపును తెలుపుగా, ఎరుపు రంగును పసుపు రంగుగా - కలతలేని బుద్ధి మాత్రమే చూడగలుగుతుంది

ఉచ్చులో చిక్కుకోని మేధ - ప్రేమ, దయ (కనికరం), దాతృత్వం, ఇతరులపైన అనుతాపం - వీటిని శ్రద్ధతో పెంచి పోషిస్తుంది ఏ పరిస్థితి సంభవించినా దానికి తగిన విధంగా నిలిచేటట్లు, ఏ పరిస్థితులైనా సరిపెట్టుకునేటట్లు మనిషిని మారుస్తుంది ఒక విశాలమైన, ఉన్నతమైన అవలోకనంతో విషయాలను చొరవగల సూక్ష్మబుద్ధితో చూచే అవకాశం కలిగిస్తుంది

— 'ఎ ఎం ఎ' బులెటిన్ సౌజన్యంతో

## 400 మిలియన్ మంది!

ఒక పదేళ్ళ బాలుడు గాంధీజీ వద్దకు వెళ్ళి ఇలా అడిగాడు "మీరెందుకు చొక్కా వేసుకోరు? మీకు ఒక చొక్కా ఇవ్వమని మా అమ్మని అడిగేదా?" గాంధీజీ చిరునవ్వుతో సమాధానం ఇచ్చారు "నీవు నాకు ఒక చొక్కా ఇస్తే నా సోదరులందరూ కలత చెంది నాతో పోట్లాడుతారు" అప్పుడు ఆ బాలుడు ఇలా ప్రశ్నించాడు "వాళ్ళందరికీ చొక్కాలు ఇస్తాను మీ కెంతమంది సోదరులున్నారు?" "నాలుగు వందల మిలియన్ మంది" అని జవాబిచ్చారు గాంధీజీ — దిగ్భ్రమచెందిన ఆ బాలుని చెక్కిళ్ళు నొక్కుతూ

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1 కల్యాణ్ సోనా అంటే ఏమిటి?
2 ఏంకరేజ్ నగరం (Anchorage city) ఎక్కడ ఉంది?



3 ఇండియాలో అతిపెద్ద ఉప్పు నీటి సరస్సు ఎక్కడ ఉంది?
4 'లౌకిక విధానం గల దేశం' (secular state) అంటే ఏమిటి?
5 'ఇంటర్‌పోల్' అంటే ఏమిటి?
6 మదర్ థెరెసా ఎవరు?
7 ఇండియా ఎప్పుడు రిపబ్లిక్‌గా రూపొందింది?
8 ఇండియాలో ఒక కొత్త రాష్ట్రాన్ని స్థాపించేందుకు ఎవరికి అధికారం ఉంటుంది?

## మాటల మహిమ

1 అణువు (ఎ) చిఱుపట్లు, (బి) సల్లవరి, (సి) వీణ, (డి) స్వల్పము లేక సూక్ష్మము
2 అభిజిత్తు (ఎ) పగలు పదునాల్గు గడియల మీద రెండు గడియల కాలం, (బి) ఒక నక్షత్రము, (సి) గెలుచునది, (డి) విష్ణువు, (ఇ) జ్యోతి
3 చంచల (ఎ) మెఱుపు (విద్యుత్), (బి) లక్ష్మి, (సి) పిప్పలి, (డి) తుమ్మెద
4 చంద్రిక (ఎ) వెన్నెల, (బి) పెద్దయేలకి, (సి) చంద్రభాగానది, (డి) మల్లెతీగ, (ఇ) ఒక జాతి చేప

## బెన్ జాన్సన్ కోరిక నెరవేర్చిన మొదటి ఛార్లెస్

*బెన్ జాన్సన్ (1573-1637) - నాటి ప్రముఖ నాటక రచయిత తనకు కూడా లండన్‌లోని వెస్ట్ మినిస్టర్ అబ్బేలో ఒక చదరపు అడుగు స్థలం ఇవ్వమని ఇంగ్లండ్ రాజు మొదటి ఛార్లెస్‌ను పరిహాస ధోరణిలో అడిగాడు ఇంగ్లండ్‌కు చెందిన గొప్ప వ్యక్తులు, ప్రభువులు సమాధి చేయబడే చోటు అది 1637లో జాన్సన్ మరణించినప్పుడు రాజు అతని కోరికను జ్ఞప్తికి తెచ్చుకుని వెస్ట్ మినిస్టర్ అబ్బేలో సమాధి చేసేందుకు ఏర్పాటు చేసాడు అయితే అక్కడ ఒక చదరపు అడుగు స్థలమే కేటాయించబడినందువల్ల జాన్సన్ నిల బడిన భంగిమలోనే సమాధి చేయబడ్డాడు*

## నేత్ర వ్యాధులకు ప్రధాన కారణం విటమిన్ 'ఏ' లోపం

ఆహారంలో విటమిన్ 'ఏ' లోపం, ప్రోటీన్ల కొంత కారణంగా 'కెరటోమలాసియా', 'జెరోఫ్తాల్మియా' వంటి తీవ్రమైన నేత్రవ్యాధులు వస్తాయి చికిత్స చేయించుకోని పక్షంలో ఈ వ్యాధుల వల్ల శాశ్వతంగా కంటి చూపు కోల్పోతారు అతిసారం (డయేరియా) వంటి వ్యాధులవల్ల బాధపడే పిల్లలకు విటమిన్ 'ఏ', విలువైన ప్రోటీన్లు ప్రత్యేకంగా చేర్చిన ఆహారం ఇవ్వటం అవసరం

[illegible]
వ్యాపారం చెయ్యడు అయితే ప్రతి ఎన్నికా [illegible]
స్థాపించేది ప్రభుత్వ సిద్ధాంతం" — సోక్రటీస్

# వనితాలోకం

## పులిసిన పాలు

ఒక వస్తువు తయారీకి పులిసిన పాలు అవసరమైతే ప్రతి పాల కప్పులో ఒక టేబిల్ స్పూన్ (చెంచాడు) నిమ్మరసం కలపండి. అయిదు నిముషాలసేపు అలాగే ఉంచి తరువాత ఉపయోగించండి. ఇది తియ్యటి పాలను పులియబెడుతుంది.

## వేడిని పీల్చే చెంచా



ఒక గాజు గ్లాసులో వేడి టీ కాని, పాలుకాని పోసేటప్పుడు, దానితోపాటు ఒక చెంచాను కూడా వెయ్యండి. చెంచా వేడిని పీల్చుకుని గాజుగ్లాస్ పగలకుండా చేస్తుంది. కొన్ని రబ్బర్ బాండ్లను గ్లాసుకు చుట్టినట్లయితే పిల్లల చేతిలో నుండి జారి పడకుండా అవి నిరోధిస్తాయి.

## పండ్లను ముక్కలుగా కొయ్యవచ్చు

ఒక రొట్టెల కత్తితో పండ్లను లేదా టొమాటోలను నాజూకుగా కోసి ముక్కలు చేయవచ్చు. ఎండిన పండ్లను కొయ్యాలంటే, మీ కత్తి అంచుకు వెన్న పూయండి. పండు దానికి అంటుకోదు.

## నెగిటివ్‌కు భద్రత

ఫోటోలను మీ ఆల్బంలో పెట్టుకునే ముందు వాటి నెగిటివ్‌లను ఆ ఫోటోల వెనుక ప్రక్క పెట్టండి. మరో ప్రింటు కావలసివచ్చినపుడు ఈ నెగిటివ్‌ను తీసి స్టూడియోకు పంపుకోవచ్చు. నెగిటివ్స్ భద్రంగా కూడా ఉంటాయి.

## పేపిళ్ళపైన మరకలు

మీ టీపాట్ (తేనీటి పాత్ర) అడుగున ఒక పిరడాను జిగురుతో అతికించినట్లయితే దాన్ని ఎక్కడైనా పెట్టుకోవచ్చు. మనుపు చేసిన (పాలిష్) మీ టేబిళ్ళ మీద మరకలు పడవు.

## మొక్కలకు చీడ

మీ మొక్కలకు (చీడ) పురుగులు పట్టినట్లయితే వాటపైన పొడి ఆవాలు చల్లండి. అవి బాగా జారేటట్లుగా చల్లటి నీరు పొయ్యండి. పురుగులు చనిపోతాయి, లేదా బయటికి వస్తాయి.

## అత్యంత విషపూరితమైన సాలెపురుగు

నల్లని (ఆడ) సాలెపురుగు బహుశా ప్రపంచంలోని అత్యంత విషపూరితమైన సాలెపురుగుగా భావించబడుతున్నది. ఈ జాతికి చెందిన మగ సాలెపురుగు హానికరం కాదు. కాని ఆడ సాలెపురుగు కాటువేస్తే ఆ వ్యక్తి తక్షణమే మరణిసాడు.

“సిరినా వేరేది నీకు శాంతిని కొని తేలేదు”

# ఆహారం, ఆదాయం అందించే కర్రపెండలం

డాక్టర్ ఆర్ కావే

కస్సావ - (Cassava) టాపియోకాగా ప్రసిద్ధి పొందింది అది హెచ్చుగా కార్బోహైడ్రేట్ కలిగిన, పలు విధాల ప్రయోజనకరమైన గడ్డ పంట టాపియోకాకు ఇతర పేర్లు మానియక్, మాన్‌డియోకా మరియు యుక్కా ఇండియాలో దీన్ని సాధారణంగా మరవల్లి, కర్రపెండలం, మరగెనసు (లేదా) కుచికిళంగు అని పిలుస్తారు




కర్రపెండలం - అమెరికాలో పుట్టిన పంట 17వ శతాబ్దిలో స్పానిష్‌వారు మెక్సికో నుండి తెచ్చి ఫిలిప్పైన్స్‌లో నాటారు అక్కడి నుంచి తరువాత ఇది ఆసియాలోకి ప్రవేశించింది 19వ శతాబ్ది చివరి భాగంలో కర్రపెండలం ఆగ్నేయాసియా అంతటా సుస్థిరంగా పంపిణీ చేయబడింది ప్రపంచంలోని కర్రపెండలం ఉత్పత్తి చేసే దేశాలలో ఇండియా ఐదవ స్థానం అలంకరిస్తున్నది మొదటి నాలుగు దేశాలు బ్రెజిల్ (దక్షిణ అమెరికా), జైరీ (మధ్య ఆఫ్రికా), నైజీరియా (పశ్చిమ ఆఫ్రికా) మరియు ఇండోనేషియా (ఆగ్నేయాసియా)

ఇండియాలో బ్రిటిష్ పాలనాకాలంలో నాటి తిరువాన్కూర్ సంస్థానానికి చెందిన ఒక రాజు మొట్టమొదటిసారిగా కర్రపెండలాన్ని తమ రాష్ట్రంలో ప్రవేశపెట్టాడు తీవ్రమైన ఆహార కొరతకు కారణమైన రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో ఈ గడ్డ (దుంప) ఆవశ్యకమైన వస్తువుగా తయారైంది హఠాత్తుగా దిగుమతులు నిల్చిపోయినప్పుడు వస్త్ర పరిశ్రమ ఉపయోగించే గంజికి కూడా ఇది ఉపయోగింపబడింది

నేడు కేరళ రాష్ట్రంలో మొత్తం సాగులో ఉన్న భూమిలో 74 శాతం మేరకు కర్రపెండలం పండించటం ద్వారా ఈ రాష్ట్రం దీని ఉత్పత్తిలో గుత్తాధిపత్యం వహించింది దేశంలోని మొత్తం కర్రపెండలం ఉత్పత్తిలో కేరళ 71 25 శాతం సమకూరుస్తున్నది తమిళనాడు మొత్తం సాగు భూమిలో 15 80 శాతం మేరకు కర్రపెండలం పండించి ద్వితీయస్థానంలో ఉన్నది దేశంలోని మొత్తం కర్రపెండలం ఉత్పత్తిలో 25 86 శాతం తమిళనాడు సమకూరుస్తున్నది

కర్రపెండలంయొక్క పిండి పదార్థంతో నిండిన దట్టమైన వ్రేళ్ళు (దుంపలు) లేక గడ్డలు మానవులకుఆహారంగా పనికి వస్తున్నాయి

## అవార్డు

### ఫ్రెంచి ప్రభుత్వం గౌరవించిన భారత శాస్త్రవేత్త

డాక్టర్ జి పి తల్వార్ - డైరెక్టర్, నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇమ్యూనాలజీకి ఆ శాస్త్రంలో అతని అద్వితీయ ప్రతిభకు గుర్తింపుగా ఫ్రెంచి ప్రభుత్వం తన అత్యున్నత పౌర బహుమతి 'ది ఆర్డర్ ఆఫ్ ది లీజియన్ ఆఫ్ ఆనర్' ఇచ్చి సత్కరించింది ఈ గౌరవం పొందేందుకు ఎంపికయిన మొదటి భారత శాస్త్రవేత్త ఈయనే

"స్త్రీ హితుల సమూహాలపైన సులమైన సుఖం ఆధారపడదు వారి ఉన్నత (యోగ్యత), మనస్సులపైనే ఆధారపడుతుంది"

బెన్ జాన్సన్

వీటి ఆకులు బలహీనమైన భూములకు ఆకు పచ్చని (లేత) ఎరువుగా పనికి వస్తున్నాయి దీని కాండం (బోదె) గృహంలో వంటలకు, వేడి చేసుకునేందుకు ఉపయోగిస్తున్నది తియ్యని (తీపిగల) కర్రపెండలం గడ్డల్ని ముడి వస్తువు గానే భుజించవచ్చు లేదా చిప్స్, పిండి, మాక్రోని మొదలైన వివిధ ఆహార పదార్థాలుగా చేసుకోవచ్చు. ఇండియాలో కేరళలోని తక్కువ ఆదాయం గల కుటుంబాలలో చాలాకాలం నుండి ఒక ముఖ్యమైన ఆహార పదార్థంగా కర్రపెండలం ఉంటున్నది తమిళనాడులో గంజి, సగ్గు బియ్యం మొదలైనవాటి తయారీలో కర్రపెండలం ఉపయోగిస్తారు

పిండి పదార్థం గల వస్తువుల్లో కర్రపెండలానికి మరేపంట సాటి రాదు కార్బోహైడ్రేటుల ఉత్పత్తిలో కర్రపెండలం రోజుకు ఒక హెక్టారుకు 250,000 కాలరీలకు చేరుకుంటే, బియ్యంలో 175,000 కాలరీలు, గోధుమలో 110,000 కాలరీలు, మొక్కజొన్నలో 200,000 కాలరీలు మాత్రమే లభిస్తాయి

కర్రపెండలం దుంపలో ఎన్నో ఖనిజాలు (లోహాలు) ఉన్నాయి దీనిలో కాల్షియం, ఫాస్ఫరస్, పొటాషియం మరియు 'సి' విటమిన్‌లు సమృద్ధిగానే ఉన్నాయి పోషకాహారం కొరత (సమస్యను) తీవ్రంగా ఎదుర్కొంటున్న అనేక దేశాలలో - కార్బోహైడ్రేట్లు, ఖనిజాలు చౌకగా లభించే కర్రపెండలం ఒక ప్రధాన పాత్ర నిర్వహించవచ్చు దీని ఫలితంగా ప్రపంచంలోని కర్రపెండలం ఉత్పత్తిలో 70 శాతం వరకు ఆహారంగా ఉపయోగపడుతూంది ఉష్ణ ప్రదేశాల్లోని దాదాపు 250 మిలియన్ ప్రజలకు పిండి పదార్థంగల ఆహారంగా కర్ర పెండలం ఉపయోగపడుతున్నది

నేడు తియ్యని పొటాటో తరువాత రెండవ స్థానం కర్రపెండలం పొందింది ప్రధానంగా చిన్నరైతులే దీన్ని సాగు చేస్తారు పశువుల దాణా, గంజి, ఔషధాల తయారీ, కాగితాలు, జిగురు మరియు ఆహార పరిశ్రమలలో దీన్ని ఉపయోగిస్తారు కర్రపెండలం ఉత్పత్తిదార్లకు - సిల్క్ ఉత్పత్తికి కారణమైన క్రిములు, కీటకాల పెంపకం ఒక సహాయకర వృత్తిగా రూపొందుతోంది కర్రపెండలంలోని ఒలిచి వేసిన ఆకులను సిల్క్‌గా రూపొందించి సిల్క్ కీటకాలు రైతుల ఆదాయాన్ని పెంపొందించేందుకు దోహదం చేసాయి

## అతడే వివేకవంతుడు



తన శక్తి గురించి తెలుసుకున్నవాడు
అతడు వివేకవంతుడు, అతణ్ణి అనుసరించు
తనకు తెలుసనే విషయం తెలుసుకోలేనివాడు
నిద్రించే వ్యక్తి అతణ్ణి మేల్కొల్పు
ఏమీ తెలియనివాడు, తనకేమీ తెలియదని తెలుసు
కోలేనివాడు
అతడు మూర్ఖుడు, అతణ్ణి విసర్జించు
ఏమీ తెలియనివాడు, తనకేమీ తెలియదని తెలుసు
కున్నవాడు
ఒక పసివాడు, అతనికి బోధించు

— అరేబియన్ సూక్తి

"గుర్తుంచుకో నీ అనుమతి లేకుండా ఎవరూ నిన్ను హీనపర్చలేరు"

# విజ్ఞానవేదిక

## అల్యూమినియం కథ

అల్యూమినియం, వెండి వంటి తెలుపు దనం గల తేలికైన లోహం ఇది దృఢంగా త్రుప్పు పట్టకుండా ఉంటుంది దీన్ని కొత్త కోణాలలోకి వంగదీసి కావలసిన విధంగా మలచుకో వచ్చు బాగా మెరుగు (నునుపు) పెట్టుకో వచ్చు కూడా భూమి ఉపరితలంలో 1/12 (8 శాతం) వంతు ఉండేది అల్యూమినియమే



Bauxite mining team

ఇది ఇతర మూలపదార్థాలతో సమ్మిళితమై 'బాక్సైట్'లో శుద్ధి చేయని ఒక ధాతువుగా ఉంటుంది.

ఫ్రాన్స్‌లోని ఒక పట్టణం - 'లెస్ బాక్స్' - లో మొట్టమొదటి బాక్సైట్ నిల్వలు పరిశోధించ బడ్డాయి అందువల్ల ఈ ముడి ఖనిజాన్ని 'బాక్సైట్' అని పిలవసాగారు దీన్ని నలగ కొట్టటం, పొడి చెయ్యటం (సానబెట్టటం), రసాయనికంగా చికిత్స చేయటం ద్వారా వేడిమితో నిండిన ఈ బాక్సైట్ 'అల్యూమినా'గా మారిపోతుంది ఫేస్ పౌడర్ వంటి తెల్లని పొడి - 'అల్యూమినా'

ఈ 'అల్యూమినా' అనే తెల్లని పొడి నుండి అల్యూమినియం తయారు చేయవచ్చునని హంఫ్రీ డేవీ అనే బ్రిటిష్ రసాయన శాస్త్రజ్ఞుడు మొదట్లో గ్రహించాడు అల్యూమినా నుండి అల్యూమినియం తయారుచేయలేకపోయి నప్పటికీ అతడే ఈ లోహానికి 1807 లో అల్యూమినియం అని పేరు పెట్టాడు

1825లో డెన్మార్క్‌కు చెందిన ఒక ప్రొఫెసర్ హాన్స్ క్రిష్టియన్ ఆర్‌స్టెడ్ తన పరిశోధనశాలలో మొదటి అల్యూమినియం లోహాన్ని ఉత్పత్తి చేసాడు కాని ఈ పద్ధతిని వినియోగపర్చుకునేందుకు ఎవరూ ముందుకు రాలేదు

1852లో ఒక కిలోగ్రాం అల్యూమినియం 4,200 రూపాయలకు విక్రయించబడింది



First aluminium rattle

నెపోలియన్ III భోజనాల బల్లవద్ద గౌరవ నీయులైన అతిథుల ఉపయోగార్థం ఖరీదైన అల్యూమినియంతో తయారు చేసిన చెంచాలు,

ఫోర్కులు (ముళ్ళ గరిటెలు) పెట్టటం జరిగింది



Paul L T Heroult

1855లో ఫ్రెంచి రసాయన శాస్త్రజ్ఞుడు హెన్రీ ఇటిన్నీ - స్టి - క్లారీ డెవిల్లీ అల్యూమినియం పరిశ్రమ స్థాపించాడు అంతకుముందే అల్యూమినియం క్లోరైడును శుద్ధిచేసిన అల్యూమినియంగా చేసే ఖర్చులేని విధానం అతను



Charles Martin Hall

కనిపెట్టాడు పారిస్‌కు చెందిన ఒక ఫ్రెంచి వ్యక్తి పాల్ ఎల్ టి హెరాల్ట్ 1886లో మెటాలిక్ (ఖనిజ) అల్యూమినియం ఉత్పత్తి చేసాడు

క్రయోలైట్‌లో అల్యూమినాను కరగించి దానిలో నుండి విద్యుచ్ఛక్తిని ప్రసరింపచేశాడు. అమెరికాలో చార్లెస్ మార్టిన్ హాల్ అనే ఓహియో యువ శాస్త్రజ్ఞుడు అదే సంవత్సరం అదే విధానాన్ని కనిపెట్టాడు. శుద్ధి చేయబడిన, సరిదిద్దబడిన ఈ ఎలక్ట్రోలిటిక్ పద్ధతినే ప్రపంచమంతటా నేడు అనుసరిస్తున్నారు

ముడి బాక్సైట్ నుండి అల్యూమినియం సంగ్రహించేందుకు వీలుగా 1889లో ఒక జర్మన్ శాస్త్రజ్ఞుడు కార్ల్ జోసెఫ్ బేయర్ మరింత తక్కువ వ్యయమయ్యే పద్ధతి కనిపెట్టాడు ఇప్పుడు అల్యూమినియం ఉత్పత్తిలో బేయర్ పద్ధతి కూడా అమలు జరుగుతున్నది



Metal tapping process

1893లో మొట్టమొదటి సారి ప్రచార నిమిత్తం లండన్ (ఇంగ్లండ్) పిక్కాడిల్లీ సర్కస్‌లో సుప్రసిద్ధ "ఈరోస్" యొక్క పోత అల్యూమినియం విగ్రహం ప్రదర్శించారు వెంటనే అల్యూమినియం ధర కిలోగ్రామ్ 5 రూపాయలకు పడిపోయింది

అల్యూమినియం తయారీకి బాక్సైట్ ఖనిజాన్ని నలగగొట్టి, అపరిశుభ్ర పదార్థాలను తొలగించేందుకు 300 డిగ్రీల (148 8°c) ఫారెన్‌హీట్‌లో వేడి చేస్తారు ఈ పద్ధతిలో

"కృతజ్ఞత అనేది అత్యల్పతమై [illegible] దేవుడు క్షమించడు"

అల్యూమినియం ఆక్సైడ్ స్ఫటికాలు మొదటి దశలో తయారవుతాయి వీటిని రసాయనాలతో మిశ్రమం చేస్తే ఎలక్ట్రికల్ కండక్టర్లుగా పని చేస్తాయి అత్యంత వేడి (శీతోష్ణస్థితి)లో ఈ మిశ్రమాన్ని ఒక నేల మాళిగలో వేడి చేస్తారు



Aluminium ingots

ఈ మిశ్రమాన్ని ఎలక్ట్రోలిసిస్‌కు లోబడేటట్లు చేస్తారు ఈ చిన్నగది (నేల మాళిగ)లో కథోడ్ (వ్యతిరేక ధ్రువం) వద్ద అల్యూమినియం లోహం విడుదల కాగా ఆనోడ్ (నిశ్చయధ్రువం) వద్ద ఆక్సిజన్ ఏక మొత్తంగా ఏర్పడుతుంది దాదాపు 20,000 యూనిట్ల విద్యుచ్ఛక్తి ఒక టన్ను అల్యూమినియం ఉత్పత్తికి అవసరమౌతుంది. ఈ లోహం అప్పుడు కరిగిన ముద్దగా లేక ఘన పదార్థంగా తయారవుతుంది ఈ ముద్దను వేడిచేసి కరిగించిన తరువాత బ్రహ్మాండమైన చదును బండల (రోలర్లు) ద్వారా ప్లేట్లు, రేకులు, వైర్లు వంటి వివిధ ఆకృతులలోకి మలుస్తారు తరచుగా స్వచ్ఛమైన అల్యూమినియం - కరగించే దశలో ఇతర లోహాలతో కలిపితే ''మిశ్రలోహంగా'' తయారవుతుంది

మిశ్రలోహంలో సహజంగా ఉపయోగించే లోహాలు ఇవి రాగి, ఇసుకరాయి (silicon), తుత్తునాగం, క్రోమియం, మెగ్నీషియం, నిక్కెల్, టిటానియం, మరియు ఇనుము ఈ లోహాలను కలుపుకున్నందువల్ల అల్యూమినియం దృఢమయ్యేందుకు, దానిలో ఇతర విశేష లక్షణాలు వృద్ధి పొందేందుకు వీలవుతుంది సిలికాన్ (ఇసుకరాయి) చేర్చితే, ఆ లోహంయొక్క అచ్చుపోత (మూస) గుణాలను అభివృద్ధి చేసుకోవచ్చు యంత్రాలు, పరికరాలు, రేకులు, వైర్లు, పెయింట్లు తయారు చేసేందుకు అల్యూమినియం మిశ్రమలోహాలు ఉపయోగిస్తాయి

అల్యూమినియం ఎన్నోవిధాల ఉపయోగపడుతుంది మెరిసే రైల్వే పాసింజర్ కోచ్‌ల నిర్మాణానికి రైల్వేలు ప్రధానంగా అల్యూమినియాన్నే ఉపయోగిస్తున్నాయి ఉక్కుకంటే అల్యూమినియం మూడోవంతు మాత్రమే బరువు కలిగినందువల్ల రైల్వే ఇంజన్లు అధికసంఖ్యలో పెట్టెలను (కోచ్) లాగ గలుగుతున్నాయి త్రుప్పు పట్టని స్వభావం కలిగినందువల్ల అల్యూమినియాన్ని - వంటపాత్రలు, వంతెనల నిర్మాణాలలో ఒక ఆదర్శవంతమైన వస్తువుగా వాడుతున్నారు

1947లో బ్రిటన్‌లోని సుందర్‌లాండ్‌లో 27 మీటర్ల వెడల్పుగల రైల్వే ట్రాక్, రోడ్డుతో కూడిన మొదటి అల్యూమినియం వంతెన నిర్మించారు కాస్మెటిక్స్, టూత్‌పేస్టులకు అల్యూమినియం కంటైనర్లు ఉపయోగిస్తున్నారు దీని తేలికతనం, దృఢత్వం కారణంగా - విమానాలు, ఆటోమొబైల్స్ నిర్మాణంలో దీన్ని ఉపయోగిస్తున్నారు ఉక్కు మీద మలాము

## తెలియని విషయాలు

### ప్రపంచంలో పెద్ద సమాధి

*221 బిసికి చెందిన మొదటి చైనా సార్వభౌముడు జెంగ్‌యొక్క మౌంట్ లీ సమాధే ప్రపంచంలోని పెద్ద సమాధి ఇది గ్జిసియాంగ్‌కు 40 కి.మీ.ల దూరంలో ఉంది ఈ సమాధిలోని అనేక (వల్లవు) గోతులలో 8,000 మానవ శరీరాకృతిలో ఉన్న ఎఱ్ఱమట్టి (జేగురు మన్ను) రంగు సైనికుల బొమ్మలు కనుగొనబడ్డాయి*

జనతా [illegible] చేస్తుంది'' -ఆల్డస్ హక్స్‌లే

చేసేందుకు, రక్షణ పూతగానూ దీన్ని ఉపయోగిస్తున్నారు.

ప్రపంచంలో ప్రధాన బాక్సైట్ నిల్వలు - ఆస్ట్రేలియా, జమైకా, గినియా, సురినాం, ఫ్రాన్స్, యుఎస్ఎ మరియు ఇండియాల్లో లభిస్తాయి



Aluminium wire rod coil

ఇండియాలో బీహార్, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్, రాజస్థాన్, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఒరిస్సా, ఉత్తరప్రదేశ్, తమిళనాడు, గోవా మరియు గుజరాత్‌లలో ప్రధానంగా బాక్సైట్ నిల్వలు ఉన్నాయి ఇటీవలి సంవత్సరాలలో భూగర్భ శాస్త్రజ్ఞులు ఒరిస్సాలోని పొట్టంగి, ఆంధ్రప్రదేశ్ లోని గైలకుండి, రకొటనియ, కటుకిలలో అపారమైన బాక్సైట్ నిల్వలు కనుగొన్నారు ఈ నిల్వలు ప్రపంచంలోని ఉత్తమశ్రేణికి చెందినవే కాక ప్రతి రాష్ట్రంలో 50 మిలియన్ టన్నులకు పైగా లభిస్తాయి అన్ని తరగతులకు చెందిన బాక్సైట్ నిల్వలు 265 37 కోట్ల టన్నుల మేరకు ఉంటాయని అంచనా వేయబడింది ప్రపంచ వనరులలో ఈ నిల్వలు 1/60వ వంతుగా ఉంటాయి

ప్రధానమైన అల్యూమినియం స్థావరాలు - రేణుకూట్ (ఉత్తరప్రదేశ్), కోర్బా (మధ్యప్రదేశ్), హిరాకుడ్ (ఒరిస్సా), అల్వే (కేరళ), బెల్గాం (కర్ణాటక), మెట్టూరు (తమిళనాడు), జేకేనగర్ అసన్‌సోల్ వద్ద (పశ్చిమ బెంగాల్) మరియు అంగుల్, ఢెంకనాల్ జిల్లా (ఒరిస్సా)లలో ఉన్నాయి

అభివృద్ధి చెందిన దేశాలలో మాదిరిగా కాక ఇండియాలో అల్యూమినియం అత్యధికంగా విద్యుచ్ఛక్తి పంపిణీకి ఉపయోగించబడుతున్నది విద్యుత్ పరిశ్రమకు అవసరమైన కేబిల్స్ మరియు కండక్టర్సు (విద్యుత్‌వాహక శక్తులు)గా - మొత్తం అల్యూమినియం ఉత్పత్తిలో దాదాపు 55 శాతం ఉపయోగించబడుతున్నది ●

## సంపూర్ణ మానవజీవికి ఆవశ్యకాలు



Dr. S. Radhakrishnan

మన జీవితాలను నిర్మించుకునేందుకు సైన్స్ తోడ్పడుతుంది అయితే జీవన చైతన్యాన్ని శక్తివంతం చేసేందుకు, నిర్మలం చేసేందుకు మరో క్రమశిక్షణ కావాలి పాదుపుగా ఉన్న వ్యక్తి పూర్ణ వ్యక్తి కాడు ఒక పూర్ణజీవి కావాలంటే, సమాజానికి నిస్వార్థంగా సేవచేసే ప్రేమాభిమానాలు, ఉప్పొంగే ఆత్మల యొక్క అనుగ్రహం, ప్రసన్నత మనం అలవరచుకోవాల్సి ఉంటుంది

— డా ఎస్ రాధాకృష్ణన్

"బుద్ధిని నెమ్మదిగా (శాంతంగా) ఉంచడమంటే నీ కార్యకలాపాలను నిలిపివేసుకోమని అర్థం కాదు నిజమైన పనిపాటలు చేసుకుంటూనే నెమ్మదిగా ఉండటం అలవరుచుకోవాలి."

# మీకు తెలుసా?

## పేరులో తేడా!

గాంధీజీ "మై ఎక్స్‌పెరిమెంట్స్ విత్ ట్రూత్" అనే పుస్తకం పేరు మైకేల్ హెండర్‌సన్ వ్రాసిన పుస్తకం పేరు "ఎక్స్‌పెరిమెంట్స్ విత్ అన్‌ట్రూత్"

## ప్రపంచ అడవుల్లో 25 శాతం సైబీరియాలోనే




కేవలం 20వ శతాబ్దిలోనే ఆర్థికాభివృద్ధి ప్రారంభమైన సైబీరియా (రష్యా)లో ప్రపంచంలోని అడవుల్లో నాలుగవ వంతు ఉన్నాయి

## కథారూప వివరణం

అలిగొరి - Allegory (కథారూప వివరణం లేక దృష్టాంతం) అనేది సాహిత్య సంబంధమైన పదం ఒక నీతిని తెలిపేందుకు అలంకారిక భాషలో చెప్పే ఒక ప్రసంగం లేదా వివరణ ఉదాహరణకు జాన్ బన్యాన్ యొక్క 'పిలిగ్రిమ్స్ ప్రోగ్రెస్'

## గుత్తాధిపత్యం

'మోనోపలీ' -Monopoly (గుత్తాధిపత్యం) ఒకరి ఆధిపత్యం క్రిందనే ఉత్పత్తి యావత్తూ అదుపు చేయబడే (విపణి) వ్యాపార వ్యవస్థకు సంకేతం

## శరీరంలో పెద్ద ఎముక

మానవ శరీరంలోని అతి పెద్ద ఎముక - తొడ ఎముక 1 8 మీటర్ల పొడవున్న మనిషిలో దీని కొలత 50 16 సెం మీ లు ఉంటుంది

## హేళన

బర్లెస్క్యూ - Burlesque (హేళన లేక ఎగతాళి) ఒక సాహిత్య రచన లేక నాటక భాగంలో వ్యంగ్య చిత్రణ చేసి హాస్యం సృష్టించటం

## తోకలపై వ్రేలాడే కోతులు

"కొత్త ప్రపంచం" (అమెరికా) కోతులు మాత్రమే తోకలమీద వ్రేలాడగలవు కానీ ఆఫ్రికా, ఆసియాలలోని కోతులు తోకలమీద వ్రేలాడలేవు!

## ప్రమాద హెచ్చరిక చేసే విద్యుత్ పరికరం

జర్మనీకి చెందిన బెట్లిన్ సంస్థ ప్రమాద హెచ్చరిక చేసే ఒక విద్యుత్ పరికరాన్ని తయారు చేసింది ఎక్కడైనా పొగ వ్యాపించిన వెంటనే ఇది మోగుతుంది దీనితోపాటు వసారాలో అపాయాన్ని తెలియజేసే దృశ్య, శ్రవణ యంత్రాలను కూడా అవసరంగా నెలకొల్పవచ్చు దీనివల్ల అగ్ని ప్రమాదం జరిగిన స్థలాన్ని సిబ్బంది త్వరగా గుర్తించగలుగుతారు ఎవరైనా అపాయంలో చిక్కుకుపోతే వారిని కాపాడ గలుగుతారు

—"ఇన్‌వెస్టర్ ఇంటెలిజెన్స్" సౌజన్యంతో

వివాహం ... అనగా నిష్కపటులైన తల్లిదండ్రుల బిడ్డ - ఆ ఇద్దరు వాలసియుండు తప్పకపోవటం మరియు నిర్దిష్టంగా ఉండటం"

## పాత్రపేరు షెర్లాక్ హోమ్స్

సర్ ఆర్థర్ కోనన్ డాయిల్ వ్రాసిన డిటెక్టివ్ కథాపరంపరలోని సుప్రసిద్ధ డిటెక్టివ్ పాత్రపేరు షెర్లాక్ హోమ్స్

## క్రిమియన్ యుద్ధంలో క్లోరోఫాం వినియోగం

క్రిమియన్ యుద్ధంలో (1854-56) గాయపడిన సైనికుల బాధను నివారించేందుకు వీలుగా క్లోరోఫాం (Chloroform) (స్పృతి తప్పేటట్లు చేసే ఔషధం) ఎనస్థిటిక్స్ మొదటిసారిగా ఉపయోగించారు

## ఆంగ్ల సారస్వతంలో గొప్ప విషాదాంత నాటకం

ఆంగ్ల సారస్వతంలో అత్యంత విషాదాంత నాటకంగా విలియం షేక్స్పియర్ ప్రసిద్ధ నాటకం "హామ్లెట్" (Hamlet) గణుతికెక్కింది

## మెఱుపుల వేడి


lightning

ఒక (మెఱుపు) పిడుగు 36,000 డిగ్రీల సెంటిగ్రేడ్ వేడిమిని ఉత్పత్తి చేస్తుంది సూర్యుని ఉపరితలంకంటే ఇది ఐదురెట్లు వేడిమితో ఉంటుంది

## చర్చిల్‌కు నోబెల్ బహుమానం


Churchill

బ్రిటిష్ ప్రధానమంత్రి విన్‌స్టన్ చర్చిల్ (1951-55) వ్రాసిన 'ది సెకండ్ వరల్డ్ వార్' (6 సంపుటాలు, 1948-53) అనే గ్రంథానికి 1953లో నోబెల్ సారస్వత బహుమానం లభించింది

## అసలైన 'గ్రీన్' కాగితం

పర్యావరణ అభివృద్ధి కోరే నకళ్ళు వ్రాసేవారు, లేజర్ ముద్రాపకులు - ఇప్పుడు ఒక అసలైన 'గ్రీన్' పేపరును వాడగలుగుతున్నారు దీనికి రెండు ప్రక్కలా నకళ్ళు తీసుకోవచ్చు ఆస్ట్రేలియా (యూరప్)లోని ఒక వాణిజ్య సంస్థ తయారు చేసిన ఈ కాగితం పర్యావరణ పరిరక్షణకు రెండు విధాల తోడ్పడుతున్నది మొదటిది ఈ కాగితం రంపపు మిల్లుల నుండి వచ్చిన చెక్క ముక్కలు లేదా తరుచుగా వృథా అయ్యే మ్రానుల యొక్క వలచని పొరలు - వీటితో తయారు చేస్తున్నారు రెండవది క్లోరిన్ వాడకుండా దీన్ని శుద్ధి చేస్తారు

— 'సిఐఐ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

'ఆనందం - సీతాకోకచిలుక వంటిది దాన్ని వెంబడిస్తే ఎప్పుడూ చేతికి చిక్కదు కానీ నిశ్చలంగా కూర్చుంటే మన సరసన వాలుతుంది''

# వీరిని గురించి తెలుసుకోండి

డాక్టర్ కాళిందీ చరణ్ పాణిగ్రాహి ప్రసిద్ధ ఒరియా సాహితీవేత్త 'మటిర్ మనిస' నవలకు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందారు ఇది 14 భారతీయ భాషల్లోకి అనువదించ బడింది



BHAGAT SINGH

భగత్‌సింగ్ (1907- 1931) "షహీద్-ఐ-అజాం"గా గుర్తుంటారు భారత స్వాతంత్ర్య సంగ్రామ నినాదంగా రూపొందిన "ఇంక్విలాబ్ జిందాబాద్" అనే నినాదాన్ని ఎలుగెత్తి చాటిన మొట్టమొదటి భారత విప్లవకారుడితడు తీవ్రమైన ఆదర్శాల కోసం పోరాడిన వ్యక్తి బ్రిటిష్ వారు 1931 మార్చి 23 న భగత్‌సింగ్‌ను ఉరి తీశారు

గ్రాహం గ్రీన్ రచనా త్రిమూర్తులలో ఒకరు మిగిలిన ఇద్దరు సోమర్సెట్ మామ్, లీ కర్రి "ది పవర్ అండ్ ది గ్లోరీ" "అవర్ మాన్ ఇన్ హవానా," "ది తర్డ్ మాన్" మరియు "ఏ సార్ట్ ఆఫ్ లైఫ్" ఇతడి ప్రసిద్ధ రచనలు

విక్రంసేత్ ప్రఖ్యాత భారత రచయిత శాన్ ఫ్రాన్సిస్కో జానపదుల గురించి అతడు వ్రాసిన 300 పేజీల నవల (పద్యాకృతి) 'ది గోల్డెన్ గేట్' తో ఖ్యాతిలోకి వచ్చాడు అతని మరో నవల "ఏ సూటబుల్ బాయ్" స్వాతంత్ర్యానంతరం భారతదేశంలో జరిగిన సంఘటనలపై కూర్చబడింది ఇది టాల్‌స్టాయ్ "వార్ అండ్ పీస్" కంటే దీర్ఘమైనది

జె హెచ్ పైనీ దారిద్ర్యంతో సన్నిహిత పరిచయం గల అమెరికా రచయిత "క్లారి, ది మెయిడ్

## మన తలపుల తలదన్నే అత్యున్నత న్యాయచట్టం



Emerson

ప్రతిరోజు మన చుట్టూ జరుగుతున్న విషయాలను గురించి కొద్దిగా యోచిస్తే మనం నిర్మించుకున్న దానికంటే గొప్పదైన ఒక న్యాయచట్టం సంఘటనలను క్రమబద్ధం చేస్తున్నదని గ్రహించుకుంటాము మన బాధాకరమైన పనులు అనవసరాలు, నిష్ఫలాలనీ, సులభమైన, తేలికైన, తనంతట తానే జరిగే కార్యాలు వృథమైనవని గమనిస్తాము

— ఎమర్సన్

"వర్తమానంపట్ల మనుషులకు లక్ష్యం లేకపోయినట్లైతే, సమీప భవిష్యత్తులో వారికి సుఖం లభిస్తుంది" -ఎ పి శర్మ

ఆఫ్ మిలన్' అనే సంగీత రూపకంలోని అతని పాట "హెూం స్వీట్ హెూం" అత్యంత ప్రజాదరణ పొందింది

లియో టాల్‌స్టాయ్ (1828-1910) సుప్రసిద్ధ రష్యన్ రచయిత, తత్త్వవేత్త, సంస్కర్త 1890 లో తన సంపదలను విడనాడి కృషీవలునిగా పనిచేయటం ప్రారంభించాడు ఆయన రచనలలో కొన్ని "వార్ అండ్ పీస్," "అన్నా కెరినినా," "వాట్ ఐ బిలీవ్"

జి డి బిర్లా (1894 - 1983) ఒక వాణిజ్యవేత్త ఆర్థిక నిపుణుడు, తాత్త్వికుడు, సంఘ సంస్కర్త, వదాన్యుడు స్వాతంత్ర్యంకోసం, సామాజిక సంస్కరణలకోసం గాంధీజీ సాగించిన కార్యక్రమాల్లో పాల్గొన్నాడు ఈయన అనేక విద్యా సంస్థలు, ప్రజోపయోగ సంస్థలు నెలకొల్పాడు వాటిలో ప్రసిద్ధమైనది - ఆయన జన్మస్థలం పిలాని (రాజస్థాన్)లో స్థాపించిన బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ అండ్ సైన్సెస్ సంస్థ

మార్లిన్ డెట్రిచ్ అంతర్జాతీయంగా తారాపథం అందుకున్న ఏకైక జర్మన్ నటీమణి హాలీవుడ్‌లో జీవనోపాధిని ఎన్నుకున్న ఏకైక జర్మన్ వనిత "బ్లూ ఏంజిల్"లో ఆకర్షణీయమైన పాత్ర 'లోలా'ను పోషించిన నటి అంతకు ముందు ఇటువంటి పాత్ర సినిమాల్లో ఎవరూ చూసి ఉండలేదు

డాక్టర్ ఎస్ ఆర్ రంగనాథన్. గ్రంథాలయ, సమాచార విజ్ఞానశాస్త్ర రంగాలలో ఆయన పేరు అగ్రస్థానంలో ఉంటుంది ఇండియాలో లైబ్రరీ సైన్స్‌కు పునాది వేసింది ఈయనే "ఫైవ్ లాస్ ఆఫ్ లైబ్రరీ సైన్స్" అనే పేరుతో వెలువడిన ఆయన గ్రంథం మిక్కిలి ప్రసిద్ధి పొందింది లైబ్రరీ సైన్స్‌లో ఫెలోషిప్, స్కాలర్‌షిప్స్ ప్రారంభించి తన ఆదాయాన్ని దాని కోసం వెచ్చించారు

నిరాధ్ సి చౌదురి: సుప్రసిద్ధ భారతీయ చింతనాపరుడు, రచయిత ఈయన వ్రాసిన ప్రసిద్ధ రచనలు "ఏన్ ఆటోబయాగ్రఫీ ఆఫ్ అన్‌నోన్ ఇండియన్," "పాసేజ్ టు ఇంగ్లండ్," "కాంటినెంట్ ఆఫ్ సిర్స్" మరియు మాక్స్ ముల్లర్ ఆత్మకథ

## దీని అర్థం ఏమిటి?



Sri Ramana Maharshi

శ్రీ రమణ మహర్షి పారశాల వదిలివేసిన అనేక సంవత్సరాల తరువాత ఆయనకు తమిళం బోధించిన ఉపాధ్యాయుడు చూసేందుకు వచ్చాడు తన ఉపాధ్యాయుని గుర్తించిన మహర్షి తాను తమిళంలో వ్రాసిన గ్రంథాలలో ఒకదాన్ని ఆయనకు సమర్పించాడు మహర్షి రచనా విధానాన్ని ఉపాధ్యాయుడు మెచ్చుకున్నాడు ఆ తరువాత ఆ గ్రంథంలోని ఒక పద్యం అర్థం అడిగాడు అప్పుడు తన సమీపంలో నిలబడిన భక్త జనంవంక చూసి మహర్షి ఇలా అన్నారు "ఆయనను చూడండి ఇటువంటి ప్రశ్నల బెడద నుండి తప్పించుకునేందుకే నేను బడినుండి పారిపోయాను ఆయన మదురై నుండి ఇక్కడికి వచ్చి మళ్ళీ నన్ను ప్రశ్నలు అడుగుతున్నారు - 'దీని అర్థం ఏమిటి?' అని"

"చదువు (విద్య) సంస్కృతి (నాగరికత) కాదు. విద్య కావలసినది మేధకు కాగా, సంస్కారం కావలసినది హృదయానికి"

# అనుకున్నది సాధించిన షా

బ్రిటిష్ నాటకకర్త, విమర్శకుడు జార్జ్ బెర్నార్డ్ షా - ఆంగ్ల నాటకాలు, పుస్తకాలు, ఇతర రచనలు చేసిన ప్రఖ్యాత రచయితలలో ఒకడు అతడు 1925లో సారస్వతంలో నోబెల్ బహుమతిని అందుకున్నాడు


George Bernard Shaw

షా కేవలం అయిదేళ్ళపాటే పాఠశాలలో విద్యాభ్యాసం చేసాడు ఒక పేద ఐరిష్ వ్యక్తి కుమారుడైన షా 15 ఏళ్ళ ప్రాయంలోనే నెలకు 4 1/2 డాలర్ల వేతనంపై ఒక గుమాస్తాగా పని చెయ్యవలసి వచ్చింది

తాను గొప్ప రచయిత కాగలనని దృఢంగా నమ్మిన షా ఉద్యోగం విడచిపెట్టి రచనా వ్యాసంగం ప్రారంభించాడు రచనల ద్వారా జీవిక గడిపేందుకు అతనికి తొమ్మిది సంవత్సరాలు పట్టింది ఆ మొదటి తొమ్మిదేళ్ళలో - అతని మొత్తం ఆదాయం కేవలం 30 డాలర్లు మాత్రమే

అయినా అతడు తాను గొప్ప రచయిత కాగలనని తీవ్రంగా నమ్మాడు అదేవిధంగా కాగలిగాడు అత్యంత ప్రసిద్ధి పొందిన రచయితలలో ఒకడయ్యాడు తన నాటకాలు, ఇతర రచనల ద్వారా మిలియన్ల కొద్దీ డాలర్లు గడించాడు ఇతి వృత్తాలలో తరచుగా కనిపించే సామాజిక అపహాస్యం (వక్రోక్తి)తో కూడిన అతని నాటక రచనలలో ప్రసిద్ధమైనవి కొన్ని "ది డెవిల్స్ డిసిప్లిన్", "మాన్ అండ్ సూపర్‌మాన్," "పిగ్మాలియన్," "సెయింట్ జోన్"

— 'హిప్నాటిక్' సౌజన్యంతో ●

# పచ్చిక తిని బ్రతుకుతున్నాం

పచ్చిక మీదే మనం జీవిస్తున్నాము గోధుమ, బియ్యం, జొన్నలు, మన జీవితాన్ని మధురం చేసే చెఱకు - అన్నీ పచ్చికకు ప్రతిరూపాలే

జంతువులు తిని బ్రతికేది కూడా పచ్చికమీదే అడవి ఏనుగులు, ఖడ్గమృగాలు, సీమ కుందేళ్ళు చీమలు, మచ్చికైన గొర్రెలు, మేకలు, ఆవులు, గేదెలు, గుఱ్ఱాలతో సహా పచ్చిక మేసి జీవిస్తాయి

మన్నుకు మంచి మిత్రురాలు పచ్చిక పచ్చిక వ్రేళ్ళు మట్టిలోకి చొచ్చుకుపోయి గాలికి కొట్టుకు పోకుండా, నీటిలో కొట్టుకుపోకుండా కాపాడతాయి వర్షపు నీరు భూమిలోకి నెమ్మదిగా జొరబడేందుకు వీలుగా పచ్చిక రక్షక కవచంగా పనిచేస్తుంది నీరులేని రోజుల్లో ఈ భూగర్భ జలాలు ఎంతో అవసరమౌతాయి

చాపలు, బుట్టలు, గోడలు, పైకప్పులు, నేలలు, మరో వంద రకాల నిర్మాణాలకు పచ్చిక పనికి వస్తుంది

*పొడుగుగా ఉన్నా, పొట్టిగా ఉన్నా పచ్చికపైర్లు గట్టిగా (కఠినంగా) ఉంటాయి*

— 'సిఇఇ.ఎన్ఎఫ్ఎన్' సౌజన్యంతో

'ధైర్యవంతులు, జ్ఞానవంతులు, విద్వాంసులు తరచుగా కనిపిస్తారు కాని నిజమైన పెద్దమనిషి మాత్రం అరుదుగా కనిపిస్తాడు'

తరువాత బుద్ధుని వలెనే ప్రబోధ ప్రచారం జీవిత ధర్మంగా ప్రారంభించాడు 30 సంవత్సరాలు ఒకచోటి నుండి మరోచోటికి పయనం సాగించాడు ఆనందానికి (సంతోషానికి) సంబంధించిన తన గొప్ప (శుభ) సందేశాన్ని బెంగాల్, బీహారులలో ప్రబోధించాడు తన సందేశాన్ని క్రూర (అనాగరిక) జాతులకు కూడా - తనపట్ల వారి క్రూర వైఖరిని గురించి ఏమీ ఆలోచించకుండా - అందించాడు తన ప్రచార కార్యక్రమం కోసం శ్రావస్తికీ, హిమాలయాలకూ వెళ్ళాడు

బాల్యంలో అతని పేరు 'వీరా' అతణ్ణి వర్ధమాన్ అని పిలిచేవారు తరువాత మహావీర' (గొప్ప వీరుడు, కథానాయకుడు) అని పిలవటం ప్రారంభించారు ఈ సార్ధకనామం అతనికి ఎలా వచ్చిందనేందుకు ఒక కథ ఉంది ఒకరోజు తన స్నేహితులతో కలిసి ఆటలాడుకుంటున్నప్పుడు, ఒక నల్లని పాము పడగపైన తనపాదం మోపి దాన్ని అణచివేశాడు ఈ విధంగా మహావీరుడు మోహం అనే సర్పాన్ని అణచటం జరిగింది

తన సిద్ధాంతాన్ని ప్రబోధించేందుకు అతడు ఒక చోటినుండి మరోచోటికి ప్రయాణం చేశాడు ఎందరో అతణ్ణి పరిహసించారు కానీ అతడు మౌనం వహించేవాడు! సమావేశాలు జరుగుతున్నప్పుడు వాళ్ళు అతణ్ణి కలతబెట్టి బాధించేవారు, అవమానపర్చేవారు అయినా అతడు నిశ్శబ్దంగా ఉండేవాడు అతడు ఒక అడవిలో ధ్యానం చేసుకుంటున్నప్పుడు ఒక ముఠా మనుషులు అతణ్ణి కొట్టారు అయినా అతడు మౌనంగానే ఉన్నాడు! ఒక అనుచరుడు అతణ్ణి వదలివేసి అతనిపై చెడ్డ (పాపపు) ప్రచారం వ్యాపింపచేశాడు అయినా అతడు నిశ్శబ్దంగానే ఉన్నాడు! అతడు మహావీరుడుగా రూపొందాడు ఒక గొప్ప విజేత, ఒక మహా పురుషుడుగా రూపొందేందుకు కారణం అతడు శాంతి శక్తిని అభివృద్ధి చేసుకున్నందు వల్లనే

అతని బోధనలు సాహసోపేతమైనవి "అన్ని ప్రాణులను నీవలెనే భావించుకో, దేనికీ హాని చెయ్యకు" అన్నింటిలో ఏకత్వాన్ని దర్శించటమంటే ఎవరికీ హాని కలిగించకుండా ఉండటమే

మహావీరుని సుభాషితాలలో విశిష్టమైన, ఒక సుభాషితం "నీకు నీవే స్నేహితుడివి, నీకు నీవే శత్రువు కూడా కనుక మిత్రునిగానే ఉండు! నీకు నీవే శత్రువు కావద్దు! మనమంతా సంతోషం (ఆనందం) కోసం వెదుకుతున్నాము, తద్వారా ఇతరులకు కూడా ఆనందం కలిగిస్తాము ఇదే శాసనం (న్యాయం) ఇతరులను ఎవరైతే ఆశీర్వదిస్తారో, వారు ఆశీర్వదించబడతారు, ఇతరులకు ఎవరైతే హాని కలిగిస్తారో, వారికి హాని కలుగుతుంది"

మహావీరునకు పదకొండు మంది ప్రధాన అనుచరులు, నాలుగువేలకు పైగా సన్యాసులు మరియు సామాన్యులు - మత (విశ్వాసం) కలవారు ఉండేవారు బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులను కూడా చేర్చుకునేవారు అతనికి "కులం" మీద నమ్మకం లేదు 526 బి సి లో పావపురి (బీహార్) లో తన 72 వ ఏట మహావీరుడు దీపావళి రోజున కాలధర్మం చెందాడు

— "ఆనిమల్ సిటిజన్' సౌజన్యంతో ●

## మలబద్ధానికి మందు - ద్రాక్షరసం

ద్రాక్షరసం - పిల్లల మలబద్ధం పోగొట్టే శక్తి కల పానీయం ఉదయం, సాయంకాలాలలో ఒక చెంచాడు ద్రాక్షరసం బిడ్డకు ఇవ్వండి అది అనవసరంగా వాళ్ళు ఏడ్చే అలవాటుని పోగొడుతుంది

"హృదయం నుండి ప్రవహించే దానికన్నా బాహ్య ప్రవర్తన ఏది కాదా - నిజంగా సంతోషపర్చలేదు" —హాన్ ప్లెయర్

# వారలు

## పెద్ద ఏలకుల ఉత్పత్తిలో సిక్కింకు ప్రముఖ స్థానం

హిమాలయాల తూర్పు ప్రాంతంలోని ఇండియా అంతర్భాగమైన సిక్కిం పెద్ద ఏలకుల ఉత్పత్తిలో ప్రధాన స్థానం ఆక్రమిస్తున్నది దేశం మొత్తంమీద పండే ఈ వాణిజ్య పంటలో ఇక్కడ 86 శాతం పండుతుంది

## ఇండియాలో పశుసంపద

ఇండియాలో ప్రతి ఇద్దరు వ్యక్తులకీ ఒక పశువు వంతున ఉన్నది చైనాలో దీని శాతం 1 10

— 'సిఐఇ-ఎస్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## 2005లో ముడిచమురు అవసరం

2005 సంవత్సరానికి ప్రపంచంలో వాడకానికి 83 3 మిలియన్ బారల్స్ ముడిచమురు అవసరమౌతుంది

## ఇండియాలో 17 మిలియన్ బాల కార్మికులు

1987-88 జాతీయ శాంపుల్ సర్వే ప్రకారం ఇండియాలో 17 మిలియన్ బాల కార్మికులు పని చేస్తున్నారు

## కారు లైసెన్స్‌లు సేకరించిన ఘనుడు

కాలిఫోర్నియా (యునైటెడ్ స్టేట్స్)లోని శాన్‌ఫ్రాన్సిస్కోకు చెందిన వెస్ విల్లిగ్‌బై ప్రపంచంలోని ప్రతి అధికారప్రాంతం నుండి కారు లైసెన్సు ప్లేట్లు సంపాదించిన మొదటి వ్యక్తి.

## ఇండియాలో పండ్ల ఉత్పత్తి

ఇండియాలో పండ్ల ఉత్పత్తి ప్రపంచ ప్రమాణాలతో పోలిస్తే ఎకరానికి 1/15 వంతుగా ఉంటుంది దీనిలో 0 5 శాతం మాత్రమే నిల్వ చేయబడి పండ్ల రసాలకు,ఇతర వివిధ ఉపయోగాలకు వాడబడుతున్నది

## ఇండియాలో ప్రైవేటు వైద్యశాలలు

ఇండియాలో ప్రస్తుతం దాదాపు 55,000 ప్రైవేటు ఆస్పత్రులు మరియు నర్సింగ్‌హోమ్స్ ఉన్నాయి

## సామాన్యంగా ఉండటం



సామాన్యంగా ఉండటం అంటే లోభిత్వం కాదు సామాన్యంగా ఉండటంలో సౌందర్యం, కళ కలిసి ఉన్నాయి పరిశుభ్రంగా, చక్కగా, హుందాగా ఉండటానికి తప్పు అవసరం లేదు ఆడంబరం, ఎటాటోపం - తరచుగా అశ్లీలం, అసభ్యతలకు సమానార్థకంగా ఉంటున్నాయి

— గాంధీజీ

"మార్పు లేకపోతే అభివృద్ధి అసాధ్యం, తమమనస్సు మార్చుకోలేని వారు ఏమీ మార్చలేరు"

# దంతాల రక్షణకు కొన్ని సూచనలు

డా. హెచ్.ఆర్. ప్రేమ్ సచ్‌దేవ

1 సక్రమంగా బ్రష్‌తో మీ పండ్లను పరిశుభ్రం చేసుకోండి రోజుకు రెండుసార్లు - ఉదయం పూట, రాత్రి నిద్రించే ముందు మీ పండ్లను పరిశుభ్రం చేసుకోవాలి

2 అపరిమితంగా స్వీట్స్ (తీపి వస్తువులు) తినకండి తీపి వస్తువులు తిన్న ప్రతిసారి మీ పండ్లను నీటితో కడగండి



3 తినే వస్తువుని పిండి అయ్యేటట్లు బాగా నమలండి దానివల్ల నోటిలో అది జీర్ణమౌతుంది

4 ఆపిల్, జామ, పేర్ పండు, కారట్ వంటి ఏ ఇతర పండ్లనైనా కోసేందుకు కత్తిని ఉపయోగించవద్దు వీటిని మీ పండ్లతోనే కొరికేందుకు ప్రయత్నించండి ముక్కలు ఎక్కువ నమలండి దీని ద్వారా పంటి చిగుళ్ళకు, దంతాలకు వ్యాయామం కల్పించండి

5 అతి వేడి పానీయాలు తీసుకోవద్దు వీటిని తరచుగా తీసుకుంటూ ఉంటే మీ పండ్ల ఎనామిల్ (తెల్లని పింగాణీ వంటి పదార్థం)కు హాని కలుగుతుంది ఇది పండ్లలోని నరాలకు బాధ కలిగిస్తుంది

మీ పండ్లతో సోడా సీసాలు తెరవకండి

పండ్లతో అక్రోటు (వాల్నట్) కాయల్ని కొరకవద్దు అలాగే బాదం కాయల వంటి కఠిన వస్తువుల్ని కొరకకండి దీనివల్ల మీ పండ్లలో పగుళ్ళు కోతలు ఏర్పడతాయి దీనివల్ల గుజ్జు (pulp disease) వ్యాధి వస్తుంది

పండ్ల మధ్య నిల్చిన ఆహార పదార్థాల్ని తీసి వేసేందుకు పండ్లుకుట్టు పుల్లలను (tooth pick) ఎప్పుడూ ఉపయోగించవద్దు దీనివల్ల మీ పంటి చిగుళ్ళకు ఇబ్బంది కలుగుతుంది అంతకంటే గొప్ప హాని - మీ పంటి మధ్య (వెడల్పు) దూరాన్ని పెంచుతుంది ఈ పనికి రబ్బర్ బాండును ఉపయోగించండి

## ప్రపంచంలో పెద్ద పొగ చుట్ట

ప్రపంచంలోని ఒక పెద్ద పొగ చుట్టను జర్మనీలోని బ్రెమెన్ టొబాకో మ్యూజియంలో ఒక పెద్ద గ్లాస్ కేస్ (పెట్టె)లో ప్రదర్శిస్తున్నారు ఇది ఆరు అడుగుల పొడవు, 20 పౌండ్ల బరువు కలిగి, 8 6 అంగుళాల వ్యాసంతో ఉన్నది ఈ పొగ చుట్ట కాల్చేందుకు దాదాపు 600 గంటల సమయం తీసుకుంటుంది 386 పౌండ్ల బరువు కలిగి, 12 అడుగుల పొడవున్న ప్రపంచంలోని అతి పెద్ద పైపు (గొట్టం) కూడా ఈ మ్యూజియంలో మరో ఆకర్షణగా ఉంది ఈ బ్రహ్మాండమైన పైపులో 465 పాకెట్ల పైప్ పొగాకు పట్టించవచ్చు

"సంతోషంలోనూ, దుఃఖంలోనూ ఉన్న త్యాగాలను చేయటంలోనే వైవాహిక జీవితపు ఆనందం ఆధారపడి ఉంటుంది" - జాన్ సెల్డెన్

8 నోటి నుండి దుర్వాసన వస్తుంటే చిటికెడు ఉప్పు, సోడా బైకార్బొనేట్‌లను నులి వెచ్చని నీటిలో కలిపి ఆ నీటితో నోరును ప్రక్షాళన చేసుకోండి మీ పండ్లు పరిశుభ్రం కాకపోయినా, ఈ సమస్య చిరకాలం వేధిస్తున్నా, మీ సైనస్ (వంపు), గొంతుక, ఉదరం, ఊపిరితిత్తులు - పరీక్ష చేయించుకోండి

9 పండ్లలోని రంధ్రాలు (సందులు) తక్షణమే నింపివేయాలి లేని పక్షంలో ఇవి మరింత కుళ్ళి చెడిపోతాయి

10 వక్కలు, పోక చెక్కలు, తమల పాకుల బీడాలు (పాన్), బబుల్ గమ్‌లను నమల వద్దు నిర్విరామంగా నములటంవల్ల నోరు తెరవటంలో తగ్గుదల కనిపిస్తుంది ముఖ కండరాలు ముడుచుకు పోవడం దీనికి కారణం

11 కోపం వస్తే పళ్ళు కొరకకండి నిద్రలో మీ పళ్ళు పటపటమని శబ్దం చేస్తుంటే, సరైన తనిఖీ, వ్యాధి నిర్ణయం కోసం వైద్యుణ్ణి సంప్రదించండి

12 పండ్లకు అరుగుదల (రాపిడి), కొత్త (క్రిమిక్షయం) ఏర్పడినప్పుడు 'ప్యుపిటిస్' (pupitis) రాకుండా తక్షణమే సరిచేసుకోవాలి

13 చల్లటి పదార్థాలు, వేడి పదార్థాలు తీసుకునేటప్పుడు మధ్యలో తగినంత విరామం ఇవ్వాలి అతి తరచుగా జరిగే ఉష్ణోగ్రత మార్పు మీ పండ్లకు నష్టితత్వం కలిగిస్తుంది

14 అసాధారణంగా ఉన్న పండ్లు, సక్రమంగా లేని పండ్లు, ముందుకు పొడుచుకు వచ్చిన పండ్లను బాగుచేసుకునేందుకు దంత వైద్యుణ్ణి ఆలస్యం చేయకుండా సంప్రదించాలి

సమర్థుడైన దంత వైద్యుని చేత సంవత్సరానికి కనీసం రెండుసార్లయినా చెకప్ (తనిఖీ) చేయించుకోవాలి

మీ శరీరానికీ, సంపూర్ణ ఆరోగ్యానికీ పండ్లు భద్రత కలిగించే కాపలివారు కనుక వీటిని చక్కగా పోషించి కాపాడుకోవాలి

— 'హిందుస్థాన్ టైమ్స్' సౌజన్యంతో

## ప్రతి చలువరాతిలో దాగిన ఓ విగ్రహం



CONFUCIUS

ప్రతి చలువరాతి ముక్కలో ఒక విగ్రహం దాగి ఉంటుంది నిపుణుడైన శిల్పి అనవసర భాగాలను చెక్కి తొలగించివేసి దీన్ని తయారు చేయాలి చలువ రాతికి శిల్పి ఎలాగో, ఆత్మకు విద్య అటువంటిదే విద్యావంతులైన స్వేచ్ఛాజీవులు ఒక చలువ రాతిని సుత్తితో కొట్టి ఒక విగ్రహాన్ని నీవు తయారు చేయలేవు అదేవిధంగా చేతులతో హాని కలిగించి ఒక వ్యక్తిలోని ఆత్మను విముక్తి చేయలేవు

— కన్ఫ్యూషియస్

[illegible]

# తక్షణ కర్తవ్యం - ధ్వనిపై పోరాటం

బోరిస్ ప్రాట్‌కోవ్

20వ శతాబ్దంలో ధ్వని మానవుణ్ణి వేటాడుతున్నది అత్యంత శీఘ్రగమనంతో సాగే వాహనా - కార్లు, బస్సులు, ట్రక్కులు, విమానాలు- ధ్వనికి మూలం (ఉత్పత్తి స్థానం) అవుతుండగా దీన్ని అదుపు చేయటం అత్యంత క్లిష్టంగా తయారౌతున్నది ఆధునిక జీవితంలో ధ్వని - జనులు చేసే పని మీదా, విశ్రాంతి మీదా ప్రభావం చూపుతూ కార్మికుల ఉత్పత్తి సామర్థ్యాన్ని తగ్గిస్తున్నది నాడీ మండలాన్ని బలహీన పరుస్తున్నది కనుక ధ్వనిపై పోరాటం నేటి తక్షణ సమస్యల్లో ఒకటిగా ఉంది



పట్టణంలోని వివిధ ప్రాంతాలలో ధ్వని స్థాయిలలో మార్పులుంటాయని పరిశోధన వెల్లడిస్తున్నది అత్యంత ధ్వనిభరిత ప్రదేశాలు చతురస్రంగా నిర్మించిన ఇళ్ళ సమూహాలు (వాకిళ్ళ) కాక రెండు వైపులా ఫ్లాట్లతో నిండిన బ్లాక్‌లకు చెందిన వీధులుగా వెల్లడయ్యాయి

నగరాలలో అత్యంత ఎక్కువగా, అతి విస్తృతంగా వ్యాపించే ధ్వనికి ప్రధాన కారణంగా ధ్వనిని 80 శాతం - రవాణా వాహనం చేస్తున్నది పారిశ్రామిక సంస్థలు వ్యాపింపచేసే ధ్వని 20 నుండి 30 శాతం ఉంటుంది

నగరాలలో ధ్వని కాలుష్యం అరికట్టేందుకు ఒక సక్రమమైన పట్టణ నిర్మాణ ప్రణాళిక అత్యవసరంగా కావాలి వీటన్నిటికంటే - వీధుల్ని

## నిరంతర పోరాటం




మంచీ చెడులనే శక్తుల మధ్య పోరాటం నిరంతరమైనది శాశ్వతమైనది మొదటిది సత్యం, అహింసలనే ఆయుధాలు ధరించి రెండవ దాని యొక్క అసత్యం, క్రౌర్యం, మృగప్రాయమైన బలాలతో - పోరాటం జరుపుతున్నది భగవంతుని నామం కన్నా ఈ ప్రపంచంలో ఏదీ ఎక్కువ శక్తి కలది కాదు ఆయనను మన హృదయ సింహాసనాధీశుణ్ణి చేసి ఎల్లప్పుడూ అక్కడే సుస్థిరంగా నిలుపుకుంటే మనకు ఏ భయం ఉండదు పైగా జీవితంలో ఒక పెన్నిధిని మనకు మనమే ఏర్పాటు చేసుకున్నట్లుగా కూడా ఉంటుంది

— మహాత్మాగాంధీ

[illegible]

[illegible]

# నవ్వు

## రైళ్ళ టైంటేబిల్



ఒక పుస్తకాల షాపుకు వెళ్ళిన ఖాతాదారు సేల్స్‌గరల్‌ని అడిగాడు "16 ఏళ్ళ వయసున్న నా మేనకోడలుకు ఒక పుస్తకం ఇవ్వాలనుకుంటున్నాను. యాత్రా సంబంధమైన పుస్తకమైతే మంచిది. అయితే దానిలో హింస, రాజకీయాలు, సాంఘిక సమస్యలు, సెక్సు గురించిన విషయాలు ఉండకూడదు"

సేల్స్ గరల్ చెప్పింది "అచ్చగా అటువంటిదే ఉన్నదండీ! ఇదిగోనండి! రైళ్ళ టైంటేబిల్"

## తప్పెవరిదో తెలుస్తుంది

బ్రిటిష్‌కు చెందిన ఒక న్యాయగ్రాహి, విద్యావిహీనుడు అయిన చెప్పులు కుట్టేవాడు అకాడమీలో జరిగే వాగ్వివాదాలకు తరచుగా హాజరవుతుండేవాడు. అక్కడ లాటిన్ భాష వాడుతుండేవారు.

"నీకా భాష అర్థం అవుతూందా?" అని చెప్పులు కుట్టేవాడిని అడిగారు.

"కాదు, అయితే వాదనలో ఎవరిది తప్పో నేను తెలుసుకుంటాను - ఎవరికి ముందుగా కోపం వస్తుందో గమనించటం ద్వారా"

## పెండ్లయింది "స్వర్గం పోయింది"

ప్రొఫెసర్: జాన్ మిల్టన్ కవిని గురించి ఏదైనా చెప్పండి?

విద్యార్థి: అయ్యా, పెండ్లి చేసుకున్న తరువాత పారడైజ్ లాస్ట్ (స్వర్గం పోగొట్టుకున్నాను) వ్రాశాడు. అతని భార్య చనిపోయింది. అప్పుడు "పారడైజ్ రీగెయిన్డ్" (స్వర్గం మరల పొందాను) వ్రాశాడు.

## అమాయక ప్రాణి

ఒక దుకాణదారుడు ధనవంతుడయ్యాడు. ఒక కారు కొన్నాడు. డ్రైవర్‌ను పెట్టుకున్నాడు. ఒకరోజున జనసమ్మర్దంగా ఉండే పట్నంలో వెళ్తుండగా ప్రతి కూడలి దగ్గరా డ్రైవర్ చేతిని బయటికి పెట్టడం చూసి విసుక్కున్నాడు. డ్రైవర్‌తో ఇలా చెప్పాడు "వర్షం ఎప్పుడు కురుస్తుందో నేను చెబుతా కాని నీ పని చూసుకో!"

## పరిమళమా? పరాచికమా?

ఒక అందమైన అమ్మాయి సరసన బస్సులో కూర్చున్న ప్రయాణీకుడు ఆమె వాడిన సువాసన ప్రశాంతం పీలుస్తూ ఆనందిస్తున్నాడు.

"క్షమించండి, మీరు వాడిన పరిమళం పేరు చెప్పగలరా? అది చాలా బాగుంది. నా భార్యకు ఒక సీసా కొనుక్కుని తీసుకువెళ్తాను" అని అడిగాడు.

"సంతోషం ఒక పరిమళం వంటిది. దాన్ని నీమీద కొంతైనా చల్లుకోకుండా నువ్వు ఇతరుల మీద చల్లలేవు."

ఆ యువతి అతనివంక ఉత్సాహరహితమైన చూపు చూసి, లేచి బస్సు నుంచి దిగే ముందు ఇలా చెప్పింది "అది ఆమెకోసం కొనవద్దని నేను సలహా చెబుతున్నాను అలా కొన్నట్లయితే అన్నిరకాల అపరిచిత పురుషులు ఆమెతో సంభాషణకు దిగేందుకు మీరు సిద్ధంగా ఉండండి"

## ప్రార్థన ఫలితం

ఒక కన్య ప్రార్థన "స్వామీ, నాకోసం నేనేమీ అడగటం లేదు కానీ దయతో నా తల్లికి ఒక అల్లుణ్ణి ప్రసాదించు!"

అతి త్వరలోనే ఆమె ప్రార్థన మన్నించబడింది ఆమె చెల్లెలికి వివాహం జరిగింది

## సరాసరి మీదగ్గరికే వచ్చాను!

న్యాయవాది తన కక్షిదారుణ్ణి అడిగాడు 'నీ హక్కు గురించి ప్రతివాదితో చెప్పావా?'

'చెప్పానండీ'
'అతనేమన్నాడు?'
'దయ్యంతో మొరపెట్టుకో, పొమ్మన్నాడు'
'అప్పుడు నీవేమి చేశావు?'
'అయ్యా! సరాసరి మీదగ్గరికే వచ్చాను!'

## తేడా!

ఒక ఉపాధ్యాయురాలు తన క్లాసులోని వారిని ఫలితాలకు, పరిణామాలకు (పర్యవసానాలకు) తేడా చెప్పమని కోరింది ఒక తెలివిగల బాలిక జవాబిచ్చింది "ఫలితాలు మీరు ఆశించేవి, పరిణామాలు మీరు పొందేవి"

## కదలిక

ఒక చిన్న కోస్తా పట్నంలో భూకంపం వచ్చే సూచనలు కనిపించగానే, పురపాలక కార్యాలయ పునాదులు కదులుతున్న దిగ్భ్రమలో సమావేశమౌతున్న పురపాలకులు మామూలు మర్యాద లేవీ పాటించకుండా త్వరగా బయటికి వెళ్ళిపోయారు నియమనిబంధనల పట్ల చింత శాసనుడని పేరొందిన గుమస్తా మాత్రం 'మినిట్స్' పుస్తకంలో సక్రమమైన అధికార భాషలో ఇలా వ్రాశాడు "పురపాలక భవనం కదలిక (మోషన్) ఫలితంగా కౌన్సిల్ వాయిదా పడింది"

## దేవుడు కాపాడుగాక!

ఒక హోటల్ బయటి సంకేత చిహ్నం మేము రాజ్‌భవన్‌కు భోజనం సమకూరుస్తాము

మరో హోటల్ బయట
గవర్నర్‌ను దేవుడు కాపాడుగాక!

## వృత్తి సంబంధమైన ఒత్తిడే ఆపదకు కారణం

కరొనరీ గుండె జబ్బులవల్ల బాధపడేవారికి అవి సంభవించే అవకాశం వృత్తి సంబంధమై ఒత్తిడులవల్ల వస్తున్నది ముఖ్యంగా అత్యధిక మానసిక ఒత్తిడికి గురయ్యే ఉద్యోగాలు నిర్వహించే వారికి, తమ పనిలో విశ్రాంతికి అవకాశం లేనివారికి గుండెజబ్బులు వస్తున్నాయి తానే ఆధారంగా ఉన్న కుటుంబాలలోని వ్యక్తులకు ఈ వ్యాధి ఎక్కువగా వస్తున్నది ఉమ్మడి కుటుంబాలలోని సాంఘిక మద్దతు, పరస్పర ప్రభావం ఆ వ్యక్తులకు గట్టి బలాన్ని ఇస్తాయి ఇది చిన్న కుటుంబాలలో ఉండదు మధ్య తరగతి సాంఘిక - ఆర్థిక అంతస్థులోని వ్యక్తులకు కరొనరీ గుండెజబ్బులు ఎక్కువగా వచ్చే అవకాశం ఉంది

*[-పంజాబ్ యూనివర్శిటీ, సైకాలజీ శాఖకు చెందిన శ్రీమతి ప్రతిభా ధూండియా చేసిన అధ్యయనం]*

"అత్యాశ (పేరాశ) బంగారం ప్రోగటంతోపాటు పెరుగుతుంది"

# అంతరంగ శాంతి, ఆత్మ సాక్షాత్కారం దిశగా..

స్వామీ శివానంద

ఈరోజు అవలంబిస్తున్న "శాంతి" భయపడే శాంతి, సన్నద్ధమయ్యే శాంతి విజ్ఞానవంతులైన వ్యక్తుల చిత్తశుద్ధితో కూడిన సలహాను ఉపేక్షించి, ప్రపంచంలోని పెద్ద దేశాలు తమ విధ్వంసక శక్తిని ప్రదర్శించేందుకు పూనుకుంటున్నాయి ఆ దారిలో యుద్ధం పొంచి ఉంది కాని శాంతి కాదు



Swami Sivananda

వివిధ మతాలకు, వివిధ దేశాలకు, వివిధ కులాలకు లేదా వర్గాలకు చెందిన ప్రజలు ఇతరుల పట్ల ఈర్ష్య అసూయ, ద్వేషం, పగ - మతం దేశభక్తి, ఇతర సిద్ధాంతాల పేరుతో రేకెత్తిస్తున్నారు మానవ హృదయంలో మొలకెత్తిన సామరస్య రాహిత్యం మొదట్లో ఆ ఇంటికీ, క్రమేణా సంఘానికీ ప్రాకి, ఆ తరువాత దేశానికి, చివరికి ప్రపంచ మంతటికీ విస్తరిస్తుంది సామాజిక చట్టాన్ని ఎంతగా పునః సర్దుబాటు చేసినా, రాజకీయ వ్యవస్థను ఎంతగా విప్లవాత్మకంగా మలచినా శాశ్వత శాంతి సిద్ధించదు ఇవి ఆవశ్యకాలైన పక్షంలో అవి మానవ హృదయం నుండి పైకి ఉబికి రావాలి - మానవజాతి సంక్షేమం దృష్ట్యా.

మానవుని అంతర్గత ఆత్మకు సహజగుణం - శాంతి. ఈ ఆత్మను గురించిన యదార్థం గ్రహించేందుకు ఎవరైతే కృషి చేస్తారో, ఆత్మ దిశగా తన వైఖరిని ఎవరైతే మార్చుకుంటారో, వారు ఆత్మలో నిండి నిబిడీకృతమైన ఈ శాంతిని అనుభవిస్తారు అణు విచ్ఛేదనం మైళ్ళ పర్యంతం నాశనాన్ని ఎలా వ్యాపింప చేస్తుందో, ఆత్మ నుండి ఉద్భవించే 'శాంతి' యొక్క ఈ అసాధారణ అద్భుత అనుభవం - శక్తివంతమైన శాంతి విద్యుత్ తరంగాలను సృష్టించి ప్రతివారిలో ఉన్న అజ్ఞానం, సామరస్య రాహిత్యమనే చీకట్లను పోగొడుతుంది

ఆత్మ సాక్షాత్కారం యొక్క అంతర్గత, ఆధ్యాత్మిక అనుభవాలను పొందిన యోగులను భక్తితో సేవించేవారు - యోగులు సంపాదించుకున్న ఆధ్యాత్మిక సంపదలో భాగం పంచుకుంటారు "తానే" అనే భావం అందరిలో ఉంటుందనే విషయం గ్రహించేందుకు ప్రారంభిస్తారు అందరిలోనిదీ ఒకే "ప్రాణం" అనీ, అసంఖ్యాక జీవులలో ఒక జగత్ సృష్టి పదార్థం ప్రతిఫలిస్తుందనీ తెలుసుకుంటారు

(మిగతా 50 వ పేజీలో)

## 75 వేల నమూనాలు

*1969 ఫిబ్రవరి 9న మొదటిసారి ప్రయాణం చేసిన బోయింగ్ 747 (జంబో జెట్)ను తయారు చేసేందుకు 75,000 ఇంజనీరింగు డ్రాయింగుల్ని ఉపయోగించారు నేడు ప్రపంచమంతటా 900 జంబోజెట్ విమానాలు పయనిస్తున్నాయి*

"చూడటం తేలికైన పనే, కాని జరగబోయే దాన్ని ముందుగా చూడటమే గొప్ప విషయం"

# సుప్రసిద్ధ శాస్త్రజ్ఞులు

## ప్రొఫెసర్ టి.ఆర్. శేషాద్రి

ప్రొఫెసర్ టి ఆర్ శేషాద్రి ఒక పండితుడు అపార జ్ఞానసంపదతో, మేధాశక్తితో, బుద్ధి కుశలతతో రసాయన శాస్త్ర రంగంలో - ఒక ఇతిహాసంగా - ఎప్పటికీ గుర్తుంచుకోబడే వ్యక్తి


Prof T R Seshadri

ఆయన తమిళనాడులోని తిరుచ్చికి సమీపాన కులితలైలో 1900 ఫిబ్రవరి 3న జన్మించారు ప్రొఫెసర్ శేషాద్రి తన పాఠశాల విద్యాభ్యాసాన్ని శ్రీరంగం, తిరుచ్చిలలో కొనసాగించారు మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాల నుండి పట్టభద్రుడై, తరువాత విశ్వ విద్యాలయ రీసెర్చి స్కాలర్‌గా 'భారత ఔషధపు మొక్కలు' అనే అంశంపై పరిశోధన చేసి బహుమతి పొందారు 1929లో స్వా మలేరియల్స్ (కొత్త చలిజ్వరాలు) మరియు ఆంథోసైయానిన్స్‌పై చేసిన పరిశోధనకుగాను యూనివర్శిటీ ఆఫ్ మాంచెస్టర్ (ఇంగ్లండ్) నుండి ఆయన పిహెచ్ డి పొందారు లండన్ యూనివర్శిటీ కాలేజి, ఆస్ట్రియా మెడికల్ కెమిస్ట్రీ లెబొరేటరీ, యూనివర్శిటీ ఆఫ్ ఎడిన్‌బరో డిపార్ట్‌మెంట్ ఆఫ్ మెడికల్ కెమిస్ట్రీల నుండి కూడా అనేక ఇతర డిగ్రీలు సంపాదించుకున్నారు

1930 నుండి 1933 వరకు కోయంబత్తూరు అగ్రికల్చురల్ రీసెర్చి ఇన్స్టిట్యూట్‌లో ప్రొఫెసర్ శేషాద్రి భూరసాయనవేత్తగా పనిచేశారు 1933 నుండి 1949 వరకు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా, రసాయన శాస్త్ర విభాగపు అధిపతిగా పనిచేశారు 1949 నుండి 1965 వరకు ఢిల్లీ విశ్వ విద్యాలయంలో ఇదే పదవి నిర్వహించారు 1965లో పదవీ విరమణ సమయంలో ప్రొఫెసర్ శేషాద్రి లక్ష రూపాయలకు పైగా విలువ చేసే తాను సేకరించిన పుస్తకాలను రసాయన శాస్త్ర విభాగానికి విరాళంగా ఇచ్చారు

ప్రొఫెసర్ శేషాద్రి లండన్ రాయల్ సొసైటీ ఇండియన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్, ఇండియన్

( 49వ పేజీ తరువాయి )

అన్ని విలక్షణతలూ మానవుని [illegible] అం[illegible] అన్ని సరిహద్దు రేఖలు (ఎల్లలు) ఊహా[illegible] తాలని తెలుసుకోవటం ప్రారంభిస్తారు
అనే ధోరణిలో ఆలోచించటం ప్రారంభిస్తారు జగత్ప్రేమ అనే ఆ విశ్వజనీన మతాన్ని అమలు చేసేందుకు పూనుకుంటారు ఇదే శాంతికి మార్గం

కనుక దృష్టిని అంతర్ముఖం చేయండి ఇంద్రియాల తలుపులు మూయండి అల్లకల్లోలమైన బుద్ధిని నిరోధించండి ఏకాగ్రత సాధించండి ధ్యానం చెయ్యండి అంతరంగ శాంతిని కోరుకోండి ఆత్మ సాక్షాత్కారం పొందండి

[illegible]

నేషనల్ సైన్స్ అకాడమీ (అధ్యక్షుడుగా కూడా), జర్మన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ ఫెలోగా పనిచేసారు

1963లో భారత రాష్ట్రపతి ఆయనకు 'పద్మభూషణ్' గౌరవంతో సత్కరించారు. ఆంధ్ర, బెనారస్, ఉస్మానియా విశ్వవిద్యాలయాలు ఆయనకు డి.ఎస్‌సి. పట్టాలిచ్చి గౌరవించాయి

ప్రొఫెసర్ టిఆర్ శేషాద్రి 1967లో ఇండియన్ సైన్స్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా పనిచేసారు. 1968లో తాష్కెంట్‌లో జరిగిన కెమిస్ట్రీ ఆఫ్ నేచురల్ ప్రాడక్ట్స్ గురించిన మొదటి ఇండో సోవియట్ బృందానికి భారత ప్రతినిధి వర్గ నాయకుడుగా వెళ్ళారు. 1972లో న్యూఢిల్లీలో జరిగిన ఆసియా సైన్స్ కాంగ్రెస్‌కు చైర్మన్‌గా ఉన్నారు

జీవసంబంధమైన (సేంద్రియ) రసాయన శాస్త్రంలో సహజ (స్వాభావిక) పంటలు (ఉత్పత్తులు) - ప్రొఫెసర్ శేషాద్రి ప్రత్యేక ప్రావీణ్యం సాధించిన అంశం. ఇండియాలోను, విదేశాల్లోను శాస్త్ర విజ్ఞానానికి సంబంధించిన పత్రికలలో ఆయన వెయ్యికి పైగా పరిశోధన వ్యాసాలు వ్రాసి ప్రచురించారు. ఆయన ప్రసిద్ధ గ్రంథం "కెమిస్ట్రీ ఆఫ్ విటమిన్స్ అండ్ హార్మోన్స్" - ఒక ఉత్కృష్ట రచనగా పేరొందింది

తన హృదయానికి ప్రేమాస్పదురాలైన విద్య వంటి ఆర్గానిక్ కెమిస్ట్రీలో పరిశోధనకు, పరిశీలనకు, ఉద్యుతో కూడిన అధ్యయనానికి ప్రొఫెసర్ శేషాద్రి ఎన్నో సంవత్సరాలను వెచ్చించారు. ఆయన ఉపన్యాసాలు వినేవారు - ఎదుట ప్రత్యక్షంగా ఉపదేశించి మాట్లాడు తున్నట్లుగానే భావించుకునేవారు

1975 సెప్టెంబర్ 27న ఆయన శాశ్వతంగా కన్నుమూశారు

## ఎలా?

### జున్ను లభించిన తీరు



3 500 సంవత్సరాలకు పూర్వం ఒక ఆసియా యాత్రికుడు వేడిమి నిండిన ఒక ఎడారి ప్రాంతంలో ప్రయాణం చేస్తున్నాడు. ఒక తోలు తిత్తిని పాలతో నింపి దాహం తీర్చుకునేందుకు తన వెంట తీసుక వెళ్తున్నాడు. ఆ రోజుల్లో గొర్రె తోలుతో చేసిన తిత్తులు - నీరు కారని విధంగా ఉండటంతో - ఉపయోగించేవారు. విశ్రాంతికోసం సాయం సమయంలో ఒక చోట ఆగినప్పుడు అతడి (గొర్రె) తోలు తిత్తిలో ఒక తెల్లటి (గట్టి) దాని కనిపించింది - అదే జున్ను

కొన్ని గొర్రెల జీర్ణకోశ రసాలు లేక రెన్నెట్ (Rennet) వాటి కడుపులోనే ఇంకిపోయి ఆ గొర్రెలు మృతి చెందిన తర్వాత కూడా చాలాకాలం అక్కడే నిలువ ఉండిపోయి తోలు తిత్తులలోని పాలతో కలిసి, వాటిని జున్నుగా మారుస్తున్నాయి

— 'ఇన్స్పిరేషనల్ కోట్స్' సౌజన్యంతో

"మధ్యరకం మాట్లాడుతుంది, కానీ మేధావి వర్గం గమనిస్తుంది"
-బెంజమిన్ డిస్రేలీ

# ఆరోగ్యప్రదం, పుష్టికరం - శాకాహారం

మాంసాహార పదార్థాలలో కంటే శాకాహారంలో ఎక్కువ ఖనిజాలు (లోహాలు), విటమిన్లు ఉన్నందువల్ల మాంసాహారుల కంటే శాకాహారుల యొక్క శరీరం, ఎముకలు, కండరాలు చాలా చురుకుగా, దృఢంగా ఉంటాయి



కాయధాన్యాలు, చిక్కుళ్ళు, బఠాణీలు మరియు కొన్ని గింజల (విత్తులు)లో ఎక్కువగా ప్రోటీన్లు (మాంసకృత్తులు) ఉంటాయి శాకాహార (మూల) పదార్థాల నుండి మాత్రమే ప్రపంచ జనాభా 70 శాతం మాంసకృత్తులు తీసుకుంటున్నారు పెరుగుదలకు అవశ్యకమైన క్రొవ్వు మరియు కార్బోహైడ్రేట్లు శాకాహార (అధార) వస్తువుల్లో లభ్యమౌతాయి

కూరగాయల నుండి మనం పొందే లాభాలను గమనించుదాము

అన్ని కూరగాయలలో టొమాటో - పక్వమైనా, కాకపోయినా సులభంగా జీర్ణమౌతుంది వండకుండానే టొమాటో (రామములగ)ను భుజించటం మంచిది అది బలహీనత నుండి, సోమరితనం నుండి విముక్తి కలిగించి, మనకు చురుకుదనం, బలం సమకూరుస్తుంది గుండె జబ్బులకు కూడా ఇది ఎంతో మంచిది టొమాటో రసం కఫం (ఉత్పత్తి) నుండి ఉపశమనం కలిగిస్తుంది దీనిలో మెగ్నీషియం (magnesium) సమృద్ధిగా ఉండటం వల్ల పళ్ళకు పటుత్వం చేకూరుస్తుంది

ఉల్లిపాయ అద్భుతమైన ఔషధ సంపత్తి కలిగి ఉంది దీనిలో సమృద్ధిగా పోషకాహార, దేహ నిర్మాణావసర మాంసకృత్తులు, ఖనిజ లవణాలు ఉన్నాయి క్రొవ్వు తక్కువగా ఉంటుంది తమ బరువును తగ్గించుకో దలచిన వారు తమ ఆహారంలో ఉల్లిని చేర్చుకోవాలి

ఆకలిని పెంపొందించుకునేందుకు, ఆహార పదార్థాలు సులభంగా జీర్ణమయ్యేందుకు మనం 'చేమ' తీసుకోవాలి

కాకరకాయలోని చేదైన పదార్థం అమృతంతో సమానం అన్నకోశం (కడుపు)లోని కఫం, పిత్తరస ప్రభావం, మందబుద్ధితనం (మాంద్యం) మరియు జాండీస్ (పసిరికలు లేక పచ్చకామెర్లు) - ఇవన్నీ ఈ చేమవల్ల విముక్తి పొందుతాయి

శరీర సౌష్ఠవానికి, వేడిమి నుండి శరీరం

## ప్రపంచంలో అతి చిన్న అచ్చుయంత్రం

ప్రపంచంలోని అతిచిన్న అచ్చుయంత్రం సులభంగా ఒక బ్రీఫ్‌కేస్‌లో కంప్యూటర్ ప్రక్కన పెట్టుకోవచ్చు దీనికి ఒక రావు కాగితం పొదవున్నా చోటు చాలు ఈ "హైప్రింట్ కంపాక్ట్" 35 కిగ్రాల బరువు ఉంటుంది ఒక నిమిషానికి 6 స్టాండర్డ్ టైప్‌రైటర్ పేజీల మేరకు ముద్రణ చేస్తుంది 150 పేజీలైన తరువాతనే దీని బాటరీ రీఛార్జి చేయవలసి వస్తుంది

—'స్కాలా' సౌజన్యంతో

'యోగ్యత అన్వేషణ కోసం వెదికి చూస్తుంటే
అయోగ్యత అలవోకగా లోపలే సమస్యలుంటే'

విముక్తి పొందేందుకు పొట్లకాయ చాలా మంచిది జలుబుతో తరచు బాధపడేవారికి ఇది మంచిది కాకపోయినా, ఇది పోషకాహార విలువగల పౌష్టిక పదార్థం




బెండకాయ - శరీరంలోని వేడిని తగ్గించేందుకు ఎంతో మంచిది. ఇది పౌష్టికాహారమే కాక పొడిదగ్గు నుండి ఉపశమనం కలిగిస్తుంది

పక్వం కాని అరటికాయ కీళ్ళ (వాత) రోగం కలవారికి మంచిదికాదు కాని ఇది పాండురోగం (రక్తహీనత)తో బాధపడుతున్న వారికి మంచిది. దీనిలో చాలా భాగం ఇనుము ఉంది బలం, వీర్యం - అభివృద్ధి చెందేందుకు ఉపయోగిస్తుంది




మునగకాయ రక్తాన్ని మూత్రాన్ని పరిశుద్ధం చేస్తుంది. నోటిలో పుండ్లు (కురుపులు) రాకుండా ఇది నిరోధిస్తుంది. మునగకాయ రసం జ్వరం నుండి, కీళ్ళ నొప్పుల నుండి నివారణ కలిగిస్తుంది

రక్తవృద్ధికి బీట్‌రూట్ (బీటు దుంపలు) తీసుకోవచ్చు కాబేజి (కోసు కూర) రక్తాన్ని శుభ్రపరుస్తుంది శరీర పెరుగుదలకు సహాయపడుతుంది రక్తం తయారీకి, రక్తం పరిశుభ్రం చేసేందుకు కావలసిన ఇనుము దీనిలో ఉంది రక్తంలో ఆక్సిజన్‌ని కలుపుకునేందుకు కాబేజి సహాయపడుతుంది మంచి నాణ్యతగల రక్తం తయారయేందుకు కూడా తోడ్పడుతుంది కాకరకాయ, బెండకాయ, మామిడి, గుత్తి చిక్కుడుకాయ - వీటిల్లో అధికంగా ఇనుము ఉంటుంది

రక్తాన్ని పరిశుభ్రంగా ఉంచేందుకు, తేలికగా జీర్ణమయ్యేందుకు క్లోరిన్ అవసరం ఇది పచ్చి కూరగాయల్లో, టొమాటోలో, ఖర్జూరపు పండ్లలో, అరటిపండ్లలో మరియు అనాసపండ్లలో ఉంటుంది ఉష్ణ శరీరానికి మృదువైన, వెడల్పైన చిక్కుళ్ళు మంచివి

మన ఆహారంలో - అవసరమైన ఐదు పోషకాహారాలు ఉన్నాయి అవి ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, పిండి పదార్థాలు, క్రొవ్వు విటమిన్లు మరియు ఖనిజాలు

బియ్యంలో పిండి పదార్థం (గంజి) ఉంది పప్పు (కాయ) ధాన్యాలలో ప్రోటీన్లు (మాంసకృత్తులు) ఉన్నాయి నూనెలలో క్రొవ్వు ఉంది పాలు, ఇతర కాయగూరలలో తదితర వస్తువులన్నీ ఉన్నాయి వీటిల్లో మాంసకృత్తులు, క్రొవ్వు, పిండి పదార్థాలు పెరుగుదలకూ, శక్తికీ (బలానికి) చాలా ఆవశ్యకాలు వీటిని సమృద్ధిగా తీసుకోవాలి

— 'దినతంతి' సౌజన్యంతో

"పెద్దల వివేకాన్ని యువజనం అలవర్చుకోవాలి, యువజనుల హృదయం పెద్దలకు ఉండాలి"
-ఛాంగ్ చౌ

# ప్రపంచంలో ప్రతీ ఆరో వ్యక్తి భారతీయుడే!

1991 జనాభా లెక్కల భోగట్టా - చదివేందుకు ఆసక్తికరంగా ఉంటుంది 1991 మార్చి 1వ తేదీ సూర్యోదయానికి భారత జనాభా తాత్కాలిక లెక్కల ప్రకారం 84 39 కోట్లు కాగా దీనిలో 43 76 కోట్లు పురుషులు, 40 63 కోట్లు స్త్రీలుగా ఉన్నారు



ప్రపంచ జనాభాలో 16 శాతం మంది ఇండియాలో నివసిస్తున్నారు మరోవిధంగా చెప్పాలంటే ప్రపంచంలోని ప్రతి ఆరో వ్యక్తి భారతీయుడే దీని తక్షణ ప్రభావం, భూమిపైన జనాభా వత్తిడి మొత్తం ప్రపంచ వైశాల్యంలో మన దేశం కేవలం 2 42 శాతమే ఉంటుంది మొత్తం ప్రపంచ వైశాల్యం 135 79 మిలియన్ చదరపు కిలోమీటర్లలో ఇండియా వైశాల్యం 3 28 మిలియన్ చదరపు కిలోమీటర్లు

1981 91 దశాబ్దిలో ఇండియా జనాభా 16 06 కోట్లు పెరిగింది 1931-41, 1941-51 మరియు 1951-61 మూడు దశాబ్దాలలో పెరిగిన జనాభాకు ఇది దాదాపు సమానంగా ఉంటుంది 1981-91 దశాబ్దిలో పెరిగిన జనాభా జపాన్ మొత్తం జనాభా కన్నా ఎక్కువగా ఉంటుంది

అత్యధిక జనాభాతో ఉన్న ఆరు రాష్ట్రాలివి - ఉత్తరప్రదేశ్, బీహార్, మహారాష్ట్ర, పశ్చిమ బెంగాల్, ఆంధ్రప్రదేశ్ మరియు మధ్యప్రదేశ్ ఈ రాష్ట్రాలలో 1981లో మన దేశ జనాభాలో 59 10 శాతం జనాభా ఉన్నారు కాగా 1981-91 దశాబ్దంలో పెరిగిన జనాభాలో 62 49 శాతం పెరుగుదల ఈ రాష్ట్రాలలోనే జరిగింది

1991 జనాభా లెక్కల ప్రకారం జనసాంద్రత ఒక చదరపు కిలోమీటర్‌కు 267 మంది మనుషులు కాగా 1981లో 216 మంది

## సుభాషితాలు

*పరుల మేలు చూచి పలుగాకి వలె నెప్డు*
*పట్టి మాటలాడు పాదధముడు*
*అట్టివాని బ్రతుకు టపియేల మంటికా?*
*విశ్వదాభిరామ వినురవేమా!*

[పరుల మేలు చూచి ఓర్వలేని వాడు అధముడు ఇతరుల శ్రేయస్సుకు ఆనందించక అసూయపడువాని బ్రతుకు నిష్ప్రయోజనం]

*మరణమన్న వెఱచి మది కలంగగనేల?*
*నిరుతు ముందబోతు నిన్న మొన్న*
*తెలుప్ప విడిచి సతడు తన కన్న తక్కువా?*
*విశ్వదాభిరామ వినురవేమా!*

[మరణమనిన భయమెందుకు? మన కంటె గొప్పవారే ఎందరో యుగయుగాల నుండి మరణిస్తునారు కదా!]

"కష్టాలు, పిల్లల వలెనే - పెంచి పోషిస్తే వృద్ధి పొందుతాయి"
- లేడీ హాలెండ్

ఉండేవారు. కేంద్రపాలిత ప్రాంతాలలో జన సాంద్రత ఢిల్లీలో అత్యధికంగా ఉంది రాష్ట్రాలలో పశ్చిమ బెంగాల్‌లో జనసాంద్రత అధికం కాగా, కేరళ దాన్ని అనుసరిస్తున్నది

జనాభాలో అక్షరాస్యత ఏడు సంవత్సరాలు, ఆపైబడిన వారిలో ఇలా ఉంది 1981-91 దశాబ్దిలో 7 సంవత్సరాలు, ఆపైబడిన వయసు వారి జనాభా 14 02 కోట్లు పెరిగినట్లు అంచనా వీరిలో 7 31 కోట్లు పురుషులు, 6 71 కోట్లు స్త్రీలు 1981-91 దశాబ్దిలో 11 81 కోట్ల మంది అక్షరాస్యులు కాగా, 2 21 కోట్ల మంది ఇంకా నిరక్షరాస్యులుగానే ఉన్నారు వీరిలో గణనీయమైన సంఖ్యలో - 1 63 కోట్ల మంది స్త్రీలు ఉన్నారు

1991 జనాభా లెక్కల ప్రకారం అక్షరాస్యత రేటు 52 11 శాతంగా ఉంది వీరిలో పురుషులు 63 86 శాతం [illegible] 42 శాతం

1991 జనాభా లెక్కల నిర్వహణకు సన్నాహాలు 4 ఏళ్ళ క్రితమే ప్రారంభమయ్యాయి ఒక ఎన్యూమరేటర్ సరాసరిన దాదాపు 600-750 మందికి జనాభా లెక్కల పట్టికలను గురించి ప్రచారం చేయవలసి ఉంటుంది దేశం నలుమూలలా ఈ పని కోసం దాదాపు 17 లక్షల ఎన్యూమరేటర్లు, సూపర్‌వైజర్లు నియమించబడ్డారు

ఇండియాలో 1872వ సంవత్సరం నుంచి జనాభా లెక్కల సేకరణ ప్రారంభమైనా క్రమబద్ధమైన పని 1881లోనే మొదలుపెట్టారు ఇది పదేళ్ళకొకసారి జరుగుతుంది స్వాతంత్ర్యానంతరం (1947 ఆగస్ట్ 15) ప్రస్తుతం జరిగిన 1991 జనాభా లెక్కల సేకరణ ఐదవది

1991 జనాభా లెక్కల సేకరణ కోసం - పట్టికల ప్రచురణకు, నిబంధనలున్న చిన్న పుస్తకాలు, ఇతర దస్తావేజుల ముద్రణకు - 8,000 టన్నుల మేరకు కాగితం ఉపయోగించబడింది

— 'యోజన' సౌజన్యంతో

## కాలుష్యమంటే ఏమిటి?

ఫ్యాక్టరీలు విడుదల చేసే విష పదార్థాలు, నదిలో ప్రవహించే మురికి కాలువలు లేదా రేడియో ధార్మిక వ్యర్థ వస్తువులు మాత్రమే కాలుష్యం కాదు

ప్లాస్టిక్ సంచులను, పెంట పోగులను రోడ్డు మీదికి విసరటం - కాలుష్యమౌతుంది బస్సు, ట్రక్కు లేదా స్కూటర్ - హానికరమైన పొగలను వదలటం - కాలుష్యమౌతుంది డిటర్జంట్లతో (నిండిన) కడిగిన నీటిని ఉపయోగించిన రసాయనాలను కాలువలు శుభ్రం చేసేందుకు వెలికి వంపటం కాలుష్యమనిపించుకుంటుంది అన్ని జీవరాశుల ఆరోగ్యానికి, మనుగడకు, కార్యకలాపాలకు భంగం కలిగించే విధంగా వాయువు, నీరు, నేల, ఆహారం మార్పు చెందటం కాలుష్యమనిపించు కుంటుంది

— 'సిఐఐ - ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

[illegible]

[illegible]

# సరసోక్తులు

## పర్వతాలను కదిలించే కాంక్ష

మనలో చాలామందిమి పర్వతాలను కదిల్చేందుకు ఇష్టపడతాము కాని చిన్న కొండల పైన అభ్యాసం చేసేందుకు ఇష్టపడము

## విజయ శాసనం

నెపోలియన్ హిల్ యొక్క ప్రసిద్ధమైన విజయశాసనం "మానవమేధ దేన్ని భావించుకుని విశ్వసిస్తుందో, అది సాధించబడుతుంది"

## యాజమాన్యంలో భాగం



అతడు యాజమాన్యంలో భాగం కాగలిగేటంత వరకు కంపెనీలోని ప్రతి సభ్యుడికీ ప్రతి సమస్యను సరైన జవాబు ఉంటుంది

— 'ఇన్స్పిరేషనల్ కోట్' సౌజన్యంతో

## ఒప్పించలేకపోతే......

ట్రూమన్ యొక్క శాసనం నీవు వారిని ఒప్పించలేకపోతే, వారిని గందరగోళ పరచు (కంగారు పెట్టు)

— హారీ ఎస్ ట్రూమన్

## బుద్ధి చేసే అపరాధాలు

ఆత్మ దోష పూరితంగా ఉన్నప్పుడు, వ్యాధి శరీరానికి ఎప్పుడైనా [illegible] వస్తుంది, బుద్ధి చేసే అపరాధాలే (పాపాలే) శరీరపు దోషాలకు కారణ హేతువులు

— శ్రీ అరవిందులు

## విజయాలు స్వల్పాలే

ఎక్కడైతే నవ్వులు స్వల్పంగా ఉంటాయో అక్కడ విజయాలు కూడా అల్పంగానే ఉంటాయి తన పనిలో ఆనందం అనుభవించి, అసౌకర్యాలను నవ్వుతూ త్రోసి పుచ్చే పనివాడే విజయం సాధించే వ్యక్తి

— ఆండ్రూ కార్నీజ్

స్టాటిస్టిక్స్ (గణాంక శాస్త్రం) - ఒక త్రాగుబోతుకు దీప స్తంభాలవంటివని, అవి వెలుతురు చూపటం కంటే (పట్టుకునేందుకు) ఆధారంగా ఉపయోగపడేవని ఆర్థిక శాస్త్రవేత్తల అభిప్రాయం

## చరిత్ర పునరావృతం

చరిత్ర తనకుతానే ఎందుకు పునరావృతం అవుతున్నదో నీకు తెలుసా? - ఎవరూ ఆలకించనందువల్ల (లక్ష్యపెట్టనందువల్ల)

"మంచీ, చెడూ అనేదేదీ లేదు. కానీ ఆలోచన అలా తయారు చేస్తుంది"
షేక్స్పియర్

# అవీ - ఇవీ

## ప్రపంచంలో అతి చిన్న అణు జలాంతర్గామి

ఫ్రాన్స్‌కు చెందిన 'అమిత్యేష్టి' అనే ప్రపంచంలోని అతి చిన్న అణు జలాంతర్గామి పని ప్రారంభించింది ఈ నౌక 73 6 మీటర్ల పొడవు, 7 60 మీటర్ల వెడల్పు కలిగి, 2,400 టన్నుల బరువుతో ఉంటుంది గంటకు కనీసం 50 కి మీ ల వేగంతో వయనిస్తుంది 300 మీటర్ల అడుగున లోతున కూడా పని నిర్వహిస్తుంది 66 మంది చోదక సిబ్బందిని తనతో తీసుకువెళ్తుంది

## ఆసియాలో పెద్ద విద్యుదుత్పాదక కేంద్రం

ఆసియాలో భూగర్భంలోని పెద్ద విద్యుదుత్పాదక కేంద్రం ప్రస్తుతం జిగ్మి సింగ్యే వాంగ్‌ఛుక్ రాజు పరిపాలిస్తున్న - హిమాలయ రాజ్యం - భూటాన్‌లోని ఛుఖాలో నెలకొల్పబడింది

## పూర్తి రక్షణ పొందని 46 మిలియన్ బిడ్డలు

బాల్యంలో వచ్చే మరణకారకాలైన ఆరు వ్యాధులు - పోలియో, ధనుర్వాతం, మశూచికం, డిఫ్తీరియా, పెర్టుసిస్, క్షయ-లనుండి ప్రతి సంవత్సరం దాదాపు 46 మిలియన్ పసివారు పూర్తి రక్షణ పొందలేకపోతున్నారు ప్రతి సంవత్సరం దాదాపు 2 8 మిలియన్ శిశువులు ఈ వ్యాధుల వల్ల మరణిస్తున్నారు మరో 3 మిలియన్ మంది దుర్బలులవుతున్నారు ఈ ఆరు వ్యాధుల నుండి రక్షణకు టీకాలు వేసేందుకు ప్రతి బిడ్డకు 10 డాలర్లు ఖర్చవుతుంది 1 బిలియన్ డాలర్ల కంటే తక్కువయ్యే 20 ఆధునిక మిలటరీ విమానాల వ్యయంతో ప్రపంచం ఈ వ్యాధులను అరికట్టవచ్చు

— 'ప్రపంచ ఆరోగ్య సంస్థ' సౌజన్యంతో

## మడిచే గొట్టాలలో కాఫీ, టీ లు

మడిచేందుకు వీలైన (ముడుచుకుపోయే) గొట్టాల ద్వారా కాఫీ, టీలను తీసుకువెళ్ళే విధానం హర్యానాలోని కర్నాల్‌లోగల నేషనల్ డైరీ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ రూపొందించింది ఈ పానీయం తయారుచేసేందుకు ఒక చెంచాడు పేస్ట్‌ను నొక్కి మరిగే నీటిలో దీన్ని కలియబెట్టాలి ఈ పేస్ట్ (paste)లో పాలలోని క్రొవ్వు క్రొవ్వు లేని పాలయొక్క ఘనపదార్థాలు, చక్కెర, నీరు, తక్షణం తయారయ్యే కాఫీ, టీలు - చేరి ఉంటాయి

## ట్యూబ్ కంటైనర్ కనుగొన్న వ్యక్తి

ఆయిల్ పెయింట్లు, టూత్‌పేస్ట్, హెయిర్ క్రీమ్ మరియు బంకలను నింపే ట్యూబ్ కంటైనర్‌ను *జాన్ గోఫీ రాండ్ (1801-1873) కనుగొన్నాడు మడిచేందుకు వీలైన మూయదగిన ట్యూబ్‌ను మొదటి సారి తన ఆయిల్ పెయింట్లకే ఉపయోగించాడు*

## 5,00,000 మందికి ఉద్యోగావకాశాలు

పశ్చిమ ఖండంలోని పారిశ్రామికాభివృద్ధి సాధించిన దేశాలలో అభివృద్ధి చెందుతున్న దేశాలలోని దాదాపు 5,00,000 మంది సైంటిస్టులు, ఇంజనీర్లు మరియు డాక్టర్లు పని చేస్తున్నారు

"ప్రతి పాపికి మంచి భవిష్యత్తును కృపతో ప్రసాదించాలి - ప్రతి మునికి ఒక గతం ఉన్నట్లుగానే." -డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్

# భగవద్గీత - శ్రీకృష్ణుని దివ్య భాషణ

డా. పి. నాగరాజరావు

మానవుని ఆధ్యాత్మిక పునరుద్ధరణకు అవశ్యకమైన, స్పష్టమైన, సులభమైన, ఆచరణ సాధ్యమైన, మనస్తత్వ సంబంధమైన 700 శ్లోకాలతో కూడిన ఒక శుద్ధప్రతి - భగవద్గీత




భగవంతుని గురించిన పరిజ్ఞానం, మనమెలా జీవించి భగవంతునితో లీనమవాలనే విషయాలు వెల్లడించే ప్రాథమిక దస్తావేజు ఇది. మానవుని విధులు, హక్కులు వివరించే పట్టికను కూడా ఇది ఇస్తున్నది. మానవ జీవితంపై దీని ప్రభావంతో పోలిస్తే - ఏ ఇతర గ్రంథం కూడా ఏమూలకూ దీన్ని చేరుకోలేదు. మహాభారతం హృదయంలో ఇది రూపొందింది.

భగవద్గీత - పరిపూర్ణ సామర్థ్యంగల మహాగ్రంథం. భగవంతుడే (శ్రీకృష్ణుడు) స్వయంగా తన అభిమాన శిష్యునికి దీన్ని అందజేశాడు. ఈ శిష్యుడు మానవునికి ప్రతినిధి, అన్నిటికంటే ముఖ్యంగా భగవంతునికి దగ్గరివాడు - అర్జునుడు. గీత బోధించే సందర్భం కూడా ప్రాముఖ్యం గలదే. యుద్ధభూమిలో ఇరుపక్షాలు తమ ఆయుధాలు చేపట్టి యుద్ధ సన్నద్ధులైన సమయం - అప్పుడు అర్జునుడు పిరికివాడయ్యాడు.

శత్రువుల్ని తుదముట్టించేందుకు బదులుగా అర్జునుడు వెక్కి వెక్కి ఏడ్చి అహింసకు అనుకూలంగా, సన్యాసానికి గొప్పతనం ఆపాదిస్తూ వాదన చేయటం కొనసాగించాడు. తనుచేసే కార్యం ధర్మబద్ధమైనదని తాను నమ్మేవరకు పోరాడేందుకు వ్యతిరేకించాడు. యుద్ధానికి వ్యతిరేకంగా ఊహాజనితమైన అన్ని రకాల వాదనలు చేశాడు. ఆ క్లిష్టసమయంలోనే భగవంతుడు అర్జునుని మేధనుండి తాత్కాలికమైన నీతికి సంబంధించిన మనోవ్యాకులం (కలవరపాటు) పోగొట్టేందుకు వివేకాన్ని ప్రసాదించాడు.

అర్జునుణ్ణి భావోద్వేగానికి చెందిన ఆత్మచింత లోబరుచుకుంది. తత్ఫలితంగా అతడు నిష్క్రియాపరత్వానికి గురై దానిలోకి త్రోయబడ్డాడు. మర్మార్థాన్ని ఎదుర్కొనకూడదని.

## ఎయిర్ బెలూన్ ద్వారా తప్పించుకున్న జంటలు

కమ్యూనిస్ట్ పాలిత తూర్పు జర్మనీ నుండి పశ్చిమ జర్మనీ (స్వేచ్ఛా ప్రపంచంలోని బవేరియాకు) 1980లో రెండు జంటలు (దంపతులు), నలుగురు పిల్లలు కలిసి ఇంట్లో తయారైన హాట్ ఎయిర్ బెలూన్ ద్వారా తప్పించుకుపోయారు. పశ్చిమ జర్మనీ లోపల 5 మైళ్ళ దూరంలో ఈ బెలూన్ దిగింది. ఒక గుడారపు సైజులో 2 చదరపు గజాల కొలత గల కంపార్ట్‌మెంట్‌లో 8 మంది ప్రయాణం చేశారు. ఒక బెలూన్‌ను ఉపయోగించుకుని తూర్పు జర్మనీ నుండి వెలుపలికి తప్పించుకుపోవటం అదే మొదటిసారి!

"ఎక్కువగా చూడటంలో అనుభవ విలువరాదు ఎవరితో చూడ గలగటంలోనే విలువ ఉంటుంది" - హెచ్ విలియం ఆర్ధర్

మనం దానినుండి దూరంగా తొలగిపోవాలని అతడు భావించాడు దుర్మార్గంలోని నిజస్థితిని అతడు ఎదుర్కొనలేకపోయాడు అత్యంత క్లిష్ట సమయంలో తనపనిలోని నీతి, నడత గురించి అతడు కలవరపడ్డాడు అప్పుడు, అటువంటి సందర్భంలో భగవంతుడు సమర భూమిలో నీతివాక్యాలు వెల్లడి చేసాడు

భగవంతుడు తన సువివరణతో కూడిన సంతోష పూర్వకమైన ఉపదేశంతో అర్జునుని మేథలోనుంచే కాక మన అందరి మనస్సుల్లో నుంచి కూడా చింతను పారద్రోలి ఆధ్యాత్మిక వివేకాన్ని ప్రబోధించాడు ఆయన నుండి వివేకాన్ని అనుగ్రహించమని కోరేవారు ఆయన పాదాలవద్ద శరణు వేడుకోవాలి మనలో ప్రతివారూ ఒక అర్జునుడే మనల్ని సరైన మార్గంలో పెట్టి దుర్మార్గంతో పోరాడేందుకు మనకు గీతలోని వివేకాబోధ అత్యావశ్యకంగా కావాలి గీత అందిస్తున్న ప్రధాన సందేశం మనం దుర్మార్గంతో తుది వరకూ పోరాడాలి దానినుండి పారిపోకూడదు, దానితో రాజీపడకూడదు దుర్మార్గాన్ని ఎదుర్కొనేందుకు ఎవరైనా ఎంత మూల్యమైనా చెల్లించాలి (వ్యయాన్ని గురించి లెక్కించకూడదు) దౌర్జన్యాన్ని ఎవరైతే సమర్థిస్తారో, వారికి వ్యతిరేకంగా మన శక్తియుక్తుల్ని ధార పోసి ఆ చెడుని మనం వ్యతిరేకించాలి

జీవితమే ఒక రణరంగం ఈ రంగం ఎప్పుడూ ప్రశాంతంగా ఉండదు మనం పోరాడాలి స్వేచ్ఛకు వేరే దారి లేదు నిష్క్రియా పరత్వంలో స్వాతంత్ర్యం లేదు అందరికీ సమానమైన ధర్మం అధర్మాన్ని ఎదిరించి పోరాడటం నిష్క్రియాపరత్వానికి దాసోహం కాకూడదు దేవుని ఆదేశం - పోరాడటమే కాకుండా భగవంతునిపట్ల భక్తితో పోరాడటం కూడా భక్తి లేక విశ్వాసం, విద్యుక్త ధర్మనిర్వహణ - గీతయొక్క సాంకేతికమైన గుర్తులు మానవ జీవితానికి గీత చూపే మార్గం - శాస్త్రబద్ధమైనది, ఆచరణ సాధ్యమైనది, అంతేకాని - అది విద్యా సంబంధమైనది, సిద్ధాంత సంబంధమైనది కాదు ●

## రూఢి పర్చుకో



భయం, ఆందోళన వగైరాల ఆలోచనలను ఇప్పుడు నిర్మూలన చేసాను

వాటి స్థానంలో శాంతి, విశ్వాసం, ఆశావృష్టిని నెలకొల్పాను

గతంలో నేను చేసిన తప్పిదాలను, నాకు జరిగిన తప్పిదాలను నా భావనల నుంచి తొలగించుకున్నాను

వాటి స్థానంలో నిశ్చయమైన ప్రీతి, ప్రేమ భావాలను ప్రవేశపెట్టాను

నేను పరాజయ భావాలను పారద్రోలాను, నాకు జరుగుతున్న, జరగనున్న మంచి - కార్యాలను గుర్తించాను

బలహీనతకు, ఆత్మన్యూనతకు సంబంధించిన భావాలను నిర్మూలించాను నాలో నాకు విశ్వాసం ఏర్పరచుకున్నాను నాలో నున్న సృజనాత్మక శక్తిపై నమ్మకం పెంచుకున్నాను

"పరమ దరిద్రం కాని, అపార సంపద కాని న్యాయాన్ని గ్రహించలేవు"

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

జవాబులు

క్విజ్: 1 ఇండియాలో అత్యధిక దిగుబడి ఇచ్చే గోధుమ, 2 ఉత్తర అమెరికాలోని అలాస్కాలో, 3 రాజస్థాన్‌లోని సాంబార్ సరస్సు (sambhar lake), 4 వారి మత విశ్వాసాలేవైనప్పటికీ పౌరులందరినీ సమానంగా చూసే దేశం, 5 అంతర్జాతీయ పరిధిలో నేరాలు చేస్తూ, అరెస్టు కాకుండా తప్పించుకు తిరుగుతున్న నేరస్థుల్ని పట్టుకునేందుకు ఏర్పడిన సంస్థ - ఇంటర్నేషనల్ పోలీస్ ఆర్గనైజేషన్, 6 నిరాశ్రయ జీవులను, రోగగ్రస్తులను బాగు పర్చేందుకు కృషి చేస్తున్న సుప్రసిద్ధ సంఘ సేవకురాలు, 7 1950 జనవరి 26వ తేది, 8 పార్లమెంట్ (సంసద్)

మాటల మహిమ: 1 (ఎ) చిఱువత్తు, (బి) నల్లవరి, (సి) వీణ, (డి) స్వల్పము లేక సూక్ష్మము, 2 (ఎ) పగలు పదునాల్గు గడియల మీద రెండు గడియల కాలం, (బి) ఒక నక్షత్రము, (సి) గెలుచునది, (డి) విష్ణువు, (ఇ) జ్యోతి, 3 (ఎ) మెఱుపు (విద్యుత్), (బి) లక్ష్మి, (సి) పిప్పలి, 4 (ఎ) వెన్నెల, (బి) పెద్ద యేలకి, (సి) చంద్రభాగానది, (డి) మల్లెతీగ, (ఇ) ఒక జాతి చేప 5 (ఎ) 27 నక్షత్రములలో ఒకటి, (బి) అర్క, (సి) నాయకుని అధిక ప్రేమ పొందిన నాయిక, (డి) పెద్దమ్మ (లక్ష్మీదేవి అక్క), (ఇ) బల్లి, 6 (ఎ) సూర్యుడు, (బి) కిరణము, (సి) జిల్లేడు, (డి) రాగి, (ఇ) సముద్రము (దాటుట), 7 (ఎ) శ్రీకృష్ణుడు, (బి) విష్ణు దేవుడు, 8 (ఎ) అర్జునుడు, (బి) యముడు, (సి) విష్ణుని ద్వారపాలకులలో ఒకడు

తెలివికి పరీక్ష: 1 హైదరాబాద్ (ఆంధ్రప్రదేశ్) హుస్సేన్ సాగర్ నడి బొడ్డున - జిబ్రాల్టర్ రాక్ పైన, 2 960 అడుగులు, 3 ఆ దేవాలయ ప్రధాన పూజారిని దక్షిణ కన్నడ జిల్లాల నుండి ఎంపిక చేస్తారు మొదటి పూజారి పేరు శ్రీ సుబ్బరాయ అడిగ, 4 మద్రాసు సమీపాన వండలూర్‌లోని అరిజ్ఞర్ అన్నా జూలాజికల్ పార్క్ - ఆగ్నేయాసియాలోనే అతి పెద్దది ఇది 510 హెక్టార్లలో వ్యాపించి, 104 రకాల పక్షులు, 57 జాతుల పాలిచ్చే (తెగల) జంతువులు, 21 వర్గాల ప్రాకే జంతువులతో నిండి ఉంటుంది, 5 కె కృష్ణారావు - మద్రాసులో 1962 ఏప్రిల్ 15న ఉడ్‌లాండ్స్ డ్రైవ్-ఇన్-రెస్టారెంట్ ప్రారంభించారు ఆయనే హోటళ్ళలో మసాలా దోసెను పరిచయం చేసారు, 6 శతావధాని - వెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు

## ప్రపంచంలో నాణ్యత గల బొగ్గు

ఇండియాలో బొగ్గు సరఫరాకు ప్రధాన ఉత్పత్తి స్థానం - బీహార్‌లోని ఝరియాలో ప్రపంచంలో ఉత్తమ నాణ్యతగల బొగ్గు నిల్వలు ఉన్నాయి *రాబోయే 600 సంవత్సరాలకు సరిపోగల అపారమైన బొగ్గు నిల్వలు ఝరియాలో ఉంది భూమట్టానికి 25 అడుగుల లోతు నుండి 3,000 అడుగుల లోతువరకు ఇక్కడ బొగ్గు పొరలు ఉన్నాయి*

## నాలుగు వస్తువులు

నాలుగు వస్తువులు తిరిగిరావు
మాట్లాడిన మాట,
విడిచిన బాణం,
గతించిన కాలం,
అలక్ష్యం చేసిన అవకాశం.

— సెకండ్ కాలిఫ్

"జ్ఞానార్జనకోసం ఆతురత - సంపదకోసం దాహంవలే పరిచయమయే కొద్దీ పెరిగిపోతుంది"

# వివేకానందుని పసిడి పలుకులు

నీలిమ షంగ్లా

వివేకానందస్వామి సందేశం వందలాది జీవితాలను ప్రభావితం చేసి, ఉత్సాహపర్చి, వారిని పూర్తిగా మార్చివేసింది గతం దానంతట అదే పూడ్చబడాలని ఆయన నొక్కి చెప్పారు అపారమైన భవిష్యత్తు మన ముందున్నది ప్రతి మాట, ప్రతి భావన,



Swami Vivekananda

ప్రతి కర్మ మన జీవితంలో ముఖ్యమనే విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి చెడు తలంపులు, చెడ్డపనులు పులులవలె మనపైకి దూకేందుకు సిద్ధంగా ఉంటాయి అలాగే మంచిపనులు, మంచిభావాలు వందలాది దేవతల శక్తితో నిండి - మనల్ని ఎప్పటికీ కాపాడేందుకు సిద్ధంగా ఉంటాయి మన జీవితంలో ఉత్తమ మార్గదర్శి మన బలమే మతంలో కాని, జీవితంలో కాని - ప్రతిచోట మనల్ని బలహీనపర్చే వాటన్నిటినీ త్రోసివేయాలి

స్వామీజీ అభిప్రాయం ప్రకారం బలహీనత కష్టాన్ని తెచ్చిపెడుతుంది మనం బలహీనంగా ఉన్నందువల్లనే పరితాపకరమైన స్థితిలో ఉన్నాము మనం బలహీనంగా ఉన్నందువల్లనే మనం అసత్యాలు పలుకుతాము, దొంగతనాలు చేస్తాము, ఇతర నేరాలకు పాల్పడతాము మనల్ని బలహీన పర్చేదేదీ లేనట్లయితే చావు లేదు, దుఃఖంలేదు భ్రమల కారణంగా మనం దుఃఖస్థితిలో ఉన్నాము భ్రమలను విడనాడండి దానితోపాటే చింత కల్గించి నిరుత్సాహపర్చే విషయం కూడా మాయమౌతుంది

స్వామీజీ స్త్రీత్వం గురించి మాట్లాడుతూ ఒక జాతి అభ్యున్నతి తెలుసుకునే ఉత్తమ సూచన - ఆదేశ స్త్రీల పురోగతిని తెలుసుకోవటమే అన్నారు సంపూర్ణమైన స్త్రీత్వమనే భావన సంపూర్ణ స్వాతంత్ర్యమే అవుతుంది తమ సమస్యల్ని తమకు తోచిన పద్ధతిలోనే పరిష్కరించుకునే స్థితిలో స్త్రీలు ఉండాలి ఈ సామర్థ్యంలో ప్రపంచంలో ఎవరికీ మన భారత స్త్రీలు తీసిపోరు అభివృద్ధికి మొదటి షరతు - స్వేచ్ఛ (హక్కు) స్త్రీలు - వ్యక్తిగతంగా, స్వేచ్ఛగా అభివృద్ధి చెందెదరుగాక!

తనకుతాను సుఖపెట్టుకోగలనని మానవుడు భావించుకుంటాడు సంవత్సరాల తరబడి పోరాడి నిజమైన సౌఖ్యం స్వప్రయోజనాన్ని పరిమార్చినప్పుడే లభిస్తుందని కనుగొంటాడు తన ఆనందాన్ని తనకుతానే సంపాదించుకోవలసిందే కాని వేరెవ్వరూ సమకూర్చి పెట్టలేరని

## ఖైదీ లేని జైలు

రోమ్ (ఇటలీ)లోని వాటికన్ సిటీ (పోప్ నివాస స్థలం) జైలులో ఇంతవరకూ ఎవరూ ఖైదు చేయబడలేదు

"ఒక స్నేహితుణ్ణి ఎంపిక చేసుకోవటంలో నీవు ఆలస్యం చేసినట్లయితే - ఎంపికయిన తరువాత, మార్చేముందు కూడా జాగ్రత్తగా ఉండాలి"

# తిరుమలలో అపూర్వ శిలాతోరణం

డా. ఎన్. రామేశన్

ప్రకృతి సిద్ధమైన భూతత్త్వ పద్ధతిన కాల గతిలో వేలాది సంవత్సరాల క్రితం రూపొంది, ప్రకృతిలోని విధ్వంసక శక్తులను అడ్డగించి ఎదురొడ్డి నిల్చిన ఒక అపురూప సహజ నిలువంపు (కమానుల) వంతెన ఆంధ్రప్రదేశ్‌లోని తిరుమల (తిరుపతి)లో ఉన్నది ఈ



Tirumala arch

శిలాతోరణం లేక నిలువంపు (కమానుల) వంతెన తిరుమల వేంకటేశ్వరస్వామి ఆలయానికి ఒక కిలోమీటరు ఉత్తరంగా, 60 డిగ్రీల ఎడమరగా ఉంటుంది తిరుమల కొండపైనున్న మైక్రోవేవ్ స్టేషన్‌కు వెళ్ళేదారి వెంబడి వెళితే దీనివద్దకు చేరుకోవచ్చు తిరుమల కొండలను అమర్చిన కడప గంభీరశ్రేణికి చెందిన నగరి శిలాస్ఫటికాలపైన 25 అడుగుల నిడివితో, 10 అడుగుల ఎత్తుతో ఒక కమానువలె ఇది నిర్మితమైంది

ప్రపంచంలో ఇటువంటి సహజమైన శిలాతోరణాలు ఇంకా రెండు మాత్రమే ఉన్నాయి వీటిలో అత్యంత మనోహ్లాదకరమైనది - యు ఎస్ ఏ లో ఉటాహ్‌లోని రెయిన్‌బో ఆర్చ్ ప్రిడ్జి రెండవది, యునైటెడ్ కింగ్‌డమ్‌లో పల్‌రాడియన్ శిలాస్ఫటికాలతో - సముద్రంలో చొచ్చుకుపోయిన భూమి అగ్రంవద్ద ప్రకృతి చెక్కిన శిలాతోరణం ఈ రెండు సహజ సిద్ధ శిలాతోరణాలను గురించి విరివిగా ఉదహరించటం జరిగింది ఇవి సుప్రసిద్ధాలు కూడా ఇప్పుడు కనుగొన్నది - ప్రపంచంలోని అసమానమైన మూడవ పరిశోధన కాగా యూరప్, ఆసియా ఖండాలలో ఇది ఏకైక శిలాతోరణంగా నిలుస్తుంది శిలాస్ఫటికాలపై తీవ్రతగల గాలి, హరించిన (తినివేసిన) ప్రవాహపు ఉధృతి దీనికి ఒక వరుస కీళ్ళను (సంధులను) చేర్చి వీటి సహకారంతో తిరుమల సహజ సిద్ధమైన శిలాతోరణం తయారయిందని స్థల సాక్ష్యం, అధ్యయనం నిరూపిస్తున్నది

భారతదేశంలో ఇటువంటి జ్ఞాపక చిహ్నాలు కేవలం మరో పదమూడు మాత్రమే ఉన్నాయి ఇది పదునాల్గవది యూరప్, ఆసియా మొత్తంలో 2500 మిలియన్ సంవత్సరాల చరిత్రగల ఏకైక శిలాతోరణం ఇదే

— 'సప్తగిరి' సౌజన్యంతో

## కొత్తరకం మైక్రోప్రాసెసర్

ఒక తపాలా బిళ్ళలో సగం పరిమాణం మాత్రమే ఉంటే ఒక మైక్రోప్రాసెసర్‌ను అమెరికాలోని ఇన్‌టెల్ కార్పొరేషన్ రూపొందించింది దీనిలో ఒక మిలియన్ ట్రాన్సిస్టర్లు ఉంటాయి ఇవి కంప్యూటర్‌లోని క్లిష్టకార్యాలు నిర్వహిస్తాయి ఈ మైక్రోస్కోపిక్ ప్రపంచంలో మైక్రోప్రాసెసర్లు భాగస్వామ్యం వహిస్తాయి క్షణంలో వెయ్యోవంతు వేగంతో ఇవి సంచరిస్తుంటాయి

— 'స్పాన్' సౌజన్యంతో

---

"కేవలం సమాచారం ఇచ్చేది ఉన్నత విద్య కాదు ప్రస్తుతం జీవిస్తున్న గారంపరితో కలిసి మనం సామరస్యంగా జీవించేటట్లు చేసేదే ఉన్నత విద్య"

రవీంద్రనాథ్ ఠాగూర్

# 2000 ఏ.డి.లో జనాభా విస్ఫోటనం

| | |
|---|---|
| ప్రపంచం ప్రారంభం (Big Bang) | 15,000,000,000 బి సి |
| పాలపుంత పుట్టుక | 10,000,000,000 బి సి |
| సౌర పద్ధతి, భూమి పుట్టుక | 5,000,000,000 బి సి |



| | |
|---|---|
| ఖండాలు ఉరవడికి కొట్టుకుని పోవటం | 200,000,000 బి సి |
| డినోసర్స్ (రాకాశి బల్లులు) భూమిపై అవతరణ | 200,000,000 బి సి |
| పిల్లలకు పాలిచ్చే జంతువుల యుగం ప్రారంభం | 50,000,000 బి సి |
| ఏప్ (తోకలేని కోతి) - వంటి మానవుని పూర్వీకులు | 1,000,000 బి సి |
| ఆధునిక మానవుడు (హోమో సపియన్) | 100,000 బి సి |
| ప్రాచీన నాగరికతలు | 10,000 బి సి |
| సక్రమంగా భద్రపర్చబడిన చరిత్ర | 1,000 బి సి |
| సైన్స్ పారిశ్రామిక యుగం | 100 బి సి |
| జ్ఞానాన్వేషణ | 10 బి సి |
| వర్తమానం (ఇప్పటినుండి భవిష్యత్ జోస్యం) | 1993 ఏ డి |
| జనాభా విస్ఫోటనం | 2000 ఏ డి |
| తీవ్రమైన వాతావరణ మార్పులు | 10,000 ఏ డి |
| భూమితో తోకచుక్క ఘర్షణ | 100,000 ఏ డి |
| పొరుగున సూపర్‌నోవా | 1,000,000 ఏ డి. |
| పూర్తిగా మారిపోయిన ఖండాలు | 10,000,000 ఏ డి |
| సూపర్‌మాన్ (?) | 100,000,000 ఏ డి |
| సూర్యుని మృతి | 5,000,000,000 ఏ డి |
| ప్రపంచ పతనం | 15,000,000,000 ఏ డి |

— 'పార్థా బులిటిన్' సౌజన్యంతో

## ప్రపంచం ఉత్కంఠతో ఎదురు చూసే క్రీడా సంరంభం

*1994 ఫుట్‌బాల్ వరల్డ్ కప్ ఆటకు తొమ్మిది అమెరికా నగరాలు ఆతిథ్యం ఇస్తాయి ఈ క్రీడోత్సవాలు జూన్ 17 నుండి జూలై 17 వరకు జరుగుతాయి దాదాపు 1 5 మిలియన్ విదేశీయులు వరల్డ్ కప్ - ప్రపంచంలో అత్యధిక సంఖ్యాకులు వీక్షించే ఒక క్రీడోత్సవ సంఘటన - చూసేందుకు విచ్చేస్తారని అంచనా ఈ పోటీలకు ఎంపికయిన తొమ్మిది నగరాలలో ఒకటి డెట్రాయిట్ సమీపంలోని పాంటియాక్ వద్ద గల 'సిల్వర్‌డోమ్' - ప్రపంచ కప్ పోటీకి సిద్ధమైన మొదటి ఇండోర్ స్టేడియం ఇది*

*అతిథి దేశంగా యునైటెడ్ స్టేట్స్, ఛాంపియన్ షిప్‌ను రక్షించుకునే దేశంగా జర్మనీ - పోటీకి స్వేచ్ఛగానే ఎంపికయ్యాయి దాదాపు 22 ఇతర దేశాలు యోగ్యతా పోటీల్లో నెగ్గి ఫైనల్స్‌లోకి వస్తాయి*

— ఎరిక్ గ్రీన్

— 'యు ఎస్ ఐ ఎస్' సౌజన్యంతో

"ప్రతివారు కష్టకాలంలో దేవుణ్ణి గుర్తుకు తెచ్చుకుంటారు కాని అదృష్ట సమయంలో కాదు నీవు నీ అదృష్ట సమయంలో కూడా దేవుణ్ణి గుర్తుంచుకుంటే నీకు దుర్దశ అనేది ఉండదు" -కబీర్

# విస్‌డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక


సంపాదకవర్గం

: సంపాదకుడు:

లయన్ కె.వి.గోవిందరావు బి.ఏ.,ఎల్.ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు:

కొండముది దత్తాత్రేయశర్మ

వి.బాలకుమార్ ఎం.ఏ.,బి.ఎడ్.,

సభ్యులు:

కె.వి.ఎస్.శరత్‌బాబు బి.ఏ.,బి.కాం.,బి.ఎల్.,

కె.వి.ఎస్.విజయకుమార్ బి.కాం.,

కె.రత్నకుమారి


## ఈ సంచికలో

జూలై 1993




: చందా వివరాలు:

3 సంవత్సరాల చందా రూ.120/-

సంవత్సర చందా రూ. 42/-

ఎయిర్ మెయిల్ (1సం॥) రూ.200/-

సీ మెయిల్ (1సం॥) రూ.100/-

: చందా పంపవలసిన చిరునామా:

రత్నా ఏజన్సీస్

9,దేశికారోడ్, మైలాపూర్

మద్రాస్ - 600004

ఫోన్: 73327

-: ముఖచిత్రం: కలర్ ట్రాన్స్‌పరెన్సీ:-

వికీ హోండా


★ తెలుగు విస్‌డమ్‌కు ఇది 12 వ సంవత్సరం ★

# ధ్యానం సంపాదకుని పేజీ

## దృఢ సంకల్పంగల వ్యక్తి




వర్తమాన వినోద విలాసాలను, భౌతిక సుఖాలను కోల్పోతాననే భయం గల మనిషి తనలో ఉన్న సత్యసంధత గాయపడుతుందని, దొంగిలించబడుతుందని, భ్రష్టుపడుతుందని మరియు కాళ్ళతో త్రొక్కివేయబడుతుందనే విషయం నిరాకరిస్తాడు ఎందుకనగా అతడే మొదటిసారి తన ఘనమైన ఆత్మను గాయపరచాడు, దొంగిలించాడు, భ్రష్టు పట్టించాడు మరియు కాళ్ళతో త్రొక్కివేశాడు కానీ దృఢ (నిశ్చల) సంకల్పంగల వ్యక్తి మచ్చ (కళంకం) లేని నైతిక నిష్ఠగల వ్యక్తి ఇటువంటి నిబంధనలకు లోబడడు ఎందుకంటే - అతడు అర్థించే (యాచించే) అంతరాత్మను నిరాకరించాడు, సత్యసంధత లోనే శరణాగతి పొందాడు ఏ కొరడాలు, గొలుసులు మనిషిని బానిసగా చేయలేవు - అతడే ఒక బానిస అనే వాసవం మినహా.

## నేటి యువలోకం

ఉత్సాహానికి నిర్వచనం యువజనం యువతీ యువకులు పరిస్థితులకు అనుగుణంగా మెలిగేవారు, ఆవేశపూరితులు తళతళ మెరిసే నీటి ప్రవాహం వంటివారు యువతీ యువకులు వశీకరించే సువాసనలు వెదజల్లే పుష్పాల వంటివారు, ఇంపుసొంపులు చేకూర్చే సుందర హసిత శిశువుల వంటివారు

యువతలో ఏదో లోపం కలదనే తలంపే పెద్ద పొరబాటు అది అపార్థంతో కూడినది, తర్క విరుద్ధమైనది, భ్రమతో కూడినది

ఈనాటి తల్లిదండ్రులకు - తమ బిడ్డల చెంత కూర్చుని, బోధించి, వారిని గమనించి, వారికి విశిష్టమైన ఆదర్శాలతో స్ఫూర్తి కలిగించే సమయం ఉండదు యువజనం యొక్క ఆశలు, అభిలాషలు, ప్రజ్ఞలు మనోభావాలు, కదలికలు అర్థం చేసు కునేందుకు వారికి సమయం చాలదు యువతను నిర్లక్ష్యం చేస్తే, అది తెగించి దుస్సాహసానికి దిగుతుంది యువలోకానికి - నిరంతరం మద్దతు, అవగాహన, దృఢమైన నిర్దేశం, ఉత్తేజపరచే సలహాలు అవశ్యకం

పిల్లలను ఉపాధ్యాయుల సంరక్షణలోకి అప్పగించగానే తమ పని పూర్తయిందని భావించే తల్లిదండ్రులు ఉన్నారు యువతను ఉత్సాహపర్చే అవగాహన, కల్పనాశక్తి బుద్ధి సూక్ష్మతలేని ఉపాధ్యాయులు ఉన్నారు ' మ

## పాటకు భద్రత

కొమ్మల మీద తాము భద్రంగా కూర్చున్న తరువాతే పక్షులు పాడతాయి

"మనలోని మంచిని మేల్కొల్పువాడే నిజమైన కవి"

శిక్షణా సంస్థల నుండి ఎప్పటికప్పుడు ఎన్నో లోపాలు గల, మూసలో (పోత) పోసిన ఉపాధ్యాయులు వెలువడుతునప్పుడు యువ లోకం సరైన దారిలో నడవాలని మనం ఏవిధంగా కోరుకుంటాం?



విద్యా సంస్థలలో చిందర వందర పరిస్థితి కల్పించేందుకు అసహన శీలురూ, స్వార్థపరులూ అయిన రాజకీయవాదులు ఎందరో సిద్ధంగా ఉన్నారు దీని ఫలితంగా యువజనుల చదువులకు అంతరాయం కలగటం, సృజనాత్మక మైన వారి వ్యక్తిత్వాన్ని చెదరగొట్టటం, వారి ననుస్మృతి క్రమశిక్షణ నుంచి తప్పించి నైతిక పతనానికి దారి ఏర్పర్చటం జరుగుతున్నది రాజకీయవాదులు యువతను పెడదారి పట్టించకుండా వారు దేశ అభివృద్ధికి తోడ్పడే విధంగా వారికి మార్గదర్శకులుగా ఉండాలి

యువజనం యొక్క అభిలాషలు, ఆశలు, ఆదర్శాలు మనం కాపాడుతున్నంత కాలం, వారి ప్రచ్ఛాపాటవాలను, తరిగిపోని వనరులను, అంతులేని ఊహా కల్పనలను ఉపయోగించు కున్నంత కాలం - మన దేశంలోని యువలోకాన్ని ప్రపంచంలోని ఏ శక్తి ప్రభావితం చేయలేదు

## చక్కెరను మార్చే సూక్ష్మజీవులు

సాధారణ చక్కెరను ఫ్రక్టోస్‌గా మార్చే సామర్థ్యం గల సూక్ష్మజీవుల (బాక్టీరియా) సంతతిని లాట్వియన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మైక్రో బయాలజీ రూపొందించింది ప్రతి సంవత్సరం ప్రజలు ఆరోగ్యానికి ప్రమాదకరంగా డజన్ల కొద్దీ కిలోల చక్కెర మరిస్తారు వర్ణం కాని కాలొరీలను నిల్వచేయటం కార్డియో వాస్క్యులర్ (హృదయ సంబంధ) వ్యాధులు వచ్చేందుకు దోహదం చేస్తుంది చక్కెర కంటే ఫ్రక్టోస్ 15 రెట్లు తీపి కలది కనుక తీపి పదార్థాలు ఇష్టపడేవారు దీన్ని తక్కువగా ఉపయోగిస్తారు పైగా ఇది చాలా నెమ్మదిగా రక్తంలో కలుస్తుంది

## విస్డమ్ పాత కాపీలు

మే '84, జూన్ '84 ఆగస్టు '84 నుంచీ నవంబరు '84, మార్చి 85 నుంచీ జూలై '85, ఫిబ్రవరి 86 నుంచీ ఏప్రిల్ 86 సెప్టెంబరు 86 నుంచీ డిసెంబరు '86 జనవరి 87 నుంచీ మే '87 ఆగస్టు '87 డిసెంబరు 87, జనవరి 88 మార్చి '88 నుంచీ డిసెంబరు 88 జనవరి 89 నుంచీ డిసెంబరు 89 జనవరి 90 నుంచీ సెప్టెంబరు 90 నవంబరు 90 డిసెంబరు 90 ఫిబ్రవరి '91 నుంచీ డిసెంబరు 91 జనవరి 92 నుంచీ డిసెంబరు 92 కాపీలు మావద్ద ఉన్నవి 1984 కాపీల వెల రూ 7 50లు, 1985 కాపీల వెల రూ 6 50లు 1986 కాపీల వెల రూ 10 50లు 1987 కాపీల వెల రూ 11 50లు, 1988 కాపీల వెల రూ 18 75లు, 1989 కాపీల వెల రూ 24 50లు, 1990 కాపీల వెల రూ 25 50లు, 1991 కాపీల వెల రూ 26 50లు, 1992 కాపీల వెల రూ 33 00లు రిజిస్టర్డ్ పోస్టులో పంపటానికి కాపీల వెలతో పాటు రూ 6 00లు చేర్చి M O పంపాలి 'రత్నా ఎవెన్యూ' 9, వేదికా రోడ్డు, ఆళ్వారుపేట, మద్రాసు - 600 004

— సర్క్యులేషన్ మేనేజర్

# హృద్రోగాల బాలశిక

అన్యురిసమ్ (Aneurysm) హృదయంలోని ఒక మొన లేదా ఒకరక్తనాళం విస్తరించబడి, పగిలే ప్రమాదంలో ఉండటాన్ని అన్యురిసమ్ అంటారు.




అంగిన పెక్టోరిస్ (Angina Pectoris) తరచుగా ఎడమ భుజంలోకి పోయే గుండెనొప్పి. ఇది హృద్రోగానికి లక్షణం లేక చిహ్నం భావావేశం (ఉద్రేకం), ప్రయాస (శ్రమ), చల్లదనానికి (శీతలానికి) గురవటం, లేదా ఎక్కువగా భోజనం చేయటంవల్ల ఇది వస్తుంది కొన్ని క్షణాల (నిర్ణీతకాలం) విశ్రాంతి, లేదా నైట్రోగ్లిసరిన్ టాబ్లెట్ వల్ల ఉపశమనం లభిస్తుంది

అర్రిహత్మియ (Arrhythmia) క్రమబద్ధం కాని హృదయ చలనం ప్రమాదం లేనిది కావచ్చు లేదా అది గుండె జబ్బుకు సూచన కావచ్చు

అథిరోస్క్లిరోసిస్ (Atherosclerosis) ధమనులలో క్రొవ్వు నిల్వ ఉండటం వల్ల అది అవరోధంగా తయారవుతుంది వ్యాయామం లేనందువల్ల, క్రొవ్వు పదార్థాలు తినడం వల్ల ఇది బాల్యంలోనే ప్రారంభమౌతుంది అత్యధిక (రక్తపు) కొలెస్టరాల్ ప్రమాద సూచిక

బెలూన్ అన్జియోప్లాస్టీ (Balloon Angioplasty) అవరోధం ఏర్పడిన కరోనరి ధమనిలో ఒక బెలూన్‌ను చొప్పించిన తరువాత దాన్ని ఊది విస్తరింపచేస్తే అవరోధం తొలగుతుంది బైపాస్ సర్జరీకి ఇది ప్రత్యామ్నాయం

బీటా - బ్లాకర్స్ (Beta - blockers) మందులు - రక్తపు ఒత్తిడిని తగ్గించి గుండె వేగాన్ని తగ్గిస్తాయి

బ్లడ్ క్లాటింగ్ (Blood- clotting) నెత్తురు గడ్డ కట్టుకోవడం - నెత్తురు ఘనీభవించి ధమనులను నిరోధించటం ఇది తీవ్రమైన అథిరోస్క్లిరోసిస్ స్థానంలో జరగవచ్చు లేదా రక్తంతో కలిసి ఒక చిన్న ధమనిలోకి రవాణా కావచ్చు

బ్లడ్‌ప్రెషర్ గుండె ముడుచుకున్నప్పుడు, మరియు విశ్రాంతిగా ఉన్నప్పుడు ధమనులలో రక్తవేగం అధికంగా ఉండటం రక్తపు ఒత్తిడి లేక రక్తపుపోటు రావడం మొదటిది సిస్టోలిక్ ఒత్తిడి, రెండవది డైయాస్టోలిక్ ఒత్తిడి దీన్ని ఒక స్పిగ్మోమానోమీటర్ (sphygmomanometer) ద్వారా కొలుస్తారు 160 (సిస్టోలిక్),

## ఇతరుల తప్పులు ఎంచటం

ఇతరుల తప్పును తేలికగా కనుక్కుంటారు తను చేసిన తప్పును గ్రహించటం మాత్రం కష్టమైన పని ఒక మనిషి తన పొరుగువాని తప్పుల్ని పొట్టు చెరిగినట్లు చెరిగి తూర్పార పడతాడు తన తప్పుల్ని మాత్రం దాస్తాడు అటగాని వద్గర చెడ్డ పాచికను దాచిన మోసగాని వలె దాస్తాడు

— ధమ్మపద

95 (డైయాస్టొలిక్) పైన ఉంటే తీవ్రమైన రక్తపుపోటుగా నిర్ణయించబడుతుంది.

బైపాస్ సర్జరీ: శరీరంలో మరోచోటినుంచి ఒకధమనిని గాని, ఒక సిరనుగాని. సర్జన్లు తీసి దానిని అవరోధంగల కరొనరీ ధమనికి రక్తప్రసారం జరిగేవిధంగా మరోమార్గం ఏర్ప ర్చేందుకు ఉపయోగిస్తారు




కార్డియాక్ (హార్ట్) అరెస్ట్ హృదయం ముడుచుకుపోయి హఠాత్తుగా నిల్చిపోవటం

కార్డియోమయోపథీస్ (Cardiomyopathies) హృదయ కండరానికి వచ్చే అనేక వ్యాధులు (సామాన్యంగా అస్పష్టంగా ఉండే మూలం లేదా పుట్టుక).

కార్డియోవాస్క్యులర్ డిసీజెస్: హృదయానికి మరియు రక్తనాళాలకు సంబంధించిన వ్యాధులు. కార్డియాక్ అరెస్ట్, కరొనరీ హార్ట్ డిసీజ్, హార్ట్ ఎటాక్, హార్ట్ ఫెయిల్యూర్, ర్యుమాటిక్ హార్ట్ డిసీజ్, స్ట్రోక్ వంటివి.

సెరిబ్రల్: మెదడుకు సంబంధించి సూచించేది

సెరిబ్రోవాస్క్యులర్ డిసీజెస్ లేక స్ట్రోక్స్ బలహీనమైన రక్తప్రసారం వల్ల మెదడుకు హాని కలగటం ముఖ్యంగా ఇవి:

* సెరిబ్రల్ హెమరేజ్ పగిలిన ధమనుల వల్ల మెదడులో రక్తస్రావం జరగటం

* సెరిబ్రల్ థ్రాంబోసిస్: మెదడులోని ధమని గడ్డకట్టటం.

కొలెస్టరాల్ శరీరంలో తయారైన క్రొవ్వు పదార్థం రక్తంలో చేరటం. క్రొవ్వుతో నుసంపన్న మైన ఆహారాన్ని భుజించటం ద్వారా కొలెస్టరాల్ శరీరంలో అధనంగా చేరుతుంది. దీనివల్ల రక్తనాళాలకు అవరోధం ఏర్పడుతుంది. 240 లేక పైస్థాయికి చేరిన కొలెస్టరాల్‌కు చికిత్స అవసరం ఆహారం, కొన్ని సందర్భాలలో ఔషధాలు - కొలెస్టరాల్ స్థాయిని తగ్గిస్తాయి

కరొనరి హార్ట్ డిసీజ్ చాలా సందర్భాలలో హృదయకండరానికి చాలినంత రక్తం సరఫరా చేయలేకపోవటం వల్ల గుండె పని చేయటంలో ఆటంకం ఏర్పడుతుంది దీని వల్ల ధమనులు కుదించుకుపోవటం, సన్నని (పరిమిత) భాగంలో రక్తం గడ్డకట్టడం - జరుగుతుంది. మయోకార్డియల్ ఇన్‌ఫ్రాక్షన్ (హృదయ కండరం లోని ఒక భాగం మరణించడం) - దీనిలోని తీవ్రమైన పరిస్థితి.

## ప్రతిరోజు మనిషి విసర్జించేవి

*ప్రతిరోజు ఒక మనిషి తన ప్రేగుల్లోని లైనింగ్ నుంచి 17 బిలియన్ (17,000 మిలియన్) వ్యర్థమైన జీవకణాలను ప్రేగుల్లోనికి నెట్టి వేస్తాడు ఇవి అతడు లేదా ఆమె తినే ఆహారం జీర్ణం అయ్యేందుకు సహాయపడే ఎంజైములు కలిగి ఉంటాయి*

"శ్రమ పడకుండా వచ్చిన సంపద మనిషిని చెడగొడుతుంది, బలహీనపరుస్తుంది"

డయాబిటిస్: శరీరంలోని కార్బొహైడ్రేట్ల (చక్కెర) రసాయనిక మార్పులను క్రమబద్ధం చేసి "ఇన్సులిన్" ఉత్పత్తి చేసే కడుపులోని ఒక భాగం - మధువాహిక (pancreas) సక్రమంగా పనిచేయక పోవటంతో ఈ వ్యాధి వస్తుంది డయాబెటిస్ రోగులు కరోనరీ గుండె జబ్బులకు గురవడానికి అవకాశాలు ఎక్కువ

డయురెటిక్స్ (Diuretics) మూత్రాన్ని అధికం చేసే ఔషధాలు రక్తంలో సోడియం క్లోరైడ్ (లవణం) ను నశింపచేస్తాయి దీనివల్ల రక్తపుపోటు, నీటిని నిల్వ ఉంచుకునే శక్తి శరీరంలో తగ్గిపోతుంది

హార్ట్ ఎటాక్ మయోకార్డియల్ ఇన్‌ఫ్రాక్షన్‌కు తరచుగా ఉపయోగించే పదం (కరోనరీ హార్ట్ డిసీజ్ గురించి చదవండి)

హార్ట్ ఫెయిల్యూర్ అవయవాలకు, ధాతువులకు (టిష్యూస్) కావలసినంత రక్తాన్ని గుండె పంపలేకపోవటం

హైపర్‌టెన్షన్ దీర్ఘమైన సిస్టోలిక్ (గుండె ముడుచుకుపోవటం) లేక డైయాస్టోలిక్ ధమని రక్తపుపోటు లేక రెండూ ఉండటం వల్ల వచ్చే అతి సామాన్యమైన రక్తప్రసారం చలనం)లోని అవరోధం

రీనల్ హైపర్‌టెన్షన్ మూత్రపిండాలవ్యాధి వల్ల ఏర్పడే తీవ్రమైన రక్తపుపోటు.

రుమటిక్ హార్ట్ డిసీజ్ గుండెకు సంబంధించిన వాల్వ్ (Valve) మరియు ంతరాలకు ఏర్పడిన నష్టం వల్ల రుమటిక్ జ్వరం వస్తుంది దీనికి స్ట్రెప్టోకొక్కల్ ఇన్‌ఫెక్షన్ (Streptococcal Infection) కారణం అభివృద్ధి చెందుతున్న దేశాల్లోని యువతలో ఈ గుండె జబ్బు అత్యంత సహజంగా కనిపిస్తున్నది

రిస్క్ ఫ్యాక్టర్స్ వ్యక్తిగత అలవాట్లవల్ల ఏ వ్యక్తి అయినా కార్డియోవాస్క్యులర్ జబ్బులకు గురయ్యే ప్రమాదం ఉంది అత్యధిక రక్తపు పోటు (160/95 ఎంఎం హెచ్‌జి - ఇంకా పైన), అత్యధిక కొలెస్టరాల్, పొగాకు వాడకం, వ్యాయామం చేయకపోవటం, అధిక మద్యపానం, స్థూలశరీరం, క్రొవ్వుతోకూడిన ఆహారం, రోజుకు 5 గ్రాములకు మించి ఉప్పు తీసుకోవటం, ఆందోళన - దీనికి కారణాలు

స్ట్రోక్ మెదడులో రక్తనాళం పగలటం లేదా అడ్డుపడటం పక్షవాతానికి (తాత్కాలికం లేదా శాశ్వతం) కారణం అవుతుంది శరీరంలో ఒక భాగం పక్షవాతానికి గురికావటం, మాటరాక పోవడం జరుగుతుంది

— 'వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్' సౌజన్యంతో

## భారం - గౌరవనీయం



**Napoleon**

దేశ బహిష్కృతుడైన నెపోలియన్ బోనాపార్టి మిసెస్ బాల్‌కూంబ్ కలిసి సెయింట్ హెలీనాలో ఒక పర్యాయం నడుస్తున్నారు తలపైన సామాన్ల భారంతో ఉన్న కొందరు నౌకర్లు వారిని సమీపించారు మిసెస్ బాల్‌కూంబ్ వారిని దారిలోనుండి తొలగి పొమ్మని ఆజ్ఞాపించింది అప్పుడు నెపోలియన్ కలుగజేసుకుని ఇలా చెప్పాడు- "భారాన్ని గౌరవించండి మేడమ్!"

"ఉత్తముడు మాటల్లో మూగగాను, చేతల్లో చురుకుగాను ఉంటాడు"

# చిట్టిదేవతలకు చిన్న కథలు

## పాపపు పనులకు చెడు ఫలితాలు తప్పవు

స్వామిని శారదా ప్రియానంద

చాలా కాలం క్రిందట సుకన్య అనే ఒక అందాల రాకుమారి ఉండేది ఒక రోజున ఆమె తన నెచ్చెలులతో కలిసి విహారం కోసం



అటవీ ప్రాంతంలోకి వెళ్ళింది అరణ్యసౌందర్యాన్ని ఆస్వాదిస్తూ వారు ఆనందంతో కొంతసేపు అటూ ఇటూ తిరిగారు ఆ అరణ్య మధ్యంలో వారికి ఒక పెద్ద చీమల కొండ కనిపించింది మధ్య మధ్య రంధ్రాలతో గంభీరంగా కనిపించే ఆ కొండపైకి చేరుకుని సన్నని రంధ్రాలలోకి చూడసాగారు

హఠాత్తుగా సుకన్యకు రెండు రంధ్రాల నుండి రెండు ప్రకాశించే వస్తువులు కనిపించాయి అవి ఏమిటో తెలుసుకోవాలనే కుతూహలంతో ఆ బాలిక రెండుముండ్లను చేతికి తీసుకుని ఆ రంధ్రాలలో పొడిచింది ఆ కొండ లోపలున్న దేనినో ఆ ముళ్ళు బాధించాయి ఆ ముండ్లను వెలికి లాగగానే - ఆమెకు భయం గొలుపుతూ - ఆ ముండ్ల చివర్ల నుండి రక్తపు బిందువులు జారుతున్నాయి ఆ బాలికలు ఆ రక్తపు ముండ్లవంక క్షణం సేపు రెప్పవేయకుండా చూశారు ఏమి చేయాలో తోచక భయభ్రాంతులయ్యారు విచార వదనాలతో అంతఃపురానికి తిరిగి వచ్చారు అడవిలో జరిగిన విచిత్ర సంఘటన గురించి వారు పెద్దవారికి చెప్పలేదు

మూడోరోజున ఆ రాజ్యమంతటా ఒక భయంకర వ్యాధి వ్యాపించింది స్త్రీ పురుషులు, పెద్దలూ, పిల్లలూ, ధనవంతులు, పేదవారు - అందరూ ఒక విచిత్ర వ్యాధికి గురయ్యారు వారి కడుపులు ఉబ్బిపోయాయి విపరీతమైన బాధతో ఏడ్వటం ప్రారంభించారు ఇది ఎందుకు సంభవించిందో వైద్యులు కూడా చెప్పలేకపోయారు సుకన్య తండ్రి అయిన సర్యాతిరాజు సత్పురుషుడు, వివేకవంతుడు ఈ వ్యాధి రాజ్యమంతటా వ్యాపించినందువల్ల, తన కుటుంబ సభ్యులే ఏదో ఒక ఘోర తప్పిదం చేసి ఉంటారని ఆయన భయపడ్డాడు

# తెలుసుకోదగిన విషయాలు

## తొమ్మిది రోజుల పాలన

ఇంగ్లండ్ రాణి జేన్ గ్రే కేవలం తొమ్మిది రోజులే పరిపాలించింది

తన కుటుంబ సభ్యులందరినీ ఒక చోట చేర్చి వారిలో ఎవరైనా, ఎవరినైనా బాధించారా అని ప్రశ్నించాడు అవమానభారంతో సుకన్య తన నేరాన్ని అంగీకరించింది

అనుచరులను వెంటబెట్టుకుని సర్యాతి రాజు తక్షణమే అరణ్యానికి వెళ్ళాడు ఆ చీమల కొండను జాగ్రత్తగా త్రవ్వించాడు దానిలోపలున్న చ్యవనుడనే ఒక వృద్ధుడు, బలహీనుడు అయిన ఋషిని కనుగొన్నాడు ఆ ఋషి రెండు నేత్రాలు గ్రుడ్డివి ఎండిన నెత్తుటి చారలు ఆయన బుగ్గలపైన కనిపిస్తున్నాయి సర్యాతిరాజు సాష్టాంగ దండ ప్రణామం చేసి ప్రార్థించాడు "ఓ మహర్షీ! నాకుమార్తె అజ్ఞానంతో మీ కళ్ళకు బాధ కలిగించింది దయితో ఆమెను క్షమించండి, నా ప్రజలను భయంకర వ్యాధి నుంచి కాపాడండి నా కుమార్తె చేసిన అపరాధానికి మారుగా మీరు ఏది చేయమన్నా చేస్తాను"

ఆ ఋషి చెప్పాడు "రాజా! మీ కుమార్తె పట్ల నాకు కోపం లేదు ఆ వ్యాధికి నేను కారకుణ్ణి కాదు కానీ భగవంతుని నిబంధనల ప్రకారం దుష్టకార్యాలకు పాపపు ఫలితాలే లభిస్తాయి అందువల్ల నీ ప్రజలు బాధపడుతున్నారు ఏమైనప్పటికీ ఈ తప్పును సవరించుకోవాలని నీవు భావిస్తే నీ కుమార్తెను నాకు ఇచ్చి వివాహం చెయ్యి నేను అంధుడనైనందువల్ల ఆమె నాకు రెండు నేత్రాలవలే నిలుస్తుంది పైగా నీ ప్రజలు వ్యాధి నుండి విముక్తులౌతారు"

తన ఆలోచనారహిత కార్యం వల్ల ఏమి జరిగిందో వినగానే సుకన్య విచారంలో మునిగిపోయింది తన కారణంగా ఎవరూ బాధపడకూడదని, సంతోషంతో ఆ ఋషిని వివాహం చేసుకుని సేవిస్తానని తన తండ్రితో చెప్పింది విచారగ్రస్తుడైనప్పటికీ, రాజుకు అదే సరైన నిర్ణయమని తెలుసు అతి త్వరలోనే వివాహం జరిగింది సుకన్య భర్తతో జీవించేందుకు తల్లిదండ్రులను వదలి అరణ్యానికి పోయింది ఒక పర్ణ కుటీరంలో ఆమె ఒక అటవీ వనిత వలే జీవించటం ప్రారంభించింది స్వయంగా గృహకృత్యాలన్నీ నెరవేర్చుకుంటూ, భర్తను అత్యంత గౌరవాదరాలతో సేవిస్తున్నది

ఒకరోజు నది నుండి నీటిని తెచ్చుకుంటున్న సమయంలో ఇద్దరు దేవతామూర్తులు

## స్నేహానికి నిర్వచనం



ఒక ఆంగ్ల ప్రచురణ ఉత్తమ స్నేహితుడికి ఉత్తమ నిర్వచనం ఇచ్చినవారికి బహుమతి ప్రకటించింది వేలాదిగా వచ్చిన జవాబుల్లో ఈ క్రిందివి కొన్ని

"సంతోషాన్ని ఎవరైతే రెట్టింపు చేస్తారో, దుఃఖాన్ని విభాగించుకుంటారో, ఎవరి న్యాయబుద్ధి నిష్పక్షపాతంగా ఉంటుందో వారే ఉత్తమ మిత్రులు"

"మన మౌనాన్ని అర్థం చేసుకున్నవాడు"

"గుడ్డల్లో చుట్టబడిన ఒక సానుభూతి సంపుటం"

"అన్ని కాలాల్లో సత్యాన్ని మ్రోగించే గడియారం, ఎప్పుడూ చెడిపోనిది"

బహుమతి పొందిన నిర్వచనం ఇది

"ప్రపంచం యావత్తూ ఎదురు నిల్చినా, తోడుగా ఉండే వ్యక్తే స్నేహితుడు"

— 'ఇన్స్పిరేషనల్ కోట్' సౌజన్యంతో

"గుణాన్ని (యోగ్యతను) ఆచార వ్యవహారాలు ఋజువు చేస్తాయి"

ఆమెను కలుసుకుని చెప్పారు "ఓ అందాల రాకుమారీ! నిన్ను చూసి జాలి చెందుతున్నాము ఆ వృద్ధుడూ, రోగగ్రస్తుడూ అయిన భర్తతో ఎలా జీవిస్తావు? మాలో ఒకరిని వివాహం చేసుకో నీకు ఆనందం కలుగుతుంది" సుకన్య జవాబిచ్చింది "తెలివితక్కువగా, మూర్ఖంగా మాట్లాడకండి మహా ఋషీశ్వరుడైన నా భర్తను నేను ప్రేమించి గౌరవిస్తాను మీ సలహాలు నాకు అవసరం లేదు"

ఆ దేవతామూర్తులు ఆమెతో కుటీరానికి అనుసరించి వచ్చారు ఆమె భర్తను కలుసుకుని "ఓ మహర్షీ! మేము అశ్వినీ దేవతలము, దైవవైద్యులము మీరు కోరుకుంటే, మిమ్మల్ని యువకునిగా, సౌందర్యవంతునిగా చేస్తాము" "నీకోసం యువకునిగా మారమంటావా? అని చ్యవనుడు సుకన్యను అడిగాడు ఆమె చెప్పింది "మీరు ఇప్పుడు ఎలా ఉన్నారో అలాగే నేను మిమ్మల్ని ప్రేమించి గౌరవిస్తాను మీరు యువకులు కావాలనుకుంటే నా అభ్యంతరం ఏమీలేదు"

చ్యవనుడు దేవతామూర్తుల వంకకు తిరిగి "తనను యువకునిగా చేయుమని" కోరాడు వారు అయన్ని నది వద్దకు తీసుకువెళ్ళారు ముగ్గురూ నీటిలో మునిగి పైకిలేచారు. ఆశ్చర్యం! ముగ్గురూ చాలా అందగాళ్ళుగా మంచి యౌవనవంతులుగా రూపొందారు, పైగా ఒకే మాదిరిగా కనిపిస్తున్నారు వారు సుకన్య వద్దకు వచ్చి అడిగారు "మాలో ఒకరిని నీ భర్తగా ఎన్నుకో"

సుకన్య కళ్ళు మూసుకుని ప్రార్థించింది "ఓ భగవంతుడా! ఈ ముగ్గురిలో నా భర్త ఎవరో నాకు తెలిసేటట్లు చెయ్యి" ఆమె తన కళ్ళు విప్పగానే, వారిలో ఒకరిలో తన భర్త రూపం స్పష్టంగా చూడగలిగింది అతణ్ణే తన భర్తగా ఎంచుకున్నది ఆ తరువాత భర్తతో కలిసి ఎన్నో ఏళ్ళు సుఖంగా జీవితం గడిపింది

## ఆశావాదం - నిరాశావాదం



1 ఆశావాద వైఖరి విజయానికి దారితీస్తుంది నిరాశావాదుల కంటే ఆశావాదులే ఒత్తిడుల (ప్రయాసలు)ను తేలిగ్గా ఎదుర్కొంటారు ఆశావాది ప్రతి కష్టంలోనూ ఒక అవకాశాన్ని చూడగలిగితే, ఒక నిరాశావాది ప్రతి అవకాశంలోనూ ఒక కష్టాన్ని చూస్తాడు

2 సమస్య అని ప్రత్యేకంగా ఏమీ లేదు - అవి అవకాశం మాత్రమే. రెండు రకాల ప్రజలు ఉన్నారు ఆశాజీవులు నిరాశావాదులు నీవు వ్యాపారంలో, జీవితంలో విజయం పొందాలంటే నీవు ఆశాజీవిగా ఉండక తప్పదు

3 ఆశావాదికి ఒక నిశ్చయాత్మకమైన స్వయం ప్రతిబింబం (Positive self-image) ఉంటుంది ఒక ఉత్తమ కార్యనిర్వాహకుడు కావాలని లక్ష్యంగా పెట్టుకున్న వ్యక్తికి ఒక నిర్ణీత స్వయం ప్రతిబింబం ముందుగా కావలసి ఉంటుంది

— 'జి జె కంతారియా' సౌజన్యంతో

"మనం ఏమి చదివామన్నది కాదు, ఏది జ్ఞాపకం పెట్టుకున్నామన్నదే మనల్ని విద్యావంతుల్ని చేస్తుంది"

# అజీర్ణ వ్యాధికి ప్రకృతి చికిత్స

హెచ్.కె.బఖ్రూ

డిస్పెప్సియ (Dyspepsia) అనే పదానికి మూలం గ్రీక్ నుండి వచ్చింది దీని అర్థం ...ం లేక జీర్ణించుకోవటంలో సంకటస్థితి ఏర్పడటం. ఇది ఆహారం తీసుకోవటానికి సహకరించే కడుపుకు సంబంధించిన ప్రేగుల లక్షణాలన్నిటినీ ఇముడ్చుకుంటుంది నేటి అతి సామాన్య రోగాలలో ఇదొకటి వాడుకగా తినుకునే ఆహారంలోని పొరపాట్లవల్ల ఇది వస్తుంది




కడుపునొప్పి (ఉదర సంబంధమైన బాధ), ఆహారం తిన్న తరువాత అమితంగా పొట్ట నిండిపోయిన భావన, గుండెల్లో మంట, ఆకలి లేకపోవటం, వాంతి మరియు వాయువు - అజీర్ణానికి సామాన్య లక్షణాలు ఇతర లక్షణాలు

మలబద్ధము, నోటిలో దుర్వాసన, పూత పూసిన నాలుక, చెడుశ్వాస కొన్ని సమయాల్లో కంఠం (ఊపిరాడకుండా) పిసికి వేస్తున్నట్లు ఆవేదన కూడా కల్గుతుంది

అజీర్ణానికి ప్రధాన కారణాలు - అధికంగా తినటం, అతి త్వరగా తినటం మరియు నమిలి తినటాన్ని నిర్లక్ష్యం చేయటం, నోటిలో అధికంగా ఉమ్మి ఊరకపోవటం అధికంగా తినటం, తరచుగా తినటం - కడుపు, కాలేయం, మూత్రపిండాలు మరియు ప్రేగుల పనిని కఠినం చేస్తాయి ఈ ఆహారం క్రుళ్ళి దుర్వాసన కొట్టగానే, దీనిలోని విషపదార్థాలు రక్తంలో కలిసిపోయినందువల్ల శరీరం అంతా విష పూరితమౌతుంది

అజీర్ణవ్యాధికి సార్థకమైన చికిత్స జీర్ణవాహికను పూర్తిగా శుభ్రం చేసిన తర్వాత పథ్యం తీసుకోవటం

## మావి ద్వారా గర్భస్థ పిండానికి చేరే విషవాయువులు

పర్యావరణంలోని విషయుక్త రసాయనాలకు గర్భంలోని శిశువులు బలి అవుతారని పశ్చిమ జర్మనీ శాస్త్రవేత్తలు చెబుతున్నారు సస్యరక్షణ మందుల వాడకం చాలా ఎక్కువగా ఉండే ప్రాంతాలకు చెందిన వర్తమాన దేశాలలోని తల్లులు తమ పిల్లలకు స్తన్యం ఇస్తూ ఈ రసాయనాలను కూడా లోపలికి పంపుతున్నారని ఋజువైంది మన్స్టైర్ విశ్వవిద్యాలయానికి చెందిన డాక్టర్ మాన్ఫ్రెడ్ టూఫెల్ కనుగొన్న ప్రకారం ఇంకా జన్మించని శిశువులు తమ కొవ్వు గల కణజాలంలో ఈ విషాలను నిల్వ చేస్తున్నారని తెలుస్తున్నది మావి (Placenta) ద్వారా గర్భంలోని పిండానికి ఈ విషవాయువులు చేరుతున్నాయి రక్షాయనిక కాలుష్య అదుపు చర్యలు లేని ప్రాథమిక దశలో ఉన్న వర్థమాన దేశాలలోని తల్లులకు దీనివల్ల చాలా చిక్కులు కలుగుతాయని ఈ పరిశోధనలు వెల్లడిస్తున్నాయి

— 'సిజెఐ- ఎస్ఎఫ్ఎస్' సౌజన్యంతో

"తరచుగా అవకాశాలు కోల్పోయేందుకు ముఖ్యకారణం - నిర్ణయాలు వెంటనే తీసుకోకపోవడం"

ఆ తరువాత జీవితశైలిలో మార్పు చేసుకోవటం. మొట్టమొదటగా - రోగి దాదాపు ఐదు రోజులపాటు అన్నిరకాల పండ్ల ఆహారం తీసుకోవాలి. తాజా పండ్లతో (రసాలు) రోజుకు మూడుసార్లు భుజించాలి. తీవ్రస్థాయిలో అజీర్ణవ్యాధి ఉన్నట్లయితే - అన్ని పండ్లతో ఆహారం తీసుకునే ముందు రెండు లేక మూడురోజుల వరకు ఉపవాసం చెయ్యటం మంచిది



అన్ని పండ్లతో కూడిన ఆహారం తరువాత రోగి తేలికగా జీర్ణమయ్యే ఆహార పదార్థాలతో కూడిన కట్టుబాటుగల ఆహారం మాత్రమే తీసుకోవాలి దీనిలో వండిన కాయగూరలు, పండ్లరసాలు మరియు మజ్జిగ చేరి ఉంటాయి. వీటిని 10 రోజులు తీసుకోవాలి అనంతరం అతడు క్రమేణా మామూలు ఆహారం తీసుకోవచ్చు మసాలాపొడులు, ఊరగాయలు, మద్యం, పొగాకు, స్ట్రాంగ్ టీ, కాఫీ, శక్యమైన మాంసం, మరగకాచిన పాలు, పప్పులు, పొటాటో, జున్ను, శుద్ధిచేసిన, నిస్సారమైన టిన్నుల్లోని ఆహారపదార్థాలు - వీటన్నిటినీ దూరంగా ఉంచాలి. పెరుగు మరియు గ్రామీణపు జున్ను స్వేచ్ఛగా తీసుకోవచ్చు

చాలాకాలంగా ఉన్న అజీర్ణవ్యాధికి గృహవైద్యం - భోజనానికి ముందు రాతి ఉప్పుతో కలిసిన ఒక గ్రాము అల్లం (శొంఠి) నమలటం. వాయురోగాలు (కడుపు ఉబ్బు) మరియు వాయువుకు వెల్లుల్లి మంచి ఔషధం. అది క్రుళ్ళిన జీవపదార్థాలను నిర్వీర్యం చేసి, అనారోగ్యం కలిగించే విషక్రిముల్ని హరిస్తుంది. వాయువును తొలగించి జీర్ణశక్తికి తోడ్పడుతుంది.

అజీర్ణ వ్యాధిగ్రస్థుడు తిండి విషయంలో ఎప్పుడూ కొన్ని నిబంధనలు పాటించి తీరాలి భోజనం చేస్తున్నప్పుడు నీరు త్రాగకుండా, భోజనానికి అరగంట ముందుగా, భోజనానంతరం ఒక గంటకు త్రాగటం - ఒక నిబంధన

## 99.9 శాతం నాణ్యత

*100 శాతం నాణ్యత - పూర్తి నాణ్యతకు లక్ష్యంగా ఉంటుంది 99.9 శాతం నాణ్యత మాత్రమే ఉంటే నీకు లభించేది ఇది:*

* *నీ గుండె ప్రతి సంవత్సరం 32,000 సార్లు కొట్టుకోదు*
* *ప్రతివారం 500 శస్త్రచికిత్సలలో లోపం ఏర్పడుతుంది*
* *ప్రతి మాసం న్యూఢిల్లీ, ఇందిరాగాంధీ విమానాశ్రయం వద్ద రెండు విమానాలు దిగేటప్పుడు ప్రమాదానికి లోనవుతాయి*
* *ప్రతి సంవత్సరం పుట్టుక సమయంలో -19,000 మంది కొత్తగా జన్మించిన పసి బిడ్డలను డాక్టర్లు జారవిడవడం జరుగుతుంది*
* *ప్రతి సంవత్సరం 16,000 ఉత్తరాలు సరిగ్గా బట్వాడా చేయబడవు*
* *ప్రతి ఏడాది 22,000 చెక్కులు తప్పు ఖాతాల్లోకి జమ అవుతాయి*
* *ప్రతి సంవత్సరం 20,000 సరిగా లేని విధంగా ఔషధ నిర్ణయాలు చేయబడుతుంది.*

*-'బిజినెస్ ఇండియా' సౌజన్యంతో*

భోజనం చేసేటప్పుడు ఎప్పుడూ తొందరపాటు కూడదు. నెమ్మదిగా తినాలి, ఆహారాన్ని నమిలి మ్రింగాలి. కడుపునిండుగా ఆహారం తీసుకోకూడదు. తాను ఇంకా తినగలననే భావంతోనే భోజనాల బల్లనుంచి లేవాలి



ఆందోళన పడుతున్నప్పుడు, అలసిపోయినప్పుడు, ఉద్రేకపడుతున్నప్పుడు, కోపంతో ఉన్నప్పుడు భోజనానికి రాకూడదు ఆకలి లేనప్పుడు తినకూడదు ఒకే భోజనంలో అనేక పదార్థాలను కలుపుకోకూడదు

సర్వాంగాసనం, వజ్రాసనం, భుజంగాసనం, శవాసనంవంటి యోగాసనాలు, జలనేతి, కుంజల్ వంటి క్రియలు, కపల్‌భతి, ఉజ్జయ్ వంటి ప్రాణాయామాలు - అజీర్ణవ్యాధి నిర్మూలనకు అత్యంత సహాయకారులు నడక, గోల్ఫ్ ఆట, ఈదటం వంటి తేలిక వ్యాయామాలు కూడా జీర్ణశక్తికి తోడ్పడతాయి

ప్రేగుల్లోని విషయుక్త వ్యర్థ పదార్థాలను పరిశుభ్రం చేసేందుకు ప్రతిరోజు ఎనిమా చేయించుకోవాలి ఇతర ఉపయోగకర నీటి చికిత్సలలో రాత్రివేళల్లో తడిసిన గుడ్డతో నడికట్టు పెర్చి కట్టడం, ప్రతిరోజు చన్నీటితో స్నానం చేయటం, రోజు విడిచి రోజు - వేడినీటితో, చన్నీళ్ళతో తుంటి (నడుము) స్నానం చేయటం మంచిది ఉదరాన్ని (కడుపును) నొక్కి తోమటం (మాలీసు) కూడా సహాయ పడుతుంది

## శీఘ్రగమనం గల చిఱుతపులి



**Cheetah**

శతాబ్దాలుగా మనిషికి చిఱుతపులిపైన ఆకర్షణ ఏర్పడింది ఈ రాజసంకల పిల్లి తన పేరును 'చిత' అనే హిందీ శబ్దం నుంచి పొందింది 'చిత' అంటే చుక్కలుగలది అని అర్థం ఇండియాలోనూ, ఉత్తర ఆఫ్రికాలోనూ తొలిదశలోని రాజులు, చక్రవర్తులు - తమ సంపన్న సహచరిగానూ, వేటలో భాగస్వామిగానూ దీన్ని ఇష్టపడి ఎన్నుకునేవారు

ప్రాచీన ఈజిప్ట్‌లో చిఱుతపులి పవిత్రమైనదిగా భావించబడేది తాము మరణించిన తరువాత తమ ఆత్మలను చిఱుతపులులు మోసుకుపోతాయని ఫారోలు (pharaohs) నమ్మేవారు

భూమిపైనున్న పాలిచ్చే జంతువుల్లో అత్యంత శీఘ్ర గమనంగల చిఱుతపులి 300 మీటర్లమేరకు కొన్ని సెకండ్లకాలంలో చేరుతుంది ఈ వేగంగా పరిగెత్తే పిల్లి పరుగెత్తటం ప్రారంభించిన వెంటనే గంటకు 112 కి.మీ.ల వేగంతో పోతుంది!

— 'సౌత్ ఆఫ్రికన్ పనోరమ' సౌజన్యంతో

[illegible]

# అవీ - ఇవీ

## అమెరికన్ కుబేరుడు

యూనివర్శిటీ నుంచి బయటికి వచ్చిన వెంటనే ప్రపంచంలోనే పెద్దది అయిన - పర్సనల్ కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ కంపెనీ స్థాపించిన 36 ఏళ్ళ వయస్కుడు బిల్ గేట్స్ యుఎస్ఏలో - అత్యధిక ధనవంతుడైన అమెరికన్‌గా పేరొందాడు అతని సంపద 6 3 బిలియన్ డాలర్ల మేరకు ఉండవచ్చునని అంచనా వేయబడింది

## ఇండియాలో పొడవైన వంతెన



Vidya Sagar Bridge

కలకత్తాలోని హుగ్లీ నదిపై నిర్మించిన విద్యాసాగర్ వంతెన ఇండియాలోనే అత్యంత విస్తారమైనది మరియు ఇటువంటి వాటిలో మొదటిది ఇది ప్రతిరోజు 85,000 వాహనాలను రవాణా చేసే శక్తి కలిగి ఉంది బాగా రద్దీగా ఉండే సమయాల్లో వాహనాల రవాణా గంటకు 3,500 వరకు పెరిగిపోతుంది వాహనాల మార్గం - ఉక్కు, కాంక్రీట్‌ల సమ్మిళితమైన నిర్మాణం

## ప్రపంచంలో అరుదైన ఈగ

ప్రపంచంలో అపురూపమైన ఈగగా భావించబడుతూ, న్యూజిలాండ్ నైఋతి దిక్కులోని ఫియోర్డ్‌లాండ్ మోటు ప్రాంతాల్లో మాత్రమే కనిపించే గబ్బిలపు రెక్కల నరమాంస భక్షకురాలైన ఈగ సమీప భవిష్యత్తులో అంతరించి పోవచ్చు గత శతాబ్దిలో కేవలం మూడుసార్లు మాత్రమే ఇది కనిపించింది

## ఇండియాకు తగినట్లుగా కంప్యూటర్ వ్యవస్థ

ప్రథమ స్థానంలో ఉన్న ఒక ఇండియన్ కంప్యూటర్ సంస్థ - పెర్టెక్ కంప్యూటర్ లిమిటెడ్ - భారత దేశ పరిస్థితులకు అనుగుణంగా ఒక కంప్యూటర్ వ్యవస్థను న్యూఢిల్లీలో ఇటీవల ప్రారంభించింది "హాల్‌మార్క్ ఎంపి" అని పేరు పెట్టిన దీనిలోని మల్టీ ప్రాసెసర్ విధానం ప్రతి క్షణానికి 120 మిలియన్ ఆదేశాలను సమర్థంగా, శీఘ్రంగా అమలు చేస్తుంది ఇతర ప్రాసెసర్లు పని లేకుండా ఉండటం, ఒక ప్రాసెసర్ అత్యధిక పని భారం మోయటం కూడా - ఆటోమాటిక్ లోడ్ బాలెన్సింగ్ అరికడుతుంది

## ప్రపంచ జనాభా 5.48 బిలియన్

ఐదు బిలియన్ (ఒక బిలియన్ = వెయ్యి మిలియన్లు) మానవుల పుట్టుక జరిగిన 1987 నుండి ప్రపంచ దేశాలు "జనాభా దినం" జరుపుకుంటున్నాయి ఆ సంవత్సరం నుండి అర్ధబిలియన్ ప్రజలు ప్రపంచ జనాభాకు చేరుకున్నారు. ఇప్పుడు ప్రపంచ జనాభా 5 46 బిలియన్‌కు చేరుకుంది

## అరుణాచలప్రదేశ్‌లో 82 భాషలు

దాదాపు 25 ప్రధాన తెగలు, 50 ఉపతెగలు

"మత సంబంధమైన ప్రతివిశ్వాసంతో చేసినంత సంపూర్తిగా, సంతోషంగా మనుషులు దుష్కార్యాలు మరెప్పుడూ చేయరు" — బ్లైజ్ పాస్కల్

కలిసి అరుణాచలప్రదేశ్‌లో ప్రస్తుతం 82 భాషలు, మాండలికాలు మాట్లాడుతున్నారని పరిశోధకశాఖవారు జరిపిన ఒక సర్వే తెలియ చేస్తున్నది వీటిలో కొన్నిటికి మాత్రమే వ్రాత అక్షరాలు ఉన్నాయి మిగిలినవన్నీ కథలూ, గాథల రూపంలో ప్రచారంలోకి వచ్చిన భాషలే

## 135 ఏళ్ళనాటి పత్రం




135 సంవత్సరాల క్రితం అమెరికా అధ్యక్షుడు అబ్రహాం లింకన్ బానిసత్వానికి వ్యతిరేకంగా వ్రాసుకున్న ఉపన్యాస కాగితం ఒక చారిత్రక పత్రాల వర్తకుడు 1992 డిసెంబర్ 16న జరిగిన వేలంలో 1.54 మిలియన్ డాలర్లకు కొన్నాడు

## గాసోహల్ ఉత్పత్తిలో అగ్రగామి

వాహనాలకు ఇంధనంగా ఉపయోగించే గాసోహల్ - పెట్రోల్, ఇథనాల్ మిశ్రమం - ఉత్పత్తిలో ప్రపంచంలో అత్యధికంగా చెఱకు పండించే బ్రెజిల్ అగ్రగామిగా ఉంది బ్రెజిల్‌లోని అత్యధిక శాతం కార్లు ఇప్పుడు ఈ కొత్త ఇంధనాన్నే ఉపయోగిస్తున్నాయి సారాయి తయారీలో ఉపయోగించే మొలాసిస్ (బెల్లపు మడ్డి) తయారు చేసేందుకు చెఱకును వాడుకుంటారు ఇప్పుడు ఈ చెఱకునే వాహనాల ఇంధనానికి ఉపయోగించే ఇథనాల్ తయారీకోసం కర్మాగారాలకు తరలిస్తున్నారు

— 'సిఐఇ ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## అపూర్వమైన రేడియో టెలిస్కోప్

హిందూ మహాసముద్రంలో మారిషస్ దీవికి దాదాపు సగటున ఉండే పాలపుంత (మిల్కీ వే) సమూహకేంద్రం కనుగొనేందుకు ఉపయోగించే ఒక అద్వితీయ రేడియో టెలిస్కోప్‌ను ఇండియా, మారిషస్ అంతరిక్ష నిపుణులు ఉమ్మడిగా నెలకొల్పారు

## పసిఫిక్ సముద్రంలో దీవులు

పసిఫిక్ సముద్రంలో దాదాపు 30 000 చిన్నదీవులు ఉన్నాయని భావిస్తున్నారు హిందూమహా సముద్రం, కరేబియన్ సముద్రాలలో కొన్ని వేలదీవులు, ఇండోనేషియాలో 13,500 దీవులు ఉన్నాయి వీటిలో అతి కొద్ది దీవుల్లోనే ప్రజలు నివసిస్తున్నారు

## ప్రపంచంలో అత్యధిక భాగ్యవంతుడు

ప్రపంచంలో అత్యంత ఖరీదైన ప్రదేశాల్లో 83 భవనాలు గల సామ్రాజ్యాన్ని నిర్మించిన ప్రపంచంలోని అత్యధిక భాగ్యవంతుడు, 88 సంవత్సరాల వయస్సుడు తైకిచిరో మోరి (Taikichiro Mori) టోక్యో (జపాన్)లో మరణించాడు అతని ఆస్తి విలువ 13 బిలియన్ డాలర్లు

# వాగ్దానం చేసుకోండి

మీ మానసిక శాంతిని ఏదీ కలత పరచలేదనీ, అది పటిష్టంగానే ఉందనీ మీకై మీరు వాగ్దానం చేసుకోండి మీరు కలిసిన ప్రతి వ్యక్తినీ ఆరోగ్యం, సంతోషం, అభ్యుదయం గురించి అడగండి వారిలో ఏదో మంచితనం ఉన్నదనే భావన వచ్చేటట్లుగా మీ స్నేహితులతో మెలగండి ప్రతి విషయాన్ని దాని ప్రకాశవంతమైన భాగంవైపే చూడండి మీ ఆశావాదం వాస్తవ రూపంలోకి వచ్చేటట్లు ప్రయత్నించండి



ఉత్తమత్వాన్ని గురించి ఆలోచించి, ఉత్తమత్వం కోసం పని చేసి, కేవలం ఉత్తమత్వాన్నే ఆశించండి మీ విజయం కోసం ఎంత ఆరాటపడతారో ఇతరుల విజయం కోసం కూడా అలాగే ఉత్సాహం ప్రదర్శించండి. గతంలో చేసిన పొరపాట్లను మర్చిపోయి భవిష్యత్తులో ఘనకార్యాలను సాధించేందుకు ప్రయత్నించండి ఎల్లప్పుడూ సంతోషకరమైన ముఖభావాలు ప్రదర్శించి, మిమ్మల్ని కలిసిన ప్రతి జీవిపైన చిఱునవ్వులు కురిపించండి మిమ్మల్ని మీరు అభివృద్ధి చేసుకునేందుకు ఎక్కువకాలం వినియోగించటం వల్ల, ఇతరులను విమర్శించేందుకు మీకు సమయం ఉండదు

క్రిస్టియన్ డి లార్సన్

డాక్టర్ ఏ.ఎం.పాయ్ సంకలనం

●

## భూగోళంలో 70 శాతం నీరు



భూగోళంలో నీరు 70 శాతం మేరకు వ్యాప్తి చెందినందువల్ల, వాస్తవానికి నీరు సమృద్ధిగా ఉన్నట్లే లెక్క. ప్రపంచంలోని మొత్తం నీటిలో దాదాపు 95 శాతం సముద్రాలలో, మహా సాగరాలలో ఉండగా 4 శాతం మంచు రూపంలో ఉంది

ప్రపంచ విస్తీర్ణంలో దాదాపు 22 శాతం ప్రాంతాన్ని నీరు హరించివేయగా, 8 శాతం చిత్తడినేలగా ఉంటుంది 5 శాతం ఉప్పునీటితో, సున్నపుకారం (లవణ సారం)తో ఉంటుంది

మొత్తం నీటి వాడకంలో 80 శాతం మేరకు వ్యవసాయ రంగం వినియోగించుకుని, ప్రధాన నీటి వినియోగదారుగా రూపొందింది

ఒక టన్ను పేపర్ ఉత్పత్తి చేసేందుకు 250 టన్నుల నీరు, ఒక టన్ను ఉక్కు ఉత్పత్తికి 150 టన్నుల నీరు, ఒక టన్ను ముడి చమురు శుద్ధి చేసేందుకు 180 టన్నుల నీరు అవసరమౌతాయి

"బరువు మోసేవాడికి మాత్రమే తెలుస్తుంది - దాని భారం"

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1 బంగాళాఖాతంలో ఉష్ణమండల తుపానులు ఏ ఋతువులో తరచుగా వస్తుంటాయి? (ఎ) శరత్కాలం, (బి) వర్షాకాలం, (సి) వేసవికాలం, (డి) చలికాలంలో



2 దాదాపు 600 సంవత్సరాలపాటు నిద్రాణంగా ఉన్న తరువాత హఠాత్తుగా ఫిలిప్పీన్స్‌లో విస్ఫోటనం చెందిన అగ్ని పర్వతం ఏది? (ఎ) బారెన్ ఐలెండ్స్, (బి) మౌంట్ ఫ్యూజియామా, (సి) మౌంట్ యున్‌జెన్, (డి) మౌంట్ పినటుబొ

3 ఇండియాలో తగినంత జిప్సం (Gypsum) నిల్వలు ఉన్నాయి వీటిలో దాదాపు సగం వరకు ఈ క్రిందిచోట లభిస్తాయి (ఎ) మధ్యప్రదేశ్, (బి) రాజస్థాన్, (సి) ఒరిస్సా, (డి) సిక్కిం

4 ట్రిపుల్ యాంటిజెన్ ఈ క్రింది వ్యాధి నుండి రక్షణ కలిగించదు (ఎ) ధనుర్వాతం, (బి) డిఫ్తీరియా, (సి) టైఫాయిడ్, (డి) కోరింత దగ్గు

5 "గ్రామస్వరాజ్య" భావన ఎవరినుండి ఉద్భవించింది? (ఎ) ఆచార్య వినోబాభావే, (బి) మహాత్మా గాంధీ, (సి) లాలా లజపతిరాయ్, (డి) గోపాలకృష్ణ గోఖలే

6 మత సంబంధమైన కొట్లాటలకు పేరొందిన 'సీతామర్హి' పట్టణం ఏ రాష్ట్రంలో ఉన్నది? (ఎ) కర్నాటక, (బి) గుజరాత్, (సి) హర్యానా, (డి) బీహార్

7 'ఏ ఫేర్‌వెల్ టు ఆర్మ్స్' అనే పుస్తక రచయిత (ఎ) ఎర్నెస్ట్ హెమ్మింగ్వే (బి) థామస్ హార్డీ, (సి) చార్లెస్ డికెన్స్, (డి) ఆల్డస్ హక్స్‌లే

8 పెట్రోలియం ధరలను నిర్ణయించే హక్కు ఈ క్రింది వారిలో ఎవరికి ఉంది? (ఎ) ఐ ఎం ఎఫ్, (బి) ఎఫ్ ఎ ఓ, (సి) ఐ బి ఆర్ డి, (డి) ఒ పి ఇ సి

## డెన్మార్క్ కార్మికునికి ఐదు నిమిషాలు చాలు

డెన్మార్క్‌లో మెకానికల్ ఇంజనీరింగ్ కార్మికుడు ఒక కిలో రొట్టె కొనేందుకు ఐదు నిమిషాల కంటే తక్కువ కాలం పని చేయవలసి వస్తుంది భారతీయుని కైతే 48 నిమిషాలు, అమెరికన్ కార్మికునికి 8 నిమిషాల కాలం పడుతుంది రొట్టె సంపాదించే సమయం చైనా కార్మికునికి 20 నిమిషాలు బ్రిటిష్ కార్మికునికి 15 నిమిషాలు, ఒక సింగపూర్ కార్మికునికి 37 నిమిషాలు సమయం తీసుకుంటుంది

— 'అంతర్జాతీయ కార్మిక సంస్థ' సౌజన్యంతో

"పగలంతటు, ఉత్తమ గ్రంథాలు — వీటి సాహచర్యం కలవానిని మిత్రులు లేనివాడని అనరంటి'

## మాటల మహిమ

1 పటలము (ఎ) ఇంటికప్పు, (బి) నేత్ర రోగము, (సి) సమూహము, (డి) చిన్న గంప, (ఇ) నొసటిబొట్టు

2 పతితుడు (ఎ) పడినవాడు, (బి) పొందినవాడు, (సి) ధర్మభ్రష్టుడు, (డి) పాపి

3 పతరము (ఎ) కంఠాభరణ విశేషము, (బి) హారము నడుమ రత్నాదులు పొదిగిన బిళ్ళ, (సి) మార్గము, (డి) పన్నాగము

4 పితృగృహము (ఎ) శ్మశానము, (బి) తండ్రి ఇల్లు, (సి) గయాతీర్థము, (డి) చూపుడు వ్రేలుకు బొటన వ్రేలుకు మధ్యనున్న చోటు

5 బంధము (ఎ) కట్టు, ముడి, (బి) దారము, (సి) సంకెల, బందీచేయుట, (డి) నిర్మాణము, (ఇ) సంబంధము

6 బల్లిదుడు (ఎ) పరాక్రమశాలి, (బి) శూరుడు, (సి) బలవంతుడు, (డి) అధికుడు

7 దిష్టి (ఎ) కథనము, (బి) ఉపదేశము, ఉత్సవము, (సి) భాగ్యము, హర్షము, (డి) ఏర్పాటు, కొలత

8 దృష్టి (ఎ) దర్శనము, (బి) కన్ను, చూపు, (సి) ఎఱుక, అభిప్రాయము, (డి) కనుబొట్టు, దృష్టిదోషము

## తెలివికి పరీక్ష

1 బకింగ్‌హాం కాలువ ఎక్కడి నుంచి ఎక్కడి వరకు ప్రవహిస్తుంది?

2 ప్రపంచ ప్రఖ్యాతి చెందిన "కోహినూరు వజ్రం" దొరికిన చోటు ఏది?

3. మాంసకృత్తులు సమృద్ధిగా లభించే వస్తువు. (ఎ) బీన్స్, (బి) వెన్న, (సి) చేప, (డి) గ్రుడ్డు.

4 అంతరిక్ష యాత్ర చేసిన మొదటి వ్యోమ మహిళ ఎవరు?

5 మొదటి ఆంధ్ర సామ్రాజ్య నిర్మాత ఎవరు? అతని రాజధాని ఏది?

6 ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం యొక్క - వృక్షం, పక్షి, జంతువుగా ఏవి పరిగణించబడ్డాయి?

(జవాబులకు వపేజీ చూడండి)

## మంచుకొండల నుండి మంచినీరు




అంటార్కిటికాలో కనుగొనబడిన మంచు కొండల నుండి త్రాగే నీటిని ఉత్పత్తి చేయవచ్చు. ఒక ఉపగ్రహాన్ని ఉపయోగించుకుని మంచుకొండలను కనుగొనటం శాస్త్రజ్ఞులు చేయవలసిన పని ఈ కొండను న్యూక్లియర్ శక్తితో పని చేసే పడవలకు ఉక్కు గొలుసులతో తగిలించి లాగాలి ఒక నక్రమమైన నౌకా పద్ధతి ప్రకారం దీన్ని సముద్రంలో ఈడ్చుకుపోవాలి అరేబియన్ ద్వీపకల్పంలోని ఒక నిస్సారమైన భూమి పైకి చేర్చాలి. గంటకు 2 నుండి 4 కి.మీ.ల వేగంతో ఈ పడవ 8 మాసాలకు ఏదో ఒక ఎడారి తీరాన్ని చేరుకుంటుంది అప్పుడు ఈ మంచును కరిగించి త్రాగే నీటిగా రూపొందించటం సాధ్యమౌతుంది

"సామర్థ్యానికి ముఖ్యం - అలసత్వంలేని కార్యనిర్వహణ."

# వార్తలు

## బట్టల ఉత్పత్తికి భారతదేశం - ద్వితీయస్థానం

భారతదేశంలో వస్త్ర పరిశ్రమ ప్రపంచ బట్టల ఉత్పత్తిలో ద్వితీయ స్థానాన్ని పొందుతూంది. ప్రస్తుతం దేశంలో 700 టెక్స్టైల్ మిల్లులు పని చేస్తున్నాయి

## కంటైనర్ రేవుగా సింగపూర్




ప్రపంచంలో ఒత్తిడిగల కంటైనర్ ఓడ రేవుగా ( busiest container port) సింగపూర్ హాంగ్‌కాంగ్‌ను అధిగమించింది

## ప్రపంచంలో చమురు నిల్వలు

ప్రపంచంలో రూఢీయైన చమురు నిల్వలు దాదాపు 999 113 మిలియన్ బారెల్స్‌గా అంచనా వేయబడింది 257 5 మిలియన్ బారెల్స్ నిల్వగల సౌదీ అరేబియా ప్రథమ స్థానంలో ఉన్నది.

## ఫ్లాష్ అటాచ్‌మెంట్

స్విట్జర్లాండ్ 'అలాడిన్' అనే ఫ్లాష్ అటాచ్‌మెంట్‌ను ఉత్పాదించింది. దీని బల్బు మన బొటన వ్రేలి గోరంత ఉంటుంది ఇది 2 ఔన్సులు తూగుతుంది పైన రిఫ్లెక్టర్ తెరవడం తోటే దీపం వెలిగి లోపల గదిలో పని చేస్తూన్నప్పుడు కాంతి పైకప్పుకి ప్రసరిస్తుంది నీడలు పడకుండా విస్తరించుకున్న కాంతితో ఫోటోలు బాగా వస్తాయి

## ఉత్తరప్రదేశ్‌నుండి అత్యధిక వార్తాపత్రికలు

ఇండియా వార్తాపత్రికల ప్రచురణ రంగంలో అత్యధిక సంఖ్యలో ప్రచురణ చేస్తున్న రాష్ట్రం - ఉత్తరప్రదేశ్ ప్రచురణల సంఖ్య - 3,564

## టెలిఫోన్ కోసం పడిగాపులు



ఇండియాలో టెలిఫోన్ కనెక్షన్ల కోసం ఎదురు చూస్తున్న వారిసంఖ్య దాదాపు 2 5 మిలియన్ కాగా, కలకత్తాలో ప్రస్తుతం దాదాపు 65,000 మంది వెయిటింగ్ జాబితాలో ఉన్నారు

## ఆకులపై గ్రుడ్లు

*అమెజాన్ నది (దక్షిణ అమెరికా)లోని బ్రెడ్‌ఫిన్స్ తమ గ్రుడ్లను నీటిపై వెళ్ళకు వ్రేలాడే ఆకులపైన*

'మన సామర్థ్యాన్ని బట్టి మనల్ని మనం అంచనా వేసుకుంటాము
మన మహత్కార్యాలను బట్టి ఇతరులు మనల్ని అంచనా వేస్తారు ''

## భూగోళంలో ఒంటెల జనాభా




భూగోళంలో ఒంటెల జనాభా దాదాపు 1 69 కోట్లు సోమాలియా, సూడాన్ (ఆఫ్రికా)ల తర్వాత ఇండియా ఒంటెల జనాబాలో మూడవ స్థానంలో ఉన్నది 1 4 మిలియన్ ఒంటెలలో 75 శాతం రాజస్థాన్‌లో కనిపిసాయి

— 'ఆహార, వ్యవసాయ సంస్థ' సౌజన్యంతో

## ఇండియన్ ఎయిర్‌లైన్స్ ప్రయాణీకులు

ఇండియన్ ఎయిర్‌లైన్స్ కు 53 విమానాలు ఉన్నాయి వీటిలో 39 మాత్రమే నిర్దిష్ట సమయాల్లోని విమాన యానాలకు లభ్యమౌతున్నాయి 1991 - 92లో ప్రతిదినం ఇండియన్ ఎయిర్‌లైన్స్ ద్వారా పయనించిన ప్రయాణీకుల సగటు సంఖ్య 24,344

— 'పిఐబి' సౌజన్యంతో

## తిరుపూర్‌నుండి ఎగుమతులు

**తమిళనాడులోని ప్రముఖ హొజైరీ (మేజోళ్ళు బనియన్లు వగైరా) కేంద్రం తిరుప్పూర్ నుండి ఒక సంవత్సరకాలంలో 1,000 కోట్ల రూపాయల పైగా ఎగుమతులు జరుగుతున్నాయి**

## ఇండియాలోని సైనిక నివాసాలు

వరుసగా 1,89,706 ఎకరాలు మరియు 2,53,478 ఎకరాల భూమిని ఆవరించుకున్న 62 కంటోన్మెంట్లు (సైనిక నివాసాలు) మరియు 299 మిలటరీ స్టేషన్లు ప్రస్తుతం ఇండియాలో ఉన్నాయి

## ఇండియాలో విద్యపై వ్యయం

ఇండియాలో విద్యపై చేస్తున్న వ్యయం కేవలం 3 శాతం కాగా, సింగపూర్‌లో 18 5 శాతం, దక్షిణ కొరియాలో 19 శాతం వ్యయం చేస్తున్నారు

## నరక దృశ్యం




*కర్మిట్ బేహన్ - 1945 ఆగస్ట్ 9న నాగసాకి (జపాన్)పై అటంబాంబును ప్రయోగించిన తీరు -చాలాకాలం తరువాత కూడా అది భయంకరమైన దృశ్యంగా ఇంకా గుర్తుందని చెబుతున్నాడు నాగసాకిపై వేసిన అటంబాంబువల్ల 70,000 మంది దుర్మరణం పాలైనట్లు అంచనా. ఇది జపాన్ లొంగిపోయేందుకు దోహదం చేసింది*

## పావురాలకు స్వాగతం

దక్షిణ అమెరికాలోని వెనిజులా నగరం పావురాలకు స్వాగతం పలుకుతుంది. పావురాలు నివసించేందుకు అనువైన, అందమైన కపోత గృహాలను నగరంలో ప్రతిచోట నిర్మించటం జరిగింది

## ప్రభుత్వ రక్షణలోని స్మారకచిహ్నాలు




ప్రస్తుతం భారత ప్రభుత్వం రక్షిస్తున్న స్మారక చిహ్నాలు, స్థలాల మొత్తం సంఖ్య - 3,483

## మొదటి జనరల్ పోస్టాఫీస్

మద్రాసు బీచ్‌లో ఉన్న ఫోర్ట్ సెంట్ జార్జి వద్ద ఇండియాలోని మొట్టమొదటి జనరల్ పోస్టాఫీస్ - మద్రాసు జి పి వో 1786 జూన్ 1 న ప్రారంభమైంది

## అపరిమిత ఆకులతో ఉండే వృక్షాలు

ఎక్కువ ఆకులుగల చెట్టు ఏరకానికి చెందినది? ఒక పెద్ద సిందూర వృక్షం బహుశా 250,000 ఆకులతో, ఒక సైప్రస్ (నిట్ట నిలువుగా పెరిగే ఒకజాతి చెట్టు) వృక్షం బహుశా4 0,50 మిలియన్ ఆకు పొలుసులతో ఉండవచ్చు

## ఏకైక రాష్ట్రం

అన్ని జిల్లాలు ఆర్థిక వెనుకబడినతనం ఆధారంగా రాయితీ ధనాన్ని పొందే ఇండియాలోని ఏకైక రాష్ట్రం - జమ్మూ- కాశ్మీర్ మాత్రమే

(పి ఐ బి)

## తపాలాబిళ్ళలపై దేశాధినేతకాని వ్యక్తి చిత్రం

తపాలాబిళ్ళలపై కనిపించేందుకు అవకాశం లభించిన - దేశాధినేత కాని మొదటివ్యక్తి అమెరికాకు చెందిన కల్పనా చతురుడు, రాజ నీతివేత్త బెంజమిన్ ఫ్రాంక్లిన్

## జీవిక కోసం చదువు



"నీవు ఎందుకంత ఎక్కువగా చదువుతుంటావు?" అని ఒక మిత్రుడు అబ్రహాం లింకన్‌ను అడిగాడు "జీవికకు విద్య నీకేవిధంగానూ సహాయపడలేదు" అన్నాడతడు "జీవిక కోసం నేను చదవడంలేదు ఒకవేళ నేను చదువుకున్నా, దాన్ని జీవితానికి ఏవిధంగా ఉపయోగించుకోవాలో తెలుసుకునేందుకు ప్రయత్నిస్తున్నాను" అన్నాడు లింకన్

—'ఇన్స్పిరేషనల్ కోట్' సౌజన్యంతో

"అన్ని వస్తువుల్లోనూ అత్యంత చౌకైనది - కనికరం ఎంతమాత్రం ఖర్చు లేనిది, స్వార్థ త్యాగం అవసరం లేనిది" — స్మైల్స్

# ఉద్యోగ విరమణ - శాపం కాదు, వరం!

డా పూరన్ బాత్రియా

మానవుని బుద్ధికి వయసు లేదు కేవలం మన ముఖంపై ముడతలు ఏర్పడగానే మనం వృద్ధులం కాము జీవితంలో ఘనకార్యాలు సాధించాలనే దృఢ సంకల్పాన్ని, విశ్వాసాన్ని కోల్పోయినందువల్ల, మన ఆదర్శాలు, ఉపయోగాలు పోగొట్టుకున్నందువల్ల మనం వృద్ధాప్యానికి చేరుకుంటాము "నీవు నీ విశ్వాసం వలె యువకుడివి, నీ సందేహం వలె వృద్ధుడివి,



మరియు నీ ఆత్మవిశ్వాసం, ఆశల మాదిరిగా యువకుడివి, నీ భయం, నిరాశల మాదిరిగా వృద్ధుడివి" అని జనరల్ డగ్లస్ మెకార్థర్ చక్కగా చెప్పాడు తన పనిని కొనసాగించటం ద్వారా, చుట్టుప్రక్కల విషయాలపై చురుకుగా శ్రద్ధ తీసుకోవటం ద్వారా, కొత్త నేర్పరితనం అలవర్చుకోవటం ద్వారా కొత్త సంబంధాలు, మిత్రత్వాలు, సహవాసాలు, సంఘాలు అభివృద్ధి చేసుకోవటం ద్వారా ఒక వృద్ధుడు "తన వయస్సుకు జీవితాన్ని తన జీవితానికి సంవత్సరాలను" కలుపుకునేందుకు పాటుపడాలి ఒక చురుకైన వృత్తి నుండి విరమించి, విశ్రాంతి తీసుకునేటప్పుడు అతడు మరో పనిలో లేదా మరో సరదా అయిన హాబీలో ఆసక్తి ఏర్పరుచుకోవాలి

చురుకుగా ఉండేందుకు, సంఘానికి ఇంకా ఉపయోగకరంగా ఉండేందుకు ఎవరూ సోమరిగా కూర్చోకుండా తన కోసం ఒక పనిని సమకూర్చుకోవాలి అది వ్యవసాయం, కన్సల్టెన్సీ (సలహా), కోచింగ్ (బోధన) వగైరాలు కావచ్చు దానికి ఎంత తక్కువ పారితోషికం లభించినా పర్వాలేదు ప్రతివారూ ఉల్లాసకరమైన పనులు, క్రియాత్మక కార్యక్రమాలు మరియు సాంఘిక సేవ, ఉపన్యాసం, విద్యాబోధన, రచనలు, పఠనం, చిత్రలేఖనం, శిల్పం, హస్తకళలు వంటి వాటిలో ఆసక్తి పెంపొందించుకోవాలి అనేకమంది పెద్దవారు స్టేజి నాటికలు, చర్చా గోష్ఠులు, వ్యాస రచన పోటీలు, వక్తృ పఠన పోటీలు, వ్యాయామ, క్రీడా పోటీల వంటివి యువజనం మధ్య జరుపుతూ, తాము కూడా వీటిలో చురుకుగా పాల్గొనడం ద్వారా కాలాన్ని సద్వినియోగం చేసుకుంటారు మానవుని మరణ సదృశ వ్యాధి అయిన విసుగు, సోమరితనం నుంచి బయటపడేందుకు ఈ విధంగా చురుకుగా ఉండటం ఎంతో సహాయపడుతుంది

ఒక వయసుమళ్ళిన వ్యక్తి సరైన ఉద్యోగపు మార్గాలను అభివృద్ధి చేసుకోవాలి అతడు

## నమ్మలేని నిజాలు

### యాత్రికులకు ఆకర్షణ

*1925లో అమెరికాలోని కెన్‌టకీకి చెందిన ఫ్లాయిడ్ కోల్లిన్స్ యాత్రికుల కోసం ఒక గుహ తెరవబోయి దానిలో చిక్కుకుపోయి మరణించాడు అనంతరం అతడి భౌతిక కాయాన్ని ఒక గ్లాస్ శవపేటికలో పెట్టి భద్రపర్చారు ఇలా తానే స్వయంగా ఒక యాత్రికుల ఆకర్షణగా మారాడు!*

"జయించలేని సైన్యం ఏదంటే - నైపుణ్యం, విశ్వాసం" — జార్జి హెర్బర్ట్

గతంపై ఆధారపడి జీవించనక్కరలేదు తన వద్ద ప్రత్యేకంగా సహాయసహకారాలు పొందిన వారినుంచి ఏదీ ఆశించకూడదు వర్తమానం లోనే జీవించటం అతడు నేర్చుకోవాలి కొత్త పరిసరాలతో కలిసి సామరస్యంగా జీవించేందుకు తగినట్లు తనను సరిదిద్దుకోవాలి తన జీవితంలోని విస్తృత అనుభవాలతో వృద్ధులు, యువజనం ధైర్యంతో, ఆశాభావంతో పురోగ మించేందుకు మార్గదర్శకత్వం వహించాలి పనిచేసేందుకు అయిష్టత చూపించటం కంటే అతడు ప్రతిరోజు ఒకనిర్ణీతకాల నిర్ణయ పట్టిక ప్రకారం పని, విశ్రాంతిని కొనసాగించవచ్చు

జీవితంపట్ల అతని వైఖరి ఇలా ఉండాలి ఇతరులపట్ల శ్రద్ధ (అక్కఱ) కలిగిఉండటం, ఎవరిపట్ల కూడా హానిచేసే తలంపులేకుండా ఉండటం, అందరిపట్ల దాతృత్వం ప్రదర్శించటం, ఈర్ష్య, విచారం, కోపం లేకపోవటం, తన వైఖరిలో సరళత్వం చూపించటం, కొత్త భావాలకు స్వాగతం పలకటం, వీటన్నిటినీ మించి భగవంతునిపట్ల అచంచల విశ్వాసం - 'మనశ్శాంతి' ని సమకూర్చే విశ్వాసం కల్గి ఉండటం, తనడునికికి ఏదోపరమార్థం ఉన్నదని, అందువల్లనే భగవంతుడు తనను జీవించి ఉండేటట్లు చేశాడని గట్టి నమ్మకం కలిగి ఉండటం మనశరీరవు లయ తప్పిపోయేందుకు తోడ్పడే ప్రాణాపాయకరమైన వ్యతిరేక ప్రభావాలకు లోనవకుండా వృద్ధుడు బయటపడగలగాలి అతడు అసహాయతను కాక ఆరోగ్యాన్ని కోరు కోవాలి "నీవు బలహీనమైన ఆరోగ్యాన్ని అభిలషిస్తే, నీవు నీ బలహీనమైన ఆరోగ్య పరిస్థితిని అధికారరీత్యా ప్రకటించుకుంటే నీకు లభించేది అదే అలాకాకుండా నిన్ను నీవు బలవంతునిగా, శక్తిపరునిగా నీవయస్సును ప్రక్కకు పెట్టి- నీవు భావించుకున్నట్లయితే నీకు దొరకబోయేది అదే" అని పీలే చెప్పిన మాటలు యదార్థాలు. ఒక వృద్ధుడు ఇటు వంటి మనోభావాలను, గుణాలను పెంపొందించుకున్నట్లయితే ఆ జీవితానికి అదనపు విలువ సమకూరుతుంది

## నా జీవన జ్యోతికి వెలుగునివ్వు!



ఓ ప్రభూ! స్నేహం కావాలని ఆరాటపడే వ్యక్తికి
నా స్నేహ హస్తం అందించేందుకు సహాయపడు!
ప్రేమకోరే వారికి నా హృదయాన్ని,
తన బాధలు వినగోరే మనిషి కావాలనే వారికి
నా అవగాహనను - అందించు!
తను జ్ఞాపకం ఉండాలనుకునే వ్యక్తికి నా ఆలోచనా శక్తిని
జీవితపు పిడికిలి దెబ్బలకు లోనైన వ్యక్తికి నా
సాధు స్వభావాన్ని
ఏకాకిగా ఉన్న వ్యక్తికి నా సాహచర్యాన్ని (చెలిమిని),
చికాకుగా, అస్థిరంగా, అనిశ్చయంగా ఉన్న వ్యక్తికి
నా నెమ్మది (శాంత గుణం) తనాన్ని,
ఆత్మీయుల మరణం వల్ల
దుఃఖపడుతున్న వానికి నా ఓదార్పును,
నీ సృష్టిలోని సమస్త జీవుల పట్ల నా కనికరాన్ని
జీవించిన వాటన్నిటిపట్ల నా కరుణ (దయ)ను
అందించేందుకు నాకు సహాయపడు ప్రభూ!
ఓ ప్రభూ! నా (జీవన) జ్యోతి ప్రకాశించేందుకు
చేయూత నివ్వు!

— షైలీ వర్గ్

"ఎక్కడ అజ్ఞానమే పరమానందంగా ఉంటుందో
అక్కడ వివేకంగా ఉండటం మూర్ఖత్వం" — థామస్ గ్రే

చిన్నచిన్న అనారోగ్యాల గురించి దుఃఖించే బదులు వృద్ధాప్యంలో అటువంటివి అనివార్య మని వారు అంగీకరించాలి తన సమర్థతపై దృఢవిశ్వాసం కలిగి ఉండాలి వరాలు, ఆశీస్సులు అందించే జీవితంపట్ల ప్రేమ కలిగి ఉండాలి "ఉత్తమమైనది ఇంకా రావలసి ఉంది" అన్న బ్రౌనింగ్ మాటల్ని గట్టిగా విశ్వ సించాలి 78 ఏళ్ళ వయస్సులో బెంజమిన్ ఫ్రాంక్లిన్ అమెరికా రాయబారిగా ఫ్రాన్స్‌కు వెళ్ళాడు 80 ఏళ్ళు దాటిన తరువాత తన ఆత్మకథ వ్రాసుకున్నాడు గ్రీక్ కవి సాఫోక్లిస్ తన నాటిక - ఓడిపస్ 90వ ఏట వ్రాశాడు ఇటాలియన్ పెయింటర్ టిటియన్ తన 85 వ ఏట సెయింట్ మార్క్ యొక్క కంచు ద్వారాల చిత్రాన్ని ఒక అద్భుత కళాఖండంగా చిత్రించాడు జర్మన్ రచయిత గోథే తన 82వ ఏట "ఫాస్ట్" ద్వితీయ భాగం రచించాడు ఆంగ్లకవి టెన్నిసన్ "క్రాసింగ్ ది బార్"ను 83వ ఏట వ్రాశాడు అమెరికా రాజ్యాంగం తయారు చేసేందుకు ఫ్రాంక్లిన్ తనకు 80 సంవత్సరాలు నిండిన తరువాత తోడ్పడ్డాడు అసోసియేట్ చీఫ్ జస్టిస్ ఆలివర్ వెండిల్ హోమ్స్ తన 90వ ఏట కూడా ప్రధానమైన సుప్రీంకోర్ట్ తీర్పులు ఇస్తూనే ఉన్నాడు బ్రిటిష్ నాటకకర్త జార్జి బెర్నార్డ్‌షా తన 94వ ఏట కూడా హాస్యకుశలుడుగా పేరొందాడు

ఎవరైనా ఆరోగ్య పారిశుధ్య సూత్రాలను సక్రమంగా పాటించినట్లైతే వారు తమ జీవితాన్ని మరో 30 సంవత్సరాలు పొడిగించుకోవచ్చు నని వృద్ధుల (విషయ ) పరిశీలకులు చెబుతు న్నారు తమ అలవాట్ల విషయంలో ప్రతివారూ క్రమబద్ధంగా ఉండాలని, చురుకుగా ఉండాలని, నిర్ణీతకాలాల్లో వైద్యపరీక్షలు చేయించుకుని అవసరమైతే చికిత్స చేయించుకోవాలని, అత్యల్పంగా భుజించాలని, మద్యపానానికి, పొగత్రాగటానికి దూరం కావాలని, సక్రమ మైన వ్యాయామ అభ్యాసాలు చేయాలని, 'యోగా'ను అభ్యసించాలని, మేధనూ, ఆత్మనూ ప్రశాంతంగా ఉంచుకోవాలని చెబుతున్నారు వీటిల్లో చివరిది అత్యంత ప్రధానమైనది తన కర్తవ్యం తాను నెరవేర్చి ఫలితం భగవంతునికి అప్పగించి, ఆ దేవుని చెంత "పరిపూర్ణ శరణాగతి" పొంది, ఆదైవం ఏది అనుగ్రహిస్తే దాన్ని సంతోషంతో స్వీకరించినప్పుడు ప్రశాంతత లభిస్తుంది

ఒకవృద్ధుడు భగవంతునిపట్ల, స్వయంకృషి పట్ల ఈ దృక్పథంతో, ఈవిశ్వాసంతో తాను శక్తి సామర్థ్యాలతో, చురుకుదనంతో నివసిస్తు న్నట్లే భావించుకుని జీవించాలి తప్పనిసరి అయిన అంతిమ దశను గురించిన భయాలతో ఈ ఆనందం భంగపడకూడదు. ఈ లోకం విడిచి వెళ్ళే సమయం ఆసన్నమైనప్పుడు - అప్పుడు కూడా తన సన్నిహితులకు, ఆప్తులకు రేపటి తనపథకాల గురించి చెప్పగలగాలి. తన నేత్రాలలో ఆశాపూరిత కాంతి కిరణాలు ప్రకాశిస్తుండగా, ప్రసిద్ధ గాయకుడు పృథ్‌రాజ్ మాలిక్ అజరామర పదాలు "మృత్యువు ఇంత చేరువగా ఉంది, నమ్మశక్యం కావటం లేదు నేను ఇంకా చిన్నవాడ్నే" అతని చిఱు నవ్వుల పెదవుల నుండి ప్రతిధ్వనిస్తుండగా నిశ్శబ్దంగా కాలప్రవాహంలోకి జారిపోగలగాలి.

## మెక్సికోలో శతాబ్ది మొక్క

*మెక్సికో ఉద్యానవనాల్లో మాగ్వే లేదా అగివి అనే పేరుతో ఒక అద్భుతమైన మొక్క ఉంది. అది గణనీయమైన అందంతో కనిపిస్తుంది. వందేళ్ళకు ఒకసారి మాత్రమే ఈ మొక్క పుష్పిస్తుందని తోటమాలి చెబుతున్నారు! అందువల్ల దీన్ని "శతాబ్ది మొక్క" అని పిలుస్తున్నారు*

"పిరికి పందలు అనేకసార్లు మరణిస్తారు పరాక్రమశాలి ఒక్కసారే మృత్యువును చవిచూస్తాడు."

— షేక్స్పియర్

# వంట ఇంటి నేస్తం-ఉల్లిగడ్డ

సుజిత్ కుమార్ సహ

చరిత్ర తొలి రోజులనుండే ఉల్లిగడ్డ కథ మొదలవుతుంది ఈజిప్షియన్లు ఉల్లిగడ్డల్ని పంటలుగా పండించి ఆహారంలో ఒక వస్తువుగా వాడుకునేవారు గ్రీకులు కూడా దీన్ని దారాళంగా ఉపయోగించుకున్నారు రోమన్లు కూడా ఉల్లి గడ్డలంటే అత్యధికంగా ఇష్టపడేవారు




ఉల్లిగడ్డ, ఘాటైన వెల్లుల్లి (లేక) తెల్లగడ్డ వలెనే ఒక ఓషధి దీని వృక్షశాస్త్రపు పేరు "అల్లియుం సిపా" (Allium Cepa)

వ్యాధుల నివారణకై ఉల్లిగడ్డలను ప్రాచీన భారతదేశం, గ్రీస్, రోమ్ మరియు ఇతర దేశాలకు చెందిన వైద్యులు ఉపయోగించేవారు శతాబ్దాల తరబడి అంటువ్యాధిని దూరంగా ఉంచేందుకు కూడా ఉల్లిగడ్డలు ఉపయోగించ బడ్డాయి 1665లో లండన్ (ఇంగ్లండ్) లో భయంకరమైన ప్లేగ్ వ్యాధి వ్యాపించినప్పుడు దాని బారినుండి ఉల్లిగడ్డలు, వెల్లుల్లి దుకాణాలు తప్పించుకున్నాయన్న పేరు గడించాయి

ఉల్లి, వెల్లుల్లి నూనెలలోని పదార్థాలు బాక్టీరియాను చంపే శక్తి కలవిగా ఉంటాయని ఆధునిక పరిశోధనలు వెల్లడిస్తున్నాయి అయితే ఈ బాక్టీరియా నిరోధకశక్తి తాజాగా ఉల్లిగడ్డను కోసినప్పుడే ఉంటుందని, అతి స్వల్ప కాలంలోనే అదృశ్యమౌతుందని చెబుతున్నారు

ఉల్లిగడ్డలో చిన్నమొత్తాలలో ప్రోటీన్లు, కార్బొహైడ్రేట్లు,కాల్షియం, ఫాస్ఫరస్, ఇనుము, 'బి' విటమిన్లు, 'సి' విటమిన్లు ఉంటాయి ఉల్లి గడ్డల పోషకాహార విలువలు ఒకరకం నుంచి మరోరకానికి మారతాయి చిన్నసైజు ఉల్లిగడ్డలు ఎక్కువ పోషకాహార విలువలు కలిగిఉంటాయి

## సుభాషితాలు

*అల్పబుద్ధివాని కధికారమిచ్చిన*
*దొడ్డవారినెల్ల తొలగగొట్టు*
*చెప్పుతినెడి కుక్క చెఱకు తీపెఱుగునా?*
*విశ్వదాభిరామ వినురవేమా!*
*[దుష్టుడు అధికారి అయినట్లయితే మంచి వారిని తరిమివేస్తాడు చెప్పు తినే కుక్కకు చెరకు రుచి ఏమి తెలుస్తుంది?]*

*రాయియైె యహల్య రాముపాదము సోకి*
*ఆడుదయ్యెనందు రవనిజనులు*
*చేయు సుకృతములిట్లు, శిలలైన దప్పవు*
*విశ్వదాభిరామ వినురవేమా!*
*[రాయిగా ఉన్న అహల్య శ్రీరాముని పాదం సోకగానే స్త్రీగా మారినదని చెబుతారు. సుకృతము ఉన్నప్పుడు రాళ్ళకైనా మేలు కలుగుతుంది.]*

"శ్రద్ధా తత్పరత - మంచి అదృష్టానికి మాతృమూర్తి"
— బెంజమిన్ ఫ్రాంక్లిన్

చలి వాతావరణంలో పెరిగిన ఉల్లిగడ్డలు వాడిగల వాసనతో ఉంటే, వేడి వాతావరణంలో పెరిగిన ఉల్లిగడ్డలు తియ్యటి రుచితో ఉంటాయి ఎర్రగడ్డలు రుచిలో చాలాఘాటుగా ఉంటాయి ఉల్లిగడ్డలో తీవ్రతకు కారణం నిలకడ లేకుండా ఆవిరిగా మారే నూనె (allyl propyl disulphide)

ఈరల మాదిరిగా ఉండే రాగితప్పు పై తొలుగల ఉల్లిగడ్డలు ఉపయోగించండి రంగువెలసిన ఉల్లిగడ్డలను వాడవద్దు

ఉల్లిగడ్డల్ని తరిగిన తర్వాత లేదా తోలు ఒలిచిన తర్వాత నిల్వచేయవద్దు బయటి తోలు తొలగించగానే ఉల్లిగడ్డలు కుళ్ళిపోతాయి ఉల్లిగడ్డల్ని చల్లని పొడి ప్రదేశంలో నిల్వచేయండి

సహజస్థితిలోనే, ముడిగానే ఉల్లిగడ్డల్ని తినవచ్చు ఉప్పుతో చేర్చి ఊరగాయలు వేసుకోవచ్చు లేదా వివిధ పద్ధతుల్లో వండుకోవచ్చు పులుసుల్లో, కూరల్లో, కమ్మని రుచిగల పదార్థాల్లో వేసుకోవచ్చు వంట ఇంట్లో, వంటల్లో ఇన్ని ఉపయోగాలు అందించే మరో కూరగాయను పేర్కొనడం కష్టమేమరి!

## జాతుల అంతర్ధానం

1500 నుంచి 1850 మధ్య ప్రతి 10 ఏళ్ళకో జంతుజాతి అదృశ్యమై పోయింది 1850 - 1950 మధ్యకాలంలో ప్రతి సంవత్సరం ఒకజాతి 1990 1992 మధ్యలో రోజుకు ఒక జాతులు అదృశ్యమయ్యాయి 1995 2000 నాటికి అన్ని జాతుల్లో దాదాపు 20 శాతం అదృశ్యమౌతాయి 2000 ప్రాంతంలో గంటకు ఒక జాతి చొప్పున అదృశ్యమౌతుంది 2100 నాటికి ఆలోచించేందుకే మనం సాహసించలేము

# మానవుని మెదడు ఒక మహత్తర యంత్రం




మానవుని మెదడు - ఒక మహత్తర యంత్రం ఇది ద్రాక్షపండు (grapefruit)లో సగం పరిమాణంలో ఉంటుంది మనలో చాలామంది జీవించే రమారమి వయస్సు 75 ఏళ్ళపాటు - ఇది అలసట లేకుండా సెకండుకు 800 జ్ఞాపకాలను భద్రపరుస్తుంది

మెదడుకు ఉన్న శక్తి సామర్థ్యాలతో ఒక కంప్యూటర్‌ను తయారు చేసినట్లయితే అది ఎంపైర్ స్టేట్ బిల్డింగ్ (1250 అడుగుల ఎత్తు)తో పోల్చదగినంత స్థలాన్ని ఆక్రమిస్తుంది దీన్ని నడిపేటందుకు 1,000,000,000 వాట్ల విద్యుచ్ఛక్తి అవసరమౌతుంది వ్యయం కూడా దీనికి సమానంగానే అత్యధికంగా ఉంటుంది

తాను నిలుపుకోగలిగే ప్రతి విషయాన్ని మెదడు స్వీకరించి, ఎప్పటికీ దాన్ని మర్చిపోకుండా ఉంచుతుంది మనం పొందిన సమాచారాన్నంతటినీ తిరిగి జ్ఞాపకం చేసుకోలేకపోవచ్చునేమోకాని, ప్రతి విషయం కూడా మన మెదడులో శాశ్వతంగా నిక్షిప్తమై ఉంటుంది

మానవునకు భగవంతుడిచ్చిన అత్యంత విగ్రహ కలిగించే కానుకలలో మెదడు ఒకటి కానీ చాలామంది తమ మేధాశక్తిని అత్యల్పంగానే ఉపయోగిస్తారు

—'ప్లెయిన్ ట్రూత్' సౌజన్యంతో

"విద్య - పేదవానికి పెట్టుబడి, భాగ్యవంతునికి నిధి" — హొరేస్ మాన్

# మనశ్శుద్ధితో ప్రార్థించు, సత్ఫలితం సాధించు!

జస్టిస్ శ్రీరంగనాధ్ మిశ్రా

మాజీ ప్రధాన న్యాయమూర్తి, సుప్రీంకోర్టు



( శ్రీరంగనాథ్ మిశ్రా దేశంలో అత్యంత గౌరవాదరణలు పొందిన న్యాయవాదుల్లో ఒకరు 1969లో ఒరిస్సా హైకోర్టు న్యాయమూర్తిగా నియమితులయ్యారు రెండున్నర సంవత్సరాలపాటు ఒరిస్సా హైకోర్టు ప్రధాన న్యాయ మూర్తిగా పనిచేశారు 1983లో సుప్రీంకోర్టులో న్యాయ మూర్తిగా నియమితులయ్యారు 1990 అక్టోబర్ నుండి 1991 నవంబర్ వరకు సుప్రీం కోర్టు ప్రధాన న్యాయ మూర్తిగా పనిచేశారు ప్రస్తుతం అనేక సాంఘిక, సాంస్కృతిక సంస్థలతో సంబంధాలు కలిగి ఉన్నారు )

మా నాన్నగారు అత్యంత క్రమశిక్షణగల అలవాట్లు ఉన్న వ్యక్తి సమయపాలనపట్ల అత్యంత వివేకంగల వ్యక్తి ప్రతివారూ కాలం గురించిన వివేకంతో ఉండాలని కోరుకునేవారు నేను న్యాయవాదిగా, 22 ఏళ్ళపాటు న్యాయ మూర్తిగా చాలా చురుకుగా జీవితం గడిపాను కోర్టులోనూ, బయటగానీ జరిగే ప్రతి కార్య క్రమానికి సకాలంలో హాజరయ్యేందుకు ప్రయత్నించేవాణ్ణి ఈ అలవాటు నావృత్తిలోనూ, సంఘంలోనూ సత్ఫలితాలను సమకూర్చింది

అలహాబాద్‌లో చదువుకుంటున్న కాలంలో నేను ఒరిస్సానుండి వచ్చిన బాలుర సంఘానికి కార్యదర్శినయ్యాను ఇది నేను ,వసిస్తున్న గదిలోనే ఏర్పటినందువల్ల సంఘం కార్యాలయంగా కూడా నా గదిని ఉపయోగించేవారు ప్రాతః కాలం లోనే నేను మేల్కొని, సిద్ధమై ఇతరులు వచ్చేలోపల ఉదయం కనీసం ఒక గంట సేపు చదవకపోతే నా విద్యాభ్యాసం సక్రమంగా సాగదని గ్రహించుకున్నాను 1946 నుండి ఉదయం 4 గంటలకే నిద్రనుంచి లేవటం అలవాటు చేసుకున్నాను ఈనాటి వరకూ దీన్ని నేను కచ్చితంగా పాటిస్తున్నాను. అప్పటి నుంచి సూర్యోదయానికి ముందే దాదాపు 5 కి మీ ల దూరం నడవటం అలవర్చుకున్నాను దీనివల్ల నాకు పనిచేసేందుకు కావలసినంత సమయం, సముచిత విశ్రాంతి లభిస్తున్నవి

నిజమైన విద్య ప్రసాదించే వాటిల్లో ఒకటి - అణకువ (నమ్రత)ను సృష్టించడం 1938లో నేను కేవలం 11 ఏళ్ళవయస్సులో మాధ్యమిక పాఠశాలలో ఉన్నప్పుడు వందలాది బాలురతోపాటు నన్నుకూడా డెలాంగ్ కాంగ్రెస్ సమావేశాలకు ఒక వలంటీరుగా ఎంపిక చేశారు గాంధీజీ ఐసలో పనిచేసే అవకాశం నాకు లభించింది ఇదొక అపూర్వ అవకాశం ఆయన ప్రవర్తనలోని

## సముద్రపు ఉపరితల వృద్ధి

సముద్ర జలాలు వేడిమి చెంది ఉప్పొంగినందువల్ల, భూమిపైన మంచు *కరిగినందువల్ల గత 100 సంవత్సరాలలో* సముద్ర *ఉపరితలం 10 నుంచి 20* సెం మీ లకు పెరిగినట్లు శాస్త్రజ్ఞులు కనిపెట్టారు

"పఠనం - మనిషిని ప్రాజ్ఞ పురుషునిగా లేఖనం - ఖచ్చితమైన మనిషిగా,
ఉపన్యాసం (ప్రసంగం) సంసిద్ధతగల వ్యక్తిగా రూపొందిస్తుంది"

— ఫ్రాన్సిస్ బేకన్

నమ్రత నాకు నిరూపితమైంది. ఆయనొక మహాత్ముడు, గొప్పనాయకుడు, అశేష ప్రజాభిమానం పొందినవాడు అయినప్పటికీ ఆయన అత్యంత నమ్రత, వినయం మూర్తీభవించిన వ్యక్తి. ఆ శిబిరంలో గడిపిన ఆ ఏడురోజుల అనుభవాలు నాపై మరపురాని ముద్రవేశాయి. అప్పటి నుంచి నమ్రత నా జీవితంలో ఒక భాగమైంది

దారిద్ర్యం అనేది ఒక వ్యాధికాదు, పేదవానిక (దానిమీద) అదుపులేని ఒక స్థితి పేద ప్రజలకు సుఖప్రదమైన జీవితం గడిపే సమర్థత లేదు కోరికలతో నిండిన జీవితం వారిది తొలినాటి పాఠశాల దినాల్లోని ఒక పాఠానికి శీర్షిక "పేదలపట్ల కనికరం (లేక) దయ" ఈ అంశంమీద ఉపాధ్యాయుని ప్రసంగం ఎంత పులకరింపచేసిందంటే, నేను ఈ అంశం పైన ఎక్కువ విషయాలను చదవటానికి ప్రారంభించాను మేము మధ్యతరగతికి చెందిన కుటుంబం నుంచి వచ్చాము మాకు ఎందరో పేదబంధువులు ఉన్నారు. నేను పెరుగుతున్న కొద్దీ పేదలపట్ల కనికరం చూపటం ఒక సద్గుణంగా, అలవర్చుకోదగినదిగా భావించాను.

నేను పెద్దవాడినయిన తరువాత సంస్కృతం అభ్యసించాను 'భగవద్గీత' పఠించటం ప్రారంభించాను. తనకు సంపూర్ణ శరణాగతి ఎవరు కోరుతారో వారిని గురించిన శ్రద్ధ ఆ భగవంతుడే వహిస్తాడని శ్రీకృష్ణ భగవానుడు అర్జునునితో చెప్పాడు భక్తుని నిజమైన కోరికలను తీరుస్తానని ఆ పరమాత్ముడు వాగ్దానం చేశాడు. నేను సంపూర్ణ శరణాగతితో జీవితం గడపాలని ప్రయత్నించాను దానిలో అత్యంత తృప్తిని అనుభవించాను శుద్ధమైన (యదార్థమైన) ప్రార్థనలు ఎప్పటికీ అలక్ష్యం చేయబడవు.

## మంచి పౌరునికి పది గుర్తులు



1 స్థానిక, ప్రపంచ విషయాలలో అతనికి మంచి అవగాహన ఉంటుంది.
2 అతడు మర్యాదగలవాడు, నిస్వార్థపరుడు, స్నేహశీలి, ఇతరులతో బాగా కలిసిపోయేవాడు, మంచి పొరుగువాడు
3 అతడు న్యాయబుద్ధి గలవాడు, నమ్మదగినవాడు, తను ఎన్నుకున్న మతవర్గానికి చెందిన పనిలో చురుకైన పాత్ర నిర్వహించేవాడు.
4 ఇతరులు తనకోసం చేసిన వాటిని అతడు మెచ్చుకుంటాడు. తన వర్గం భవిష్యత్ అభివృద్ధి బాధ్యత తీసుకుంటాడు
5 ఇతరులతో సంబంధాల విషయంలో అతడు న్యాయంగా, సక్రమంగా ఉంటాడు.
6 తన వర్గం, తన దేశం చట్టాలు చెప్పిన ప్రకారం నడుచుకుంటాడు.
7 ఎన్నికల సమయంలో అతడు సక్రమంగా, తెలివిగా ఓటు వేస్తాడు.
8. ప్రపంచ ప్రజలందరి సంక్షేమం, స్వాతంత్ర్యంపట్ల అతడు ఆసక్తితో ఉంటాడు. వీటిని సాధించేందుకు తన వంతు పాత్ర నెరవేరుస్తాడు
9 అతడు తన తోటి వారికి సేవ చేస్తాడు
10 తన వర్గంలోని యువకులకు అతడు ఒక మంచి ఉదాహరణగా నిలుస్తాడు

—'ది రొటేరియన్' సౌజన్యంతో

# వీరిని గురించి తెలుసుకోండి

జాన్ డవిసన్ రాక్‌ఫెల్లర్ (1839 - 1937) అమెరికా వాణిజ్యవేత్త, లోకోపకారి



చమురు నిక్షేపాల ద్వారా ప్రపంచంలో అత్యధిక సంపన్నుడయ్యాడు రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్ ప్రారంభించాడు

ప్రొఫెసర్ యు ఆర్ అనంతమూర్తి కన్నడంలో ప్రసిద్ధ నవలా రచయిత, కథా రచయిత, కవి వీరి నవల 'సంస్కార' వివిధ భారతీయ భాషల్లోకి, విదేశీ భాషల్లోకి అనువదించ బడింది

రిక్సి మార్కస్ ప్రపంచ బ్రిడ్జి చరిత్రలో అత్యంత విజయం సాధించిన మహిళా క్రీడా కారిణి 1974లో ప్రపంచ ప్రథమ మహిళా గ్రాండ్‌మాస్టర్ ఆఫ్ బ్రిడ్జి - అంతర్జాతీయ ఆటల పోటీలలో అత్యధిక హోదా పొందింది

హేవలాక్ ఎల్లిస్ (1859 - 1939) బ్రిటిష్ వైద్యుడు, మానసిక శాస్త్రవేత్త. "స్టడీస్ ఇన్ ది సైకాలజీ ఆఫ్ సెక్స్" అనే 7 సంపుటాల గ్రంథం వ్రాశాడు

ఇగ్నేస్ జాన్ పాడెరెవ్‌స్కీ: సుప్రసిద్ధ కాన్సర్ట్ పియానో వాద్యకారుడు మరియు 1919-21లో పోలండ్ ప్రధానమంత్రి ఇతడు తన ప్రదర్శనల వల్ల 5,000,000 డాలర్లు ధనం కూడబెట్టాడు

## భారతీయ లోహ శాస్త్రవేత్తల సాంకేతిక ప్రతిభ



**Konark Sun Temple**

భారత లోహశుద్ధి పరిశ్రమ పురాతనమైనది మెహరౌలీ *(ఢిల్లీ)* వద్ద నున్న సుప్రసిద్ధమైన *ఇనుప స్తంభం గత 1500 సంవత్సరాలుగా ఎన్నో ప్రకృతి వైపరీత్యాలకు గురైనప్పటికీ ఒక తుప్పు మరక కూడా పడకుండా నిలిచి ఉంది 13వ శతాబ్ది తుది అర్ధభాగంలో కోణార్క్ సూర్యదేవాలయ నిర్మాణంలో ఉపయోగించిన ఇనుప దూలాలు మరియు 18వ శతాబ్ది వరకు తయారైన వస్తువు లన్నీ - పెద్ద ఫిరంగులు, ప్రేలుడు పదార్థాలు, కత్తులు భారతీయ లోహ శాస్త్రవేత్తల సాంకేతిక ప్రతిభకు దృష్టాంతాలుగా నిలుస్తాయి*

"సగం మూఢత్వం కలవారిపట్ల, సగం తెలివితేటలు కలవారి దగ్గర మెలగటం అత్యంత ప్రమాదకరం" — గోథే

ఎడ్గార్ వాలెస్ (1875-1932). ప్రఖ్యాత బ్రిటిష్ పండితుడు, నాటక రచయిత ఇతడు 'ది త్రీ ఓక్స్ మిస్టరీ' అనే నవలను ఒక మంగళవారంనాడు ప్రారంభించి శుక్రవారం నాడు అచ్చుకి ఇచ్చాడు

కె ఆర్ శ్రీనివాసన్ అంతర్జాతీయ ఖ్యాతి గల ఒకపురాతత్త్వ శాస్త్రజ్ఞుడు. ఈయన 1949లో ఇండోనేషియా సందర్శన తరువాత బోరోబుదూర్ స్మారక చిహ్నం సంరక్షణకు సంబంధించిన ఒక నివేదిక సిద్ధం చేశాడు దక్షిణ భారత దేవాలయాలు, శిల్పాలు, శిలా శాసనాలకు సంబంధించిన ఎన్నో పుస్తకాలు, రచనలు, పరిశోధక పత్రాలు రచించాడు

డాక్టర్ విలియం కారే. ఇంగ్లండ్ నుండి వచ్చి మతప్రచారకుడుగా మారిన, ఒకనాటి చెప్పులు కుట్టే వ్యక్తి 18 వ శతాబ్ది చివరి భాగంలో ఇండియావచ్చి తన జీవితంలో చివరి 41 సంవత్సరాలు సామాన్య ప్రజల సామాజిక, విద్యాభ్యున్నతికి అంకితం చేశాడు. బాలికలలో పాఠశాల విద్యావశ్యకతను చాటి చెప్పాడు

ఆఘా ప్రసిద్ధ హాస్యనటుడు మూకీల కాలం నుండి సినిమాల్లో నటించడం ప్రారంభించాడు 60 సంవత్సరాల సుదీర్ఘ వృత్తి జీవనంలో 300 పైగా చిత్రాలలో నటించాడు. ఎవరికీ అక్కరలేని ఒక బిడ్డకు పెంపుడు తండ్రిగా 'పతిత' చిత్రంలోని అతని నటన చిరస్మరణీయంగా నిల్చి పోతుంది

విష్ణు ప్రభాకర్ హిందీలో ప్రముఖ నవలా రచయిత, కథారచయిత, నాటకకర్త, జీవిత చరిత్ర రచయిత శరత్ చంద్రునిపై ఆయన వ్రాసిన జీవిత చరిత్ర -'అవార మసిహా' - సోవియెట్ లాండ్ నెహ్రూ అవార్డ్ పొందింది

# దేవుణ్ణి ఎక్కడ చూడగలుగుతాము?


Benjamin Franklin

సుప్రసిద్ధ శాస్త్రవేత్త బెంజమిన్ ఫ్రాంక్లిన్‌ను పిల్లలు బాగా ప్రేమించేవారని, చాలా సందర్భాలలో ఆయన రోడ్డు మీద కనబడగానే చుట్టూ చేరి ఆయన చేతిని ముద్దుపెట్టుకునే వారని చరిత్ర చెబుతున్నది

ఒక రోజు ఒక చిన్న బాలుడు ఆయన్ని ఇలా అడిగాడు "ఇంత చదువుకున్నవారు గదా, మీరు నాకొక విషయం చెబుతారా? మనం దేవుణ్ణి ఎక్కడ చూడగలుగుతాము?"

ఆ వృద్ధ వ్యక్తి నవ్వి కాంతివంతమైన ఆకాశంవైపు చూపి "సూర్యుని వైపు నేరుగా చూసేందుకు ప్రయత్నించు" అన్నాడు. ఆ బాలుడు ప్రయత్నం చేసి, తక్షణమే తన కళ్ళకు చేతులు అడ్డుపెట్టుకున్నాడు "తళతళలాడే సూర్యకాంతిని నేను చూడలేక పోతున్నాను" అన్నాడు. దానికి ఫ్రాంక్లిన్ జవాబిస్తూ భగవంతుణ్ణి మన కళ్ళతో చూడలేమని చెప్పాడు. జ్ఞానానికీ మంచికీ ఆ దేవుడు అపారమైన కేంద్రమని, అలాగే సూర్యుడు వేడిమికీ, వెలుగుకూ కేంద్రమనీ, దీన్ని గురించి బాగా అధ్యయనం చేసి, ప్రతిరోజూ అభివృద్ధి చెందుతూ ఆవిధంగా ఆ భగవంతుడికి చేరువ కావాలని, ఆ దేవుని ప్రతిబింబాన్ని నీ ఆత్మలో చూసుకోవాలని బాలునికి చెప్పాడు.

[illegible]

[illegible]

# వైద్యవృత్తిలో హాస్యపు సళికలు

## డాక్టర్ ఎం.ఆర్.చౌధరి

వైద్యవృత్తిలో ఆంగ్లభాషా పరిజ్ఞానం అత్యంత కీలకమైనది. అయితే ఆంగ్లభాషలో తక్కువ ప్రావీణ్యం గలవారు మనకు ఎదురవు తుంటారు. ఒకసారి నేను మా హౌస్ సర్జన్‌ను



"ఏమి చేస్తున్నావని" అడిగాను అతడు "నేను చరిత్రను రూపొందిస్తున్నాను" అని జవాబిచ్చాడు అప్పుడు నేను "కేవలం గొప్ప వ్యక్తులు మాత్రమే చరిత్ర సృష్టిస్తారు. మనం సామాన్యులం - కేవలం చరిత్రను వ్రాస్తాము" అని అతడితో చెప్పాను.

చరిత్రను గురించి మాట్లాడుతున్నప్పుడు గ్రామీణుల్లోని ఒక సర్వసాధారణమైన నమ్మకం జ్ఞాపకానికి వస్తున్నది. ఏ విధమైన (సూచన) ప్రశ్నలు అడగకుండా ఒక మంచి డాక్టర్ తమ రోగాలను నిర్ధారణ చేస్తాడని వీరు నమ్ముతారు రోగ చరిత్ర వెల్లడించే విషయంలో వీరు కఠినంగా ఉంటారు నాడి పరీక్షచేసి వైద్యుడు తమ వ్యాధి నిర్ణయం చేస్తాడని వీరు ఇప్పటికీ నమ్ముతుంటారు ఒక సందర్భంలో ఒక వృద్ధ గ్రామీణుని పట్ల కోపంతో పట్టణంలో ఉన్న మరో వైద్యునికి అతని కేసు సూచిస్తున్నట్లు చెప్పాను. దీనికి అతడు ఎంతో తృప్తి పడ్డాడు ఆ వైద్యుని పేరు, చిరునామా నేను చెప్పగానే అతడు అదొక పశువైద్యుడిదిగా గుర్తించి ఉగ్రుడయ్యాడు మాట్లాడని రోగులనే ఆ నా వైద్యమిత్రుడు పరీక్ష చేస్తాడని నేను అతనితో చెప్పాను!

నాకున్న మరో వైద్య మిత్రుడు సోమరితనం కలవాడు కాలికి గాయంతో ఒక బిడ్డ అతని దగ్గరకు వెళ్ళగా గాయం పరీక్షించి ఆ బాలుణ్ణి, అతని తల్లిని గాయానికి కట్టుకట్టించేందుకు ప్రక్క గదిలోకి పంపాడు అప్పటికి కంపౌండర్ రాలేదు తల్లీ కొడుకులు దాదాపు గంట సేపు నిరీక్షిస్తూ కూర్చున్నారు మరోప్రక్క డాక్టర్ తన కుర్చీలో కూర్చుని ఇతర రోగులతో మాట్లాడుతూ ఉన్నాడు చిట్టచివరికి కంపౌండర్ వచ్చాడు పిల్లవానికి కట్టుకట్టాడు తల్లి కూడా పిల్ల

## రోడ్లులేని గ్రామాల్లో దారిద్ర్య తాండవం

ఇండియాలోని గ్రామాలలో రోడ్లు లేకపోవటంవల్ల దారిద్ర్యం, నిరక్షరాస్యత, నిరుద్యోగం ఎక్కువగా ఉంది. ఉదాహరణకు - కేరళలోని అన్ని గ్రామాలకు మంచి రోడ్ల సౌకర్యం ఉంది ఈ గ్రామాలలో దారిద్ర్యం (దారిద్ర్య రేఖకు దిగువన ఉన్న జనాభా) 16 4 శాతంగా ఉంది అదే విధంగా పంజాబ్‌లోని 99 శాతం గ్రామాలకు చక్కని రోడ్ల సౌకర్యం ఉంది ఇక్కడ దారిద్ర్య రేఖ 7 2 శాతంగా ఉంది ఒరిస్సాలో కేవలం 15 శాతం గ్రామాలలోనే మంచి రోడ్లు ఉండటంతో ఇక్కడ దారిద్ర్య రేఖ 48 3 శాతంగా ఉంది

—'ఎకనామిక్ టైమ్స్' సౌజన్యంతో

# సచేతన స్థితిలో కీచురాళ్ళ సంగీతం

నీటా కాల్విన్

ఒక తేనెటీగ ఝుంకారం లేక ఒక కుమ్మరి పురుగు అవ్యక్త ధ్వని - ఇవి హెచ్చుగా ఐచ్ఛికంగా రాని శబ్దాలు - ఈ మాదిరిగా కాకుండా కీచు రాళ్ళు లేక ఇలకోళ్ళు శబ్దాలను సచేతన స్థితి (స్మృతి)తోనే చేస్తాయి



Cricket

పురుగులకు (కీటకాలు) నిజమైన కంఠధ్వని లేదు. కీచురాళ్ళు "సంగీతపు" ధ్వనులను - ఒకమనిషి తంత్రీవాద్యం వాయిస్తున్న పద్ధతిలోనే - ఉత్పత్తి చేస్తాయి శరీరంలోని ఒక భాగం మరో భాగంతో రాపిడి పొందినప్పుడు, ఆ సంఘర్షణవల్ల శబ్దాలు ఉత్పత్తి అవుతాయి వయొలిన్ వాద్యకారుని విల్లు, తంత్రుల మాదిరిగా కీచురాళ్ళు కూడా తమ తెక్కలను ఒక దానితో ఒకటి రాపిడి చేసి శబ్దాన్ని ఉత్పత్తి చేస్తాయి

తాము ఉత్పత్తి చేసిన సంగీతం వినేందుకు కీచురాళ్ళకు "చెవులు" కావాలి ఈ చెవులు తల భాగంలో కాకుండా వాటి ముంగాళ్ళలోని ప్రక్కభాగంలోని సందుల్లో (రంధ్రాలు) ఉంటాయి. మనకర్ణభేరులవలే వీటి కర్ణభేరులపై తేలు కంపించడం ద్వారా మెదడుకు సందేశాలు అందిస్తాయి అయితే పురుగులకు ఏది సంగీతమో మానవుని చెవులకు అది మధుర స్వరంగా ఉండక పోవచ్చు అంతేకాక ఈ శబ్దాలు అత్యంత ఎక్కువ శ్రుతిలో ఉండటంతో అవి మానవులకు వినిపించవు కూడా

జతకూడే సమయంలో మరియు వేడి వాతావరణంలో కీచురాళ్ళ కంఠధ్వని మరింత ఎక్కువగా ఉంటుంది ఇంటి కీచు రాళ్ళు రాత్రింబవళ్ళు పాడుతూనే ఉంటాయి. ఇవి తరచుగా వినిపిస్తాయి కాని కనిపించవు పగటివేళల్లో ఇవి వెలుగులేని చోట్లలో, చీకటి మూలల్లో నక్కి ఉండి ఆహారం కోసం రాత్రి వేళల్లో మాత్రమే బయటకి వస్తాయి

## ఆనాటి సంపూర్ణ సూర్యగ్రహణం

*నంపూర్ణ సూర్యగ్రహణం గురించి ప్రాచీన కాలంలో నమోదైన అక్షరాలు చెక్కిన ఒక మట్టి ఫలకం సిరియాలో లభించిందని ఇద్దరు డచ్ పరిశోధకులు వెల్లడించారు ఈ నంపూర్ణ సూర్య గ్రహణం - 1223 బిసి మార్చి 5న ఏర్పడింది సిరియాలో మధ్యధరా నముద్రతీరంలోని ప్రాచీన నగరం ఉగరిత్ - యాన్ శిథిలాలలో 1948లో ఈ మృణ్మయ ఫలకాన్ని కనుగొన్నారు*

*—'నేచర్' సౌజన్యంతో*

'[illegible] - [illegible] మరియు ధనికుల వివేకం''

— [illegible]

బొద్దింకల వలెనే వేడిమిగల స్థలాలలో నివసించాలనే కోరిక వీటిని వంటఇంటికి చేరువలో ఉంచుతుంది. అక్కడే మిగిలిపోయిన ఆహారపు మెతుకుల కోసం వెతుకుతుంటాయి నిల్వచేసిన ఉల్లిగడ్డలు మరియు వెల్లుల్లి కూడా వీటికి ఇష్టమైన ఆశ్రయాలు ఈ ఇంటి కీచురాళ్ళు ప్రధానంగా శాకాహారులైనప్పటికీ - పురుగుల్ని మరియు చచ్చిన పశువులను ఆహారంగా స్వీకరిస్తాయి

ఒక సెంటీమీటరు కంటే కొద్దిగా పొడవున్న ఇంటి కీచురాళ్ళు బాగా వృద్ధిపొందిన రెక్కలు, పొడవైన కోణంగా ఉండేకాళ్ళు మరియు పొడవైన దారంవంటి మీసాలు కలిగి ఉంటాయి వీటి పాలిపోయిన (వివర్ణమైన ) గోధుమవర్ణపు శరీరరంగు వెలుపల్ పర్యావరణానికి అను గుణంగా ఉంటుంది పొలాలలో, పొదలలోని కీచురాళ్ళు గాఢ రంగులు కలిగి ఆకుపచ్చని, పక్వమైన ఆకులతో కలిసి పోతాయి

ఇంటి కీచురాళ్ళు తమ జీవితమంతా ఇంటి లోపలే గడుపుతాయి వీటిల్లో సాహసో పేతమైనవి మాత్రం బయటికి వెళ్ళి చెత్త కుప్పల్ని ఇళ్ళుగా చేసుకుంటాయి కుళ్ళి పులిసిపోయిన చెత్తకుప్పలు వీటికి వెచ్చదనాన్ని, ఆహారాన్ని సమకూరుస్తాయి

ఇంటి కీచురాయియొక్క ఆహారం దాన్ని మనిషితో బాటు కలిసి జీవించేటట్లు చేస్తుంది బహుశా ఉత్తర ఆఫ్రికా మరియు నైరుతి ఆసియాలకు చెందిన ఇంటి కీచు రాయి ఇప్పుడు ప్రపంచమంతటా విస్తరించింది

సంగీతాలాపనకు తోడు కీచురాళ్ళు ఎగిరే సామర్థ్యానికి కూడా పేరొందాయి వీటి శక్తివంతమైన దుమికేకాళ్ళు వీటిని కొల్లగొట్టి జీవించే వ్యక్తులకంటే ముందుగానే ఇవి దూకేందుకు తోడ్పడతాయి దూకిన తరువాత శరీరాన్ని గాలిలోకి తేలిపోయేందుకు వీటి వెనుక రెక్కలు - బూస్టర్స్‌వలె సహాయపడతాయి ఈ చిన్న కీటకాలను పళ్ళతో కరుచుకు పోవాలని ఎదురుచూసే-పొలిచ్చే తెగకు చెందిన జంతువులు, ప్రాకే జంతువులు, పాలీళ్ళు ఇంకా అనేక పక్షులనుండి రక్షణకు వీటికి ఉన్న ఏకైక ఆయుధం - దూకటం, పరుగున ఉండటం

ఇంటి కీచురాళ్ళు సూక్ష్మజీవులు,శిలీంధ్రాలు తెచ్చే అంటువ్యాధులకు గురవుతుంటాయి దీనివల్ల సంపూర్ణ జనాభా నశించిపోయే ప్రమాదం కూడా ఉంది నల్లులు, బొద్దింకల వంటి గట్టి పిండాలను చంపేందుకు ఉపయోగిస్తున్న మరి ఘాతకమైన పురుగుమందులు ఈ గాయకులను కూడా ఇంటినుండి బహిష్కరిస్తున్నాయి

— 'సిఐఇ-ఎన్ఎఫ్ఎస్' [illegible]

## 1852 జూలై 1 న మొదటి తపాలా బిళ్ళ విడుదల

*1840లో సర్ రోలండ్ హిల్ ఇంగ్లండులో ప్రపంచంలోని మొదటి తపాలా బిళ్ళను ప్రవేశపెట్టిన 12 ఏళ్ళ తరువాత ఇండియా మొదటిసారిగా తపాలా బిళ్ళను ఉపయోగించింది 1852 జూలై 1 న ఇండియాలోని మొదటి తపాలా బిళ్ళ వెలుగు లోకి వచ్చింది*

## ప్రపంచంలో పొడవైన అల్లిక

*ట్రాపికల్ ఆర్బ్ వీవర్స్ (Tropical orb Weavers) అనే సాలె పురుగులు ప్రపంచంలో అతి పొడవైన అల్లికను నేస్తాయి చుట్టుకొలతలో ఈ అల్లిక దాదాపు 570 సెం.మీ.లు ఉంటుంది*

[illegible]

# మానవ దేహంలో మాంసకృత్తుల స్థానం

శరీరంలో మౌలిక అంశం - మాంసకృత్తు (ప్రోటీన్) ప్రోటీన్ అనే మాట గ్రీక్‌పదం 'ప్రోటో' నుండి వచ్చింది 'ప్రోటో' అనగా 'మొదటిది' అని అర్థం 'ఎమినో ఆసిడ్స్' అని పిలవ బడుతున్న సాధారణ రసాయన సారాంశాల సంగ్రహం (లేక) కూర్పే ప్రోటీన్లు మానవు నకు తెలిసిన అన్నిరకాల ప్రోటీన్లను తయారు చేసేందుకు దాదాపు 22 ఎమినో ఆసిడ్స్ సంయోగం (కలయిక) చేయబడతాయి ఈ 22 ఎమినో ఆసిడ్స్‌లో ఎనిమిదింటిని 'అత్యా వశ్యక ఎమినో ఆసిడ్స్' అని పిలుస్తారు



శరీరం సంయోగం చేయలేక పోతున్న ఎమినో ఆసిడ్స్ ఇవే

ఒకవ్యక్తి తినే ఆహారంలోని మాంసకృత్తుల సారం జీర్ణమై ఎమినో ఆసిడ్స్‌గా తయారవుతుంది శరీరం ఉపయోగించుకునే కొత్త ప్రోటీన్ రకాలను సమకూర్చేందుకు ఈ ఎమినో ఆసిడ్స్ తిరిగి ప్రోగవుతాయి

జైలు గది వంటి శరీర నిర్మాణం తరచుగా విచ్ఛిన్నమౌతుంటుంది ఏడేళ్ళ కాలపరిమితిలో శరీరంలో తిరిగినింపని ఒక్క జీవకణం (cell) కూడా కనిపించదు. విచ్ఛిన్నమౌతున్న ధాతువును (tissue) మరమ్మతు చేసేందుకు మనకు ప్రోటీన్ అవసరమౌతుంది ఒక వయోజనుని కంటే ఎదుగుతున్న బిడ్డకు ఎక్కువ ప్రోటీన్లు అవసరమవుతాయి అరలు అరలుగా ఉండే జీవకణాల మరమ్మతుకు, పునరుత్పత్తికి ప్రోటీన్ అవసరం అత్యంత వేగంగా భస్మమయ్యే కార్బోహైడ్రేట్లు మనకు కావలసిన శక్తిని సమకూరుస్తాయి క్రొవ్వులు (fats) ఆలస్యంగా దహించుకుపోయినా, అవి కూడా శక్తిని ఇవ్వ టానికి ప్రధానమైనవే, ప్రోటీన్లు కావు

శరీరంలోని ప్రతి జీవాణువులో ప్రోటీన్ భాగంగా ఉంటుంది రోజుకు ఒక కిలోగ్రాం శరీరపు బరువుకు ఒక గ్రాం ప్రోటీన్ మనకు అవసరమవుతుంది ఉదాహరణకు 50 కేజీల బరువు తూగే మనిషికి 50 గ్రాముల ప్రోటీన్ కావాలి అంతమాత్రాన అమిత లావు కలవారంతా ఎక్కువ ప్రోటీన్లు భుజించాలని అర్థంకాదు వాస్తవానికి ఒక సగటు మనిషికి అతని వయస్సు, చేసేపని, జీర్ణశక్తి, ఆహారపు అలవాట్లను బట్టి 25 నుండి 50 గ్రాముల ప్రోటీన్ ప్రతిరోజూ అవసరమౌతుంది

## ఏదీ వ్యక్తిగతం కాదు

'నీవు నీవే పూర్తిగా ఉన్నావా' అని మనం ఆకును అడిగితే లేదు 'నా జీవితం కొమ్మలకు అంకితం' అని చెప్పింది కొమ్మని అడిగితే 'నా జీవితం వ్రేళ్ళకు సంబంధించింది' అని చెప్పగా వ్రేళ్ళను ప్రశ్నిస్తే 'నా జీవితం బోదెకు, ఇతర కొమ్మలకు సంబంధించినది ఆకుల్ని రాలిస్తే నేను మరణిస్తాను' అంది

కనుక గొప్ప వృక్షంగా జీవించటం అంటే ఏదీ పూర్తిగా కేవలం వ్యక్తిగతంగా ఉండదని తెలుసు కోవాలి

— హారీ ఎమర్సన్ ఫాస్‌డిక్

"ఈ ప్రపంచంతో వచ్చిన చిక్కు ఏర్పడుతుంటే మూర్ఖులు అతి నమ్మకంతో ఉంటే, బుద్ధిమంతులు సంపూర్ణ సందేహాలతో ఉండటం"

— బెర్ట్రాండ్ రస్సెల్

**తాను** బలవంతుడు కావాలనే **ఆశతో** ఒక వ్యక్తి ఎక్కువ ప్రోటీన్ భుజించినా **అది అతని** శరీరం మీద భారంగా పరిణమిస్తుంది ప్రోటీన్ - జీవకణాల్లో కలిగే రసాయనిక క్రియ - యూరియా, యూరిక్ ఆసిడ్ వంటి భస్మం కాని పదార్థాలను విడిచిపెడుతుంది ఇవి అత్యధికంగా ప్రోటీన్ తీసుకున్నందువల్ల శరీరంలో కేంద్రీకృతమై శరీరపు మలిన పదార్థాల విసర్జన సామర్థ్యాన్ని తగ్గిస్తుంది దీని ఫలితంగా కీళ్ళనెప్పులు, అత్యధిక రక్తపోటు, మధుమేహం, ఆస్తమా, చర్మవ్యాధుల వంటి వివిధరకాల దీర్ఘవ్యాధులు వస్తాయి శరీరంలో దగ్ధమయ్యే క్రొవ్వులు, కార్బొహైడ్రేట్లు వదిలివేసే కార్బన్ డయాక్సైడ్ మరియు నీటి అవశేషాలను ఊపిరితిత్తులు, మూత్రపిండాలు, చర్మం మొదలైనవి సులభంగా తొలగిస్తాయి

కఠినమైన పనులు చేసే కార్మికులకు అదనపు ప్రోటీన్లు అవసరం లేదు ఎంజైమ్సును పునఃస్థాపించటం, జీవకణాలను పునఃనిర్మించటం, ప్రతిరక్షకం (antibodies) ఉత్పత్తి చేయటం, శ్లేష్మం (mucous) సంపుకోవటం వంటి పనులను ప్రోటీన్ నిర్వహిస్తుంది శారీరక శ్రమ కారణంగా వీటిల్లో ఏదీ నష్టపడదు

మంచి ప్రోటీన్ ఆహారం ఈ క్రింది లక్షణాలు కలిగి ఉండాలి 1 క్రొవ్వు లేని పప్పులు, కాయ ధాన్యాలు, కూరగాయలతోకూడి ఉండాలి 2 అతిసులభంగా జీర్ణమయ్యేటట్లు ఉండాలి జీర్ణమయ్యేందుకు కఠినంగా ఉండే జీవరసాలు లేకుండా ఉండాలి వాయువు ప్రకోపింపచేసే పదార్థాలు ఉండకూడదు 3 అది ఎక్కువ ఖర్చులేనిదిగా, ఆకలి కలిగించేదిగా, సంతృప్తి కలిగించేదిగా ఉండాలి

శరీర అవసరాలను సమకూర్చటానికి ప్రోటీన్ చిన్న పరిమాణాల్లో అవసరమౌతుంది ప్రోటీన్ల పూర్తి వినియోగానికి ఆధారాలైన ఖనిజాలు మరియు విటమిన్లతో దాని సాహచర్యాన్ని బట్టి నిర్ణయమౌతుంది నమ్మకమైన, స్వచ్ఛమైన ప్రోటీన్లు ఈ క్రింది మొక్కల సారాంశాలు అందిస్తాయి

1 ఆకుపచ్చని కాయగూరలు రమారమి హెచ్చు జీవశాస్త్ర విలువలుగల 36 శాతం ప్రోటీన్‌ను సరఫరా చేస్తాయి ఇది ఆవుపాల కన్నా హెచ్చు 2 శరీరానికి కావలసిన ప్రోటీన్లన్ను ప్రతిరోజు తినే కాయగూరలే ఎక్కువగా సరఫరా చేస్తాయి 3 ఉత్తమ నాణ్యతగల ఎమినో ఆసిడ్స్ పొటాటో (ఉర్లగడ్డ) ల్లో ఉన్నాయి. వీటిని శరీరం సులభంగా ఉపయోగించుకో వచ్చు 4 శుద్ధి చేయకుండా పాలిష్ పెట్టకుండా తీసుకున్న (ధాన్యం) గింజలు కూడా ప్రోటీన్లను సరవరా చేస్తాయి 5 హెచ్చు జీవ శాస్త్ర విలువలు గల ప్రోటీన్లకు మూల స్థానం - సోయాచిక్కుళ్ళు, సోయా మొలకలు మరియు సోయా పాలు ఉపయోగకరమైన ఆహారపదార్థాలు ఉన్నత స్థాయికి చెందిన ప్రోటీన్లు వేరుశెనగలో కూడా ఉన్నాయి 6 ప్రొద్దుతిరుగుడు పూల విత్తనాలలో కూడా హెచ్చు స్థాయిగల ప్రోటీన్లు ఉన్నాయి 7 ఉన్నతస్థాయిగల ప్రోటీన్లు ఉన్న గింజలు కాయగూరలతో కలిపి ప్రోటీన్ల నష్టం పూరించేందుకు తీసుకోవాలి 8 పాలల్లో ప్రోటీన్లు కలిసి ఉంటాయి

— 'హెల్త్ హెరాల్డ్' సౌజన్యంతో

## 60 గ్రుడ్లతో అల్పాహారం

*1861 నుండి 1876 వరకు టర్కీని ఏలి పాలించిన సుల్తాన్ అబ్దుల్ అజీజ్ తన ప్రాతఃకాల భోజనంలో గట్టిగా ఉడకబెట్టిన అరవై గ్రుడ్లను తినేవాడు*

తన జీవితాన్ని [illegible] కాలం
వంటి కాలం [illegible]

# క్రమశిక్షణతో రాణించే జీవితం

1 మీ ఆలోచనలను కట్టుబాటు చేసుకోవటం ద్వారా మీ ఉద్వేగాలను అదుపు చేసుకోండి ఏదైనా ప్రణాళిక అమలు చేసేటప్పుడు, భయాందోళనలు ఏర్పడినప్పుడు దృఢమైన భావాలను చొచ్చుకు రానివ్వండి వ్యతిరేక భావాలను తక్షణమే తలక్రిందులు చేయండి దృఢమైన ఆలోచనలే ఉద్వేగాలను అదుపు చేస్తాయి



2 ఓరిమితో ఉండండి ఓర్పులేక పోవటం అపరిపక్వస్థితికి నిదర్శనం అవి పెరుగుతున్నాయా లేదా ? అని చూసేందుకు మీరు విత్తనాలను త్రవ్వి తీయనక్కరలేదు ఆశయాలను, కోరికలను అలవర్చుకోండి, వాటిని అమలు జరపండి ఓర్పుతో మీ కృషి ఫలితాల కోసం వేచి ఉండండి

3 ప్రతి లక్ష్యసాధనకు అడుగుతీసి అడుగువేసే విధంగా ప్రణాళిక సిద్ధం చేసుకోండి ఒక సమయంలో ఒక పథకం మాత్రమే చేపట్టి పూర్తిచేయండి. ఒక సమయం ఒకే పని చేపట్టినట్లయితే ఒకే దృష్టితో మీరు ఇష్టంగా పనిచేయగలుగుతారు ఒక సమయంలో ఒక ఆలోచన మాత్రమే రానివ్వండి ఒకేసారి పెక్కుపనులలో తలదూర్చకండి మరొకపనిలోకి చొరపడే లోపల ఉన్న పనిని వేర్వేరుగా నెరవేర్చేందుకు మిమ్మల్ని మీరే క్రమబద్ధం చేసుకోండి

4 మీ లక్ష్యాలేమిటో, దానిలో మీ అభివృద్ధి ఎంతో వ్రాతపూర్వకంగా రికార్డు చేసుకోండి (భద్ర పర్చుకోండి) ఇంకా చేయవలసిన పనులుంటే, వాటిని చెయ్యండి అల్పమైన విషయాలపై కాలం వృధా చేస్తూ ముఖ్యమైన పనులను నిలిపి వేయకండి అత్యల్పకాలంలోనే పని పూర్తి చేసే విధంగా మిమ్మల్ని మీరు క్రమబద్ధంగా తీర్చిదిద్దుకోండి ఒక వ్యాసం, ఒక పుస్తకం వ్రాసేందుకు, ఒక ఉపన్యాసం సిద్ధం చేసుకునేందుకు, ఒక ధర్మోపన్యాసాన్ని తయారు చేసుకునేందుకు, ఒక తోటను త్రవ్వి బాగుచేసుకునేందుకు, ఇంటికి రంగులు వేసుకునేందుకు, కారు విక్రయించేందుకు పూనుకున్నప్పుడు - వీటిని కఠినమైనవిగానే ఊహించుకుని నిర్వహించండి

—బ్రయాన్ ఆడమ్స్

## కనుగొన్నాను

నేను నా దేవుణ్ణి అభ్యర్థించాను
కాని నా దేవుణ్ణి నేను చూడలేకపోయాను
నేను నా ఆత్మను వెదికాను
కాని నా ఆత్మను చూడలేకపోయాను
నేను నా పొరుగువానిని వెదికాను
ఈ మూటింటినీ కనుగొన్నాను

-ఎడ్గార్ ఏ గెస్ట్

'తాము గొప్పజాతిగా నిలవాలని కోరుకునే ప్రజలు సామూహిక క్రమశిక్షణ కలిగి ఉండటం - అత్యంత ఆవశ్యకమైన షరతు''

— మహాత్మాగాంధీ

# సినీ ప్రపంచం

## 1927లో నిర్మాణం- "ది లైట్ ఆఫ్ ఆసియా" చిత్రం


Buddha

1927లో జర్మన్ సాంకేతిక నిపుణుల సహకారంతో హిమాంశు రాయ్ 'ది లైట్ ఆఫ్ ఆసియా' ఫిలిం నిర్మించాడు బౌద్ధమత స్థాపకుడైన గౌతమబుద్ధుని జీవితాన్ని చిత్రీకరించిన ఈ చిత్రం దాని కళాఖండం లక్షణానికి శ్లాఘించబడింది

## జపాన్‌లో మహాదీర్ఘచిత్రం

250 మంది ప్రముఖ నటీనటులతో టోక్యో (జపాన్)లో ఒక సంస్థ నిర్మించిన చిత్రం 'ది హ్యూమన్ కండిషన్' 1961 అక్టోబర్‌లో ప్రదర్శించబడింది 20 నిమిషాల గల రెండు విరామ సమయాలతో 8 గంటల 50 నిమిషాలసేపు నడిచే ఈ చిత్రానికి మసకి కొబయాషి దర్శకత్వం వహించాడు

## మొదటి ఫిలిం ట్రేడ్ జర్నల్

1953లో ప్రారంభించిన ఇండియాలో మొట్ట మొదటి ఫిలిం ట్రేడ్ జర్నల్ "ట్రేడ్‌గైడ్"కు బి.కె.ఆదర్శ్ స్థాపక సంపాదకుడు ఇండియాలో లైంగిక విద్యకు సంబంధించిన మొదటి చిత్రం 'గుప్తజ్ఞాన్' - ఆయన నిర్మించాడు

## 'ధర్మాత్మా' లో ఏక్‌నాథ్ జీవిత చిత్రణ

హరిజనులను తన వారివలె ఆదరించిన ప్రఖ్యాత యోగి ఏక్‌నాథ్ జీవితాన్ని వెల్లడించే చిత్రం - 1930లో ప్రభాత్‌వారు నిర్మించిన 'ధర్మాత్మా'

## నవ్వు విలువ



నవ్వులోని విలువ మనలో చాలామంది గ్రహించుకోలేదు ఆత్మను పరిశుద్ధం చేసేది నవ్వు నవ్వు శారీరక, ఆధ్యాత్మిక బలవర్ధక ఔషధం మనం ఇతరులను చూసి నవ్వకుండా ఉండేందుకు జాగ్రత్త పడాలి మనల్ని చూసి మనమే నవ్వుకోగలగాలి'

—జె.పి. వాస్వాని

"ధైర్యం కోల్పోకుండా ఓటమిని సహించటమే - సాహసానికి పరీక్ష"

— ఆర్.జి. ఇంగర్‌సాల్

## ఉత్తమ సహాయనటికి ఆస్కార్ అవార్డు

లింగభేదం గల పాత్ర పోషించి ఆస్కార్ అవార్డ్ పొందిన మొట్టమొదటి మహిళ లిండా హంట్ 1983లో విడుదలయిన "ది ఇయర్ ఆఫ్ లివింగ్ డేంజరస్లీ" అనే చిత్రంలో పురుషపాత్ర ధరించి ఉత్తమ సహాయనటి అవార్డు అందుకున్నదామె

## నాలుగు ఆస్కార్ అవార్డ్స్ విజేత



Oscar award

డైరక్టర్ జాన్ ఫోర్డ్ నాలుగు ఆస్కార్ అవార్డులు కైవసం చేసుకున్నాడు ఆ చిత్రాలు ది ఇన్‌ఫార్మర్ (1935), ది గ్రేప్స్ ఆఫ్ వ్రాత్ 1940), హౌ గ్రీన్ వాజ్ మై వాలీ (1941) మరియు ది క్వైట్ మాన్ (1952)

## ఐసోహైట్స్

అదే మొత్తం వర్షపాతం పడే ప్రదేశాలను చేర్చి ఒక పటంమీద గీతలు గీయటాన్ని - ఐసోహైట్స్ *(Isohyets)* అని పిలుస్తారు

## మీవిజ్ఞానం పరీక్షించుకోండి

### జవాబులు

**క్విజ్.** 1 (డి) చలికాలంలో, 2 (డి) మౌంట్ పినటుబో, 3 (బి) రాజస్థాన్ 4 (సి) టైఫాయిడ్, 5 (బి) మహాత్మాగాంధీ, 6 (డి) బీహార్, 7 (ఎ) ఎర్నెస్ట్ హెమ్మింగ్వే 8 (డి) ఒ.పి.ఇ.సి (ఆర్గనైజేషన్ ఆఫ్ పెట్రోలియం ఎక్స్పోర్టింగ్ కంట్రీస్)

**మాటలమహిమ.** 1 (ఎ) ఇంటికప్పు, (బి) నేత్ర రోగము, (సి)సమూహము, (డి) చిన్నగంప, (ఇ) నొసటి బొట్టు, 2 (ఎ) పడినవాడు, (బి) పొందినవాడు, (సి) ధర్మభ్రష్టుడు, (డి) పాపి, 3 (ఎ) కంఠాభరణ విశేషము, (బి) హారము నడుమ రత్నాదులు పొదిగిన బిళ్ళ, (సి) మార్గము, (డి) పన్నాగము, 4 (ఎ) శ్మశానము, (బి) తండ్రి ఇల్లు, 5 (ఎ) కట్టు, ముడి, (బి) దారము, (సి) సంకెల, బందీ చేయుట, (డి) నిర్మాణము; 6 (ఎ) పరాక్రమశాలి, (బి) శూరుడు, (సి) బలవంతుడు, (డి) అధికుడు; 7 (ఎ) కథనము, (బి) ఉపదేశము, ఉత్సవము, (సి) భాగ్యము, హర్షము, (డి) ఏర్పాటు, కొలత, 8 (ఎ) దర్శనము, (బి) కన్ను, చూపు, (సి) ఎఱుక, అభిప్రాయము, (డి) కనుబాటు, దృష్టిదోషము

**తెలివికి పరీక్ష:** 1 విజయవాడ నుండి మద్రాసుకు 310 కి.మీ.ల దూరం పయనిస్తుంది, 2 గుంటూరు జిల్లా కొల్లూరులో, 3 (సి) చేప, 4 రష్యా వ్యోమగామి - వలంటినా తెరిష్కోవా (1963 జూన్ 16వ తేదీన), 5 శాలివాహన చక్రవర్తి శ్రీముఖుడు 300 బి.సి.లో శ్రీకాకుళం రాజధానిగా స్థాపించాడు, . 6 వృక్షం వేపచెట్టు, పక్షి పాలపిట్ట, జంతువు కృష్ణజింక

"అతడు నిశ్శబ్దంగా ఉన్నంతకాలం ఒక అవివేకి కూడా ఇతరుల వలెనే కనిపిస్తాడు"

# మీకు తెలుసా?

## థాయ్‌లాండ్ కరెన్సీ

ఆ యాలోని థాయ్‌లాండ్‌లో - బహట్ (bahr) కరెన్సీగా ఉంది

## కోతులకు నామవాచకం

[illegible] కోతులకు (apes) ఉమ్మడి [illegible]చనం [illegible] పిప్పర్

## కుటుంబ జీవనం చేయని చిఱుతలు




చిఱుత పులులు కుటుంబపు గుంపులతో కలిసి జీవించవు జతకూడిన తక్షణమే మగచిఱుత ఆడచిఱుతను వదిలి వేస్తుంది తల్లి చిఱుతపులే తన పిల్లల్ని పెంచుతుంది

## ఐసొహెల్స్ అంటేఏమిటి?

సూర్యకాంతి ఒకే విధంగా ప్రసరించే వివిధ స్థలాలను దేశపటంలో చూపే గీతలకు ఇచ్చిన శాస్త్రనామం- ఐసొహెల్స్ (isohels)

## మిడత వినికిడి జ్ఞానం

ఒక మిడత యొక్క వినికిడి జ్ఞానం దాని మోకాళ్ళపై కేంద్రీకరించబడింది

## సుదూరతీరాల్లో దీపస్తంభం

ప్రపంచంలోని సుదూర ఏకాంత దీపస్తంభం (లైట్‌హౌస్) - వేల్స్ (యునైటెడ్ కింగ్‌డం) తీరానికి 18.4 మైళ్ళకు అవతల ఉన్న - స్మాల్స్ లైట్‌హౌస్

## మొదటి నోబెల్ శాంతిబహుమానం

స్విట్జర్లాండ్‌కు చెందిన జీన్ హెచ్ డ్యునాంట్ మరియు ఫ్రాన్స్‌కు చెందిన ఫ్రెడరిక్ పాస్సీ ఉమ్మడిగా 1 901 లో మొదటి నోబెల్ శాంతి బహుమానం పొందారు

## ఇండియాలో ఎత్తైన పీఠభూమి

లడఖ్ పీఠభూమి - ఇండియాలో ఎత్తైన పీఠభూమి ●

# అద్భుత ప్రపంచం

## సాటిలేని వరండా వైభవం

*ఇండియా కడపట ఆగ్నేయదిక్కున, పాక్ జలసంధిలోని ఒక దీవిలో రామేశ్వరం (తమిళనాడు) ఉన్నది రామేశ్వరంలోని శ్రీరామనాధస్వామి దేవాలయ నిర్మాణం పూర్తి చేసేందుకు 350 సంవత్సరాలు పట్టిందని చెబుతారు అది 17వ శతాబ్దినాటిది ఈ దేవాలయాన్ని చుట్టిన బ్రహ్మాండమైన నడవ (వసారా) వెయ్యి స్తంభాలతో ఉంటుంది ఇది మొత్తం దూరం 1,220 మీటర్లు (4,000 అడుగులు) వ్యాపించింది. అత్యంత వైభవంగల ఈ వరండాకు (వసారా) ప్రపంచంలో మరొకటి సాటిరాదు*

'మన జీవితపు అల్లిక మిశ్రమ నూలుతో నేయబడింది
అది మంచీ చెడులు కలనేత'' — షేక్స్పియర్

# స్టాంపుల కథ

## సంప్రదాయ తేనీటి పాత్రలు

తేనీరును ప్రీతితో వేలాది సంవత్సరాలుగా సేవించే చైనీయులు తమ ప్రేమ చిహ్నంగా తైవాన్ చైనా (ప్రధాన చైనాకు దక్షిణ భాగం)లో ప్రాచీన తేనీటి కలశాలు (Teapots) గల తపాలా బిళ్ళలను విడుదల




చేసారు. వీటిలోని ఐదు తేనీటి పాత్రలు - మింగ్ (1368-1644) మరియు ఛింగ్ (1644-1911) వంశాలకు చెందినవి ఉన్నాయి. తైవాన్ రాజధాని తైపేలోని నేషనల్ మ్యూజియంలో ఈ ప్రాచీన తేనీటి పాత్రలు ప్రస్తుతం ప్రదర్శిస్తున్నారు.




ఫొనిక్స్ డిజైన్లు గల ఈ పింగాణి (పోర్సిలిన్) టీపాట్ (ఎన్‌టి 2 00 డాలర్లు) నున్నని, మెరిసే నీలి రంగుతో, సమతలమైన మూతతో, వెదురుకాడల చేతిపిడితో అలంకరించి ఉంటుంది. దీని గోడలు చాలా పలుచగా ఉండి తేలిగ్గా ఉంటాయి. మరో రకం పింగాణీ టీపాట్ (ఎన్‌టి 3 00 డాలర్ల స్టాంప్) గొట్టం (పర్తుల స్తంభాకారం) ఆకారంలో ఉండి, చేతిపిడి రెండు చురుకుగా ప్రాకే భయంకర మొసళ్ళ ప్రతిరూపాలతో ఉంటుంది. ఇది తేనీటిని దాని కొమ్ము నుండి వేగంగా ప్రవహింపజేస్తుంది.

— కవితా రాయ్

## మూడవ వ్యక్తి ఎవరు?

సుప్రసిద్ధ బ్రిటిష్ శస్త్ర వైద్యుడు లార్డ్ మొయినిహాన్ అనేకమంది ప్రముఖులైన వైద్యుల సమక్షంలో ఒక శస్త్ర చికిత్స ముగించాడు. ఇంతగుంపు మధ్య ఎలా పని చేయగలిగారని ప్రశ్నించగా ఆయన ఇలా జవాబు చెప్పాడు. "నేను శస్త్ర చికిత్స చేస్తున్నప్పుడు ఆపరేటింగ్ గదిలో కేవలం ముగ్గురు వ్యక్తులు మాత్రమే ఉన్నారు - నేను, రోగి."

'అయినా ఇద్దరే కదా! మరి మూడో వ్యక్తి ఎవరు?' అని ఆతనిని అడిగారు.

'మూడో వ్యక్తి - భగవంతుడు' అని జవాబిచ్చాడు మొయినిహాన్.

## తలసరి విద్యుత్ వాడకం

***ఇండియాలో తలసరి విద్యుత్ వాడకం సంవత్సరానికి దాదాపు 250 కిలోవాట్లు (KWH) కాగా, వర్ధమాన దేశాలలో 10,000 కిలోవాట్లుగా ఉంది.***

"జీవించి ఉన్నంత కాలమూ నేను నేర్చుకుంటూనే ఉంటాను."

— రామకృష్ణ పరమహంస

# ప్రపంచంలో పొడవైన సముద్ర గర్భ సొరంగం

నాలుగు ప్రధాన జపాన్ దీవులలో రెండు దీవులు-హెంషూ, హొక్కయిడోలను కలుపుతున్న సీకన్ సొరంగం ప్రపంచంలోని పొడవైన సముద్రగర్భపు లంకె (link)గా చెప్పవచ్చు. ట్సుగరు జలసంధికి 100 మీటర్ల క్రిందుగా, 53.9 కి.మీ.ల పొడవున - సముద్ర మట్టానికి పూర్తిగా 240 మీటర్ల క్రిందుగా ఈ సొరంగం నిర్మించారు.


Seikan Tunnel (Japan)

హెంషూ, హొక్కయిడో దీవులలో ఒక సమయంలోనే ఈ సీకన్ సొరంగం త్రవ్వకాలు జరిగాయి. సముద్రం క్రింద రెండు దీవులకు మధ్య ప్రదేశంలో వీటిని కలిపారు. సొరంగం యొక్క ఉన్నత పరిమాణానికి కీలకమైన కారణం - దీన్ని క్షితిజ లంబం (Vertical)గా తొలచటం (లేక) ఛేదించటం కాకుండా క్షితిజ సమాంతరం (horizontal)గా తొలచటం. దీనికి అధిక స్థాయిగల సాంకేతిక ప్రజ్ఞ అవసరం. సీకన్ సొరంగంలోని మార్గంలో గల మట్టి భూగర్భ శాస్త్రరీత్యా లేతది, మృదువైనది. అందువల్ల ప్రతి 25 మీటర్లకు కొలతలు తీసుకోబడి గతిక్రమంలో సొరంగం నిలుస్తుందని హామీ ఇవ్వబడింది. మృదువైన మట్టిని తొలచేందుకు ఒక క్షితిజ లంబ యంత్రం (horizontal boring machine) కూడా ప్రత్యేకంగా తయారు చేయబడింది.

సొరంగపు పనులు 24° C ఉక్కతో కూడిన వేడిమిలో 90 శాతం తేమ (తడి)లో జరిగాయి. [కాంక్రీట్ పోసే సమయాల్లో 30° C వేడి మరియు 100 శాతం తేమకు చేరు కుంటుంది.] నాలుగు సందర్భాలలో ఈ ప్రాజెక్ట్ హఠాత్తుగా భూగర్భ జల ప్రళయానికి లోనైంది. అన్నిటిలోకి అత్యంత ఘోర సంఘటన 1976 మేలో జరిగింది. నిమిషానికి 70 టన్నుల నీరు సొరంగంలోకి వరదవలే ముంచుకు వచ్చి 3,000 మీటర్ల మేరకు పని నిర్వహిస్తున్న సొరంగాన్ని, 1500 మీటర్ల ప్రధాన యంత్రభాగాన్ని ముంచెత్తింది. కానీ ఈ కఠిన పరిస్థితులు - ఆ బ్రహ్మాండమైన సొరంగాన్ని ఊట (కారటం) అరికట్టే పద్ధతులకు సంబంధించిన ఒక ఆదర్శ పరిశోధనశాలగా

# అపూర్వ విషయాలు

## బంగారం తయారీ

*ఒక ట్రవుజర్ గుండీ సైజులో ఉండే బంగారవు ముక్కను తయారు చేసేందుకు 5 టన్నుల ప్రకృతి సిద్ధమైన శిలాధాతువు (ముతకలోహం) కావల్సి ఉంటుంది.*

## 20 ఏళ్ళు చిత్రించిన చిత్రం

*ప్రసిద్ధ చిత్రకారుడు ఆల్బర్ట్ పిన్‌ఖం రైడర్ (1847-1917) - వివరీత మనస్తత్వం కల వ్యక్తి ఒక పర్యాయం ఒకే ఒక వర్ణచిత్రం రూపొందించేందుకు ఇతడికి 20 సంవత్సరాలు పట్టింది.*

"సరిగ్గా ప్రవర్తించడం కన్నా, విమర్శనాత్మకంగా ఉండటం సులభం."

రూపొందించాయి దీని ఫలితంగా గణనీయమైన సాంకేతిక అభివృద్ధి సాధించబడింది ఒక కొత్త సిమెంట్ ఇన్‌జెక్షన్ పద్ధతి, అభివృద్ధి చెందిన నీటిని పైకి తోడే పంపు ఈ సొరంగ మార్గం నిర్మాణంలో ఉపయోగించారు ఈ నిర్మాణ సామర్థ్యం పట్టణ సొరంగ ప్రాజెక్టులకు ఎంతో ఉపయోగంగా ఉంటుంది



Seikan tunnel

దిశ మారకుండా ఉంచేందుకు - లేజర్ కిరణాలను మరియు కాంతి తరంగాల వంటి సర్వేయింగ్ పరికరాలు ఈ 53 9 కి మీ ల సొరంగ నిర్మాణంలో ఉపయోగించారు వీటికి పక్కగా నిలిపిన కట్టడాలను, చుట్టుప్రక్కల ఉన్న రాతిని కంప్యూటర్ విశ్లేషణ ద్వారా త్వరితంగా, క్షేమంగా నిలిచేటట్లు దృఢపర్చటం జరిగింది

ప్రధాన సొరంగం మరియు సహాయక సొరంగాల మధ్య కాంక్రీట్ గోడలను చీలుస్తూ అత్యవసర సుగము మార్గాలను ఏర్పర్చేందుకు నవీన జెట్ సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించారు కాంక్రీట్‌పైన ప్రతి చదరపు సెంటీమీటర్‌కు 450 కి గ్రా ల అత్యధిక ఒత్తిడితో నీటిధారను ప్రవహింపజేశారు ఈ జెట్ లేక నీటిధార 70 సెం.మీ ల గోడను కూడా - ఏవిధమైన కదలిక (కంపనం), విస్ఫోటనం, శబ్దం లేక ఒక చిన్న పగులు లేకుండా కోసి వేసింది

కొత్త సాంకేతికత తెచ్చిన ఈ అద్భుత ఫలితాలవల్ల మొత్తం 200 కి.మీ.ల సొరంగం (ప్రధానమైనవి - సహాయకమైనవి) నిర్మించారు దీనికి దాదాపు 12,600,000 పని రోజులు పని చేసారు 6,330,000 క్యూబిక్ మీటర్ల మట్టి, రాయి వెలికితీయబడింది 847,000 టన్నుల సిమెంట్, 168,000 టన్నుల ఉక్కు వాడబడింది

ఒకే పర్యాయం కొన్ని వందల వాహనాలు పని చేయటంవల్ల ప్రమాదాలు జరిగే అవకాశాలు ఎక్కువ రాళ్ళు పడటం, జారటం, వరదలు ముంచెత్తటం, ఇంకా ఇతరమైన అవ్యవస్థలు ఉన్నా 2,360,000 పని గంటలలో ఆకస్మిక దుర్ఘటనలు లేకపోవటం జపనీస్ నిర్మాణ పరిశ్రమ యొక్క అపూర్వ యాజమాన్య సాంకేతిక విజ్ఞానానికి నిదర్శనాలు

— 'జపాన్ కాలింగ్' సౌజన్యంతో

## అమెరికాలో 45 శాతం స్త్రీల వద్ద వజ్రాల నగలు

*అమెరికాలో 15 సంవత్సరాల వయస్సు దాటిన స్త్రీలలో 45 శాతం మందికి వజ్రాలు అమర్చిన నగలు ఉంటాయి బ్రిటన్‌లో ప్రతి ఐదుగురు స్త్రీలలో ఒకరికి వజ్రాల నగలు ఉంటాయి కెనడా, జర్మనీలలో 25 శాతం స్త్రీలకు వజ్రాల నగలు ఉంటాయి ఇటలీలో కేవలం 13 శాతం స్త్రీలకు మాత్రమే వజ్రాల నగలు ఉంటాయి*

## తలపై నిలబడే చేపలు

*తన శత్రువుల నుండి తప్పించుకునేందుకు ఫైల్ చేపలు తలపై నిలబడి ఈల్ గ్రాస్ (eel grass)ను అనుకరిస్తాయి!*

సుగంధ ద్రవ్యాలు ఉత్పత్తి కాగా, 300 కోట్ల రూపాయల ఖరీదైనవే ఎగుమతి అవుతున్నాయి

## ఇండియాలో పురుగు మందుల వాడకం

ప్రస్తుతం భారతీయులు దాదాపు 75,000 టన్నుల కీటక నాశక మందుల్ని ఉపయోగిస్తున్నారు దీనిలో 98 శాతానికి పైగా స్వదేశీ పరిశ్రమల్లో తయారయినవే ఎన్నో రకాల పురుగు మందులు - అనేక యూరోపియన్, పశ్చిమాసియా మరియు ఇతర వర్ధమాన దేశాలకు ఎగుమతి చేయబడుతున్నాయి 1991-92లో 232 కోట్ల రూపాయలు ఖరీదుగల కీటక నాశక మందులు ఎగుమతి చేయబడ్డాయి (పిఐబి)

## పర్యాటక శాఖద్వారా విదేశీ మారకద్రవ్యం

ప్రపంచ జనాభాలో 15 శాతంకన్నా ఎక్కువ ఉన్న దేశం, ప్రపంచ భౌగోళిక ప్రాంతంలో 7 శాతం ఉన్న దేశం అయిన ఇండియా కేవలం 0 32 శాతం మాత్రమే ప్రపంచ పర్యటనకు దోహదం చేస్తూంది అయినప్పటికీ ఇండియాలో టూరిజం (పర్యటన) 1991-92లో విదేశీ మారక ద్రవ్యం 3,300 కోట్ల రూపాయలు గడించి పెట్టింది (మొత్తం ఎగుమతుల ఆదాయంలో దాదాపు 7 5 శాతం)

## ఇండియాలో షెడ్యూల్డ్ కులాలు, తెగలు

ఇండియాలోని మొత్తం జనాభాలో షెడ్యూల్డ్ కులాలు మరియు తెగలకు చెందినవారు 24 56 శాతం ఉన్నారు. దీనిలో షెడ్యూల్డ్ తెగలవారు 16 48 శాతం కాగా అత్యధిక సంఖ్యలో షెడ్యూల్డ్ కులాల వారు - పంజాబ్‌లో (28 31 శాతం) కేంద్రీకృతమై ఉన్నారు హిమాచల్‌ప్రదేశ్‌లో 25 34 శాతం, పశ్చిమ బెంగాల్‌లో 23 62 శాతం ఉన్నారు బీహార్‌లో షెడ్యూల్డ్ కులాలు మరియు షెడ్యూల్డ్ తెగలవారు రాష్ట్ర జనాభాలో 14 55 మరియు 7 66 శాతం ఉన్నారు

— '1991 జనాభా లెక్కలు' ఆధారంగా

## గుండెలను తాకే మాటల ప్రయోజనం



క్రింద సుడులు తిరిగి పారుతున్న నదిలోకి దూకి చనిపోయేందుకు ఒక యువతి వంతెన మీద నిలబడి ఉంది

బ్రతుకులోని పరమార్థాన్ని గురించి ఒక మనస్తత్వవేత్త, ఒక పోలీస్ అధికారి, ఒక క్రైస్తవ మతగురువు ఆమెకు నచ్చచెప్పి విఫలులయ్యారు

అప్పుడే అదోవనే పోతున్న మరో యువతి ఇలా అరిచింది "ఆ కంపు కొట్టే మురికి నీళ్ళలోకి దూకవద్దు అవి బొత్తిగా రోతగా ఉన్నాయి!"

ఆత్మహత్యకు పూనుకున్న యువతి వెంటనే వంతెన పైనుంచి క్రిందికి దిగి వచ్చింది. వారికి ఏది ముఖ్యమో దాన్ని స్పృశించకపోతే మాటలవల్ల ఇతరులను ప్రభావితం చెయ్యలేరు వారి భావోద్వేగాలను, వారి జీవితాలను స్పృశించే మాటలు పలికినప్పుడే ప్రజలు ప్రతిస్పందిస్తారు

—'ఇన్‌స్పిరేషనల్ కోట్' సౌజన్యంతో

"విజయం అనేది ప్రజా సంబంధమైనది, అపజయం అనేది వ్యక్తిగతమైనది."

— రొస్సెల్

# నోబెల్ బహుమతి - నేపథ్య కథ

స్వీడెన్‌కు చెందిన నోబెల్ బహుమతి గురించి ప్రపంచమంతటికీ తెలుసు 1833లో స్టాక్‌హోమ్‌లో జన్మించి, 1896 డిసెంబరు 10న శాన్ రెమోలో మరణించిన ఆల్‌ఫ్రెడ్ నోబెల్ వీలునామా ననుసరించి 'ది నోబెల్ ఫౌండేషన్' స్థాపించబడింది


ALFRED NOBEL

1895 నవంబర్ 27న వ్రాసిన వీలునామా ద్వారా ఆల్‌ఫ్రెడ్ నోబెల్ తన యావదాస్తిని - 30 మిలియన్ క్రోనార్‌లకు మించినది (19.40 క్రోనార్లకు ఒక స్టెర్లింగ్ సమానం) ఒక నిధికి పట్టి పూర్వకంగా వ్రాసి ఇచ్చారు ఈ నిధిపై వచ్చే వడ్డీని అంతకుముందు సంవత్సరాలలో మానవాళికి అత్యంత ఉపయోగకరమైన సేవ లందించిన వారికి ప్రతి సంవత్సరం చెల్లించాలని ఆ శాసనంలో వ్రాశారు

ఈ వడ్డీని ఐదు సమాన భాగాలుగా విభజించి ఈ క్రింది విధంగా కేటాయించారు ఫిజిక్స్ (భౌతిక శాస్త్రం)లో అత్యంత ముఖ్యమైన పరిశోధనకాని, ఆవిష్కరణ కాని (సృష్టికాని) చేసినవారికి ఒక భాగం, రసాయనిక శాస్త్రంలో పరిశోధన లేక అభివృద్ధి సాధించిన వారికి ఒక భాగం, శరీర ధర్మశాస్త్రం లేక వైద్య శాస్త్రంలో అత్యంత ప్రాముఖ్యంగల పరిశోధన చేసినవారికి ఒక భాగం, సారస్వత రంగంలో ఆదర్శవాద ధోరణిలో విశిష్టమైన, విలక్షణమైన రచన చేసిన వ్యక్తికి ఒక భాగం, శాంతి సంఘాలు స్థాపించి, శాంతి కోసం ఉద్యమించి, స్థానిక సైన్యాలను తగ్గించటమో, రద్దు చేయడమో చేయాలని ప్రచారం చేసి, వివిధ దేశాల మధ్య సౌభ్రాతృత్వానికి అత్యంత దోహదం చేసే వ్యక్తికి ఒక భాగం ఇవ్వాలని నిర్ణయించారు

బెర్తా వాన్ సుట్నర్ (Bertha von Suttner) అనే మహిళ ప్రభావంవల్ల నోబెల్ "శాంతి బహుమానం" నెలకొల్పబడింది ఈ గొప్ప వనిత గురించిన వివరాలు కూడా ఆసక్తి కలిగిస్తాయి

## అటంబాంబ్ ప్రయోగించిన 47 ఏళ్ళకు

*1945 ఆగస్టు 6వ తేదీ ఉదయం 8.15 నిమిషాలకు* జపాన్‌లోని హిరోషిమా నగరంపై అటంబాంబు ప్రయోగించిన తరువాత *47* సంవత్సరాలు గడిచిపోయాయి నేడు ప్రజలు మెగాటన్స్‌లోనే లెక్కలు వేస్తున్నారు గ్రీక్ పదం మెగాకు అర్థం పది మిలియన్‌లో హెచ్చవేయటం మిలిటరీ సాంకేతిక విజ్ఞానం మెగాటన్నులతో 'మిస్సైల్స్' సంఖ్యను చేసింది న్యూక్లియర్ అస్త్రాలు కొన్ని నిమిషాలలోనే ప్రపంచంలో ఏ మూలకు వద్దకైనా నేడు ఎటాచ్ చేయబడుతున్నాయి ప్రతి మిస్సైల్ (క్షిపణి) *3 7 10* లేదా ఇంకా ఎక్కువ అస్త్రాలను మోయగలుగుతుంది ప్రతి ఒక్కటీ స్వతంత్రంగా గురిపెట్టబడినవే

'మాటలు చేసే గాయాల్ని స్వస్థపర్చటం కఠినం'

1876లో ఫ్రాంకో - ప్రర్షియన్ యుద్ధం ముగిసిన తరువాత, నోబెల్ తనకొక స్త్రీ సహచరి కావాలని వియన్నా పత్రికలో ప్రకటించాడు. ఆయనకు వచ్చిన జవాబుల్లో ఒకటి - ఒక యువతి బెర్తా కిన్స్కే నుండి వచ్చింది.



Bertha Von Suttner

అనంతరం ఈమె బెర్తా వాన్ సుట్నర్‌గా ప్రఖ్యాతి చెందింది. వివాహ బంధం అనేది జరగకపోయినా వీరిద్దరి మధ్య యుద్ధ సమయంలో లక్ష్యసాధకుడు, మరియు ప్రపంచ శాంతి కోసం ఉద్యమించిన బెర్తా-వీరిద్దరి మధ్య ఏర్పడిన స్నేహబంధం నోబెల్ జీవించి ఉన్నంత కాలం సాగిపోయింది. పట్టుమహిషి సుట్నర్ ప్రభావంవల్ల మారణాయుధాల మోజీ తయారీదారుడు తన వ్యక్తిగత అభిరుచులకు విరుద్ధంగా ప్రపంచ శాంతి సిద్ధాంతం కోసం పోరాడే యోధుడై, తన యావదాస్తిని - 33,000,000 క్రౌన్లకు పైగా మానవాళి సంక్షేమ కార్యకలాపాలకు వినియోగింప చేశాడు. 1896 డిసెంబర్ 10న నోబెల్ మరణించాడు. అతని అపార సంపదపై వచ్చే వడ్డీని ఫిజిక్స్, కెమిస్ట్రీ, వైద్యం, సారస్వతం, విశ్వశాంతి రంగాలలో అత్యున్నత పరిశోధన, సేవలు చేసినవారికి అందించమని వ్రాసిన వీలునామా చదివి ప్రపంచం ఆశ్చర్య పరవశమైంది. 1901 నుండి 1930 వరకు నోబెల్ శాంతి బహుమానం అందుకున్న వారిలో 13 మంది మహిళలు ఉన్నారు. నోబెల్ శాంతి బహుమానం విలువ 172,000 స్వీడిష్ క్రౌన్లు ఉంటుంది.

1905లో బెర్తా వాన్ సుట్నర్‌కు నోబెల్ శాంతి బహుమతి ప్రకటించారు. ఈ గౌరవానికే కాక మరింత గొప్ప గౌరవానికి కూడా ఆమె పాత్రురాలౌతుంది. ఆమె తన జీవితాన్నంతా ప్రపంచ శాంతి కోసం ధారపోయటమే గాక ఆల్‌ఫ్రెడ్ నోబెల్‌ను కూడా ఒప్పించగలిగింది. తత్ఫలితంగా ఏర్పడిందే ఘనత వహించిన 'నోబెల్ బహుమతుల సంస్థ'.

ఈ విషయాన్నంతా పరిశీలించిన వారెవరైనా ఎంతమంది 'చిన్న బెర్తాలు' ప్రపంచంలో ఉద్భవించి తమ భర్తలను, కుమారులను, ప్రజాహిత రంగంలోనివారిని ప్రపంచ శాంతి కోసం కృషి చేయమని ప్రోత్సహిస్తున్నారో ఊహించుకోవచ్చు.

## పసిబిడ్డల్ని ఎత్తుకెళ్ళే, చేపలు పట్టే పిల్లి

ఇండియా, శ్రీలంకలలో కనిపించే చేపలు పట్టే పిల్లి దానికన్నా పెద్ద జంతువుల్ని కూడా చంపుతుంది. పెద్ద సైజు వేటాడే కుక్క మాదిరిగా ఉండే ఈ చేపలుపట్టే పిల్లి క్రూరంగా, నిర్దయగా ఉంటుంది. ఇది హెచ్చుగా మంచి నత్తలు, చేపల మీద జీవిస్తున్నా గొర్రెల్ని చంపే సమర్థత కలిగి ఈ పిల్లి పసిపిల్లల్ని కూడా ఎత్తుకుని వెళ్తుంది. ఈ పిల్లి చర్మం తేలిక రకం పండు గోధుమరంగుతో నల్లని మచ్చలు కలిగి ఉంటుంది.

"ప్రార్థించే పెదవులకంటే సాయపడే హస్తాలే పవిత్రాలు"

— రాబర్ట్ ఇంగర్‌సాల్

# అనువు కాని చోట అధికుల మనరాదు

జనరల్ పెర్షింగ్ నిజమైన గొప్ప సైనికాధికారి మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో యూరప్ లోని అమెరికన్ ఎక్స్‌పిడిషనరీ దళాలకు అతడు సర్వ సైన్యాధిపతి యుద్ధానంతరం అతడు యునైటెడ్ స్టేట్స్ సైనిక దళాలకు జనరల్‌గా నియమించబడ్డాడు ఒక అమెరికన్ సైనికాధికారికి ఎన్నడూ లభించని అత్యున్నత పదవి ఇది

ఒక రోజున జనరల్ పెర్షింగ్ వెస్ట్ పాయింట్ వద్దగల మిలటరీ అకాడమీ గ్రౌండ్స్‌లో వాహ్యాళికి వెళ్ళాడు దారి వెంట కులాసాగా, సిగరెట్ త్రాగుతూ నడుస్తున్నాడు అతనికి దగ్గరలోనే ఇద్దరు కేడెట్లు (సైనిక విద్యార్థులు) కంచెను కత్తిరించి సరిచేస్తున్నారు వీరిలో ఒకడు అకాడమీలో కొత్తగా చేరినవాడు అతడు పెర్షింగ్‌ను చూడగానే అతని దగ్గరకు వెళ్ళి ఒక సిగరెట్ ఇవ్వమని అడిగాడు వెంటనే పెర్షింగ్ అతనికి సిగరెట్ ఇచ్చి దాన్ని వెలిగించాడు కూడా ఆ యువకుడు ధన్యవాదాలు చెప్పి తను పనిచేస్తున్న కంచె దగ్గరకు తిరిగి వెళ్ళిపోయాడు అక్కడ అతని సహచరుడు భయభ్రాంతుడై నిలబడి ఉన్నాడు "ఆయన ఎవరో నీకు తెలుసా? ఆయనే జనరల్ పెర్షింగ్" - అన్నాడు ఈ యువకుడు ఆశ్చర్యంలో విభ్రాంతి చెంది, అలాగే సిగరెట్‌ను క్రింద వేసి, పెర్షింగ్‌ను కలుసుకునేందుకు పరుగుతీశాడు ఆయన్ని కలుసుకుని చెప్పాడు "అయ్యా! నేను భయవిహ్వలతతో విచార పడుతున్నాను ఈ చోటుకు నేను కొత్త వాడిని అన్ని యూనిఫారాలు నాకు ఒకే విధంగా కనిపిస్తాయి అయ్యా! ఏది ఏమైనా నా అసభ్య ప్రవర్తనకు నేను క్షమార్పణ కోరుకుంటున్నాను"

జనరల్ పెర్షింగ్ అతని వెన్ను తట్టి చెప్పాడు "ఏమీ ఫరవాలేదు బాబూ! ఏ హానీ జరగలేదు." ఆ తరువాత కొంటె నవ్వుతో మిణుకు మిణుకుమనే కళ్ళతో పెర్షింగ్ ఇలా అన్నాడు "నీవేమీ అనుకోకపోతే, నీకొక చిన్న సలహా ఇస్తాను ఈ విధంగా సెకండ్ లెఫ్టినెంట్ దగ్గరమాత్రం ఎప్పుడూ చేయవద్దు!"

— 'ఇన్‌స్పిరేషనల్ కోట్' సౌజన్యంతో

# అది సుందరవదనం



నాకొక మనోహరమైన ముఖం తెలుసు సౌందర్య ప్రపూర్ణం, కృపాకటాక్షశోభితం - అది శాంతమైన ముఖం, నిత్య ప్రకాశితం గాఢాంధకారంలో వెలుగును విరజిమ్మేది అది ఉల్లాస పూరిత వదనం దాన్ని వీక్షించిన నేను నిజంగా అదృష్ట బాలికను ఇతరుల వలనే నాకూ సంతోష కారణం అది ఆ అందమైన ముఖం మా అమ్మదే'

— ఉమేష్ భాటియా

— 'యోగా అండ్ టోటల్ హెల్త్' సౌజన్యంతో

# తన కోపమే తన శత్రువు

ఒకానొకప్పుడు ఇంగ్లండ్‌లోని ఒక చిన్న గ్రామంలో ఒక వడ్రంగి, అతని భార్య నివసిస్తూండేవారు. ఒక రోజు భర్త కోసం చేసిన గంజిలో ఉప్పు వేయటం ఆమె మర్చిపోయింది. వడ్రంగి కసరగా ఇంత చిన్న విషయానికి గడబిడ చేసే మూర్ఖుడివని ఆమె ప్రత్యుత్తరమిచ్చింది.

ఇది వడ్రంగికి కోపకారణం కాగా పనిలోకి వెళ్ళి ఒక చెట్టును అధిక క్రోధంతో నరక సాగాడు. ఆ ఊపులో గొడ్డలి పిడి ఊడి చాలా దూరంవెళ్ళి అతని యజమాని యొక్క అభిమాన అశ్వాన్ని గాయపరచింది.

వడ్రంగిపట్ల యజమాని ఎంతో కోపంగా ఉన్నాడు. అలాగే వడ్రంగి కూడా క్రోధావేశంలో ఉండటంతో ఇరువురూ ఒకరినొకరు దూషించుకున్నారు.

రాజుకి వ్యతిరేకంగా తాము చేయదలచుకున్న ఫిర్యాదులను గురించి చర్చించేందుకు ఏర్పాటైన గొప్ప కులీనుల సమావేశంలో పాల్గొనేందుకు ఈ కులీనుడ్లో ఆ గుఱ్ఱం అదేరోజు తీసుకు వెళ్ళవలసి ఉంది.

అందువల్ల క్రోధావస్థలోనే వడ్రంగి యొక్క యజమాని ఆ సమావేశంలో పాల్గొన్నాడు. అనివార్యమైన కోపం కారణంగా తన సహచరుల్ని తిరుగుబాటు చేయమని గట్టిగా సలహా ఇచ్చాడు.

త్వరలోనే రక్తం చిందించే విధంగా తిరుగుబాటు జరిగింది. కత్తికి, కరవుకు చాలామంది బలి అయ్యారు. తిరుగుబాటు అణచివేయబడింది. ఎంతోమంది కులీనులకు రాజు మరణ శిక్ష విధించాడు.

ఆ తరువాత కొన్ని తరాల వరకు ప్రజలు అత్యధిక పన్నులభారం మోయవలసి వచ్చింది. తిరుగుబాటుకు పూర్వం ఉన్న స్వల్ప స్వేచ్ఛని కూడా అధికారవర్గం తీసివేసింది.

—'ఎ సోర్స్ బుక్ ఆఫ్ ఇన్‌స్పిరేషన్' సౌజన్యంతో

## కంటి చూపుకు సెలినియం ఆవశ్యకం



Eagle

మంచి కంటి చూపుకు అవసరమైన అణు లవణం (Selinium) కూరగాయలు, పండ్లు, ఆకులు ఎన్నో తాజా కాయలలో సమృద్ధిగా లభిస్తుంది. ప్రపంచంలోని కొన్ని ప్రాంతాలలో నివసించే ప్రజలు సమృద్ధిగా సెలినియం ఉన్న ఆహారాన్ని తీసుకుంటారు. బహుశా దీనివల్లనే వారు కళ్ళవ్యాధులు భరించరు. దాదాపు 7 మైక్రోగ్రాముల సెలినియం మానవ నేత్రాలలో ఉంటుంది. సునిశిత దృష్టికి పేరొందిన రాబందుల కళ్ళలో 780 మైక్రోగ్రాముల సెలినియం ఉంటుంది.

# అవార్డులు

## జాతీయ కుటుంబ సంక్షేమ అవార్డు

వ్యవస్థీకృతరంగంలో కుటుంబ నియంత్రణ కార్యక్రమాలలో అగ్రగామిగా నిల్చి కార్యకలాపాలు నిర్వహించినందుకు "టాటా స్టీల్స్ సెంటర్ ఫర్ ఫామిలీ ఇన్షియేటివ్స్"కు జాతీయ కుటుంబ సంక్షేమ అవార్డు లభించింది

## లియో టాల్‌స్టాయ్ అంతర్జాతీయ పురస్కారం



MOTHER TERESA

నోబెల్ బహుమతి గ్రహీత మదర్ థెరసాను 1992 లియో టాల్‌స్టాయ్ ఇంటర్నేషనల్ అవార్డుతో సత్కరించారు ప్రపంచవ్యాప్తంగా శిశుసంరక్షణ కోసం ఆమె చేసిన అవిరళ కృషికి ఇచ్చిన ఈ అవార్డును రష్యన్ చిల్డ్రన్స్ ఫెడరేషన్ నెలకొల్పింది

## భారతీయ జ్ఞానపీఠం పురస్కారం

సుప్రసిద్ధ సాహిత్యవేత్త నరేష్ మెహతాకు 1992 సంవత్సరానికి ప్రతిష్ఠాత్మకమైన భారతీయ జ్ఞానపీఠ్ అవార్డ్ లభించింది వర్తమానకాలంలో హిందీ భాషలో ఉత్తమశ్రేణికి చెందిన ఏడుగురు కవులలో అయన కూడా ఒకరుగా గుర్తించబడ్డారు

## బాల్జి పెండార్కర్‌కు ఫాల్కే అవార్డు

భారత చలనచిత్ర పరిశ్రమకు చేసిన అద్వితీయ సేవలకుగాను ప్రతిష్ఠాత్మకమైన దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు బాల్జి పెండార్కర్‌కు లభించింది అయన చలనచిత్ర నిర్మాణ జీవిత గమనం 60 సంవత్సరాలకు పైగా సాగుతున్నది

## ప్రథమ వాచస్పతి పురస్కారం

కెకె బిర్లా ఫౌండేషన్ నెలకొల్పిన - సంస్కృతంలో ప్రథమ వాచస్పతి పురస్కారం జమ్మూకు చెందిన గొప్పపండితుడు, మహావిద్వాంసుడు అయిన డాక్టర్ జగన్నాథ్ పథక్‌కు - ఆయన అపూర్వసృష్టి 'మృద్వీక'కు లభించింది

## తొమ్మిదవ మూర్తీదేవి అవార్డు

'యజ్ఞసేని' అనే అపూర్వ నవల వ్రాసినందుకు సుప్రసిద్ధ ఒరియా రచయిత్రి డాక్టర్ ప్రతిభా రాయ్‌కి తొమ్మిదవ మూర్తీదేవి అవార్డు బహూకరించారు

# తెలియని విషయాలు

## ప్రెసిడెంట్‌గా బ్రహ్మచారి

**యునైటెడ్ స్టేట్స్‌కు ఇంతవరకూ ఒక బ్రహ్మచారే అధ్యక్షుడయ్యాడు అతడే జేమ్స్ బుఖానన్ *(1857-1861)* అమెరికా 15వ అధ్యక్షుడు**

# ఆసియాలో ఎత్తైన ఆనకట్ట

1963 అక్టోబర్ 22న - 29 సంవత్సరాల బ్రహ్మాండమైన భాక్రాడాం (పంజాబ్)ను పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ జాతికి అంకితం చేశారు. సిక్కుల ఆదరాభిమానాలు గడించిన గురువు, గోవింద్‌సింగ్ పేరిట గోవింద్ సాగర్ సరస్సు నిర్మించి సట్లెజ్ నది యొక్క కల్లోలిత జలాలను దానిలో భద్రపర్చారు.


BHAKRA DAM

225 మీటర్ల (740 అడుగుల) ఎత్తుగల ఈ ఆనకట్ట ఆసియాలోనే ఎత్తైన, తిన్ననైన, వంపులేని, గురుత్వ నిర్మితమైన ఆనకట్ట. ఇది ఎత్తులో ఢిల్లీ లోని మెహరౌలీ వద్దనున్న కుతుబ్‌మినార్ కన్నా మూడు రెట్లు ఎక్కువగా ఉంటుంది. పరిమాణంలో దాని బ్రహ్మాండమైన మట్టి కొలతల మధ్య 1 00,000 గదులు గల ఒక 60 అంతస్తుల ఆకాశ హర్మ్యాన్ని కట్టవచ్చు. ఈ నిర్మాణానికి ఉపయోగించిన కాంక్రీట్ (సిమెంట్, ఇసుకల మిశ్రమం) పరిమాణం భూమధ్యరేఖ దగ్గర - భూమి చుట్టూ 8 అడుగుల వెడల్పు గల రోడ్డును నిర్మించడానికి సరిపోతుంది.

ఈ భాక్రా ఆనకట్ట 13,000 మంది కార్మికులు, 300 మంది ఇంజనీర్లు, 30 మంది విదేశీ నిపుణుల చేత నిర్మించబడింది. గోవిందసాగర్ స్టోరేజి రిజర్వాయర్ నుండి వెలువడే నీటివల్ల పంజాబ్, హర్యానా, రాజస్థాన్ రాష్ట్రాలలోని 26 7 లక్షల హెక్టార్ల భూమి సేద్యం చేయబడుతున్నది. జలవిద్యుత్ ఉత్పత్తికి కూడా ఉపయోగించబడుతున్నది. ●

## ఒకటే లోటు

ఉద్యోగం కోసం దరఖాస్తు పెట్టిన అభ్యర్థిని యజమాని ప్రశ్నించాడు.

'తాగుతావా?'

'లేదండీ'' యువకుని జవాబు.

''పొగ త్రాగుతావా?''

''లేదండీ''

చమత్కార ధోరణిలో యజమాని మాట్లాడటం కొనసాగిస్తూ ''అంటే నీవు వినోద కాలక్షేపం ఆడపిల్లల వెంటపడటం - అవునా?'' అని ప్రశ్నించాడు. కాదని తల త్రిప్పాడు యువకుడు.



''అంటే అర్థం, నీకు ఒక్కటైనా దురలవాటు లేదనేనా?''

''అవునండీ! నాకున్నదండీ'' ఆ యువకుడు ఒప్పుకున్నాడు ఉల్లాసంగా.

''నేను అబద్ధాలు చెబుతానండీ''

— 'ఇన్‌స్పిరేషనల్ కోట్' సౌజన్యంతో

[illegible]

# మన నగరాలు

## జంషెడ్పూర్

దక్షిణ బీహార్‌లోని ఉక్కునగరం - జంషెడ్పూర్ భారతదేశపు పారిశ్రామిక పథ నిర్ణేత జంషెడ్జీ నుస్సర్వాంజీ టాటాకు సజీవ స్మారక చిహ్నంగా నిలుస్తుంది. 20వ శతాబ్ది తొలిదశలో రెండు నదుల మధ్య ఉన్న అటవీ ప్రాంతం 'సాక్చి' (Sakchi) జంషెడ్పూర్ పేర ఒక పెద్ద ఉక్కు నగరంగా అభివృద్ధి చెందింది.



Steel Plant, Jamshedpur

1907 డిసెంబర్‌లో సువర్ణరేఖ మరియు ఖర్కై నదులు సంగమించే చోట సి.ఎం. వెల్డ్, దొరబ్ టాటాలు షికారు (వాహ్యాళి) చేస్తున్నప్పుడు వారికి ఉక్కుకర్మాగారం నెలకొల్పేందుకు అనువైన స్థలం కనిపించింది.

జె.ఎన్. టాటా నిర్విరామకృషి ఫలితంగా 1907లో టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ రిజిష్టరయింది. 'సాక్చి' అనే ఒక మారుమూల గ్రామంలో 1908లో ఉక్కు కర్మాగారం తొలిదశ ప్రారంభమైంది. 1911లో మొట్టమొదటి ముడి (దుక్క) ఇనుము ఉత్పత్తి జరిగింది. 1912 లో మొదటి ఉక్కు కడ్డీ తయారయింది. నేడు ప్రపంచంలో అత్యధికంగా ఉక్కు ఉత్పత్తి చేస్తున్న సంస్థల్లో టాటా స్టీల్ ప్లాంట్ ఒకటి.

టాటా ఉక్కు కర్మాగారం దాదాపు 24 చ.కి.మీ.ల మేరకు విస్తరించి ఉంది. తగరపు రేకులు, వ్యవసాయ పరికరాలు, కేబుల్స్, మోటారు వాహనాల భాగాలు వంటి ఎన్నో ఇతర పరిశ్రమలు ఈ నగరం చుట్టూ నెలకొల్పబడి విజయవంతంగా నడుస్తున్నాయి. వీటన్నిటికీ హృదయం వంటిది - టాటా స్టీల్.

65 చ.కి.మీ.ల విస్తీర్ణం గల జంషెడ్పూర్‌లో దాదాపు 500,000 మంది జనాభా ఉన్నారు. హౌరా - బొంబాయి మార్గంలోని టాటా [illegible] కలిపే రైల్వేస్టేషన్ సర్వసమ్మతమైన [illegible] విశ్వజనీన నగరం కనుక ఇక్కడ ఇండియాలోని ప్రతిమూల నుండీ వచ్చిన ప్రజలను, వివిధ భాషలు మాట్లాడేవారిని చూడవచ్చు.

# అంతరిక్షంలో

## హ్యాపీ బర్త్‌డే!

*1969 మార్చి 8వ తేదీన అపోలో IX లోని వ్యోమగాములు అంతరిక్షంలో [illegible] - హ్యాపీ బర్త్‌డే టు యూ గానం చేశారు.*

## త్వరిత వేగంగల చంద్రుడు

*బృహస్పతికి చెందిన 1979 జెజిప్ (J?) అనే కొత్త, చిన్న చంద్రుడు ఆ గ్రహం చుట్టూ కేవలం 7 గంటల వ్యవధిలో భ్రమణం పూర్తి చేస్తుంది. ఈ చంద్రమామ వేగం (సౌర వ్యవస్థలోనే అత్యంత వేగవంతం) - దాదాపు గంటకు 1,13,330 కి.మీ.లు. ఇది దాదాపు 20 నిమిషాలలో భూభ్రమణం చేసే వేగంగా ఉంది!*

"మోకాళ్ళపై నుంచే పెద్ద మనిషికంటే పాదాలపై నిలిచే వ్యవసాయదారుడు శ్రేష్ఠుడు"
— బెంజమిన్ ఫ్రాంక్లిన్

తన సిబ్బంది, వారి కుటుంబాల కోసం టాటా స్టీల్ కంపెనీ ఒక సంపూర్ణ నూతన నగరం నిర్మించింది. అన్ని ఆధునిక సౌకర్యాలు గల వసతి భవనాలు, పరిశుభ్రమైన పబ్లిక్ మార్కెట్లు, కంకరరాయి పరచిన చక్కని రోడ్లు,



Jamsetji Tata

పార్కులు, స్వచ్ఛమైన నీరు, అనేక భాషలు బోధించే అధ్యాపకులతో పాఠశాలలు, ఆస్పత్రులు మరియు ఒక ఆధునిక వాడి కేంద్రం ఇక్కడ ఉన్నాయి. నగరంలో మనోహరమైన ప్రాంతాలలో ఒకటి - బిష్టుపూర్




inside steel plant

జంషెడ్‌పూర్‌లో లభించే అనేక సౌకర్యాలలో దేశంలో ఉత్తమ వైద్యశాలలతో పోల్చదగినట్టి టాటా మెయిన్ హాస్పిటల్ ఒకటి. ఇచటి జేవియర్ లేబర్ రిలేషన్స్ ఇన్‌స్టిట్యూట్ - దేశంలోని ప్రథమస్థానంలోని మేనేజ్‌మెంట్ ఇన్‌స్టిట్యూట్‌గా గుర్తించబడింది. ఇక్కడి నేషనల్ మెటలర్జికల్ లేబొరేటరీ మౌలికం మరియు అనువర్తిత లోహ సంగ్రహణ శాస్త్ర పరిశోధన ప్రయోగాలను, ప్రాంతీయ పరిశోధన కేంద్రాలను నిర్వహిస్తుంది. స్వాతంత్ర్యానంతరం ఇండియా సాధించిన విజయాలలో ఈ పట్టణం కూడా ఒకటిగా లెక్కించబడుతున్నది. ఇండియాకు చెందిన ఏకైక ఫుట్‌బాల్ అకాడమి ఇక్కడనే

## వాటికన్ సిటీలో 1,000 మంది నివాసులు




*1929 ఫిబ్రవరి 11న ఇటలీలోని రోమ్ నగర అంతర్భాగంలో దేశంలోని ప్రత్యేక ప్రాంతంగా వాటికన్ సిటీ స్టేట్ రూపొందింది. ఈ నగర ప్రభుత్వం 44 హెక్టార్ల విస్తీర్ణం కలిగి ఉంది. 1932 నవంబర్‌లో స్వంత రైల్వేస్టేషన్ తెరువబడింది. ఇక్కడ తపాలా సౌకర్యాలు, నాణాలు, రేడియో కూడా సమకూర్చారు. వాటికన్ సిటీ, ఇటలీలోని ట్రాన్స్‌మిటర్ల నుండి 31 భాషలలో వాటికన్ రేడియో కేంద్రం విస్తృత ప్రసారాలు చేస్తున్నది. వాటికన్ సిటీలో 1,000 మంది నివాసులుగా ఉన్నారు.*

విహారయాత్రికులు దర్శించే అనేక ప్రదేశాలలో 300 ఎకరాలకు పైగా విస్తరించిన జూబిలీ పార్క్




కూడా ఉంటుంది 1958లో టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ స్వర్ణోత్సవ సందర్భంలో ఈ ఉద్యానవనాన్ని జంషెడ్పూర్ పౌరులకు కానుకగా సమర్పించారు దిమ్నా సరస్సు, రివర్స్‌మీట్, దాల్మా పర్వతశ్రేణి చూడదగిన ఇతర ప్రదేశాలు



దాదాపు 30,000 మంది ప్రేక్షకులు కూర్చునే సౌకర్యం ఉన్న ఆధునిక క్రికెట్ స్టేడియం కూడా ఉంది

పొడవైన గడ్డంతో, ఒక క్రైస్తవ మత గురువువలె కనిపించే ఉక్కు కర్మాగార స్థాపకుడు జంషెడ్జీ నుస్సర్వాంజీ టాటా మనుమడైన జె.ఆర్.డి టాటా, ఆయన సహచరులు ప్రస్తుతం ఉక్కు నగరం లోని ఉక్కు కర్మాగారాన్ని ఇతర టాటా వాణిజ్య సంస్థలను అజమాయిషీ చేస్తున్నారు ఎన్నో బహూకృతులు, గౌరవ పురస్కారాలు జెఆర్‌డి టాటాను అలంకరించాయి స్వాతంత్ర్య సమరంలో క్రియాశీలకపాత్ర నిర్వహించిన పారిశ్రామిక రంగంలోని వ్యక్తులలో ఆయన ఒకరు

## వేకువకు సంతోషపూర్వక స్వాగతం



రోజును స్నేహపూర్వకంగా ప్రారంభించు
అప్పుడు స్నేహితుల్ని మాత్రమే నీవు పొందుతావు
అవును, వేకువకు ఆనందంతో స్వాగతమివ్వు
మేధలో సంతోషపు ఆలోచనలే నింపుకో
కాంతియుత భావాలతో రోజుకు నమస్కరించు
అప్పుడు నీమనస్సంతా కాంతితో నిండిపోతుంది
ఆనందపూర్ణమైన ఆత్మతో రోజును ప్రారంభించు
అప్పుడు సంతోషం, ఉల్లాసం నీలో భాగమవుతుంది

—ఫ్రాంక్ బి విటనే

ప్రాజ్ఞ మానవుణ్ణి - పటుత్వంగల శీలం, మృదుమనసం గల
దృఢమైన శరీరంగల మానవుణ్ణి విద్య తయారు
హాల్ — ప్లేటో

# హాస్యతోరణం

## కుడిఎడమైతే...

ఇండియా క్రికెట్ టీం గురించి మాట్లాడుతూ నాటి దేశీయాంగశాఖ మంత్రి సర్దార్‌పటేల్ వ్యాఖ్యానించాడు "వాళ్ళు రెండో ఇన్నింగ్స్ మొదట్లోనే ఎందుకు ఆడకూడదు? అలాచేస్తే వారు గెలుస్తారు'

## తీర్పు



ఆంగ్ల నాటకకర్త బెర్నార్డ్‌షా తన భార్యను ప్రశ్నించాడు "ప్రియతమా! స్త్రీల తీర్పు కంటే పురుషుల తీర్పు మేలుగా ఉంటుందనేది నిజమేనా?" షా సతి చిఱునవ్వుతో జవాబిచ్చింది "నిజమేకావచ్చు ప్రియతమా! ఎందుకంటే నువ్వు నన్ను, నేను నిన్ను వివాహం చేసుకున్నాం కదా"

## సలహా

ప్రతివాదితో న్యాయమూర్తి నీవు ఇంత నేర్పులేకుండా అబద్ధాలాడుతున్నావు కనుక ఒక న్యాయవాదిని ఏర్పాటుచేసుకోవలసిందిగా నేను సలహా ఇస్తున్నాను

## లక్షణం

తండ్రి "ఏదో ఒకనాడు వాడు గొప్ప రాజనీతివేత్త అవుతాడు"
తల్లి మీరు నిజంగానే అంటున్నారా?
తండ్రి నిస్సందేహంగా చెబుతున్నాను ప్రతి సమస్యను ఎంత సులభంగా పరిష్కరిస్తున్నాడో చూడు!

## మారినవ్యక్తి

"నాన్నా! రాజకీయాల్లో దేశద్రోహి అంటే ఎవరు?"
"మన పార్టీని విడిచిపెట్టి అవతల పార్టీలో చేరినవ్యక్తి- దేశద్రోహి"
"సరే! ఒకవేళ ఒకవ్యక్తి తనపార్టీని వదిలిపెట్టి మనపార్టీలోకి వస్తే?"
"పుత్రా! అప్పుడు అతణ్ణి (అన్యమతానికి) "మారినవ్యక్తి" అని పిలుస్తాము"

## సాఫల్యం

న్యాయవాది "నేను బాలునిగా ఉన్నప్పుడు నా ఉన్నతమైన ఇచ్ఛ (లేక ఆశ)- సముద్రపు దొంగకావటం"
కక్షిదారు మీరు అదృష్టవంతులు తన బాల్యంలోని కలలు సఫలం చేసుకోవటం ప్రతివారికీ సాధ్యంకాదు కదా!

— 'పార్థ' సౌజన్యంతో ●

## ఆధునిక బాబిలోన్

యునైటెడ్ కింగ్‌డమ్ రాజధాని లండన్ ఆధునిక బాబిలోన్ అని పిలువబడుతున్నది

'మనదృష్టానికి [illegible] తెలివితే [illegible] గా
విరగబడి నవ్వుతారు'

— [illegible]

ఉంటుంది ఈ కారణంగానే నేను మిక్కిలి ఉత్సాహవంతుడైన వాని కంటే ఒక ముందు జాగ్రత్త గల మిత్రుడికే ప్రాధాన్యం ఇస్తాను

— జోసెఫ్ అడిసన్

## నేరుగా అందిన ఆదేశాలివి!

దశ ఆదేశాలు (టెన్ కమాండ్మెంట్స్) హ్రస్వంగా, తేటగా ఉండటానికి కారణం అవి అనేక సంఘాల ద్వారా కాకుండా నేరుగా అందించటం వల్ల!

## అభిప్రాయాల కొనుగోలు

జన సామాన్యం పాలను కొనుక్కుంటున్నట్లే, అభిప్రాయాలను కూడా కొనుక్కుంటారు ఒక ఆవును పెంచటం కంటే ఇది చౌక అనే సూత్రం మీద ఇలా జరుగుతుంది నిజమే కావచ్చు కానీ ఈ పాలలో నీళ్ళు కలవటం మాత్రం తప్పనిసరి

— శామ్యూల్ బట్లర్

## ఒక్క బంతి కోసం ఇంత పోట్లాటా?

స్వతంత్రం వచ్చి 46 సంవత్సరాలయిన తరువాత కూడా 22 మంది ఆటగాళ్ళు ఒక ఫుట్బాల్ కోసం ఎందుకిలా కొట్లాడుకుంటున్నారని ఆశ్చర్యం వెలిబుచ్చాడు - ఒక ఫుట్బాల్ పోటీ ఫైనల్ ఆట చూసిన తరువాత ఒక రాజకీయ నాయకుడు వెంటనే ప్రతి ఒక్క ఆటగానికి ఒక ఫుట్బాల్ (కాలి బంతిని) కొని ఇవ్వేందుకు అనుమతి జారీ చేశాడు!

## ఈ ప్రశ్నకు బదులేది!

ఈస్ట్ ఇండియా ట్రేడింగ్ కంపెనీ తరఫున రాండిల్ జాక్సన్ అనే వక్త న్యాయస్థానంలో వాదిస్తున్నాడు అతనికి న్యాయశాస్త్రం ఎక్కువగా తెలియదు కేవలం తన వాగ్ధాటితోనే కేసు గెలవాలని ప్రయత్నిస్తున్నాడు అతడు ఇలా మొదలుపెట్టాడు "మైలార్డ్స్, ప్రకృతి అనే గ్రంథంలో ఇలా వ్రాయబడింది" ఇంతలో అతని వాగ్ధాటికి ప్రధాన న్యాయమూర్తి లార్డ్ ఎలెన్బరో అడ్డుపడి ప్రశ్నించాడు, "మీరు దయతో అది ఏ పేజీలో వ్రాయబడిందో సూచించగలరా?"

## ఎప్పుడూ పారిపోవద్దు, నిల్చి ఎదిరించు

ప్రమాదాన్ని సూచించే బెదిరింపులకు వణికి ఏ వ్యక్తీ వెనుదిరిగిపోకూడదు ఆ బెదిరింపులకు భయపడి పారిపోకూడదు ఆ విధంగా చేసినట్లయితే ఆ అపాయాన్ని రెండింతలు చేస్తున్నావన్నమాట దాన్ని నీవు సకాలంలో ఎదుర్కొని, జంకి వెనుదీయకుండా ఉన్నట్లయితే అపాయం సగానికి సగం తగ్గిపోతుంది దేని నుంచీ ఎప్పుడూ పారిపోవద్దు

— విన్స్టన్ చర్చిల్

## పిడికిలి

అఱచేతిని పిడికిలిగా బిగించినట్లయితే ఆ చేయి వస్తు ఉంటుంది పిడికిలి వల్ల నీవు దేనినీ తీసుకోలేవు, ఇవ్వలేవు, పట్టుకోలేవు

— స్వామీ చిన్మయానంద

## ఉపాధి కల్పనకు కోట నిర్మాణం

ఐర్లండులో బల్లీమనన్ ఎస్టేట్ నిర్మించిన వార్ట్ టౌన్ కాజిల్ (దుర్గం) - ఆకలితో బాధపడుతున్న ప్రజలకు ఉపాధి కల్పించటం కోసం నిర్మించబడింది ఈ భవనం 108 రోజుల్లో పూర్తయింది ప్రతి కార్మికునికి రోజుకు 12 పెన్నీలు ఇచ్చారు!

"[illegible]"

[illegible]

# మానసిక సమర్థతకు ఏడు మార్గాలు

డాక్టర్ క్లైవ్ డి. హర్లీ

ప్రతి పందమందిలో దాదాపు నలుగురు మాత్రమే అత్యంత సూక్ష్మబుద్ధి గలవారుగా ఉంటారు ప్రథమశ్రేణికి చెందిన మేధాశక్తి గల సహజబుద్ధి కుశలురు వీరు ఏ వృత్తిలోనైనా వీరు అత్యున్నత స్థానానికి చేరుకుంటారు



ఇక కొలబద్దకు ఈ చివర - అతితక్కువ తెలివితేటలు గలవారు కూడా ఇదే శాతంలో ఉంటారు వీరు దాదాపు విద్యావిహీనులే ఈ రెండు చివరలకు మధ్య మనలో చాలామందిమి ఉంటాము మన తెలివితేటల్ని మనం పెంపొందించుకోలేము కాని దాని నిర్వహణ శక్తిని తప్పకుండా అభివృద్ధి చేసుకోగలం

మన మానసిక సామర్థ్యాన్ని పెంపొందించుకోవటం సాధ్యమే దీనికి ఏడు మార్గాలు ఉన్నాయి

1 మంచి రచయితల పుస్తకాలను చదవాలి అంటే అర్థం ఉత్కంఠ రేకెత్తించి, పులకరింతలు కలిగించే (గగుర్పాటు) వాటిని చదవమని కాదు మీలో ఆలోచనలను పురికొల్పే పుస్తకాలు చదవాలి జీవితంలోని సూక్ష్మమైన అంశాలను సున్నితంగా ఎరిగిన రచయితల పుస్తకాలు, భాషమీద చక్కని ఆధిపత్యం గల రచయితల పుస్తకాలు చదవాలి శరీరానికి వ్యాయామం మాదిరిగానే మేధకు పఠనం అవసరం ఇది వాస్తవం కావాలంటే మన మేధను వికసింపచేసి, సుసంపన్నం చేసే వాటిని చదవాలి

2 మీ పరిశీలనా శక్తిని అభివృద్ధి చేసుకోండి కళ్ళున్నా చూడలేమనేమాట మనలో చాలామందికి వర్తిస్తుంది సమర్థవంతంగా చూడలేకపోవటం ద్వారా మనం జీవితంలోని సౌందర్యాన్ని వైచిత్రినీ కోల్పోతున్నాము మనం చక్కగా పరిశీలన కొనసాగిస్తే మనమేధకు సరైనపని కల్పిస్తున్నామని చెప్పవచ్చు గొప్ప శాస్త్రవేత్తలు, చింతనాపరులు అత్యంత సన్నిహితంగా పరిశీలించటం ద్వారా ఎన్నో నేర్చుకున్నారు

3. ఆలోచించడం నేర్చుకోండి మనం సహజంగా సోమరులం నీటి వలెనే ప్రతిబంధం లేని మార్గం అనుసరిస్తాము ఆలోచనల రైలు బండిని - అగ్ని కణాలతో ప్రజ్వలింపచేసేందుకు

## ప్రపంచంలో ప్రథమ ఫౌంటెన్ పెన్ నిర్మాత

అమెరికాకు చెందిన లూయీ ఎడ్సన్ వాటర్‌మాన్ ప్రపంచంలోని మొదటి ఫౌంటెన్ పెన్ సృష్టికర్త 1884 లో ఒక ఇన్సూరెన్స్ సేల్స్‌మన్ అయిన వాటర్‌మాన్ సిరాని ఫిల్లర్‌తో కలంలో నింపే విధంగా రూపొందించాడు తరువాత ఒక వ్యాపార సంస్థ స్థాపించి తన సేఫ్టీపెన్ ఉత్పత్తికి నాంది పలికాడు తన కలానికి ప్రచారం కోసం 'పెన్ ప్రాఫెట్' (Pen Prophet) అనే పత్రిక ప్రచురించాడు

"పరుల ప్రయోజనాన్ని ప్రథమ స్థానంలో పెట్టే మాట - మంచి మాట"
— హెన్రి డేవిడ్ థోరో

మిమ్మల్ని మీరే ప్రశ్నించుకోండి ఒక కథనం విన్నప్పుడు మిమ్మల్ని మీరే ప్రశ్నించుకోండి
ఇది నిజమేనా ? దీనికి మూలం ఎక్కడ ఉంది? ఇంతకు ముందు ఇలా జరిగిందా? ప్రస్తుత పరిస్థితులేమిటి? వగైరా ప్రశ్నలు

ఆసక్తి కలిగి ఉండండి మనం ఆసక్తిని కోల్పోయినట్లయితే మానసిక క్షీణతవైపు అడుగు వేస్తున్నామని అర్థం మీ సహజ సిద్ధమైన ఆసక్తిని అణచి వేయకండి ప్రశ్నించేందుకు భయపడకండి దీనివల్ల మీ తెలివితేటలు అభివృద్ధి పొంది మీ మేధను పదునుగా, అప్రమత్తంగా ఉంచుతుంది

5 మీ జ్ఞాపక శక్తిని అభివృద్ధి చేసుకోండి సాధారణమైన తెలివితేటలు కలిగిన ఎవరైనా సరైనవారిలో సాగిపోతే దీన్ని సాధించుకోవచ్చు. ఫొటోగ్రఫిక్ జ్ఞాపకశక్తి అనేదేదీ లేదు తమ జ్ఞాపక శక్తితో మనల్ని విభ్రాంతి పరిచే వ్యక్తులు కొన్ని సూత్రాలను ఆచరిస్తారు

ఎ) మీరు గుర్తు పెట్టుకోదలచిన దానిలో శ్రద్ధ చూపించండి

బి) జ్ఞప్తిని కోరుకోండి

సి) మీ జ్ఞాపక శక్తిని నమ్ముకోండి "నేను గుర్తుంచుకున్నట్లయితే" అని చెప్పవద్దు 'నేను గుర్తుంచుకుంటాను" అని చెప్పండి

డి) మరల చెప్పడం, మరల చేయటం - ఉత్తమ మార్గం ఇది మరల జ్ఞప్తికి తెచ్చుకునేందుకు సహాయపడుతుంది

ఇ) మీరు గుర్తుంచుకోవాలనుకున్న విషయాన్ని అర్థం చేసుకోండి

ఎఫ్) మీ మెదడులో సభలు ఏర్పాటు చేసుకోండి మీరు గుర్తించుకోదలచిన విషయాన్ని అంతకు ముందే మీ అనుభవంలో భాగంగా ఉన్నదానితో అనుసంధానం చేసుకోండి దీనికి ఊహ, బుద్ధి సూక్ష్మత ఉపయోగించాలి మీరు గుర్తుపెట్టుకోవలసినది గజిబిజిగా ఉంటే మరీ మంచిది ఇటువంటి సంఘటనలు తేలిగ్గా గుర్తుపెట్టుకో తగినట్లుగా ఉంటాయి

6 ఇచ్చి పుచ్చుకునేందుకు సిద్ధంగా ఉండండి మనం ఎవరినుంచైనా నేర్చుకునేందుకు సిద్ధంగా ఉండాలి - వారి వయస్సు, అంతస్తు, లింగభేదం, వంశం, మతం ఏదైనా సత్యానికి గుత్తాధిపత్యం మన వశంలో లేదు మనకు ఒక్కోసారి

## మూడు నిధులు



నావద్ద మూడు నిధి నిక్షేపాలు ఉన్నాయి
అవి కాపాడి, రక్షించుకోవలసినవి -
మొదటి నిధి ప్రేమ,
రెండవది అధికంగా ఏదీ చేయకపోవటం,
మూడవది ప్రపంచంలో ప్రథమస్థానం కోసం
ప్రాకులాడకపోవడం
ప్రేమ ద్వారా ఎవరికీ భయం కలగదు
అధికంగా (పని) చేయకపోవటం ద్వారా
శక్తిని నిల్వ చేసుకునే వైఖరి రూపొందుతుంది
ప్రపంచంలో మొదటి స్థానంలో ఉన్నామనే తలంపు
విడనాడితే, ప్రతివారూ తమ సామర్థ్యాన్ని
పెంపొందించుకుని, పరిపూర్ణత సిద్ధించుకోవచ్చు

సరైన సమాచారం లభించకపోవచ్చు. లేదా ఉద్వేగాలతో, ఈర్ష్యతో సరైన అవగాహన లేక పోవచ్చు. కనుక మనం ఇతరుల అభిప్రాయాలను జాగ్రత్తగా పరిశీలించేందుకు సిద్ధంగా ఉండాలి ఎమర్సన్ చెబుతుండేవాడు "నేను కలుసుకున్న ప్రతివ్యక్తీ ఏదో విధంగా నాకంటే అధికుడే"

7 మీ ఏకాగ్రతను అభివృద్ధి చేసుకోండి మీరు ఒక కన్ను టెలివిజన్ పైనా, మరో చెవి రేడియోకార్యక్రమం మీద పెట్టుకుంటే ఏకాగ్రత అలవర్చుకోవటం దుస్సాధ్యమైన పని వెలుపలి నుంచి ధ్యానభంగాలు వీలైనంత తక్కువగా చేసుకోవాలి

ఏకాగ్రతకు మరో సహాయకారి- ఆపని చేసి తీరాలనే దృఢనిశ్చయం ఒకేసారి రెండు పనులు మీద దృష్టి నిలిపే ప్రయత్నం తిరస్కరించటం చివరిగా ఏపనైనా శ్రద్ధతో పూనుకోవాలి మనం ఒక ఆకర్షించే పుస్తకంలో లీనమైపోయినప్పుడు మనం బయటి ప్రపంచాన్ని మర్చిపోతాము వేరే ఏకాగ్రత అవసరం ఉండదు

పని కష్టంగా లేదా విసుగ్గా ఉన్నప్పుడు దానిలో అభిలాష చూపటమనేది విసుగ్గానే కనిపిస్తుంది అటువంటి సందర్భాలలో దానిపై అభిలాష ప్రదర్శించి, విజయం సాధించేందుకు ఐదు నిమిషాల సేపు ఆపనిలో నుంచి బయటపడి "పగటి కలలు" కనండి।

మీ ముందున్న కష్టమైన, విసుగుగొల్పే అడ్డంకిని విజయవంతంగా దాటినట్లుగా ఈ సమయంలో మీలో మీరే మనోనేత్రంలో దర్శించండి ఈ పని ముగించినప్పుడు మీరు పొందే ఆనందాన్ని జ్ఞప్తికి తెచ్చుకోండి దీని వల్ల మీ ఉత్సాహం మళ్ళీ మేల్కొని, ఇనుమడించిన అభిలాషతో, వృద్ధి చెందిన ఏకాగ్రతతో అసలు సమస్య దగ్గరకు చేరుకుంటారు

**ఈ ఏడు అడుగులను అనుసరిస్తే - మీకు లభించిన మేధాశక్తులు ఉపయోగించుకోవటంలో అపజయం ఏర్పడదు.**

# బౌద్ధ కళా ప్రపూర్ణం - సాంచీ స్థూపం

**Sanchi Stupa**



మౌర్య వంశానికి చెందిన అశోక చక్రవర్తి (273-232 బి.సి) కాలం నుండీ మధ్యప్రదేశ్‌లోని భోపాల్ సమీపంలో ఉన్న సాంచీలో స్మారక స్థూపాలు ఉన్నాయి భారత దేశంలో తొలి బౌద్ధ కళలకు ఇవి వైభవోపేతమూ నిర్దిష్టమూ (ఉత్తమమూ) అయిన ఉదాహరణలుగా నిలిచాయి

సాంచీలోని పెద్ద స్థూపం - చిన్న చిన్న స్థూపాలతో గంభీరమైన నాలుగు ముఖద్వారాలతో అలరిస్తుంది ఈ ముఖ ద్వారాలు ఒకే పోలిక గల ఆకృతులతో ఉంటాయి వీటి నిర్మాణంలో ఉపయోగించిన సాంకేతిక నిపుణతను పరికిస్తే ఇది రాళ్ళ (శిల్పి) పనిచేసేవారి కంటే ఏనుగుల యొక్క పనితనమని తెలుస్తుంది। స్తంభాలతో, మేలైన కట్టడాలతో గౌతమ బుద్ధుని జీవితంలోని ఘట్టాలు, బౌద్ధ చరిత్రలోని ప్రధాన సంఘటనలతో ఇవి చిత్రితమై ఉంటాయి

"భార్య - మనిషిలో సగభాగం (అర్ధాంగి), ఉత్తమ మిత్రురాలు, కుటుంబం, దాని స్థిరత్వానికి మూలం, క్షే[illegible] (సుఖా[illegible]) [illegible] భారం"

# ఈ శతాబ్దంలో

## ప్రపంచంలో ప్రథమ మహిళా ప్రధాని

1960 జూలై 21న ప్రపంచంలో ప్రథమ మహిళా ప్రధానమంత్రిగా శ్రీమతి సిరిమావో బండారనాయకే నియమితులయ్యారు 1979 మే 4న బ్రిటన్ మొదటి మహిళా ప్రధానిగా శ్రీమతి మార్గరెట్ థాచర్ పదవిని స్వీకరించారు

## ఆఖరి వైస్రాయి




1947 మార్చి 22న ఇండియా విచ్చేసిన లార్డ్ లూయీ మౌంట్‌బాటన్ మార్చి 24న చివరి వైస్రాయిగా నియమితులయ్యారు

## గుఱ్ఱం మీద 10,000 మైళ్ళ ప్రయాణం

1925-27లో స్విట్జర్లాండ్‌కు చెందిన ఒక పాఠశాల ఉపాధ్యాయుడు గుఱ్ఱంపై బ్యూనోస్ ఎయిర్స్ (దక్షిణ అమెరికాలోని అర్జెంటీనా) నుంచి వాషింగ్టన్ డీ సి (యుఎస్ఎ)కి 10,000 మైళ్ళ దూరం పయనించాడు

## కింగ్స్ కమిషన్ ప్రదానం

భారత సైన్యంలో కింగ్స్ కమిషన్ - 1918లో భారతీయులకు ఇవ్వటం ప్రారంభించారు కింగ్స్ కమిషన్ పొందిన మొదటి బృందంలో ఫీల్డ్ మార్షల్ కె ఎం కరియప్ప కూడా ఉన్నారు

## 50 అడుగుల కొవ్వొత్తి

1971 మే 9వ తేదీన ఒరెగాన్ స్వీపోజ్ నమూనాలో 30వ యునైటెడ్ స్టేట్స్ హైవే (వహాదారి) వెంబడి వెస్టన్ కాండిల్ కంపెనీవారు 50 అడుగుల ఎత్తు, 18 అడుగుల వ్యాసం గల కొవ్వొత్తిని వెలిగించారు

## టెన్నిస్ పోటీ చూసిన అధిక సంఖ్యాక ప్రేక్షకులు



1954 డిసెంబర్ 27 న డేవిస్ కప్ ఫైన (టెన్నిస్ ) పోటీలు ఆస్ట్రేలియా, అమెరిక మధ్య సిడ్నీలోని వైట్ సిటీ స్టేడియం జరిగినప్పుడు రికార్డు సంఖ్యలో 25,5 మంది ప్రేక్షకులు తిలకించారు

# విస్డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక




ఈ సంచికలో

నవంబరు 1993




: చందా వివరాలు:

3 సంవత్సరాల చందా రూ.120/-

సంవత్సర చందా రూ. 42/-

ఎయిర్ మెయిల్ (1సం॥) రూ 200/-

సీ మెయిల్ (1సం॥) రూ 1(

చందా పంపవలసిన చిరునామా

రత్నా ఏజన్సీస్

9, దేశికారోడ్, ఆళ్వారుపేటప

మద్రాసు - 600 004

ఫోను : 4990327

-: ముఖచిత్రం: కలర్‌ట్రాన్సపరెన్సీ:-

వికీ హేండా


★ తెలుగు విస్‌డమ్‌కు ఇది 12 వ సంవత్సరం

# ధ్యానం

## ధార్మిక వ్యక్తి




ప్రాపంచిక జీవితానికీ, ధార్మిక జీవితానికీ మధ్య విలక్షణత ఉంది తనను ప్రతిదినం పురికొల్పే అపరిశుద్ధమైన ప్రేరేపణలను అనుసరిస్తూ, వాటి నుంచి వైదొలగి పోయేందుకు ఇచ్చగించని వ్యక్తి మతం పట్ల విశ్వాసం లేనివాడు కాగా, ఎవరైతే ప్రతిరోజు తనను ప్రేరేపించే అపరిశుద్ధమైన కోరికలను అదుపు చేసుకుని, శుద్ధి చేసు కుంటాడో అతడే ధార్మిక వ్యక్తి లేక ధర్మపరాయణుడు

తన మోహాలను, కోరికల పట్ల చనువును లేదా లాలసత్వాన్ని ధార్మిక వ్యక్తి లొంగ దీసుకోవాలి ఎందుకంటే అది మతంలో ఒక భాగం కనుక మనుష్యులను మరియు విషయాలను వాటి పరిధిలోనే వీక్షించటం అతడు నేర్చుకోవాలి వారి స్వభావాను సారంగా వారు జీవిస్తున్నారని అర్థం చేసు

(మిగతా 3 వ పేజీలో)

# సంపాదకుని పేజీ

## జ్ఞానమే శక్తి

జ్ఞానం శక్తివంతమైనదనేది స్పష్టమైన విషయం విశ్వవ్యాపితంగా ప్రతి దాన్ని అది జయించింది జ్ఞానం మన గమ్యస్థానానికి దారి చూపుతుంది దేశం అభివృద్ధికీ, అభ్యుదయానికీ జ్ఞానం అవశ్యకమైనది జ్ఞాన సంపన్నులకు జ్ఞాన విహీనులపై ఆధిక్యత ఉంటుంది

ఈ విధంగా మానవుడు జంతుజాలం కంటే అధికుడు ఇతర మృగాలు, ప్రాణులలా గాక మానవుడు జ్ఞానశక్తిని సొంతం చేసుకుని ఉంటాడు అతని అధికస్థాయిలోని తెలివితేటలు మరియు జ్ఞానం - అతణ్ణి అన్ని ప్రాణులపైన ముఖ్యాధికారిని చేసాయి అదేవిధంగా మరింత బుద్ధిసూక్ష్మత కల మనుష్యులు - తమతో భౌతికంగా సమానంగా ఉన్న జాతులపైన కూడా సహజంగానే ఆధిక్యతలో ఉండేవారు



తొలినాళ్ళలో విద్య భాగ్యవంతులకూ, ఉన్నత శ్రేణిలోని వారికి మాత్రమే ప్రత్యేక హక్కుగా ఉండేది రాజులు జ్ఞాన సంపన్నులనే విశ్వాసం ఉండేది "రాజు - భగవంతుడు" గా కొలవ బడటానికి ఇదొక కారణం. బ్రాహ్మణుల

"[illegible]"
—జగదీశ్ చంద్రబోస్

విషయంలో కూడా ఇంతే వారు జ్ఞాన సంపన్నులుగా భావించబడేవారు కనుకనే దేశాన్ని పరిపాలించారు

నేడు, విద్య విశ్వవ్యాప్తం అయింది. తమ పూర్వీకుల కంటే మనుష్యులు అనేక రీతులలో అధిక శక్తిగలవారుగా ఉండటానికి ఇదొక కారణం వీరు జ్ఞానంలో ముందంజ వేసినప్పటి నుంచీ, అధికారంలో కూడా ముందంజ వేయటం జరిగింది తమ జ్ఞానంతో ప్రజలు నేడు స్వయం పాలన చేసుకోగలుగుతున్నారు పురోహితులు, రాజులు మరియు ప్రత్యేక వర్గాలకు చెందిన కొందరు వ్యక్తుల క్రింద వీరు ఇక ఎంత మాత్రం పడి ఉండనక్కరలేదు

ప్రపంచంలోని ఇతర వర్ధమాన దేశాలతో పోల్చినప్పుడు మనదేశం విద్యలో, జ్ఞాన సముపార్జనలో అత్యంత వెనుకబడి ఉంది "ప్రతి ఒక్కరూ మరొకరికి బోధించండి" అనే విధానాన్ని అనుసరించి విద్యాబోధనను మరింత ప్రోత్సహించటం జరిగితే, మనం విద్యను ప్రజా బాహుళ్యం లోకి విస్తృతంగా వ్యాపింపచేయవచ్చు. మనదేశం జ్ఞానంలో మరింత అభివృద్ధి చెందినట్లయితే, అప్పుడు మరే ఇతర దేశం మనపై అధికారం చెలాయించలేదు జ్ఞానమే బలవత్తరమైనది, అదే ఒక వర్ధమాన దేశానికి ఏకైక పరిష్కారం మరియు చికిత్స కూడా

( 2 వ పేజీ తరువాయి)

కోవాలి అతడు తన జీవితపు నియమాలను వారిపై ఎన్నడూ రుద్ద కూడదు; వారికంటే "ఉన్నత శ్రేణి"లో తాను ఉన్నానని ఎన్నడూ ఊహించుకోకూడదు లేదా కనీసం అలా భావించకూడదు కూడా

## అదీ అసలు విషయం


ARTHUR CONAN DOYLE

ఒక ఫ్రెంచి టాక్సీ డ్రైవర్ ఒకసారి సర్ ఆర్థర్ కానన్ డాయిల్‌పైన ఒక పరిహాసం ప్రదర్శించాడు ఆ డ్రైవర్ సర్ ఆర్థర్‌ను స్టేషన్ నుంచి హోటల్‌కు తీసుకు వచ్చాడు తన బాడుగ వసూలు చేసుకున్న తరువాత ఇలా అన్నాడు "మెర్సీ, మాన్సియర్ కానన్ డాయిల్"

"నీకు నాపేరెట్లా తెలిసింది?" అని అడిగాడు కొంచెం విభ్రమంతో సర్ ఆర్థర్

"అయ్యా! మీరు దక్షిణ ఫ్రాన్స్ నుంచి పారిస్ వస్తున్నట్లు పత్రికల్లో చూశాను మీ ఆకారం చూస్తే సాధారణంగా మీరు ఇంగ్లీషువారని నాకు అనిపించింది మీ జుట్టును దక్షిణ ఫ్రాన్స్‌లోని క్షురకుడు స్పష్టంగా కత్తిరించాడు వీటన్నిటినీ కలిపి చూశాను మీరెవరో ఊహించగలిగాను"

"ఇది చాలా విశేషంగానే ఉంది నీకు మరే ఇతర సాక్ష్యం దొరకలేదా?"

"మరేనండీ! మరో నిజమేమిటంటే మీ సామాన్లపైన మీపేరు ఉన్నదండీ"

[illegible]

— [illegible]

# నవభారత నిర్మాతలు

## టంగుటూరి ప్రకాశం

ఆంధ్రప్రదేశ్ లోని ఒంగోలు తాలూకాలో ఉన్న కనుపర్తి గ్రామంలో 1872 మే 23 న టంగుటూరి ప్రకాశం జన్మించారు అతని తండ్రి ఆ గ్రామ కరణం కాగా ప్రకాశానికి పన్నెండేళ్ళ వయస్సులో తండ్రి చనిపోయాడు



T Prakasam

పేదరాలైన తల్లి చిన్న పూటకూటి ఇంటిని నడిపి ప్రకాశాన్ని, కుటుంబంలోని మిగిలిన చిన్న పిల్లలను పోషించింది ఒంగోలు మిషన్ స్కూలులో ఉపాధ్యాయుడు ఇమ్మానేని హనుమంత రావు నాయుడు విద్యాభ్యాసంలో ప్రకాశానికి సహాయపడటం జరిగింది రాజమండ్రిలోని ఒక మాధ్యమిక పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడుగా బదిలీ అయిన నాయుడు ప్రకాశాన్ని కూడా రాజమండ్రికి తన వెంట తీసుకు వెళ్ళాడు

నటనా కౌశలం కల బాలుడైన ప్రకాశం రంగస్థలంపైన అర్జునుడు, ద్రౌపది మరియు ఇతర పాత్రలను అభినయించారు అనేక మంది అతని నటనకు ముగ్ధులై, అతని ప్రతిభ శ్రేష్ఠమైనదని కొనియాడారు

మెట్రిక్యులేషన్ మరియు ఎఫ్.ఏ., పూర్తి కాగానే ప్రకాశం సెకండ్ గ్రేడ్ ప్లీడర్‌గా అర్హత సంపాదించుకునేందుకు మద్రాసు చేరుకున్నారు రాజమండ్రికి తిరిగివచ్చి తన న్యాయవాద వృత్తిని ప్రారంభించారు 1900లో ఆయన పురపాలక కౌన్సిలర్‌గా ఎన్నికయ్యారు మూడేళ్ళ తరువాత ఆయన రాజమండ్రి పురపాలక సంఘాధ్యక్ష పదవి చేపట్టారు పురపాలక సంఘాధ్యక్షుడుగా ప్రజా సమస్యల పట్ల తన బుద్ధి సూక్ష్మతతో కూడిన అవగాహన ద్వారా, అన్నిటికంటే మిన్నగా మానవతా స్ఫూర్తి ద్వారా ప్రజాభిమానాన్ని చూరగొన్నారు పురపాలక సంఘం యొక్క పాలనా సామర్థ్యాన్ని పెంపొందించారు

న్యాయశాస్త్రంలో తదుపరి చదువుల కోసం ప్రకాశం 1904లో ఇంగ్లండ్ వెళ్ళారు ఇండియాకు తిరిగి రాగానే తన న్యాయవాద వృత్తిని రాజమండ్రిలో ప్రారంభించి, అనంతరం మద్రాసుకు మార్చుకున్నారు ఆయన చేపట్టి గెలుపొందిన వ్యాజ్యాలు ఆయనకు అపార ధనాన్ని సంపాదించి పెట్టాయి. తన 47వ ఏట

## తమిళనాడులో 17,000 కార్మిక సంఘాలు

*తమిళనాడులో 17,000కు పైగా రిజిష్టరైన కార్మిక సంఘాలు పనిచేస్తున్నాయి వ్యవస్థీకృత రంగంలో దాదాపు 10 లక్షల మంది కార్మికులు పనిచేస్తున్నారు ఈ 10 లక్షల మంది కార్మికులలో కేవలం 5,000 మంది పనివారు మాత్రమే సమ్మెలు, లాకౌట్లకు గురవుతున్నారు*

మద్రాసు బార్ (న్యాయవాది సంఘం) లో అయన ఒక ప్రముఖ న్యాయవాదిగా రూపొందారు

1921 లో ప్రకాశం స్వాతంత్ర్య ఉద్యమంలో పూర్తిగా లీనమైపోయారు దాదావు 25 సంవత్సరాలు చేసిన న్యాయవాద వృత్తిని విడిచి పెట్టారు శక్తివంతమైన చర్యకు పూను కోవాలని ప్రజలను ఉత్తేజ పరచి రెండుసార్లు కారాగారవాసం చేశారు

పత్రికా రచన పట్ల ప్రకాశానికి ఆసక్తి ఉంది అయన ఖాసా సుబ్బారావు సంపాదకత్వాన ఆంగ్ల దినపత్రిక "స్వరాజ్య"ను ప్రారంభించారు అది ప్రజాదరణ పొందిన దినపత్రిక కాగా ముందుగానే దినపత్రికను పొందాలనే ఆసక్తితో ప్రజలు గంటల తరబడి వేచి ఉండే వారు. కాంగ్రెస్ పార్టీ కార్యకలాపాలను ప్రకటిస్తూ 14 సంవత్సరాల పాటు ఎన్నో ఘన కార్యాలను నిర్వహించిన ఈ పత్రికను అయన ఎంత ప్రయత్నించినా 1935లో మూసి వేయక తప్పలేదు. ఋణదాతలు ప్రకాశం ఆస్తులన్నీ – ముద్రణాశాలతో సహా-హస్తగతం చేసుకున్నారు

ప్రకాశం గొప్ప స్వాతంత్ర్య సమర యోధుడు బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా అయన చేసిన సాహస కార్యాలు అయనకు "అంధ్రకేసరి" బిరుదాన్ని సమకూర్చిపెట్టాయి. అయన వేదికపై నుండి ప్రసంగిస్తే, అప్రసంగం అయన వ్యక్తిత్వం చేసిన ప్రసంగంగానే ఉండేది అయన సుడిగాలి వలే ప్రచారాలు చేసేవారు వేలాదిమంది అయన ఉపన్యాసాలు వినేవారు అయన గొంతుక సింహగర్జన వలే ఉండేది ధైర్యసాహసాలతో కూడిన ప్రచార దండ యాత్రలు సాగించే సందర్భంలో అయన దృష్టి దాదావు మానవాతీతమైనది

1937 లో మద్రాసు రాష్ట్రం పరిపాలించిన రాజగోపాలాచారి మంత్రివర్గంలో ప్రకాశం రెవిన్యూ మంత్రిగా ఉండేవారు ఎన్నో వర్గాల నుంచి వ్యతిరేకత వచ్చినా భూమిపైన వ్యవసాయదారునికి యాజమాన్య హక్కులు కలిగించేందుకు అయన ప్రయత్నించారు మద్రాసు రాష్ట్రంలో జమిందారీ విధానం రద్దు కూడా ప్రధానంగా ప్రకాశం వల్లనే జరిగింది

1946 లో మద్రాసు రాష్ట్ర ప్రధానిగా ప్రకాశం రాజకీయ యుక్తులకు వ్యతిరేకంగా1 3 నెలలు అద్భుతమైన పరిపాలన అందించారు అయన ఎన్నో సంస్కరణలు-హరిజనోద్ధరణ, సహకార సంస్థలు, సమాజ వికాస పథకాలను వ్యాప్తిలోకి తేవటం - అమలు చేశారు

1953 లో తమ 81 వ సంవత్సరంలో ప్రకాశం అంధ్రరాష్ట్ర ప్రథమ ముఖ్యమంత్రిగా పనిచేశారు తమ పనిలో గొప్ప చొరవ, నిర్ణయాలలో వేగం, అవగాహనలో పదును ప్రదర్శించారు అయన పాలనాకాలంలోనే కృష్ణానదిపై నాగార్జున సాగర్ ఆనకట్ట నిర్మాణం, తిరుపతిలో కొత్త విశ్వవిద్యాలయ స్థాపన, అంధ్రప్రదేశ్ హైకోర్టు అవతరణ జరిగాయి

తమ 85 వ ఏట ప్రకాశం 1957 మే 20వ తేదీన హైదరాబాద్‌లో కాలధర్మం చెందారు

●

## అల్పం - అనల్పం

చిన్న చిన్న నీటి బిందువులు,
చిన్న ఇసుక రేణువులు
మహా సముద్రాన్ని,
ఆహ్లాదకర వృథ్విని నిర్మిస్తాయి
కనికరంతో చేసే చిన్న కార్యాలు
ప్రేమతో పలికే చిన్న పలుకులు
ఈ భూమిని ఈడెన్‌గా, పైనున్న స్వర్గంగా మారుస్తాయి

[illegible]

# విజయసాధనకు పథకం వేసుకో

డాక్టర్ కె.సి.పాఢీ

అసిస్టెంట్ జనరల్ మేనేజర్, స్టేట్ బ్యాంక్ ఆఫ్
ఇండియా, సంబల్‌పూర్

జీవితంలో విజయం సాధించేందుకు ఆదేశం, మార్గదర్శకత్వం ఇస్తున్నదెవరు? నీవా లేక ఇతరులా? నీ కోసం ఇతరులు ఆదేశాలు అందిస్తుంటే, ఆ పద్ధతి నీకు ఇష్టమైనట్లయితే,



నీవు ఫిర్యాదు చేయనక్కరలేదు, బాధపడ నక్కరలేదు, విచారాన్ని, అసంతృప్తినీ వెల్ల డించనక్కరలేదు నీస్వంత నిర్ణయాలు నీవే స్వయంగా చేసుకున్నట్లయితే నీ విజయానికి కానీ, పరాజయానికి కానీ నీవే బాధ్యత వహిస్తావు అదో అదృష్టం అనో లేదా అవకాశం అనో భావించకుండా విజయాన్ని పొందేందుకు నీవు పథకం వేసుకుని సంసిద్ధంగా ఉండాలి అనుకూల ఫలితం సాధించేందుకు ప్రతి విజయవంతుడైన వ్యక్తీ ఎంతో కష్టపడ్డాడు నీకు చేతనైనంత బాగా పని నిర్వహించినా విజయం పట్టుచిక్కకుండా ఉందని నీవు చెప్ప లేవు తీవ్రంగా పనిచేయి విజయం నీదే

* నీ గమ్యం తెలుసుకో నీవు ఎక్కడికి వెళ్ళదలచావో తెలియకుండానే - గమ్యం లేని ప్రయాణం సాగిస్తే - నీకు ఇష్టం లేని చోటుకే చేరుతావు జీవితంలో ఒక నిర్దిష్ట లక్ష్యం మనకు ఉండాలి ఉదాహరణకు ఒక కార్య నిర్వాహకుడుగా, చిత్రకారుడుగా లేదా సంగీత కారుడుగా విజయం సాధించటం ఒక పనిని సక్రమంగా నిర్వహించినట్లయితే నీకు తృప్తి ఉంటుంది అది సక్రమంగా నిర్వహించాననేదే కాక ఇతరుల కంటే బాగా చేసాననే తృప్తి కూడా నీకు ఉంటుంది

* నిపుణునిగా ఉండు ఒక నిపుణునిగా ఉండు నీ పని పరిధిలో ఏదో ఒక అంశం పైన నీవు ప్రత్యేకమైన ఆసక్తిగల వ్యక్తిగా రూపొందాలి ఒక నిపుణుడు కేవలం డిగ్రీలు కలిగిన వాడుగా కాక ప్రత్యేక అవసరాలను తీర్చేవాడుగా ఉంటాడని ఎప్పుడూ మర్చిపోవద్దు

* ఆత్మ విశ్వాసంతో ఉండు నీకు ఆత్మ విశ్వాసం ఉంటే నీవే విజేతవు తాను అజేయుడ్నని ఘనత వహించిన అలెగ్జాండర్ భావించు కున్నాడు అలాగే తనకు తాను ఋజువు చేసుకున్నాడు పానిపట్ యుద్ధం జరిగిన మూడు సందర్భాల్లోనూ ఆత్మ విశ్వాసం కోల్పోయినందువల్లనే పరాజయం పొందటం సంభవించింది

* గెలిచే దృష్టి అలవర్చుకో విజయానికి, అపజయానికి మధ్య తేడా దృష్టి భావమే "స్త్రీ పురుషులు తమ బుద్ధుల్లోని అంతర్గత వైఖరులను మార్చుకోవడం ద్వారా తమ జీవితాలలోని బహిర్గత అవస్థలను (కోణాలను)

మార్చుకోగలుగుతున్నారు" అనేది వాస్తవమే దీన్ని ఎవరూ కాదనలేరు నీకు నీవే విజయుడవుగా అంగీకరించినంత మేరకు నీవు విజయం సాధించినట్లే



తెగించు. తెగించకుండా, సాహసం చేయకుండా ఎవరూ ఉన్నత శిఖరాలను అధిరోహించలేరు భద్రతా ఎంపిక జరుపుకున్నవారు చరిత్ర యొక్క పెంటకుప్పలోకి త్రోసివేయబడ్డారు "ప్రతి గొప్ప, ఔదార్యవంతమైన సాహస కార్యానికి - భద్రతా కోరిక వ్యతిరేకంగా నిలుస్తుంది" అంటారు టసిటస్

ఇప్పుడే నిశ్చయించుకో యోగ్యత కల పనులు నిర్వహించేందుకు కొంతమందికి సమయం ఉండదు సమయం కోసం నీవు చూడకూడదు నీవే సమయాన్ని సమకూర్చుకోవాలి అత్యవసరం మరియు ముఖ్యం - వీటి మధ్య గల తేడాను తెలుసుకోకుండా ప్రజలు తమ కాలాన్ని వ్యర్థం చేస్తారు ప్రధానమైన పనులు అత్యవసరమైనవి కాకపోవచ్చు అత్యవసరమైన పనులు ప్రధానమైనవి కాకపోవచ్చు. అంతేకాదు, శ్రేష్ఠత కంటే సంపూర్ణతకే ప్రజలు తమ కాలాన్ని వెచ్చిస్తారు ఆదర్శవాదం వలెనే సంపూర్ణత్వం కూడా ఒక శ్లాఘనీయమైన చిహ్నామే కాని ప్రపంచానికి శ్రేష్ఠత కోసం వెదకే సమర్థవంతులైన ప్రజలు ఆవశ్యకంగా కావాలి

* ఇతరుల పనిని గుర్తించు ఇతరుల సహాయం లేకుండా ఎల్లప్పుడూ నీవు విజయాన్ని సాధించలేవు నీ పైనున్న వారినీ, నీ క్రింద నున్న వారినీ ఉపయోగించుకోవాలి ఏ మార్పు చేసినా మంచి కోసమే కనుక నీ పనిని మరింత సార్థకంగా చేసుకునేందుకు నీ పైఅధికారిని సమ్మతింపచేయాలి నీ క్రింది వారు తమ వృత్తులలో మంచి అదృష్టాన్ని అభిలషిస్తుంటారు కనుక నీ అమూల్యమైన మార్గదర్శకత్వంలో ఏదైనా మంచి జరుగుతుందేమోనని వారు ఎదురు చూస్తూంటారు వారి ఆకాంక్షలను నీ వాటితో జతచేసి ఉమ్మడి గమ్యానికి నడక సాగించాలి అప్పుడు నీవు విజయాన్ని తప్పకుండా పొందగలవు

* సమాచారం చక్కగా అందించు ఇతరుల ద్వారా నీవు విజయాన్ని సాధించుకోవాలి నీవు వారితో మాట్లాడాలి వారు చెప్పేది వినాలి లొంగి ఉండమని ప్రజల్ని నీవు బెదిరించలేవు నీవు వాదన చేస్తుంటే, నీ అభిప్రాయాన్ని సరిగ్గా చెప్పలేక పోతున్నానని త్వరలోనే గ్రహిస్తావు నీవు ఒక వాదనలో గెలవవచ్చు కానీ ప్రజల్ని పోగొట్టుకుంటావు భవిష్యత్‌లో పరాజయానికి విత్తులు నాటే వాదనలో నీవు గెలవవచ్చు నీతో ఎలా మాట్లాడితే ఇష్టపడతావో అలాగే ఇతరులతో మాట్లాడు ఇతరులు నిన్ను ఎలా ఆదరిస్తారో ఇతరుల్ని కూడా నీవు అలాగే ఆదరించు

విజేతగా ఉండు విజయం సాధించు మొదట్లో కష్టంగా ఉన్నా ప్రతిదీ సాధ్యమవుతుంది ●

## వాయురూపంలో ఆక్సిజన్

ఆక్సిజన్ (ప్రాణవాయువు) ద్రవరూపంలో ఉన్నదానికంటే వాయువుగా 860 రెట్ల స్థలాన్ని ఆక్రమించుకుంటుంది

" [illegible] — [illegible]

# సంతులిత ఫలం, విరేచన ఔషధం - బేరిపండు

హెచ్.కె.బఖ్రూ

బేరిపండు (పియర్) - పళ్ళ తోటల్లో పెరిగే, ప్రజాదరణ పొందిన ఈ పండులో ఏ ఇతర పండ్లలో కంటే తక్కువ ఆమ్లం ఉంటుంది. ఇది సంతులిత ఫలం. విలువలో ఇది ఆపిల్‌తో సమానం కాగా బేరిపండు కండ ఆపిల్ కంటే స్వల్పంగా గట్టిదనం కలిగి ఉంటుంది అయితే ఇది ఆపిల్ కంటే ఎక్కువ రసంతో ఉంటుంది తులనాత్మకంగా పెద్ద చెట్టుకే ఈ పండ్లు ఉత్పత్తి అవుతాయి




యూరప్ మరియు పశ్చిమాసియాల్లోని సమశీతోష్ణ ప్రాంతాలు బేరిపండుకు జన్మస్థలాలు ప్రాచీన గ్రీస్ మరియు రోములలో ఇది చాలా అధిక ఉపయోగంలో ఉంది ప్రపంచంలోని అన్ని సమశీతోష్ణ ప్రదేశాలలో ఇది ప్రస్తుతం సాగుచేసి పెంచబడుతున్నది ఇండియాలో కాశ్మీర్, నీలగిరులు మరియు ఇతర పర్వత ప్రాంతాలలో ఇది ఉత్పత్తి అవుతున్నది

బేరిపండును విశ్లేషిస్తే దానిలో సగటున 86 శాతం తేమ, 0 6 శాతం ప్రోటీన్, 0 2 శాతం క్రొవ్వు, 0 3 శాతం ఖనిజాలు, 1 0 శాతం పీచు మరియు 11 9 శాతం కార్బోహైడ్రేట్లు - ప్రతి 100 గ్రాముల ఖాద్య (తినదగిన) భాగంలో ఉంటాయి దీనిలోని ఖనిజాలు మరియు విటమిన్ సారాలు ఇవి: నూటికి 8.0 మిల్లీగ్రాముల కాల్షియం, 15 0 మిల్లీగ్రాముల ఫాస్పరస్, 0 5 మిల్లీగ్రాముల ఇనుము, 28 మిల్లీగ్రాముల కరోటిన్, 0 06 మిల్లీగ్రాముల థైయామిన్, 0 03 మిల్లీగ్రాముల రిబొఫ్లావిన్ మరియు 0 2 మిల్లీగ్రాముల నియసిన్ ప్రతి 100 గ్రాములకు ఉన్నాయి విలువైన పెక్టిన్ కూడా దీనిలో ఉంది దీని కాలరీల విలువ 52

బేరిపండు రసం అత్యంత అలసటను తీర్చేదిగా, రుచికరంగా ఉంటుంది దాహార్తి బాపేందుకు ఇది చాలా మంచి పానీయం జ్వరం వచ్చినప్పుడు ఇది ఎంతో అమూల్యమైనది

మలబద్ధాన్ని పోగొట్టేందుకు శక్తివంతమైన చికిత్స - బేరిపండు అల్పాహారంలో కానీ

## గాఢ విశ్వాసంలోని మాధుర్యం

*తామరపువ్వు దళాలకు వెలుపల ఉండి, దానిలోని మకరందాన్ని రుచి చూడనంతకాలం తేనెటీగ ఝుంకారం చేస్తూ ఆ పువ్వుల చుట్టూ తిరుగుతూ ఉంటుంది అది ఎప్పుడైతే పువ్వులోనికి చొచ్చుకు పోతుందో అప్పుడు మధువును నిశ్శబ్దంగా గ్రోలుతుంది. అలాగే మానవుడు సిద్ధాంతాల గురించి, పిడివాదాల గురించి కీచులాటలు, తగవులు పడుతున్నంత కాలం నిజమైన విశ్వాసం యొక్క అమృతాన్ని అతడు రుచి చూడలేదు దాన్ని అతడు రుచి చూసినప్పుడు ఇక నిశ్చలంగా ఉంటాడు*

— శ్రీరామకృష్ణ

లేదా భోజనం తరువాత కానీ ఒక మధ్యరకపు సైజులో ఉన్న బేరిపండు తిన్నట్లయితే కొద్ది రోజుల్లోనే సత్ఫలితాలు కనిపిస్తాయి. దీర్ఘకాలపు రోగాలలో రోగికి కొన్ని రోజుల వరకు బేరిపండును కానీ, దాని రసాన్ని కానీ ఇవ్వాలి

బేరిపండు విరేచనకారిగా కూడా పని చేస్తుంది దీని కోసం రోజుకు మూడు లేదా నాలుగుసార్లు 250 నుంచి 350 మిల్లీలీటర్ల బేరిపండ్ల రసాన్ని ఇవ్వాలి బేరిపండులో సహజసిద్ధంగా ఉండే తీపిదనం త్వరితంగా విలీనమై శరీరానికి ఉపయోగపడుతుంది కనుక దీని వినియోగం వల్ల విరేచనాలైనా తాము బలహీనంగా ఉన్నట్లు ఎవరూ భావించరు

పెక్టిన్, మాలిక్ మరియు సిట్రిక్ ఆమ్లాలకు బేరిపండు అమూల్యామైన మూలాధారంగా ఉంటుంది ఈ సారాంశాల (ద్రవ్యాల) వల్ల ఈ పండు అతిసారం, రక్త విరేచనాలకు ఒక శక్తివంతమైన ఆహార చికిత్సగా రూపొందింది

'పెర్రీ' అని పిలువబడే బేరిపండుయొక్క పులిసిపోయిన రసం - వాతరోగం మరియు కీళ్ళవాతానికి అత్యంత ఉపయోగకరమైన చికిత్సగా రూపొందింది

పిత్తాశయ సమస్యలు, పిత్తాశయంలో రాళ్ళు ఏర్పడటం వంటివి ఉన్న వ్యక్తులు బేరీ రసాన్ని విరివిగా తీసుకోవచ్చు ఇది పిత్తాశయంలో రాళ్ళు మొదలైన వ్యాధులపై బాగా పనిచేస్తుంది

సాధారణంగా బేరిపండును తాజాఫలంగానే తీసుకుంటారు దీన్ని విస్తృతంగా డబ్బాలలో భద్రపరుస్తారు. ఎండిన స్థితిలో కూడా ఉపయోగిస్తారు.

# జంతుహింస చేయవద్దు



1 దేన్ని కూడా ఎప్పుడూ జంతువులపైవు విసర వద్దు ముఖ్యంగా నాణాల వంటివి మొనళ్ళ కొలనులో విసరవద్దు జంతువు దాన్ని మ్రింగి రోగగ్రస్తమౌతుంది
2 జంతు ప్రదర్శనశాలలోని జంతువులకు ప్రత్యేక ఆహారం పెడతారు అధిక ఆహారం కానీ అత్యల్ప ఆహారం కానీ వాటిని చంపివేస్తాయి కనుక 'జూ'లోని జంతువులకు మీరు ఆహారం పెట్టకూడదు
3 చాలా జంతువులు పగలు నిద్రించి రాత్రివేళల్లో మేల్కొని ఉంటాయి పెద్ద పులుల వంటివి ఇటువంటి రాత్రి సంబంధ జంతువులు ఒక జంతువు నిద్రిస్తున్నప్పుడు మీరు లేపటానికి ప్రయత్నించవద్దు. మీరు గాఢ నిద్రలో ఉన్నప్పుడు ఎవరైనా మిమ్మల్ని లేపేందుకు అంగీకరిస్తారా?
4 చెత్త (పెంట)ను జంతువులపైన కానీ, ఆ స్థలాలపైనకానీ విసరకండి
5 ఎవరైనా జంతువుల్ని వేధిస్తుండగా మీరు చూడటం తటస్థిస్తే, అవని నిలిపివేయమని చెప్పండి వారు అలా చేయనప్పుడు, జంతు ప్రదర్శనశాలాధికారికి కానీ, ఒక పయోజనునకు కానీ ఫిర్యాదు చేయండి

— 'అట్లర్‌వైజ్' సౌజన్యంతో

# బ్రతుకులో కల్పనలో కాకి

జాతి కాకుల్లో ఎన్నోరకాలు ఉన్నాయి. ఇవి - జెముడు కాకి, మాల కాకి, ఒక విధమైన 'జాక్డే' కాకి, తెల్లని కంఠోత్తరీయం కల కాకి మరియు సిలోన్ కాకి. ఎత్తైన పర్వతాల్లోని చలి ప్రదేశాల్లో మినహా దేశంలోని అన్ని ప్రాంతాలలో భారత గృహ వాయసం కనిపిస్తుంది. ఈ ఇంటి కాకి - తెలుసుకోవాలనే ఆతురత కలదీ, సిగ్గుమాలినది, తెలివికలది,



CROW

అతి జాగ్రత్త కలది అలంకారికంగా దీన్ని ఆకాశపు పాకీదానిగానూ మరియు ఒక ఓడ దొంగగానూ పిలుస్తారు ఇది మన ఇంటిలోని అన్ని భాగాలలోకి - వంట గదిలో సహా - ప్రవేశిస్తుంది

హితోపదేశం, పంచతంత్ర కథలు మరియు ఈసప్ నీతి కథలలో కాకి కనిపిస్తుంది సన్నని కూజా అడుగుభాగంలో ఉన్న నీటిని ఇది ఎంత తెలివి తేటలతో త్రాగగలిగిందో మనం జ్ఞప్తికి తెచ్చుకోవాలి ఇదే సమయంలో ఇది చాలా మందబుద్ధిగల మూఢురాలు కూడా అనిపిస్తుంది. చింపిరి గుడ్డ పేలికలతో, కుండతో తయారు చేసిన దిష్టిబొమ్మని చూసి భయపడిపోతుంది తినే వస్తువుల్ని ఎండబెట్టిన ముసలమ్మ కూడా ఒక నల్లని చింకి గుడ్డ వాటిపై కప్పి కాకుల్ని భయపెట్టగలుగుతుంది!

కాకులకు హాస్యప్రియత్వం కూడా ఉంది మేస్తున్న పశువులపైన కూర్చుని ఇవి ఆహ్లాదపు సవారీ చేస్తాయి ఇవి సాహసవంతమైనవి కూడా ఒక మొసలి నోటిలోకి (దవడ) ప్రవేశించి దాని దంతాలు శుభ్రం చేస్తాయి కాకిని మోసపుచ్చే ఒక పక్షి కోకిల కోకిల తన గ్రుడ్లను కాకి గూటిలో పెడుతుంది ఆ పెంపుడు తల్లి వీటిని పొదిగి పక్షుల్ని చేస్తుంది

కాకులు మందలుగా నివసిస్తాయి తరచుగా సభలూ, సమావేశాలూ జరుపుకుంటాయి. వాటికి స్వంత నియోజక వర్గాలు ఉన్నాయి ఒక ప్రాంతానికి చెందిన కాకి మరో ప్రాంతంలో జరిగే సంభాషణలలో పాల్గొనలేదు కార్పొరేషన్ డివిజన్లవలే ఇవి కొన్ని సర్కిల్స్‌గా విభజింపబడ్డాయి. కాకిలోని ఒక అపురూప సుగుణం ఏమంటే, అది ఆచరణలో సామ్యవాది కొంత ఆహారం దొరికినట్లయితే, అది ఇతర సభ్యుల్ని కూడా - కూత వేసి విందులో పాల్గొనమని ఆహ్వానిస్తుంది నిస్వార్థంగా మానవులు ఉండేందుకు కాకిని ఆదర్శంగా తీసుకోమని మన ఋషులు చెప్పారు

ఎగిరే కళలో కాకి అత్యంత నైపుణ్యంగల నేర్పరి ''కాకి ఎగిరినట్లు'' అనే జాతీయం - తప్పుగా వాడిన ప్రయోగం దగ్గరి దారిలో కాకి నేరుగా ఎగరదు కాకి యొక్క ప్రేమైక జీవనం మరియు వైవాహిక స్థాయి ఆదర్శ ప్రాయమైనది జీవితమంతా అది ఏకపత్నీ వ్రతం అనుసరిస్తుంది దాని సహచరి మరణించినా లేక చంపబడినా ఆ శోకంతో జీవిత భాగస్వామి మరణిస్తుంది మంచి పాకీదాని వలే కాకిని చెప్పుకున్నా కొన్ని సమయాల్లో ఇది బావులను, చుట్టుపక్కల పరిసరాలను మురికి

'[illegible] పళ్ళ [illegible] ఫలితాలు తాత్కాలిక అనుభవిస్తాయి
ఈ అనుభవం కోసం మళ్ళీ మళ్ళీ అటువంటి పద్ధతి చెప్తుంటారు
కానీ ఈ [illegible] తమని నాశనం చేస్తాయని తెలుసుకోరు''

చేస్తుంది దానికి స్వచ్ఛమైన వ్యక్తిగత అలవాట్లు ఉన్నాయి స్నానం చేయటం, తుడుచుకోవటం మరియు శృంగారించుకోవటం ఈ పనులకై దానికి స్వంత పద్ధతులు ఉన్నాయి



రెండు కాకులు మెడలు రాచుకోవటం - ఆధునిక ప్రేమికులకు ఒక ఆదర్శప్రాయంగా ఉంటుంది కాకి - మనిషికి సహచరి అనుకోని అతిథుల రాక తెలియజేస్తుంది అది మనల్ని మేల్కొల్పుతుంది హిందూ పౌరాణిక గాథల్లో శనీశ్వరుని వాహనంగా, శకటంగా వాయసానికి గౌరవస్థానం లభించింది రామాయణంలో కాకి ''కాకాసురుని''గా చిత్రించబడింది

మన నిత్య జీవితంలో ఒక ముద్ద ఆహారం కాకికి సమర్పించకుండా మనం భోజనం చెయ్యలేము దాన్ని పిలిచేందుకు మనం దొడ్లోకి వెళ్తాము 'కాకా' అనే తన పిలుపుకు ప్రత్యుత్తరం రాని సమయంలో ఒక హిందూ విశ్వాసి విచారగ్రస్తుడవుతాడు ఏదైనా లేనప్పుడే దాని విలువ తెలుస్తుందనే మాట మనం చెబుతుంటాము ఒకవేళ భారత దేశంలోని కాకులన్నీ బయటికి వెళ్ళిపోయినట్లయితే మన దేశం ఎంత భారంగా మారుతుంది? మనం సర్వం కోల్పోయినట్లు భావిస్తాము కాకుల ''కావ్ కావ్'' శబ్దాలు లేని చోట స్మశాన నిశ్శబ్దం పరిఢవిల్లుతుంది. ఇంగ్లీష జాతీయాల్లో కూడా కాకులు చోటు చేసుకున్నాయి నల్లగా ప్రకాశించే వెంట్రుకల కుచ్చులకు అర్థం నల్లని వెల్వెట్ సిల్క్ జుట్టు మరియు అది కలిగి ఉన్నవారికి అభినందనలు

## విస్‌డమ్ పాతకాపీలు

*మే '84, జూన్ '84, ఆగస్టు '84 నుంచీ నవంబరు '84, మార్చి '85 నుంచీ జూలై '85, ఫిబ్రవరి '86 నుంచీ ఏప్రిల్ '86, సెప్టెంబరు '86 నుంచీ డిసెంబరు '86, జనవరి '87, మార్చి '87 నుంచీ మే '87, ఆగస్టు '87, డిసెంబరు '87, జనవరి '88, మార్చి '88 నుంచీ డిసెంబరు '88, జనవరి '89 నుంచీ డిసెంబరు '89, జనవరి '90 నుంచీ సెప్టెంబరు '90, నవంబరు '90, డిసెంబరు '90, ఫిబ్రవరి '91 నుంచీ డిసెంబరు '91, జనవరి '92 నుంచీ డిసెంబరు '92, జనవరి '93 నుంచీ జూన్ '93 కాపీలు మావద్ద ఉన్నవి 1984 కాపీల వెల రూ 7 50 లు, 1985 కాపీల వెల రూ 6 50 లు; 1986 కాపీల వెల రూ 10 50 లు; 1987 కాపీల వెల రూ 10 00 లు; 1988 కాపీల వెల రూ 18 75 లు; 1989 కాపీల వెల రూ 24 50 లు; 1990 కాపీల వెల రూ 25 50 లు; 1991 కాపీల వెల రూ 26 50 లు; 1992 కాపీల వెల రూ 33 00 లు, 1993 కాపీల వెల రూ 17 00 లు; రిజిష్టర్డ్ పోస్ట్‌లో పొందటానికి కాపీల వెలతోపాటు రూ 6-00లు చేర్చి M O పంపాలి 'రత్నా ఏజెన్సీస్', 9, దేశికా రోడ్డు, (ఆళ్వారుపేట వద్ద), మద్రాసు - 600 004*

— సర్క్యులేషన్ మేనేజర్

### ఆంతర్యం

*ఒక చేప పిల్లను తన గాలం నుండి వెలికి లాగి ఒక జాలరి - దాన్ని తిరిగి నీళ్ళలోకి విసరివేస్తూ అన్నాడు ''నీ తల్లిదండ్రులు లేకుండా మరోసారి నీ ముఖం చూపించకు''*

# అమ్మవారి కటాక్షం పొందిన అభిరామ భట్టార్

డాక్టర్ కె. సంతానరామన్

తమిళనాడులోని తంజావూరు జిల్లాలో తిరుక్కడవూర్ ప్రసిద్ధి చెందిన ఒక చిన్న గ్రామం ఈ గ్రామంలోనే తన భక్తుడైన మార్కండేయుని రక్షించేందుకు మహాదేవుడైన శివుడు యముణ్ణి శిక్షించాడని చెబుతారు ఈ స్థలాన్ని అధిష్ఠించిన మాతృదేవత పేరు "అభిరామి"



దాదావు 250 సంవత్సరాలక్రితం రెండు భావలలో విద్వాంసుడైన సుబ్రహ్మణ్యం ఇక్కడ నివసించాడు ఆయన కవి, జ్యోతిశ్శాస్త్రవేత్త మరియు యోగి పుంగవుడు కూడా 'అభిరామి' మాతపట్ల తీవ్రమైన భక్తికల సుబ్రహ్మణ్యం ఏకాంత స్థలంలో ఆమెను ధ్యానిస్తూ బయటి ప్రపంచం యొక్క భౌతిక అనుభవాలను విస్మరించేవాడు

గ్రామంలోని శాస్త్ర పరిజ్ఞానంకల ఇతర పండితులు ఈ యోగి పద్ధతులను అర్థం చేసుకోలేకపోయేవారు అతడొక ఉన్మాది అని భావించేవారు అతడు కనికట్టు విద్యల ప్రాబల్యంలో ఉన్నాడని కొందరు తలచేవారు అతడు క్షుద్ర శక్తులను ఆరాధిస్తున్నాడని మరికొందరు అభిప్రాయపడేవారు. కానీ ఇటువంటి వదంతులకు సుబ్రహ్మణ్యం చెవి యొగ్గలేదు వాటిని అలక్ష్యం చేశాడు

ఒక సుప్రభాతాన (పాడ్యమినాడు) మాత అభిరామి ఆలయం ముందు సుబ్రహ్మణ్యం నిలబడ్డాడు అతడు ఆమెనే ధ్యానించసాగాడు ప్రపంచాన్నే మరచిపోయాడు ఆ సమయంలో తంజావూరు పాలిస్తున్న మరాటా రాజు శర్ఫోజీ తన రాజోద్యోగులతో కలిసి దేవాలయాన్ని సందర్శించటం జరిగింది దేవాలయోద్యోగులు మరియు భక్తులు ఆరాధన కోసం అక్కడ గుమికూడారు సుబ్రహ్మణ్యం మినహా మిగిలిన వారందరూ రాజుకు స్వాగతం పలికి అవనత శిరస్కులైనారు తక్షణమే అమ్మవారికి ప్రత్యేక పూజలు నిర్వహించబడ్డాయి దేవాలయమంతా పండుగ ధ్వనులతో నిండిపోయింది శర్ఫోజీ మహారాజు సమక్షంలో ఉన్నప్పటికీ సుబ్రహ్మణ్యం చలనరహితంగా నిల్చిపోయి, దేన్నీ లక్ష్య పెట్టకుండా, కేవలం ఆ తల్లి అభిరామిపైనే కేంద్రీకరించి తీవ్ర తపస్సులో మునిగిపోయాడు

ఈ విచిత్ర భక్తుని వీక్షించిన రాజు అతని గురించి అడిగి తెలుసుకున్నాడు అవకాశం కోసం ఎదురు చూస్తున్న మిగిలిన పండితులంతా అన్ని వైపులనుండి ఇలా బిగ్గరగా అరచారు. "అతడొక పిచ్చివాడు, అతడు చేతబడికి గురయ్యాడు క్షుద్ర దేవతలను ఆరాధిస్తాడు. ఎప్పుడూ త్రాగినవానివలే ప్రవర్తిస్తాడు" - ఇత్యాదులన్నీ వారు చెప్పారు

శర్ఫోజీ రాజు వీరి మాటల వెనుకనున్న

చెంతకు చేరి ఇలా ప్రశ్నించాడు:

"ఇవ్వాళ ఏమిరోజు?"

"ఇవాళ పౌర్ణమి రోజు" అని సుబ్రహ్మణ్యం జవాబు చెప్పాడు

అతని జవాబు విని అందరూ నవ్వుకున్నారు నిజానికి ఆ రోజు పాడ్యమి. రాజు అతనిని మళ్ళీ అడిగాడు, "ఓయోగీ! నీవు చెప్పేది ఖాయమేనా?"



"అవును పూర్తిగా యదార్థమే ఇవ్వాళ పౌర్ణమిరోజు"

"నీవు చెప్పేది నిజమైతే ఈ రాత్రివేళ పూర్ణ చంద్రుణ్ణి నాకు ఆకాశంలో చూపించగలవా?"

"అవును, ఆ దివ్య దేవత అభిరామి మీకు ఈ రోజు రాత్రి పూర్ణ చంద్రుణ్ణి చూపుతుంది నా ప్రకటన ఆమె ప్రకటనే" అని పూర్తి విశ్వాసంతో జవాబిచ్చాడు సుబ్రహ్మణ్యం "ఈ ప్రకటన ఋజువు చేసుకునే మార్గమేమిటి?" అని రాజు ప్రశ్నించాడు

అంతట సుబ్రహ్మణ్యం అమాత్యమూర్తి అభిరామిని "అభిరామి అంతాధి" ద్వారా ప్రార్థించటం ప్రారంభించాడు అతని నోటి నుండి ఒక పద్యం తరువాత మరో పద్యం వెలువడ్డాయి కాని పూర్ణ చంద్రుడు వెలువడలేదు

78వ పద్యంలో సుబ్రహ్మణ్యం అమాత్య దేవత అభిరామి యొక్క కర్ణాభరణాలను అభివర్ణించాడు అవి సూర్య చంద్రులకన్నా వేరేవీకావు. తన కర్ణాభరణాల గురించిన అందమైన పద్యాన్ని విన్న చంద్రవదన అయిన అభిరామి తన కర్ణాభరణాలలో ఒక దానిని వెలికి తీసి ఆకసం వైపు విసిరివేసింది

ఏమి విచిత్రం? అక్కడ పౌర్ణమినాటి పూర్ణ చంద్రుడు ఉదయించాడు! ఈ అనూహ్యమైన, అసాధారణ సంఘటన జరగటం చూసిన రాజు విభ్రాంతి చెందాడు అతడు సుబ్రహ్మణ్యం పాదాలపై పడి తన విచారాన్ని వెల్లడించి, తన తప్పిదానికి క్షమాపణలు కోరుకున్నాడు ఎన్నో అమూల్య కానుకలు అందుకోమని అతడు సుబ్రహ్మణ్యాన్ని అర్థించాడు తనకు అభిరామి మాత అనుగ్రహం ఒక్కటే అమూల్య కానుక అని చెప్పి రాజు కోరికను అతడు తిరస్కరించాడు

తిరుక్కడవూర్‌లోనూ, ఆచుట్టుప్రక్కలా ఉన్న ప్రతి వ్యవసాయదారుడు పంటల కాలంలో ఒక కొలత ప్రకారం ధాన్యం సుబ్రహ్మణ్యానికి లేదా అతని వారసులకు ఇవ్వాలని తన సంతృప్తి కోసం శర్ఫోజీ రాజు ఒక రాజ శాసనం ప్రకటించాడు ఈ ఆజ్ఞను ఒక రాగి ఫలకంపై చెక్కించాడు. సుబ్రహ్మణ్యం కుటుంబానికి చెందిన అమృతభారతి అనే వయొలిన్ వాద్యకారుడు ఈ రాగి ఫలకాన్ని ఈనాటికీ భద్రపరచుకుని, ధాన్యం స్వీకరించి అనుభవిస్తున్నాడు

• ఆ తరువాత శర్ఫోజీ రాజు సుబ్రహ్మణ్యానికి "అభిరామ భట్టర్" బిరుదు ఇచ్చి సత్కరించాడు అప్పటినుండి అతడు "అభిరామ భట్టర్"గానే పేరొందాడు.

"నిజాయితీ పరుడైన వ్యక్తి తన అంతరాత్మ అంగీకరించని పనిని ఎన్నటికీ చేయలేడు"

—నూపర్ హ్యూమ్

# తోకలేని కోతికి వారసుడే మానవుడు

మనిషి భూమిపైన దాదాపు 500,000 సంవత్సరాల నుంచి నివసిస్తున్నాడు సుప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు డార్విన్ అభిప్రాయం ప్రకారం మనిషికీ, తోక లేని ఒక విధమైన కోతికీ (ape) ఒక ఉమ్మడి వంశకర్త ఉన్నాడు అతని పరిణామ సిద్ధాంతంలోకి మూలాధారమైన జీవశాస్త్ర నియమాలు - వారసత్వం, సర్దుకుపోయే శక్తి, మార్పు, పరివర్తన మరియు నైపుణ్యం - తీసుకొనబడ్డాయి

దాదాపు 5 మిలియన్ సంవత్సరాలకు పూర్వం తూర్పు మరియు దక్షిణ ఆఫ్రికాలో నివసించిన పురాతనమైన తోకలేని కోతికి, మనిషి వారసుడయ్యాడని నేడు కొందరు మానవ శాస్త్రవేత్తలు నమ్ముతున్నారు వీరి శిలాజాల అవశేషాలు - సామాన్యమైన రాతి పరికరాలతోపాటు - ఈ ప్రాంతాలలో కనుగొనబడ్డాయి ఈ తోక లేని కోతి మనుషులు



"ఆస్ట్రలోపిథిసిన్స్" (Australopithecines) దక్షిణాది తోకలేని కోతులు అని పిలువబడ్డారు వీరు కట్టెలను మరియు పదునైన రాళ్ళను పరికరాలుగా వాడేవారు వీరి దంతాలు తోకలేని కోతుల దంతాల వలే కాక మానవుల దంతాల వలే ఉండేవి వీరు నిటారుగా నడవగలిగే వారు ఈ ఆస్ట్రలోపిథిసిన్స్‌లో అనేక (విభిన్న) రకాలు ఉండవచ్చు వీటిల్లో ఒకటి నిజమైన మనిషి పెంపొందేందుకు తోడ్పడి ఉండవచ్చు అతడు పొట్టిగా, తేలికగా శరీర నిర్మాణం కలిగి చురుకుగా ఉండి, దాదాపు ఒక మిలియన్ సంవత్సరాలకు పూర్వం నివసించి ఉండవచ్చు.



తోకలేని కోతి వంటి మనుషులు నిజమైన మనుషులుగా - వారు పరికరాలు తయారు చేయటం ప్రారంభించిన తరువాతనే మారారు దాదాపు 500,000 సంవత్సరాల క్రిందట నిజమైన, అత్యంత పురాతనమైన మనుషులు యూరప్, ఆసియా మరియు ఆఫ్రికాలలో నివసించారు పితికాంత్రోపస్ లేక జావా మనిషి - 1891లో జావా (ఇండోనేషియా)లో

## 4,600 ఏళ్ల వయస్సుగల సతతహరిత వృక్షం

కాలిఫోర్నియా (యుఎస్ఎ)లో కనుగొనబడిన మెధుసిల్లా అని పిలువబడుతున్న ఒక సతత హరిత వృక్షం 4,600 సంవత్సరాలకు పైగా వయస్సు కల్గి ఉంది

కనుగొనబడినప్పటి అవశేషాలే బహుశా అటువంటి తొలి మానవులకు చెందిన వాటిల్లో సుప్రసిద్ధమైనవి.



అతనికి ఒక తోకలేని కోతికి ఉండేటటువంటి దవడ మరియు దట్టమైన కనుబొమ్మల వట్టెలు ఉన్నాయి అతని మెదడు ఆస్ట్రలోపిథికస్ కంటే పెద్దదిగా ఉన్నది ఒకప్పుడు పిథికన్ థ్రోపస్ కోతి మనిషి అని పిలువబడే జావా మనిషి ప్రస్తుతం హెూమోరెక్టస్ అని పిలువ బడుతున్నాడు. దీనికి అర్థం - తిన్నని మనిషి.

హెూమో సపియన్స్ - ఆలోచించే మనిషి - నేరుగా హెూమోరెక్టస్ నుంచి వారసుడుగా వచ్చాడు

నీన్డర్తల్ మనిషి గురించి 1856లో జర్మనీలో కనుగొన్నారు అప్పటినుంచే అనేకమంది నీన్డర్తల్ మనుషుల అవశేషాలు కనుగొనటం జరిగింది పాత రాతియుగంలో అతడు యూరప్‌లోని ఎన్నో ప్రదేశాలలో నివసించాడు అతడు ఎన్నోవిధాల ఆధునిక మానవుణ్ణి ప్రతిబింబిస్తుంటాడు అతనికి పెద్ద కపాలం (పుర్రె), పెద్ద మెదడు ఉన్నాయి అతడు బహుశా 70,000 సంవత్సరాల క్రితం నివసించి ఉండవచ్చు. రాపిడి కలిగించే చెకుముకి రాళ్ళను మరియు రాతి మొనలను వదిలిపెట్టి ఉండవచ్చు. అతడు గుహల్లో నివసించేవాడు మరియు అత్యంత నైపుణ్యంకల వేటగాడు కూడా అతడు 35,000 బి.సి.లో మరణించి ఉండవచ్చు

ఆధునిక మానవుడికి ప్రత్యక్ష వారసుడైన క్రో-మాగ్నన్ మానవుడు ఫ్రాన్స్‌లోని క్రో - మాగ్నన్ లోనూ, యూరప్‌లోని ఇతర ప్రాంతాలలోనూ మరియు ఉత్తర ఆఫ్రికాలోనూ దాదాపు 8,000 నుంచి 10,000 సంవత్సరాల క్రితం వరకు నివసించేవాడు. వందకు పైగా క్రో-మాగ్నన్ మనిషి యొక్క నమూనాలు ఇంతవరకు కనుగొనబడ్డాయి. అతడు నీన్డర్తల్ మనిషికి బదులుగా తయారయ్యాడు. ఆధునిక బుద్ధి మరియు రూపురేఖలు కలిగి ఉన్నాడు.



అతడు చెకుముకి రాయి మరియు ఎముకల వరికరాలను, ఆయుధాలను, చక్కగా తయారైన కత్తులను ఉపయోగించాడు జంతువులకు సంబంధించిన గుర్తించదగిన గుహా చిత్రాలను కూడా అతడు విడిచి పెట్టాడు మరణించిన వాటిని పూడ్చిపెట్టాడు. అతడు బహుశా ఒక క్రమబద్ధమైన సామాజిక జీవితం కూడా అనుభవించి ఉండవచ్చు.

"ప్రేమలేని వివాహం వ్యక్తిని బాధిస్తుంది. వివాహం లేని ప్రేమ సంఘాన్ని బాధిస్తుంది"
—బుచ్చిబాబు

# మన ప్రాచీనుల మహాత్మ్యాలు

## శిలలలో సంగీత ఝరులు

ఆర్ శెట్టి

కర్ణాటకలోని హొస్పేట్‌కు 11 కి.మీ.ల దూరంలో ఉన్న హంపీ గ్రామంలో విజయ విఠల దేవాలయంలోని రాతిస్తంభాలను తట్టినట్లయితే మనకు స్పష్టమైన సంగీత శబ్దాలు వినిపిస్తాయి




ఒకదాని వెంట ఒకటిగా వీటిని త్వరితంగా తట్టినట్లయితే ఈ రాతి స్తంభాల నుంచి ఒక సంగీత కచ్చేరి ప్రవహిస్తుంది ఒకనాటి విజయనగర సామ్రాజ్యానికి (1336-1646 ఏడి) రాజధానిగా ఉన్న హంపీలోని దేవాలయంలో ఇటువంటి సంగీత రాతి స్తంభాలు 54 ఉన్నాయి

ఒక దీర్ఘ చతురస్రపు ముంగిలిలో నిల్చిన విజయవిఠల దేవాలయం ప్రసిద్ధ చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయల (1509-29 ఏడి) చేత నిర్మించబడింది ఈ దేవాలయానికి చెందిన దృఢమైన, మనసులో ముద్రవేసే స్తంభాలు ఎంతో పెద్దవి ప్రతి ఒక్క స్తంభం ఏకశిలతో నిర్మించబడింది. విజయనగర శైలిలో రాతి పూలతో - అత్యంత అమూల్యమైన ఆభరణాలుగా - చెక్కబడిన ఈ స్తంభాలు 12 అడుగుల ఎత్తు, 4 నుంచి 16 చదరపు అడుగుల పునాది కలిగి ఉన్నాయి ఈ రాయి దృఢమైన నల్లరాయి (Granite)

ప్రతి రాతి స్తంభంలో మూడు విభాగాలు ఉన్నాయి పునాది, అధో భాగం మరియు మధ్య భాగం స్తంభంలోని మధ్య భాగం అనేక ప్రత్యేక పట్టెలుగా (bars) నైపుణ్యంతో చెక్కబడింది ఈ పట్టెల సంఖ్య ఒక స్తంభం నుంచి మరో స్తంభానికి విభిన్నంగా ఉంది కొన్ని స్తంభాలకు ఏడు పట్టెలు ఉంటే మరి కొన్నిటికి 16 పట్టెలు ఉన్నాయి ప్రతి పట్టె దాని స్వంత ఆకారం, కొలత కలిగి, తట్టినప్పుడు విభిన్న రీతిలో సంగీత ధ్వనులను ఉత్పత్తి చేస్తుంది ఒకే రాతికి, స్తంభానికి చెందినవే ఈ విభిన్న పట్టెలు అన్న విషయమే మనల్ని ఆశ్చర్య పరుస్తుంది అయినప్పటికీ వీటిలోని ప్రతి ఒక్కటీ విభిన్నమైన ప్రత్యేక సంగీత శబ్దాలను ఉత్పత్తి చేస్తుంది స్తంభాల ఆకారం, కొలత మరియు మందం (దళసరితనం) వల్ల ఇది తటస్థిస్తుంది

ప్రాచీన భారతీయులకు భూవిజ్ఞానశాస్త్రం (Geology) మరియు సంగీత శాస్త్రంలో పరిచయం (ప్రావీణ్యం) కలదనే వాస్తవానికి విఠలాలయంలోని సంగీత రాతి స్తంభాలు సజీవ స్మారక చిహ్నాలు సంగీతాన్ని ఉత్పత్తి చేసే రాళ్ళను ఎంపిక చేసుకుని, వాటిని అనేక పట్టెలలో చెక్కగలిగే నైపుణ్యం, సామర్థ్యం, ఆచరణాత్మక వివేకం వారిలో ఉన్నాయి.

# నిజాలు - నిదర్శనాలు

## ఇండియాలోనే వృద్ధుల పెంపుదల



ప్రపంచంలోని వృద్ధులలో ఎక్కువ భాగం ఇండియాలోనే ఉన్నారు. ఇక్కడ 60 సంవత్సరాలు, ఆపై వయస్సు కలవారి జనాభా అభివృద్ధి, మొత్తం జనాభా పెరుగుదల రేటుకన్నా ఎంతో త్వరితంగా జరుగుతున్నది. ప్రస్తుతం ఇండియాలో ఉన్న వృద్ధుల జనాభా 34.3 మిలియన్ మంది (1991 జనాభా లెక్కలు)

## పూర్తి అంధులు 30 మిలియన్ మంది

ప్రపంచమంతటా పూర్తిగా గ్రుడ్డివారు ప్రస్తుతం 30 మిలియన్ మంది ఉన్నారు (ఆల్ ఇండియా ఆప్థల్‌మొలాజికల్ కాన్ఫరెన్స్ డేటా)

## ఇండియాలో బాలల జనాభా

ఇండియా మొత్తం జనాభాలో 6 ఏళ్ళ వయస్సు వరకు ఉండే పిల్లలు దాదాపు 18 శాతం ఉన్నారు. 0-6 వయస్సు కలవారిలో అత్యధిక శాతం మేఘాలయాలో ఉన్నారు. రాష్ట్రం మొత్తం జనాభాలో వీరు 22.18 శాతం కాగా, గోవా రాష్ట్రం మొత్తం జనాభాలో పిల్లల జనాభా 11.74 శాతంగా ఉంది - దేశంలో అత్యల్ప శాతం ఇదే (1991 జనాభా లెక్కలు)

## ఆరవ ప్రధాన ప్రాణహారి

ఇండియాలో 2 మిలియన్ కాన్సర్ రోగులు ఉన్నట్లు అంచనా. ప్రతి సంవత్సరం 5 లక్షల కొత్త కేసులు వెలుగులోకి వస్తున్నాయి. ప్రతి సంవత్సరం దాదాపు 3 లక్షలమంది ప్రాణాలను తీస్తూ ఇది ఆరవ ప్రధాన ప్రాణహారిగా తయారయింది.

## ఢిల్లీలో బాల కార్మికులు

ప్రస్తుతం ఢిల్లీలో 400,000 బాల కార్మికులు ఉన్నారు. ఇది నగరంలోని పిల్లల మొత్తం జనాభాలో దాదాపు 18 శాతంగా ఉంది. బాల కార్మికులలో 100,000 మంది ఇంటి నౌకర్లుగా ఉన్నారు (ఆధారం యునిసెఫ్ వారి అధ్యయనం)

## కేరళలో అత్యధిక అక్షరాస్యత

ఇండియాలోని రాష్ట్రాలన్నిటిలో కేరళలో అత్యధిక అక్షరాస్యత - 90.59 శాతం ఉన్నది. కేంద్రపాలిత ప్రాంతాలలో చండీఘర్ 78.73 శాతం, ఢిల్లీ 76.06 శాతం అక్షరాస్యత సాధించాయి.

## ప్రపంచంలో విశాల భవనం

*14వ శతాబ్ది మధ్యకాలం నుండి 20వ శతాబ్ది తొలినాళ్ళ వరకు పరిపాలించిన మింగ్ మరియు జింగ్ వంశాలకు చెందిన 24 మంది చక్రవర్తులు నివసించిన చైనా దేశపు ప్రాచీన రాజసౌధం బైజింగ్‌లో ఉన్నది. ఉన్నత పథక శ్రేణిలో నిర్మితమైన ఈ నిర్మాణం ప్రపంచంలోనే అతి విశాలమైన రాజ ప్రాసాదంగా నిలుస్తుంది. 720,000 చ.మీ.ల విస్తీర్ణం గల ఈ భవంతి 10 మీటర్ల ఎత్తు, 52 మీటర్ల వెడల్పు గల గోడలతో చుట్టబడి ఉంటుంది.*

## 33 ఆహారం తయారు చేసే ప్రక్రియ మరియు పోషకాహార కేంద్రాలు

ప్రస్తుతం ఇండియాలో 15 రాష్ట్రాలు, రెండు కేంద్ర పాలిత ప్రాంతాలలో ఉన్న 43 డైరీల నుండి 33 లక్షల లీటర్ల పాలు - విటమిన్ 'ఏ' తో బలపర్చబడి సరఫరా చేయబడుతున్నాయి ఇప్పుడు దేశంలోని వివిధ ప్రాంతాలలో - 33 ఆహారం తయారు చేసే ప్రక్రియ మరియు పోషకాహార కేంద్రాలు పనిచేస్తున్నాయి

## ఇండియాలో వజ్రాల పరిశ్రమ



1991-92లో ఇండియాలోని వజ్రాల పరిశ్రమ 6,000 కోట్ల రూపాయల విలువైన వజ్రాలను ఎగుమతి చేసింది ఇండియాలో వజ్రాల ఎగుమతిదారుల సంఖ్య 2,000 వజ్రాల పరిశ్రమ అధిక సంఖ్యలోనే పని వారిని పెట్టుకుంటుంది. 1990లో వీరి సంఖ్య 8,00,000

— 'ఎకనామిక్ టైమ్స్' సౌజన్యంతో

## గంగా జలాలను మురికి చేసే పారిశ్రామిక సంస్థలు

ప్రస్తుతం ప్రతిరోజు 1,000 కిలో లీటర్ల వ్యర్థ పదార్థాలను గంగానదిలోకి వదులుతూ నీటిని మురికి చేస్తున్న 68 పారిశ్రామిక సంస్థలు ఉన్నాయి. వీటిలో 34 ఉత్తరప్రదేశ్‌లో, 5 బీహార్‌లో, 29 పశ్చిమ బెంగాల్‌లో ఉన్నాయి.

## స్టాంపుల కథ

### ప్రదమ స్వయంచాలిత దీపస్తంభం




First Automated Lighthouse.

*స్వీడిష్ రాయల్ పేటెంట్ మరియు రిజిస్ట్రేషన్ కార్యాలయం ప్రారంభించి 100 సంవత్సరాలైన సందర్భంలో 1992 లో స్వీడన్ (యూరప్) ఈ తపాలా బిళ్ళను విడుదల చేసింది ఈ తపాలా బిళ్ళలో ఒక సూర్య కవాటీ (sun valve) మరియు స్వీడన్‌లోని గాస్‌ఫిటిన్‌లో నిర్మించిన ప్రపంచంలోని మొట్టమొదటి స్వయంచాలిత దీపస్తంభం (automated lighthouse) కనిపిస్తాయి ఈ సూర్య కవాటం లేక సన్ వాల్వ్ - వెలుతురుకు చైతన్య వంతమైన కవాటం- సూర్యోదయం కాగానే స్వయం చాలకంగా దీపాన్ని ఆర్పివేస్తుంది సూర్యాస్తమయం కాగానే (చీకట్లు వ్యాపించగానే) తిరిగి వెలిగిస్తుంది దీనిని స్వీడిష్ రాయల్ పేటెంట్ ఆఫీసులో పేటెంట్ (సర్వహక్కులు ప్రత్యేకించటం) చేశారు దీని తరువాత ఇతర చోట్లగల దీపస్తంభాలకు స్వయంచాలకత్వం అంగీకరించారు*

— *కవితా రాయ్*

# గతానికి దూతగా 4000 ఏళ్ళనాటి మనిషి

చాలాకాలం క్రితం ఒక రోజున చర్మపు కోటు ధరించిన ఒక యువకుడు, ఒక మోటు రకం కొయ్య సామాన్ల మూటను భుజానికి తగిలించుకుని, ఒక కత్తిని, ఒక బాణాన్ని మరియు ఒక గొడ్డలిని గట్టిగా పట్టుకుని, ఆస్ట్రియా నుండి ఇటలీ వరకు విస్తరించిన టైరొలియన్ ఆల్ప్సుకు నడచి పోతున్నాడు అప్పుడు ఆ ఎత్తైన పర్వతాలలోని దాదాపు 3,200 మీటర్ల పైన ఏదో ఒక విఘాతం సంభవించింది ఒక ఆకస్మిక అపాయమో, ఒక హింసాత్మక ప్రహారమో (దెబ్బ) అతని ప్రాణాల్ని హరించింది సిమిలాన్ హిమానీ నదం (Similaun Glacier) కబళించి వేసేందుకు వీలుగా అతని భౌతికకాయం అలాగే వదిలివేయబడింది అక్కడ అతడు ఆ హిమఖండం బీటల్లో సమాధి అయి, ఘనీభవించి, అలాగే విడిచి పెట్టబడి ఉన్నాడు

ఇప్పుడు 4000 సంవత్సరాల తరువాత అతడు పైకి వచ్చాడు - వాస్తవంగా చెడకుండా (తాకబడకుండా), గణనీయంగా, బాగా భద్ర పర్చబడి ఉన్నాడు ప్రాచీన గతానికి ఒక దూతవలే ఉన్నాడు హిమఖండం అంచున - ఇద్దరు జర్మన్ ఆరోహకులకు అడ్డు వచ్చిన ఈ చెడకుండా కాపాడబడిన శవం తొలి కంచుయుగంనాటి అసాధారణ మానవుని నమూనాగా గుర్తించబడింది యూరప్‌లో ఇంతవరకు కనుగొనబడిన వాటిల్లో పురాతన మైనది బహుశా ఇదే కావచ్చు. ఈ "సిమిలాన్‌కు చెందిన మంచు మనిషి" బాగానే భద్రపర్చ బడ్డాడు ఈ మంచుమనిషి ఆస్ట్రియాలోని ఇన్స్‌బ్రూక్ యూనివర్శిటీకి విమానం ద్వారా - విస్తృత అధ్యయనం కోసం పంపబడ్డాడు

"యూరప్ చరిత్రలోని చీకటికాలంలోకి ఈ పరిశోధన క్షణదర్శనం కల్గిస్తుంది" అని టైమ్ చెబుతున్నది ఈజిప్ట్ రాజ్యాలతోనూ, మరియు మెసపొటేమియాకు చెందిన నగర రాజ్యాలతోనూ పోల్చినప్పుడు కంచు యుగంలోని మధ్య యూరప్ (సెంట్రల్ యూరప్) మిక్కిలి పురాతనమైనది మిశ్రమ వ్యవసాయం మరియు వేటద్వారా జీవనోపాధి చేసుకుని స్వయంపోషకంగా ఉంటూ చిన్న సంఘాలుగా నివసించే నిరక్షరాస్యులైన వ్యవసాయదారుల జనాభాతో ఈ నేల నిండి ఉండేది

## ఆలోచించి చూడు



* నీకలలు నిజాలు కావాలంటే మేల్కొనటం చక్కని మార్గం
* వ్యాపారంలో కఠినమైన పనుల్లో ఒకటి నీ పనిలో నీవు శ్రద్ధ వహించటం
* ప్రతివారూ సుదీర్ఘకాలం జీవించాలని కోరుకుంటారు కానీ ఎవరూ వృద్ధాప్యం రావాలని కోరుకోరు
* ఇతరుల దురదృష్టాలను భరించగలిగే శక్తి మన అందరికీ ఉంటుంది

ప్రాచీనకాలంనాటి ఐరోపా వాసుల జీవిత చిత్రణ చేయడానికి ఏ విధమైన వ్రాత పూర్వక రికార్డ్సు లేనందువల్ల శాస్త్రవేత్తలు త్రవ్వకాలనుంచి వెలికి తీసే వాటిపైనే ఆధార పడవలసి వస్తున్నది.

ఈదృష్ట్యా మంచుమనిషి ద్వారా ఇప్పటికే ఎంతో సమాచారం లభించింది. అతడు 20 నుంచి 40 ఏళ్ళ వయస్సు కలవాడు దాదాపు 160 సెం.మీ.ల ఎత్తుతో, శిలువ గుర్తులు మరియు గీతల (రేఖలు) ఆకారంలో వచ్చ పొడిచిన గుర్తులు (పచ్చబొట్లు) కలిగి ఉన్నాడు. అతడి పండ్లు - మాంసాహారం మరియు రాళ్ళతో కొట్టిన ఆహారం తీసుకునేవాడని సూచిస్తున్నాయి (అతని కడుపులోని పదార్థాలను విశ్లేషించిన తరువాత అతని ఆహారపు అలవాట్ల గురించి ఎక్కువ సమాచారం దొరకవచ్చు.) ఆల్పైన్ పర్యటనకు సర్వసన్నద్ధుడై అతడు పదును పెట్టిన చర్మపు పైఅంగీని (జాకెట్) ధరించాడు. చలికాలపు శీతలత్వాన్ని తట్టు కోడానికి ఎండు కసవు - లోతట్టు పొరగా నిర్మించిన పదును పెట్టిన చర్మపు కాలి జోళ్ళు అతనికి ఉన్నాయి.

— 'ట్రిబ్యూన్' సౌజన్యంతో

## [illegible]

## [illegible] ఎగిరే పాము

ఒక ఎగిరే పాము - అసాధారణ సరీసృపం (పాకుడు జంతువు) జావా (ఇండోనేషియా) మరియు మలేసియాలలో కనిపిస్తుంది. అది ఒక రిబ్బన్ వలే సమంగా రూపొంది ఒక చెట్టునుంచి మరో చెట్టుకు ప్రయాణం చేస్తుంది. చెట్టు నుంచి భూమిపైకి మెలిదిరిగే సుడివలే ప్రయాణిస్తుంది.

## [illegible]

'వెలికిరా' అనే మాటలు కేవలం నోటి నుంచి ఉచ్చరించగానే భూగర్భంలో దాగిన సంపద వెలికి రాదు. నీవు సరైన మార్గ నిర్దేశనం చేసుకోవాలి, త్రవ్వాలి, పైనున్న మట్టినీ, రాళ్ళనూ తొలగించాలి. ఆ తరువాత దాన్ని నీ సొంతం చేసుకోవాలి.

## [illegible]

తాత్పర్య రచన: యామిజాల పద్మనాభ స్వామి

తన వారు లేని చోటను
చనవించుక లేని చోట, జగడము చోటన్
అనుమానమైన చోటను
మనుజునకును నిలువ వగదు మహిలో,
సుమతీ!

[తన బంధువులు లేని చోట, ఏలాటి పరిచయం లేని చోట, కలహాలు జరిగే చోట, తనకి జీవితం సుఖంగా జరుగుతుందా? అన్న సందేహం కలిగించే చోట ఉండకూడదు.]

* * *

చుట్టములు కాని వారలు
చుట్టములము నీ కటంచు సొంపు దలిర్పన్
నెట్టుకుని ఆశ్రయింతురు
గట్టిగ ద్రవ్యంబు గలుగ గదరా! సుమతీ!

[ఏలాటి సంబంధం లేనివారు ఏదో చెప్పి నీకు మేము చుట్టాలమయ్యా! అని ఇచ్చకా లాడుతూ నచ్చిక మాటలాడుతూ కొందరు వస్తారు. ఈ రావడానికి కారణం ఏమిటో తెలుసునా? అన్న వస్త్రాలకు లోటు లేకుండా సమృద్ధిగా ధనం ఉండడం కారణం - అలాటి వారిని చేరదీయకూడదు.]

'[illegible]'

— [illegible]

# సౌహార్దానికి, ఉల్లాసానికి ప్రతీక-దీపావళి

సాంప్రదాయకంగా దీపావళికి అర్థం - పండుగకు ఒక నెల అటూ, ఒక నెల ఇటూ - 24 గంటల సేపు బాణా సంచా కాల్చటం కాదు. రాత్రిని పగలుగా మార్చే విధంగా విద్యుద్దీపాల మాలికలను అలంకరించటం కాదు



ఈ సంవత్సరం, నిజమైన సాంప్రదాయిక దీపావళి జరుపుకోండి ఇది మరింత సౌందర్య వంతంగా, పర్యావరణ సంకేతంగా ఉండాలి

*దీపావళికి ముందు, దీపావళినాడు మాత్రమే బాణసంచా ధ్వనులను పరిమితం చేసేందుకు ప్రయత్నించండి వ్యయాన్నీ, మోత (శబ్దం)నూ, వాతావరణ కాలుష్యాన్నీ తగ్గించండి

*జనసమ్మర్దం కల ప్రాంతాలలో బాణా సంచా కాల్చవద్దు వృద్ధులు, పిల్లలు మరియు దుర్బలులు ఈ నిరంతర శబ్దానికి తట్టుకోలేరు భద్రత దృష్ట్యా అందరికీ అపాయకరం కూడా

*దీపావళి - దీపాల పండుగ. కనుక మీ ఇంటిని కూడా దీపాల కాంతితో నింపండి.

కానీ మితిమీరి చేయటం మానండి. మీరు ఖర్చు చేస్తున్న విద్యుచ్ఛక్తిని గురించీ (లేదా) నూనెను గురించీ కాసేపు ఆలోచించండి

దీపావళి - ధ్వని పెంపుదలకూ, కాంతి పెంపుదలకూ పోటీ జరుపుతున్న పండుగ కాకూడదు సౌహార్దానికి, ఉత్సాహానికి (ఉల్లాసానికి) - ఇది అనువైన సమయంగా రూపొందాలి

—'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## అదే కోతి [illegible] రెస్టారెంట్

బ్రెజిల్‌లో రియో డి జనిరో లోని ఒక రెస్టారెంట్ యజమాని ఖాతాదారులను ఆకర్షించేందుకు చేసే ప్రయత్నాలలో తన రెస్టారెంట్‌లో అల్పాహారాలు అందించేందుకు ఒక కోతిని 'అద్దె'కు తీసుకున్నాడు కాలం గడుస్తున్న కొద్దీ ఈ కొత్తదనంలోని ఆకర్షణ తగ్గిపోయింది అయినా రెస్టారెంట్ విపరీతంగా వ్యాపారం పెంపు చేసుకుంటున్నది ఈ కొత్తదనం కోసం కాక అక్కడ త్వరితంగా సేవలు అందుతున్నాయనే అభిప్రాయంతో ప్రజలు ఆకర్షించబడుతున్నారు. ఖాతాదారు తన ఆర్డరును పళ్ళెంలో ఉంచగానే, కోతి దాన్ని తక్షణమే వంటగది లోకి తీసుకు వెళ్తుంది కొన్ని నిమిషాలలోనే ఆర్డర్ చేసిన ఆహార పదార్థాలను తీసుకుని తిరిగి వస్తుంది

## ఉన్నత వ్యక్తి

ఉన్నత వ్యక్తి - సత్ప్రవర్తన గురించి ఆలోచిస్తే, అల్పవ్యక్తి సుఖాన్ని గురించి ఆలోచిస్తాడు ఉన్నత వ్యక్తి - చట్టం దండన (శాసనానుమతి) గురించి ఆలోచిస్తే, అల్పవ్యక్తి తను పొందబోయే ఉపకారాలను గురించి యోచిస్తాడు

— కన్‌ఫ్యూషియస్

"[illegible] ఉంటుంది"

—[illegible]

# భూమి పైనున్న జీవరాశికి పోషకుడు

చరిత్రకు పూర్వకాలం నుంచి సూర్యారాధన జరుగుతున్నది. సూర్యుని తమ అధి దైవతంగా భారతీయులే కాక సుమేరియన్లు, ఈజిప్షియన్లు, బాబిలోనియన్లు, పెర్షియన్లు, గ్రీకులు మరియు రోమన్లు గౌరవించేవారు అమెరికాలో సూర్యుని కోసం పెద్ద దేవాలయాలను అజ్టెక్, మాయ మరియు ఇన్కా నాగరికతలు నిర్మించాయి

SUN

ఇండియాలో ఒరిస్సాలోని కోణార్క్‌లో సూర్య దేవాలయం ఒక దీపస్తంభంగానే కాక నావికులకు దిక్కులు చూపే అయస్కాంత సూచికగా ఉండేది

సూర్యుని ప్రాధాన్యం గుర్తించేందుకు ఎవరైనా సూర్యారాధకుడు కానక్కరలేదు అది ఒక ప్రవర్థమానమౌతున్న మొక్కలోని వికసిత దళం కానీ, మానవ శరీరంలోని అందమైన వర్చస్సు కానీ కావచ్చు - దేనికైనా - భూమిపై నున్న అన్ని జీవరాసులకూ సూర్యుడు పోషణ కలిగిస్తాడు. అణ్వస్త్ర శక్తి మినహా (పరోక్షంగా ఇది కూడా సూర్యుని నుంచి వచ్చేదే) 98 శాతం వేడిమి సూర్యుని నుంచి వస్తుంది

ఔషధ పిత హిప్పోక్రాట్స్ - సూర్యకాంతి కొన్ని వ్యాధుల నివారణకు పనికి వస్తుందని 2000 సంవత్సరాల క్రితమే కనుగొన్నాడు. దీనికి హీలియోథెరపీ అని పేరు పెట్టాడు. సూర్యకాంతి - సూక్ష్మ జీవులను నశింపజేసేందుకు అత్యంత శక్తివంతమైనది. వివిధ తరంగ దైర్ఘ్యాల (wavelengths) లోని (అల్ట్రావయొలెట్ నుంచి ఇన్‌ఫ్రా - రెడ్ వరకు) కాంతి మరియు వివిధ రంగులు - కొన్ని వ్యాధుల నివారణకు ఉపయోగపడతాయి ఇండియాలో జునాఘడ్ (గుజరాత్) నవాబు వివిధ రంగుల అద్దాలతో ఒక సౌరశాల (solarium) ను నెలకొల్పాడు

రష్యాలో 'ఇంపల్స్ హీలియోథెరపీ' అని పిలువబడుతున్న సూర్యుని ద్వారా స్వస్థపర్చే ఒక కొత్త పద్ధతి ప్రారంభమైంది. ఉజ్బెక్ అకాడమీ ఆఫ్ సైన్సెస్‌లో అభివృద్ధి చేయబడిన ఈ విధానం -నిమిషానికి 60 నుంచి 120 వరకు

## ప్రపంచంలో గుర్తించబడిన మొదటి పుష్పం

*ప్రపంచంలో మొదటిసారిగా గుర్తించబడిన 120 మిలియన్ సంవత్సరాల నాటి పుష్పం యొక్క శిలాజాన్ని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు ఆగ్నేయ ఆస్ట్రేలియాలో 10 సంవత్సరాల క్రితం ఇది వెలికి తీయబడింది*

## పిహెచ్.డి. సాధించిన అంధ విద్యార్థి

*నలందా జిల్లా (బీహార్)కు చెందిన పర్వల్‌పూర్ గ్రామస్తుడు, వెనుకబడిన ధనుక్ కులస్తుడు అయిన డాక్టర్ అనిల్ కుమార్ తన 7వ ఏట కంటి చూపు కోల్పోయాడు అతడు సమర్పించిన పరిశోధక వ్యాసం - "బీహార్‌లో అంధులు - ఒక సామాజిక పరిశీలన"కు పాట్నా విశ్వవిద్యాలయం నుండి పిహెచ్‌డి డిగ్రీ పొందాడు*

ఇంపల్స్‌లతో - ఒకే ప్రదేశంలో అస్థిరంగా కేంద్రీకృతం చేసిన సూర్యకిరణాల చికిత్స. సెమాష్కో ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హెల్త్ రిసార్ట్ అండ్ ఫిజియోథెరపీలో దీన్ని ఉపయోగిస్తున్నారు. బ్రోంకైల్ అస్థమా (రొమ్ము పడిశం), క్రానిక్ న్యుమోనియా, కార్డియోవాస్క్యులర్, లోకో మోటర్ (నరాలకు, కండరాలకు సంబంధించినది), చర్మ వ్యాధులు మరియు ఇతర వ్యాధులపైన ఈ కొత్త పద్ధతిలో జరిపే చికిత్స యొక్క విజయాన్ని గురించి వైద్య శాస్త్రజ్ఞులు ఉన్నతాభిప్రాయంతో ఉన్నారు

సూర్యుడు - మనకు దగ్గర నక్షత్రం, దీని చుట్టూ భూమి తిరుగుతుంటుంది ఇదొక స్వయం ప్రకాశం గల శరీరం (దేహం) మరియు పరమాణువు రూపంలో వాయువుతో ధగ ధగ వెలిగే భూగోళం ఈ రెంటినీ తన స్వంత గురుత్వంతో కలిపి ఉంచుతున్నది దీని ఉష్ణోగ్రత ఉపరితలంపైన 10,000 డిగ్రీల ఫారెన్‌హీట్ నుంచి కేంద్రంలో దాదాపు 2,80,00,000 డిగ్రీల ఫారెన్‌హీట్ వరకు మారుతూ ఉంటుంది భూమి నుండి సూర్యుని దూరం దాదాపు 9,30,000 మైళ్ళు - సూర్యుడు పూర్తిగా (పొగ) వాయు రూపంలో ఉన్నప్పటికీ, దాని దూరం దీనికొక ఉపరితలం ఉన్నట్లు దృష్టి భ్రమ కలిగిస్తుంది

ఎవరైనా సూర్యుని పూజించనీ, పూజించకపోనీ, వాస్తవాలు తెలుసుకున్న తరువాత భూమిపై నున్న సమస్త జీవరాసుల్ని పోషిస్తున్న ఆ కాంతి పదార్థానికి మనం కనీసం గౌరవాదరణలు సమర్పించెదము గాక!

— శ్రీయోగీశ్వర్ "సూర్య నమస్కార్" మరియు డా కె. జి. శర్మ ఫైనాన్షియల్ ఎక్స్‌ప్రెస్ (యోగా అండ్ టోటల్ హెల్త్) సౌజన్యంతో

## సుఖ సంసారానికి సూత్రాలు



* ఒకే సమయంలో ఉభయులూ కోపగించుకోకండి
* ఇంటికి నిప్పంటుకుంటే తప్ప ఒకరినొకరు అరచుకోకండి
* మీలో ఎవరో ఒకరు వాదనలో గెలవాలనుకుంటే, ఆ అవకాశం మీ సహచరికి/సహచరునకు ఇవ్వండి
* మీరు విమర్శించ దలిస్తే, అది ప్రేమ పూర్వకంగా చెయ్యండి
* గతంలోని తప్పులను ఎప్పుడూ ముందుకు తీసుకురాకండి
* ఒకరినొకరు నిర్లక్ష్యం చేసుకునే దానికంటే, ప్రపంచం మొత్తాన్ని నిర్లక్ష్యం చేయండి.
* పరిష్కారం కాని వాదన తరువాత ఎప్పుడూ నిద్రకు ఉపక్రమించకండి
* మీ జీవిత భాగస్వామిని కనీసం రోజుకొక సారైనా అభినందన పూర్వక ప్రశంస చేయండి దయతో కూడిన మాట ఆమె పట్ల చెప్పండి
* మీరు ఏదైనా పొరపాటు చేసినట్లయితే దాన్ని అంగీకరించేందుకు సిద్ధంగా ఉండండి క్షమార్పణ కోరుకోండి
* పోట్లాటకు ఇద్దరు అవసరమౌతారు వారిలో ఎక్కువగా మాట్లాడే వ్యక్తే తప్పు చేసిన వ్యక్తి

— 'హెరాల్డ్ ఆఫ్ హెల్త్' సౌజన్యంతో

# విజ్ఞాన వీచిక - బుద్ధగయ

గౌతమ బుద్ధుడు జ్ఞానజ్యోతిని దర్శించిన బుద్ధగయ - హైందవ పుణ్యక్షేత్రం గయకు దక్షిణంగా ఆరుమైళ్ళ దూరంలో ఉంది ఇది పాట్నా (బీహార్)కు చేరువలో ఉంది బుద్ధుడు కూర్చుని ధ్యానం చేసి, సర్వోన్నత జ్ఞానాన్ని సముపార్జించుకున్న బోధివృక్షం (రావిచెట్టు) ఇక్కడ ఉంది ఈ పవిత్ర స్థలంలో - అనేక పర్యాయాలు పునరుద్ధరించబడిన మహాబోధి ఆలయం ఉంది ప్రాచీన బౌద్ధ స్మారక చిహ్నాలలో దీనికి సమానమైనది లేదు



BUDDHA

ఇప్పుడు బుద్ధగయలో విలసిల్లుతున్న మహాబోధి ఆలయం దాదాపు 160 అడుగుల (55 మీటర్లు) ఎత్తుతో, ఏడు అంతస్థులు గల తిన్నని (వంపులేని) పిరమిడు రూపంగల గోపురం కలిగి ఉంది సర్వోన్నత జ్ఞానాన్ని సముపార్జించుకున్న మహత్తర ఘట్టానికి చిహ్నంగా బంగారుపూత పూసిన గొప్ప బుద్ధ విగ్రహం - భూమిని తాకుతున్న భంగిమలో - దేవాలయంలో ప్రతిష్ఠించబడింది దేవాలయానికి ఉత్తరపు వైపు భూమికి దాదాపు నాలుగు అడుగుల ఎత్తున, రాతితో నిర్మించిన ఒక వేదిక ఉంది దీన్ని "విహార (నడక) చైత్యపు ఆభరణం" (jewel shrine of the walk) అని పిలుస్తారు.



MAHABODHI TEMPLE, GAYA

పరిపూర్ణ జ్ఞానం పొందిన పిమ్మట బుద్ధుడు తీవ్ర ధ్యానంలో ఒక వారం రోజులు అటూ - ఇటూ నడక సాగిస్తూ గడిపిన చోటుగా దీన్ని చెబుతారు ఆయన తన పాదాలు నిలిపిన బిందువుల (కొనల)లో - నాడు ఆయన అడుగు జాడల్లో ప్రత్యక్షమైన అపురూప పుష్పాలకు ప్రతిబింబాలుగా నేడు చెక్కిన ఆభరణాలు కనిపిస్తాయి

## వంట ఇంటి సలహాలు

### బూట్‌పాలిష్‌కు మృదుత్వం

[illegible] మెత్తబడుతుంది

### గ్లిసరిన్‌తో తడిపిన గుడ్డపేలిక

గ్లిసరిన్‌తో తడిపిన గుడ్డ [illegible] తాయి

[illegible]

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1 బంగారం ఇండియాలో ప్రధానంగా లభించే రాష్ట్రం
(ఎ) బీహార్, (బి) కేరళ, (సి) ఒరిస్సా, (డి) కర్ణాటక



2 ఉక్కు తయారీ కర్మాగారం నెలకొల్పబడిన చోటు
(ఎ) కోలార్, (బి) ఖరగ్‌పూర్, (సి) భిలాయ్, (డి) ధన్‌బాద్.

3 "యూరప్ ఆటస్థలం" అని పేరొందిన దేశమేది?
(ఎ) ఇటలీ, (బి) ఆస్ట్రియా, (సి) స్విట్జర్లాండ్, (డి) స్వీడన్.

4 సంఖ్యలో దశాంశ పద్ధతి ఆరంభమైన దేశం·
(ఎ) ఇండియా, (బి) గ్రీస్, (సి) బెల్జియం, (డి) జర్మనీ

5 భూమిపై చంద్రుని బలవత్తరమైన ప్రభావం ఏమిటంటే
(ఎ) కాంతినివ్వటం, (బి) భూకంపాలు కలిగించటం, (సి) సూర్య చంద్రగ్రహణాలు కలిగించటం, (డి) సముద్ర కెరటాలపై ప్రభావం చూపటం.

6 ఈక్రిందివాటిల్లో వాణిజ్య పంట ఏది?
(ఎ) వరి, (బి) మొక్కజొన్న, (సి) బార్లీ, (డి) చెఱకు

7 ఇంద్రధనుస్సును ఎల్లప్పుడూ ఈ దిక్కులోనే చూస్తాము
(ఎ) తూర్పు, (బి) పడమర, (సి) సూర్యునికి ఎదురుగా, (డి) సూర్యునికి సూటిగా

8 'జీరో అవర్' అంటే ఏమిటి?
(ఎ) ప్రతిపక్షం వారి ప్రతిపాదనలను యోచనలోకి తీసుకున్నప్పుడు, (బి) అత్యంత ప్రాధాన్యం కల విషయాలు ప్రస్తావించ బడినప్పుడు, (సి) ఉదయం, మధ్యాహ్నం సమావేశాల మధ్య విరామ సమయం, (డి) లోక్ సభలో ఒక ద్రవ్య సంబంధమైన చట్టం ప్రవేశపెట్టినపుడు

## తిలక్ కార్యనిష్ఠ

ఒకప్పుడు లోకమాన్య బాలగంగాధర తిలక్ కుమారులలో ఒకరికి జబ్బు చేసింది ఒక వైపు కుమారుని ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపుతూనే మరొకవైపు 'కేసరి' పత్రిక పనిని చూస్తున్నారు ఒక రోజు ఆయన సంపాదకీయం వ్రాస్తున్నారు ఇంతలో ఇంటినుంచి కబురు వచ్చింది కుమారుని ఆరోగ్య పరిస్థితి ఆందోళనకరంగా ఉంది వార్త తెచ్చిన వ్యక్తితో తిలక్ "మీరు వైద్యుని పిలవండి ఆయన మందు ఇస్తారు నేను పని పూర్తికాగానే వస్తాను" అన్నారు

పని పూర్తి అయిన తరువాత తిలక్ ఇంటికి వెళ్ళారు కాని అప్పటికే ఆయన పుత్రుడు మరణించాడు ఆయన ప్రశాంత చిత్తంతో కుమారునికి దహన సంస్కారాలు చేశారు తిలక్ కర్తవ్యనిష్ఠ అటువంటిది

*(—"కథాకల్పతరువు" నుండి)*

"ప్రార్థనకు కావలసింది గొంతుకాదు, హృదయం"

## మాటల మహిమ

1 **అభ్రము.** (ఎ) **ఆకాశము,** (బి) మబ్బు, (సి) బంగారు, (డి) బేగడ
2 **అరాళము.** (ఎ) మదపుటేనుగు, (బి) సజ్జరసము, (సి) అభినయహస్త విశేషము, (డి) వీణ
3 **ఆత్మ** (ఎ) జీవుడు (బి) బుద్ధి/మనస్సు, (సి) బ్రహ్మము, (డి) శరీరము
4 ఇష్టి. (ఎ) యజ్ఞము, (బి) కత్తి, (సి) కోరిక, (డి) సంగ్రహశ్లోకము
5 ఉదానము (ఎ)కంఠమునందలి గాలి, (బి) పాము, (సి) బొడ్డు, (డి) ధాన్య విశేషము
6 ఉపచారము: (ఎ) సన్మానము, (బి) ఊడిగము, (సి) లంచము, (డి) వాడుక
7 ఉష్ణీషము (ఎ) తలపాగ, (బి) కిరీటము, (సి) తల, (డి) వేసంగి కాలము
8 ఊర్మిక (ఎ) అల, (బి) ఉంగరము, (సి) వస్త్రపు ముడుత, (డి) జనకుని కుమార్తె

## తెలివికి పరీక్ష

1 భూకంపాలు ఎలా వస్తాయి? ఇటీవల వచ్చిన దారుణ భూకంపానికి ఏ రాష్ట్రం గురైంది?
2 చర్మ కాన్సర్ ఎందువల్ల వస్తుంది? దీని రక్షణకు ఆధునిక ప్రక్రియ ఏది?
ఆంధ్రప్రదేశ్‌లో అభయారణ్యాలు ఎక్కడ ఉన్నాయి?
'అల్మా అటా' ఏదేశపు రాజధాని?
5 మానవుని లాలాజలంలో ఉన్న ఎంజైమ్ పేరేమిటి?
తెలుగు భాషా సాహిత్యాలకు మరపురాని సేవ చేసిన ఒక సాహితీ వేత్త 102వ జయంతి ఇటీవల జరిగింది ఆయన ఎవరు?

(జవాబులకు వ పేజీ చూడండి)

## కొమొడో డ్రాగన్స్

## Komodo dragon



*భూమిపై నివసిస్తున్న పొడవైన బల్లులు - కొమొడో డ్రాగన్స్ (భయంకర రెక్కల మొసళ్ళు) - దాదాపు 5,700, ఇండోనేషియాలోని కొమొడో నేషనల్ పార్క్‌లో నివసిస్తున్నాయి ఈ 219,322 హెక్టార్ల పార్క్ - కొమొడో, పదర్, రింకా మరియు గిలి మొటాంగ్ దీవులకు విస్తరించి, సాప్ స్ట్రెయిట్స్ జలాలను, ఫ్లోరెస్ ప్రధాన భూమిని చుట్టుకుని ఉంటుంది ఈ గణనీయమైన డ్రాగన్స్ దాదాపు 3 మీటర్ల పొడవు కలిగి, 135 కేజీల బరువుతో ఉండి, 100 సంవత్సరాల వరకు జీవిస్తాయి ఈ బ్రహ్మాండమైన బల్లులు మిలియన్‌ల సంవత్సరాల నుండి ఈ ప్రాంతంలో నివసిస్తున్నాయి*

— *'యునెస్కో' సౌజన్యంతో*

## ఆధునిక విజ్ఞానశాస్త్రంలో అద్భుతాలు

## కొత్త రాబోట్ విధానం

*ఎలక్ట్రిక్ పవర్ కంపెనీ నైపుణ్యంతో ఆవిష్కరించిన ఒక కొత్త రాబోట్ రెండు ప్లాస్టిక్ చేతులతో లైవ్ పవర్ డిస్ట్రిబ్యూషన్ వైర్ (విద్యుత్ ప్రసారపు తీగె) పైన మరమ్మతు పనులు జరుపుతున్నది ఇది 14.5 మీటర్ల ఎత్తులో ఉన్న పనులను, 6,600 వోల్టుల విద్యుత్ కేబిల్స్ మీద విద్యుచ్ఛక్తి నిలిపివేయకుండానే పనిచేస్తుంది ఇది ప్రమాద కరమైన పనుల నుంచి నిర్వాహణ ఉద్యోగులను విడుదల చేస్తుంది*

# ఈ శతాబ్దంలో

## మొదటి 3-డీ చిత్రం

బెంగుళూరుకు చెందిన ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ శాస్త్రజ్ఞులు ఇండియాలోని - మొదటి హోలోగ్రాం - నగ్న నేత్రాలతో చూసే ఒక 3-డి చిత్రాన్ని 1969లో రూపొందించారు

## భారత అంతరిక్ష కార్యక్రమం



1963 నవంబర్ 21న తుంబా (కేరళ) నుంచి సముదూరపు రాకెట్‌ను ప్రయోగించటం ద్వారా భారత దేశపు అంతరిక్ష కార్యక్రమం ప్రారంభమైంది

## ప్రపంచంలో పెద్ద కెమెరా

ప్రపంచంలోని పెద్ద కెమెరా - ఆండర్సన్ మమ్మత్ కెమెరా - చికాగో (యుఎస్ఏ)లో 1900లో తయారు చేయబడింది విస్తరించినప్పుడు ఇది 9 అడుగుల ఎత్తు, 6 అడుగుల వెడల్పు, 20 అడుగుల పొడవుతో ఉంటుంది దీని రెండు లెన్సులు 68 అంగుళాల స్పష్టత కల (దూరం) వైడ్ యాంగిల్ జెన్ మరియు 120 అంగుళాల ఫోకల్ లెంగ్త్ కల టెలిస్కోప్ రాపిడ్ రెక్టిలినియర్ ఫోటో తీసేందుకు దాదాపు 150 సెకండ్లు పడుతుంది ఈ కెమెరా పని నిర్వహించేందుకు 15 మంది మనుషులు అవసరమౌతారు

## గాంధీజీ, మోతీలాల్ నెహ్రూ ప్రారంభించిన కాశీ విద్యాపీఠం

జాతీయ విద్య సమకూర్చేందుకు ఉత్తర ప్రదేశ్‌లోని వారణాశిలో 1921 ఫిబ్రవరి 10న కాశీ విద్యాపీఠానికి గాంధీజీ, మోతీలాల్ నెహ్రూ (జవహర్‌లాల్ నెహ్రూ తండ్రి) ప్రారంభోత్సవం చేశారు భగవాన్ దాస్ ప్రిన్సిపాల్‌గా నియమితులయ్యారు

## ఎఫ్.ఎం. ప్రసారం

ఫ్రీక్వెన్సీ మాడ్యులేషన్ (FM) బ్రాడ్‌కాస్టింగ్‌కు తొలిచర్యలు 1981లో మద్రాసులో తీసుకోబడ్డాయి మన దేశంలో ఇదొక కొత్త పురోగమనం

## అతడు పేదవాడే కానీ బుద్ధిశాలి

రైట్ ఆనరబుల్ శ్రీనివాసశాస్త్రి తన కళాశాలకు చొక్కా లేకుండా వెళ్ళాడు అతడు పేద విద్యార్థి చొక్కా లేకుండా కాలేజీకి వచ్చినందుకు ప్రిన్సిపాల్ అర్థరూపాయి జుల్మానా విధించాడు అప్పుడు శాస్త్రి ప్రిన్సిపాల్‌తో చెప్పాడు, "అయ్యా! నాదగ్గరే అర్థరూపాయి ఉన్నట్లయితే రెండు చొక్కాలు కొనుక్కునేవాడిని" అనంతరం అటువంటి బుద్ధిమంతుడైన విద్యార్థిని తరగతి గదిలో అవమానపర్చినందుకు ప్రిన్సిపాల్ జీనస్ ఎదుట పశ్చాత్తాపం ప్రకటించి, ప్రార్థన చేసుకున్నాడు

## ప్రథమ ఐరోపా వారాంతపు వార్తాపత్రిక

రాబర్ట్ మాక్స్‌వెల్ 1990 మే 10న "ది యూరోపియన్" అనే ప్రథమ ఐరోపా వారాంతపు వార్తాపత్రికను (Weekend newspaper) ప్రారంభించాడు

## ప్రపంచంలో భారీ ఎత్తున తాళం బిగించే విధానం



ప్రపంచంలో భారీ ఎత్తున తాళం బిగించే విధానం - సెంట్రల్ అమెరికాలోని పనామా కాలువ వద్ద గల మిరాఫ్లోర్స్ లాక్ సిస్టం - 1914 ఆగస్టు 15న అమలు చేశారు క్రింది రెండు తాళాలు 1,050 అడుగుల పొడవు, 110 అడుగుల వెడల్పు కలిగి ఉండగా, ద్వారాలు 82 అడుగుల ఎత్తు, 65 అడుగుల పొడవు మరియు 7 అడుగుల మందంతో ఉన్నాయి ప్రతి ఒక్క తలుపు 730-780 టన్నుల బరువు కలిగి ఉన్నది

## అత్యంత వృద్ధ సైనికుడు

అన్ని కాలాలలో అత్యంత వృద్ధుడైన సైనికుడు బహుశా జాన్ బి సల్లింగ్ కావచ్చు అతడు అమెరికా కాన్ఫెడరేట్ స్టేట్స్ ఆర్మీకి చెందినవాడు అమెరికా అంతర్యుద్ధం (1861 -65)లో పాల్గొని జీవించిన చివరి వ్యక్తిగా అంగీకరించబడినవాడు. తన 113 సంవత్సరాల 1 రోజు వయస్సులో అతడు 1959 మార్చి 16న కింగ్స్‌పోర్ట్ (టెన్నెసీ)లో కన్నుమూశాడు

## ఆసియాలో మొదటి సింథటిక్ రబ్బర్ కర్మాగారం

'సింథటిక్స్ అండ్ కెమికల్స్ లిమిటెడ్' అని పిలువబడే ఆసియాలోని మొదటి సింథటిక్ రబ్బర్ కర్మాగారం 1964లో ఉత్తర ప్రదేశ్‌లోని బరెల్లీలో ప్రారంభించబడింది

## బీహార్ నుండి ఒరిస్సా విభజన

1936 ఏప్రిల్ 1న బీహార్ నుండి ఒక ప్రత్యేక రాష్ట్రంగా ఒరిస్సా విభజించబడింది

## నామ మహిమ

*జీవితారణ్యంలో మృగాలనుంచి మిమ్మల్ని కాపాడగల తుపాకీ భగవన్నామం గుండు వదలినప్పుడు తుపాకీ పెద్ద ధ్వని చేస్తుంది నామమనే ధ్వనితో పాటు, భావమనే గుండును వదలి గురిని కొట్టండి 'నామంలో ఏముంది?' అని చాలామంది అడుగుతుంటారు అది కేవలం కొన్ని శబ్దాల సముదాయమే కదా అంటారు నా పలుకులు కూడా శబ్ద సముదాయమే గదా! అవి మీ హృదయాలలో ప్రవేశించగానే మీకు సంతృప్తి, ఉత్తేజమూ ఎందుకు కలుగుతున్నాయి? మాటలకు, మహత్తర శక్తి ఉంది ఉద్రేకాలను రెచ్చగొట్టగలవు, మనస్సులను శాంతపరచగలవు సత్యావిష్కరణ చేయగలవు అపారమైన శక్తికీ, వివేకానికీ ఆటపట్టు కాగల మహాశక్తి మాటలలో ఉన్నది కాబట్టి నామ మహిమను విశ్వసించి వీలు చిక్కిన వేళల్లో నామం పదే పదే ఉచ్చరించండి* —బాబా

"నా తరంలో కనుగొన్న ముఖ్యమైన విషయం ఏదంటే మానవ ప్రాణులు తమ మానసిక వైఖరులను మార్పు చేసుకోవటం ద్వారా తమ జీవితాలను కూడా మార్చుకోగలగటమే" — విలియం జేమ్స్

## 1902లో మౌంట్ పిలీ విస్ఫోటనం

ఫ్రెంచ్ వెస్ట్ ఇండీస్ (కరేబియన్ సముద్రం) లోని మార్టినిక్ దీవిలోని మౌంట్ పిలీ 1902లో ఉధృతంగా విస్ఫోటనం చెందింది వేడిమితో కూడిన ఎర్రని లావా పర్వతం నుంచి ప్రవహించి సెయింట్ పియర్రీ నగరాన్ని ధ్వంసం చేసింది

## పురాతన పక్షి

1979లో ఆంధ్రప్రదేశ్‌లోని అదిలాబాద్ జిల్లాలో భూగర్భ శాస్త్రజ్ఞులు ఒక పక్షి అవశేషాలు కనుగొన్నారు 19వ శతాబ్దిలో జర్మనీలో కనుగొనబడిన శిలారూపంగా ఉన్న ఒక పక్షి - ఆర్కియాప్టిరీ - కంటే ఇది ప్రాచీనమైనదని భావించబడుతున్నది

## లాంగ్ ప్లేయింగ్ రికార్డ్సు తొలి ఉత్పత్తి

మొదటిసారి విజయవంతంగా తయారు చేయబడిన లాంగ్ ప్లేయింగ్ రికార్డ్సును 1948 జూన్ 21న కొలంబియా రికార్డ్సుకు చెందిన డాక్టర్ పీటర్ గోల్డ్‌మార్క్ ఆవిష్కరించారు

## వైర్‌లెస్ సమాచారం పంపి అరెస్టయిన నేరస్థుడు

వైర్‌లెస్ సమాచారం ఉపయోగించి 1910లో అరెస్టయిన మొదటి నేరస్థుడు డాక్టర్ క్రిప్పిన్

## ప్రపంచంలో పెద్ద వంటశాల

ఒక తీవ్రమైన కఱవును ఎదుర్కొనేందుకు 1973 ఏప్రిల్‌లో ప్రపంచంలోనే పెద్ద వంటశాల ఇండియాలో నిర్మించబడింది ఈ వంటశాలలో ప్రతిరోజూ 1,200,000 మందికి భోజనాలు ఏర్పాటు చేశారు. ●

## ప్రపంచ రికార్డుల్ని బ్రద్దలు కొట్టిన ఓవెన్స్




అమెరికా పరుగు పందేల వీరుడు జెస్సీ ఓవెన్స్ *(Jesse owens)*, పరుగు పందాలలో మరియు అడ్డంకులను దాటటంలో నెలకొల్పిన ప్రపంచ రికార్డ్సు అనేక సంవత్సరాలు అలాగే నిల్చిపోయాయి అతడు నెలకొల్పిన బ్రాడ్ జంప్ రికార్డ్ కూడా25 సంవత్సరాలపాటు ఎవరూ అధిగమించలేదు

*1935 మే 25 న జెస్సీ ఓవెన్స్ ఒకే ఒక రోజులో మూడు ప్రపంచ రికార్డులను అధిగమించాడు. ఇవి 220 గజాల డాష్, 220 గజాల హర్డిల్స్ (అడ్డంకులు) మరియు బ్రాడ్ జంప్. అదే రోజున అతడు 100 గజాల డాష్‌లో ప్రపంచ రికార్డ్‌ను చేరుకున్నాడు ఒక సంవత్సరం తరువాత దాన్ని అధిగమించాడు*

*1936 బెర్లిన్ ఒలింపిక్స్‌లో 100మీటర్ల డాష్, 200 మీటర్ల డాష్, బ్రాడ్ జంప్ మరియు స్ప్రింట్ రిలేలలో అతడు బంగారు పతకాలు గెలుచుకున్నాడు. తెల్ల ఆధిపత్యాన్ని మాత్రమే ఆశించే జర్మన్ హిట్లర్ ఓవెన్స్ విజయాలను అణగద్రొక్కి తక్కువగా పరిగణించాడు - కారణం అతడు నల్లవాడు కావటమే!*

"మానవత్వంతో ఉండాలంటే పశుత్వం లేదా క్రూరత్వం విసర్జించాలి ఇది పూర్తిగా అవగాహన చేసుకున్నప్పుడే మానవ ప్రవర్తన వెల్లడవుతుంది"

# వేయివిధాల మేలు చేసే వేపచెట్టు

శ్రీమతి కె. భార్గవి

వేప చెట్టు - భారతదేశంలో ప్రసిద్ధమైనది భారత భూమి దీని జన్మభూమి ప్రపంచంలోని ఉష్ణ సంబంధ దేశాలలో ఇది విరివిగా పెరుగుతుంది నీడనిచ్చేందుకు ఇది ప్రధానంగా ఉపయోగపడుతుంది ఈ ప్రఖ్యాతి పొందిన వృక్షం - నీమ్, వేప, నింబ, బెవు మరియు లింబ్రో - అని దేశంలోని వివిధ ప్రాంతాలలో పేరొందింది కలప, ఇంధనం, పశుగ్రాసం మరియు నూనె విత్తనాలు సమకూర్చటమే కాకుండా వేప ఆయుర్వేదంలో ఔషధంగా కూడా ప్రముఖ స్థానాన్ని ఆక్రమించుకుంది



Margosa

వేప చెట్టు ఏ రకం నేలల్లో అయినా జీవిస్తుంది కొలతలో మితంగానూ, కొంచెం పెద్దదిగానూ 20 మీటర్ల వరకు పెరుగుతుంది చుట్టు కొలత 2-25 మీటర్ల వరకు ఉంటుంది దీని బోదె నేరుగా సాగి పొట్టిగా, కాంతివంతమైన పచ్చని కిరీటంతో దట్టంగా ఉంటుంది. ఈ వృక్షం మార్చి, మే నెలల మధ్య పుష్పించి వికసిస్తుంది కొత్త రేకులు తొడుగుతుంది వేపపూలు తెల్లనివిగా, చిన్నవిగా సువాసనతో కూడి ఉంటాయి మే నుంచి ఆగస్టు వరకు పక్వానికి వచ్చే వేపపండ్లు మృదువుగా - అండాకారంలో - ఆకుపచ్చ, పసుపు రంగులతో చేదు, తీపి గుజ్జు కలిగి ఉంటాయి

తమ ధాన్యాన్ని నిల్వ చేసుకునేటప్పుడు క్రిమికీటకాల నుండి రక్షణకు ధాన్యపు గింజలలో ఎండిన వేప ఆకులను కలపటం - అచిరకాలం నుండి గ్రామీణ ప్రాంతాలలో ఆచరిస్తున్నారు వేప విత్తనాలలో క్రిమికీటకాలను తరిమి కొట్టే లక్షణం ఉన్నట్లు వ్యవసాయ పరిశోధన శాస్త్రవేత్తలు కనుగొన్నారు

## పూర్వ శిలాయుగం నాటి వస్తు ప్రదర్శనశాల

మాస్కో (రష్యా)లోని పూర్వ శిలాయుగం వస్తు ప్రదర్శనశాలలో అంతరించిన సముద్రపు జంతువుల మరియు భూచర జంతువుల కళేబరాలు ప్రదర్శించబడుతున్నాయి ఆకర్షణీయంగా 4,000 చ.మీ.ల వైశాల్యంతో ఉన్న ఐదు గదుల మ్యూజియంలో చారిత్రక ప్రాధాన్యంతో వస్తువుల్ని ఏర్పాటు చేశారు ఇది సందర్శకుల్ని ప్రాచీన భూవిజ్ఞాన యుగాలకు క్రమేణా తీసుకువెళ్తుంది 30 టన్నుల బరువు, 25 మీటర్ల పొడవు గల బ్రహ్మాండమైన డిప్లొడీకస్ వంటి చరిత్రలో అతి పెద్ద జంతువులు కల మెసోజయిక్ కాలంనాటి వస్తువులు ఈ మ్యూజియంలో హెచ్చుగా కనిపిస్తాయి ఈ డిప్లొడీకస్ కళేబరం - ఈ ప్రదర్శనలో ప్రధాన ఆకర్షణగా ఉంది

"[illegible]"

తెవుళ్ళను అదుపుచేసే అత్యంత శక్తివంతమైన ప్రతినిధి - వేప వేప పిండి - యూరియా మిశ్రమ ఎరువును ఆకులపై పూతవేస్తే - సామర్థ్యంలో పెంపుదల కనిపిస్తుంది వేప విత్తనాలను ప్రధానంగా మందుల పరిశ్రమలో ఉపయోగిస్తారు

అతి క్రొవ్వుగల వ్యక్తులలోని మధుమేహ వ్యాధిని వేపనూనె అదుపు చేస్తుందని కనుగొనబడింది పుండ్లను కడిగేందుకు వేప ఆకుల కషాయం వాడతారు ఈ చేదు ఆకుల్ని చర్మ వ్యాధులకు, పుండ్లకు ఎక్కువగా ఉపయోగిస్తారు ఈ చెట్టు బెరడు జ్వరాలకు మందుగా పనిచేస్తుంది మలేరియా వంటి నిర్ణీత సమయాల్లో మళ్ళీ మళ్ళీ వచ్చే జ్వరాలను పోగొడుతుంది దీని విస్తారమైన ఆకులవల్ల వేపచెట్టు ఇతర చెట్లకంటే ఎక్కువ ఆక్సిజన్‌ను ఇస్తుంది కలుషిత వాయువుని బాగా స్వచ్ఛపర్చే చెట్టు ఇది

వేప కలప మన్నిక గలది నిర్మాణ కార్యలాపాలలో, ఫర్నిచర్ తయారీలో, ఎడ్లబండ్ల నిర్మాణంలో ఉపయోగపడుతుంది క్రిందపడే వేప ఆకులు మరియు రెమ్మలు నేలకు పోషకాహార విలువల్ని సమకూరుస్తాయి

వేప నూనెలో క్రీమ్, షాంపూ, టూత్‌పేస్ట్, సోప్‌ల తయారీకి పనికి వచ్చేవి మరియు చుండ్రును పోగొట్టే రక్షణ కల ఎన్నో ఆమ్లాలు ఉన్నాయని ఇటీవలి పరిశోధనలు వెల్లడిస్తున్నాయి

మేకలు మరియు ఇతర జంతువులకు ఇష్టమైన ఆహారమే కాకుండా వేప విలువైన ప్రోటీన్లు కలిగినందువల్ల శ్రేష్ఠమైన పంటల సంరక్షణి కూడా అని చెప్పవచ్చు

## లేత మనసులతో మీ అనుబంధం పెంచుకోండి



* పిల్లల ఎదుట పోట్లాడుకోకూడదు దీనివల్ల వారిలో అభద్రతా భావం ఏర్పడుతుంది మీ గురించి వారు సిగ్గుపడతారు

* వారిపై పెత్తనం చేసేందుకు, వారిని కొట్టేందుకు ప్రయత్నించవద్దు మీ కోసం వారు ఏపనైనా చేయాలని మీరు భావిస్తే వారిని మర్యాదగా అడగండి

* మీ స్నేహితుల పిల్లలతో కానీ లేదా వారి స్వంత సన్నిహితులతో కానీ పోల్చవద్దు దీనివల్ల వారు అసూయపడతారు, మిమ్మల్ని ద్వేషిస్తారు

* వారి అంతరంగిక రహస్యాలను కనుగొనే పరిశోధకుడుగా మారవద్దు అవి మీకు చెప్పేవి కానేకావు

* వారికి ఎక్కువగా భద్రత చేకూర్చవద్దు వారు స్వతంత్రులు తమ రక్షణ తాము చేసుకోగలవారే

ఈ ఐదు చిట్కాలు మీ కుటుంబంలోకి ఇంద్రజాలాన్ని తిరిగి తెస్తాయి యౌవనారంభ దశలోని వారితో మృదువుగా వ్యవహరించండి తత్ఫలితంగా వారిలో నిరాశ మరియు సంఘర్షణలకు సంబంధించిన సమస్యలు లేకుండా భవిష్యత్‌లో శ్రేష్ఠమైన తల్లిదండ్రులు కాగలుగుతారు

"మానసిక వ్యథ - ప్రార్థించమని ఒక మనిషికి ఒక్కొక్కసారి బోధిస్తుంది, ఐశ్వర్యం ఎప్పుడూ చెప్పదు" — బెన్ జాన్సన్


డాక్టర్ రాజేంద్రప్రసాద్
1950-1962


డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్
1962-1967


వరాహగిరి వెంకటగిరి
1969-1974

# భారతదేశపు రాష్ట్రపతులు


నీలం సంజీవరెడ్డి
1977-1982


జ్ఞాని జైల్‌సింగ్
1982-1987

# అవి పిల్లులు కావు - పునుగులు

నీటా కాల్విన్

పునుగు పిల్లులుగా( Civet cats) తరచుగా గుర్తించబడిన పునుగులు పిల్లులు కావు ఇవి ముంగిస మరియు పునుగుపిల్లి వంటి ఒక జంతు కుటుంబానికి చెందినవి. ఇవి కుఱచగా, లావుగా ఉండే కాళ్ళతో, పొడవైన తోకతో, మొనగల మోర (నోటి)తో ఉంటాయి



Small Indian civet cat

పునుగులు ఆకారంలో, అలవాట్లలో, చర్మపు రంగులో చిన్న పిల్లుల్ని ప్రతిబింబిస్తాయి కానీ పిల్లులు కేవలం వేటగాళ్ళు కాగా పునుగులు శాకాహారంపైన కూడా ఆధారపడతాయి పిల్లులతో పోల్చినపుడు వీటి దంతాలు బలహీనంగానూ, వీటి వాడిగోళ్ళు శక్తిహీనంగానూ ఉంటాయి

మాంసభక్షకులైన వాటిల్లో అత్యంత పురాతనమైనవి పునుగులు ఆసియా, ఆఫ్రికాలలోని ఉష్ణప్రదేశ అరణ్యాలలో ఇవి నివసిస్తాయి ఇండియాలో కనిపించే పునుగులు - ఇండియా పెద్ద పునుగు, ఇండియా చిన్న పునుగు, బెత్తెడు పునుగు, చుక్కల పునుగు మరియు బిన్ట్యురాంగ్ జాతి పునుగు

ఇండియా చిన్న పునుగు కపిల వర్ణం గల బూడిద రంగులో ఉండి, వీపు మీద చారలు కలిగి, శరీరంపైన చుక్కల వరుసలతో ఉంటుంది ఇండియా పెద్ద పునుగు వీపుపైన ఉండే పొడవైన నల్లని వెంట్రుకల కొప్పు (శిఖ) ఈ చిన్న పునుగుకు ఉండదు

ఒంటరి, రాత్రించరి అయిన ఇండియా చిన్న పునుగు అడవుల ప్రక్కకు వెళ్ళకుండా పొడవైన పచ్చగడ్డిలో కానీ, పొదలలో కానీ నివసించేందుకు ప్రాధాన్యమిస్తుంది ఇది బొరియలలో లేదా రాళ్ళక్రింద ఆశ్రయం తీసుకుంటుంది లేదా పగటి వేళల్లో పచ్చగడ్డిలో కానీ, పొదలలో కానీ రహస్యంగా దాగి ఉంటుంది ఇది ఒక చెట్టును అతి లాఘవంగా ఎక్కుతుంది, నీటిలో ఈదటం కూడా చేస్తుంది

ఇండియా చిన్న పునుగు మరియు సాధారణమైన బెత్తెడు పునుగు - ఇవి పునుగులలో అత్యంత పొందికగల పునుగులు ఇవి జన సమ్మర్దం కల పట్టణాలలో, గ్రామాలలో సంచారం చేస్తూ ఇంటి పైకప్పుల పైనున్న నీటి గొట్టాలలో ఆశ్రయం తీసుకుంటాయి ఈ ప్రాంతాలలో అభివృద్ధి చెందే కోళ్ళు, ఎలుకలు మరియు ఇతర చిన్న జంతువులను ఆహారంగా తీసుకుని జీవిస్తాయి

పునుగుల వేట కూడా పిల్లుల వేటను పోలి

## తగిన వారసులం కావాలి

*"గత చరిత్ర చూచి గర్వపడటం తెలివి తక్కువ మన పూర్వులు వేసిన పునాదులపై నిలుచోడం మనకు గర్వం కాదు, ఆ పునాదులకు సర్వవిధాల తగిన, సుందరమైన సౌధ నిర్మాణం చేయగలిగినప్పుడే - వారికి తగిన వారసులమని గర్వించాలి*

*— లాలా లజపతిరాయ్*

"విజయవంతమైన ప్రతి తిరుగుబాటు 'విప్లవం'గా పేర్కొనబడుతున్నది పరాజయం పాలైన ప్రతి తిరుగుబాటు 'విద్రోహం' అవుతున్నది"

— డాక్టర్ ప్రీస్ట్లీ

ఉంటుంది బలిపశువుపైన ఇవి ఆకస్మికంగా పడతాయి. వాటిని రహస్యంగా పట్టుకుంటాయి. అయితే పిల్లుల మాదిరిగా పునుగులకు ఎముకలను శుభ్రంగా నాకేందుకు వీలైన మోపైన నాలుకలు లేవు దీనికి మారుగా - కుక్కలవలే ఇవి తాము చంపిన చిన్న జంతువుల ఎముకలను నలగగొట్టి మ్రింగివేస్తాయి. పునుగులు -ఎలుకలను, ఉడుతలను, క్రిమికీటకాలను, పీతలను, బల్లులను, గ్రుడ్లను, పక్షులను, పాములను మరియు పండ్లను భక్షిస్తాయి.

పునుగుల పండ్లు మరియు గోళ్ళు వాటికి రక్షణాయుధాలుగా ఉపయోగిస్తాయి ఇండియా చిన్న పునుగుకు మరొక అసాధారణమైన రక్షణ యంత్రాంగం ఉన్నది - అదే దాని దుర్గంధ పూరితమైన గ్రంథులు తప్పించుకునేందుకు మరోదారి లేనప్పుడు అది ఈ రసాయనిక యుద్ధానికి తలపడుతుంది అటువంటి పరిస్థితిలో ఈ చిన్న పునుగు తన గ్రంథుల నుండి పసుపు రంగు ద్రవాన్ని ప్రవాహ రూపంలో బలవంతంగా విడుదల చేసి తనపై దాడి చేసిన వారిపై ప్రయోగిస్తుంది ఈ విడుదలైన ద్రవపు దుర్గంధాన్ని తట్టుకోలేని శత్రువుకు క్షణకాలం కళ్ళు మూసుకుపోతాయి

కానీ ఈ దుర్గంధపూరిత ద్రవాన్ని విడుదల చేసేముందు, ఈ చిన్న పునుగు తన శత్రువును హెచ్చరిస్తూ ఒక 'మేలిముసుగు' ధరిస్తుంది ఇది కోటు మరియు శిఖలయొక్క పొడవైన నల్లని శిరోజాలను నిక్కబొడుచుకునేటట్లు చేస్తుంది లేత రంగుకల మృదువైన రోమాలను ప్రదర్శిస్తుంది

శత్రువుల్ని పారద్రోలేందుకు ఇండియా చిన్న పునుగు ఉమిసిన ఆ తీవ్రమైన దుర్గంధం - మానవులు ప్రత్యేక సుగంధ ద్రవ్యంగా ఉపయోగించుకునే విలువను సంతరించుకుంది. ఎదుటివారిని (స్త్రీపురుష భేదంలో) ఆకర్షించేందుకు దీన్ని ఉపయోగిస్తున్నారు. తొలి రోజుల్లో ఇండియా చిన్న పునుగుల్ని నిర్బంధంలో ఉంచి వాటి నుంచి వెలువడే ద్రవాన్ని సుగంధ ద్రవ్యాలు మరియు ఔషధాలలో ఉపయోగించుకునేవారు

ఈ ఇండియా చిన్న పునుగులు తీసుకునే ఆహారం వల్ల పట్టణాల చుట్టుప్రక్కల ఉన్న ఎలుకల జనాభా తగ్గిపోతుంది అరణ్యాలలో పండ్ల చెట్ల విత్తనాలు వెదజల్లేందుకు ఈ పునుగులు సహాయపడుతున్నాయి. సుదూర ప్రాంతాలలో విత్తనాలు వెదజల్లడం ద్వారా ఇవి అరణ్యాల జీవశాస్త్ర అభివృద్ధికి దోహదం చేస్తున్నాయి

— 'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## బర్మాలో ఉన్నవి 5,000 ఏనుగులు మాత్రమే



*బర్మా (మైయన్మార్)లో 5,000 ఏనుగులు మాత్రమే ఉన్నాయి 600,000 ఆఫ్రికా ఏనుగులతో పోల్చితే ఆసియాలోని మొత్తం ఏనుగుల జనాభా 27,000గా అంచనా వేయబడింది*

"మనిషి విముఖత (వ్యతిరేకత)తో ప్రారంభించి ప్రేమతో ముగించవచ్చు. కానీ అతడు ప్రేమతో ప్రారంభించి విముఖతను చేరుకున్నట్లయితే, అతడు ఎప్పటికీ ప్రేమను పొందలేడు" — బాల్జాక్

# సత్యాహింసల మహాప్రవక్త

సదానంద మొహంతి

స్వాతంత్ర్య పోరాటం భారత దేశమంతటా శక్తివంతంగా జరుగుతున్న రోజులవి మతకల్లోలాల వల్ల అప్పుడు కల్లోలిత ప్రాంతంగా ఉన్న నౌఖాళి (Noakhali - ఇప్పుడు బంగ్లాదేశ్‌లో ఉన్నది) లో ఒక నాయకుడు ఒక సభలో ప్రసంగించ వలసి ఉంది నౌఖాళి నివాసుల్ని మత సామరస్యాన్ని, మైత్రినీ కొనసాగించమని అతడు ప్రబోధించవలసి ఉంది అతని ప్రయాణానికి అన్ని ఏర్పాట్లు జరిగాయి ఆ మహానాయకుని ఉపన్యాసం వినేందుకు నౌఖాళి ప్రజలు ఆతురతతో ఎదురు చూస్తున్నారు



నౌఖాళికి వెళ్ళేందుకు కొన్ని రోజులముందు ఆ నాయకుడు అస్వస్థతపాలయ్యాడు నౌఖాళి పర్యటన రద్దు చేసుకుని, విశ్రాంతి తీసుకో వలసిందిగా వైద్యుడు సలహా ఇచ్చాడు మరో సారి వెళ్ళేవిధంగా తన పర్యటన రద్దు చేసు కునేందుకు నాయకుడు అంగీకరించలేదు

అతడు ఇలా చెప్పాడు, "నౌఖాళి సందర్శించేందుకు నేను ఇదివరకే ఒక కార్యక్రమం తయారుచేసుకున్నాను అక్కడి పరిస్థితి ఉద్రిక్తంగా ఉంది నా ఉపన్యాసం వినేందుకు అక్కడి ప్రజలు ఆదుర్దాతో ఎదురు చూస్తున్నారు నేను వారికి ఆశాభంగం కలిగించదలచుకోలేదు నేను వారిని సందర్శిస్తానని వాగ్దానం చేశాను ఆ మాట మీద నేను నిలబడాలి నేను నౌఖాళి వెళ్ళేందుకు కృతనిశ్చయంతో ఉన్నాను - ఏదైనా జరగనీ! నౌఖాళీకి వెళ్ళే త్రోవలో కానీ, ఈ లోపుగా కానీ నేను మరణిస్తే నా భౌతిక కాయాన్ని నౌఖాళీకి తీసుకు వెళ్ళమని విజ్ఞప్తి చేస్తున్నాను దీని ద్వారా నేను నా వాగ్దానాన్ని నెరవేర్చలేదనే విషయం నిజంకాదని వారు గ్రహిస్తారు నేను మృతి చెందిన తరువాత కూడా వారిచెంతనే ఉన్నానని, నామాట నిలబెట్టుకున్నానని, వారికి ఆశాభంగం కలిగించ లేదని - నేను సంతోషిస్తాను"

ఆ మహా నాయకుని నోరునుంచి వెలువడిన ఈ ఉద్వేగభరిత, దేశభక్తి పూరిత, శక్తివంతమైన పలుకులు విన్న తరువాత అతన్ని వ్యతిరేకించే సాహసం కాని, అతని నిర్ణయం నుంచి మనను మార్చించే ప్రయత్నం కాని ఎవరూ చేయలేక పోయారు

ఆత్మశక్తి మరియు భగవత్కృపపై గల విశ్వాసం వల్ల అతడు నౌఖాళీని సందర్శించగలిగాడు ప్రజలకు ఆనందాన్ని, ఉద్వేగాన్ని కలిగించే విధంగా ఉపన్యసించగలిగాడు ఆనాటి ఆ దృఢసంకల్పం కల, స్థిర నిశ్చయం కల, క్రమ శిక్షణకల వ్యక్తి ఎవరో కాదు - కోట్లాది స్వదేశీయుల ప్రియతమ నాయకుడు మహాత్మాగాంధీయే అతడు సత్యం మరియు అహింసల యొక్క నిజమైన ప్రవక్త

'ఒక ఆశావాది మర్చిపోయేందుకు నవ్వుతాడు,
ఒక నిరాశావాది నవ్వటం మర్చిపోతాడు"

# అదృశ్యమయ్యే స్వదేశీ జనులు

ప్రస్తుతం ప్రపంచంలో 250 మిలియన్ స్వదేశీ ప్రజలు 70 దేశాలలో నివసిస్తున్నారు ఆయా భూములకు మొట్టమొదటిసారి ఏతెంచిన వారిలో ఇండియన్లు, గిరిజనులు, అల్పసంఖ్యాక జాతీయులు మరియు తక్కువ జాతి జనులు ఉన్నారు



స్వదేశీ ప్రజలు అత్యధికంగా కేంద్రీకృతమైన చోటు దక్షిణ అమెరికా. బొలీవియా జనాభాలో వీరు 66 శాతం, పెరూలో 40 శాతం, చైనా మరియు ఇండియాలలో 7 శాతంగా ఉన్నారు యుఎస్ఏ మరియు స్వీడన్‌లలో వరుసగా 0 5 మరియు 0 1 శాతం ఉన్నారు

భూగోళ వైవిధ్యంలో 90 నుంచి 95 శాతం వరకు ఉండే 5000 నుంచి 20,000 విలక్షణమైన స్వదేశీ సంస్కృతులను ఈ ప్రజలు రూపొందించుకున్నారు మొక్కల ఉపయోగం మరియు నిర్వహణ, జంతువుల నడవడి మరియు జీవ్యావరణ సంబంధాలు అనే అంశాల గురించిన అమూల్యమైన జీవశాస్త్రం మరియు జీవ్యావరణ విజ్ఞానాన్ని ఈ సంస్కృతులు రూపొందించాయి అయితే, ఈ ప్రజలంతా ప్రస్తుతం ఆధునిక జీవనంలోకి మారిపోతూ వారి ప్రాచీన అలవాట్లు, ఆచారాలు మర్చిపోతున్నారు. అడవుల విధ్వంసం వల్ల ఒక బ్రెజిల్‌లోనే 90కి పైగా స్వదేశీ గుంపులు అదృశ్యమయ్యాయి

— 'బిజినెస్ ఇండియా' సౌజన్యంతో

## అదీ సంగతి!

*ఆంటీ కరోలిన్ తన మేనల్లుడితో కలసి ఒక ఆదివారం చర్చికి వెళ్ళింది ప్రార్థనోపన్యాసం ప్రారంభం కాగానే నిద్రలోకి జారుకుంది ఆమె గుఱక పెట్టటం మతోపన్యాసకుడు గమనించాడు "ఈ దైవవాక్కులకు మీ అత్త గుఱక ఇబ్బంది కలిగిస్తున్నాయని గమనించలేదా? ఆమెను మేల్కొల్పరాదా?" అని అతడు మేనల్లుడిని హెచ్చరించాడు*

*మేనల్లుడు ఇలా జవాబిచ్చాడు: "మీరే ఆమెను మేల్కొల్పండి, ఆమెను నిద్రపుచ్చింది మీరేగదా!"*

## 1300 ఏళ్ళనాటి బంగారు నాణాలు

కైరోకు *దక్షిణంగా దాదాపు 450 కి.మీ.ల దూరంలో ఉన్న సోహగ్ సమీపంలోని ప్రసిద్ధి చెందిన దయర్-అల్-అబిద్ లోని కాప్టిక్ క్రిస్టియన్ సన్యాసి మఠంలో పూడ్చబడిన రెండు చిన్న బంకమట్టి జాడీల్లో 1300 సంవత్సరాల నాటి బంగారు నాణాలను పురావస్తు శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. ఇంతవరకు కనుగొనబడిన ఈ తరహా నాణాలలో ఇవి అమూల్యమైనవని భావించబడుతున్నది*

# యాత్రాస్థలాలు

## రామేశ్వరం

భారతదేశంలోని ఒక గొప్ప ధార్మిక కేంద్రం - రామేశ్వరం - భారత ద్వీపకల్పం యొక్క - కడపటి - ఆగ్నేయ దిక్కులోని పాల్క్




జలసంధిలోని ఒక దీవిలో ఉన్నది రామాయణ ఇతిహాస కథానాయకుడైన శ్రీరాముడు ఇక్కడ శివుణ్ణి అర్చించాడని విశ్వసించబడుతున్నది



రామేశ్వరంలోని ప్రతి స్థలం - రామాయణంలోని ఆఖరి ఘట్టాలతో అనుబంధం కలిగి ఉన్నది ఉత్తరాదిలోని వారణాశి (బెనారస్)ని సందర్శించిన ప్రతి హిందూ యాత్రికుడు దక్షిణాది లోని రామేశ్వరం సందర్శించి ప్రణామాంజలి సమర్పించుకోవటం తన పవిత్ర కర్తవ్యంగా భావిస్తాడు

రామేశ్వరంలోని శ్రీరామనాథస్వామి ఆలయం 17 వ శతాబ్ది నాటిది. శ్రీలంకకు చెందిన ఒక రాజకుమారుని అభిమతానుసారం దీన్ని నిర్మించినట్లు చెబుతారు.ఇది పూర్తయ్యేందుకు 350 సంవత్సరాలు పట్టింది 46 మీటర్ల ఎత్తున్న గోపురం మరియు దేవాలయం ముఖద్వారం - 305 మీటర్ల పొడవు, 198 వెడల్పుకల ఒక విశాల చతురస్రాకారపు బహిరంగ ప్రదేశంలో నిల్చి ఉన్నాయి ఈ బహిరంగ స్థలానికి



చుట్టూ ఉన్న స్తంభాల వరండా (వసారా) 1,220 మీటర్ల పొడవు (4000 అడుగులు), 52 నుంచి 64 మీటర్ల వరకూ వెడల్పు, నేలనుంచి పైకప్పు వరకు దాదాపు 9 మీటర్ల ఎత్తు కలిగి ఉంటుంది దాదాపు 36 మీటర్ల ఎత్తుగల ప్రతి స్తంభం - బ్రహ్మాండమైన నల్ల రాతితో చెక్కబడి, చక్కగా అలంకరించబడి, సరైన పాళ్ళలో ఉండి, శిల్పకళకు సొగసైన ఉదాహరణగా కనిపిస్తుంది రామేశ్వరం దేవాలయంలో ప్రాచీనమైన, అమూల్యమైన ఆభరణాలు కూడా ఉన్నాయి

'ప్రజల శక్తి ఏ దేశాన్లో అగ్రపీఠంలో ఉంటుందో అది
స్వచ్ఛం సిద్ధాంతాలు''

సిసిరో

# విజేత కావడం ఎలా?

డా. క్లైవ్ డి. హర్లీ

ధైర్యం లేక తెగువ - మనం అత్యంత సార్థకమైన, వివేకవంతమైన జీవితం గడిపేందుకు తోడ్పడుతుంది గతాన్ని మర్చిపోయి, భవిష్యత్తును దాని రక్షణను దానికే వదిలివేసి, ప్రస్తుతపు (నేటి) పనులపై మరియు ఇష్టాలపై కేంద్రీక రించేందుకు మనకు సహాయపడుతుంది 'రేపటి గురించి విచారం వద్దు' అనే బైబిల్ యొక్క పురాతన శాసనం (ఉత్తరువు) అమలు చేసేందుకు ధైర్యం తోడ్పడుతుంది



భవిష్యత్తు గురించిన ఆందోళన సహజమే దానికి మనం ఏర్పాటు చేసుకోవాలి. దానిని ప్రభావితం చేయగల మనకు ఉన్న ఒకే ఒక మార్గం - నేటి మన కార్యకలాపాలను మన యావచ్ఛక్తి సామర్థ్యాలతో నెరవేర్చటం తెగువతో మనం గతాన్ని వెనుకకు పంపవచ్చు. భవిష్యత్తు ఇప్పుడే గోచరించటం లేదు అది ఇంకా రూపు దాల్చవలసి ఉంది వర్తమానంలోనే మన పనులు చేయగలగాలి ఈ జ్ఞానానికి అనుగుణంగా పని చేసేందుకు ధైర్యం కావాలి మనం పట్టుదల విడవకుండా నేటి పరిస్థితుల పరిధిలో జీవించేందుకు ప్రయత్నాలు చేయాలి

తెగువ, పట్టుదల - దృఢమైన గుణం (శీలం) నిర్మాణమయ్యేందుకు తోడ్పడుతాయి. ఇవి ఆత్మ విశ్వాసాన్ని కలిగిస్తాయి ఇవి మానసిక శాంతిని, ప్రయత్నాలలో విజయాన్ని అడ్డంకులకు పరిసమాప్తిని కలిగిస్తాయి. ధైర్యం సంపాదించుకునేందుకు త్వరిత మార్గం - ఇతరుల సహాయం పొందటం ద్వారా లభిస్తుంది. ఉత్సాహం కలిగించే పుస్తకాలు చదవటం మాదిరిగానే మీకు కావలసిన స్ఫూర్తిని స్నేహితులు సమకూర్చగలుగుతారు మీరు ప్రారంభించవలసిన రెండు ప్రసిద్ధమైన పుస్తకాలు: డేల్ కార్నీజ్ వ్రాసిన "హౌ టు స్టాప్ వర్రీయింగ్ అండ్ స్టార్ట్ లివింగ్" మరియు డాక్టర్ నార్మన్ విన్సెంట్ పీలీ వ్రాసిన "ది పవర్ ఆఫ్ పాజిటివ్ థింకింగ్"

ఎయిర్‌కండిషనింగ్ వ్యాపారంలో నిపుణుడైన ఒక వ్యక్తి నుంచి నేర్చుకున్న విషయాల్ని డేల్ కార్నీజ్ ఇబ్బందుల్ని ఎదుర్కొనేందుకు తాను సూచించే పద్ధతుల్లో ఒకటిగా చేర్చాడు

## అత్యంత జటిలమైన గొప్ప చిత్రం

*ఆంగ్ల దర్శకుడు ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ నిర్మించి, 1958లో విడుదల చేసిన చిత్రం 'వెర్టిగో' - అత్యంత జటిలమైన, ఘనమైన చిత్రం లొంగిపోయిన మాజీ డిటెక్టివ్‌గా జేమ్స్ స్టీవర్ట్ ఈ చిత్రంలో నటించాడు*

"హాని జరిగిన తరువాత సలహా ఇవ్వటం - మరణానంతరం మందు ఇవ్వటం వంటిది" — డానిష్ సూక్తి

# అలనాటి అద్భుత ఆలయం - అంగ్‌కర్ వాట్

ఈనాటి కాంబోడియా అయిన ఆనాటి ఖమర్ (Khmer) సామ్రాజ్యానికి 9వ శతాబ్ది నుండి 14వ శతాబ్ది వరకు అంగ్‌కర్ రాజధానిగా ఉండేది ఆసియాలో అత్యంత వైభవోపేతమైన నగరం ఇది గొప్ప దేవాలయాలు, భవనాలు మరియు స్మారక చిహ్నాలతో కూడిన ఈ నగరం దాదాపు 2 మిలియన్ ప్రజలకు నివాసస్థానం



Angkor Wat

ఇది ఒక అరణ్యం మధ్య 40 చదరపు మైళ్ళ వరకు విస్తరించింది 14వ శతాబ్దిలో ఖమర్లు పూర్తిగా పరాజితులయ్యారు అంగ్‌కర్ దోచుకోబడింది తరువాత 500 సంవత్సరాల వరకు అంగ్‌కర్ ఎడారిగా మారిపోయింది ఆ నగర వీధులు, భవనాలు దట్టమైన అడవి వలె తయారయ్యాయి

ఆ తరువాత 1861లో ఒక ఫ్రెంచి ప్రకృతి ప్రియుడు హెన్రీ మౌహట్ సీతాకోకచిలుకల కోసం అన్వేషిస్తూ ఈ చిట్టడవి పట్టణాన్ని కనుగొన్నాడు ఇక త్వరితగతిలో యాత్రికులు, విద్వాంసులు - 'అంగ్‌కర్ వాట్' అని పిలువబడే అక్కడి ప్రధాన దేవాలయాన్ని సందర్శించేందుకు చేరుకున్నారు

అంగ్‌కర్ వాట్ - ప్రపంచంలోని అతిపెద్ద మత సంబంధమైన నిర్మాణం. ఐదు గోపురాలు (బురుజులు) - దానిలో పొడవైనది 250 అడుగుల ఎత్తు కలది - దేవాలయానికి చెందిన అనేక ప్రదర్శన శాలలకు, రాజాస్థానాలకు, మరియు సోపానాల వరుసలకు కిరీటంగా భాసిస్తాయి దేవాలయం యొక్క ఒక అంచు నుండీ మరో అంచు వరకు ఉన్న వేలాది అడుగుల కుడ్య స్థలాన్ని విస్తృతమైన రాతి చెక్కడపు పనులు కప్పి వేస్తున్నాయి దేవుళ్ళు, దేవతలు, నాగు పాములు, రాజులు మరియు నర్తకుల ప్రతిబింబాలు - ఈ బృహత్తర నిర్మాణంలోని గదులలో, చావడులలో జటిలంగా చెక్కబడ్డాయి ప్రధాన దేవాలయంతో పాటు గ్రంథాలయాలు, స్నాన మందిరాలు, మార్గ ద్వారాలు, భవంతులు మరియు చిన్న దేవాలయాలు ఈ చిట్టడవి నగరంలోని ఎక్కువ భాగంలో విస్తరించుకుని ఇప్పటికీ శోభాయమానంగా కనిపిస్తాయి

## భయ, సందేహాలను తొలగించు!

భయం వీడు, ఎక్కువ విశ్వాసంతో ఉండు
తక్కువగా భుజించు, ఎక్కువగా నములు
చిరాకును తగ్గించు, చిఱునవ్వును పెంచు
మాట్లాడటం తగ్గించు, ఎక్కువగా ఆలోచించు
ఎవరినీ ద్వేషించకు, ప్రేమను పెంచు
వ్యాకులం తగ్గించు, ప్రార్థించటం హెచ్చించు
కాలాన్ని వ్యర్థం చేయకుండా
మంచి పనుల కోసం వెచ్చించు

"చాలామంది సలహాలు తీసుకుంటారు కాని వివేకవంతులే వాని నుంచి లాభం పొందుతారు'

# అవీ - ఇవీ

## ఎవరెస్ట్‌ను రెండుసార్లు అధిరోహించిన ప్రథమ మహిళ



ప్రపంచంలో ఎత్తైన 8,848 మీటర్ల శిఖరాగ్రం ఎవరెస్ట్‌ను జయించిన మొట్టమొదటి భారత మహిళా పర్వతారోహక బృందంలోని ముగ్గురు సభ్యులు - సంతోష్ యాదవ్, కుంగ భుటియా మరియు డిక్కీ-డోల్మా - 1993 మే 10వ తేదీ మధ్యాహ్నం 12 గంటలకు ఎవరెస్ట్ అధిరోహించారు. హర్యానాకు చెందిన సంతోష్ యాదవ్, ఇండో - టిబెటన్ సరిహద్దు పోలీస్ దళంలో అధికారిగా పనిచేస్తున్నారు. ఈ శిఖరాన్ని రెండుసార్లు అధిరోహించిన మొదటి మహిళ ఈమె. 1992లో ఐ టి బి పి సహ యాత్రలో భాగంగా ఈమె ఎవరెస్ట్ పర్వతాన్ని అధిరోహించడం జరిగింది.

## ఎముకల మార్పిడి చికిత్స

థలస్సిమియాకు ఏకైక వైద్య చికిత్స అయిన ఎముకల (అస్థిసారం) మార్పిడి చేసి నాటటం - ఇండియాలో మొదటిసారి వెల్లూరు (తమిళనాడు) లోని క్రిష్టియన్ మెడికల్ కాలేజీ ఆస్పత్రిలో నిర్వహించబడింది.

## ప్రపంచంలో ఏకైక ఏనుగు అంబారీ

ప్రపంచంలో ఇప్పుడు ఉన్న ఏకైక ఏనుగురథం (అంబారి) - ''ఇందిరా విమాన్'' ప్రస్తుతం రెండంతస్థుల ఏనుగు అంబారీ జైపూర్ (రాజస్థాన్)లో రాజకుటుంబం యొక్క ప్రత్యేకంగా నిర్మించిన వాహనాల శాలలో భద్రపర్చబడింది. 65 ఏళ్ళ క్రితం ఇది తన తుది పర్యటన చేసింది. ఆ రోజుల్లో దీన్ని సంవత్సరానికి ఒకసారి - దసరా మర్నాడు- ఊరేగింపుగా వెలుపలికి తెచ్చేవారు.

## ఎత్తైన భవనాల్లో అగ్నిప్రమాదాలు

అత్యంత ఎత్తుగా నిర్మించిన భవనంలో అగ్నిప్రమాదం సంభవించినపుడు, 10 నుంచి 15 నిమిషాల లోపు- బయట పడకపోతే - 800° సి అత్యుష్ణోగ్రత మరియు దట్టంగా అల్లుకున్న విషపు పొగల వల్ల - లోపల ప్రాణాంతకంగా చిక్కుపడిన వారిని వెలికి తీసుకు రావటం అసాధ్యమని ఋజువైంది. స్నోర్‌కెల్ వంటి అగ్నిని ఆర్పటానికి ఉపయోగించే పరికరం కూడా 10 అంతస్తులు దాటి వెళ్ళలేదు. దీనికి అమర్చిన నిచ్చెన కూడా 13వ అంతస్తు వరకే వెళ్ళగలుగుతుంది.

## చంద్రమండలంలో ఉదజని

చంద్ర సంబంధమైన భూమిలో రష్యన్ భూరసాయన శాస్త్రవేత్తలు హైడ్రోజన్‌ను (ఉదజని) కనుగొన్నారు. విశ్వంలో విస్తృతంగా వ్యాపించిన ఉదజని వాయువు చందమామలో లేకపోవడం చాలాకాలంగా శాస్త్రవేత్తలకు విచిత్రంగా కనిపించింది. భూమి పైపొరలలో ఉదజని ప్రతిచోట కన్పించగా చంద్రునిలో

---

'చెడుమార్గాల ద్వారా లభించిన ఫలితాలు న్యాయమైనవి కావు,
ఎప్పుడైనా చెట్టు పాపంవాడు మంచి ఫలాలను ఇచ్చాయా''
— చార్లెస్ స్టువర్ట్

దాన్ని వాస్తవంగా గుర్తించలేక పోవటం జరిగింది. చంద్రమండలం పైన రష్యన్ నిపుణులు గాజు సూదంటు రాళ్ళ రేణువుల్ని కరగించి, వాటిని అధ్యయనం చేస్తూ, ఉదజని వాయువుని సంపాదించారు అభివృద్ధికి

ఫించిన ఒక నిర్దిష్ట కాలంలో - కరగించి పోసిన చంద్ర సంబంధమైన సూదంటురాయి ఈ ఆవిరియై పోయే వాయువును వలలో వేసుకుందని వారు నమ్ముతున్నారు

## అత్యధిక వేగంతో రవాణాచేసే ఈదే రైలు



శక్తివంతమైన అయస్కాంతాలపై ప్రత్యేకంగా రూపొందించిన సంచార మార్గాలపై వైర్జ్యమాన మోటార్ (linear motor) తో నడిచే భవిష్యత్ రైలైన - ఒక చక్రాలు లేని రైలును జపాన్ ఎయిర్‌లైన్స్ అభివృద్ధి చేసింది భావి జపాన్ కోసం నిర్మించిన ఈ ఈదే రైలు (floating train) ఎటువంటి శబ్దం చేయదు మరియు ఎటువంటి కంపనం కలిగించదు అతి ముఖ్యమైన విషయం అత్యధిక వేగపు రవాణాకు ఇది అత్యంత భద్రమైనది

## చేపలు పట్టే ఎలుక

న్యూగినియాలో కనుగొనబడిన చేపలు పట్టే ఎలుక తన తోకను నదిలోకి జారవిడుస్తుంది ఒక చేప ఆ తోకను కొరకగానే - అతి త్వరితంగా దాన్ని తటాలున లాగి వేస్తుంది

'మిషా' సౌజన్యంతో

## ప్రతి నలుగురిలో ముగ్గురి నివాసం

నేడు ప్రపంచంలోని ప్రతి నలుగురిలో ముగ్గురు వర్ధమాన దేశాలలో నివసిస్తున్నారు 2050 నాటికి ప్రతి 10 మందిలో 9 మంది వర్ధమాన దేశాలలో నివసిస్తారు ప్రస్తుతపు రేటు ప్రకారం తన జనాభా రెట్టింపు చేసుకునేందుకు ఆఫ్రికాకు కేవలం 25 సంవత్సరాలు సరిపోతే, యూరప్‌కు 140 సంవత్సరాలు కావలసి వస్తాయి

(ప్రపంచ బ్యాంక్ నివేదిక)

## బొగ్గునార రెక్కలతో విమానం

బొగ్గు నార (carbon fibre) ఆధారంగా పూర్తిగా ఒక మిశ్రమ పదార్థంతో తయారైన రెక్కలు గల ప్రపంచంలోని మొట్టమొదటి విమానాన్ని ఫ్రాన్స్ విజయవంతంగా ఎగిరేలాగా చేయగలిగింది

## ఉప్పునీటి నుంచి శుభ్రమైన నీటి ఉత్పత్తి

గంటకు 100 గాలన్ల నీటిని బట్టీ పెట్టే ఒక కర్మాగారాన్ని భావ్‌నగర్ (గుజరాత్) లోని ది సెంట్రల్ సాల్ట్ అండ్ మెరైన్ కెమికల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ రూపొందించింది తాజా నీటిని తయారు చేసేందుకు వీలుగా ఉప్పు నీటిని ఈ పద్ధతి ద్వారా తక్కువ ఒత్తిడిలో బట్టీ పెడతారు 1000 లీటర్ల స్వచ్ఛమైన నీటిని తయారు చేసేందుకు 20 రూపాయలు ఖర్చవుతుంది.

"మనం ప్రేమించే వాళ్ళే పట్టి మన రూపం మరియు తీరు ఏర్పడుతుంది"

— గోథే

## ప్రపంచంలో అత్యధిక జనాభా కలదేశం



12 బిలియన్ ప్రజలతో చైనా ప్రస్తుతం ప్రపంచంలో అత్యధిక జనాభా కల దేశంగా రూపొందింది కానీ 2120 నాటికి ఇండియా - ప్రస్తుతం ఉన్న 883 మిలియన్ జనాభాతో - ప్రస్తుత పరిస్థితులే కొనసాగితే - జనాభాలో చైనాను అధిగమిస్తుంది

- ప్రపంచ బ్యాంక్ నివేదిక

## ప్రపంచంలో లాభార్జన చేసే ఆరో దేశం

1992 లో ఎయిర్ చైనా 100 మిలియన్ డాలర్ల మేరకు లాభాలు గడించి ప్రపంచంలో లాభార్జన చేసే వాటిల్లో ఆరోస్థానం సంపాదించుకుంది ప్రస్తుతం ప్రపంచంలోని 139 విమాన సంస్థలలో కేవలం 90 మాత్రమే లాభాలు గడిస్తున్నాయి

## విమానయానంలో చరిత్ర సృష్టికర్త

ప్రపంచంలోని ఏకైక వాణిజ్యపరమైన సూపర్‌సోనిక్ విమానం - కన్‌కార్డ్‌కు - బ్రిటిష్ ఎయిర్‌వేస్‌కు చెందిన మహిళా పైలెట్ బార్బరా హార్మర్ - మొదటిసారి చోదకత్వం నెరపి ఒక వైమానిక చరిత్ర సృష్టించింది. సౌర విమానయానంలో అధునాతనమైన కన్‌కార్డ్‌ను లండన్ నుంచి న్యూయార్క్‌కు శబ్ద వేగానికి రెట్టింపు వేగంతో ఆమె నడిపింది

## ఆసియాలో అతిపెద్ద సౌరవిద్యుత్ కర్మాగారం

ఆసియాలోని అతిపెద్ద 100 కిలోవాట్ల సోలార్ (సౌర) ఫొటోవోల్టియక్ పవర్ ప్లాంట్ 45 కోట్ల వ్యయంతో కల్యాణ్‌పూర్ గ్రామం (ఉత్తర ప్రదేశ్‌లోని అలీఘర్) లో నెలకొల్పారు ఈ విద్యుత్ కర్మాగారం కల్యాణ్‌పూర్ మరియు పరిసర గ్రామాలలో 500 ఇంటి దీపాలను, 40 వీధి దీపాలను వెలిగిస్తుంది ఇవికాక 15 వ్యవసాయ పంపులకు ఇంధనం సమకూరుస్తుంది

## 200,000 సంవత్సరాల నాటి జంతువుల శిలాజాలు

చైనాలోని గ్యాంగ్‌డంగ్ రాష్ట్రంలో 200,000 సంవత్సరాలనాటి జంతువుల శిలాజాలను శాసన లిపి శాస్త్రజ్ఞులు కనుగొన్నారు

## [illegible]

*అమెరికాకు 30వ అధ్యక్షుడు కాల్విన్ కూలిడ్జ్ (1872 - 1933) మరో పర్యాయం ఎన్నికల్లో పోటీ చేయరాదని ఆయన నిర్ణయించుకుని, ఆ నిర్ణయాన్ని బహిరంగపర్చటం ఇష్టంలేక పత్రికా విలేఖరులకు తన నిర్ణయం తెలియజేస్తున్న చిన్న కాగితపు మడతల్ని అందజేశాడు. విందులో ఆయన ప్రక్కనే కూర్చున్న యువతి ఆయనచేత రెండు మాటలకు పైగా చెప్పించగలనని పందెం వేసింది కూలిడ్జ్ జవాబిచ్చాడు. "నీవు నష్టపడతావు"*

"జీవితమంటే సంఘర్షణ అని అర్థం నీవు ఉన్నతంగా లక్ష్యం పెట్టుకుంటే నీవు ఎక్కువగా నెరవేర్చాలని తలిస్తే, నీ నుంచి అత్యంత హెచ్చు కార్యభారం, త్యాగం కోరబడుతుంది" — ఇందిరా గాంధీ

## అతి ప్రాచీనకాలం నాటి చైనీయుల కాగితం

73 నుంచి 49 బి సి నాటి మూడు కాగితపు ముక్కలను చైనాలోని పురాతత్వ శాస్త్రవేత్తలు కనుగొన్నారు తూర్పు హాన్ వంశానికి చెందిన కెయి లున్, కాగితాన్ని 105 ఏ.డి లో కనిపెట్టి నట్లు ఇదివరకు నిర్ధయించటం జరిగింది బైజింగ్ విశ్వవిద్యాలయంలో నిపుణులు చేసిన లేబొరేటరీ పరీక్షలలో - ఈ కాగితం సిల్క్‌కి బదులు జనపనార (కిత్తనార)తో తయారు చేయబడ్డదని, అంతకు పూర్వం కనుగొనబడిన హాన్ వంశపు కాగితం కంటే దీని నేత మేలైనదని స్పష్టమైంది

## మురుగు నీటి గొట్టాల మరమ్మతుకు కొత్తపద్ధతి

మురుగుపోయే తూములలోని గొట్టాలలో నీటిస్థాయిలో సరైన సర్దుబాటు చేయటం మురుగు పారుదలలోని ప్రధాన అంశం వివిధ కేంద్రాలలో ఎప్పటికప్పుడు మారుతుండే నీటిస్థాయిని గురించి సమాచారం ఇచ్చే వ్యవస్థ అవసరం ఈ దిశలో టోక్యో మెట్రోపాలిటన్ గవర్నమెంట్ (టి ఎం జి) - ఈ గొట్టాల లోపల ఫైబర్ ఆప్టిక్స్ సమాచార వ్యవస్థను సమకూర్చేందుకు పథకాలు వేస్తున్నది ప్రస్తుతం టోక్యోలోని 80 శాతం మురుగునీటి గొట్టాలు - వాటిలోకి మనుషులు ప్రవేశించి పనిచేయలేనంత - సన్ననివి

## పశుసంవర్ధక పరిశ్రమ నుంచి 80 శాతం ఆదాయం

జర్మనీలోని బవేరియాకు వ్యవసాయ రంగంలోని పశు సంవర్ధక పరిశ్రమ నుంచి 80 శాతానికి పైగా ఆదాయం లభిస్తుంది

## ప్రపంచ నిరక్షరాస్యులలోకి చేరే స్కూలుకు వెళ్ళే వయస్సు కల పిల్లలు

పాఠశాలలు ప్రారంభించనందువల్ల కానీ లేదా 4 వ గ్రేడ్ లోపలనే వెలుపలికి రావటం వల్ల కానీ దాదాపు 30 మిలియన్ స్కూలుకు వెళ్ళే వయస్సు కల పిల్లలు ప్రపంచపు నిరక్షరాస్యుల జాబితాలో ప్రతి ఏటా చేరుతున్నారు నాలుగో గ్రేడ్ వరకు చేరని పిల్లలలో హెచ్చు శాతం లాటిన్ అమెరికా, కరేబియన్ ప్రాంతం మరియు దక్షిణ ఆసియాల్లో ఉన్నారని నమోదయింది

# నమ్మలేని నిజాలు

## మరపురాని అనుభవం

*జెనీవా (స్విట్జర్లాండ్) సబ్ పోస్టాఫీస్ పోస్ట్‌మాస్టర్ గెరాల్డ్ గౌముజ్‌కు 1978 జూన్ 5న ఒక మరపురాని అనుభవం కలిగింది ఆనాటి తపాలా ముద్ర తొమ్మిది (ఒకట్ల స్థానపు) అంకెలకు ప్రాధాన్యం ఇచ్చి వెలికి తెచ్చింది 1234 పోస్టాఫీస్ నెంబర్, 5-6-78 తేదీ, ఉత్తరాలు స్వీకరించి, బట్వాడా చేసే సమయం-9*

## 5 పైసల అదనపు చార్జీ కథ

*కాంతిలాల్ జికరియా అజాద్ చౌక్ నుంచి జునాగఢ్ (గుజరాత్)లోని భావ్‌నాథ్‌కు 1974 ఆగస్ట్ 4న ప్రయాణం చేసాడు అతని వద్ద 25 పైసలకు బదులు 30 పైసలు వసూలు చేసారు తనవద్ద అదనంగా వసూలు చేసిన 5 పైసలు తిప్పి ఇవ్వవలసిందని అతడు రవాణా శాఖకు వ్రాసాడు ఇలా కొంతకాలంపాటు ఉత్తర ప్రత్యుత్తరాలు సాగాయి చివరికి, ఐదుపైసల తపాలా బిళ్ళ ఆ బాధిత ప్రయాణీకునకు పంపబడింది జికరియా దాన్ని తిప్పి పంపుతూ తనకు ఐదుపైసలు నగదుగానే చెల్లించాలని కోరాడు!*

'పాతిగా మన అభివృద్ధి విషయంలో [illegible] ప్రోగు కంటే తరితం కాదేమ''

జాన్ ఎఫ్ కెన్నెడీ

# వనితాలోకం

## ఉప్పు ఉపయోగాలు ఎన్నో....

* మీ వంట పాత్ర ఉల్లిపాయల వాసన వేస్తూంటే, దాన్ని వేడి ఉప్పు నీటితో కడగండి ఉల్లివాసన అదృశ్యమౌతుంది

* జుట్టు ఊడిపోతూంటే, ఉప్పు కలిపిన నీటితో జుట్టును శుభ్రం చేసుకోండి

* ఇనుప వస్తువుల పైన తుప్పు చేరినప్పుడు వాటిని ఉప్పుతో తేలికగా రుద్దివేయవచ్చు.

* మీ వస్త్రాలపైన రక్తపు మరకలు ఉన్నట్లయితే వాటిని ఉప్పు నీటితో ఉతకండి మరకలు అదృశ్యమౌతాయి



* గుడ్డలమీద పడిన సిరామరకలు పోవాలంటే దానిమీద ఉప్పుతో రుద్దిన తరువాత బట్టలను వేడినీటితో ఉతకండి

* మీ బిడ్డకు స్నానం చేయిస్తున్నప్పుడు నీటిలో కొంచెం ఉప్పును, డెట్టాల్‌ను కలపండి దీనివల్ల బిడ్డ చర్మ వ్యాధులతో బాధపడదు

* ఉప్పు నీటితో నింపిన మీ పూలతొట్టిలో పూలు పెట్టండి ఈ పూలు కనీసం ఒక వారం రోజుల వరకు ప్రకాశవంతంగా, తాజాగా ఉంటాయి ●

## పార్లమెంట్ హౌస్

Parliament House, New Delhi



న్యూఢిల్లీ కేంద్రస్థానంలో ఉన్న 'పార్లమెంట్ హౌస్' లేదా 'సంసద్ భవన్'కు ఇద్దరు ప్రసిద్ధ వాస్తు శిల్పులు - సర్ ఎడ్విన్ లుట్‌యెన్స్ మరియు సర్ హెర్బర్ట్ బేకర్ - రూపకల్పన చేశారు ఈ మహత్తరమైన గుండ్రని భవనానికి మహా ఘనత వహించిన డ్యూక్ ఆఫ్ కన్నాట్ 1921 ఫిబ్రవరి 12న శంకుస్థాపన చేసాడు

మనల్ని ప్రభావితం చేసే ఈ భవన నిర్మాణానికి ఆరు సంవత్సరాలు పట్టింది ఆనాటి గవర్నర్ జనరల్ లార్డ్ ఇర్విన్ 1927 జనవరి 18న దీనికి ప్రారంభోత్సవం జరిపారు ఒక మైలులో మూడో వంతు చుట్టుకొలత, 560 అడుగుల వ్యాసం కలిగిన ఈ మూడు అంతస్తుల భవనం 83 లక్షల రూపాయల వ్యయంతో నిర్మించబడింది

పార్లమెంట్ హౌస్ భవనం యొక్క కేంద్రస్థానంలో ఉన్న సెంట్రల్ హాల్ పైనున్న గుమ్మటం (dome) ప్రపంచంలోని అత్యంత వైభవోపేతమైన గుమ్మటాలలో ఒకటి ఈ హాల్‌లోనే భారత రాజ్యాంగం సృష్టించ బడింది. బ్రిటన్ నుండి ఇండియాకు పాలనాధికారం కూడా ఇక్కడే 1947 ఆగస్టు 14 అర్ధరాత్రి అప్పగించబడింది.

— కె జి సురేష్, 'ది టీనేజర్' సౌజన్యంతో

"అలవాటు - మనం ఉపయోగించే చేతికర్ర వలె ఉండాలి కాని ఆధారపడే ఊతకర్రలుగా ఉండకూడదు" - ఏ జి గార్డెనర్

# అమర సంగీత స్వరకర్త - జొహాన్ సెబాస్టియన్ బచ్

విశ్వవిఖ్యాత సంగీత వాద్యకారుడు, పాశ్చాత్య సంగీత స్వరకర్త జొహాన్ సెబాస్టియన్ బచ్ - సంగీత ప్రపంచానికి స్వరకర్తలను, సంగీత నిర్వాహకులను వరుసగా అందించిన బచిశ్చన్ కుటుంబం నుంచి వచ్చాడు


BACH

జె ఎస్ బచ్, ఐసినచ్ (తురింగియా)లో 1685 మార్చి 21న జొహాన్ అంబ్రోసియస్ బచ్ మరియు ఎలిజబెత్ హమ్మెర్హ్బ్ర్ట్‌లకు కడసారి బిడ్డగా జన్మించాడు ఈ కుటుంబం ఆర్థికంగా బలహీనంగా ఉన్నా బచ్ చదువుల్లో బాగా ముందు ఉండేవాడు అతడు తండ్రి దగ్గర నుంచి తంత్రీ వాద్యం నేర్చుకున్నాడు 1695లో అతని తల్లిదండ్రులు ఈ ప్రపంచాన్ని విడిచిపెట్టిన తరువాత, పెద్దన్న అతని సంరక్షణ బాధ్యత తీసుకున్నాడు అతనే మొదటి సాధారణ సంగీత స్వరపాఠాలు తమ్మునికి నేర్పాడు సంగీతం అభ్యసించాలనేది బచ్‌కు ఎన్నాళ్ళ నుంచో ఉన్న కోరిక వివిధ సంగీత కర్తలను వినటం ద్వారా, సంగీతానికి సంబంధించిన అనేక గ్రంథాలు చదవటం ద్వారా అతడు గొప్ప సంగీత వాద్యకారుడయ్యాడు

అతడు సంగీత వాద్యకారుడుగా తన వృత్తిని ప్రారంభించాడు తరువాత అతడు ఒక ఉపాధ్యాయుడుగా, క్రమేణా ఒక స్వరకర్తగా, కూర్పరిగా రూపొందాడు లీప్‌జిగ్‌లో అతడు 27 సంవత్సరాలు సంగీత దర్శకుడుగా పని చేశాడు అతనికి ఖ్యాతి చేకూర్చే 200 సంగీత స్వర రచనలు చేశాడు బచ్ ప్రధాన కార్యరంగం - వాద్యం అతడు సంగీత సభలకు, సంగీత వరుసలకు స్వర రచన కూడా చేశాడు అతని ఆరు బ్రాన్‌డెన్‌బరి సంగీత కచ్చేరీలు ప్రఖ్యాతి పొందాయి

బచ్ యొక్క స్వర రచనలన్నీ - ముఖ్యంగా అతని బృందగానాలు - మతస్ఫూర్తి కలిగిస్తూ ఉంటాయి పాశ్చాత్య సంగీత చరిత్రలో బచ్ మొట్టమొదటి అతి ప్రధాన స్వరకర్త అతడు ఒక అమర సంగీత కళాకారుడు అతని ఇరవై మంది పిల్లలలో నలుగురు విశిష్టమైన స్వర కర్తలుగా రూపొందారు బచ్ తన కంటి చూపు కోల్పోయి 1750లో లీప్‌జిగ్‌లో అంధత్వంతో మరణించాడు 1985లో అతని 300వ జయంతి ప్రపంచమంతటా జరపబడింది ఇండియా కూడా అతని చిత్రంగల తపాలా బిళ్ళను విడుదల చేసింది

—జోబీ మనచెరికల్

—'ఇన్‌స్పిరేషనల్ కోట్' సౌజన్యంతో

## ప్రపంచపు పైకప్పు

ప్రపంచంలోని తొమ్మిది ఉన్నతమైన పర్వత శిఖరాలు హిమాలయాల్లోనే ఉన్నాయి ఇవి ఇండియా, నేపాల్, పాకిస్థాన్ మరియు టిబెట్ లోపల కానీ, వాటికి సమీపంలో కానీ ఉన్నాయి కనుక ఈ ప్రాంతం "ప్రపంచపు పైకప్పు"గా పేరొందింది

"మీ పని సక్రమంగా జరగాలనుకుంటే ఒక తీరికలేని మనిషిని ఎంచుకోండి, ఇతర రకాల వారికి తీరిక ఉండదు" ఆల్బర్ట్ హుబ్బర్డ్

# అవార్డులు

## అస్సాం లోయ సాహితీ అవార్డ్

అస్సాం ప్రజలకు చేసిన సారస్వత సేవలకు, సృజనాత్మక రచనా విధానానికి 1992 అస్సాం వ్యాలీ (లోయ) లిటరరీ (సాహితీ) అవార్డు సయ్యద్ అబ్దుల్ మాలిక్‌కు బహూకరించారు

## బ్రిటిష్ ఆర్ట్స్ కౌన్సిల్ సారస్వత బహుమతి

అతని జీవితకాలంలో సాధించిన సారస్వత కార్యసిద్ధికి ట్రినిడాడ్‌లో జన్మించిన భారతీయ గ్రంథకర్త వి ఎస్ నైపాల్‌కు 30,000 పౌండ్లు పారితోషికం గల మొదటి బ్రిటిష్ ఆర్ట్స్ కౌన్సిల్ సారస్వత బహుమతి లభించింది

## స్టాక్‌హోమ్ వాటర్ ప్రైజ్

ఇండియాలో నీటిరంగంలో ఆధునికీకరణ, మరియు వికేంద్రీకరణలపై విశిష్టమైన సేవలందించినందుకు ప్రతిష్ఠాత్మకమైన స్టాక్ హోమ్ (స్వీడన్) వాటర్ ప్రైజ్, ప్రసిద్ధ నీటి వనరుల నిపుణుడు డాక్టర్ ఎం.ఎ చిటాలే పొందారు

## హకీం ఖాన్ సురీ అవార్డ్

జాతీయ సమైక్యత పెంపొందించేందుకు నెలకొల్పిన హకీం ఖాన్ సురీ అవార్డ్ - 1992 బొంబాయి కల్లోలాల సమయంలో మంటల్లో చిక్కుకున్న ఒక కారులోని కుటుంబాన్ని కాపాడినందుకు - ప్రముఖ క్రికెట్ క్రీడాకారుడు సునీల్ గవాస్కర్‌కు బహూకరించారు

## శ్రీ రాజా-లక్ష్మి అవార్డ్

**కర్ణాటక సంగీతానికి వైభవోపేతమైన సేవ** చేసినందుకు స్మృతిగా 1992 శ్రీరాజా-లక్ష్మి అవార్డ్ శ్రీద్వారం వెంకటస్వామి నాయుడు ట్రస్ట్‌కు బహూకరించారు. వీరి సారస్వత బహూకృతి సుప్రసిద్ధ తెలుగు, సంస్కృత విద్వాంసుడు శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులకు లభించింది

## వెలిసాల వంటిది కాదు నామతం



Gandhiji

*నా గృహానికి నాలుగు వైపులా గోడలు ఉండటం, నా గవాక్షాలు బిక్కిరిసి ఉండటం నాకు ఇష్టం లేదు వీలైనంత స్వేచ్ఛగా అన్ని భూముల నుండి సంస్కృతీ పవనాలు నా గృహంలోకి ప్రసరించాలని నేను కోరుకుంటున్నాను. అయితే వీటిలో దేనివల్లనైనా నా పాదాలు కదిలిపోయి దెబ్బ తినటాన్ని నేను వ్యతిరేకిస్తాను నాది వెలిసాల మతం కాదు భగవంతుని సృష్టిలో అతి హీనమైనదానికి కూడా దీనిలో చోటు ఉన్నది. జాతి మత వర్ణ అహంకారానికీ గర్వానికి వ్యతిరేకంగా - ఒక ఋజువుగా - ఇది ఉండాలి*

— మహాత్మాగాంధీ

"కార్యశీలమైన యుగంలో గుడ్డి ఆరాధన ఎంతమాత్రం విలువలేనిది అది తరచుగా ఇబ్బందికరంగా మరియు తరచుగా అంతకు సమానమైన బాధాకరంగా ఉంటుంది"

— గాంధీజీ

## హల్దీ ఘటి అవార్డ్

మహిళలు ఎదుర్కొనే సమస్యలు మరియు సంఘంలోని బలహీన వర్గాలు ఎదుర్కొనే సమస్యలకు - జర్నలిజం మాధ్యమం ద్వారా బహుళ ప్రాచుర్యం కలిగించినందుకు 'మానుషి' సంస్థాపక సంపాదకురాలు శ్రీమతి మధు కిష్వర్‌కు హల్దీ ఘటి అవార్డ్ లభించింది

## 1992 టెంపుల్‌టన్ బహూకృతి

మతాభివృద్ధికై ఇచ్చే 1992 టెంపుల్‌టన్ బహూకృతి (ఒక మిలియన్ డాలర్లు) ప్రపంచంలోని అతిపెద్ద ప్రెస్‌బైటిరియన్ చర్చి సంస్థాపకుడైన - దక్షిణ కొరియాకు చెందిన - రెవరెండ్ క్యియుంగ్ - చిక్ హన్‌కు లభించింది

## డాక్టర్ మాధవ్‌కు ఆర్.డి.బిర్లా అవార్డ్

అద్వితీయ పరిశోధనకుగాను బొంబాయి టాటా మెమోరియల్ సెంటర్‌కు చెందిన కాన్సర్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ ప్రధానాధిపతి డాక్టర్ మాధవ్ జి. దియోకు రామేశ్వర్‌దాస్ బిర్లా నేషనల్ అవార్డ్ బహూకరించారు భయంకరమైన కుష్ఠువ్యాధిని నివారించే తొలి స్వదేశీ టీకా మందును ఆయన అభివృద్ధి చేశారు.

## జి.ఎం.మోడీ సైన్స్ ఫౌండేషన్ అవార్డ్

ఆధునిక శాస్త్ర విజ్ఞానానికి అద్వితీయ సేవలందించిన స్పేస్ (అంతరిక్ష) కమిషన్ మాజీ ఛైర్మన్ ప్రొఫెసర్ సతీష్ ధావన్ మొదటి గుజర్ మల్ మోడీ సైన్స్ ఫౌండేషన్ అవార్డు స్వీకరించారు 1 లక్ష నగదు, ఒక వెండి పళ్ళెరం మరియు ప్రశంసాపత్రంతో కూడిన అవార్డు ఇది ●

## రాజీకి వివిధ దశలు



నా జీవిత మార్గంలో నేను నేర్చుకున్న అత్యంత ముఖ్యమైన విషయాల్లో ఒకటి - తోటి జనులను గురించి తొందరపాటుతో కూడిన తీర్పులు చెప్పటం అన్యాయమని, అది సరియైనది కాదన్న విషయం ఇది మరో అమూల్య పాఠాన్ని నేర్చేందుకు నాకు దారి చూపింది జీవితం నేర్పిన ఆ మరో పాఠం ఏమిటంటే - జీవితపు దారిలో రాజీ మార్గాన పోవటమనే బంగారపు సిద్ధాంతం ఉభయత్రా పరిష్కారాలు (సవరింపులు) మరియు సహకారాల పరంపరల ద్వారానే జీవితం మృదువుగా సాగి పోతుంది రాజీపడనివాడు ఒక మూఢ ఆవేశపరుడో, ఒక పిచ్చివాడో మరియు ఒక నియంతో అయి ఉంటాడు "జీవించు మరియు జీవించనివ్వు"- అనే వైఖరి లేనప్పుడు సాంఘిక జీవితం అసాధ్యం ఇతరుల పొరపాట్ల (దోషాలు) వల్ల సహానుభూతి కావాలి "వంద పుష్పాలు వికసించనీయండి మరియు వంద భావాలు వర్ధిల్లనీయండి" అనే పంచశీల వైఖరి, సచేతన తాటస్థ్యం మొదలైన వన్నీ "రాజీ" అనే బంగారపు సూత్రానికి వివిధ (దశలు) ముఖాలు మాత్రమే

— ఎస్ ఎస్ వాసన్

—సెల్ఫ్ ఇంప్రూవ్‌మెంట్ మాన్యువల్ సౌజన్యంతో

"దుఃఖం భగవంతుడిని జ్ఞాపకం చేస్తుంది సుఖం దేవుణ్ణి మరచిపోయేలాగ చేస్తుంది" — స్వామీ సుందర చైతన్యానంద

# సుప్రసిద్ధ శాస్త్రజ్ఞులు

## డా.ఆర్.ఎస్. కృష్ణన్

ప్రపంచంలో ప్రసిద్ధి పొందిన భౌతిక విజ్ఞాన వేత్త డాక్టర్ రవ్పల్ సంగమేశ్వర కృష్ణన్ బెంగుళూరులోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్‌లో నోబెల్ బహుమతి గ్రహీత సి.వి. రామన్ మార్గదర్శకత్వంలో పరిశోధన కొనసాగిస్తూ కీర్తి ప్రతిష్ఠల్ని సంపాదించుకున్నారు.



Dr.R.S Krishnan

1911 సెప్టెంబర్ 23న కేరళలోని రవ్పల్‌లో సంగమేశ్వర అయ్యర్, పర్వతవర్థిని దంపతులకు డాక్టర్ కృష్ణన్ జన్మించారు. వీరు 1933లో బి.ఏ. ఆనర్స్ పరీక్షలో ఉత్తీర్ణులై, మద్రాసు విశ్వవిద్యాలయం యోగ్యత (మెరిట్) గలవారి జాబితాలో ప్రథమస్థానం పొందారు. 1937లో మద్రాసు విశ్వవిద్యాలయం నుండి డి.ఎస్‌సి (కాంతి వ్యాపకం) పొందారు. 1941లో ఇంగ్లండ్‌లోని కేంబ్రిడ్జి యూనివర్శిటీ నుండి పిహెచ్.డి (న్యూక్లియర్ ఫిజిక్స్) గడించారు. అప్పటినుండి వీరు ఫిజిక్స్ (భౌతికశాస్త్రం)లోని వివిధ దశలలో - కాంతి వ్యాపకం, న్యూక్లియర్ ఫిజిక్స్, ఎక్స్-రే డిఫ్రాక్షన్, లేజర్స్, న్యూక్లియర్ జియోక్రోనాలజీ, అల్ట్రాసోనిక్స్ మొదలైనవి - విస్తృత పరిశోధనలు చేసి, ఆ అంశాలకు గణనీయమైన తోడ్పాటునిచ్చారు.

1948లో బెంగుళూరులోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ యొక్క ఫిజిక్స్ శాఖాధిపతిగా, ప్రొఫెసర్‌గా డాక్టర్ కృష్ణన్ ప్రొఫెసర్ సి.వి. రామన్ తరువాత పదవి చేపట్టి అదే హోదాలో 1970 ఆగస్ట్ వరకు కొనసాగారు. ఇక్కడ ఆయన సాలిడ్ స్టేట్స్ ఫిజిక్స్ యొక్క వివిధ శాఖలలో పరిశోధనకుగాను ఒక క్రియాశీల పాఠశాల నెలకొల్పారు. ఇది ఇండియాలో సాలిడ్ స్టేట్ ఫిజిక్స్ పరిశోధనకు ప్రధాన కేంద్రంగా ప్రపంచమంతటా గుర్తింపు పొందింది. ఆయన ప్రత్యక్ష మార్గదర్శకత్వం, పర్యవేక్షణలలో అనేకమంది రిసెర్చి స్కాలర్లు, రిసెర్చి అసిస్టెంట్లు డాక్టరేట్ డిగ్రీలు గడించారు. ఆయన ఇండియాలోనూ, విదేశాల్లోనూగల గుర్తించబడిన సైంటిఫిక్ జర్నల్స్‌లో - ఆప్టిక్స్, స్పెక్ట్రోస్కోపీ, న్యూక్లియర్ ఫిజిక్స్ మరియు సాలిడ్ స్టేట్ ఫిజిక్స్ - వంటి అంశాలపై 200 మూల (ఒరిజినల్) వ్యాసాలు ప్రచురించారు.

1935లో డాక్టర్ కృష్ణన్ సంఘర్షించే నేత్ర విజ్ఞానం మరియు కాంతి వెదజల్లటం (Colloid optics and light scattering)పై ఒక కొత్త ఆప్టికల్ ఎఫెక్ట్ కనుగొన్నారు మరియు దీని సామాన్యాంశాన్ని సిద్ధాంతపరంగా ఋజువు చేశారు. ఫిజికో-కెమికల్ సమస్యల అధ్యయనంలో దీని ప్రాధాన్యం ప్రపంచమంతటా గుర్తించటం జరిగింది. ఇది "కృష్ణన్

"సంపదపోతే మనిషి కోల్పోయేది ఏమీ లేదు. ఆరోగ్యాన్ని కోల్పోతే మనిషి కొంత నష్టపోతాడు. మరి శీలమే కోల్పోతే మనిషి సర్వమును కోల్పోయినట్లే"

— బాబా

ఎఫెక్ట్'గా పేరొందింది.

1973 నుండి 1977 వరకు డాక్టర్ కృష్ణన్ తిరువనంతపురంలోని కేరళ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్‌గా పని చేశారు. 1977 నుండి బెంగుళూరులోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్‌లో, సైన్స్ అండ్ టెక్నాలజీ డిపార్ట్‌మెంట్‌కు ప్రిన్సిపల్ ఇన్వెస్టిగేటర్‌గా, ఎమిరిటస్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు.

డాక్టర్ కృష్ణన్, కేంబ్రిడ్జ్‌లోని సైక్లోట్రాన్ లెబొరేటరీలో ప్రొఫెసర్ సర్ జాన్ కాక్‌క్రాఫ్ట్ వద్ద పనిచేశారు. 1938 నుండి 1941 వరకు ఆ లెబొరేటరీకి పూర్తి అధిపత్యం నిర్వహించారు. ప్రపంచంలో జరిగిన అనేక ఫిజిక్స్ సదస్సులకు, గోష్ఠులకు హాజరయ్యారు. బ్రిటన్, యుఎస్‌ఎ, కెనడా, ఆస్ట్రేలియా, ఫ్రాన్స్, జపాన్, స్విట్జర్లాండ్ మరియు సింగపూర్‌లలోని విశ్వవిద్యాలయాల ఆధ్వర్యంలో ఎన్నో ఉపన్యాసాలు ఇచ్చారు. 1949 లో ఆయన ఇండియన్ సైన్స్ కాంగ్రెస్ యొక్క ఫిజిక్స్ విభాగానికి అధ్యక్షుడుగా ఉన్నారు. 1974లో యు ఎస్ ఎస్ ఆర్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ ఆహ్వానంపై మూడువారాలు మాస్కో మరియు లెనిన్‌గ్రాడ్‌లలోని యూనివర్శిటీ ఫిజిక్స్ శాఖలను, ఎకాడమీ ఆఫ్ సైన్సెస్‌కు చెందిన ఫిజిక్స్, కెమిస్ట్రీ, క్రిస్టల్లోగ్రఫీ మరియు మెటీరియల్ సైన్సెస్ ఇన్‌స్టిట్యూట్స్‌ను సందర్శించారు.

భారత ప్రభుత్వం యొక్క వివిధ సైంటిఫిక్ కమిటీలు, యూనివర్శిటీ గ్రాంట్స్ కమిషన్, కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రిసెర్చి, అటామిక్ ఎనర్జీ డిపార్ట్‌మెంట్ మరియు అనేక భారత విశ్వవిద్యాలయాలు, సైంటిఫిక్ సొసైటీలలో క్రియాశీల సభ్యుడుగా పనిచేశారు. ఇవి కాక అమెరికన్ ఫిజికల్ సొసైటీ, ఇండియన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్, ఇండియన్ నేషనల్ సైన్స్ అకాడమీ, లండన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫిజిక్స్‌లో ఫెలోగా ఉన్నారు. ఫెర్రో-ఎలక్ట్రిసిటీకి చెందిన అంతర్జాతీయ సంఘంలో సభ్యుడిగా ఉన్నారు.

ఉపాధ్యాయుడు, పరిశోధక విద్యార్థి, శాస్త్రజ్ఞుడు, పరిపాలకుడు మరియు విద్యావేత్తల విజయవంతమైన మేళవింపే డాక్టర్ కృష్ణన్.

## ఒక ఎద్దు సమకూర్చే అశ్వశక్తి 0.5



*మన గ్రామీణ రవాణా వ్యవస్థలో దాదాపు 67 శాతం వరకు-15 మిలియన్ ఎడ్లబళ్ళు ఉంటాయని అంచనా వేయబడింది. ఒక ఎద్దు 0.5 అశ్వశక్తిని ఇస్తుంది. ఇండియాలోని మొత్తం 84 మిలియన్ బరువులు మోసే జంతువులు 40 మిలియన్ అశ్వశక్తిని రైతులకు సమకూరుస్తాయి.*

*సేద్యపు భూమిలో 67 శాతం నేలను ఇవన్నీ కలసి దున్నుతాయి. ఇవి 25,000 మిలియన్ టన్నుల బరువును కూడా లాగుతాయి. తమ లాగే శక్తి ద్వారా, ప్రతి సంవత్సరం డీసిల్‌పై జరుగుతున్న 15,000 కోట్ల రూపాయల వ్యయంలో 2,400 కోట్ల రూపాయల వ్యయాన్ని ఇవి తగ్గిస్తున్నాయి.*

*— 'బిజినెస్ ఇండియా' సౌజన్యంతో*

"మాట్లాడేందుకు నేను సందేహపడటం ఒకప్పుడు సతాయింపుగా ఉండేది కానీ ఇప్పుడు సుఖంగా, ప్రీతిగా ఉంది. మాటల పొదుపు - నేను నేర్చుకున్న గొప్పలాభం."

— గాంధీజీ

# నాలుగు విధాల మేలుచేసే నల్లరేగు

నల్లరేగు చెట్టుకు భారతదేశం జన్మస్థానం ఇది కఠినమైన ఉష్ణమండల ప్రదేశాల్లో వృద్ధి చెందుతుంది ఇది మన ఉపఖండంలోని అన్ని ప్రాంతాలలోనూ, ఆగ్నేయ ఆసియా దేశాలలోనూ, తూర్పు ఆఫ్రికాలోనూ కనిపిస్తుంది ఇది "సైజైజియం కుమిని" (syzygium cumini) అనే పేర వృక్ష శాస్త్ర పరంగా గుర్తించబడింది



జాంబస్, జమున్, రాజమన్, కళాజమున్, నేరేడు, నవల్, నెరలి, జమలీ, నల్లరేగు, మరియు నల్ల బెర్రీ అనే స్థానిక పేర్లతో పిలువబడుతున్నది ప్రాచీనకాలం నుంచి దీని అసాధారణ రుచి, వాసన, రంగు ఆదరణకు పాత్రమైనాయి ఈ పండు ఔషధ గుణాలకు అమూల్యమైనది ముఖ్యంగా మధుమేహ చికిత్సలో ఇది ఎంతో విలువైనది

నల్లరేగు చెట్టు- ఎత్తుగా, ఆకుపచ్చగా ఉండి, ఇండో - గంగా మైదాన ప్రాంతాల్లోనూ, తమిళనాడులోని కావేరీ డెల్టాలోనూ వృద్ధి పొందుతుంది అసహజమైన మరియు చెల్లా చెదరైన చెట్లు ఎక్కువగా - తోటలు, తోపులలోనూ, నీటి పారుదల కాలువల ప్రక్కన, తేమగా ఉండే స్థలాలలోనూ మరియు చిత్తడి నేలల లోనూ పెరుగుతాయి వర్షాకాలంలో పక్షులు మరియు జంతువుల ద్వారా వెదజల్లబడి స్వయంగా విత్తనాలు మొలకెత్తుతాయి ఇండ్ల వద్ద లేదా రోడ్డుపక్కన నీడనిచ్చే చెట్లుగా వీటిని పెంచటం మరో సామాన్య పద్ధతిగా ఉంది దీని పండ్లు జూన్, జూలైలలో పక్వానికి వస్తాయి ఈ చెట్టు 60, 70 సంవత్సరాల వరకు పండ్లను ఇస్తుంది

నల్లరేగు పండు సామాన్యంగా ఆకర్షణీయమైన ఊదారంగులో ఉంటుంది ఇది రుచిలో కారంగా, తియ్యగా ఉంటుంది ఈ పండు దాదాపు ప్రతిరోజూ కోయబడి అదేరోజు మార్కెట్‌కు పంపబడుతుంది ఇది అత్యంత క్రుళ్ళిపోయే స్వభావం కలది, మంచి స్థితిలో రెండు లేక మూడు రోజుల కంటే నిలువ ఉండనిది

అనేక ఇతర రకాలలో, చాలా సాధారణ రకం - రాజమన్ రకం ఇవి పెద్ద దీర్ఘ చతురస్రంగా ఉండి, గాఢమైన ఊదారంగు లేదా నీలం రంగులో ఉంటాయి గులాబీ రంగు లేదా బూడిద రంగు తీపి గుజ్జు కలిగి చిన్న విత్తనాలతో ఉంటాయి మరోరకం క్రింది స్థాయికి చెందిన 'కాథ' రకం - ఇవి ఆమ్లపు గుజ్జుగల చిన్న పండ్లు అభివృద్ధి చెందిన ఇతర రకాలను కూడా పెంపొందించటం జరిగింది ఇవి ఊదారంగు, వైలెట్ లేక తెల్లరంగు గల విత్తనాలు లేని పండ్లు

## ముగ్గురు చాలు!

ఒక పరమ పిసినారి ఇలా చెబుతున్నాడు- "నీవు ఒక నౌకరును పెట్టుకుంటే నీ పని పూర్తవుతుంది ఇద్దర్ని పెడితే సగమే పూర్తి చేస్తారు, ముగ్గుర్ని పెట్టుకుంటే, నీ పని స్వయంగా నీవే చేసుకోవల్సి వస్తుంది "

"సమయానుకాలతకు - తగినకాలం అనేది సారాంశం, చాలాకొద్ది మంది మాత్రమే కచ్చితమైన సమయజ్ఞానం కలిగి ఉంటారు "

ఇదే జాతికి చెందిన మరోచెట్టు రోజ్‌యాపిల్ (సైజైజియం జంబోస్) దీని ఫలాలు గులాబ్ జామున్‌గా పేరొందాయి పెరునవల్ - గులాబి వాసన కల గుజ్జుకు ప్రసిద్ధి పొందింది రోజ్ యాపిల్స్ దాదాపు యాపిల్స్ మాదిరిగా పెద్దవిగా ఉంటాయి వీటిల్లో తరచుగా రుచిలేని, నిస్సార మైన, రంగులేని, పెళుసైన కండ ఉంటుంది ఈ పాద ఇంటి తోటలోనే సామాన్యంగా పెరుగుతుంది కారణం ఇది అలంకారప్రాయంగా ఉంటుంది కనుక

రేగుపండులోని తినదగిన భాగం మొత్తం పండులో 70 శాతం వరకు ఉంటుంది పక్వమైన పండులో ప్రధానమైన చక్కెరలు గ్లూకోస్ మరియు ఫ్రక్టోస్ సుక్రోస్‌కు చెందిన ఆధారం ఏదీ కనుగొనబడలేదు విటమిన్ 'సి' మరియు ఖనిజ లవణాలకు ఇది మంచి ఆధారం పండులోని పైనవు భాగం మరియు తాజా ఆకులు - పక్వంకాని మామిడి వాసనకల నూనెను సమకూరుస్తాయి

మధుమేహ చికిత్సలో రేగుపండుకు ప్రత్యేక స్థానం ఇచ్చారు ఈ చెట్టువట్ట, విత్తనాలు మరియు ఆకులు ఉపయోగిస్తారు విత్తనాలలోని నీటి సంగ్రహం కుక్కలకు ఇన్‌జెక్షన్ చేస్తే బ్లడ్ సుగర్‌ను తగ్గించినట్లు దాఖలాలు ఉన్నాయి లక్నోలోని సెంట్రల్ డ్రగ్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో జరిపిన పరిశోధనల ఫలితంగా మధుమేహ వ్యాధిగ్రస్తులకు ఎండిన విత్తనాలలోని సారాన్ని నోటిద్వారా ఇచ్చినట్లయితే వారి బ్లడ్ సుగర్ మరియు గ్లైకోసురియాల స్థాయి తగ్గిస్తుందని వెల్లడయింది రేగువిత్తనాలు ప్రొటీన్ మరియు కాల్షియంలలో అత్యంత విలువగలవి పసుపుపచ్చ రంగులో ఉండే మంచి నాణ్యత కల తేనెకు రేగుపూలు ప్రధానమైన ఉత్పత్తి స్థానాలు

రేగు ఆమ్ల గుణం కలది. సాధారణంగా ఉప్పు అద్దుకుని వీటిని తింటారు తాజా పండ్లు రుచిగా ఉంటాయి. కానీ వీటిని పండ్ల కలకండగా కానీ, తాండ్రగా కానీ భద్రపర్చుకోవాలి ఈ పండ్లు, పానీయాలు మరియు హల్వా వంటి మెత్తని పదార్థాలు చేసుకునేందుకు ఉపయోగిస్తాయి పక్వంకాని పండురసం వెనిగార్ తయారు చేసేందుకు ఉపయోగిస్తారు ఇది ఆకర్షకమైన రంగు, చక్కని (సు)వాసన, రుచి మరియు పరిమళం కలిగి ఉంటుంది మంచి మద్యాలుగా పక్వమైన రేగుపండ్లు తరచుగా మారతాయి నీడకోసం, పొలాలలో గాలిని ఆపేందుకు ఈ రేగుచెట్లను సాధారణంగా రోడ్లప్రక్కనా, కాఫీతోటలలోనూ నాటుతారు కొన్ని ప్రాంతాలలో రేగుచెట్లపైన పట్టుపురుగులు పెంచబడతాయి

## అత్యంత ముఖ్య సందర్శకుడు

*మన ఆవరణలోకి వచ్చే అత్యంత ముఖ్యమైన సందర్శకుడు - ఖాతాదారుడే అతడు మనపైన ఆధారపడలేదు మనమే అతనిపై ఆధారపడ్డాము దాని ఉద్దేశం అతడే అతనికి సేవ చేయటం ద్వారా మనం అతనికేమీ ఉపకారం చేయటంలేదు అలా చేసే అవకాశం మనకు కలిగించటం ద్వారా అతడే మనకు ఉపకారం చేస్తున్నాడు*

*— గాంధీజీ*

## అంటార్కిటికాలో చలికాలం

*దక్షిణ ధ్రువం సమీపంలోని మంచులో కప్పబడిన అంటార్కిటిక్ ఖండం - దాదాపు యునైటెడ్ స్టేట్స్ మరియు ఆస్ట్రేలియాలను కలిపినట్లయితే ఏర్పడేంత వైశాల్యం కలిగి ఉంది వేసవి మధ్యలో సముద్ర తీరంలో కూడా ఉష్ణోగ్రత చలి చేత ఘనీభవించి ఉంటుంది చలికాలంలో ఉష్ణోగ్రత (జీరో క్రింద) 100 డిగ్రీలకు దిగిపోతుంది*

# తులసిలోని ఔషధ గుణాలు

ఒక పవిత్రమైన మొక్క - తులసి ప్రతి హిందూ గృహంలో పూజించబడి, ఉపయోగించబడుతున్నది దీనిలో అనేక ఔషధ గుణాలు ఉన్నాయి ఒక వ్యక్తి తులసి ఆకును ధరిస్తే,



దాని ఔషధ విలువలు అతని శరీరానికి సామాన్యమైన మరియు ప్రమాదకరమైన వ్యాధులు రాకుండా కాపాడుతాయి గొలుసు కట్టుగా పొగత్రాగటం, తీవ్ర రక్తపు పోటుకు గురికావటం వల్ల అలసట చెంది, ఆయాస పడుతున్న ఒక ఉన్నతాధికారి టిల్ ఆయిల్‌లో ఉడికించిన ఇతర మూలికా వనస్పతి సారాంశాలతో కలిపిన తులసి సారాన్ని తీసుకొనటం ప్రారంభించాడు అతడు తీవ్రమైన రక్తపు పోటు నుంచి, కార్డియక్ వాస్క్యులర్ బాధ నుంచి క్రమేణా స్వస్థత పొందాడు తులసి నూనెను క్రమబద్ధంగా వాడటం ద్వారా అతడు ఆరోగ్యంగా, ఉత్సాహంగా రూపొందాడు

ఆధునిక ఔషధాల అపరిమిత ఖరీదు నుంచి బయట పడేందుకు తులసి వాడకంలోని సుగుణాన్ని ప్రజలు గ్రహించుకోవాలి

చర్మవ్యాధుల్కు, రక్తంలోని అవరోధాల్కు, మలేరియా, మూత్ర వ్యాధులు, తీవ్రమైన జలుబు, కీళ్ళ నొప్పులు (ఆర్థిరిటిస్), తక్కువ మరియు ఎక్కువ రక్తపుపోటు, మూలవ్యాధి, కాలేయం మరియు బిడ్డల వ్యాధులు — తులసి మొక్కను సక్రమ మార్గంలో ఉపయోగించటం ద్వారా నయం చేసుకోవచ్చు

హృద్రోగస్థితి, కాన్సర్, అంటువ్యాధులు మరియు ఒత్తిళ్ళు - వీటిపై తులసి మొక్క యొక్క ఔషధ గుణం బాగానే ఉన్నదని పరిశోధనా ఫలితాలు వెల్లడిస్తున్నట్లు కేంద్ర ఆయుర్వేద పరిశోధన సంస్థ విడుదల చేసిన సమాచారం వెల్లడిస్తున్నది

— 'పెంబా' సౌజన్యంతో

## భయ, విచారాలకు దూరం కావాలి

*విచారం దేనికి? భయమెందుకు? నీ అంతరంగ వ్యక్తిత్వం తగినవిధంగా స్వరాలు కూర్పబడి, సక్రమంగా చక్కదిద్దబడడం ఎలాగో నీవు తెలుసుకున్నప్పుడు - జీవితంలో విచారపడేందుకు, భయపడేందుకు ఏమీ ఉండదు. ప్రతి పరిస్థితిలోనూ సృజనాత్మక సజీవంగా ఉండు నీలో నివసించే అనంత శక్తి నంపన్నుడు, వివేకవంతుడైన భగవంతుని పట్ల ఆత్మవిశ్వాసంతో ఉండు ఎప్పుడూ మనశ్శాంతి కలిగి ఉండు ఏ పరిస్థితుల్లోనూ వ్యాకులం చెందవద్దు. జీవితపు సవాళ్ళను సంతోషంతో ఎదుర్కో*

— స్వామీ చిన్మయానంద

"కార్యాచరణకు దారి తీయని ఏ ఆలోచన కూడా ఆలోచన కాదు అది కలలు కనటమే"

# తొలినాటి వెలుగురేఖ - క్రొవ్వొత్తి

ప్రాచీన ప్రపంచంలో తొలిగా కనుగొన్న వాటిల్లో క్రొవ్వొత్తులు లేక మైనపు వత్తులు ఉన్నాయి 3000 బి సి నాటి ఈజిప్ట్ మరియు గ్రీస్‌లకు చెందిన క్రొవ్వొత్తి వుల్లలు మనవద్ద ఉన్నాయి దీపాల వెలుగుకు ఆధారంగా క్రొవ్వొత్తులు- తొలి రోజుల్లోని జంతువుల క్రొవ్వుతో కూడిన మైనంతో రెల్లు గొట్టాలు లేక కాడలద్వారా వెలిగే దీపాలకు - వారసులుగా వచ్చాయి



కాలక్రమేణా జనపనార మరియు పత్తిదారాలను ప్రవేశపెట్టి అభివృద్ధి చేశారు వీటిని 'టాలో' అనే జంతువుల క్రొవ్వులో ముంచారు ఇటువంటి "టాలో క్రొవ్వొత్తులు" మధ్య యుగాలలో యూరప్‌లో విస్తృతంగా ఉపయోగించారు క్రొవ్వొత్తులు తయారు చేస్తూ ఒక ఇంటి నుంచి మరొక ఇంటికి వెళ్ళే ట్రావెలింగ్ కాండిల్ మేకర్స్ (సంచార క్రొవ్వొత్తి తయారీదారులు)కు సంబంధించిన గిల్డ్స్ (సమాజాలు) ఏర్పడేందుకు ఇది దారి తీసింది 18వ శతాబ్ది మధ్యకాలం నాటికి క్రొవ్వొత్తుల తయారీలో ఉపయోగించిన పదార్థాలు 'టాలో' మరియు తేనెటీగల మైనం మాత్రమే

తరువాత ఒకదాని వెంట ఒకటిగా రసాయనిక ప్రక్రియలు జరిగాయి తత్ఫలితంగా ప్రస్తుతం ప్రపంచంలో భారీ ఎత్తున క్రొవ్వొత్తుల నిర్మాణంలో పారాఫిన్ వాక్స్ ఉపయోగించ బడుతున్నది ఇప్పుడు క్రొవ్వొత్తుల తయారీలో ఐదు పద్ధతులు అనుసరిస్తున్నారు ముంచి వేయటం, మూస పోయటం, చల్లటం, తీయటం లేదా రూపొందించటం మరియు బయటకు త్రోసివేయటం

నేడు క్రొవ్వొత్తులకు ఉత్తమ ఖాతాదారుల్లో చర్చి ఒకటి ఈస్టర్ మరియు క్రిస్టమస్ వంటి మత సంబంధమైన సెలవు రోజుల్లో క్రొవ్వొత్తుల విక్రయాలు బాగా పెరుగుతాయి సాధారణంగా చర్చి దైవపీఠంకోసమే పొడవైన, పెద్ద క్రొవ్వొత్తులు తయారవుతాయి యూరప్ దేశాలలో కొన్ని క్రొవ్వొత్తులు కళాపరమైన వాస్తవిక కృతులుగా కనిపిస్తాయి జర్మన్లు, స్కాండినేవియన్లు క్రొవ్వొత్తుల పట్ల చాలా పక్షపాతం కలిగి ఉంటారు ఎవరినైనా భోజనానికి కానీ, లేదా కేవలం కాఫీ, కేక్‌ల సేవనంకు కానీ ఆహ్వానిస్తే, విందుబల్లపైన ఒకటి కానీ లేదా అనేక రంగులతో కూడిన క్రొవ్వొత్తులను కానీ అలంకృత స్థంభాలపై ఉంచి వాటిని వెలిగించి ఆసందర్భాన్ని ఒక వేడుకగా జరుపుకుంటారు

అన్ని క్రొవ్వొత్తులు వెలిగేవి కావు 100 రూపాయలకు పైగా ఖరీదుకల దేనినైనా ఇంట్లో ఒక అలంకార వస్తువుగా పెట్టుకుంటారు

## రుచి కో

*ప్రతి ఆనందానికి (భోగానికి) ఒక హద్దు ఉంటుంది ఒక విషయాన్ని కొంతమేరకే నీవు ఆనందించ గలుగుతావు ఆ పరిధి దాటితే, దాని రుచిని కోల్పోతావు*

# సర్వధాత్రీసుతుని దివ్యసందేశం - క్రైస్తవమతం

ప్రపంచంలో అత్యంత విస్తృత వ్యాప్తి చెందిన క్రైస్తవమతం జీసస్ క్రీస్తు జీవితం మరియు భావాలకు అనుగుణంగా స్థాపించబడింది యావత్ ప్రపంచం అతని చేత, అతని బోధనల చేత ప్రభావితమైంది


Christ

తన 30వ ఏట జీసస్ ప్రబోధం ప్రారంభించారు "దైవ కుమారుడ"నని తనను తాను పిలుచుకుని ఈ ప్రపంచానికి దేవుని సందేశం తీసుకు వచ్చారు అతని ఆకర్షణీయమైన వ్యక్తిత్వం మరియు సాహసోపేతమైన భావ ప్రకటన అనేకమంది సహచరులను సమకూర్చి పెట్టింది యూదులకు బందీగా చిక్కగా, జూడాలో ఒక కొత్త రాజ్యం స్థాపించేందుకు ప్రయత్నిస్తున్నాడన్న అభియోగం మోపబడింది అతని 12 మంది అనుచరులలోని- జూడాస్ ఐజకరియట్ - అనే శిష్యుని చేత వంచించబడ్డారు పాలస్తీనాను పరిపాలించే రోమన్ గవర్నర్ పిలట్ అతనికి మరణదండన విధించాడు 30 ఏ డి లో జీసస్‌కు మేకులు కొట్టి శిలువ పైకి ఎక్కించారు శిలువపై జీసస్ అస్తమించినా క్రైస్తవమతం మరణించలేదు. శిలువ వేసిన మూడు రోజుల తరువాత అతడు సమాధి నుండి లేచి, తన కార్యాన్ని కొనసాగించమని భక్తులను ప్రోత్సహించారు

ప్రపంచంలోని అత్యున్నత మత ప్రవక్తలలో జీసస్ ఒకరు "దేవుని రాజ్యం మీలోనే ఉన్నది" "నీవలే నీ పొరుగువానిని ప్రేమించు" "నీ కోటును ఒక మనిషి తీసుకువెళ్తే అతనికి నీపై గుడ్డను కూడా ఇవ్వు" వంటి దివ్య వాక్యాలు ఆయన పలికారు 'సెర్మన్ ఆన్ ది మౌంట్'లో

## అత్యంత ప్రాముఖ్యమైన ఆరు మాటలు

ఆరు అత్యంత ముఖ్యమైన మాటలు
నేను తప్పు చేశానని అంగీకరిస్తున్నాను
*(I admit I made a mistake)*
ఐదు ముఖ్యమైన మాటలు
నిన్ను చూసి నేను గర్వపడుతున్నాను
*(I am proud of you)*
నాలుగు ప్రధానమైన పదాలు
బహుశా నీదే ఒప్పు కావచ్చు
*(Perhaps you are right)*
మూడు ముఖ్యమైన మాటలు
నేను నిన్ను ప్రేమిస్తున్నాను
*(I love you)*
రెండు ముఖ్యమైన మాటలు
మీకు వందనాలు
*(Thank you)*
ఒకే ఒక ప్రధానమైన మాట
దయచేసి *(Please)*
అత్యంత అప్రధానమైన మాట
"నేను!" *(I)*

ప్రసిద్ధి చెందిన అయన బోధనలు ఉన్నాయి.

మలభమైన, స్వదేశీయమైన నీతి కథల ద్వారా జీసస్ తన సందేశాన్ని అందజేశారు




'న్యూటెస్టమెంట్ లేదా ది బైబిల్'లో క్రీస్తు బోధనలను ఆయన శిష్యులు సేకరించి, సమకూర్చారు ఇది క్రైస్తవులకు పవిత్ర గ్రంథమే కాకుండా అదొక గొప్ప సారస్వత ఉత్తమ కృతి కూడా

క్రీస్తు మరణానంతరం అయన బోధనలను ప్రచారం చేసే బాధ్యత ఆయన శిష్యులపై పడింది. పీటర్, జాన్ మరియు సెయింట్ పాల్ క్రైస్తవ మతాన్ని విస్తృతం కావించారు సెయింట్‌పాల్ "ధర్మపత్రం" (లేఖ)లో క్రీస్తు యొక్క అమూల్యమైన అనేక బోధనలు ఉన్నాయి ఈ కొత్త మతంలోకి వచ్చేందుకు అనేకమంది అనుచరులను అయన గెలుచుకున్నారు. క్రమేణా, క్రైస్తవమతం ప్రపంచ మతంగా రూపొందింది

రోమన్ చక్రవర్తుల హస్తాలలో క్రైస్తవ మతం కఠిన పీడనకు గురైంది పవిత్రుడూ, ఋషి తుల్యుడూ అయిన మార్కస్ అరిలియస్ వంటి చక్రవర్తి కూడా తన రాజ్యంలో క్రైస్తవులను పీడనకు గురి చేసాడు 3వ శతాబ్ది ఏ.డి.లో అనేకమంది క్రైస్తవులు శిక్షింపబడ్డారు. చర్చి ఆస్తులు స్వాధీనం చేసుకోబడ్డాయి. మత గ్రంథాలు మంటల్లోకి విసరబడ్డాయి కానీ ఈ పీడనలు క్రైస్తవమతం పునాదుల్ని కదిలించలేక పోగా దాన్ని మరింత బలపర్చటం జరిగింది రోమన్ చక్రవర్తి కాన్‌స్టైన్‌టైన్ క్రైస్తవ మతాన్ని ఆదేశపు మతంగా చేశారు. అప్పటి నుండి క్రైస్తవ మతం త్వరితగతిలో అభివృద్ధి సాధించింది సెయింట్ థామస్ భారత దేశంలో క్రైస్తవ మతాన్ని ప్రవేశపెట్టాడు

వివిధ మత శాఖలతో కలిసి క్రైస్తవ మతంలో దాదాపు 1784 మిలియన్ సభ్యులు లేదా ప్రపంచ జనాభాలో 33 1 శాతం మంది ఉన్నారు. రోమన్ కాథలిక్ చర్చిలో దాదాపు 1010 మిలియన్ మంది ఉన్నారు కాథలిక్ చర్చి యొక్క ప్రపంచ కేంద్ర స్థానం వాటికన్ నగరం ఇది పోప్ అధికార నివాసస్థానం ఇటలీ రాజధాని రోమ్‌లో గల వాటికన్‌లో దాదాపు 1000 మంది జనాభా ఉంటారు. కార్డినల్స్ (పోప్ క్రింద పనిచేసే ఉద్యోగులు), పూజారులు, సన్యాసినులు మరియు ఇతర చర్చి అధికారులు ఈ జనాభాలో ఉన్నారు.

## స్వార్థాన్ని త్యాగం చేయడమే ప్రేమ

ప్రేమకు తరతమ భేదాలుండవు చిన్న పిల్లల ప్రేమలో కపటముండదు నిజమైన ప్రేమలో ఇచ్చి పుచ్చుకోవడాలుండవు బేరసారాలంతకంటే ఉండవు తల్లి తన పిల్లను ఎంత సాహసం చేసైనా అపాయం నుండి రక్షించుకుంటుంది స్వార్థాన్ని త్యాగం చేయడమే ప్రేమ

—అమ్మ

## వార్తలు

### నాగాలాండ్‌లో జనాభావృద్ధి

1981-1991లో నాగాలాండ్‌లో అత్యధిక జనాభావృద్ధి జరిగింది (56 86 శాతం).

### నేటి భారత జనాభా



కుటుంబ నియంత్రణ కార్యక్రమం అమలు చేసేందుకు ముందుకొచ్చిన వాటిల్లో ఇండియా ఒకటి అయినప్పటికీ మన దేశ జనాభా, నేడు సంవత్సరానికి దాదాపు 17 మిలియన్ మేరకు అభివృద్ధి చెందుతున్నది ఇది ఆస్ట్రేలియా జనాభాకు సమానం

### ఇండియాలో పురుగు మందుల విషం

ఇండియాలోని వివిధ రాష్ట్రాలలో 1989 నుండి 1991 వరకు పురుగు మందుల విషానికి గురైన 3,000 పైగా కేసులు కేంద్ర పర్యావరణ శాఖ దృష్టికి తీసుకురాబడ్డాయి.

### ఇండియాలో బొగ్గు నిల్వలు

1992 జనవరి నాటికి ఇండియాలో బొగ్గు నిల్వలు 1200 మీటర్ల లోతు వరకు 196022.90 మిలియన్ టన్నుల మేరకు ఉండవచ్చునని ఇండియా భూగర్భశాస్త్ర సర్వే (Geological Survey of India) అంచనా వేసింది

### జపానీయుల వ్రాతతీరు

భారతీయ గ్రంథాలలోని చివరి పేజీ జపాన్ గ్రంథాలలోని మొదటి పేజీగా మారిపోయి ఉంటుంది భారతీయులవలే కాక జపానీయులు - కుడి నుంచి ఎడమకు వ్రాస్తారు వారు ప్రతి పంక్తి పైనుంచి క్రిందికి వ్రాస్తారు భారతీయులవలే ఒక వైపుకు వాలకుండా - మట్టంగా - వ్రాయరు

### ఎడారిలో తలసరి పాల వాడకం

అత్యధిక తలసరి పాల వాడకం రాజస్థాన్‌లో జైసల్మీర్‌లోని ఎడారి ప్రాంతంలో జరుగుతున్నది ఇండియాలో సగటు తలసరి వాడకం 112 గ్రాములు, ఇతర వర్థమాన దేశాలలో తలసరి వాడకం 400 గ్రాములతో పోల్చినప్పుడు జైసల్మీర్‌లో ఒక వ్యక్తి తలసరి పాల వాడకం 890 గ్రాములుగా ఉంది

## తెలుసుకోదగిన విషయాలు

### 7 లక్షల పట్టుపురుగుల బరువు

*కొత్తగా పొదిగిన పట్టు పురుగులు ఎంత చిన్నవంటే, వాటిల్లో 700,000 పురుగులు కేవలం ఒక పౌండ్ మాత్రమే బరువు ఉంటాయి ఆరువారాల్లో వీటి మొత్తం బరువు 9,500 పౌండ్లకు పెరుగుతుంది. అంటే బరువులో 950,000 శాతం అభివృద్ధిని ఇది సూచిస్తుంది.*

## మధుమేహ వ్యాధిగ్రస్తులు

ఇండియా జనాభాలో 5 నుండి 8 శాతం వరకు మధుమేహంతో బాధపడుతుండగా వర్ధమాన దేశాలలో ఈ వ్యాధి 2 శాతం మేరకే ఉంది

## ఏభై ఏళ్ళు నేపథ్యగానం చేసిన లత


Lata

భారతీయ నేపథ్య గాయకురాలు లతా మంగేష్కర్ నేపథ్య గాయనిగా 1992లో యాభై స్వర్ణ సంవత్సరాలు పూర్తి చేసుకుంది

## ఇండియాలో మొదటి ఆధునిక ఆస్పత్రి

ఇండియాలో మొదటి ఆధునిక ఆస్పత్రి 1664లో మద్రాసు ఫోర్ట్ సెయింట్ జార్జిలో నెలకొల్పబడింది

## 3.65 కోట్ల నిరుద్యోగ విద్యావంతులు

ఉద్యోగాలను కోరుతూ 3.65 కోట్ల నిరుద్యోగులైన విద్యావంతులు ఇండియాలోని ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లలో నమోదు అయ్యారని పత్రికలు తెలుపుతున్నాయి

## ఉత్తర భారతంలో మొదటి హైడ్రో-ఎలక్ట్రిక్ ప్రాజెక్ట్

ఉత్తర భారతదేశంలో మొదటి హైడ్రో ఎలక్ట్రిక్ (జల విద్యుచ్ఛక్తి) ప్రాజెక్ట్ - షానన్ పవర్ హౌస్ (Shanan Power House) హిమాచల్‌ప్రదేశ్‌లోని జోగీందర్ నగర్‌లో స్థాపించారు

# తెలియని విషయాలు

## ప్రపంచంలో అత్యంత విషసర్పం - సముద్రపు పాము

*భూమిపై గల సర్పాలలో అత్యంత విషపూరితమైన పాము దక్షిణ ఆస్ట్రేలియాలో కనుగొనబడిన 'పెనిన్స్యులర్ టైగర్' పాము దీని నుంచి తీసిన విషం 300 గొఱ్ఱెలను చంపటానికి సరిపోతుంది ఇది 4 అడుగుల పొడవు ఉంటుంది ప్రపంచంలోని అత్యంత విషపూరితమైన పాము - సీస్నేక్ (సముద్ర సర్పం) ఆస్ట్రేలియా పాము విషం కంటే ఈ సముద్ర సర్పం విషం 100 రెట్లు ఎక్కువ శక్తి కలదిగా ఉంటుంది*

## ప్రయత్నం ఆచరణీయం

మనం శిఖరాగ్రానికి ఎన్నటికీ చేరలేక పోయినప్పటికీ ఒక పర్వతాన్ని అధిరోహించే ప్రయత్నం చేయటం మంచి పనే పైకి పోతున్నప్పుడు మనం ఒక అద్భుత దృశ్యాన్ని వీక్షించగల్గుతాము ఈ అనుభవం మనం మరోసారి ప్రయత్నం చేసినప్పుడు ఎంతో ఉపకరిస్తుంది

— హెట్టీ బోట్లన్

[illegible]
[illegible]
[illegible] - [illegible]

## విమానంతో పక్షి ఢీకొనగా మొదటి మృతి

విమానంతో పక్షి ఢీ కొనగా మానవ మరణానికి సంబంధించిన రికార్డు 1910లో మొదటిసారి నమోదయింది

## ప్రపంచంలో గొప్ప కళా ప్రదర్శనశాలలు

ప్రపంచంలోని గొప్ప కళా ప్రదర్శనశాలలు (Art museums) పారిస్‌లోని ది లౌర్, లండన్‌లోని బ్రిటిష్ మ్యూజియం, న్యూయార్క్‌లోని మెట్రోపాలిటన్ మ్యూజియం ఆఫ్ ఆర్ట్స్ మరియు కాలిఫోర్నియాలోని జె పాల్ గెట్టీ మ్యూజియం

## ఇండియా పెట్రోలియం పరిశ్రమ

మన పరిశ్రమలు, వ్యవసాయం మరియు రవాణా శాఖలకు ఇంధన శక్తిని సమకూర్చే 48 మిలియన్ టన్నుల చమురును ఉత్పత్తి చేస్తున్న 12 రిఫైనరీలు ఇండియా పెట్రోలియం పరిశ్రమకు ఉన్నాయి

## ఇండియాలో పొడవైన పొగగొట్టం

ఇండియాలో పొడవైన పొగగొట్టం ఒరిస్సాలోని తాల్చెర్‌లో నిర్మించబడింది దీని పొడవు 227 5 మీటర్లు ఉంటుంది

## 8వ పంచవర్ష ప్రణాళిక తొలిదశలో నిరక్షరాస్యులు

ఇండియా 8 వ పంచవర్ష ప్రణాళిక ప్రారంభంలో 15-35 ఏళ్ళ వయస్సు కలవారిలో 104 మిలియన్ మంది నిరక్షరాస్యులుగా ఉన్నారని అంచనా వేయబడింది

## ఇండియాలో గాజు సీసాల వినిమయం

1991-92లో ఇండియాలో గాజు సీసాల మొత్తం వినిమయం దాదాపు 10 లక్షల టన్నులు కాగా 50,000 టన్నులు ఎగుమతి చేయబడ్డాయి

## ప్రపంచంలో ఉత్తమ విమానాశ్రయం



*సింగపూర్‌లోని ఛాంగి విమానాశ్రయం ప్రపంచంలోని ఉత్తమ విమానాశ్రయం లండన్‌లోని హీత్రూ మరియు ఆమ్‌స్టర్‌డాంలోని స్కిఫోల్ వరుసగా రెండవ, మూడవ స్థానంలో వస్తాయి*

*ఆసియా పసిఫిక్ ప్రాంతంలో అత్యధిక సామర్థ్యం గల ఈ ఛాంగి విమానాశ్రయం ఒక సంవత్సర కాలంలో 24 మిలియన్ ప్రయాణీకుల రాకపోకలు జరుపగలుగుతుంది. ఈ విమానాశ్రయానికి చెందిన అనమానమైన స్కై-ట్రెయిన్ ప్రయాణీకులను ఒక టెర్మినల్ నుంచి మరో టెర్మినల్‌కు చేర్చేందుకు ఒక నిమిషం సమయం తీసుకుంటుంది. సమర్థవంత మైన సామాన్లను చేరవేసే విధానాల ద్వారా గంటకు 10,700 సంచులను రవాణా చేస్తారు*

— *'బిజినెస్ ఇండియా' సౌజన్యంతో*

"[illegible]"

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

జవాబులు

**క్విజ్:** 1 (డి) కర్ణాటక, 2 (సి) ఖిలాయ్, 3 (సి) స్విట్జర్లాండ్, 4 (ఎ) ఇండియా, 5 (డి) సముద్ర కెరటాలపై ప్రభావం చూపటం, 6 (డి) చెఱకు, 7 (సి) సూర్యునికి ఎదురుగా, 8 (బి) అత్యంత ప్రాధాన్యంకల విషయాలు ప్రస్తావించబడినప్పుడు

**మాటల మహిమ:** 1 (ఎ) ఆకాశము, (బి) మబ్బు, (సి) బంగారు, (డి) బేగడ; 2 (ఎ) మదపుటేనుగు, (బి) సజ్జరసము, (సి) అభినయహస్త విశేషము, (డి) వీణ, 3 (ఎ) జీవుడు, (బి) బుద్ధి/మనస్సు, (సి) బ్రహ్మము, (డి) శరీరము; 4 (ఎ) యజ్ఞము, (బి) కత్తి, (సి) కోరిక, (డి) సంగ్రహశ్లోకము, 5 (ఎ) కంఠమునందలి గాలి, (బి) పాము, (సి) బొడ్డు; 6 (ఎ) సమ్మానము, (బి) ఊడిగము, (సి) లంచము, (డి) వాడుక, 7 (ఎ) తలపాగ, (బి) కిరీటము, (సి) తల; 8 (ఎ) అల, (బి) ఉంగరము, (సి) వస్త్రపు ముడుత

**తెలివికి పరీక్ష:** 1 భూకంపాలు ఎందుకు ఎప్పుడు ఎలా వస్తాయో శాస్త్రవేత్తలు ఇంకా ఇదమిత్థంగా కనుగొనలేదు కానీ కొంత మేరకు కొన్ని కారణాలు తెలుసుకోవటం జరిగింది అంతః ప్రవాహాలవల్ల భూమి లోపలి బలహీన ప్రదేశాలలో పగుళ్ళు, అగాధాలు ఏర్పడతాయి ఈ జలాలు లోతుగా ప్రవహిస్తుంటాయి భూమిక్రింది పొరలలోని ఒత్తిడులవల్ల, భూభౌతికపరమైన లోపాలున్న బలహీన ప్రాంతాలలో భూకంపాలు సంభవిస్తాయి. 1993 సెప్టెంబర్ 30వ తేదీ తెల్లవారు జామున సంభవించిన దారుణమైన భూకంపానికి మహారాష్ట్రలోని ఉస్మానాబాద్ జిల్లాలు గురం వేలాదిమంది మృతి చెందారు అస్థి నష్టం సంభవించింది ఇక్క ప్రకంపన రిక్టర్ స్కేలుపై 6గా నమోద

2. సూర్యుడి నుంచి అతినీలలోహిత కిరణ చర్మ కాన్సర్ వస్తుంది 'మెలనోమా చర్మ కాన్సర్ అధికంగా రావచ్చు నుంచి రక్షణకు "సన్‌సేఫ్" ర ప్రక్రియకు లోనైన టీ షర్టులు వాడకంలోకి వచ్చాయి ఈ బట్ట నీటిలోనూ, 'రయోసాన్' అనే రసాయనంలోనూ 2 గంటలు నానబెడ

3 ఆంధ్రప్రదేశ్‌లో అభయారణ్యాల చోట్లు 1 కావల్, 2 ప్రాణహి శివరామ్, 4 ఏటూరు నాగారం, 5 6 పోచారం, 7 మంజీర, 8 కోర కొల్లేరు, 10 కిన్నెరసాని, 11 పాపిక 12 నాగార్జునసాగర్/ శ్రీశైలం, 13 చి శ్రీ వెంకటేశ్వర, 14 నేలపట్టు, 15 పు

4 కజకిస్తాన్, 5 టియలిన్, 6 కీ రామకృష్ణయ్యగారు

## మెక్సికో వృద్ధ దంపతు

మెక్సికో (సెంట్రల్ అమెరికా)లోని అతి దంపతులు - 114 సంవత్సరాల వయస్సు జీసస్ కర్రాంజా వేగా మరియు 133 సంవ వయస్సుగల అతని సహధర్మచారిణి పాలా డి కర్రాంజా అని తెలుస్తున్నది ఉత్తర టమాలిపస్‌లో విద్యుచ్ఛక్తి సౌకర్యంలేని మి గ్రామంలో వీరు సంవత్సరాల తరబడి - టో బీన్స్ మరియు ఛిలీ మిరియాలు ఆహారంగా జీ జీవించారు